# జ్ఞానేశ్వరి

## (భగవద్గీత)

[7 నుండి 12 అధ్యాయములు]

సంత్-శిరోమణి శ్రీ జ్ఞానేశ్వర్ విరచితము

అనువాదం

**దిగవల్లి శేషగిరిరావు**


ఆధ్యాత్మిక గ్రంథమండలి

విజయవాడ 2.

# తెలుగు జ్ఞానేశ్వరి

## ఏడవ అధ్యాయము

య్యా సక్త మనాః పార్థ ! యోగం యుఞ్జ న్మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥ ౧

నం తే ఽహం స విజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః।
జ్ఞాత్వా చేహ భూయో ఽన్యజ్జ్ఞాతవ్య మవశిష్యతే॥ ౨

శ్రోతలారా వినుడు; ఇటుపిమ్మట పార్థునితో శ్రీకృష్ణుడిటుల చెప్పెను- ఓ అర్జునా, నీ విప్పుడు వాస్తవముగ యోగ యుక్తుడవైతివి. నేను నీ కిప్పుడు జ్ఞానము మరియు విజ్ఞానము (ప్రపంచజ్ఞానము)లను గురించి విశ చెప్పెదను. దీనివలన అరచేతియందున్న రత్నమును గురించి సులభ తెలసికొన్నరీతిని నీవు నన్ను గురించి చక్కగా తెలసికొనగలవు. ప్రాపంచిక జ్ఞానమువలన నాకు గలుగు లాభమేమని నీవు తలంచవచ్చును! కాని ప్రప్రథమమున ప్రపంచజ్ఞానమును తెలిసికొనుటయే ఆవశ్యకము. ఏలనన, జ్ఞానమును గురించిన ప్రసంగము వచ్చినప్పుడు యీ ప్రాపంచిక జ్ఞాతృత్వ దృష్టియే కప్పివేయబడియుండును, ఒడ్డుకు చేరిన నావ ఒడుదుడుకులు లేకుండా వుండునటుల, ప్రాపంచిక జ్ఞాతృత్వము చేరజాలనిదిన్నీ, విచారశక్తి ద వెనుకకు మరలవలసినట్టిదిన్నీ, తర్కమునకు కూడ అందనిదిన్నీ యగు ట్టి దానినే, ఓ అర్జునా 'జ్ఞాన' మందురు. జ్ఞానమునకు భిన్నమైనదంతయు ప్రపంచము, దీనినే 'విజ్ఞాన' మందురు; మరియు, యీ ప్రపంచమంతయు మపెడి కల్పనయే 'అజ్ఞాన'మని యెరుంగుము. ఇక నీకు అజ్ఞానమును ద్రోలునట్టిదిన్నీ, విజ్ఞానమును నశింపజేయునదిన్నీ యగు గూఢరహస్య మును చెప్పెదను. దీనివలన మనము కేవల జ్ఞానస్వరూపులము కాగలుగు దుము. ఈ స్థితికి మనము చేరినప్పుడు వక్తయొక్క వాక్కులు అంతమొం దును, శ్రోతయొక్క శ్రవణాసక్తికూడ సమాప్తమగును. చిన్న పెద్ద యనెడి

భేదభావముకూడ నశించును. ఈ విధమగు గూఢరహస్య జ్ఞానము ఏ కొంచెము కలిగినప్పటికికూడ మానవునిమనస్సు మిక్కిలి శాంతిని పొందును.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః ॥ ౩

" వేలకొలది మానవులలో ఏ ఒకనికో యీ విషయములందు ప్రీతి యుండును. అట్టి వారిలో ఒకానొకడు మాత్రమే నన్ను నిజముగ తెలిసి కొనగలడు. ఓ అర్జునా, ప్రపంచమంతయూ వెదకి సాహసికుడగు వీరు నొకని సంపాదించి సేనయందు లక్షలకొలది సైనికులను చేర్చుకొనునటుల, మరియూ సేనసంతయు చేకూర్చుకొనిన పిమ్మట యుద్ధరంగమున పెక్కురు సైనికులు కత్తిదెబ్బలకు లోనై నశించగా, అంతమున విజయలక్ష్మి సింహాసనమున అందెవడో ఒక్కడు మాత్రమే కూర్చుండునటుల, ఈ బ్రహ్మజ్ఞానమనెడి జలాశయమునందుకూడ పెక్కురు దుమికెదరు, కాని అందే ఒక్కడో మాత్రమే ఒడ్డునకు చేరును. అందువలననే, నేను దీనిని సాధారణ విషయము కాదని చెప్పుచున్నాను. దీనిని గురించి చెప్పుటకూడ చాల కష్టమైనపనియే. అయినప్పటికీ నీకు దీనిని గురించి చెప్పుటకు ప్రయత్నించెదను, వినుము.

భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥ ౪

" ఓ పార్థా, మానవశరీరమునకు నీడవలె, నాకు యీ మహత్తత్త్వమునకు ఆదిమాయ కూడ ప్రతిబింబము. ఈ మాయకుగల మరొక పేరు ప్రకృతి. ఇది ఎనిమిది విధములు. ఇదియే యీ ముల్లోకములను సృష్టించుచున్నది. అప్పు, తేజస్సు, ఆకాశము, పృథ్వి, వాయువు, మనస్సు, బుద్ధి, అహంకారములనెడివే ప్రకృతియొక్క ఎనిమిది భేదములు.

అపరేయ మితి స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ ౫

" ఓ అర్జునా, ఈపైన చెప్పిన రీతిని ఎనిమిది విధములుగాగల సామ్యావస్థనే నా పరమ ప్రకృతిగ నెరుంగుము. దీనినే 'జీవు' డందురు.

ఏలనన, ఇదియే నిర్జీవ శరీరమును సజీవ మొనర్చునట్టిదన్ని, శరీరమున చలన
శక్తి మొదలగునవి కలిగించునదిన్ని, మనస్సునందు శోకము, మోహము
మొదలుగాగల వికారములను కలుగజేయునదిన్ని అయియున్నది. ఈ పరమ
మాయా సాంగత్య ఫలితమువలననే బుద్ధికి జ్ఞాతృత్వము కలుగుచున్నది.
మరియు దీనివలన ఉత్పన్నమగు అహం - భావమే యీ సంసారముయొక్క
అస్తిత్వమును నిలిపియుంచుచున్నది.

**ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ**
**అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా ॥ ౬**

“ఈ సూక్ష్మ ప్రకృతి తన యిచ్ఛచే స్థూల మహాభూతముల అంగ
ములతో కూడియున్నప్పుడు, యీ భూతసృష్టి - అనగా ప్రాణికోటియొక్క
టంకసాల తెరువబడును. ఈ టంకసాలలో నాల్గురకములగు ప్రాణుల
నాణెములు తమంతతామే వెలువడును. అవి జరాయుజ, అండజ, స్వేదజ,
ఉద్భిజములనెడి నాల్గువిధములగు నాణెములై యున్నవి. మూలస్థ
విచారణతో చూచినచో యీ నాల్గురకములగు నాణెములు సమానమైనవే;
కాని, కేవలము జాతి లేక వర్గ విచారణతో చూచినచో యివి నాల్గును
ఒకదానితో మరొకటి భిన్నమైనవేను. ఈ జాతులన్నియును కలసి ఎనుబది
నాల్గు లక్షలు గలవు. ఇవిగాక ముఖ్య వర్గములోగల ఉపవర్గములు అనంత
ములు; ఇవి లెక్కింపరానన్ని గలవు. ఈ విధముగాగల ప్రాణిరూపులగు
అసంఖ్యాకములైన నాణెములతో ఆ నిర్గుణ, నిరాకార, అవ్యక్తబీజ భాండా
రము నిండియున్నది. ఈ రీతిని పంచమహాభూతములతో సమముగ తూకము
గల అనంతములుగాగల నాణెములను కేవలము ఆ ప్రకృతియే లెక్కించ
గలదు. ప్రథమమున తాను పోతపోసి తయారుచేసిన నాణెమును, అదియే
అనంతరమున కరగించివేయుచున్నది. కేవలము వాటియొక్క మధ్య అనగా
అస్తిత్వ స్థితియందు మాత్రమే అది వాటిచే కర్మాకర్మలను చేయించు
చున్నది. ఈ ప్రకృతి - అనగా మాయయే - నామరూపములద్వారా ప్రతీత
మగుచున్న యీ విశ్వమునందలి సమస్త వస్తువులను ప్రసార మొనర్చు
చున్నది. అట్టి యీ ప్రకృతి నాయందే సమరసత్వమును పొంది వసించు

చున్నది, కావున యీ జగత్తున కంతకును, ఆది, మధ్య, అంతములు నేనేనై యున్నాను.

★ మత్తః పరతరం నా న్యత్కించి ద స్తి ధనంజయ
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ ౭

"మనకు కనిపించెడి ఎండమావులయొక్క మూలకారణమును గమనించినచో, దీనికిగల కారణము కేవలము కిరణములే కావనిన్ని, ప్రత్యక్షముగ సూర్యుడేననిన్ని బోధపడును. అదేరీతిని, ఓ అర్జునా, ఈ ప్రకృతివలన ఉత్పన్నమైన యీ సృష్టి అంతమొంది, మరల తన మూలస్థితిలో యథా ప్రకారముగ కలసిపోయినప్పుడు, యీ సృష్టియంతయు కేవలము నారూపము గలదిగనే యగును. అన, అది నాయందే లీనమగును. అప్పుడు కేవలము నారూపమే యుండును. యీ రీతిని, ఉత్పన్నమయి తిరిగి విలీనమయ్యెడి యీ విశ్వమెల్లప్పుడు నాయందే యుంటున్నది, దారమునందు గ్రుచ్చబడిన మణులవలె, యీ జగత్తుకూడ నాయందే యుండును. బంగారుతో చేయబడిన నగలు బంగారు తీగయందే గ్రుచ్చబడురీతిని, యీ విశ్వమునంతను బయటను, లోపలను అంతటను నేనే ధరించి యుందును."

రసో ఒహ మప్సు కౌన్తేయ ప్రభాస్మి శశి సూర్యయోః
ప్రణవ స్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ ౮

పుణ్యో గన్ధః పృథివ్యాంచ తేజ శ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు ॥ ౯

"కావున ఓ అర్జునా, నీటియందుగల రస-గుణము, వాయువునందు గల స్పర్శ-గుణము, సూర్యచంద్రులందలి తేజో-గుణము 'నేనే'నని నీవు తెలిసికొనుము. ఇదేరీతిని పృథివియందలి గంధ-గుణము, ఆకాశమునందలి శబ్ద-గుణము, వేదములందలి ఓంకార - స్వరూపప్రణవము - యివన్నియు స్వాభావిక శుద్ధములని అనగా యివన్నియు 'నేనే'యని యెరుంగుము. మనుష్యునందలి మనుష్యత్వము, పౌరుషమనెడి అహంభావముయొక్క బలముకూడ 'నేనే'నని నీకు ముందుగనే చెప్పియున్నాను. తేజస్సునైనగల

'అగ్ని'యనెడి పేరుగల ఆవరణను తొలగించిన పిమ్మట మిగిలియుండు కేవల స్వరూప - తేజస్సుకూడ నేనేయై యున్నాను, ఈ త్రిభువనములందలి భూతకోటి అనేకములగు యోనులందు జన్మించి, తమ తమ విశిష్టమార్గ నిర్వహణ మొనర్చుచుండును. కొన్ని వాయుభక్షణ మొనర్చును, కొన్ని తృణమును తిని జీవించును. కొన్ని అన్నమును తిని బ్రతుకును, కొన్ని కేవలము నీటిని త్రాగియే జీవితమును గడుపుకొనును. ఈ రీతిని భిన్న-భిన్న ప్రాణులు జీవించుటకు స్వాభావికముగగల భిన్న భిన్న సాధనలన్నింటను నేనే అభిన్న స్వరూపమున నివసించుచున్నాను.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్।
బుద్ధిర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్॥ ౧౦

బలం బలవతాం చాహం కామ రాగ వివర్జితమ్।
ధర్మా విరుద్ధో భూతేషు కామో ఽస్మి భరతర్షభ॥ ౧౧

"ఉత్పత్తి సమయమున ఆకాశముయొక్క అంకురము (బీజము)తో పాటు విస్తరించునట్టిదిన్ని, విశ్వసంహార సమయమున ఓంకారమునందలి 'అ' 'ఉ' 'మ' కారములనుకూడ నాశమొనర్చునదిన్ని, ఈ దృశ్యప్రపంచమున జగదాకారమున తోచునదిన్ని, మహాప్రళయ సమయము వచ్చినప్పుడు బయటను చూచుటకు నశించినటుల కనిపించినప్పటికిని కూడ, వాస్తవమునకు ఎన్నడును నశించజాల నట్టిదిన్ని అగు స్వయంసిద్ధమూ అనాదియూనగు విశ్వబీజముకూడా నేనేనై యున్నాను. ఓ అర్జునా ఆత్మానాత్మ విచారణచే యీ జ్ఞానమునకు సామంజస్యము నేర్పరచినప్పుడు, దీని యొక్క వాస్తవిక మహాత్మ్యము నీకు అనుభవమగును. ఇక యీ విషయమును విడచి మరొక విషయమును నీకు చెప్పెదను. తాపసులయొక్క తపస్సుకూడ నా రూపముగానే యెరుంగుము. బలిష్ఠులందలి బలము, బుద్ధిమంతులందలి బుద్ధికూడా నేనే యైయున్నాను. భూతకోటికి ధనసంపాదన మూలమున విపులముగ ధర్మసంగ్రహణ మొనర్పజేసెడి శుద్ధకామ - వాంఛ కూడ ఆత్మస్వరూపమంచు రఘునందన నేనే. ఈ శుద్ధకామము సాధారణముగ వికారములయొక్క

ప్రవాహము ననుసరించి ఇంద్రియములకు తృప్తిని కలిగించు కర్మలాచరించి నప్పటికి కూడ అవి ఇంద్రియములను వాటి ధర్మములకు విరుద్ధముగ పోనివ్వదు. ఈ కామము కర్మసన్న్యాసమనెడి వంకరటింకర మార్గమును విడచి విధ్యుక్త కర్మాచరణమనెడి రాజమార్గమున పోవును. మరియు నియమితత్వ మనెడి దివిటీ ఎల్లప్పుడు దీనిని అంటిపట్టి యుండును. ఈ రీతిని జాగరూక తతో కర్మములు జరుగునప్పుడు ధర్మము పరిపూర్తియగును. అందువలన సాంసారిక భోగముల ననుభవించు పురుషులుకూడ మోక్షతీర్థమునందు ముక్తులగుదురు. వేదములందు ప్రశంసించబడిన మహత్త్వమనెడి మంటపముపైన ఎక్కించబడిన కామమనెడి జగల్లత (జగత్తనెడితీగ) యొక్క కర్మములనెడి శాఖలు ఫలభారముకలన వంగి అంతమున మోక్షమువద్దకువచ్చి ఆనుకొనును; ఇట్టి అన్నివిధములైనట్టి సమస్త భూతములను సృష్టించు బీజరూపమునగల కామముకూడా యోగిశ్రేష్ఠ పరమాత్మనగు నేనేయై యున్నాను. ఈరీతిని ఒక్కొక్క విషయము నెంతదూరము చెప్పను! సమస్త వస్తువులు నావలననే వ్యాపించుచున్నవి. అన్నింటిని నేనే వ్యాపింపజేయుచున్నాను.

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసా శ్చ యే
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తేమయి॥ ౧౨

"సాత్త్వీక, రాజస, తామసికములైన వెన్నిగలవో అవన్నియు నా స్వరూపమునుండియే పుట్టినవి. ఈ విషయమును నీవు చక్కగా జ్ఞప్తియందుంచుకొనుము. ఈ వికారములు పుట్టుచో అవికూడ నాయందే పుట్టును; కాని, స్వప్నావస్థయందు జాగ్రదవస్థ ఉండనిరీతిని, యీ వికారములందుకూడ నేనుండను. బీజకణము వాస్తవమునకు రసద్రవ్యము వలననే ఏర్పడి, దానితోనే నిండియున్నది; కాని, అంకురమునందునూ, కొమ్మలందునూ కఠినరూపమున గల కొయ్య ఉండును యిదికూడ ఆ బీజ కణమువలననే ఏర్పడుచున్నది. అయినప్పటికి ఆ కొయ్యలో ఎప్పటనైన బీజగుణము ఉండునా! అటులనే, చూచుటకు బయటకు నా నుండియే వికారములు ఉత్పన్నమైనటుల కనిపించినప్పటికిని, నేను నా వికారము లందుండను. ఆకాశమున మేఘములు వచ్చును, కాని మేఘములందు ఆకాశము ఉండదు. మేఘములందు జలము ఉండును, కాని ఆ జలమునందు

మేఘము లుండవు. మేఘములందుండెడి నీటిలో క్షోభ కలిగినప్పుడు మెరపు కనిపించును. అందుచే, ఆ మెరసెడి మెరపులో నీరుగలదని చెప్పవచ్చునా? నిప్పునుండి పొగవచ్చును, కాని ఆ పొగలోకూడ నిప్పు ఎన్నడైన వుండునా? ఇదేరీతిని నాయందు వికారము లుండును, కాని ఆ వికారములు నేను కాను.

త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వమిదం జగత్
మోహితం నాభి జానాతి మా మేభ్యః పర మవ్యయమ్॥ ౧౩

“నీటియందు పుట్టెడి నాచు నీటియందంతటను వ్యాపించి దానిని కప్పివేయురీతిని, మేఘములవలన ఆకాశమంతయు కప్పివేయబడురీతిని, స్వప్నమును అసత్యమైనదిగా చెప్పినప్పటికి నిద్రయందున్నంత వరకు ఆ స్వప్నము నిజమైనదిగనే తోచి మనను గురించిన స్మృతియే లేకుండురీతిని, కన్ను తనంతతాను తన కనుగ్రుడ్డుపైన కలుగచేసికొనిన పొరవలన తన దృశ్యశక్తిని పోగొట్టుకొన్నటుల, యీ త్రిగుణములతో నిండియున్న మాయకూడ నాయొక్క ప్రతిబింబమైయున్నది. మరియు అది నా ఆత్మ స్వరూపము నెడి మరుగున తెరవలె నుండియున్నది. ఇందువలననే ఈ జీవులు నన్ను గుర్తించజాలకున్నారు. అవన్నియు నానుండియే ఉద్భవించినవి, కాని అవి మాత్రము నేనుకాను. నీటినుండి ఉద్భవించిన ఉప్పు నీటియందు కరగిపోనటుల, మట్టితో చేయబడిన కుండ కాల్చకుండా వెంటనే మట్టిలో కలపివేసినచో ఆ మట్టితో కలసి ఏకజీవముగ నగునేగాని, ఆ కుండను అగ్నిలో కాల్చినచో అది మట్టిగాగాక మరొక భిన్నస్వరూపముగలదిగా నగునటుల, యీ భూతకోటియంతయు నాయొక్క అంశయే, కాని ప్రకృతి యొక్క కలయిక (యోగము)వలన అవన్నియు జీవ-దశను పొందినవి. ఇందుచే ‘అవి’ నావి, కాని ‘నేను’ అవికాను. ‘అవి’ నావే అయినప్పటికి అవి అహంకారము, మమత్వము, మరియు భ్రమవలన విషయాంధత్వమును పొందుటచే నా స్వరూపమును గుర్తించలేవు.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే॥ ౧౪

"ఓ అర్జునా, మహత్తత్త్వము మొదలగు నా మాయను దాటి నామూల స్వరూపమును ఎటుల పొందవగునననది యిప్పటి ప్రశ్న. పరబ్రహ్మమనెడి పర్వతముపైన మూలసంకల్పమనెడి జలముతోపాటు మాయయనెడి నదియందు అతి చిన్నదగు మహాభూతమనెడి నీటిబుడగ (బుద్బుదము) పుట్టును. ఆ పిమ్మట సృష్టిరచనా ప్రభావమువలనను మరియు కాలక్రమముతోపాటుగను వృద్ధిపొందుచూ వేగముతో కర్మమార్గము మరియు మోక్షమార్గము యనెడి రెండు ఎత్తయిన తటము (ఒడ్డు)లగుండా జలప్రవాహము తన యిష్టానుసారము యిటు నటు పోవుచుండును. ఆపైన సత్త్వ, రజస్తమో గుణములనెడి త్రిగుణరూపమునగల వర్షమువలన చక్కగా నిండి తన మోహమనెడి వరద ద్వారా యమము (మనోనిగ్రహము) నియమము (ఇంద్రియనిగ్రహము)లనెడి నగరములను ముంచివేయును. యిందు ప్రతిచోట ద్వేషమనెడి సుడిగుండము లుండును. మత్సరమనెడి తిరుగుడులుండును, ఉన్మాదము మొదలగు భయంకరమైన మొసళ్ళు తిమింగలములు కనిపించుచుండును. మరియు ప్రపంచమనెడి పెక్కు మలుపులు ఉండును. కర్మాకర్మలనెడి అలలపైన సుఖ-దుఃఖమనెడి చెత్తయుండును, మరియు ఆ నదియందు గల విషయ విలాసముయనెడి లంకను వాసనలనెడి అలలు కొట్టుకొనుచుండును. అంతేగాక జీవులనెడి ఫేనపుంజములు వ్యాపించియుండి కనిపించుచుండును. మరియు ఆ నదియొక్క అహంకారమనెడి ప్రవాహమున విద్యామదము, ధనమదము, బలమదములనెడి మూటియొక్క అలలు లేచుచుండుటే గాక విషయ వాసనలనెడి అలలుకూడ వచ్చుచుండును; ఇంకను అందు, ఉదయము - అస్తమయములనెడి వరదవలన జనన - మరణము లనెడి గోతులు పడుచుండును, వాటియందు పంచభూతాత్మక సృష్టియొక్క నీటి బుడగలు ఎల్లప్పుడు లేచుచుండును. మరియు ఆ నదియందలి మోహము, భ్రమ మొదలగు మత్స్యములు ధైర్యముయొక్క మాంసమును ఒలుచుకొని తినుచుండును, అప్పుడు వంకరటింకరగా గల అజ్ఞానమనెడి తిరుగుడులోపడి యిటు నటు తిరుగుచుండును, మరియు ఆ మాయయనెడి నదిలో భ్రమయనెడి మురికివలన నేర్పడ్డ శ్రద్ధ యనెడి ఊబియుండును; రజోగుణముయొక్క గర్జనము స్వర్గలోకమువరకు వినుపించును, మరియు ఆ మాయారూపియగు నదిలో తమోగుణ ప్రవాహము అత్యధికముగను అతి ప్రబలముగనుండును, మరియు

సత్త్వరూపముగల గోతులను యీది దాటివచ్చుట చాల కష్టమగును, ఆ మాయానది చాల దుష్టమైనదీ, కఠినమైనదిన్ని. ఇందు వచ్చెడి జనన మరణములనెడి వరదవలన సత్యలోకమునందలి కోటలు పడిపోవును, బ్రహ్మాండమనెడి గొప్ప గొప్ప రాతిబండలుకూడ కదలి పడిపోసాగును

ఈ మాయానది యందలి జలముయొక్క ప్రచండవేగమున యిప్పటి వరకు దాని తరంగములు ఆగుటయనునదే లేదు. ఇట్టి మాయ యనెడి వరదను యీది ఏరీతిని ఎవడు దాటిరాగలడు? ఇందు మరొక విచిత్ర విషయముకూడా గలదు; ఈ మాయ యనెడి నదిని దాటుటకు మన మవలంబించెడి ఉపాయములవలన మరికొన్ని క్రొత్తబాధలు కూడకలుగజేయుచును. ఇక యీ బాధలేవో చెప్పెదను వినుము కొందరు తమ స్వబుద్ధిపై విశ్వాస ముంచి యీ నదిలో ప్రవేశింతురు; కాని అట్టివారు వెంటనే తమ స్మృతిని పూర్తిగా కోల్పోవుదురు. కొందరు అజ్ఞాన మనెడి గోతియందలి అభిమానపు సూటియందు పడుదురు. కొందరు యీ నదిని దాటుటకుగాను తమ నడుమున కట్టుకొనిన వేదత్రయమనెడి సొరకాయ బుర్రతోపాటు, అహంకార మనెడి ఒక పెద్దరాతినికూడ తమ నడుమున కట్టుకొందురు; అట్టి స్థితిలో గలవారిని ఉన్మాదమనెడి చేప పూర్తిగా కబళించివేయును. కొందరు తమ యౌవనముపై విశ్వాసముగలవారై దానిని (నదిని) దాట గోరెదరు. కాని వారు విషయలంపటత్వమనెడి తిరుగుడులోపడిపోదురు, మరియు విషయములనెడి మొసలి వారిని నమిలివేయుచుండును ఆ పిమ్మట వారు యీ నదియొక్క వార్ధక్యరూపమునగల బుద్ధిభ్రంశమనెడి వలలో అచ్చటచ్చట చిక్కుపడిపోదురు పిమ్మట శోక మనెడి రాతిబండకు కొట్టుకొని, రాగ మనెడి సుడిగుండములో మోసగింపబడి, తల పైకెత్తినప్పుడెల్ల ఆపదలనెడి రాబందులు వారిని అతికఠోరముగ ముద్దుపెట్టుకొని - పీలుచుకుని తినసాగును. పిమ్మట వారు దుఃఖ మనెడి మురికితో అంటుకొనిపోయి, అంతమున మరణమనెడి యిసుకదిబ్బవద్దకు చేరి అందుచిక్కుకొని మరణింతురు. ఈ రీతిని విషయలంపటత్వమున పడియుండువారి జీవితము సంపూర్ణముగ వ్యర్థమైనదే. కొందరు యజ్ఞవిధానమును తామీ మాయానదిని దాటుటకు పరికరముగ నేర్పరచుకొని యీ పరికరమును సొరబుర్రను తమ పొట్టక్రింద కట్టుకొని స్వర్గసుఖమనెడిగోతిలో పోయి పడెదరు, మరికొందరు మోక్షమును

సంపాదించలేకను ఆశతో కర్మలనెడి బాహువులను తమకు ఆధారముగ చేసికొందురు; కాని వారు విధి, నిషేధములు అనగా కర్తవ్యాకర్తవ్యములనెడి సుడిగుండమున చిక్కుకొందురు. వైరాగ్యమనెడి నావ ప్రవేశించుటకు కూడ వీలులేనట్టిన్ని, వివేకమనెడి దారము దూరనట్టిన్ని, యోగసాధనమున మాత్రమే ఏ కొద్దిగనో దాటుటకు వీలగునట్టిదిన్ని యగు ఆ మాయానదిని గురించి జీవుడు దానిని దాటగలడని పోల్చి చెప్పుటకు తగినదేదియును లేదని చెప్పితీరవలెను. పథ్యము చేయని రోగికి రోగనివారణ యగునెడల, దుర్జనుని బుద్ధిని వశపరచుకొనుటకు ఏదైన ఉపాయ ముండునెడల, లోభి తన చేతికి వచ్చిన సంపదను విడచిపెట్టగలుగునెడల, దొంగ నిండుసభలో దూరగలుగునెడల, చేపను వేణువమ్రింగి వేయగలుగునెడల, పిరికివాడు యక్షిణిని భయపెట్టి వెనుదిరుగునటుల చేయగలుగునెడల, లేడిపిల్ల వలను త్రెంచివేయగలుగునెడల, చీమ మేరుపర్వతముపైకెక్కి దాని ఆవలిఒడ్డునకు పోగలుగునెడల - జీవునకుకూడ మాయానది ఆవలిఒడ్డునకు చేరినటుల కనిపించగలదు. కావుననే ఓ అర్జునా, స్త్రీనే సమస్తముగా భావించు మానవుడు స్త్రీని తన వశము నందుంచుకొనజాలని రీతిని జీవుడు కూడా మాయానదిని యీది దాటజాలడు. ఏక నిష్ఠతోనూ అనన్యభావముతోనూ కేవలము నన్నే భజించువారు మాత్రమే యీ నదిని యీది దాటగలరు. లేదా, వారిని గురించి యిటుల చెప్పవచ్చును - వారు యీ నదిని యీది దాటవలసిన ఆవశ్యకతయే యుండదు. ఏలనన, వారిముందుగల యీవలిఒడ్డున నీరు వుండనే వుండదు. సద్గురువనెడి మంచినౌక లభించినవారు, అనుభవమనెడి కౌపీనమును బిగించి కట్టుకొనినవారు, ఆత్మబోధ యనెడి తెప్ప దొరికినవారు, అహంకారమనెడి మిక్కుటమగు బరువును పారవైచి, సంకల్ప - వికల్పములనెడి అలలనుండి తప్పించుకొని, విషయాసక్తి యనెడి తీవ్రమైన వాన దెబ్బనుండి కాపాడుకొని, ఏకత్వపు రేవునుచేరి, ఆత్మబోధ యనెడి బల్లకట్టును అందుకొని, వెంటనే నిరాశ యనెడి ఆవలిఒడ్డునకు చేరినట్టివారు మాత్రమే వెంటవెంటనే వైరాగ్యమనెడి చేతులతో నెట్టుకొనుచూ, అహంబ్రహ్మాస్మి యనెడి శ్రద్ధా సామర్థ్యముకలన పైన తేలుచూ, అంతమున అనాయాసముగనే నివృత్తి తటమునకద్దనపోయి చేరుదురు. ఈ మార్గముననుండి నన్ను భజించువారు

మాత్రమే నాయీ మాయానదిని యీది దాటగలరు. కాని, యిట్టి భక్తులు చాలా అరుదు. ఇట్టివారు అధిక సంఖ్యలో కనిపించరు.

నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః॥ ౧౫
చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినో ఽర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ॥ ౧౬

ఈ విధముగ భక్తులే గాక అహంకార మనెడి భూతమునకు వాహనముగనైనట్టి పెక్కురు మనుజులు కూడ గలరు. వీరు ఆత్మజ్ఞానమును మరచి పోవు చున్నారు. ఈ విధముగ అహంకారభూతము ఆవేశించిన వారిని గురించి వేదము లిటుల చెప్పుచున్నవి. వీరియందు సంయమము అను ఇంద్రియ నిగ్రహ మనెడి తెరతొలగిపోవును. భవిష్యత్తున తాము అధః పతితులమగుదు మనెడి సిగ్గు నశించును, ఎన్నడును చేయకూడని పనులను యిట్టి జీవులు చేయ సాగుదురు. ఇట్టి ప్రాణులు ఇంద్రియములనెడి గ్రామమునందలి రాజమార్గ మున అహంకారముతో కూడియున్న స్వార్థప్రలాపము లాడుచూ అనేక విధములగు వికార సముదాయమును ప్రోగుచేసెదరు. మరియు అంతమున దుఃఖశోకములనెడి ఆఘాతములు నిరంతరము వారికి తగుల నారంభించి నప్పుడు, వారికి స్మృతి భ్రంశమగును. దీనికంతకును కారణము ప్రకృతి యనబడెడి యీ మాయయే. దీనివలననే యీ జీవులెరు నన్ను మరచిపోయిరి. ఆత్మహితమును సాధన మొనర్చు నా భక్తులు నాల్గువిధములుగా నుందురు. వారు - ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు మరియు జ్ఞానులు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే।
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం సచమమప్రియః॥ ౧౭

వీరిలో ఆర్తులు తమ దుఃఖనివారణకొరకు, జిజ్ఞాసులు జ్ఞానమును తెలిసికొను వాంఛతోను, అర్థార్థులు ధనము సంపాదించవలెనను కోరికతోను నా భక్తులగుచున్నారు. కాని నాల్గవతరగతి భక్తులలోమాత్రము యిట్టి వాసన ఏదియూ నుండదు; వారు దేని తృప్తికొరకును నన్ను భజించరు;

కావుననే జ్ఞానులగువారు నా నిజమైనభక్తులు. ఏలనన, అజ్ఞాన ప్రకాశము వలననే భేదభావమనెడి అంధకారము నశించుచున్నది. అందుచే వారు మద్రూపులైయుందురు, దానితోపాటు నా భక్తులుగాకూడ నుందురు. కాని స్వచ్ఛమైన స్ఫటికశిల దానిపైనుండి ప్రవహించు నీటియొక్క గమనము వలన సాధారణ మానవులదృష్టిలో క్షణము సేపటివరకు నీటివలె (నీటితో సమానముగ) కనిపించు రీతిని, జ్ఞానియగు పురుషునిస్థితికూడా యిటులనే యుండును. వాయువు శాంతముగలదై ఆకాశమునందు కలసిపోవునప్పుడు ఆకాశమునకు భిన్నమగు వాయుభావ మేదియూ నుండదు. అదేరీతిని, జ్ఞాని యగువాడు నాలోకలసి ఐక్యత పొందినప్పుడు 'అతడు నా భక్తుడు' అని చెప్పవలసిన అగత్యముగాని, చెప్పదగినచోటుగాని వుండనేవుండదు. ఊపి గాని, విసరిగాని చూచినప్పుడు మాత్రమే వాయువుయొక్క స్వరూపము ఆకాశముతో భిన్నమైనదిగ కనిపించును, మరియు అప్పుడే అది ఆకాశ ముతో భిన్నమైనదని నిర్ధారణ కాగలదు. అటుల కానప్పుడు అది స్వాభా వికముగ గగన (ఆకాశ) రూపముననే యుండును. ఇదేరీతిని, జ్ఞాని శరీరము ద్వారా కర్మాచరణ కొనర్చినప్పుడు అతడు లోకులకు భక్తుడువలె కని పించును, కాని అతడు తన ఆత్మానుభవ మనెడి సహజ గుణమువలన మద్రూపుడై యుండియుండును. అతడు తన జ్ఞానప్రకాశమువలన 'నేను ఆత్మనే' అని తెలిసికొను చున్నాడు. అందుచే నేనుకూడ ప్రేమావేశముచే అతనిని 'ఆత్మయే' యని చెప్పుచున్నాను. జీవత్వమునకు అవలి ఒడ్డునగల ఆత్మస్వరూపముయొక్క సంకేతమును గుర్తించి వ్యవహరించు (ఆచరించు) గలవాడు కేవలము భిన్నదేహధారి అయినంత మాత్రమున ఎన్నడైన వాస్తవమునకు పరమాత్మ తత్త్వమునకు భిన్నమైనవాడు కాగలడా ?

ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామేవానుత్తమాంగతిమ్ ॥ ౧౮

"కావుననే కేవలము స్వకార్యసిద్ధికై నా భక్తులుగానై నన్ను అనుస రింతురు; కాని యిట్టి భక్తులలో తన ప్రియవిషయము 'నేను మాత్రమే' అయియున్న నా డెవడో అతడే జ్ఞాని". శ్రీకృష్ణుడీరీతిని చెప్పినది మిథ్య కాదు. ఎటులన, పాలనెడి ప్రయోజనముకొరకై ప్రతిచోటున ప్రజలు ఆవును

కట్టియుంచుకొను చున్నారు. కాని ఆ కట్టివేతవలన కలుగు ప్రయోజనము దాని దూడకుకూడా బంధనములేకుండా లభించజాలదుగదా ! ఏ విధముగు పలుపు లేకపోయినప్పటికికూడ దానిబిడ్డ ఆబంధనమున పడియుండును; ఏలనన, ఆ దూడ తనువు, మనస్సు మరియు ప్రాణములతో అది తనతల్లితో సంబద్ధమై యుండుటయే; మరియు దానికి తన తల్లిని మించి మరేదియూ తెలియకపోవుటయే. దానిని చూచుటతోడనే అది (దూడ) 'ఇదియే నాతల్లి' యని యనును. ఇదేరీతిని, యీదూడ 'నేను' లేకున్నచో దిక్కులేనిది, ఆధారములేనిదీ యగునని ఆవు చూచినప్పుడు, ఆ ఆవుకూడ తనబిడ్డ తనపట్ల చూపునట్టి ఏకాంతిక ప్రీతినే మరల తనబిడ్డపట్ల తానుకూడ చూపును. కావున శ్రీ కృష్ణుడు చెప్పిన యీ విషయము పూర్తిగా వాస్తవమైనదే. అస్తు. భగవానుడు మరల యీరీతిని చెప్పసాగెను-"జ్ఞానిగాక మరి మూడు విధములైన వారుగా నాచే చెప్పబడిన భక్తులుకూడ తమ తమ తావులందు యోగ్యులును నాకు ప్రియమైనవారును అయియున్నారు. కాని సముద్రమున కలసిపోయిన నది మరల వెనుకకు మరలుటకు వీలులేనటుల నన్ను గురించిన జ్ఞానోదయమైన పిదప వారుకూడ వెనుకకు మరలుటను మరచిపోవుదురు. ఈ విధముగా తన అంతఃకరణమునం దుత్పన్నమైన అనుభూతి యనెడి గంగ నా స్వరూప మనెడి సాగరమున కలిసిపోయియున్నట్టి భక్తుని పూర్తిగా నా స్వరూపముగనే తలంచవలెను - అతడు భక్తుడుగాదు, స్వయముగ 'నేనే'యని తెలిసికొనవలెను. ఇక దీనిని గురించి విస్తరించనేల ? జ్ఞానియైన వాడు నా శుద్ధచైతన్యము మరియు ప్రత్యక్ష ఆత్మగా నెరుంగవలెను. వాస్తవమునకు యీ విషయము ఎవనితోను చెప్పదగినది కాదు. కాని ఏమి చేయను ! చెప్పరాని విషయమునుకూడ చెప్పివైచితిని !

బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే 19
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ ౧౯

"ఇట్టి పురుషుడు విషయము లనెడి భయంకరారణ్యమునందలి కామ క్రోధము లనెడి వికారము కలిగించు సంకటములనుండి తనను రక్షించుకొని నిర్మలవాసన యనెడి పర్వతముపైన ప్రవేశించును. పిమ్మట వీర శ్రేష్ఠుడవగు అర్జునా, అతడు సత్సాంగత్యముగలవాడై కర్మ సన్న్యాస మనెడి

డొంకతిరుగుడు దారిని ఒకవైపు వదలిపెట్టి, సరళమగు సత్కర్మయోగ మనెడి రాజమార్గమున నడచును. అట్టివాడు వందలకొలది జన్మలవరకు ఆ మార్గముననే ప్రవాసమొనర్చుచుండును. ఈ ప్రవాస సమయమున అతడు తన పాదములకు ఆశ యనెడి పావుకోళ్ళనుకూడ ధరించడు. అట్టి స్థితిలో, ఫల-హేతువును గురించిన విచారణకుకూడ తావెక్కడగలదు ? అతడు యీ రీతిని ప్రతి జన్మమున శరీరధారణమొనర్చుట యనెడి మాయ యనెడి రాత్రికాలమున వాసనా సంగమును త్యజించి కర్మయోగమార్గమున వేగముగ ఒంటరిగనే పోవుచుండును. ఈ సమయమున కర్మక్షయమగుట తోడనే, ఆతనికి జ్ఞాన మనెడి ప్రభాతమగును. ఆ సమయముననే గురుకృప వలన ఉషఃకాల మగును, జ్ఞానసూర్యుని కిరణములు వచ్చి ఆతనిపై పడ సాగును. మరియు, అప్పుడాతని దృష్టిముందు భేదభావము లేశము ఏకత్వ మనెడి సంపద ప్రకటమగును. ఇట్టి స్థితిలో ఆతడేయే దిక్కున చూచునో, ఆయా దిక్కున ఆతనికి కేవలము నేనే కనిపింతును; మరియు ఆతడేమియు చూడక పూర్తిగా నిశ్చేష్టుడుగను శాంతుడుగను నున్నప్పటికికూడ ఆతని హృదయ మున కేవలము నేనే భాసిల్లుచుండును ఆతనికి నేను తప్ప మరెచ్చటను ఏదియూనుండదు. నీటిలో మునిగియున్న పాత్రకు లోపలా, బయటా అంతటను నీరేయుండునటుల ఆతడుకూడ నాలో నిమగ్నుడైయుండును. మరియు ఆతని లోపలను బయటనుకూడ కేవలము నేనే యుందును. ఈస్థితి శబ్దములచే వర్ణించవలదికానిది. కావున యిట్టి వానిని గురించి నేను చెప్పున దేమన - ఈ విధమగు జ్ఞానసంపద యనెడి భాండారము ఆతనికొరకై తెరువ బడుటచే, అప్పుడాతడు యీ జ్ఞానద్రవ్యమును ఉపయోగములోనికి తెచ్చు కొని విశ్వమునంతను తనవలె నొనర్చుకొనును. ఆతని దృష్టియందు కనిపించున దంతయు శ్రీవాసుదేవుడేనని ఆతనికి అనుభవము కాసాగును. మరియు యీ అనుభవరసమువలన అంతమున ఆతడే శ్రేష్ఠుడగు భక్తుడు, నిజమైన జ్ఞాని యగురీతిని ఆతని అంతరంగము తనకుతానే అత్యధికముగ నిండియుండును. ఆతని ఆత్మానుభవ భాండారము సృష్టియందుగల స్థావర, జంగమములగు సమస్త పదార్థములు అందిమిడిపోగలుగునంత పెద్దగా విస్తరించును. సోదరా అర్జునా, ఇట్టి మహాత్ముడు కడు దుర్లభుడు; కాని, కామభావముతో నన్ను

భజించునట్టివారు, ఆశ యనెడి అంధకారమున గ్రుడ్డివారై తారట్లాడువారు నగు యితర తరగతికి చెందిన భక్తులు విరివిగా గలరు.

కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యన్తే ఽన్యదేవతాః।
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా॥ ౨౦

ఫలవాసన కలిగియుండుటవలన వారి అంతఃకరణమున కామము (విషయవాసన) ప్రవేశించును. మరియు ఆ కామమనెడి చెంపదెబ్బ వలన జ్ఞానదీపము ఆరిపోవును. ఇందుచే వారు లోపలను బయటనుకూడ ఘోరమగు అంధకారమున మునిగిపోదురు. మరియు వారికి నేను చాలదగ్గరగనున్నప్పటికి వారు నన్ను చూడజాలనందువలన శారీరకముగను మానసికముగను అన్యదేవతలను భజించసాగుదురు. ఇట్టి పురుషులు మొదటినుండియు మాయకు దాసులై యుందురు. అందుమీదవిషయభోగము లనెడి తిరుగుడులో పడి వారింకను అధికముగ దీను లగుదురు. మరియు అట్టిస్థితిలో వారు దుష్కర్మలవలన అన్యదేవతలను మిక్కుటమగు కుతూహలముతో భజింతురు. వారు స్వయముగ బుద్ధిపూర్వకముగ తమకొరకై పెక్కు నియమములను నిర్బంధములను ఏర్పరచుకొందురు. పూజకొరకై పెక్కు వస్తువులను చేర్చెదరు, మరియు శాస్త్రోక్తవిధుల ననుసరించి వారు శ్రద్ధతో ఎన్నోరకములగు వస్తువులను ఆ దేవతలకు అర్పింతురు

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య తస్యా చలాం శ్రద్ధాం తా మేవ విదధామ్యహమ్॥ ౨౧

"భక్తులు వారేదేవతను భజించినప్పటికికూడ ఆ భజన, పూజల యొక్క ఫలమును నేనే నెరవేర్చుచున్నాను. అందరు దేవుళ్ళయందు నేనే నివసించుచున్నాననెడి బుద్ధినిశ్చయముకూడ అట్టి వారికి వుండదు; మరియు అందువలన యీ వన్నిదేవుళ్ళు దేవతలందరు వాస్తవముగ భిన్నభిన్నమైన వారేననెడి భేదభావము అతని మనస్సునందు నిలచి యుండును.

సతయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్హి తాన్॥ ౨౨

“అతడు యీ విధమగు శ్రద్ధకలవాడై తన యిష్టదేవతను యథావిధిగ ఆరాధించును; మరియు కార్యసిద్ధి కలుగునంతవరకు అతని యీ ఆరాధన అఖండరూపమున నడచును. ఇట్టి భక్తులు తమ మనస్సున వాంఛించెడి ఫలమును పొందుదురు; ఆఫలముకూడ నావలననే కలుగుచున్నది.

అ న్తవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసామ్।
దేవా న్దేవయ జో యా న్తి మద్భక్తా యా న్తి మా మపి॥ ౨౩

కాని తమ సంకుచితమగు సంకల్పములు, మరియు యోచనలను ఎన్నడును అతీతులుగాని భక్తులకు నన్నుగురించిన జ్ఞానమే కలుగదు; అందుచే వారికి లభించెడి ఫలము ఏదో ఒకనాడు అంతమొందక తప్పదు; మరియు ఆ ఫలములు శాశ్వతములు కూడ కావు. ఇంతేగాదు ఈ విధమగు భక్తివలన కేవలము సాంసారిక సాధనములు మాత్రమే లభించును. ఏలనన ఆత్మానుభవము లేనియెడల యీ సమస్త ఫలభోగములు క్షణకాలము వరకు మాత్రమే కనిపించు స్వప్నము వంటివై పోవును. కాని, దీనినిగురించిన విచారణ కొద్దిసేపటివరకు విరమించి మరొక విషయమునుగురించి యోచింతము. ఇట్టివారు, తాము ప్రేమపూర్వకముగ భజించు దేవతాస్వరూపమునే పొందుదురు. కాని తను, మన, ప్రాణములతో నామార్గముననే నడచు భక్తులు దేహాంతమగుటతోడనే మత్స్వరూపులయ్యెదరు.

అవ్య క్తం వ్య క్తి మాపన్నం మన్య న్తే మామబుద్ధయః
పరం భావ మజానన్తో మమావ్యయ మను త్తమమ్॥ ౨౪

“కాని, సామాన్య ప్రాణులు యిటులచేయక వ్యర్థముగ తమ హితవును తామే కీడు తెచ్చుకొందురు; ఏలనన, వారు తమ అరచేతియందు నీరు పోసి దానియందే యీదుటకు ప్రయత్నింతురు. కాని, వాస్తవముగ యీద దలచువారు లోతైన నీటిలో ప్రవేశించవలెను. అమృత సముద్రమున మునగ దలచినప్పుడు తన నోటినేల గట్టిగా మూసివేసికొనవలెను? మరియు తన మనస్సున ఏదో గోతియందు లోతుగాగల నీటిని జ్ఞప్తికి తెచ్చుకొని దుఃఖించనేల? అమృతమున ప్రవేశించికూడా బలవంతముగ తనపైకి మృత్యువు నేల తెచ్చుకొనవలెను? ఇంతకు బదులు స్వయముగ తానే అమృతుడై అమృ

తమునందే ఏల నివసించరాదు ? ఇదేరీతిని ఓ అర్జునా, యీ ఫలహేతువనెడి పంజరమును విడిచి, అనుభవమనెడి రెక్కలు తగిలించుకొని, జ్ఞానమనెడి ఆకాశమున ఏల చక్కగా విహరించరాదు. మరియు దానికి ప్రభువై ఏల వుండరాదు ? మానవుడిట్టి ఉన్నత ప్రదేశమున ఎగురసాగినప్పుడు తన పరాక్రమమువలన పొందెడి సుఖవ్యాప్తి - మానవుడు తన ఆనందాకాశమున తాను కోరినంత వేగముగ ఎగురగలుగునంత మిక్కుటముగనుండును. ఆ అపరిమితమగు ఆత్మసుఖమును కొలచుట కేల ప్రయత్నించవలెను ? నేను అవ్యక్తుడను, నిరాకారుడను. అట్టి నన్ను ఏల వ్యక్తునిగను సాకారునిగను అంగీకరించవలెను ? నా స్వరూపము స్వయముగ ప్రాణులందే స్వతస్సిద్ధముగ నున్నది. అట్టి పరిస్థితిలో నన్ను పొందుటకై ఏల వ్యర్థమగు సాధనలనెడి తిరుగుడులో పడవలెను ? కాన, ఓ అర్జునా, యీ విధముగా ప్రశ్నించసాగుట అట్టి జీవులకు ఏమాత్రము నచ్చదు.

నాహం ప్రకాశ స్సర్వస్య యోగ మాయా సమావృతః
మూఢో ఽయం నాభి జానాతి లోకో మామజ మవ్యయమ్॥ ౨౫

“జీవుల కనులపై మాయ యనెడి మసకకమ్మి యుండును. అందుచే వారికేమియు కనుపడదు. ఇందుచే వారు ప్రకాశము (వెలుగు) నందు కూడ నన్ను చూడజాలరు. కానిచో, నేనులేని ఏ ఒక్క వస్తువునైన నీవు చెప్పగలవా ? రసములేని జలమేదైన గలదా ? వాయువు స్పర్శించని పదార్థమేదైన గలదా ? ఆకాశము వుండని స్థలమేదైన గలదా ? కాన ఈ విశ్వమందంతటను నేనొక్కడనే నిండి యున్నానని తెలిసికొనుము.

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున।
భవిష్యాణిచ భూతాని మాంతు వేద న కశ్చన॥ ౨౬

“ఓ అర్జునా, ఇప్పటి వరకు ఎన్ని భూతములు గతించినవో అవన్నియు యిప్పుడు మద్రూపమునే పొందియున్నవి. ఇప్పుడున్న భూతములన్నియు నా స్వరూపములే - వాటియందు నేనే వున్నాను. భవిష్యత్తునందుత్పన్నము కానున్న భూతములుకూడ నాకు భిన్నమైనవి కావు. నిజము చెప్పవలెనన్న యివికూడ మాయతోకూడి యున్నమాటలే. లేకున్న వాస్త

లోనికి తప్పు దారితప్పి తిరుగుచూ మహామోహమనెడి అడవి క్రింద అణగి పోవును.

యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వన్ద్వ మోహ నిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥ 28

"ఇట్టి మిథ్యయైన సంకల్ప - వికల్పము లనెడి పదునుగల ముళ్ళను చూచుచుండికూడ, తనను ద్వంద్వ - మోహముయొక్క గాలియైన తగుల నివ్వనివారు, సకలమును ఏకనిష్ఠ యనెడి అడుగుగిడుచూ సంకల్ప - వికల్పము లనెడి ముళ్ళను త్రొక్కుకొనుచు మహాపాతకము లనెడి అడవిని దాటి వచ్చెడివారు, మరియు పుణ్యబలమువలన పరుగెత్తికొని నా వద్దకు వచ్చు వారునగు - యిట్టివారి గుణములను నే నెంతని వర్ణించను! యిట్టివారు కామము క్రోధము మొదలగు దొంగలనుండి పూర్తిగా తప్పించు కొందురు

జరామరణ మోక్షాయ మా మాశ్రిత్య యతన్తి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ 29

"ఓ అర్జునా, ఇటు పిమ్మట యీ జనన - మరణ మనెడి విషయము తనంత తానే అంతమొందును. పైన చెప్పియున్న ప్రయత్న మనెడి ఫల మునకు కానీన నిష్ఠగలవారి ప్రయత్నము ఎప్పుడో ఒకప్పుడు తప్పక సిద్ధించును; మరియు అప్పుడు వారి చేతికి పరబ్రహ్మ మనెడి పక్వమైన పూర్తి యగు ఫలము అందును; అందు పూర్ణత్వ మనెడి రసము పరిపూర్ణముగ నిండి యుండును, ఆ సమయమున ప్రపంచమంతయు కృతకృత్యత యనెడి ధన్యత్వ ముతో నిండియుండును, ఆత్మజ్ఞానముయొక్క గౌరవము పూర్ణత్వమును పొందును, కర్మల ఆవశ్యకత అంతమొందును మరియు మనస్సు సుఖము శాంతము గలదగును. ఓ అర్జునా, తన ఆచరణలో నన్నే తన మూలధన ముగా భావించి ఏర్పరచుకొనుటకు నిట్టి యీ విధముగ ఆత్మబోధ లాభము చేకూరును. వాని వృత్తుల సమావస్థతో పాటు బ్రహ్మైక్యత యనెడి వ్యవ సాయముకూడ విస్తరించును మరియు అప్పుడాతనియందు భేదభావ మనెడి భిక్షుకత్వము, లేక దీనత్వము ఎచ్చటను మిగిలియుండదు.

సాధి భూతాధి దైవం మాం సాధి యజ్ఞంచ యే విదుః
ప్రయాణకాలే ఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః ॥ 30

"ఎవరికి యీ మాయామయ జడసృష్టి నా స్వరూపమే యని అను
భవమగునో, మరియూ ఎవరు యీ అనుభవమనెడి చేతులతో నా అధి
భౌతికరూపమును ఆధారము చేసికొని సమస్త దేవతలకు అధిష్ఠానమగు నా
అధిదైవిక స్వరూపమువరకు వచ్చి చేరుదురో, మరియూ ఎవరికి పూర్ణజ్ఞాన
బలమువలన నా అధియజ్ఞ అనగా పరబ్రహ్మ స్వరూపము కనుపించసాగునో.
అట్టివారు యీ శరీరము పోవుటచే ఎన్నడును దుఃఖించరు. ఆయువ్య
మనెడి దారము తెగిపోవుటతోనే యీ ప్రాణులు పొందు వ్యాకులత, పరి
సరములందున్నవారు నేడు కల్పాంతమైనదాయని అనుకొనునంత భీకరముగ
నుండును. ఇట్టివారి స్థితి ఎటులైన నుండనిమ్ము, కాని నా స్వరూపప్రాప్తి
పొందినవారు మాత్రము మరణ సమయమందలి వ్యథలోకూడ నన్ను మరువరు.
ఇట్టి పూర్ణత్వమును పొందినవానినే నిజమైన యుక్తచిత్తునిగను, నిజమైన
యోగిగను సాధారణముగ తెలిసికొనవలెను." శ్రీకృష్ణ కింపుపైన, శబ్దము
లనెడి పిందెలోనుంచి వాణి యనెడి రసమును పోయుచుండెను; కాని
అర్జునుని అవధానమనెడి దోసిలి ముందుకుసాగి ఆ రసగ్రహణ మొనర్చు
చుండెను. ఏలనన, ఆ సమయమున ఆతడొక క్షణము నేపటివరకు గడచిన
శ్లోకములలో చెప్పబడిన విషయములను గురించి ఆలోచించుచుండెను.
విపులమగు అర్థ - రసముతో నిండియుండి, నలుమూలల సద్భావన మనెడి
సుగంధమును వ్యాపింపజేయుచూ పరబ్రహ్మ ప్రతిపాదన మొనర్చెడి
ఆ వచన రూపమునగల ఫలములు, కృపాప్రసాదమనెడి వాయువుయొక్క
మెల్లని దెబ్బలవలన శ్రీకృష్ణుడనెడి చెట్టుపైనుంచి అర్జునుని చెవులనెడి
జోలెలో పడెను. ఆ సమయమున ఆతనికి యీ వచన - ఫలములు స్వయముగ
మహా - సిద్ధాంతములవలననే తయారు చేయబడినవనిన్ని మరియు బ్రహ్మ - రస
సాగరమున ముంచబడినవై, ఆపిమ్మట పరమానందమనెడి రసమున
చక్కగా కడుగబడి తీయబడినవనిన్ని - అనిపించెను. వాటియందలి
మనోహరత్వము అర్జునుని అనిమిష నేత్రములు విస్మయామృత బిందువు
లను గుటుగుటు త్రాగునటు లొనర్చెను. ఆ అలౌకిక సుఖమును ఆస్వా

దించి అర్జునుడు స్వర్గమునుకూడ తుచ్ఛముగ తలంచసాగెను. మరియు అతని అంతరాత్మలో ఆనంద మనెడి చక్కిలిగిలి కాసాగెను. ఈ రీతిని ఆ వచన-ఫలముల కేవల బాహ్యదర్శన సౌందర్యముకలననే అర్జునుని కింతగా సుఖవృద్ధి కలుగసాగుటచే, అతనికి ఆ వచనఫలరసమును చవిజూడవలె ననెడి ప్రబలమైన కోరికకూడ కలుగసాగెను. అతడు ఆ వచన ఫలములను తర్క - బుద్ధి చేతులనుండి తొందరగా తీసికొని అనుభవ మనెడి నోట బెట్టుకొని వాటి రుచిని గోలసాగెను. కాని ఆ వచన ఫలములు విచారణ యనెడి జిహ్వకు రుచికరములు కాకుండెను. హేతువనెడి దంతములకు కొరుకుడుబడకుండెను. అందుచే అనుభవాబాధుడు వాటిని నమలవలె ననెడి విచారణనే వదలివైచెను. అర్జునుడిపుడు చకితుడై తన మనస్సున అనుకొనసాగెను— "ఇవన్నియు జలమున కనిపించు నక్షత్రములేనా? కేవలము అక్షరముల బాహ్యాడంబర మనెడి తిరుగుడులో నే నెటుల చిక్కుకొంటిని! వాటివలన నే నెటుల మోసపోతిని? ఇవి యెటువంటివి. మరియు ఎచ్చటి అక్షరములు? ఇవి కేవలము ఆకాశమునందలి పారలు. నా మతి ఎంతఎత్తుగా ఎగిరినప్పటికి యిందలి లోతును తెలిసికొనగలదా? దీని గాంభీర్యతను తెలిసికొనవంతవరకు యీ వచనముల అర్థమే బోధపడజాలదు" అర్జునుడు తన మనస్సునందీరీతిగా యోచించి, యాదవేంద్రుడగు శ్రీకృష్ణుని వైపుచూచెను; మరియు ఆ వీరశ్రేష్ఠుడు వినయపూర్వకముగ నిటులనెను. "ఓ దేవా, ఇచ్చటి ఏకత్రితమైన సప్తపదములు (శబ్దములు) యింతవరకెవరి చేతను ఆస్వాదింపబడనివి మరియు అపూర్వమైనవియై యున్నవి. ఇటుల కానిచో, చక్కగా ఏకాగ్రచిత్తముగలిగి ధ్యానించినప్పటికి కూడ శ్రవణము వలన గొప్ప గొప్పసిద్ధాంతములు స్పష్టీకరింపబడి యుండా వుండుట సంభవమా? కాని యీ ప్రకరణ మిట్టిది కాదు అక్షరముల యీ సొగసుచూచి విస్మయము కూడ విస్మయముచెందును. చెవులనెడి కిటికీ మార్గములగుండా తమ వాక్కిరణములు నా అంతఃకరణమున ప్రవేసించుటతోడనే నాకు పరమాశ్చర్యమయ్యెను. మరియు నావిచారశక్తియే ఆగిపోయెను. అందుచే నామనస్సున యీ మాటల అర్థజ్ఞానమును పొందవలెననెడి అనురాగము కలిగినది. కాని, యీఅనురాగమును గురించి వర్ణించుటకు కావలసినంత సమయము లేదు. కాన నో దేవా, తామే స్వయముగ వీటినన్నింటినివివరించుడు."

# తెలుగు జ్ఞానేశ్వరి

## ఎనిమిదవ అధ్యాయము

అర్జున ఉవాచ :—

కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ
అధి భూతం చ కిం ప్రోక్త మధి దైవం కి ముచ్యతే॥ ౧

అర్జును డిట్లనెను—"నే నడిగినది నాకు చెప్పుడు. బ్రహ్మకర్మ యన నేమో, అధ్యాత్మ మన నేమో నాకు తెలియజెప్పుడు. అధిభూతము, అధిదైవతములన నేమో కూడా నిరూపించుము. నాకు సులభముగ బోధపడు రీతిని నాకీ విషయములన్నియూ చెప్పుము.

అధి యజ్ఞః కథం కో ఽత్ర దేహే ఽస్మి న్మధుసూదన
ప్రయాణకాలేచ కథం జ్ఞేయో ఽసి నియతాత్మభిః॥ ౨

"ఓ దేవా, తాము అధియజ్ఞుడని చెప్పు నాతడు యీ శరీర మందెవరు? ఆత డెటు లుండును? నాకు తెలియ జెప్పుము. మరియు ఓ దేవా, నియమింపబడిన అంతఃకరణము గలవారికి మరణకాలమున మిమ్మును గురించిన జ్ఞాన మెటుల కలుగును?" అదృష్టవంతు డగు పురుషుడు చింతామణులచే నిర్మింపబడిన గృహమున నిద్రించుచున్న సమయమున కలవరించె ననుకొనుము; అతను నిజముగ కలవరించి నప్పటికీ అది ఎన్నడును వ్యర్థము కానేరదు. అటులనే అర్జునుని నోటినుండి యీ విషయములన్నియు వెలువడక పూర్వమే శ్రీకృష్ణ భగవాను డిటు లనిరి-"ఓ అర్జునా, నీ వడిగిన విషయములను వివరించెదను, చక్కగా వినుము." అర్జును డా సమయమున వాస్తవముగ కామధేనువుయొక్క బిడ్డవలెను, అతనిపైన కల్పవృక్షపు మండపముయొక్క సంతోషముతో కూడిన నీడ యున్నటులను వుండెను. ఇట్టి స్థితిలో అతని మనోరథము స్వయముగ మూర్తిమంతమై ఎదుట నిలచిన దనుటలో ఆశ్చర్య మేమి గలదు? శ్రీ కృష్ణుడు కోపావేశమున ఎవనిని చంపినప్పటికికూడ ఆతడు పరబ్రహ్మ సాక్షాత్కార పాత్రు డగును. అట్టి స్థితిలో ఆతడు అత్యంత ప్రేమతో బ్రహ్మోపదేశ మొనర్చినప్పుడు, అట్టివానికి బ్రహ్మ సాక్షాత్కార మెటుల కాదు? మనము కృష్ణరూపుల మైనప్పుడు

మన అంతఃకరణమున కృష్ణుడే యుండును మరియు ఆ స్థితిలో సిద్ధితనంతతానే సంకల్ప మనెడి మన యింటికి నడచివచ్చును. ఇట్టి అపూర్వ ప్రేమ కేవలము అర్జునుని యందే కలదు; అందువలననే అతని మనోరథములుకూడ ఎల్లప్పుడు సఫలమగుచున్నవి కాననే, భగవానుడు అర్జునుడీ రీతిగా ప్రశ్నించునని ముందుగనే తెలిసికొని, అతనికొరకై జవాబనెడి ఆహారమును ముందుగనే వడ్డించి సిద్ధముగ నుంచెను. చంటిబిడ్డడు స్తనమువైపునకు సాగుటతోడనే తల్లి అత డాకలితో నున్నాడని అర్థము చేసికొనును. అట్టి స్థితిలో బిడ్డడు వచ్చి-రాని మాటలతో నాకు పాలు కావలెనని అడుగ నక్కరలేదు. అతడు చెప్పకుండగనే అతని వాంఛను తల్లి తెలిసికొని, నెరవేర్చును. కావుననే, కృపాసముద్రుడగు గురువునందు తన భక్తునిపట్ల యింత ప్రేమ కలదనుటలో ఆశ్చర్య మేమియు లేదు. ఆ పైన భగవాను డేమి చెప్పెనో వినుడు.

శ్రీ భగవానువాచ:—

అక్షరం బ్రహ్మ పరమం స్వభావో ఽధ్యాత్మ ముచ్యతే
భూత భావో ద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః 3

సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుడిట్లనెను— "ఏది అనేకరంధ్రములతో కూడియున్న యీశరీరమునందుండి కూడ వాటిగుండా ఎన్నడును బయటకు పడదో, ఇందుకు విరుద్ధముగ ఏవస్తువు మనము శూన్యమని చెప్పుటకు కూడ వీలులేనంత సూక్ష్మమైనదో, మరియు ఏది ఆకాశమనెడి జల్లెడలో వస్త్ర గాలితము పట్టబడినదో, - ఇంత విరళమైనదీ, సూక్ష్మమైనట్టిదీ అయినప్పటికి కూడ ఏది మనము ఎంతగా విదలించినప్పటికి యీ ప్రపంచమనెడి జోలె నుండి క్రిందికి పడదో—అట్టి వస్తువు పరబ్రహ్మమైయున్నది. ఆ బ్రహ్మ తత్త్వము ఆకారము ఉత్పన్నమైనప్పటికి కూడ జన్మ వికారము నెరుగదు. మరియు ఆకారలోపమైనప్పటికి కూడ అది లోపించదు. ఈరీతిగ తన స్వయంసిద్ధావస్థలో నిరంతరముండెడి బ్రహ్మతత్త్వమునే, ఓ అర్జునా, అధ్యాత్మ మందురు. స్వచ్ఛమగు ఆకాశమున రంగురంగుల మేఘపటలములు ఉత్పన్న మగుచున్నవి. కాని అవి ఎటుల ఉత్పన్నమగుచున్నదీ, ఎచ్చటినుంచి

వచ్చుచున్నదీ ఎవరూ ఎరుగరు. ఇదేవిధముగ, ఆ నిరాకార శుద్ధ బ్రహ్మము నుండి ప్రకృతి మరియు అహంకారము మొదలుగాగల భిన్న భిన్న భూతములు పుట్టుచున్నవి మరియు వాటివలననే బ్రహ్మాండరచన ఆరంభమగుచున్నది. నిర్వికల్ప బ్రహ్మమనెడి భూమియందే "అహం బహుస్యామ్" అనెడి సంకల్పబీజము ప్రప్రథమమున చేరి అంకురముగ అవతరించును, మరియు అది అత్యంత శీఘ్రముగనే బ్రహ్మాండరూపమున నలువైపుల వ్యాపించి నిండి పోవును. ప్రత్యేక బ్రహ్మాండగోళమును చక్కగా చూచినచో అది ఆమూల బీజముతోనె అనగా ఆ బ్రహ్మత్వముతోనే నిండియున్నట్టుల కనిపించును. కాని నా టిమధ్యలో పుట్టెడి మరియు గిట్టెడి జీవులను లెక్కించనేలేము. ఆపిమ్మట ఆ బ్రహ్మాండములందలి భిన్నభిన్న భాగములు (అంశములు) కూడ 'అహం బహుస్యామ్' అనెడి ఆదిసంకల్పమునే త్వరగా జపించసాగును. అందుమూలమున అనేకవిధములగు యీ అనంతసృష్టి వృద్ధియగుచున్నది. కాని, సృష్టియందుగల యీ సమస్త పదార్థములందును ఆ ఏకమేవాద్వితీయ పరబ్రహ్మయే లోపలను బయటను నిండియున్నాడు. మరియు యీ అనేకత్వము, యీ భేదభావము అతనిపైన కేవలము వరదవలె వ్యాపించి యుండును. ఇదేరీతిని, యీ సృష్టియందు సమ, విషమ భావములు ఏరీతిని కలుగుచున్నవో కూడా బోధపడదు. పోనీ, యీ స్థావర — జంగమాత్మకమైన విశ్వసృష్టియంతయు వ్యర్థముగ మనోవినోదముకొరకే ఏర్పరుపబడిన దండమనిన, దానియందు పుట్టెడి భూతకోటి యందు లక్షలకొలది జాతులు కనిపించుచున్నవి. ఇటులనే యీ జీవుల సంఖ్యగాని, వీటి భేదభావమునకు ఒక పరిమితినిగాని నిర్ణయించుటకే అలవిగాదు. కాని వీటి మూలతత్త్వమును తెలిసికొనుటచే, యివన్నియు ఆ శూన్య బ్రహ్మమునుండియే పుట్టినవని తెలియుచున్నది. ఈ సృష్టియొక్క మూలకర్త ఎచ్చటను దొరకనే దొరుకుటలేదు; దానితోపాటు యీసృష్టికి గల కారణముకూడ ఏదియు కనుపించుటలేదు. కాని, మధ్యలో యీ సృష్టి కార్యము తనంతతాను అతిత్వరగా వృద్ధిపొందసాగుచున్నది. ఈ రీతిని కర్త ఎవరునూ లేకుండా ఆ నిరాకారబ్రహ్మపైన పడెడి ఇంద్రియ గమ్య ఆకారపుముద్రనే 'కర్మ' యందురు.

అధిభూతం క్షరోభావః పురుషశ్చాధిదైవతమ్
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥ 4

"ఇక నీకు అధిభూతమును గురించి సంక్షేపముగ తెల్పెదను. మేఘములు కనిపించి, లేకుండా పోవుచున్నట్లు పైకి మాత్రము కనిపించుచున్నప్పటికి వాస్తవమునకు నశ్వరమైనట్టిదియు, పంచమహాభూతముల అంశల పరస్పర మిశ్రణము వలన నిర్మాణమైనట్టిదియు, భూతములను ఆశ్రయముగా గొని వాటియందే మిశ్రితమై యుండెడి భాసమానమగు నట్టిదియు, నామరూపాదులతో కూడియున్న భూత-సంయోగమున వ్యాప్తభూతము కలుగుట తోడనే నశించిపోవునట్టిదియు యగునదేదో- దానినే అధిభూతమందురు. అధిదైవతమునే పురుషునిగా తెలిసికొనవలయును. ప్రకృతిచే ఉత్పన్నమైన సమస్త వస్తువులను యీతడు భోగించుచుండును (అనుభవించుచుండును)

ఈ పురుషుడే చైతన్యమనబడును. అందుగా ఆతడు బుద్ధికి నేత్రము వంటివాడు మరియు ద్రష్ట అయియున్నాడు. ఈతడే యింద్రియ ప్రదేశములకు ముఖ్యాధికారి లేక రాజు; మరియు దేహము సడలించిన పిమ్మట సంకల్ప-వికల్పములనెడి పక్షి పోయి. విశ్రాంతి గైకొనెడి వృక్షము కూడ యీతడే. ఈ 'అధిదైవత' మనెడి పేరు గల పురుషుడు వాస్తవమునకు ఆ పరమాత్మయే. కాని, పరమాత్మకు కొంచెము భిన్నముగానయ్యెను. ఈతడు అహంకారమనెడి నిద్రకు వశీభూతుడై యుండును; అందుచే స్వప్నతుల్యమైన మాయాజగదమును హర్షశోకాదుల అనుభవించుచుండును. లోకులు సాధారణముగా జీవుడని పిలచెడి యాతడే యీ పంచభూతాత్మక శరీర పిండమున గల అధిదైవతము. ఈ శరీరమనెడి బాహ్యమగు శరీర - బుద్ధిని లోపింపజేయువాడను నేనే; మరియు నన్నే యీ శరీరమున గల అధియజ్ఞముగా నెరుంగుము. ఇదిగాక, అధిదైవము మరియు అధిభూతము అనెడి రెండును కూడ వస్తుతః నేనే అయియున్నాను. మంచి బంగారము కల్తీ బంగారముతో కలసినప్పుడు మంచి బంగారము కూడ కల్తీబంగారమగుటలేదా? అయినప్పటికి ఆ మంచిబంగారము కల్తీ బంగారములో భాగము కాజాలదుగదా! కాని ఆ మంచిబంగారమును కల్తీ బంగారముతో కలసియున్నంతకాలము కల్తీబంగారమనియే చెప్పుట సబబు. అదే

కితిని, యీ అధిభూతము మొదలుగా గలవి ప్రకృతి యనబడెడి మాయ యొక్క తెరచే కప్పివేయబడి యున్నంతవరకు వాటిని మూల బ్రహ్మకు భిన్నమైనవిగానే అంగీకరించవలెను. కాని అవిద్యయనెడి తెర తొలగిపోయి భేదబుద్ధి యనెడి ముడి విడిపోయినప్పుడు యీ అధిభూతము మొదలుగాగల దృశ్యములన్నియు నశించి పరబ్రహ్మతో కలసి ఏకరూపమగును. ఆసమయమున వాటియందలి పరస్పర భేదము లెటుల వుండగలవు? జడకొప్పువైన స్వచ్ఛమగు స్ఫటికశిలను ధరించిన యెడల నేత్రములకు ఆ స్ఫటికశిల విరిగిపోయిన దానివలె కనిపించును. కాని, దాని క్రింద గల ఆ జెడ కొప్పును విప్పి వైచినప్పుడు, అప్పటి వరకు విరిగిపోయినటుల కనిపించిన ఆ స్ఫటిక శిలారూపము ఏమైపోయినదో ఎవరు చెప్పగలరు? పోనీ, ఆసమయమున అచ్చట విరిగిపోయిన భాగములను మరల ఎవరైన కలుపగలరా? వాస్తవమున కచ్చట యిదేదియూ సంభవించుటలేదు. ఆ సమయమున కూడా ఆ స్ఫటికశిల పూర్వమువలెనే యథాప్రకారముగ అఖండముగా వుంటున్నది, అది అచ్చట విరిగి పోయిన ముక్కగా కనిపించుటకు కారణము ఆ జెడ కొప్పు యొక్క సంయోగము మాత్రమే; దానిని ఆరీతిగా భ్రమింపజేసిన ఆ జెడకొప్పు విప్పివేయుట తోడనే అది తన యదార్థ రూపమున అఖండముగానే కనిపించుచున్నది. ఇదేరీతిని అధిభూతము మొదలగు వాని అహంభావము నశించిపోయినప్పుడు పరబ్రహ్మతోపాటు తనకు గల మూల ఐక్యరూపము పూర్వము వలెనే నిలచి యుండును. ఎవనియందీ ఐక్యము కలుగునో ఆ అధియజ్ఞుడు నేనే అయియున్నాను. ఓ అర్జునా, మనస్సు నందీ అభిప్రాయము నుంచికొనియే నేనింతకు పూర్వము (కర్మజాన్విద్ధి తాన్సర్వానేవం - మొదలగు శ్లోకములలో) కర్మలవలననే సమస్త యజ్ఞములు పుట్టుచున్నవని చెప్పియున్నాను. సమస్త జీవులు విశ్రమించెడి ఆ నిష్కామబ్రహ్మ సుఖమనెడి గుప్తభాండారమును నేడు నేను నీకు తెరచి చూపితిని. ప్రప్రథమమున చక్కగా వైరాగ్యమనెడి కట్టెలు తగిలించి ఇంద్రియములనెడి అగ్నిని ప్రజ్వలిత మొనర్చవలెను; ఆపైన ఆ అగ్నిలోనే విషయ-ద్రవ్యములను ఆహుతి యొనర్చవలెను. ఆపైన వజ్రాసన భూమిని శుద్ధ మొనర్చి, యీ శరీర మండపమున మూలబంధముద్రయనెడి యజ్ఞ-వేదిక నేర్పరచవలెను. ఈ విధమగు సిద్ధి కలిగిన పిదప ఇంద్రియనిగ్రహ కుండ

మున యోగ మంత్ర ఘోషనొనర్చుచూ తగురీతిని ఇంద్రియ ద్రవ్యములను అర్పించవలెను. ఆపైన, మనస్సు మరియు ప్రాణవాయునిగ్రహమునే యీ యజ్ఞవిధాన సమారంభముగ నెంచి, నిర్మల జ్ఞానమనెడి అగ్నిని సంతుష్ట పరచవలెను. ఈ రీతిని జ్ఞానాగ్నిలో సమస్తము అర్పణ మొనర్పబడి నప్పుడు అజ్ఞానము సమస్తజ్ఞేయవస్తువు లందున లీనమగును. మరియు అప్పుడు కేవలము జ్ఞేయ స్వరూపమునందే అంతటను అవిశిష్టముగ నుండును. ఈ జ్ఞేయమునే 'అధియజ్ఞ' మందురు. ఈ రీతిగా శ్రీ కృష్ణుడు చెప్పిన విషయము లన్నియు అప్పటి కప్పుడే అర్జునునకు బోధపడెను. అంత శ్రీ కృష్ణుడర్జునుని చూచి యిటులనెను. "ఓ పార్థా నేను చెప్పిన దంతయు చక్కగా వింటివిగదా!" శ్రీ కృష్ణుని యీ మాటలను వి అర్జునుడు తనను పరమ ధన్యునిగా భావించెను. బాలుడు తృప్తి నొందుటను చూచి తల్లి కూడా తృప్తి పొందును. శిష్యుని తృప్తిని చూచి గురువు కూడా తృప్తి నొందును. ఇందలి అనుభవము ఆ తల్లికి, గురువుకు మాత్రమే తెలియును; ఇతరులు దీనిని గురించి ఊహించనైన ఊహించజాలరు. శ్రీకృష్ణుడు యిటులనెను. "అర్జునా వినుము, మాయ యీ రీతిని దగ్ధము కాసాగినప్పుడు ఆ అగ్నిలో దానిని దగ్ధమొనర్చుచున్న జ్ఞానము కూడ దగ్ధమై బూడిదయై పోవును."

**అన్తకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్**
**యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥ 5**

నేనిప్పటివరకు వివరించిన అధియజ్ఞమని చెప్పబడుదానిని గురించి లోకులీరీతిని తలంచుచుందురు. "ఇది ఆదినుండి అంతము వరకు 'నేనే'నని వారు భావించెదరు మరియు వారు తన శరీరమును - అవకాశమును తన లోపల భాగమందు నింపికొనియుండి. తాను కూడ బయటగల ఆ అవకాశమునందే వసించియుంటున్న యిల్లువలె భావింతురు. ఈ రీతిగా వారు బ్రహ్మరూపులై లోపలను, బయటను అంతటను యెల్లప్పుడు బ్రహ్మ స్వరూపమునందే నివసించుచున్నారు. వారు బ్రహ్మానుభవమనెడి లోపలి యింటి యందలి దృఢనిశ్చయమనెడి గదిలో ప్రవేశించినప్పుడు వారికి బ్రహ్మకు మినహా బయటగల మరే పదార్థమును కొంచెమైనను స్మరణయుండదు

ఈ రీతిగా లోపలను, బయటను పరబ్రహ్మస్వరూపులై మద్రూపులగువారికి బయట గల పంచమహాభూతములచే నిర్మితమైన శరీరమనెడి ఆవరణ తొలగిపోయి నట్లు కూడ తెలియకుండ [illegible] నుండును. శరీరము వున్నప్పుడే యీ శరీర ఆకారమును గుర్తించిన మోక్షము. అతనికి వుండనప్పుడు అది తొలగి పోవుటవలన మాత్రమేమి లక్షించును? ఇట్టివానికి శరీరము పోయినప్పటికి లేక నశించినప్పటికి అతని బ్రహ్మత్వము ఘనమునందు లేశమాత్రమేమి కొరతరాదు. అతని ఆ అనుభూతి పరిపూర్ణత్వమనెడి పోతపోసిన జీవించియున్న బొమ్మయే యగును. ఆ బొమ్మ నిశ్చలత్వమనెడి చట్రమును (Frame) నందు అమర్చబడి. సమరసత్వమనెడి సముద్రమున తేలగబడి, నామమనెడి మలినము కూడ మిగిలి యుండనంత స్వచ్ఛమైనదై యుండును. లోతైన జలాశయమున కుండను ముంచి నెడల, దాని లోపలను నీరు నిండియుండును. బయటను కూడ నీరు నిండియే యుండును ఇట్టి సమయమున ఏ వేళయున ఆ కుండ పగిలిపోయిన దనుకొనుము - అప్పుడు దానితోపాటు నీరు కూడ విడిపోవునా? పాము కుబుసమును విడిచినప్పటికుగాని. లేక ఉమ్మదించుట (ఉడుకబోత) వలన మనుష్యుడు తన శరీరముపైన ధరించిన వస్త్రములను విప్పివేయుటచేగాని, ఆ పాము యొక్క లేక ఆ మనుష్యుని యొక్క అంగములందు కూడ మార్పు వచ్చునా? అదేరీతిని యీ నామరూపాత్మకమైన శరీరము నశించును. కాని అందలి బ్రహ్మ యనెడి సద్వస్తువు ఆ దేహాదులు లేనంతనే స్వస్వరూప ముతో యథాప్రకారముగా నుండును. అట్టి పరిస్థితిలో, బ్రహ్మస్వరూప ముతోపాటు సమరసత్వమును పొందు స్వరూపముగ బ్రహ్మత్వమును పొంది యున్న బుద్ధి ఏ రీతిని భిన్నాభిన్నము కాగలదు? కావుననే యీ రీతిగా దేహావసాన సమయమున నన్ను తెలిసికొని శరీరమును విడచువారు మద్రూపులే యగుదురు.

యం యం వాపి స్మరన్భావం త్యజత్యన్తే కళేబరమ్
తం తమేవేత్తి కౌన్తేయ సదా తద్భావ భావితః॥ ౬

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మరయుధ్యచ
మయ్యర్పిత మనోబుద్ధిర్మామే వైష్యస్య సంశయమ్॥ ౭

సాధారణముగ మనుష్యుడు తన మృత్యుసమయమున తన మనస్సున దేనిని ధ్యానించునో, అతడు అదే యగుచుండును. ఒకడు భయముగలవాడై వాయువేగమున ఏదో వైపునకు పరుగెత్తసాగెననుకొందము. అతడు అకస్మాత్తుగ ఆ పరుగెత్తుటలో నూతిలో పడెను. అతనికి ఆ సమయమున ఆ నూతిలో పడుటకు పూర్వము తనను కాపాడుకొనుటకు ఏమార్గము అతనికి కనిపించకపోవుటచే, అతనికి నూతిలో పడుటకు మించిన వేరే ఉపాయము లేకపోయినది; అదేరీతిగా, మృత్యుసమయమున జీవునకు ఏ కల్పన కలుగునో, ఆ కల్పనతో కలిసిపోవుటకు మించి అప్రయత్నమే మరే యితర ఉపాయము వుండదు. అటులనే, మేల్కొని యున్నప్పుడు మనుజుడు ఏ విషయమును నిరంతరము ధ్యానించుచుండునో, అదే విషయము అతనికి నిదుర వచ్చినప్పుడు స్వప్నమునందు కూడ కాన్పించును. అదే విధముగ జీవించి యున్నప్పుడు జీవునకు పూర్తికాని వాంఛలపట్ల మరణసమయమున ఆ జీవునకు అనురాగము చాల ఎక్కువగును. అంతేగాక మరొక నియమము గలదు. అదేమన, మరణసమయమున జీవుడు దేనిని గూర్చి స్మరించునో, దాని యోనియందే జీవుడు పోయి పడును. కావున యెల్లప్పుడు నీవు నన్నే స్మరణయందుంచుకొనుము. నీవు కన్నులతో చూచునది, వినునది, మనస్సున చింతించునది, వాక్కుతో చెప్పునది అంతయూ లోపలను, బయటను అంతటను మద్రూపుడనై చూచుము; వినుము, చింతన మొనర్పుము మరియు పూట్లాడుము — మద్రూపప్రపంచముగానే అయి సమస్త ఆచరణముల నొనర్పుము. అట్టి స్థితిలో ఎల్లప్పుడు అంతటను నేనే సహజభావమున సిద్ధించును. ఓ అర్జునా, నీవు ఈ విధముగ చేయగలుగు నెడల శరీరము నశించునెడి మృత్యుభయమేమాత్రము నీకు వుండదు. ఇట్టి స్థితిలో, కేవలము యుద్ధము చేయుటకు నీకేల భయము కలుగును? నీవు వాస్తవముగ నీ మనోబుద్ధులను నా ఆత్మస్వరూపమునందర్పణ మొనర్చినచో, నీవు మద్రూపుడవే అయ్యెదవని నీకు నేను ప్రతిజ్ఞచేసి మాట యిచ్చుచున్నాను. నీకిది యెటుల సంభవించగలదని సంశయము కలుగునెడల నీవు ముందుగనే దీని నభ్యసించి అనుభవించుము; అప్పుడు నీకు ఫలసిద్ధికానిచో నీవు సంతోషముగ నన్ను కోపగించవచ్చును.

అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్య గామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థాను చిన్తయన్ । ౮

ఈ విధముగు అభ్యాసము వలన మాత్రమే యీ కర్మయోగము చిత్తమును నిర్మలమైనదిగను సమర్థమైనదిగను చేయును. ఉపాయ బలము వలన కుంటివాడు కూడ పర్వతముపై కెక్కగలుగు నటుల, కర్మ యోగాభ్యాసము వలన నీవు నీ మనస్సును పరబ్రహ్మ మార్గమున లగ్నమొనర్చుము. ఇటుల చేసినచో మనస్సు, శరీరములు - ఉన్నప్పటికి నశించినప్పటికి కూడా ఏ విధముగు హానియు కలుగదు. మానవుని అనేక విధముగు అవస్థల లోనికి గొంపోయెడి చిత్తము, ఆత్మయందు రమించుచో, యీ శరీరము వున్నది, నశించినది యనెడి ధ్యాస యెవరికుండును? నదీ ప్రవాహముతో పాటు తీవ్రముగ ప్రవహించుచూపోయి సముద్రమున కలసిపోయిన నీరు, తన వెనుక ఏమి జరుగుచున్నదో చూచుటకు మరలి వచ్చునా? ఎన్నడును రాదు. అది సముద్రముతో పాటు ఏకరూపమును పొంది దాని యందే ఉండిపోవును. ఇదేరీతిని చిత్తము కూడ చైతన్యమై పరబ్రహ్మ యందే ఉండిపోవును.

కవిం పురాణ మనుశాసి తార, మణో రణీయాం సమనుస్మరేద్యః
సర్వస్య ధాతార మచిన్త్యరూప, మాదిత్య వర్ణం తమసః
పరస్తాత్ ॥ ౯

ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యాయుక్తో యోగబలేన చైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ సతం పరం పురుష
ముపైతి దివ్యమ్ ॥ ౧౦

"దేనియందు జనన - మరణము లనెడి పోరాటము లన్నియు అంత మొందునో, ఏది పరమానంద స్వరూపమో, ఏది నిరాకారమైనదో, దేని యందు జనన మరణములు లేవో, ఏది సర్వసాక్షియో, ఏది ఆకాశముకంటె కూడ ప్రాచీనమైనదో, ఏది పరమాణువుల కంటె కూడ చాలా చిన్నదియో, దేని సాంగత్యము వలన విశ్వమునకు చేతనత్వము ప్రాప్తించునో, ఏది

యీ సమస్త దృశ్యములను ప్రసవించుచున్నదో, దేని మూలమున యీజగత్తు జీవించి యున్నదో, దేనియందు హేతువాదము అనగా కార్య - కారణ సంబంధము నిలువజాలదో, ఏది కల్పనాతీతమో, ఏది పగటియందు కూడా చెదపురుగు అగ్నిలో ప్రవేశించ జాలని రీతిగను, తేజస్సునందు అంధకారము ప్రవేశించజాలని రీతిగను - చర్మ చక్షువులకు అంధకారమువలె అదృశ్యమై యుండునో, ఏది పరిపూర్ణముగ నిర్మల మొనర్చబడిన సూర్యుడనెడి కిరణముల రాశియో, ఏది జ్ఞానులపట్ల ఎల్లప్పుడు ఉదయించి యుండెడి సూర్యుని వంటిదో మరియు ఎవనిపట్ల లక్షణము (శబ్దాభిప్రాయమును సూచించెడి శబ్దశక్తి) వలన కూడ 'అస్తమించెను' అనెడి శబ్దమును ప్రయోగించుటకు వీలుకాదో, ఆ నిర్దోషుడు పరిపూర్ణ స్వరూపుడునగు బ్రహ్మమును ఎవడు మరణ సమయమున శాంతచిత్తముతోను జ్ఞానపూర్వకముగను స్మరించునో, ఎవడీ బాహ్యశరీరముతో పద్మాసనమున కూర్చొని ఉత్తర దిశవైపు ముఖము నుంచి కూర్చొనునో, ఎవడు కర్మయోగ మనెడి శాశ్వత సుఖమును పూర్తిగా తనలో తాను నింపుకొని, లోలోపలనే ఏకాగ్రమొనర్చికొనిన మనశ్శక్తితోను మరియు బ్రహ్మ స్వరూప ప్రాప్తి కావలెననెడి ప్రేమతోను అతి శీఘ్రముగ ఆత్మస్వరూప ప్రాప్తికై సిద్ధమొనర్చుకొనబడిన యోగసహాయము వలన, సుషుమ్నా మధ్యమార్గము గుండా, అగ్నిచక్రము నుండి బ్రహ్మరంధ్రము వైపు పోసాగినప్పుడు మరియు మహదాకాశమున ప్రాణవాయువు సంచరింప సాగినప్పుడు, అతనికి దేహాదులు మరియు చిత్తసంయోగములు చాల తుచ్ఛమైనవి బాహ్యమైనవిగను కనిపించును, - కాని, ఎవడు మనశ్శాంతి వలన జాగరూకుడై యుండునో, భక్తిభావనతో పరిపూర్ణముగ నిండియుండునో మరియు యోగశక్తి వలన చక్కగా సిద్ధుడైయుండునో, అట్టివాడే జడము మరియు అ-జడములను లయమొనర్చగలడు మరియు భ్రూమధ్య భాగమున తిరుగుచుండును. ఘంటానాదము ఘంటమునందే లీనమగు నట్టుల మరియు పాత్రక్రింద పెట్టబడియున్న దీపము ఎప్పుడు ఆరిపోయినదో తెలియరానట్టుల ఎవడిట్టి శాంతావస్థలో యీ శరీరమును విడచునో, అతడే పూర్ణ పరబ్రహ్మమగును. పరమ పురుషుడనెడి పేరుగల నా స్వయం సిద్ధ తేజో స్వరూపముగా అతడై యుండును.

యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్రహేణ
ప్రవక్ష్యే॥ ౧౧

"అన్ని విధములగు జ్ఞానములకు అంతిమము మరియు చరమసీమయునై యున్న సర్వశ్రేష్ఠ జ్ఞానగనియగు జ్ఞానులబుద్ధి 'అక్షర'మని చెప్పనట్టిదిన్ని మరియు ప్రచండవాయువు వలన కూడ ఎన్నడును ఎగురనట్టిదిన్ని యగునదే నిజమగు ఆకాశము. ఇటులకాక, అది కేవలము మేఘమే యగునెడల, అది వాయువునకుంచు పోటుల ఆగగలదా? ఇందువలననే జ్ఞానులు మాత్రమే తెలిసికొనదగినట్టిదిన్ని - జ్ఞానమువలన మాత్రము కొలువదగినట్టిదిన్ని స్వాభావికముగా అక్షరమైనట్టిదిన్ని యైనదగునది యెన్నడును తెలుసుకొన బడజాలదని చెప్పదురు. కాన వేదము నెరిగినవారు 'అక్షర'మని చెప్పనట్టిదిన్ని, ప్రకృతికి భిన్నమైనదిన్ని, సచ్చిదానందస్వరూపము గలదిన్ని, విషయములందలి విషయాసక్త ఖండమును తీసివేసి లేదా వదలివేసి సమస్త యింద్రియములను నిర్మలమొనర్చి ఉదాసీనవృత్తితో శరీరచ్ఛాయలో కూర్చొనియున్న విరక్త పురుషుడు కూడ ఎల్లప్పుడు కావలెనని కోరుకొనునట్టిదిన్ని, ఇచ్ఛాహీనుడగు పురుషుడు కూడ వాంఛించునదిన్ని, కొందరిచే అనురాగమువలన బ్రహ్మచర్యమనెడి ఘోరవ్రత సంకటములను కూడ లక్ష్యము చేయక ఘోరముగ తమ యింద్రియములను నిశ్చలమొనర్చునటుల చేయించునట్టిదిన్ని యగు ఆ దుర్లభము, అచింత్యము మరియు అనంతమునగు పదమును పైనచెప్పినరీతిని మరణ సమయమున నన్ను స్మరించు పురుషుడు పొందును కాన ఓ అర్జునా, నీవు జయప్రదుడవగుటకై ఒక పనిచేయవలెను. మనస్సునకు స్వాభావికముగా గల బయటకు పరుగెత్తు అలవాటును మాన్పవలెను; మరియు దానిని ఎల్లప్పుడు హృదయమున వసింపజేయువలెను. ఇటుల చేయునెడల సమస్తము తనంత తానే తెలియగలదు.

సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్॥ ౧౨

"ఇది యెట్టుల యెప్పుడు కటస్థించును సంగతి ఇంద్రియద్వారముల నన్నిటిని చక్కగా నిగ్రహించి మూసివేసినప్పుడే వచ్చును ఆ స్థితిలో మనస్సు సహజముగనే లోలోపలనే అణగియుండును. మరియు అణచి వేయబడియున్న ఆ మనస్సప్పుడు హృదయమునందే పడియుండును. కాళ్ళు-చేతులు విరుగుటవలన అంగవైకల్యము పొందిన వ్యక్తి యెన్నడును యిల్లు విడచి బయటకు పోనిరీతిని మనస్సు కూడ చక్కగా లోపల బంధింపబడి యున్నప్పుడు మానవుడు ప్రాణవాయువు ద్వారా ప్రణవము అను ఓంకారమును ధ్యానించవలెను. అప్పుడు క్రమక్రమముగ ఆ ప్రాణవాయువును బ్రహ్మరంధ్రమువరకు తీసికొనిపోవలెను. ప్రాణవాయువును బ్రహ్మరంధ్రము లోనికి తీసికొనిపోయినప్పుడు ధారణాబలమువలన దానినచ్చట బ్రహ్మకాశమునందు కలసిపోవురీతిని స్థిరముగ నుంచవలెను.

ఓమి త్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం సయాతి పరమాంగతిమ్॥ ౧౩

"ఇటు పిమ్మట 'అ' 'ఉ' మరియు 'మ్' — ఈ మూడు మాత్రలు అర్ధమాత్రలో లయము కానంతవరకు ప్రాణవాయువును చిదాకాశమునందు నిశ్చలమొనర్పవలెను. దీనివలన ఐక్యత ప్రాప్తించగనే ఆ ఓంకారమంతయు కూడ బ్రహ్మలో నిండియున్నటుల కనిపించును. దీనితో ఓంకార స్మరణము కూడ అంతమొందును. మరియు ప్రాణవాయువు కూడ లీనమైపోవును. ఇటుపైని ఓంకారమునకు కూడ భిన్నమగు కేవల శుద్ధ బ్రహ్మానంద స్వరూపమే మిగిలియుండును. ఈ ప్రకారము, ఓంకారమే నా ఏకాక్షర బ్రహ్మ స్వరూపము. నా యీ స్వరూపమును తలచుకొనుచూ యీ జడశరీరమును విడచువాడు నిస్సందేహముగ నా శుద్ధ శరీరమును పొందును; మరియు యీ స్వరూపమును పొందినవానికి పొందవలసినది మరేదియు లేదు.

"అర్జునా! మరణ సమయమున ఇంద్రియములన్నియు శిథిలమైపోయి జీవితమునందలి సమస్త సుఖములు నశించి, లోపలను బయటను మృత్యుదేవత పూర్తిగా కబళించి వేసిన సమయమున ఆసనమున కూర్చొని ఎవడు ఇంద్రియ నిరోధ మొనర్చగలడు? మరియు అట్టి మానవుడు ఎట్లని అంతః

కరణతో ఓంకార చింతన మొనర్చ గలను ? ఇదంతయు అసంభవముగా కనిపించు చున్నది" అని నీకు సంశయము కలుగు నెడల, నీవొక విషయమును జ్ఞప్తియందుంచు కొనుము. ఎల్లప్పుడు అఖండ రూపముగ నన్నె చింతించు చుండువారికి మరణ సమయమున నేను స్వయముగ సేవకుని వలె ఉపయోగ పడుదును.

అనన్య చేతాస్సతతం యోమాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్య యుక్తస్య యోగినః॥ ౧౪
మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాంగతాః॥ ౧౫

"విషయములను అంతమొనర్చి, బంధకమగు కర్మ - ప్రవృత్తి యొక్క పాదములకు సంకెళ్ళువేసి నిరంతరము నన్నే తన హృదయము నందుంచుకొని, నా స్వరూప సుఖోపభోగ మొనర్చుచూ, యీ రీతిని సుఖోపభోగ మొనర్చు సమయమున ఆకలి దప్పులను కూడ మరచిపోవు వారిని గురించి చెప్పవలసిన దేమున్నది ! ఈ రీతిని నిరంతరము నా స్వరూపమున ఏకాగ్రులై కలసి యుండువారు. హృదయముతో నాతో కలసిపోయి మత్స్వరూపులుగనే యుందురు; ఇట్టివారియెడ కూడ మరణ సమయమున నన్ను స్మరించినయెడలనే వారు నన్ను చేరెదరని చెప్పుచో, యిక ఉపాసనా మహత్వ మేమి గలదు ! ఎవడైన దీనుడు సంకటావస్థలోనుండి పరిశుద్ధ హృదయముతో "ఓ నారాయణా త్వరగావచ్చి నన్ను కాపాడుము" అని వేడినంతనే, నేనతని పిలుపును విని, అతని దుఃఖముచే వ్యాకులమును పొందినవాడనై, అతనికి సహాయము చేయుటకై పరుగిడిపోవుట లేదా ? ఇట్టివారి యెడలనే నేనింత ప్రేమతో నున్నప్పుడు, నన్నె ఏకనిష్ఠతో యెల్లప్పుడు భజించువారు అంతకాలమున స్మరించిన యెడలనే నేను వారిని తరింపజేయుదుననుటలో అర్థమేమైన గలదా ? అట్టి పరిస్థితిలో నన్ను భజించవలెనను వాంఛ కలుగుటకేమైన అవకాశము గలదా ? అందువలననే, యీ విధమగు సంశయమునకు నీ మనసునందేమాత్రము తావివ్వవద్దని నీతో చెప్పుచున్నాను. భక్తులగువారు నన్ను స్మరించిన వెంటనే నేను వారివద్దకు పరుగిడిపోవలసియున్నది. అట్టి

ఏకనిష్ఠోపాసన చేయువారి భారము యింతటితో తొలగిపోకపోగా, వారి భక్తియనెడి ఋణభారము నాపై నుండును, మరియు ఆ ఋణమును తీర్చుటకై అట్టి భక్తుల మరణ సమయమున వారిని సేవించుటకై నేను చాల జాగరూకతతో సంసిద్ధుడనై యుండవలసియున్నది. ఆ కోమల భక్తులకు వారి శరీర దౌర్బల్యము వలన ఏవిధమైన బాధయైన కలుగునేమోయని నేనెల్లప్పుడు బాధపడుచుందును; అందుచే వారిని ఆత్మజ్ఞానమనెడి పంజరమున సురక్షితముగ నుంతును. మరియు వారిపైన ఆత్మసమర్పణమనెడి శాంతము శీతలమునగు నీడనుంచెదను. ఈ రీతిని వారి బుద్ధి నిరంతరము స్థిరముగను శాంతిముగను నుండునటుల చేతును. ఇందుచే నా భక్తులకు ఏమాత్రపు కష్టమూ మరణ సమయమున కలుగదు. నాకు పరమ ప్రియులగు ఆ భక్తులను నేను సహజముగనే నా స్వరూపమువైపుకు తీసికొందును. వారిపైనగల శరీరమనెడి బాహ్య కవచమును నేను తొలగింతును, వారిపైన గల అసత్య అహంభావమనెడి ధూళిని నేను తుడచివేతును, మరియు వారి శుద్ధవాసనను నిర్లిప్తముగ నుంచి వారిని నా స్వరూపముతో కలిపివేసికొందును. ఇంతే గాక, భక్తులకు కూడ ఏకత్వభావము గలవారై యుండుటవలన తమ శరీరముపై విశేష మమకారము వుండదు. ఇందువలన తమ శరీరమును విడచిపెట్టునప్పుడు వారికి శరీరవియోగదుఃఖము కలుగదు. ఇదేరీతిని, దేహపాతమగుటతోడనే 'భగవానుడు నన్ను తీసికొనిపోవును గాక, నన్ను ఆయన ఆత్మ స్వరూపములోనికి తనవద్దకు తీసికొనుగాక' — యనెడి భావము కూడా అట్టి భక్తుల మనస్సునందుండదు; ఏలనన, వారు దేహధారులుగా నున్న స్థితియందే నా స్వరూపమున కలిసియుంటున్నారు. వాస్తవిక దృష్టితో చూచినచో, యీ ప్రపంచమున ఆతనికిగల ఆ అస్తిత్వము శరీరమనెడి జలమునగల కేవల ఛాయవంటిదిమాత్రమే. నీటియందు చంద్రుని ప్రతిబింబము పడుచున్నది. కాని, అచ్చట జలము నశించినప్పుడు వాస్తవమునకు ఆ ప్రతిబింబము తనంత తానే చంద్రునితో చేరిపోవుచున్నది. సరిగా యిదేరీతిని, యీ శరీర రూపమున గల జలము అంతమొందినప్పుడు ఆ మనుష్యుం వాస్తవమునకు ఆత్మస్వరూపమునందే యుండును. ఈ జగత్తున వారికి గల ఆ అస్తిత్వము వాస్తవము కాదు, అది కేవలము ప్రతిబింబముతో సమానముగ నగును. మరియు వారి వాస్తవిక స్వరూపము బ్రహ్మ స్వరూపమే యగును.

ఈ రీతిని మద్రూపులై యున్నవారికి నేను ఎల్లప్పుడు అనాయాసముగ నే ప్రాప్తింతును; అందుచే వారు దేహావసాన సమయమున నా స్వరూపమును పొందుదురు. ఇందేమాత్రము సందియము లేదు. క్లేశ-వృక్షములకు నిధియు, ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికమనెడి త్రివిధ తాపములను కుంపటియే యున్నా, మృత్యువనెడి కాకిముందు పెట్టబడిన కేవలము బలియున్నా, విపుల పరిమాణములో దైన్యతను పుట్టించునదిన్నీ, దుఃఖములను పెంపొందించునదియు, సమస్త దుఃఖములకు భాండారమును, దుర్బుద్ధికి ఆదికారణమును మరియు భ్రాంతి యొక్క ప్రత్యక్ష మూర్తియు, యీ సంసారమునకు మూలాధారమును, వికారములకు క్రీడారంగమును, మరియు సమస్త వ్యాధులకు ఆహారమును, కాలుని ఎంగిలి పులగమున్నా, ఆశకు ఆశ్రయస్థలము మరియు జనన-మరణములను కలిగించునట్టి సారవంతమగు పొలమున్నా, భ్రమతో నిండియుండి వికల్పముతో నిర్మింపబడిన దుఃఖములనెడి తేళ్లతో పూర్తిగా నిండియున్నదిన్నీ, పెద్ద పులి గుహయు, వారాంగనలతో నుండెడి విషయ-భోగములకు పూర్తిగా ఆదరణీయమైన సాధనమును, యక్షిణీ ప్రేమవలె-చల్లార్చిన విషబిందువువలె - మోసబుద్ధితో కూడుకొనియున్న బాహ్య విశ్వసనీయ సద్వ్యవహారము వంటిదిన్నీ, కుష్ఠురోగుల ఆలింగనము - కాలసర్పపు కోమలత్వము మరియు వ్యాధుని స్వాభావిక గానము వంటిదిన్నీ, శత్రువుచే చేయబడిన అతిథి సత్కారము - దుర్జనులచే చూపబడిన ఆదర-సత్కారముల వంటిదిన్నీ, సమస్త అనర్థములకు సముద్రమున్నా, నిద్రలో చూచిన స్వప్నము వంటిదిన్నీ, ఎండమావులచే తడుపబడినతోటయు, ధూమకణములచే ఏర్పడిన ఆకాశమున్నా అగు యీ శరీరము, ఒక్కమారు నా అపార బ్రహ్మ-స్వరూపమునుపొంది మద్రూపులైనవారికి మరల యెన్నటికిని ప్రాప్తించదు.

ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥ ౧౬

సహస్రయుగపర్యన్త మహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహో రాత్ర విదో జనాః ॥ ౧౭

"సాధారణముగ కనకుగల బ్రహ్మజ్ఞానమును గురించి అభిమానముగల వారు తమ జనన-మరణ చక్రమును ఎన్నటికిని అంతమొందింపజాలరు. కాని, మరణించినవాని పొట్టలో నొప్పి కష్టాటుల. మేల్కొనిన పిదప ఎవడును అంతకుముందు స్వప్నమున చూచిన వరదలో మునగజాలనటుల – మద్రూపమును చెందిన వారెన్నడును సంసారమునందున చిక్కుకొనరు. వ్యావహారిక దృష్టితో చూచుటచే, ఏ బ్రహ్మ-భువనము యీ నామరూపాత్మక సంసారము (జగత్తు)నకు మస్తకమో, ఏది చిరస్థాయియగు గుణములతో అత్యంత శ్రేష్ఠమైనది మరియు విశ్వమనెడి పర్వతపు అత్యుత్తమ శిఖరమో, ఏ త్రిభువనమునందలి ఒక ఝాము ప్రాతఃకాలమంతవరకు ఇంద్రుని ఆయువు కూడ నుండదో మరియు దేనియందు ఒక దినము పూర్తియగునప్పటికి పదునలుగురు యింద్రుల పంక్తి క్రమముగా ఉదయించి అంతమున అస్తమించునో, ఇరువది నాల్గువేల యుగములు గడచుటచే ఏ బ్రహ్మభువనమున ఒక పగలు అగునో, యిదే మాదిరిగ మరల 24 వేల యుగములు ఆ లోకమునకు ఒక రాత్రి యగునో, యీ విధముగు కాలమానముగల ఆ బ్రహ్మభువనమును చేరిన భాగ్యశాలియగు మనుష్యుడు ఎన్నటికిని మరణించడు మరియు అతడు స్వర్గమున చిరంజీవియై సమస్తము చూచుచుండును. అచ్చట సామాన్య దేవ గణములను గురించి ఏమని చెప్పను! సమస్త దేవతలకు రాజగు యింద్రునికి అచ్చట ఏ స్థితియుండును! ఒకే రోజున పదునల్గురు యింద్రులు వత్తురు మరియు వెళ్ళిపోదురు. కాని, బ్రహ్మదేవుని ఎనిమిది ఝాములుగల దినమును స్వయముగ తమ కన్నులతో చూచువారిని 'అహోరాత్రవిదులు' అందురు.

అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్య హరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయ న్తే తత్రైవా వ్యక్త సంజ్ఞకే ॥ ౧౮

భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవం త్యహరాగమే ॥ ౧౯

"ఆ బ్రహ్మలోకమున పగలు రాగానే గణింపనలవికాని యిట్టి నిరాకార బ్రహ్మమునుండి యీ నామరూపాత్మకమగు సాకారజగత్తు జన్మించును. ఆ బ్రహ్మభువనమునందలి పగటి నాల్గుఝాములు పూర్తికాగానే

యీ నామరూపాత్మక విశ్వము పూర్తిగా నాశ మొందును, మరియు ఆ బ్రహ్మభువనమున మరల పగలు రాగానే యీ విశ్వము పునర్నిర్మాణము కావాగును శరదృతువు ప్రారంభము కాగానే మేఘములన్నియూ ఆకాశమున అదృశ్యమైపోయి, మరల గ్రీష్మఋతువు అంతమున అవి మరల అదే ఆకాశమున, ఉత్పన్నమై కనుపించనాగు రీతిని, బ్రహ్మకు పగలు ప్రారంభమైనప్పుడు యీ పంచభూతాత్మక సృష్టి ఉదయించును. మరియు ఆతని పగటికాల పరిమాణము పూర్తికానంతవరకు యీ సృష్టి సమాదాయము నిలచియుండును మరల ఆతనికి రాత్రి రాగానే యీ పంచభూతాత్మక సాకార విశ్వము ఆ అవ్యక్త బ్రహ్మతత్త్వమున అణగియుండును బ్రహ్మయొక్క రాత్రి కాలము కూడా 24 వేల యుగముల పరిమితిగలదియై యున్నది. మరల ఆతని రాత్రి సమయము అంతమొందగనే, మరల మొదటివలెనే నామరూపాత్మక విశ్వ సృష్టి ప్రారంభమగును. కాని, యిదన్నియూ చెప్పుటలో గల అభిప్రాయము - యీ బ్రహ్మభువనమున గలుగు పగలు మరియూ రాత్రులందు యీ జగత్తు జన్మించి ప్రళయము పొందుచునుటయే ఈ బ్రహ్మభువనముయొక్క వైశాల్యము దానియందు యీ సమస్త విశ్వముయొక్క బీజమును తనయందు కలిగియున్నంత పెద్దది; కాని యిట్టి బ్రహ్మభువనము కూడ అంతిమున జనన-మరణ చక్రమున పడవలసియేయున్నది. ఓ అర్జునా, ఆ బ్రహ్మనగరమున పగలు రాగానే యీ విశ్వమనెడి సంత (Market( ప్రారంభమై, రాత్రి సమయము వచ్చినంతనే ఆ సంత దానంతట అదే నశించును. అనగా, యిది తన మూలబీజమునందే అణగిపోవును మరియూ దానితో కలసి ఐక్యమగును వృక్షముకూడ అంతిమున బీజమునందే లీనమగునటుల, మేఘము గగనమును చేరునటుల. అనేకత్వముతో కూడియున్న భేదభావము ఏకరూపమై అణగియుండు స్థితిని 'సామ్య' మందురు.

పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ ౨౦

అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాంగతిమ్ ।
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమంమమ ॥ ౨౧

పురుషస్స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
యస్యాన్తస్స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ 22

"ఈ సామ్యస్థితిలో ఎవరికిని న్యూనత్వము గాని, ఎవరికిని అధిక్యత గాని వుండదు; అందుచే అందు 'భూత' శబ్దమునకు ఏవిధమగు తావులేదు. పెరుగుగా మారిన పిమ్మట పాలు నామరూపములు లేకుండా పోయినటుల జగత్తుయొక్క ఆకారము సామ్యమున చేరిపోయినప్పుడు సంసారము యొక్క సంసారత్వము కూడ, అంతమొందును. అయినప్పటికి కూడ సాకారము ఏ బీజమునుండి ఉత్పన్నమైనదో, ఆ బీజమునందు సామ్యస్థితిలో కూడ అది యథాప్రకారముగ వుండును. ఆ సమయమున స్వాభావికముగ దాని పేరు 'అవ్యక్తము' అని యుండును. మరియు ఆ అవ్యక్తమునుండి ఆకారము ఏర్పడుటనే 'వ్యక్తము' అందురు. ఈ రెండు పేరులు కేవలము తెలిసికొనుటకు మాత్రమే చెప్పబడినవి. కాని, వాస్తవముగ చూచినచో యివి రెండును రెండు భిన్నవస్తువులు కావు. బంగారమును కరుగబెట్టి పోతపోసినప్పుడు (బంగారు) కణికయగును. కాని దానిని ఒక నగగా మార్చినప్పుడు దాని పూర్వరూపము నశించుచున్నది. ఈ రెండు వికారములును ఆ మూలభూతము మరియు ఏక స్వరూపముగల బంగారమునుంచియే యేర్పడుచున్నరీతిగనే 'వ్యక్తము' 'అవ్యక్తము' అనెడి యీ రెండు వికారములుకూడ ఆ ఏకపరబ్రహ్మమునుండియే యేర్పడుచున్నవి. కాని ఆ పరబ్రహ్మ వ్యక్తుడూకాదు, అవ్యక్తుడూ కాదు. అతడు ఈ రెండు వికారములకునూ అతీతుడూ అనాదిసిద్ధుడూ అయి యున్నాడు. అతడు స్వయముగనే ఈ జగత్తంతయు కాగలడు. కాని, జగత్తు నశించినప్పటికి కూడ అతడు నశించడు. వ్రాసిన అక్షరములు తుడిచివేసినప్పటికీ దాని అర్థము తుడిచివేయుటకు వీలుకానటుల - అలలు లేచుచున్నవి మరియు విలీనమగుచున్నవి, అయినప్పటికి నీరు తన స్వరూపమున అఖండముగ నుండునటుల - భూతములు నశించినప్పటికికూడ వుండెడి ఆ అవినాశి, బంగారు నగను కరిగించినప్పుడు ఆ నగయొక్క స్వరూపము నశించినప్పటికికూడ, అందలి బంగారము ఏరీతిగను నశించక ఏదో రూపమున తప్పక వుండునోరీతిని, జీవరూపమునగల సాకార వస్తువు నశించినప్పటికి కూడ యెల్లప్పుడు అవి

రూఢై యుండునాతనిని తెలిసికొనుటకై, ఆతనిని గురించి 'అవ్యక్త'మని చెప్పిన చెప్పెదముగాక, కాని ఆతనికిది యీ వర్ణనముగాని, విశేషణము గాని తగదు; ఏలనన, ఆతడు మనోబుద్ధులకు ఎన్నడును లోబడడు. ఆకారమును ధరించినప్పటికి కూడ [illegible] శాశ్వ[illegible]మున వుండియుండును. అందువలననే ఆతనిని 'అక్షరుడు' అందురు, మరియు యీ పేరువలననే ఆతడు 'నాశరహితుడు' అని బోధపడగలదు ఆతనికి ముందు మరేమార్గము లేనందువలననే ఆతనిని పరమగతియందురు; ఆతడే దేహమనెడి నగరమున నిద్రించుచున్న వానివలె నుండెడి అవ్యక్త పరబ్రహ్మమై యున్నాడు. ఏలనన, ఆతడు ఏ కర్మము చేయించుటయూ లేదు; మరియు తాను స్వయముగా చేయుటయూ లేదు. అయినప్పటికిని, ఓ అర్జునా, శరీరముచే జరుగు వ్యాపార-వ్యవహారములలో ఏ ఒక్కటియు ఆగిపోదు మరియు ఇంద్రియమార్గములు అన్నియు సమానముగ పోవుచునే యుండును. మనస్సుయొక్క నాల్గువీధులు కలసెడి కూడలివద్ద విషయములనెడి అంగడి తెరువబడును. మరియు దాని సుఖ-దుఃఖములనెడి రాజభోగము లోపల వసించెడి జీవునకు కూడ ప్రాప్తించును అయినప్పటికి రాజు సుఖముగ నిద్రించియున్నప్పటికి కూడ దేశమందలి సమస్తవ్యవహారములు ఆగిపోక యథాప్రకారము జరుగుచునే యుండునటుల మరియు ప్రజలు తమ తమ అభిరుచి ననుసరించి సమస్త కార్యములు చేయుచునే వుందురో అటులనే-బుద్ధియొక్క తెలిసికొనుట, మనస్సుయొక్క ఇచ్చుట = పుచ్చుకొనుటలు (వ్యాపారము) ఇంద్రియముల కర్మ వాయు సంచారము మొదలుగా గల సమస్త శరీర వ్యాపారములు ఆతడు చేయకపోయినప్పటికి చక్కగా నడచుచునే వుండును ఓ అర్జునా, సూర్యుడు నడిపించకపోయినప్పటికి కూడ సమస్త లోకములు తమంత తాము నడచుచుండురీతిని యీ శరీరమందు నిద్రించుచున్నవానివలె నున్నప్పటికి కూడ పురుషుడనబడెడి ఆతడు, పతివ్రత యగు ప్రకృతితో ఏకపత్నీవ్రతనిష్ఠుడయియుండుట వలన కూడా పురుషుడని చెప్పబడెడివాడు, ఎంతో వ్యాపకబుద్ధి గల వేదములు కూడ ఎవని ముంగిలిని కూడా చూడజాలవో, ఎవడు ఆకాశమునంతను కప్పివేయగలిగినంత అధిక వ్యాపకత్వము గలవాడో, ఎవనిని యోగులు 'పరాత్పరు' డందురో, ఎవడు ఏకనిష్ఠులు ఏకాంతులునగు భక్తుల యిండ్లను తానే వెదకుకొనుచు వచ్చునో, ఎవడు మనోవాక్కాయ

కర్మలయందుకూడ అన్యవిషయములపై దృష్టినుంచని ఏకనిష్ఠులగు భక్తులకు నిరంతరము ఫలమునిచ్చెడి సారవంతమగు పొలమో, ఈ త్రిభువనములన్నియు కేవలము ఆ బ్రహ్మయే యనెడి స్వాభావిక నిశ్చయము కలిగిన మనస్సుగల శ్రద్ధావంతుడగు భక్తునకు ఎవడు విశ్రాంతి స్థానమో, ఎవడు నిరభిమానులకు మహత్వమును ప్రసాదించునో, ఎవడు గుణహీనులకు జ్ఞానము నిచ్చునో, నిస్పృహులకు ఎవడు సుఖసామ్రాజ్యము నొసంగునో, సంతృప్తిగలవారికి అన్నముతో నిండియున్న పళ్లెరము నెరడిచ్చునో, ఎవడు సాంసారిక విషయములను గురించి నిశ్చింతులుగా నుండెడి నిరాశ్రితులను తల్లివలె రక్షించునో, ఎవని యింటివరకు చేరుటకు కేవలము భక్తి ఒక్కటియే సరళ మార్గమో - ఆతడే ఆ అవ్యక్త అక్షర బ్రహ్మమైయున్నాడు. ఓ అర్జునా, నే నింకనూ ఎంతని వర్ణించను! చల్లదనముకలన వేడినీరుకూడ చల్లబడిపోవునటుల, సూర్యుడు ఎదుటకు వచ్చుటతోడనే అంధకారముకూడ ప్రకాశముగా మారిపోవునటుల-ఎచ్చటకు చేరుటతోడనే జీవుడు తద్రూపుడగునో మరియు ఏ ప్రదేశమునకు చేరుటతోడనే సంసారమునుండి పూర్తిగా మోక్షము లభించునో, మరియు నిప్పులోపడిన కట్టె ఏమి చేసినప్పటికీ, ఎంత వెదకినప్పటికీ దాని స్వరూపమెచ్చటను మిగులక కేవలము అగ్నిరూపముగానే అయిపోవునటుల - మరియు అర్జునా, ఒకమారు చెరుకు రసముతో పంచదార తయారు చేసిన పిదప ఎంతటి బుద్ధిశాలియైనప్పటికి దానిని మరల చెరుకుగా తయారు చేయజాలనటుల, స్పర్శమణి తాకుటచే బంగారుగా మారిన యినుమును, తిరిగి పెక్కు ప్రయత్నములు చేసినప్పటికి యినుముగా మార్చజాలనటుల, ఒకమారు పాలనుండి నేతిని తయారుచేసిన పిదప మరల ఆ నేతిని ఎన్నడును పాలుగా చేయజాలనటుల - ఎచ్చటకు చేరి అందు కలసిపోయిన పిమ్మట మరల జనన-మరణము లనెడి ఆవృత్తి యిక వుండనే వుండదో, అట్టి ప్రదేశమే వాస్తవమునకు నా సర్వశ్రేష్ఠ స్థానము. నాహృదయమునందు గల రహస్యమును నీకు స్పష్టముగ చెప్పుచున్నాను.

యత్రకాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ ౨౩

"దేహావసాన సమయమున యోగపురుషులు చేయు నా ఆ స్వరూపమును మరియొకవిధముగ సులభముగ బోధపడురీతిని చెప్పవచ్చును. ఆకస్మికముగ దేహపాతమగుటవలనగాని, లేదా అనుచిత సమయమున దేహపాతమగుటవలనగాని మరణించిన వ్యక్తి తిరిగి దేహధారణ మొనర్పవలసియున్నది. కాని, శాస్త్రోక్తరీతిని శుద్ధసమయమున దేహవిసర్జన మొనర్చుచో, అట్టివాడు దేహ విసర్జన మొనర్చిన వెంటనే బ్రహ్మరూపుడగును. కాని, అసమయమున దేహపాతమగుచో అతడు మరల జనన-మరణ బంధనమున పడవలసివచ్చును ఇందుచే 'సాయుజ్యము' అనగా పరబ్రహ్మతోపాటు ఏకరూపుడగుట మరియు పునరావృత్తి అనగా మాటిమాటికి జన్మించుట - మరణించుట అనెడి సుడిగుండమునపడుట - అను యీ రెండు విషయములను దేహపాత సమయమున నిర్ణయింపబడును. అందువలననే యీ ప్రసంగమున నీకు దేహపాత సమయమందలి తత్వమును చెప్పదలచితిని. కాన అర్జునా, వినుము. మృత్యువనెడి తునికిపాటు వచ్చినప్పుడు పంచమహాభూతములు తమ తమ దారులనుండి బయలుదేరిపోవును. ఇందుచే, దేహవిసర్జనా సమయము వచ్చినప్పుడు బుద్ధి భ్రాంతి నొందకుండుటకు, స్మృతి అంధురాలు కాకుండవలెననిన, శరీరముతోపాటు మనస్సు కూడ మరణించకుండా నుండవలెననిన, బ్రహ్మస్వరూపానుభవ కవచము లభించవలెననిన; మరియు పంచప్రాణములనెడి యీ చేతనా సమూహము మంచిస్థితియందుండి పూర్తిగా పనిచేయవలెననిన, మరియు యిదేవిధముగ అంతరింద్రియ సముదాయము కూడ మంచిస్థితియందుండి చక్కగా పనిచేయవలెననిన, మరియు ప్రాణ ప్రయాణ సమయమువరకు యథాస్థితియందుండవలెననిన - శరీరమందలి అగ్ని అనగా ఉష్ణము అంతమువరకు యథారీతిని వుండుట ఆవశ్యకము. గాలిపీతవలనగాని నీటి దెబ్బవలనగాని దీపజ్యోతి ఆరిపోయినప్పుడు మనచూపు (దృష్టి) చక్కగా నున్నప్పటికి కూడ ఏమియూ కనిపించదు గదా! ఇదేరీతిని దేహపాత సమయమున భయంకరమగు వాతప్రకోపముచే శరీరమునకు లోపలను బయటను అంతటను కఫము వ్యాపించినప్పుడు శరీరగతమగు ఉష్ణము చల్లారిపోవును; అట్టి సమయమున ప్రాణములందు కూడ ప్రాణము లేకుండును, యిట్టి స్థితిలో బుద్ధియొక్క స్థితిని గురించి చెప్పనక్కరయేలేదు! శరీరగతమగు ఉష్ణత లేనిదే శరీరమున

జీవ-తత్త్వమే వుండజాలదు. ఇక యీ శరీరమందలి ఉష్ణము నశించినప్పుడు యీ శరీరము మాత్రి మెటుల వుండగలదు ? అట్టి స్థితిలో యీ శరీరము మురికి (లేక) తడిమట్టితో చేసిన ముద్దవలె యుండవలెను. ఈ స్థితిలో ఆయువ్యకాలము అంధకారమునపడి వ్యర్థముగ నశించును మరియు యీ శరీరము ఎప్పుడు అంతమొందునో కూడా తెలియదు. ఇక యిట్టి స్థితిలో మానవుడు తన మనస్సునందు తన పురాతన స్మృతిని జ్ఞప్తియందుంచుకొని శరీరమును విడచి ఆత్మ స్వరూపమున కలసిపోవుదమని తలంచబోవునప్పటికి కఫాదులవలన అప్పటికే మరుగుడుగనైయున్న యీ శరీరమందలి జీవన జ్యోతి అదృశ్యమగును, మరియు పూర్వాపరస్మృతి యంతయు పోవుచుండును. ఇందువలన, ధనభాండారము కనిపించకపూర్వమే చేతియందలి దీపము ఆరిపోవురీతిని అంతకు పూర్వము చేసిన యోగాభ్యాసము మృత్యువు రాకపూర్వమే నశించును. అనగా, జ్ఞానమునకు శరీరగతఉష్ణత్వమే మూలాధారమైయున్నది. మరియు ప్రాణ ప్రయాణ సమయమున యీ శరీరమందలి అగ్నిబలము పరిపూర్ణముగ నుండుట ఆవశ్యకమని తాత్పర్యము.

అగ్నిర్జ్యోతి రహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ ౨౪

“ ఆ సమయమున శరీరములోపల అగ్నిజ్యోతి ప్రకాశించుచునే వుండవలెను. మరియు బయట, శుక్లపక్షము పగలు మరియు ఉత్తరాయణము నందలి ఆరుమాసములలో ఏదే నొక మాసమూ అయి యుండవలెను. మరియు యీరీతిని అన్ని సుయోగములు లభించవలెను. ఇట్టి సుయోగమున దేహత్యాగమొనర్చు బ్రహ్మజ్ఞానులు బ్రహ్మస్వరూపమున ఐక్యమొందెదరు. ఓ అర్జునా, జ్ఞప్తియందుంచుకొనుము, ఈ యోగమునందింత అధికమగు మహాత్మ్యముగలదు. మరియు యిదియే మోక్షనగరమున ప్రవేశించుటకు సరళమార్గము. ఈ మార్గమందలి మొదటి మెట్టు శరీరగతాగ్ని, రెండవ మెట్టు ఆ అగ్నిజ్యోతి, మూడవ మెట్టు పగటి సమయము, నాల్గవ మెట్టు శుక్లపక్షము మరియు ఆటు పిమ్మట ఐదవది లేక అన్నిటికంటె పైమెట్టు ఉత్తరాయణమునందలి ఆరుమాసములలో ఏదే నొక మాసము. ఈ ఐదు మెట్లు గల మార్గమునుండగానే యోగులు ఐక్యమగునది మోక్షసదనముగ

ప్రవేశింతురు. కాన వీటిని దేహపాతమునకు ఉత్తమ సమయముగా తెలిసికొనుము. దీనినే అర్చిరాది (సూర్యకిరణ మార్గము) మార్గమందురు. ఇక దేహత్యాగమునకు అయోగ్యమగు కాలమును గురించికూడా నీకు చెప్పెదను వినుము.

ధూమో రాత్రిస్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాన్ద్రమసంజ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25

"మరణ సమయమున వాయువు మరియు కఫము ప్రకోపించును. అందుచే అంతఃకరణమున అంధకారము నిండియుండును. ఆ సమయమున సమస్త యింద్రియములు కట్టెవలె జడములగును, స్మృతి భ్రమలోపడును, మనస్సు అతి చంచలముగను క్షుబ్ధముగను అగును, మరియు ప్రాణములు వలువైపులనుండి అణచివేయబడి అడ్డగింపబడసాగును. శరీరమందుగల అగ్ని ప్రకాశము నశించును. మరియు నలువైపుల పొగయే ఆవరించియుండును, యిందుచే శరీరమున గల జీవజ్యోతి అంతరించును. చంద్రుని యెదుటకు నీటితో నిండియున్న మేఘము వచ్చినప్పుడు పూర్తిగా చీకటిగాని పూర్తిగా వెలుతురుగాని వుండక కొంత కొంత మబ్బుతో కప్పబడియున్న ప్రకాశము వుండురీతిని, ఆ సమయమున జీవునియందు ఒకవిధమగు స్తబ్ధత్వము ఏర్పడును, అప్పుడాతడు మరణించియుండడు మరియు స్పృహలోనూ వుండడు; మరియు ఆతని జీవితము మరణాసన్న స్థితికి వచ్చి అడ్డగింపబడి యుండును. ఈ విధముగ, జీవునిపైన నలువైపులనుండి మనస్సు, బుద్ధి మరియు ఇంద్రియములు ఒత్తిడి పడినప్పుడు, జీవితమంతయు కష్టించి ఆర్జించిన ఫలము పూర్తిగా వ్యర్థమైపోవును. మరియు, చేతికివచ్చిన వస్తువునే పోగొట్టుకొనినప్పుడు, మరల ఆ వస్తువును అప్పుడే సంపాదించగలమని చెప్పుటకు అవకాశమే వుండదుగదా! ప్రాణ ప్రయాణ సమయమున యిలాటి దుఃస్థితియే ప్రాప్తించును. ఇదంతయూ శరీరములోపల సంభవించు అవస్థ. ఇక శరీరమునకు బయట కూడా యికేరీతిని ప్రతికూలావస్థ సంభవించుచో - అనగా కృష్ణపక్షము, రాత్రి సమయము, అందుపైన దక్షిణాయనము నందలి ఏదో ఒక మాసము అనగా ప్రాణ ప్రయాణ సమయమున జనన మరణ చక్రమును అభులువందుంచు యీ విధమగు లక్షణములు ఒకదానికొకటి తోడగుచో - ఆతని చెవులకు బ్రహ్మస్వరూప ప్రాప్తియనెడి మాట యెటుల

వివరించగలదు ? ఇట్టి దురవస్థలో దేహపాతమును పొందిన మానవుడు చంద్రలోకము వరకు మాత్రమే పోగలడు: అతడు కొంత కాలమైన పిమ్మట మరల యీ లోకపు జంజాటమునందే వచ్చి చిక్కుకొనును. కనుక ప్రాణ ప్రయాణమునకు 'అకాలము' అని చెప్పినదిదియే. జనన - మరణము లనెడి గ్రామమునకు చేర్చునట్టి కష్ట పథమగు 'ధూమ్రమార్గ' మిదియే. ఇదిగాక గల రెండవదగు 'అర్చిరాది మార్గము' మిక్కిలి ప్రకాశముగలదీ, స్వతంత్రమైనదీ, సమస్తవిధములగు శాంతిసుఖములచే కూడియున్నదీ, చివ్వరగా నివృత్తి (మోక్షము) వరకు చేర్చునట్టిదియూనై యున్నది.

శుక్ల కృష్ణే గతీహ్యేతే జగతః శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః ॥ ౨౬

“ఈ విధముగ యోగుల శుక్ల కృష్ణమార్గములనీ, లేదా అర్చిరాది మరియు ధూమ్రమార్గము లనెడి రెండు మార్గములును అనాదికాలమునుంచి వచ్చుచున్నవి. ఇందు మొదటిమార్గము సరళమైనదీ చిన్నదైనదిన్నీ అయి యున్నది; రెండవది వంకర టింకరయైనది అయి యున్నది: అందుచే వీటిని గురించి నీకు విపులీకరించి చెప్పితిని. నీ విందలి సుమార్గము మరియు కుమార్గము లను చూచుకొనుము, మంచిచెడ్డల నిర్ణయము చేసికొనుము, హితాహితవులను తెలసికొనుము - ఆ పిమ్మట నీకు కల్యాణకరమగు సాధనమును అనుసరించుము. ఎవనికైన శ్రేష్ఠమైన బలిష్ఠమైన నావ కనిపించినప్పుడు అతడెన్నడైన లోతైన నీట దుముకునా ? చక్కని శ్రేష్ఠమైన సులభమైన సుగమమైన మార్గము తెలసినప్పుడు ఎవడైన అరణ్యమందలి వంకర టింకరయగు సుగమముకాని మార్గమున కాలిడునా ? అమృతము మరియు విషములందలి భేదము తెలసినవాడెన్నడైన అమృతమును పారవేయునా ? ఇదేరీతిని సులభమగు సరళమార్గమును చూచినవాడు ఎన్నడును కఠినమగు మార్గమునపోడు. ఇదే విధముగ, సత్యమేది, అసత్యమేది, మంచి ఏది, చెడ్డ ఏది - అని చక్కగా పరీక్షించి తెలసికొనవలెను; ఈరీతిని చక్కగా పరీక్షించి తెలసికొనినవానికి ఏదైన వికటప్రసంగము వచ్చి పడినప్పటికికూడ ఏ విధమగు హానిని కలిగించదు. అటుల కానిచో, దేహపాత సమయమున గొప్ప అనర్థము వాటిల్లును, మరియు యీ రెండు మార్గములను గురించి భ్రాంతి

కలుగుటచే చాల చెడుగు సంభవించును. మరియు జీవితమంతయు చేసిన యోగాభ్యాసము వ్యర్థముగ పోవును. అంత్య సమయమున జీవుడు అర్చిరాది మార్గమును మరచిపోయి ధూమ్రమార్గమును పట్టుచో అతడు మరల సంసార బంధమున పడవలసివచ్చును. మరియు జనన-మరణచక్రమునపడి భ్రమతో తిరుగవలసివచ్చును. ఈ పీ కష్టములన్నింటిని తెలిసికొని సులభముగ వీటిని దాటుటకై యింత స్పష్టముగ విపులీకరించి చెప్పితిని. ఈ రెండుమార్గము లందును, ఒక మార్గమువలన జీవుడు బ్రహ్మస్వరూప మహత్త్వమును పొందును. మరియొక దానివలన జనన-మరణ బంధమున చిక్కుకొనును. ఈ మార్గము లలో ఎవనికి ఏమార్గము దైవయోగమువలన ప్రాప్తించునో, అదియే ఆతని మార్గము.

నైతే సృతీ పార్థజానన్ యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥ ౨౭
వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ।
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా।
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥ ౨౮

"ఇచ్చట, దేహపాత సమయమున మనము కోరినటుల అన్నియు సంభవించకపోవచ్చునుగదా యనెడి శంక పొడమ వచ్చును! మనకు ప్రాప్తించ నున్నది ఆకస్మికముగ దైవయోగముచే ప్రాప్తించును. ఇట్టి స్థితిలో మన మిందలి శ్రేష్ఠమగు మార్గమునపోయి బ్రహ్మస్వరూపులమగుట ఎటుల సంభవ మందురు! అందుచే నేను చెప్పునదేమన, శరీరము వుండుగాక లేకపోవు గాక - మానవుడెల్లప్పుడును 'నేను బ్రహ్మస్వరూపుడనే' అని తెలిసికొని యుండవలెను. త్రాటినిచూచి పాముగా భ్రమించుటకు గల మూలకారణము త్రాడే అయియున్నది. నీటికి మధ్యమందు తరంగత్వము వున్నదా లేదా యనెడి ఆభాస యెన్నడైన వుండునా? లేదా, దానియందు తరంగములుండు గాక, లేకుండుగాక అది ఎన్నటికిని నీరే అయియున్నది. అది తరంగము లతోపాటు పుట్టుటయూలేదు, మరియు తరంగములు నాశమగుటతోపాటు

నాశనమూ పొందుటలేదు. ఇదే విధమున దేహధారణా సమయమున కూడ బ్రహ్మస్వరూపులుగా నుండువారిని 'విదేహు'లని చెప్పబడియున్నది. ఇట్టి విదేహులందు శరీరమనెడి పేరుగల గ్రామమే మిగిలియుండనప్పుడు, అట్టి వారు మరణించుటనునది యెన్నడైన సంభవమగునా? అనగా యిట్టివారు యెన్నటికిని మరణించుటయే లేదు. ఇట్టివారికి మార్గాన్వేషణ మొనర్చవలసిన ఆవశ్యకత ఏమి కలదు? మరియు అట్టివారు యెచ్చటనుంచి యెచ్చటకు మరియు యెప్పుడు పోగలరు? ఏలనన, అట్టివారికి సమస్త దేశ-కాలములు ఆత్మరూపముగనే అయియుండును. కుండ పగిలినప్పుడు ఆ కుండయందలి ఆకాశము సరళమార్గమున పోయినప్పటికి కూడ అది ఆకాశతత్వమునందే కలియుచున్నది. ఈ ఘటమునందలి ఆకాశము ఏ మార్గముననైన పోవుగాక, అది ఆకాశతత్వమున కలియకుండుట యెన్నడైన సంభవించునా? వాస్తవ విషయ మేమన, కేవలము ఆ కుండ మాత్రము నశించుచున్నది, అందుచే కేవలము దాని ఆకారము మాత్రము నాశమగును. మరియు దాని యందుగల మూలాకాశము ఘటాకారము ఏర్పడక పూర్వమూ వున్నది మరియు ఘటము నశించిన పిమ్మట కూడ యథాప్రకారముగానే వుండును. ఈ విధమగు బ్రహ్మజ్ఞాన సహాయమువలన బ్రహ్మస్వరూపులైన యోగులకు మార్గమేది, అమార్గమేది యనెడి తగవే వుండదు. కావున ఓ అర్జునా, నీవు ఎల్లప్పుడు యోగయుక్తుడవై యుండుము. ఇటుల వున్నచో నీకు సహజముగనే బ్రహ్మస్వరూప ప్రాప్తి కలుగును. ఆపైన యీ దేహ బంధనము వున్నంతవరకు వుండనిమ్ము, లేదా దాని యిష్టము వచ్చినప్పుడు పోనిమ్ము, కాని నీ నిర్బంధ రహితమైన లేక స్వతంత్ర బ్రహ్మరూపమున తిలమాత్రము కూడ అడ్డంకు రాజాలదు. ఆ బ్రహ్మ స్వరూపము విశ్వమును సృజించునప్పుడు జన్మబంధమున పడనూపడదు. మరియు విశ్వప్రళయము వచ్చినప్పుడు మరణబంధనమందునూ పడదు; కల్పాది మరియూ కల్పాంతములందలి మధ్యసమయమున అది స్వర్గము మరియూ యిది సంసారమనెడి మోహమునందును పడదు. ఈ విధమగు బోధను పొంది యోగులైనవారు మాత్రమే యీ బోధను సక్రమముగను మరియు పరిపూర్ణముగను వినియోగించుకొనగలరు; ఏలనన అట్టివాడు విషయ భోగములను కాలదన్ని ఆత్మస్వరూపమును పొందును. ఇంద్రాది దేవతల యొక్క స్వర్గమునందు నలువైపుల వ్యాపించి

యున్న సామ్రాజ్యాధికారమును కూడ అతడు దూరముగ పారవేయదగినదీ మరియు చిల్లిగవ్వ విలువ మాత్రము చేయునదిగను భావించి తృణీకరించును.

"ఎవడైన వేదములను సంపూర్ణముగ అధ్యయనమొనర్చి వేదోనారాయణుడగుగాక, లేదా శాస్త్రములందు చెప్పబడిన సమస్త విధములను యజ్ఞాదులనుచేసి అపార ఫలప్రాప్తినొందుగాక లేక పునశ్చరణ చేసిగాని దానమిచ్చిగాని అపార పుణ్యార్జనమొనర్చుగాక - ఈ సమస్త పుణ్య సముదాయము, లేదా కర్మఫల పూర్ణత్వముకూడ యెన్నటికిని నిర్మల పరబ్రహ్మతో సాటి రానేరదు. వేదములు యజ్ఞములు మొదలగునవి యిచ్చెడి అపార స్వర్గ సౌఖ్యములను కూడ యోగిశ్రేష్ఠుడు బ్రహ్మజ్ఞానముచేకలుగు సౌఖ్యము ముందు అత్యల్పమైనవిగా తలంచును. యోగులు సమస్త స్వర్గ సౌఖ్యములను మట్టితో సమానముగ భావించి పాదములు తుడుచుకొనెడి పీటలగా పరచి, వాటిపై పాదమునుంచి పరబ్రహ్మ పీఠము నధిరోహింతురు." ఎవడు స్థావర - జంగమాత్మక సృష్టియందు గల ఒకచోటున చేర్చిన సమస్త వైభవమో, ఎవనిని బ్రహ్మ మరియు శంకరుడు స్వయముగా ఆరాధింతురో, ఎవడు కేవలము యోగిజనులకు మాత్రమే భోగవస్తువో, ఎవడు సమస్త కళలకు కళనిచ్చువాడో, ఎవడు పరమానంద మూర్తియో, విశ్వమందలి జీవులకన్నిటికి జీవమో, ఎవడు సర్వజ్ఞత్వమున మూలఉద్గమ స్థానమో, యెవడు యాదవకుల దివ్య కులదీపకుడో - ఆ శ్రీకృష్ణుడు పాండుపుత్రుడగు అర్జునునకు యీ రీతిగా సమస్త విషయములు చెప్పెను. ఈ రీతిగా కురుక్షేత్రమందు జరిగిన ఘటనలను సంజయుడు ధృతరాష్ట్ర రాజునకు చెప్పెను. జ్ఞానదేవుడనగు నేను యీ వివరమును శ్రోతలగు మీకు యిక వినవలసినదిగా విన్నవించుచున్నాను.

# తెలుగు జ్ఞానేశ్వరి

## తొమ్మిదవ అధ్యాయము

ఓ శ్రోతలారా, మీరు ఏకాగ్రమనస్సుతో నా ప్రవచనము వినుడు. దీనివలన మీకు సమస్తసౌఖ్యములు లభించునని నేను స్పష్టముగ ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. ఈ మాటను నేను అభిమాన పూర్వకముగ చెప్పుటలేదు. ఏలనన శ్రోతలగు మీరెల్లరు సర్వజ్ఞులు. అయినప్పటికి మిమ్ము నేను ఆత్మీయతతో నా మాటలయెడ ధ్యానముంచవలసినదిగా ప్రార్థించుచున్నాను. పుట్టింటివారు భాగ్యవంతులగుచో స్త్రీకిగల కోరికలన్నియు నెరవేరు రీతిని, నాకు మీ ఆశ్రయము లభించినందువలన నా మనోరథములన్నియు నెరవేరగలవు. మీ కృపాదృష్టియనెడి వర్షమువలన నా సంతోషమనెడి ఉద్యానవనము చక్కగా పుష్పించి ఫలించుచున్నది; మరియు ఆ ఉద్యానవనపు చల్లని నీడనుచూచి సంసారతాపముచే తపించియున్న నా జీవము ఆ నీడలో విశ్రమించి తనతాపమును శాంతిపరచుకొనుచున్నది. మీరు సుఖరూపమునగల గంభీరమగు అమృతపు లోతులు, అందుచే నేను కోరినంతగా సుఖమనెడి అమృతమును పొందగలను. ఇట్టి చక్కని అవకాశము వచ్చినప్పుడుకూడ నేను ముద్దుగామాట్లాడుటకు భయపడుచో యిక నాకు సుఖశాంతులెటుల ప్రాప్తించగలవు? పిల్లవాని వచ్చీరాని మాటలూ, వచ్చీరాని నడకనూ సంతోషముతో చూచి అతని తల్లి ఆనందపడురీతిని నేనుకూడ మహాత్ములగు మీ ప్రేమను సంపాదించవలెననెడి తీవ్రమగు వాంఛచే యీ విధముగ మాట్లాడుచున్నాను. అటులకానిచో నా వక్తృత్వ యోగ్యతయూ సామాన్యము, మీరా సర్వజ్ఞులు, ఇట్టస్థితిలో నేను మీ ఎదుటకూర్చొని ప్రవచనము చేయుట సరస్వతీదేవి పుత్రునకు పలకపైన పాఠము వ్రాసి నేర్పుటవలెనుండును. మిణుగురుపురుగు ఎంతపెద్దదైన కావచ్చుగాక, అయినప్పటికి సూర్యుని మహాతేజస్సుముందు అది అల్పమైనదే యగునుగదా! అమృతపు పళ్లెరములో వడ్డించదగినంత శ్రేష్ఠమైనదగు రసపరిపాక మెచ్చట లభించగలదు? అందరకును చల్లదనమిచ్చెడి చంద్రునకు గాలివచ్చుటకై విసనకర్రతో విసరుటెచ్చటైన సంభవించునా? నాదతత్త్వమునకు సంగీతము

వినిపించుట సంభవమా? అలంకారమునకు కూడ అలంకారము ధరింపనగునా? సుగంధము సువాసనకై దేనిని వాసనచూడగలదు? సముద్రము ఏ ప్రాంతమున స్నానము చేయుటకేగును? ఆకాశమంతయూ యిముడునంత వైశాల్యముగల స్థలమేదైన గలదా? అదే విధముగ మీ కందరకు సంతృప్తి కలిగి మీరందరు ఆనందముతో 'వక్తృత్వమనిన యిటుల వుండవలెను!' అని పొగడు నంతటి వక్తృత్వశక్తిని నేనెచ్చటినుంచి తేగలను? అయినప్పటికి సమస్తజగత్తునకు వెలుగునిచ్చు సూర్యునకు చేతితో తయారుచేసిన వత్తితో హారతినిచ్చుటలేదా? అపారమగు నీటితో నిండియున్న సముద్రమునకు దోసెడు నీటితో అర్ఘ్య మిచ్చుటలేదా? శ్రోతలగు మీరెల్లరు శంకర మూర్తులు, మిమ్ము ఆరాధించు భక్తుడనగు నేను దుర్బలుడను, నా మాటలు వావిలి ఆకులు (శ్వేతసింధువారము) వంటివైనప్పటికి మీరు ఆదరపూర్వకముగ స్వీకరించి తీరెదరు. బిడ్డడు తన తండ్రి పళ్ళెరమున చేయినిడును, తన తండ్రి నోట అన్నపుముద్ద పెట్టబోవును మరియు తండ్రికూడ బిడ్డడు తన నోట పెట్టబోవు ముద్దను అందుకొనుటకై మిక్కుటమగు ఆనందముతో నోటిని ముందుకు చాపును. ఇదేరీతిని నేను బాల్యబుద్ధితోను, ముద్దుగాను నిరర్థకము మరియూ మితిమీరిన ఆత్మీయతనూ ప్రకటించినప్పటికి ప్రేమతోకూడిన స్వాభావిక ధర్మము ననుసరించి మీరు నాయెడ సంతుష్టులుగానే వుందురు. మహనీయులగు మీ మనస్సులందు మీ ఆశ్రితులపట్ల ఆత్మీయతచే అత్యధికమగు ప్రేమయుండును. ఇందుచే నేను ముద్దుగా చూపెడి ఆత్మీయత మీకు భారము కానేరదు. తల్లియొక్క స్తనములకు ఆకలితోనున్న బిడ్డని నోటి నొక్కుడు తగులుటతోడనే ఆమె స్తనములందు యింకను ఎక్కుడు పాలు వచ్చును. మరియు ఆమె బిడ్డనికి పాలుయివ్వవలెనని యింకనూ ఎక్కువ ఉత్సుకతగలదగును. మనకు ప్రియమైనవాడు కోపముచే ఒకమాట త్రోసి వేసినప్పటికి అతనియెడ ప్రేమ యింకనూ అధికమగును.

ఇందువలననే, నాబోటి బాలుని వ్యర్థ ప్రలాపములవలన మీయందు నిద్రితమైయున్న కృపాళుత్వము మేల్కొంచినదని తెలిసికొనియే నేనీ విషయములన్నియు చెప్పితిని. వెన్నెలను పక్వమొనర్చుటకై రొట్టెలలో కప్పి పెట్టి మగ్గవేయవలెనా? లేదా గాలిని యిటు వీచవలెను, అటు వీచవలెను. అని యెవడైన చెప్పునా? లేదా ఆకాశమునకు యెవడైన దుస్తులు తొడుగ

గలదా? నీటిని పలుచనగా చేయనక్కరలేనటుల, వెన్నను మథించుటకై
దానియందెవరును శ్రమమును పెట్టనటుల, గీతార్థమును చూచి నా దుర్బల
వ్యాఖ్యానము సిగ్గిలి తనంత తానే వెనుకకు మరలుచున్నది; ఇంతేగాదు;
శబ్దబ్రహ్మమగు వేదము కూడ శబ్దగతి సమాప్తమగుటచే ఏ గీతార్థమనెడి
మంచముపై స్తబ్ధురాలై నిద్రించునో, అట్టిగీతార్థమును దేశభాషలో తెచ్చు
టకు తగు యోగ్యత నా యందెట నుండి రాగలదు? నావంటి దుర్బలుడు
కూడ యిట్టి అనుచిత సాహసము చేయుటలో గల హేతువు, కేవలము
మీవంటివారికి ప్రేమపాత్రుడను కావలెననెడి తలంపే. కాన చంద్రుని
మించిన శీతలత్వము, అమృతమును మించిన జీవింపజేయు శక్తిగల మీ అవ
ధానమును మీరు నాకు దానమొసర్చి, నా మనోరథమును పోషింతురు
గాక. ఏలనన, మీ కృపా కటాక్షము వర్షించుచే తదవుగ నా మనో
రథములన్నియు సిద్ధించును. మీ కృపా కటాక్షము నాకు లభించక, మీరు
ఉదాసీనులుగా నున్నచో మొలకరించిన నా జ్ఞానాంకురము కూడ యెండి
పోవును. వక్త యొక్క వక్తృత్వానకు స్వాభావిక భోజనము
శ్రోతలయొక్క సావధానతయేనని మీరు జ్ఞప్తి యందుంచు కొందురు
గాక! వక్తకు అట్టి భోజనము లభించుచున్నచో సిద్ధాంత ప్రతిపాదక శబ్ద
ములను అతడు అత్యధికముగ చెప్పును. ఇట్టి శబ్దములు వెలువడుటతోడనే
అర్థప్రతిపత్తి యగును. ఏలనన, శబ్దములు మరియు వాక్యములకై అర్థములు
చూచుచుండును; అర్థప్రతిపత్తిచే అభిప్రేతార్థ పరంపర యేర్పడును.
మరియు బుద్ధియైన పుష్పములచే కూడిన వసంతఋతువు వచ్చును. ఈ రీతిని
వక్త మరియు శ్రోతల యొక్క ఐకమత్యమనెడి అనుకూల వాయువు వీచ
సాగినప్పుడు హృదయమనెడి ఆకాశమున వక్తృత్వమనెడి రసమేఘము
సంచరించును శ్రోతలు ఉదాసీనతచే చక్కగా ధ్యానముంచకున్నచో
వక్తృత్వ రసముచే నిర్మింపబడిన మేఘము కూడా చెదరిపోవును. చంద్ర
కాంతమణి ద్రవించును, కాని అది ద్రవించునటుల చేయు శక్తి చంద్రుని
యందే గలదు. ఇదే రీతిని, యోగ్యులగు శ్రోతలు లభించనంతవరకు
ఏ వక్తయూ, వక్తయే కాజాలడు. బియ్యము యెన్నడైన తనను తిను
వారితో 'నేను తియ్యగా వుంటినని యెంచి తినుడని' ప్రార్థించవలసివచ్చునా?
లేదా, కొయ్య బొమ్మలను ఆడించువానితో ఆ కొయ్యబొమ్మలు 'నన్ను

ఆడించుము' అని ప్రార్థించవలెనా? ఆ కొయ్య బొమ్మలను అతడు వాటి హితవు కొరకై గాని, లేదా ప్రజలలో తనకుగల జ్ఞానపటిమను ప్రసిద్ధమొనర్చుటకుగాని ఆడించునా? ఇక దీనిని గురించి విశేషించి చెప్ప నేందుకు! కర్త యీ రీతిని చెప్పగనే శ్రీ సద్గురువు లిటుల చెప్పిరి— 'నేను నీ అభిప్రాయమును తెలిసికొంటిని. ఇక శ్రీకృష్ణుడేమి చెప్పెనో చెప్పుము' ఇది విని శ్రీ నివృత్తినాథుని శిష్యుడు ఆనంద పూర్వకముగ ఉల్లసితముద్ర గలవాడై 'తమ ఆజ్ఞ ప్రకారము శ్రీకృష్ణుడేమి చెప్పెనో చెప్పెదను వినుడు' అనెను.

శ్రీ భగవానువాచ—

ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యన సూయవే ।
జ్ఞానం విజ్ఞాన సహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్ ॥ ౧

"ఓ అర్జునా, నీకిప్పుడు నా అంతఃకరణమున అన్నింటికంటె లోపల గల సమస్త జ్ఞానమునకు ఆదికారణమగు గుప్త రహస్యమును చెప్పెదను వినుము నా అంతఃకరణమందలి గుప్త ద్వారమును తెరచి అందలి రహస్యమును బయటపెట్టవలసినంత ఆవశ్యకత యిప్పుడేమి వచ్చినదని నీవు తలంచవచ్చును; ఓ అర్జునా అందలి కారణము చెప్పుచున్నాను వినుము. నీవు భక్తి-భావమునకు ప్రత్యక్ష అవతారమవై యున్నావు. నీవు నేను చెప్పుదానిని నెన్నడును ఉపేక్షచేయవు. ఇందుచే నా మనస్సునందలి రహస్యము బయటపడినప్పటికిన్నీ, నా అంతఃకరణమున గల విషయముల నన్నిటిని నీ అంతఃకరణమున ఒకసరి ప్రవేశపెట్టుదమని సంకల్పించితిని. స్తనమున పాలు నిండియుండును, కాని అవి ఆ స్తనమునకు తియ్యగా నుండవు. కాని, ఏకనిష్ఠగల ప్రాణి ఎవడైన లభించినప్పుడు, అతని కోరికను నెరవేర్చుదమని సహజముగనే వాంఛ కలుగును. ధాన్యపు గాదె నుండి విత్తనములు తీసి, వాటిని చక్కగా దున్ని శుభ్రము చేసిన భూమిలో చల్లుటను, యెవడైన వ్యర్థముగ విత్తనములను పాడుచేయుచున్నాడని అనగలడా? కావుననే మంచి మనస్సు మరియు స్వచ్ఛమైన బుద్ధియు గలిగి నిందనీయము కాని ఏక నిష్ఠగలవాడు లభించినప్పుడు, అట్టివారికి నేను సంతోషముతో నా మనస్సున గల విషయములను

చెప్పవలసియున్నది. ఈ సమయమున యిట్టి లక్షణములుగల వ్యక్తి నీవు తప్ప మరెవరూ కనిపించుటలేదు; అందుచే, నీయెడ ఏ రహస్యమునూ దాచుట తగదు. మాటిమాటికి 'గుప్తము' అని నీకు చెప్పుచుండుటచే నీకు విసుగు జనించియుండవచ్చును, అందుచే నీకిప్పుడు విజ్ఞానయుతమగు జ్ఞాన విషయములను స్పష్టీకరించి చెప్పెదను. పెక్కు నిజమైన నాణెములూ దొంగనాణెములూ కలిసిపోయి యున్నప్పుడు వాటిని జాగ్రత్తగా పరిశోధించి వేరువేరు రాసులుగా ఏర్పరచవలసి వచ్చురీతిని, నేను జ్ఞానము మరియు విజ్ఞానములను పరీక్షించి వాటిని నీయెదుట విడివిడిగా పెట్టెదను. లేదా రాజహంస తన చంచువు యనెడి పటుకారుతో నీటిని పాలనూ విడదీయు రీతిని నేను కూడా జ్ఞానము మరియు విజ్ఞానములను వేరువేరుచేసి నీకు చూపదలచితిని. గాలి వీతలోపడి పొల్లు నిలువజాలక, కేవలము ధాన్యపు గింజల రాశిమాత్రమే మిగిలియుండురీతిని, వివేకముచే జ్ఞాన విజ్ఞానములను పరీక్షించి విడదీసినప్పుడు జనన-మరణ సంసారము యీ నామరూపాత్మక సంసారముతో ఏకమగును. మరియు ఆ పరమ జ్ఞానము మనను అక్షయ మోక్షపద సింహాసనముపైకి తీసికొనిపోయి కూర్చోబెట్టును.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ 2

"ఏ జ్ఞానము సమస్త విద్యలందును మహాశ్రేష్ఠమగు ఆచార్య పదవికి చేరియున్నదో, ఏది సమస్త రహస్య జ్ఞానమునకు యజమానిత్వమును వహించునో, ఏది పవిత్రములన్నింటను ధురంధరమైనదో, ఏది జ్ఞాన-ధర్మమునకు పుట్టినిల్లో, ఏది సర్వోత్తమమైనదో, ఏదిలభించుటచే జనన-మరణములకు తావులేకుండా పోవునో, ఏ జ్ఞానము గురు-ముఖమునుండి కించిత్తు ఉదయించినటుల కనిపించినప్పటికి వాస్తవమునకు ప్రతి మనుష్యుని హృదయమునందును స్వయంభువురై యుండి కోరినవారు తమంత తామే పొందగలరై యున్నదో, ఆత్మసుఖమనెడి మెట్టుపైకెక్కగనే ఏ జ్ఞానము లభించునో మరియూ ఆవిష్మృట, ఆసమయమున భోక్త, భోగ్యవస్తువు మరియూ భోగము అనెడి త్రిపుటి అంతమొందుటచే భోగించువాని భోక్తృత్వము

కూడ అందే లీనమైపోయి, అటుల లయము పొందిన స్థితికి యీవలిఒడ్డున దేనివలన హృదయము పరమ సుఖముతో నిండిపోవునో, అట్టి జ్ఞానము సులభమైనదీ సహజమైనదీ అయినప్పటికికూడ అది ప్రత్యక్ష పరబ్రహ్మమే అయియున్నది. ఈ జ్ఞానమునగల ఒక విశేషలక్షణమేమన, ఇది ఒకసారు లభించినచో ఎన్నటికిని కోల్పోబడజాలదు మరియు దాని మాధుర్య మెన్నటికిని తగ్గిపోదు. ఓ అర్జునా నీకు తర్కించి చూచుటచే ఒక శంకపొడము వచ్చును, ఇదియింత అప్రతిమమూ అమూల్యమూనగు వస్తువగుచో దీనిని ఎవరునూ ఎందుకు సంపాదించలేదు? ధనమునకై అగ్నియందు దుముకి మనిషిని చూపుటకు సాహసించెడివీరు పరిశ్రమలేకుండగనే లభించునదగు యీ ఆత్మసుఖ మాధుర్యమును ఏల వదలుకొనిరి? పవిత్రమూ, రమ్యమూ, సుఖలభ్యమూ, సమస్తసుఖముల రాశియూ ఆత్మతత్త్వమును చేకూర్చునదీయగు యీ ఆత్మసుఖమును ప్రజలేల విడచిపెట్టిరి? మొదలుగాగల నీకు కలిగెడి సంశయములు స్వాభావికము సహజమును అయియున్నవి. కాని నీమనస్సున యీ సంశయమున కెన్నడును చోటివ్వకుము.

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప।
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యు సంసారవర్త్మని॥ 3

"చూడుము, పాలు చాల పవిత్రమైనదీ రుచికరమైనదిగను వుండును, మరియు అవి గోస్తనమునందు చాలపలుచని చర్మపుచాటున సంగ్రహింపబడి యుండును. అయినప్పటికి పొదుగుపై ప్రాలియున్న బుడ్డబుడుజు ఆ పాలను విడచి రక్తమును త్రాగుటలేదా? భ్రమరమూ మరియు మండూకమూ యివి రెండునూ కమలమువద్దనే నివసించుచున్నవి; కాని కమలమునందుగల పరాగమును భ్రమరములు మాత్రమే అనుభవించును; మండూకము బురదమాత్రమే వచ్చును. ఇదేరీతిని ఒక్కొక్క దురదృష్టుడగు మానవుని యింట మొహరీలతో నిండియున్న వేలకొలది కుండలు పడియుండును; అయినప్పటికిని అతడు ఆ యింటియందే నివసించుచూ ఆకలిచే చచ్చును, లేదా అతి దరిద్రస్థితిలోనుండి జీవితము గడుపుకొనుచుండును. అదేరీతిని అంతరంగమున సమస్తసుఖ భాండారమైన ఆత్మారాముడనగు నేను ప్రత్యక్ష

ముగ నుంటున్నప్పటికికూడ మాయామోహితులగు పురుషులు విషయ భోగములపైపై ప్రవృత్తులగుచున్నారు. అపారమగు మృగతృష్ణను చూచి నోటగల అమృతబిందువును వుమిసినటుల, స్పర్శమణిని విసుగగొట్టి పారవేసి నటుల అహమ్మన్యతయనెడి చిక్కులోపడి యీ దురదృష్టజీవులు నాదరకు రాజాలకున్నారు; ఇందుచే జనన - మరణములనెడి బాణముల మధ్యపడి మోసపోవుచున్నారు. సూర్యునివలె ఒక్కొక్కప్పుడు కనిపించుట మరొ కప్పుడు మేఘములచాటున మరుగుపడి పోవుటా లేదా పగలు కనిపించుటా రాత్రి కనిపించకుండుటా - అను భేదములేక నేను ఎల్లప్పుడు కనులఎదుట ప్రకాశించుచుండెడివాడనూ మరియూ నిర్మలుడను అయి యున్నాను.

మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥ ४

" నా వైశాల్యమునుగురించి అడుగుచో యీ జగత్తంతయూ కలసి నను నేను కాను! పాలు తన స్వభావము ననుసరించి తోడుకొని పెరుగు అగునటుల, లేదా బీజమే వృక్షరూపమున బయల్వెడలునటుల, లేదా బంగారునుండి నగలు ఏర్పడునటుల యీ జగత్తంతయు నా వ్యాపకత్వమే అయియున్నది. నా నిరాకారతత్త్వమే ఏకత్రితమై యీ నామరూపాత్మక జగదాకారమును ధరించుచున్నది. మరియు అమూర్తుడనగు నేనే ఆ సమయ మున త్రిలోకములను విస్తరింపజేయుదును. నీటిబుడగ వ్యక్తరూపమున కని పించిన రీతిని మహత్తత్వము మొదలుగాగల నామ - రూపాత్మకములగు సమస్తభూతములును నాయందే కనిపించును. అయినప్పటికి ఆనీటిబుడగ లోపల నీరు కనిపించనిరీతిని, లేదా స్వప్నావస్థ యందు కనిపించిన అనేకము లగు ఆకారములు జాగ్రదవస్థలో కనిపించనిరీతిగా యీ భూతములన్నియు నాయందే భాసిల్లుచున్నవి. కాని నేను యీ భూతములందు వసించుటలేదు. ఈ తత్వ-విచారణను నీకింతకు ముందే ఒకపరి చెప్పియున్నాను గాన దీనిని గురించి యిచ్చట విపులీకరించవక్కరలేదు. కాని, నీ దృష్టి నా స్వరూప మున ప్రవృష్టరాలై విస్తృతము కావలసియున్నది.

నచ మత్‌స్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరమ్ ।
భూతభృన్నచ భూతస్థో మమాఽత్మా భూతభావనః ॥ 5

"కార్యకారణ విచారణను విడచిపెట్టి, మహామాయను కూడ అతీత మైనదీ, దానికి భిన్నమైనదియూ నగు నా స్వరూపమును గురించి నీవు యోచించినచో యీ భూతములన్నియు నాయందున్నవనెడి కల్పన మిథ్య యని తెలగలదు; ఏలనన సమస్తమూ నేనే అయి యున్నాను. నాకంటె భిన్నమైనది మరొక్కటియూ లేదు. ప్రథమ సంకల్పము వలన పరబ్రహ్మమందు జ్ఞానము మరియు అజ్ఞానమనెడి కొంత ప్రకాశము కొంత అంధకారమువంటి సంధి సమయము సంభవించినప్పుడు బుద్ధియొక్క జ్ఞాన చక్షువున కొంచెము అంధకారము వంటిది వ్యాపించెను, ఇందుచే ఆకారహీనుడు మరియు వికార రహితుడునగు పరబ్రహ్మమునందు అవిద్యారూపమున గల సంజవలన యీ భూతములు పరబ్రహ్మకు భిన్నమైనవిగా భాసించసాగెను. కాని, సంకల్ప జన్యమగు అవిద్యా సంజ అంతమొందినప్పుడు - సంశయము విడిపోగానే సంజ చీకటిలో పుష్పమాలను పాముగా భ్రమించుట నశించిపోయినటుల— యీ భూతకోటిని గురించి గల భ్రమ కూడా తొలగిపోవును; మరియు అప్పుడు కేవలము పరబ్రహ్మయే తన అఖండ, అవికృతి శుద్ధ స్వరూపమున మిగిలియుండును. వాస్తవముగ చూచినచో, భూమిలో నుంచి మట్టికుండలు, కడవలూ మొదలగునవి ఉద్భవించుచున్నవా? లేదు. ఈ కుండలు, కడవలూ మొదలగువాని సృష్టి కుమ్మరివాని కల్పన యనెడి గర్భమునుండి జరుగుచున్నది. లేదా, సముద్రపు నీటియందు తరంగముల గని ప్రత్యేకించి ఏదైనా గలదా? అలలు వాస్తవమునకు గాలివీచుటచేతనే ఏర్పడు చున్నవి ఈ రీతిగనే, ప్రత్తికాయ లోపల బట్టలుగల పెట్టె యేదైనా వుండునా? ధరించెడివాడు చూచినంత మాత్రము చేతనే ప్రత్తి వస్త్రము లుగా తయారగునా? బంగారమును ఏదైన నగగ చేసినప్పటికి దానియందలి స్వర్ణత్వము నశించదు. దానియందు బాహ్యమునకు మాత్రము నగరూప ముండును. అది కూడ కేవలము ఆ నగను ధరించువాని దృష్టివలననే ఏర్పడుచున్నది. ప్రతిధ్వని ఏ జవాబు విచ్చునో, లేదా అద్దము దేనిని చూపునో అది, మనము చెప్పిన మాట లేదా మనయొక్క రూపమేయగును;

అంతేగాని, అది ఆ ప్రతిధ్వని యొక్క లేక దర్పణము యొక్కగాని అంగ
మగునా? ఇదేరీతిని, నాయొక్క అవికృతము, శుద్ధమూనగు మూలస్వరూ
పముపై భూతసృష్టిని ఆరోపించుట, అతని సంకల్పము లేదా ఆలోచనలో
యీ భూతసృష్టి వుండుటవలననే అయియున్నది. ఈ విధముగ కల్పన
యొనర్చునట్టి మాయ అంతమొంది భూతాభాస పూర్తిగా మిథ్యయని తెలి
యుట వలన నా యొక్క కేవల శుద్ధ, బుద్ధ అవికృత స్వరూపమే మిగిలి
యుండును. మనకు తల తిరుగుచున్నప్పుడు మన పరిసరములందు గల కొండలు,
బండలు మొదలగునవన్నియూ తిరుగుచున్నటుల కనిపించును. సరిగా
యిదేవిధమున మన కల్పన వలననే వికారహీనుడగు పరబ్రహ్మమందుకూడా
భూతములుగల వనెడి ఆభాస కలుగుచున్నది. కాని యీ కల్పన పోయి
నప్పుడు 'నేను భూతకోటిని, భూతకోటి నాయందున్నది' అనెడి విషయము
స్వప్నమునందుకూడ అంగీకరించ దగినది కాదని తెలియుగలరు. ఇందుచే
లోకులు సాధారణముగ తలంచుచున్న 'కేవలము నేనే యీ భూతకోటిని
ధరించుచున్నాను; లేదా నేను యీ భూతకోటియందున్నాను' అనెడి
మాటలు సంకల్పమనెడి వాత ప్రకోపమువలన భ్రమావస్థలో నోటినుండి
వెలువడెడి వెర్రిప్రలాపములేనని తెలిసికొనుము. కాన నాప్రియసఖుడవగు
ఓ అర్జునా, నన్ను 'జగత్తు'గా భావించుట లేదా, నన్ను 'విశ్వాత్మ'గా
భావించుటయు మిథ్యాభూతకోటియొక్క మిథ్యాకల్పనగ నెరుంగుము. సూర్య
కిరణములవలన అచ్చట ఏమియూ లేకున్నప్పటికీ ఎండమావుల భ్రాంతి
కలుగురీతిగనే నాయందు భూతకోటిగల దనెడి భ్రాంతికూడనైయున్నది.
ఇంతేగాదు, అవి నేనుకూడ తమయందున్నటుల భ్రమింపజేయుచున్నవి.
ఈ రీతిని నేను 'భూతభావన' అనగా భూతాభావకు ఆధారుడనై
యున్నాను. ప్రభ (ప్రకాశము) మరియు సూర్యుడు రెండునూ ఒకటే
యైనటుల నేనుకూడ భూతకోటితో ఏకరూపుడనే అయియున్నాను.
తత్త్వవిచారణతో కూడియున్న యీ ప్రణాళిని ఐశ్వర్యయోగమందురు.
నీకిది చక్కగా బోధపడినదిగదా! భూతకోటి నాకు భిన్నమైనది కాదు
మరియూ నీవు నన్నెన్నడును భూతకోటికి భిన్నమైన వానినిగా తలంచకుము.

యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ॥ ౬

"ఆకాశము ఎంతవరకు వ్యాపించియున్నదో అంతవరకు వాయువు కూడా వ్యాపించియున్నది. విసనకర్ర మొదలగునవి విసురుటవలన వాయువు భిన్నరూపమున కనిపించును; లేనప్పుడు వాయువు ఎల్లప్పుడు ఆకాశముతో కలసి ఏకరూపముననే యుండును. ఇదేరీతిని కల్పనవలన భూతకోటి నాయందే భాసిల్లుచున్నది. లేనిచో నిర్వికల్పావస్థలో యీ భూతకోటి నశించినప్పుడు మరియు నేనే నా అవికృతి రూపమున మిగిలి యుండును. కావున, 'కాదు' 'అవును' అనెడి రెండునూ కేవలము కల్పితములే. కల్పన లేనప్పుడు యీ నామరూపాత్మక విశ్వమే లేదు, కల్పన వున్నప్పుడు యీ వింతయూ వుండును. కల్పన నశించినప్పుడు యీ 'అవును' 'కాదు' అనెడి మాటలకు ఏ విధమగు ఆధారమూ వుండనేరదు. కావున నీవీ ఐశ్వర్యయోగమును చక్కగా తెలిసికొనుము. ప్రప్రథమమున నీవీ పరమజ్ఞాన సముద్రమున తరంగాకారములగల వాడవగుము. అప్పుడు నీవు 'నీవే యీ సమస్త చరాచర జగత్తువని తెలియగలవు.' అర్జునునితో శ్రీకృష్ణుడిట్టుల చెప్పెను "అర్జునా, నీవీ పరమజ్ఞానమువలన మేల్కాంటివిగదా! నీకీ జాగ్రదవస్థలో నీకిప్పటికి వరకుగల ద్వైతస్వప్నము అంతమొందినదిగదా! బుద్ధికి ఎన్నడైన కల్పనయనెడి నిద్రవచ్చుచో అప్పుడు నీకీ అభేదజ్ఞానము వుండదు. ఏలనన అప్పుడు నీవు స్వప్నావస్థ యందుందువు. అందుచే నీకీ రహస్య జ్ఞానమును స్పష్టీకరించి చెప్పుచున్నాను. దీనివలన అవిద్యయనెడి నిద్ర పేరుకూడా లేకుండా పోవును; మరియూ నీ ఆత్మజ్ఞానమనెడి మెలకువ స్థిరముగానుండును. కావున ఓ అర్జునా, నీవు ధైర్యముతో నామాటలయెడ ధ్యానముంచుము. ప్రకృతియే భూతకోటిని సృష్టించుట నాశనముచేయుటలు చేయుచున్నదని నీవు తెలిసికొనుము.

సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥ ౭

"ప్రకృతి యొక్క ద్వివిధములను గూర్చి నీకు చెప్పితిని. ఆ రెండింటి యందును, మొదటిదగు అపరాప్రకృతి ఎనిమిది భిన్న భిన్న స్వరూపములందు వ్యక్తమగును. మరియు రెండవదగు పరాప్రకృతి జీవరూపమున వ్యక్తమగును. ఈ ప్రకృతిని గురించిన కొన్ని విషయములను నీకింతకు పూర్వము చెప్పితిని కాని దీనిని గురించి మాటిమాటికి వర్ణించి చెప్పుటవలన లాభము లేదు. మహాప్రళయ సమయమున, యీ నా ప్రకృతి యందే నిరాకార అభేదరూపముతో భూతకోటి ఏకరూపమున విలీనమగును. గ్రీష్మ ఋతువునందు ఎండ మిక్కుటముగా నున్నప్పుడు బీజ సహితముగ తృణము భూమి యందే పూర్తిగా లయము నొందును; లేదా వర్ష ఋతువునందు కనిపించెడి మేఘములు శరదృతువు వచ్చిన నిర్మల కాంతి యనెడు గుప్త భండారము తెరువబడినప్పుడు ఆకాశమునందే లీనమై పోవును. ఆకాశమున వీచెడిగాలి అంతమున అదే ఆకాశమున లయము నొందును. మరియు నీటియందలి అలలు నీటియందే లుప్తమగును. స్వప్నమందు కనిపించెడి దృశ్యములు మేల్కొనిన పిమ్మట మనస్సునను నిండియుండును. ఇదే విధముగ, కల్పాంత సమయమున ప్రకృతి వలన ఉత్పన్నమగు సమస్త పదార్థములు, అనగా మాయచే భాసమానమగుచున్న భూతకోటి ప్రకృతియందే సమరసత్వము పొంది నిండియుండును. మరల నూతన కల్పారంభ సమయమున 'మరల నేను భూతములను సృష్టించుచున్నాను' అని లోకులు చెప్పుకొందురు. దీనిని గురించి నీకు వివరముగా చెప్పెదను, జాగరూకుడవై వినుము.

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ ॥ ౮

"నూలు పోగుల సమూహము అల్లికవలన తానే వస్త్రరూపము ధరించినట్లు, నేను కూడ నా యీ మాయను సహజ లీలారూపమున ధరింతును. మరల దారముల అల్లికవలన వాటిచే చిన్న చిన్న చతుష్కోణములుగా గల అంచులు ఏర్పడిన విధముగనే, నా ప్రకృతి వలననే నామరూపాత్మకమగు పాంచభౌతిక సృష్టి ఉత్పన్నమగుచున్నది. తోడు పెట్టుట వలన పాలు తోడుకొను రీతిని మూల ప్రకృతిలో సృష్టి భావము ప్రతిబింబించ సాగును. బీజమునకు నీటి సంసర్గము లభించినప్పుడు దానినుండి మొలక

రాసాగును; మరియు దానినుండి వెలువడేసి కొమ్మలు, రెమ్మలు మొదలగున
వన్నియు వృక్షరూపధారణ మొనర్చును. ఇదే విధమున, నాచే ప్రకృతి
అవ్యక్తమగు భూతసృష్టి విస్తరించును. రాజుగారు ఫలానా నగరమును కట్టిం
చిరి - అని లోకులు చెప్పుకొందురు. ఒక దృష్టితో చూచినచో యిది
వాస్తవమే యగును. కాని వాస్తవ దృష్టితో చూచినచో అది వాస్తవము
కాదు; ఏలనన, ఈ నగరమును నిర్మించుటలో రాజు కూడ తన చేతితో
పనిచేసెనని ఎవడైన చెప్పగలడా? ఇదే రీతిని, స్వప్నస్థితియందున్నవాడు
జాగ్రదవస్థలో ప్రవేశించిన రీతిగా నేను కూడ అదేరీతిని ప్రకృతిని స్వీకరిం
తును. స్వప్నావస్థ నుంచి జాగ్రదవస్థలోనికి వచ్చినప్పుడు, అట్టివాని పాద
ములకు ఏవిధమగు శ్రమయైన కలుగుచున్నదా? లేదా అతనికి స్వప్నము
నుంచి పోయి యొచ్చుటకై ప్రవాస మొనర్చవలసి వచ్చుచున్నదా? ఇదం
తయూ చెప్పుటలో గల ఉద్దేశ్యము - భూతసృష్టి నిర్మాణము చేయునప్పుడు
నేను ఏ విధమగు క్రియయు చేయనక్కరలేదని చెప్పుటయే. రాజశాసనము
నకు బద్ధులై ప్రజలున్నటుల ప్రకృతిని స్వీకరించుటవరకు మాత్రము నాయం
దున్నది; రాజశాసనమునకు బద్ధులైయున్నప్పటికి ప్రజలు తమ తమ
అభీష్టానుసారము తమ వ్యాపారములు వ్యవహారములు చేసికొందురు గదా;
అదేరీతిని ప్రకృతిని స్వీకరించుటవరకు నా వంతు, ఆ పిమ్మట ప్రకృతి
వలననే సమస్త వ్యవహారములు జరుగుచుండును. వాటితో నాకు
ఏ విధముగను ప్రత్యక్ష సంబంధము లేదు. పున్నమ చంద్రుడు వచ్చినప్పుడు
సముద్రమున అపారముగ అలలు లేవసాగును. ఓ అర్జునా, ఆ అలలు లేచు
నటుల చేయుటకై చంద్రునకు ఆ సముద్రమును మధించుట గాని, తలక్రిందు
లుగా చేయవలసిన అవసరముగాని గలదా! ఇనుము జడ స్వరూపము
గలదైనప్పటికి సూదంటురాయి దగ్గరకు వచ్చినప్పుడు ఆ రాతివైపునకు పోసా
గును. ఆ యినుము తనవైపు వచ్చునటుల చేయుటలో సూదంటురాయి
ఏ విధమగు శ్రమయైన పడుచున్నదా! సరిగా యిదేరీతిని, నేను కూడ
మూలమాయను ధరించి యున్నాను. మరియు అట్టి సమయమునందు
మాత్రమే భూతసృష్టి తనంత తాను అస్తిత్వములోనికి రానారంభించుచున్నది.
విత్తునుండి కొమ్మలూ, ఆకులూ మొదలగునవి వుద్భవించుటకు భూమి
సహాయకారి అయినటుల, ఓ అర్జునా, యీ భూతసృష్టియంతయూ ప్రకృతి

సహాయముచే జరుగుచున్నది. లేదా, పాలాక్షిది అక్షస్థలుర ముఖ్య కార
ణము రీటుల దేహ సాంగత్యమో, లేదా ఆకాశము నుండి వర్షము కురియు
నటుల చేయుటలో మేఘ సమూహము ఏకైకని మూలకారణమో, లేదా
వృష్టమునకు విదుర ఏ రీతిగ మూలకారణమో, అదే రీతిని ఓ నరశ్రేష్ఠుడ
వగు పార్థా, యీ సమస్త భూతసృష్టికి మూలకారణము ప్రకృతియే.
సమస్త చరాచరములు, స్థూల సూక్ష్మ భూతకోటులంతకూ మూలకారణ
మీ ప్రకృతియే కావున నే, భూత సృష్టిని ఉత్పన్నమొనర్చుట, లేదా దానిని
పోషించుట మొదలుగా గల క్రియలతో నాకేవిధమగు సంబంధమూ లేదు.
నీటియందు పడెడి చంద్రకిరణములు అలలతో సమానముగ పొడవైనవిగ కని
పించును; కాని, చంద్రునిచే యిటుల చేయబడినవి కావు. సరిగ యిదే రీతిని
సమస్త కర్మలు నావరకు చేరికూడా, నాకు భిన్నమైనవై దూరముగనే
యుండును.

న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ!
ఉదాసీన వదాసీన మసక్తం తేషు కర్మసు ౯

“సముద్రమున లేచెడి ప్రచండమగు నీటి తరంగములను ఉప్పుచే
ఏర్పడిన కట్ట అడ్డగించజాలని రీతిని నాలోనే అంతమున లయమును, పొందెడి
యీ కర్మలన్నియు నాయెడ బంధకారములు కాజాలవు. క్షుద్రమగు ధూమ
కణ సమూహము వాయువును అడ్డగించగలుగు నెడల, లేదా సూర్యుని
ప్రకాశమండలమునందు కాలిమ ప్రవేశించగలుగు నెడల - యీ కర్మలుకూడా
నన్ను బంధించగలుగును. వర్షధారలవలన పర్వతమునందు రంధ్రములు
పడనిరీతిని ప్రకృతిచేయు కర్మలు నన్ను బంధించజాలవు. వాస్తవముగా
చూచినచో నామరూపాది వికారములను కలిగించుచున్న యీ ప్రకృతికి
నేనే ఆధారుడనై యున్నాను. కాని, నేను ఎల్లప్పుడు ఉదాసీనుడుగను
తటస్థుడుగను వుందును. కావున, నేను ఏపనిని చేయుటలేదు, చేయించు
టయూ లేదు. ఏదైన యింటియందు దీపము వెలిగించి పెట్టినప్పుడు, యీ
దీపము ఎవరివలనను ఏ పనినీ చేయించుటయూ లేదు, లేదా ఏ పనినీ చేయ
కుండా ఎవరినీ అడ్డగించుటయూ లేదు. అంతేగాక, అది ఎవరు ఏపని
చేయుచున్నారో చూచుటలేదు కూడాను. ఆ యింటియందు దీపము

కేవలము తటస్థముగా నుండి యున్నప్పటికినీ యింటియందుండెడివారు చేసెడి పనులకు (క్రియలకు) కారణమైనటుల, నేను భూతకోటియందున్నప్పటికిన్ని భూతకోటి చేయు కర్మలతో నా కేవిధమగు సంబంధమున్నూ యుండదు.

మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్।
హేతునాఽనేన కౌన్తేయ! జగ ద్విపరివర్తతే॥ ౧౦

'సుభద్రానాథుడవగు ఓ అర్జునా, యీ ఒకేవిషయమును నేను మాటిమాటికి భిన్నభిన్నరీతులుగా ఎంతమారము చెప్పను! ప్రజలు చేసెడి పనులకు సూర్యుడు నిమిత్తమాత్రుడైనటుల నేనుకూడా జగదుత్పత్తికి తటస్థరూపమున నిమిత్తమాత్రుడనై యగుదును. దీనికిగల కారణము నేను ధరించెడి మూలప్రకృతివలన యీ చరాచర విశ్వోత్పత్తి జరుగుటయే; యీ దృష్టితో యోచించినప్పుడు నేనే యీ విశ్వోత్పత్తికి కారణుడను. ఇప్పుడు నీవు దివ్యజ్ఞాన ప్రకాశమున యీ 'ఐశ్వర్యయోగ తత్త్వము'ను చూడుము. అటులైన, యీ భూతకోటి నాయందున్నది, కాని నేను భూతకోటియందు లేను. లేదా, యీ భూతకోటికూడా నాయందులేదు మరియు నేనుకూడా యీ భూతకోటియందులేను. సోదరా అర్జునా, నీవీ ముఖ్యవిషయమును ఎన్నడునూ మరువవద్దు. ఈ గూఢజ్ఞానమే నా సారము మరియు సర్వస్వమై యున్నది. నేను నీకీవిషయమును స్పష్టముగా విపులీకరించి చెప్పుచున్నాను' నీవిప్పుడు యిటునటు తిరుగుచున్న యింద్రియద్వారములను మూసివేసి, మనస్సునందు ఆత్మచింతన నొనర్చుచూ యీ రహస్య మాధుర్యమును గ్రోలుము. ఓ అర్జునా, యీ రహస్యము తెలియనంతవరకు పొట్టువంటి బియ్యపుగింజ వున్నటుల తెలియనికతన - యీ నామరూపాత్మక జగత్తుయొక్క మాలిన్యమువంటి నా యథార్థరూపము సరిగా బోధపడదు. సాధారణముగ తర్కమార్గము వలన మాత్రమే రహస్యము బోధపడునటుల కనిపించును; కాని వాస్తవమునకు అనుభూతిలేని యీ రహస్యమునుగురించిన జ్ఞానముకూడా వ్యర్థమై యున్నది; ఏలనన ఎండమావియొక్క ఆర్ద్రతవలన ఎన్నడును భూమితడిసి మెత్తబడజాలదు! నీటిలో వలవేసినప్పుడు చంద్రుని ప్రతిబింబము ఆ వలలోనికివచ్చి చిక్కుబడిపోయినటుల కనిపించును. కాని

ఆ వలను నీటినుండి బయటకుతీసి ఒడ్డున పెట్టినప్పుడు అందు చిక్కుబడిన చంద్రుడెచ్చటకుపోవును ? ఈ విధముగనే లోకులు వ్యర్థముగ వాచాలతచే అనుభవపు కనులయందు దుమ్ముచల్లుదురు మరియు అనుభవము లేకపోయి నప్పటికిని 'మాకు అనుభవమైనదని' వాగుచుందురు. యదార్థ బోధాసమయము వచ్చినప్పుడు వారి యీ అనుభవమునకు తావెచ్చటనూ వుండదు

**అవజానన్తి మాం మూఢాః మానుషీం తను మాశ్రితమ్।**
**పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్॥ ౧౧**

" నీకు నిజముగా సంసారభయము బోధపడి, వాస్తవముగ నాయెడ నీకు నిజమగు అనురాగము కలిగినచో, నీవీ తత్త్వవిచారణను చక్కగాను ప్రయత్నపూర్వకముగను జ్ఞప్తియం దుంచుకొనవలెను. కామెర్లవ్యాధి వచ్చిన వానికి స్వచ్ఛమగు వెన్నెలకూడ పసుపువన్నెగా కనిపించురీతిని, నా నిర్మలరూపముకూడ దోషవంతముగా కనిపించును. లేదా జ్వరముగలవ నోటిరుచి మారినవానికి పాలుకూడ చేదుగావుండు రీతిని, నేను మనుష్యుడుగా నుండుచున్నను మానవులు నన్ను మనుష్యునిగనే భావింపసాగిరి. కావుననే ఓ అర్జునా, యీ రహస్యజ్ఞానమును మరువబోకుమని నీకు మాటిమాటికి చెప్పుచున్నాను. ఈ రహస్యజ్ఞానములేని స్థూలదృష్టి నిష్ప్రయోజనము. స్థూలదృష్టితో నన్ను చూచుట చూచుటేకాదు; ఏలనన, స్వప్నమున ఎవడైన అసత్యముగ అమృతము త్రాగుచో ఆతడెన్నటికిని అమరుడు కాజాలడు. సాధారణముగ ప్రజలు నన్ను బాహ్యదృష్టితోనే చూచెదరు. మరియు బాహ్యరూపమున మాత్రమే నన్నెరుంగుదురు; కాని నీటియందు పడిన నక్షత్ర ప్రతిబింబమును రత్నముగా భావించి దానిని గైకొనదలచెడు తలంపుతో మోసపోయి నాశనమునొందు హంసవలె యీ బాహ్యజ్ఞానము కూడా యదార్థజ్ఞానమును పొందుటలో హానికరమైయున్నది. ఎండమావిని గంగగా తలంచి దానివద్దకు పోయినందువలన మన కేమి లభించగలదు ! కలువమొక్కను కల్పవృక్షముగా భావించి చేతపెట్టుకొనుటచే లాభమేమి కలుగును ! కాలసర్పమును రెండుపేటలుగల నీలమణిహారముగ భావించి చేతపట్టుకొనుచో, లేదా తెల్లరాతినే రత్నముగ భావించి ఏరుకొనుచో, లేదా మండుచున్న చంద్రకట్టెల నిప్పురవ్వలను గుప్తభాండా-

రము లభించినదని జోలెలో వేసికొను వెడల, లేదా సింహము నూతియందు తన నీడను చూచి, ఆ నీడను మరొక సింహముగా భావించి దూకువెడల — దీని పరిణామ మేమగును!

ఇదే విధముగ, పరమాత్ముడనగు నేను నిజముగా సాకారుడనై ప్రపంచమున అవతరింతునని దృఢనిశ్చయము గలవారై యీ సాంసారిక ప్రపంచమున లీనమగువారు, నీటియందు పడెడి ప్రతిబింబమునే చంద్రునిగా భావించి దానిని గైకొనినవారిని భావించవలెను. భ్రమతో కూడియున్న యిట్టి బుద్ధి నిర్ణయము కేవలము వ్యర్థమైనదే. గంజిని త్రాగి దాని నుంచి అమృత గుణములు ఆశించినట్టుల యీ నశ్వరమగు నామరూపాత్మక స్థూల రూపమును మనస్సునందు పూర్తిగా విశ్వసించి, దానియందే నా శాశ్వత స్వరూపమును చూచుట కూడా వ్యర్థమైనదేయని తెలిసికొనుము. ఈ విధమైన ప్రయత్నముకలవారు నన్నెటుల గనిపించెదరు? తూర్పు దిక్కునకు పోయెడి మార్గమున పోయి ఎవడైనా పడమటి సముద్రపు ఆవలి ఒడ్డును చేరగలడా? లేదా, ఓ అర్జునా, పొల్లును యెంత దంచినప్పటికి దానినుండి బియ్యపుగింజ లభించగలదా! ఇదేరీతిని, కేవలము వికారముచే ఏర్పడిన యీ స్థూల జగదాకారమును తెలిసికొనినంత మాత్రమున నా కేవల నిరాకార నిర్గుణ స్వరూపమును తెలిసికొనవగునా? ఫేనమును త్రాగుటచే నీటిని త్రాగినందువలన కలిగెడి ఫలితము కలుగునా? ఇదే విధమున ప్రజలు తమ మనస్సున మోహము జనించుటచే భ్రమనొందినవారై 'యీ జగత్తే పరమాత్మనగు నేను'గా భావించెదరు. ఇట్టి స్థితిలో, యిచ్చట కలిగెడి జనన మరణము లాదిగా గల కర్మలు నాయందు కూడా ప్రయుక్తమగునని విశ్వసింతురు. ఈ రీతిని, నామరహితుడనగు నాకు నామమును, క్రియాహీనుడనగు నాకు కర్మను మరియు విదేహుడనగు నాపై దేహధర్మమును ఆరోపించుచున్నారు. నేను నిరాకారుడనైయున్నప్పటికిని నాకు ఆకారముగలదని ఆరోపింతురు. ఉపాధిహీనుడనగు నాపై ఉపచార విధిని ఆరోపింతురు. నిష్క్రియుడనైనప్పటికి కర్మలు చేయుచున్నానని, వర్ణవిహీనుడనైనప్పటికిని వర్ణము గలదని, నిర్గుణుడనైనప్పటికి గుణవంతుడనని, చేతులు - పాదములు లేకున్నప్పటికి చేతులు - పాదములు పెక్కులైనవి గలవని, అపరిమితుడనైనప్పటికిని పరిమాణముగలదనీ, మరియు సర్వవ్యాప్తినైనప్పటికిని,

స్థానవిశేషము గలదని ఆరోపణ చేతురు. నిద్రయందున్న మనుష్యుడు స్వప్నమున తన శయ్యపైననే అరణ్యమును చూచురీతిని అట్టివారు శ్రవణహీనుడ నగు నాకు శ్రవణములు గలవని భావింతురు. నాకు నేత్రములు, గోత్రము, రూపము, ఆకారము, ఇచ్ఛ, తృప్తి, వస్త్రము, భూషణములు మరియు కారణము మొదలగునవి ఏవీ లేకున్నప్పటికిని యివన్నియు నాకు గలవని అట్టివారు భావింతురు. నేను స్వయంసంసిద్ధుడ నయినప్పటికి వారు నా విగ్రహములను నిర్మింతురు; నేను స్వయంభువు నయినప్పటికి నాకు ప్రాణప్రతిష్ఠ చేతురు; నేను ఎల్లప్పుడును అంతటను అఖండరూపముగ వ్యాపించి యున్నప్పటికిని వారు నా ఆవాహన విసర్జనముల నొనర్తురు. నేను ఎల్లప్పుడు స్వయంసిద్ధుడనై యున్నప్పటికిని వారు తమబుద్ధిచే నా అవికృత ఏకరూపమునకు బాల్య, యౌవన, వార్ధక్యములతో సంబంధమును కలుగజేతురు. నేను ద్వైతహీనుడ నైనప్పటికిని నాయందు వారు ద్వైతభావమును ఆరోపింతురు. నేను నిష్క్రియుడనై యున్నప్పటికిని నాపై క్రియారోపణ చేతురు; మరియు నేను అభోక్తనైనప్పటికి నేను భోగములను అనుభవించుచుందునని వారు భావింతురు. నాకు ఏ కులగోత్రములును లేకున్నప్పటికిని వారు నా కులమును గురించి వర్ణింతురు. నేను అవినాశిని అయినప్పటికిని నా మృత్యుకల్పన మొనర్చి వారు దుఃఖింతురు. నేను అందరియందును నిండియున్నప్పటికిని నన్ను గురించి శత్రుమిత్రాది భావములుగలవాడనని తలంతురు. నేను ఆత్మానందమునకు ప్రత్యక్షనిలయము నైనప్పటికిని వారు నేను వివిధసుఖములను వాంఛించుచుందునని భావింతురు; నేను అంతటను వ్యాపించి యున్నప్పటికిని వారు నన్ను ఏకదేశీయునిగా చెప్పుదురు. అంతేగాక నేను ఫలానాచోటున నుందునని కూడ అంగీకరింతురు. నేను సమస్త చరాచరములకు ఆత్మనైనప్పటికిని నేను ఒకపక్షము వహించి రెండవపక్షము వారిని కోపించి చంపుదునని వారు నన్ను గురించి తలంచుచుందురు. మానవధర్మముల నన్నిటిని వారు నాకు గలవని ఆరోపింతురు. ఈరీతిని వారి జ్ఞానస్వరూపము భ్రాంతిగా సత్యదూరమై యున్నది. వారు తమముందు ఏదైన విగ్రహమును చూచుచు దానిని దేవత యని సాగుదురు. ఆ విగ్రహము విరిగిపోయినచో యిది దేవత కాదని అవల పారవైతురు. వారు నేను సాకారమనుష్యుడనని చెప్పు-

భంగుల తలంతురు. వీరి యీ విపరీతజ్ఞానమే సత్యమగు జ్ఞానమును అంధకారమందుంచు చున్నది, మరియు సత్యమైన జ్ఞానము వారి దృష్టిలోనికి వచ్చుటలేదు.

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః।
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥ ౧౨

"ఇందువలననే యిట్టి పురుషుల జీవితము నిష్ఫలమగుచున్నది. వర్షఋతువు గాక తదితర ఋతువులయందు కనిపించు మేఘములును, ఎండమావులందు లేచుచున్నటుల కనిపించు నీటి అలలును - యివన్నియు దూరమునుండి చూచి ఆనందింప దగినవి మాత్రమేను. వాటివద్దకు పోయి పరీక్షించి చూచినచో అందేమియు నుండదు. అప్పుడవి నిస్సారమైనవిగ తేలును. పిల్లలు ఆడుకొనుటకుగాను తయారుచేయునట్టి మట్టి గుఱ్ఱములు, గారడీవాడు తయారుచేయునట్టి అలంకారాదులు, లేదా ఆకాశమున మేఘములచే నేర్పడిన మేడలు, కోటలు, గంధర్వనగరులు మొదలగునవి నిజమైనవి కాకున్నప్పటికి చూచుటకు మాత్రము కనిపించుచున్నది. జమ్ముగడ్డి తిన్నగా పెరుగుచుండును. కాయలు కాయవు. లోపల బోలుగా కాండము వుండును. మేక కంఠమున గల స్తనములు కూడా చూచుటకు మాత్రమే; అంతకు మించి వాటియందు మామూలు స్తనములచే గలుగు ప్రయోజనమేదియు లేదు. ఈ విధముగనే మూఢుని జీవితము కూడను అతడు చేయు కర్మలు బూరుగు కాయలవలె ఉపయోగ రహితమైనవి. మరియు తృణీకరింపదగినవియన్ని. ఇట్టివారు సంపాదించెడి జ్ఞానము కోతి బ్రద్దలుకొట్టిన నారికేళమువలె, లేదా అంధునిచే జిక్కిన ముత్యములవలె నిష్ఫలమగును. అనగా బొమ్మలచేతియందున్న శస్త్రములవలె లేదా అశుద్ధ పురుషునందలి మంత్రబీజమువలె అతని జ్ఞానము కూడ నిరుపయోగమైనది. కావున ఓ అర్జునా, అతడు ఆర్జించిన జ్ఞానము, మరియు కర్మలూ అన్నియు వ్యర్థములే యగును: ఏలనన అతని చిత్తమున యథార్థజ్ఞానము కొరవడియున్నది. సద్బుద్ధిని కూడా కబళించెడి వివేకము యొక్క ఉనికిని చెడగొట్టెడి మరియు అజ్ఞానాంధకారమున సంచరించెడి తామస రాక్షసియగు ప్రకృతి (మాయ) చేత వారు చిక్కుబడియుందురు: ఇందుచే వారి చిత్తము చెదరగొట్టబడి, తమోగుణ యుక్తమగు

రాక్షసినోట్లో వారు పోయి పడుదురు. ఆ తామసరాక్షసి నోటియందుగల ఆశయనెడి ఉమ్మిలో హింస యనెడి నాలుక నివసించుచుండి అసంతృప్తి అనుపంతో నముల నెడి మాంస పిండమును నిరంతరము రుచిచూచు చుండును. ఈ హింస యనెడి నాలుక పెదవులను నాకుచూ అనర్థపు కర్మములవరకు బయటకు కెడలును, ఈ రాక్షసి దోషమనెడి పర్వతగుహలలో నిరంతరము మదించితిరుగు చుండును. ద్వేషమే దానిదంష్ట్రిలు; ఇవి జ్ఞానమును నమిలివైచి నాశమొనర్చును. స్థూలబుద్ధిగల మూర్ఖుల దృష్టియందిది చర్మము మరియు ఎముకలతో చుట్టి వేయబడియున్న దానివలె కాన్పించును. ఈ రీతిని యీ తామస మాయారాక్షసి నోటియందు భూతములకు పెట్టబడిన బలివలె పడు మానవులు అజ్ఞానమనెడి లోతునీటిలో మునిగి నాశనమగుదురు. ఈ విధముగ తమోగుణపు గోతిలో పడువారివద్దకు సహాయము చేయుటకై విచారణ యనెడి హస్తము చేరజాలదు. ఇట్టివారికి తామెచ్చటకు పోతిమో కూడా తెలియదు. కావున మూర్ఖులను గురించిన గాధను యిక ముగింతును. ఇంకను దీనిని విస్తరించినచో వాణీదేవికి వ్యర్థముగ కష్టము కలుగును" అని శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు విని అర్జునుడు "ఓ మహారాజా! తాము చెప్పినది పూర్తిగా నిజమే" యనెను. అందుపై శ్రీకృష్ణుడు "ఓ అర్జునా! ఇక సాధుపురుషుల స్థితిని వివరించెదను, వినుము" అనెను.

మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజన్త్యనన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥ ౧౩

"నిరంతరము పవిత్ర స్థలములందు నివసించవలెనని సంకల్పించెడి క్షేత్ర-సన్యాసినగు నేను ఎవరి శుద్ధాంతఃకరణమందు నివసింతునో, ఎవనిని వైరాగ్యము నిద్రావస్థయందు కూడ విడచిపోదో, ఎవని శ్రద్ధతో కూడియున్న శుద్ధభావనలందు ధర్మసామ్రాజ్యము వసించుచుండునో, ఎవనిమనస్సున ఎల్లప్పుడు వివేకమనెడి ఆర్ద్రితయుండునో ఎవరు జ్ఞాన గంగలో స్నానము చేసియున్నారో, ఎవరు పూర్ణ బ్రహ్మస్థితివరకు చేర శాంతిని పొందియున్నారో, ఎవరు శాంతియనెడి తీగెయందు వెడలిన నూతన పల్లవములవలె నుందురో, ఎవరు ఆ పరబ్రహ్మమందు వెలువడిన అంకురమువలె నుందురో, ఎవని యందు జగత్పరిణతి లేశా పరిసమాప్తి, యుండునో, ఎవరు ధైర్యమునకు

ఆధార స్తంభముగ కనిపింతురో, ఎవరు ఆనందసముద్రమున ముంచి నింపబడిన పాత్రవలె నుందురో, ఎవరుభక్తియెడగల గాఢానురాగముచే ముక్తికాంతతో కూడ "నీవు నా కక్కరలేదు, తొలగిపొమ్ము" అందురో, ఎవని సహజాచరణమునందుకూడ నీతి స్వప్రాణముగ విహరించుచున్నట్లు కనిపించుచూ, ఎవని సమస్త యింద్రియములను శాంతిచే సింగారింపబడి యుండునో, మరియు ఎవని చిత్తము నావంటి సర్వవ్యాపకునికూడ నాల్గువైపులను ఆచ్ఛాదితమొనర్చగలంతటి అత్యధిక విశాలమైనదో, యీరీతిగా ఏమహాసమర్థుడగు మహాత్ముడు నా ఆ సత్య స్వరూపమును పరిపూర్ణముగ తెలిసికొనునో, ఎవడు దైవీసంపదయొక్క సౌభాగ్యమో మరియు ఎవడు దినదినాభివృద్ధిగాంచుచున్న ప్రేమతో నన్ను భజించుచూ, ఎవనిని ద్వైతభావము ఎన్నడును నామమాత్రమునకైన స్పృశింపదో, ఓ అర్జునా అట్టివారు మత్స్వరూపులైయేయుందురు. వారు నన్నే సేవింతురు. ఆ సేవలోగల విలక్షణమును చెప్పెదను వినుము.

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ ౧౪

"ఇట్టి భక్తులు ప్రాయశ్చిత్త విధానమును మానివేసి, నన్ను కీర్తించు చప్పుడు భక్త్యావేశమున నాట్యముచేయ సాగుదురు. వారియందు నామమాత్రపు పాపముకూడా లేనందువలన వారికి ప్రాయశ్చిత్తముతో పనిలేదు. వీరు యమ-దమాదులను నిస్తేజమొనర్తురు. తీర్థక్షేత్రముల చిహ్నముకూడా లేకుండ చేతురు మరియు యమ-లోక మార్గమును అంత మొందింతురు. ఏలనన, యమము మున్ముందుగనే 'వీరు ఇంతకుపూర్వమే యింద్రియములు వశపరచుకొని యున్నారు. ఇట్టి స్థితిలో వీటిని నేను నియమించగలిగిన అగత్యమేమి గలదు?' అనును. ఇట్టివారికి గల మనోనిగ్రహమును చూచి దమము 'నేను యిప్పుడు దేనిని దమన మొనర్చును?' అనును. తీర్థములు 'వీరి అంగములందు ఔషధసేవ చేయుటకు అవశ్యకమగుమాత్రపు దోషముకూడా లేదు; అట్టి పరిస్థితిలో మేము మా పవిత్రతచే వీరియందలి ఏ మాలిన్యమును తొలగించము?' అనును. ఈ విధముగ ఆ మహాత్ములు కేవలము నా నామ సంకీర్తనమువలననే ప్రపంచమందలి దుఃఖములను నాశనమొనర్చి జగత్తునంతను ఆత్మసుఖముతో నింపివేయుదురు. వారి ప్రభావము లేకుండగనే జ్ఞాన

దివసమును ఉదయింపజేసురు, అభ్యాసము లేకుండగనే అభ్యాసులనొనర్తురు, యోగసాధన లేకుండగనే నేత్రములకు మోక్షదర్శన మొనరింతురు. రాజు మరియు దరిద్రులందరి యోగ్యతలో భేదభావము నెంచుటగాని, ఎవరైన గొప్పగాగాని, కొద్దిగాగాని భావించుటనునది వారు ఎరుగనే ఎరుగరు. వారు ఉచ్చ నీచ భేదముల నొనర్చరు. ఆనందపు లహరులను జగత్తునకంతకు తెరచి యుంతురు. వైకుంఠమునకు ఎవరైన పోదురో లేదోగాని వారు జగత్తు నంతను వైకుంఠముగ నొనర్తురు. ఈ రీతిగా వారు నామకీర్తనము వలన జగత్తునంతను స్వచ్ఛమగు ప్రకాశముతో నిండియుండునటుల జేతురు. వారు సూర్యసమాన తేజస్వులుగా నుందురు. కాని సూర్యునకు కలిగెడి అస్తమయ దోషము వారికేమాత్రము స్పర్శించదు. చంద్రుడొక్క పున్నమనాడు మాత్రమే పూర్ణ రూపమున కాన్పించును. కాని వారు ఎల్లప్పుడు పూర్ణ త్వము కలిగియుందురు. మేఘములు ఉదారమైనవనుటలో సందియము లేదు. కాని వాటి మూలధనము కూడ యెప్పుడో ఒకప్పుడు అయిపోవును; కావున యిట్టి మేఘములు కూడా ఆ మహాత్ములకు సాటిరావు. వీరిని నిజముగ యెగురుచున్న సింహములని చెప్పవలెను. నా నామమును ఒక్కమారు నోట దలచుటకే కొన్నివేల జన్మల నెత్తవలసి వచ్చును, అట్టి నామము వారి నాలుకలపై ప్రేమచే నిరంతరము నాట్యమొనర్చుచుండును. నేను వైకుంఠమునందునూ వుండను. భానుమండల మందునూ నివసించను, అంతే గాదు నేను యోగుల మనస్సును కూడ దాటి అవలకుపోదును. అయినప్పటి కిని, ఓ అర్జునా, ఎచ్చట నా అనన్యభక్తులు ప్రేమచే నా నామ సంకీర్తన మొనర్చుచుందురో అచ్చట, ఎచ్చటనూ ఎన్నడునూ లభించని నేను సహజముగనే లభింతును. వారు నాగుణములందు ఎంతగ రకటుల లీనమై పోదురో చూడుము, వారికి స్థల కాల స్మరణ కూడ వుండదు. మరియు వారు నా నామ కీర్తనమున ఆత్మసుఖ ప్రాప్తి నొందుదురు. వారి కృష్ణ, విష్ణు హరి, గోవింద - యనెడి అఖండమాల ఎడతెగకుండ సాగుచుండును. మరియు వారు నన్ను గురించి ముక్తహృదయముతో ఆధ్యాత్మచర్చ నొనర్చి తృప్తి పొంది నా గుణములను గానము చేయుచుందురు. ఓ అర్జునా ఆభక్తులు యీ రీతిగా నా కీర్తన మొనర్చుచూ, చరాచరములందు సంచరింతురు. వారు అత్యంత ప్రయత్న పూర్వకముగ పంచప్రాణములను మరియు మనస్సును

పూర్తిగా అణచియుంచి వాటిని తన వశమునందుంచు కొందురు. వారు శౌర్యమునకు యమ - నియమము లనెడి కోటగోడ నేర్పరచుకొందురు. మరియు లోపల వజ్రాసన మనెడి కోటను నిర్మించుకొని ప్రాణాయామ మనెడి ఫిరంగులతో కోటను కాపలా కాయుచుందురు. ఆ సమయమున కుండలినీశక్తి జాగరణము వలన వెలుగు ప్రకాశమునందు మనస్సు మరియు ప్రాణవాయువుల యొక్క అనుకూల్యమువలన షోడశకళల అనగా పరిపూర్ణ ఆత్మజ్ఞాన రూపము నన్న అమృత సరోవరములు తెరువబడును. అప్పుడు అంతర్ముఖేంద్రియముల ఏకాగ్రత యొక్క పరమావధి సంభవించును (అనగా, అవి ఏకాగ్రత యొక్క అంతిమ సీమకు చేరును). వికారములనెడి భావ అంతమొందును; మరియు సమస్త యింద్రియములు ఖండింపబడి హృదయమున మూసివేయబడును.

ఇంతలో ధారణ అనగా ధ్యానముయొక్క పరిపక్వస్థితినందిన గుఱ్ఱపు రౌతులు ప్రయత్నము చేసి పంచమహాభూతములను ఏకత్ర మొనర్తురు మరియు పంచమహాభూతములు ఏకత్రమై ఆకాశమున లీనమగును, సంకల్ప వికల్పము లనెడి చతురంగసేన పూర్తిగా నాశమొందును. ఆపిమ్మట 'విజయము కలిగినది విజయము కలిగినది' అనెడి ప్రచండ జయఘోష సాగును. మరియు ఆ జయఘోషలో ధ్యానధారణల నగారా వాయింపబడ సాగును; మరియు బ్రహ్మతోపాటు ఐక్యమనెడి ఏకచ్ఛత్ర రాజ్యము కనిపించసాగును. ఇటుపిమ్మట సంపూర్ణ ఆత్మానుభవ సామ్రాజ్యమున సమాధి లక్ష్మియనెడి అభిషేకము జరుగును. ఓ అర్జునా, యీరీతిగా సాధన అతిగంభీరమైనదిన్నీ గూఢ రహస్యాత్మకమైనదిన్నీ అయియున్నది. ఈ విధముగా నన్ను భజించెడి భక్తులు 'వస్త్రమునందు యీ చివరినుంచి ఆ చివరివరకు ఒకేఒక దారపు పోగులు వుండునటుల, నేనే కూడా సమస్తచరాచరము లందంతటను నిండి యున్నానని, తెలిసికొందురు. ఇంతేగాక నేను లేని పదార్థమేదియూ లేదనికూడా వారు తెలిసికొందురు. జగత్తనెడి వస్త్రమునకు ఒక కొన బ్రహ్మదేవుడూ రెండవకొన దోమయూననికూడా వారెరుగుదురు; మరియు యీ రెంటిమధ్యను గల సమస్త భూతసృష్టియు నా స్వరూపమేనని కూడ వారెరుంగుదురు. అంతేగాక వీరు చిన్న పెద్ద సజీవ నిర్జీవ - సృష్టి భేదము నేమాత్రము పాటించరు, వారిదృష్టియందు పడిన ప్రతివస్తువును మద్రూప

ముగ అనగా బ్రహ్మస్వరూపముగ భావించి దానిని సరళత్వముతో ఆద
రింతురు. వారికి తమ శ్రేష్ఠత్వమును గురించిన ధ్యానమే యుండదు మరియు
యితరుల యోగ్యతా యోగ్యతలనుగురించిన భావమే వారికుండదు. వ్యక్తు
లందరిని ఒకేరీతిని నమ్రతతో గౌరవించుటే వారికి నచ్చును. మెరకగానున్న
చోటున పడిన నీరు తనంతతానే ఒకచోటుకుచేరి పల్లముగానున్న వైపుకు
ప్రవహించురీతిని, అట్టి భక్తుల స్వభావము భూతకోటిని చూచుటతోడనే
నమ్రమగుటయేయై యున్నది. తీగాఫలభారముచే నిండియున్న చెట్లకొమ్మలు
తమంతతామే క్రిందికివంగురీతిని, వారు భూతకోటిముందు స్వాభావికముగనే
నమ్రతను చూపుదురు. వారు నమ్రతనే తమ సమస్తవైభవముగ తలంతురు
మరియు వారి ఆ వైభవమునంతను జయజయ ధ్వానములతో నాకు అర్పిం
తురు. ఈ రీతిని ఎల్లప్పుడు భూతకోటియెడ నమ్రులై యుండుటవలన వారికి
గల మానావమానములనెడి భావము పూర్తిగా నాశనమగును; యిందువలన
వారు తమంతతామే మద్రూపులై నిరంతరము సమరసులై యుండి ఉపాసన
చేయుచూ నుందురు. ఓ అర్జునా, యీరీతిని నీకు నిజమైన మరియు మహి
మాన్వితమూనగు భక్తివిషయమునుగురించి చెప్పితిని. ఇక జ్ఞానయజ్ఞముచే
న న్నుపాసించువారినిగురించి చెప్పెదను వినుము. ఓ అర్జునా, కాలముతో
భజనమైనట్టి పద్ధతిని నీకిదివరకే చెప్పియున్నానుగాన నీ వెరుగుదువు.
శ్రీకృష్ణుని యీ మాటలనువిని అర్జునుడిట్టులనెను. "భక్తి మరియు భజనను
గురించిన సంగతులు నేనువింటిని, ఈ సౌభాగ్యప్రసాదము నాకొకమారు
లభించినది. అయినప్పటికిని అమృతమును మాటిమాటికి వడ్డించినప్పటికిని
'వద్దు'ను వాడెవడైన నుండునా! అర్జునుని యీ మాటలనువిని శ్రీకృష్ణుడు
భేషుభేషు! అర్జునా, నీవు చక్కగా పలికితివి. నీయెడ నా అంతఃకరణమున
గల స్నేహపూర్ణమైన ఆదరమే నీకు మాటిమాటికి చెప్పునట్టుల చేయు
చున్నది" అనెను. అంత అర్జునుడు "మహారాజా, తామట్టుల పలుకుట
వింతగానున్నది! చకోరము తనంతమాత్రమున వెన్నెలకాయుదా? సంసార
తాపమును నివారించుట వెన్నెలయొక్క సహజస్వభావము కాదా? తనకు
గల అనురాగముచే చకోరపక్షి నోరుతెరచుకొని చంద్రునివైపు చూచురీతిని,
నేనుకూడా మిమ్ము ప్రార్థించుదును. కాని మహారాజా తాము ప్రత్యక్ష
కృపాసాగరులు. మేఘము తన సామర్థ్యముకలన మాత్రమే జగత్తుయొక్క

వాంఛను నెరవేర్చుచున్నది. అటుల కానిచో మేఘములవలన గలుగు వర్షమునందు చాతక పక్షికి కలిగెడి దప్పిక ఏపాటిది! కాని, దోసెడు నీరుకావలసి నప్పటికికూడ గంగానది ఒడ్డుకు పోవలసివచ్చు నటుల నాకోరిక కొద్దిదేకావచ్చును. లేదా గొప్పదికావచ్చును, కాని ఓ మహారాజా, సమస్తము నాకు విపులీకరించి చెప్పుము" అనెను. అర్జునుని యీ మాటలకు శ్రీకృష్ణుడు సంతసించి యీరీతిని చెప్పసాగెను.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్॥ ౧౫

"జ్ఞాన యజ్ఞమునుగురించి యిక చెప్పెదను. పరబ్రహ్మమునం దుత్పన్నమగు 'అహం బహుస్యామ్ ప్రజాయేయ' యనెడి మూలసంకల్పము యీ యజ్ఞమునకు యజ్ఞ-స్తంభము. మహాభూతము యజ్ఞ-మండపము, మరియు ద్వైతము యజ్ఞ-పశువులై యున్నవి. పంచమహాభూతములకు గల విశిష్టగుణములు లేదా ఇంద్రియములు మరియు ప్రాణములు యీ జ్ఞాన యజ్ఞమునకు ఉపచారవిధాన సామగ్రులై యున్నవి. అజ్ఞానము ఈ యజ్ఞమునం దాహుతివేయు ఘృతమైయున్నది. ఈ జ్ఞానయజ్ఞమున మనస్సు మరియు బుద్ధి యనెడు కుండములందు జ్ఞానాగ్ని మండుచుండును; మరియు సఖుడ వగు ఓ అర్జునా, సామ్యభావమునే యీ యజ్ఞవేదికగా నెరుంగవలెను. వివేకమనెడి బుద్ధికౌశల్యమే మంత్రవిద్యకు శక్తి, శాంతి దీనికి యజ్ఞపాత్ర, మరియు జీవుడు దీని యజ్ఞకర్తయగు యజమానుడు. ఈ యజమానుడగు జీవుడే బ్రహ్మానుభవ మనెడి పాత్రలోనుంచి వివేక మనెడి మహామంత్ర ఘోషమొనర్చుచూ జ్ఞానాగ్నిహోమమునందు ద్వైతమును ఆహుతి యొనర్చును. అజ్ఞానము నశించినప్పుడు యజ్ఞ-కర్త మరియు యజ్ఞ-విధి యనునవి అంతమొందును. ఆ పిమ్మట, ఆత్మైక్యమనెడి నీటియందు జీవుడు యజ్ఞ-సమాప్తి యొక్క అవభృథ స్నానము చేసినప్పుడు భూతములు, యింద్రియములు, విషయములనెడి విభేదము వుండదు. ఆత్మైక్యబుద్ధి పూర్ణముగ ప్రతిబింబిత మగుటవలన యివన్నియు ఒకే బ్రహ్మరూపముగ నగును. ఓ అర్జునా, నిద్రనుంచి మేల్కాంచిన మానవుడు - 'నిద్రావస్థలో నేనొక కలగంటిని. అందు నేను సైన్యరూపమున నుంటిని. ఇప్పుడు నేను మేల్కాం

టివి. ఆ స్వప్నమందలి సైన్యము కేవలము భ్రమ జనితము. అప్పటి సైన్యమూ నేనే, ఇప్పుడూ నేనే వున్నాను' అని అనుకొనును. అదేరీతిని, జ్ఞాన యజ్ఞ మొనర్చువానికి యీ విశ్వమంతయు అభిన్నమగు ఒకే బ్రహ్మరూపమని బోధ పడును. ఇందుచే అతనికి గల జీవభావము నాశనమగుచున్నది అతడు పరమాత్మ బోధచే నిండియుండును. మరియు బ్రహ్మైక్య ప్రాప్తి నొందును. కొందరు యీ ఒకే భావముతో జ్ఞానయజ్ఞము ద్వారా నన్ను భజింతురు. మరికొందరు భక్తులు యీ జగత్తు అనాదియని కూడా విశ్వసింతురు.

ఈ విశ్వమదన్నియూ సమానమైనదే, కాని నామరూపాదులవలన అవి భిన్నమైనవిగా కనిపించుచున్నవి. ఇందుచే యీ విశ్వమందు భేదభావము విలసిల్లుచున్నది. అయినప్పటికిని యీ భేదభావము వలన వాటి జ్ఞానమున భేదముండదు. అవయవములు భిన్నభిన్నముగ నున్నప్పటికిని వాస్తవముగ అవి ఒకే దేహమునకు చెందియున్నటుల, లేదా కొమ్మలు చిన్నవీ పెద్దవిగా నున్నప్పటికిని అవన్నియూ ఒకే వృక్షమునకు చెందినవైనటుల, లేదా కిరణములు అసంఖ్యాకములుగ నున్నప్పటికిని అన్నియూ ఒకే సూర్యునివైనటుల—వివిధ రూపములుగా గల వస్తువులు, వాటికి గల భిన్నభిన్న నామములు భిన్నభిన్న వ్యాపారములు మరియు వాటియన్నింటియందును గల భేదము అనునవి యీ భౌతిక జగత్తునకు మాత్రమే సంబంధించినవనియు, నేను పూర్తిగా భేదభావరహితుడననియు ఆ సాధకులు తెలుసుకొందురు. ఓ అర్జునా, ఇటుల తన బ్రహ్మస్వరూపజ్ఞానమునకు భేదభావస్పర్శ కలుగనివ్వనివారు మాత్రమే సరియగు జ్ఞానయజ్ఞము నొనర్చువారు. ఏలనగా, వారికి ఎప్పుడు ఎచ్చట ఏది కనిపించునో అది పరబ్రహ్మనగు నాకు భిన్నమైనది ఏదియూ కాదనెడి జ్ఞానము వారికి మొదటినుండియూ యుండును. నీటిబుడగ జలరూపమే యగును. అది విచ్చి పోవుగాక, లేదా యుండుగాక దానికి గల సంబంధము నీటితోనే. గాలివలన దుమ్ము అటునిటు ఎగిరిపోవచ్చును, కాని అది తనకు గల పృథ్వీభావము నెన్నడును కోల్పోదు. అది క్రిందపడినప్పుడు మరల భూమిపైననే పడును. ఇదేరీతిని, ఏదైనా నామరూపాత్మక వస్తువు యుండుగాక లేక నశించుగాక— అదెన్నడును బ్రహ్మరూపముగనే వుండును. నేను సర్వవ్యాపకుడనైనటులనే వారి బ్రహ్మానుభవము కూడా సర్వవ్యాపకము. ఈ నానావిధ విశ్వమంతయు ఆ ఏకవిధ బ్రహ్మమే ననెడి జ్ఞానముతో వారు సర్వకార్యముల

నొనగుదురు. ఓఅర్జునా, సూర్యబింబమును చూడగోరువాడు దానిఎదుటనే వుండురీతిని యీజగత్తును తనఆత్మబోధచే వ్యాపముగా నుంచుటవలన వారుకూడ సమస్తమునకు (అందరికి) తమఎదుటనే కనిపింతురు. ఓపార్థా, వారిజ్ఞానమున నానావాత్రపు భేదభావముకూడ వుండదు. ఆకాశమున వాయువు అంతటను సమానముగను పూర్తిగను నిండియుండురీతిని వారిజ్ఞానము కూడ జగత్తునంతను సమభావముచే వ్యాప్తమొనర్చియుంచును. నావ్యాప్తి ఎంతఅధికముగా నుండునో అంతగా వారిబ్రహ్మబోధకూడ వ్యాపించియుండును; కావున వారు ఉపాసనాసంబంధమగు పని నొకదానినికూడ చేయనప్పటికిని, వారిద్వారా తనంతతానే నన్నుగురించిన ఉపాసన జరుగును. ఈరీతిగా అంతటను నేనొక్కడనే వున్నప్పుడు నాఉపాసన ఎప్పుడెవరివలన జరుగకుండును? (అనగా అందరును సమంతతామే నిరంతరము ఏకరూపమున నన్నుపాసించుచుండియున్నారు). కాని, వారిందరికి అసర్వవ్యాపకజ్ఞానము కలుగదు, కాని కేవలు అప్రాప్తస్థితియందుందురు— వారికి నాయథార్థ స్వరూపప్రాప్తి కలుగదు. నీకీవిధముగు యోగ్యమైన జ్ఞానయజ్ఞముచే నన్నేరీతిని ఉపాసించవలెనో చెప్పితిని. భిన్నభిన్న వ్యక్తులవల్ల భిన్నభిన్న సాధనములచే జరుగు భిన్నభిన్నకర్మలన్నియు అంతమున నాకే అర్పితమగును. కాని మూఢుల కీరహస్యము తెలియదు. అందుచే వారు నాశుద్ధస్వరూపప్రాప్తిని పొందరు.

అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాఽహ మహమౌషధమ్।
మన్త్రోఽహ మహమే వాఽజ్య మహమగ్ని రహంహుతమ్॥ ౧౬

“కాని, అశుద్ధ బ్రహ్మజ్ఞానోదయమైనప్పుడు, వేదములుకూడా నేనే ననిన్ని మరియు వేదములలో చెప్పబడిన అనుష్ఠానవిధితో చేయబడు క్రతువులూ యజ్ఞములుకూడా నేనే ననిన్ని తెలియగలదు. ఆక్రతుకర్మలచే జరుగు యథాస్థితి యజ్ఞములన్నియు, అంగోపాంగ సహితమగు యజ్ఞము కూడ నేనే. స్వాహా, స్వధా, సోమాది ఓషధులు, బలి, ఘృతము, సమిధ, మంత్రము, ఆహుతి, ద్రవ్యము, హోత, అగ్ని మరియు హవన వస్తువులు మొదలగు యజ్ఞమునం దుపయోగింపబడు వస్తువులన్నియూకూడా నేనే.

పితాఽహమస్య జగతో మాతాధాతా పితామహః
వేద్యం పవిత్ర మోఙ్కార ఋక్సామ యజురేవచ॥ ౧౭

"ఎవని సహవాసముచే అష్టవిధములగు ప్రకృతి (మాయ) వలన అనామ రూపాత్మక జగత్తు ఉత్పన్న మగుచున్నదో, ఆ జగత్పితను నేనే; అర్ధనారీ నటేశ్వర మూర్తి యందలి పురుషుడే నారీమణికూడా యగును. ఈరీతిని యీ చరాచర జగత్తుకు తల్లినికూడా నేనే. ఆ పిమ్మట, సృష్టింపబడు యీ జగత్తు ఎవని ఆధారమున నిలచియుండి వృద్ధిపొందుచున్నదో, ఆ ఆధారము కూడా నేనుగాక మరెవరునుకాదు. ఈ ప్రకృతి-పురుషులు, శివ-శక్తులజంట ఎవని సహజ సంకల్పముచే ఏర్పడినదో, ఆ త్రిభువన పితామహుడనుకూడ నేనే. మరియూ ఓ వీరుడవగు అర్జునా, సమస్తమగు భిన్న భిన్న జ్ఞానమార్గములును అతమున ఏ ఒకేచోట నాల్గు బాటల కూటమి వద్దకువచ్చి కలియునో, దేనిపేరు 'వేద్యమో' అనగా తెలిసికొనదగిన వస్తువో, ఎచ్చట నానా మతములు ఏకమతియగునో, ఎచ్చట భిన్న భిన్న శాస్త్రములు పరస్పరము ఒకదాని నొకటి గుర్తించునో, ఎచ్చట వాటి భేద భావము నశించునో, ఎచ్చట ఒకదాని కొకటి భిన్నముగ నుండెడి జ్ఞాన మార్గములు కలియునో, దేనిని 'పవిత్రి' మందురో మరియు ఏది అది సంకల్ప రూపమగు బ్రహ్మ బీజమునుంచి అంకురించిన నాద-స్వరూప ఘోషధ్వని మయమగు అంకురమునకు మూలస్థానమగు ఓంకారమో, అదికూడా నేనే. ఆ ఓంకారపు కుక్షియందుండెడి 'అ', 'ఉ' 'మ'- యనెడి యీ మూడక్షరములును వేదములతో పాటు పుట్టినవి. అట్టి ఆ అక్షరములుకూడ నేనే. ఋగ్, యజుస్సామ వేదములు మూడుకూడా నేనే. ఈ విధముగ సాహిత్య పరంపర యంతయు నేన.

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్
ప్రభవః ప్రలయస్థానం నిధానం బీజమవ్యయమ్॥ ౧౮

"ఈసమస్త చరాచరజగత్తు ఏప్రకృతియందణగియున్నదో, ఆప్రకృతి (మాయ) అలసిపోయినప్పుడు ఎవనియందు విశ్రమించునో అపరమధామము కూడా నేనే. ఎవనివలన ప్రకృతికి జీవము వచ్చుచున్నదో, మరియు ఎవనిని

స్వీకరించుటచే ప్రకృతి యీజగత్తును ప్రసవించుచున్నదో మరియు యీప్రకృతితో సహవాసము చేసి గుణములను అనుభవించునో, ఓఅర్జునా, అయీవిశ్వలక్ష్మీనాథుడనుకూడ నేనే. ఈసమస్త త్రిభువనములకు నేనే శాసకుడను. ఆకాశము అంతటను వ్యాపించియుండుట, వాయువు క్షణకాలముకూడ విశ్రాంతముగా నుండకుండుట, అగ్ని కాల్చుట, నీరు వర్షించుట, పర్వతము అచలముగానుండుట, సముద్రము తనమర్యాదను ఉల్లంఘించకుండుట, భూమి భూతకోటియొక్క బరువును ఓర్చుకొనుట—యివన్నియు నాఆజ్ఞవలననే ఆటుల నొనర్చుచున్నవి. నేనుపలికినప్పుడే వేదములుకూడ పలుకును. నేను నడిపించినప్పుడే సూర్యుడు నడచును. నేను ప్రాణశక్తి నిచ్చుటవలననే ప్రపంచమునంతను నడపు ప్రాణులుకూడ నడచుచున్నవి. నేను ఏర్పరచిన నియమముల ననుసరించియే యముడుకూడ భూతసంహార మొనర్చును. ఎవని ఆజ్ఞవలన యీసమస్తము జరుగుచున్నదో మరియు ఎవడుజగత్తున కంతకు సమర్థుడగు ప్రభువో, అతడుకూడ నేనే. ఆకాశమువలె ఏమియూ చేయక తటస్థముగా నుండువాడనుకూడ నేనే. ఓఅర్జునా, ఎవడు యీసమస్త నామరూపములందును నిండియున్నాడో, ఎవడు యీసమస్తనామ-రూపములకు మూలాధారుడో, ఎట్లు జలతరంగములకు జలమేరీతిని ఆధారమో అదేరీతిని యీసమస్తభూతసృష్టికి ఆధారమో, ఆ ఆధారముకూడ నేనే. ఏకనిష్ఠుడై నన్ను శరణుజొచ్చువాని జనన-మరణములనుకూడా నేనే అంతమొందింతును; అందుచే శరణాగతులకు శరణ్యమైనవాడనుకూడ నేనే. అనేకత్వమును ధరించి ప్రకృతియొక్క భిన్నభిన్న గుణములద్వారా జగత్తునందలి ప్రాణరూపమున కర్మలను నేనే చేయుదును. సూర్యుడెన్నడును యిదిసముద్రము, యిదిమురికిగుంట - యనెడి భేదభావమును పాటించడు. అతడు జలాశయములన్నింటను సమానరూపమున ప్రతిబింబితుడగును. ఇదేరీతిని బ్రహ్మనుండి దోమవరకు గల సమస్తభూతములందును సమానభావము వహించు సఖ్యరూపమున నుండెడివాడనుకూడ నేనే. ఓఅర్జునా, నేనేజగత్తుకు ఆధారము, మరియు దీనిఉత్పత్తి, వినాశము మరియు పునరుత్పత్తులకుకూడ నేనే కారణుడను. బీజమే కొమ్మలనన్నింటిని ఉత్పన్న మొనర్చును, అయినను అవృక్షత్వము తిరిగి ఆబీజమునందే అణగియుండును. ఇదేవిధముగ, యీజగత్తంతయు ఆదిసంకల్పము వలననే ఉత్పన్నమగును, మరియు అంతమున అదేసంకల్పమున

అణగియుండును. ఈవిధముగు అమూర్తమైన నా నిరూపితమగు యీజగత్తుకు బీజమైన సంకల్పము కల్పాంతమున ఎవనియందు అణగియుండునో, అతడు కూడ నేనే. నామరూపములు నశించినప్పుడు వ్యక్తులపరిస్థితి పుడదు, జాతి-వర్గములచెడి భేదభావము నశించును మరియు ఆకారము నుండదు—అప్పటినుంచి (నామరూపములు నశించినప్పటినుంచి) ఆదిసంకల్పవాసన మరల స్ఫురణకు వచ్చునంతవరకు సమస్త చరాచరములన్నిగూడ ఎవనియందు సుఖపూర్వకముగా నుండునో, ఆతడుకూడ నేనే.

తపామ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ।
అమృతం చైవమృ త్యుశ్చ సదసచ్చాహ మర్జున॥ ౧౯

"నేను సూర్యరూపమున తాపమును కలిగించినప్పుడు జలము ఎండి పోవును. మరల నేనే యింద్రరూపమున వర్షించుచున్నాను, అందుచే అంత టను మరల జలపూర్ణమగుచున్నది. అగ్ని కొయ్యను కాల్చునప్పుడు ఆకొయ్యయే అగ్నియగుచున్నది. అదేరీతిని చచ్చెడివారూ మరియు చంపెడి వారూ యిద్దరునూ నా స్వరూపమే యగుదురు. కావున, మృత్యువుమూలమున పడెడివారుకూడ నారూపమే, మరియు అమరులైనవారు స్వాభావికముగ నే నా స్వరూపులుగదా! ఎంతో కష్టమైనము నుపయోగించి నిత్యము చెప్ప వలసిన విషయమును నీకొక్క మాటలో చెప్పెదను వినుము. సత్ మరియు అసత్ అనగా అవినాశి మరియు వినాశియగు అన్నియూ నేనే. కాన ఓ అర్జునా, నేనులేని తావేలేదు. కాని ప్రాణుల దౌర్భాగ్యవశమున వారికి నేను కనిపించనే కనిపించుటలేదు. నీరు లేదని చెప్పి తరంగములు యింకి పోవునా? లేదా దీపము లేదని సూర్యకిరణములు గ్రుడ్డివై పోవునా? ఇదెంత ఆశ్చర్యకరము! ఇదేరీతిని యీలోకులు మద్రూపులైయుండికూడ 'నేనులేనని' భ్రమకలిగియుండుట ఆశ్చర్యకర విషయమే! ఈజగత్తుకంతికూను లోపలను బయటను నేను వ్యాపించి యున్నాను మరియు యీజగత్తయు నా రూపమే; కాని, యీ దురదృష్టవంతుల దౌర్భాగ్యము 'నేనులేనని' వారిచే చెప్పించుచున్నది. ఈమాట సరిగా, ఒకడు అమృతపు సూతియందు పడెను, అప్పుడాతడు తనను తానే దానినుంచి బయటకుతీసి ఒడ్డున కూర్చొనబెట్టు కొనవలెనని భావించినటు లున్నది. లోకులకు గల యీ విధమగు దురదృష్ట

మున కేమి చేయగలదు? ఓ అర్జునా, గ్రుడ్డివాడు ఒకప్పుడు అన్నము కై అంతటను తిరిగి తన గ్రుడ్డితనము వలన తన కాలికి తగిలిన చింతామణినికూడ కాలదన్నుకొనువటుల, జ్ఞానములేని జీవులకుకూడ యీ గ్రుడ్డివానికి పట్టిన గతియే పట్టును. కావునను, మానవులకు జ్ఞానములేనందు వలన చేయవలసిన కార్యములు చేయుటలేదు. గ్రుడ్డి గరుత్మంతునికికూడ రెక్కలుండును. కాని వాటి వలన ఆతనికి కలుగు ప్రయోజనమేమి? ఇదేరీతిని జ్ఞానములేనిదే సత్కర్మ ప్రయాస వ్యర్థమగును.

త్రైవిద్యామాం సోమపాః పూతపాపా।
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే।
తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోక।
మశ్నన్తి దివ్యాన్ దివిదేవభోగాన్॥ ౨౦

"ఓ అర్జునా, ఎవరు ఆశ్రమ ధర్మానుసారము తాము సదాచారమనెడి మచ్చురాయి యగుదురో, ఎవరి యజ్ఞక్రియనుచూచి మూడు వేదములును సంతోషముచే తలలూపునో, ఎవరిముందు యజ్ఞక్రియాఫలము మూర్తిమంతమై నిలచియుండునో, అట్టి సోమపానమొనర్చెడి యజ్ఞకర్తలు తాము స్వయముగ యజ్ఞరూపుడనైన నాకుకూడ, వారు పుణ్యమనెడిపేర పాపసంచయమే చేసిరని తెలిసికొనుము: ఏలనన, వారు మూడువేదములను పఠించి మరియు వందలకొలది యజ్ఞములనొనర్చి యీ యజ్ఞములన్నియు ఎవనిని చేరునో అట్టి నన్ను మరచిపోదురు; మరియు నన్ను మరచి వారు స్వర్గమును స్వీకరించుచున్నారు. దురదృష్టవంతుడగు పురుషుడు కల్పవృక్షము క్రింద కూర్చుని యుండి ఆసమయమున తనజోలెను మూసియుంచుకొని, ఆ పిమ్మట భిక్ష మెత్తుకొనుటకు గుమ్మము-గుమ్మము తిరిగినటుల, వీరుకూడ వందలకొలది యజ్ఞములద్వారా నన్నే ఉపాసించి అంతిమున స్వర్గసుఖమును వాంఛింతురు; ఇట్టిస్థితిలో వీరికర్మలు వాస్తవముగ పుణ్యములేవనీ, పాపములుకావనీ యనుటకు తావెక్కడగలదు? కావున, నన్ను విడచి స్వర్గసంగ్రహమొనర్చుట అజ్ఞానముతోకూడియున్న పుణ్యమార్గము; జ్ఞానులు దీనిని కేవలము ఉపద్రవముగా అనగా హానికరముగా తలతురు. నిజముచెప్పవలెననిన, నరకదుఃఖము

లను చూచి లోకులు స్వర్గమును సుఖవంతమైనదిగ భావింతురు. వాస్తవమునకు కేవలము నాస్వరూపమొక్కటియే దోషరహితమూ మరియు అవినాశియగు సుఖముగలదిన్నీ అయియున్నది. ఓసీ శ్రేష్ఠుడవగు అర్జునా, నన్ను చేరుటకు గల వంకరటింకరయైనట్టిన్నీ, బాధాకరమైనట్టిదిన్నీ యగు రెండుమార్గములును ఇవియే. స్వర్గనరకములు దొంగలమార్గములు. ఇందలి నియమమేదనగా, పుణ్యమిశ్రితమగు పాపమువలన లోకులు స్వర్గమును పొందెదరు, శుద్ధపాపమొనర్చుటచే నరకమునకు పోయెదరు. మరియు శుద్ధము, నిర్దోషమునగు పుణ్యమునొనర్చి నన్ను పొందెదరు. ఓఅర్జునా, నాయందుంటూ కూడా ఏకర్మవలన నన్ను లోకులు పొందజాలకున్నారో అట్టికర్మను పుణ్యమని చెప్పెడి నాలుకకు వందలు వేలు ముక్కలు కాదా! యీరీతిని యీయాజ్ఞకర్తలు యజ్ఞముద్వారా నన్ను ఉపాసించి స్వర్గభోగములను యాచింతురు. వారు తమపాపరూపమునగల పుణ్యసామర్థ్యముచే స్వర్గలోకమును పొందెదరు; అట్టివారు నన్నెన్నడును చేరరు. ఆస్వర్గమందొక అమర్త్యమే సింహాసనము. అచ్చట కూర్చొనుటకు ఐరావతము, మరియు నివసించుటకు రాజధానియగు అమరావతియు గలవు. అచ్చట మహాసిద్ధుల సంగ్రహము, అమృతభాండారము మరియు కామధేనుసమూహము గలవు. అచ్చట సేవచేయుటకు ఎల్లప్పుడు దేవతలు సిద్ధముగానుందురు, నేలపైని చింతామణిచే గచ్చుచేయబడియుండును, క్రీడించుటకు నలువైపుల కల్పతరువులుగల ఉద్యానవనములు గలవు. అచ్చట గంధర్వులు గానమొనర్తురు, రంభవంటి అప్సరలు నాట్యమొనర్తురు, మరియు ఊర్వశి మొదలుగాగల విలాసస్త్రీలు లభింతురు. అచ్చట, పడకగదియందు స్వయముగ మదనుడే సేవచేయుచుండును, చంద్రుడు ముంగిలియందు నీరుచల్లును మరియు వాయువువంటి నౌకరులు ఎడతెగకుండా యిటునటు పరుగులిడుచు సమస్తకార్యములు చేయుచుందురు. అచ్చట స్వస్తి-వచనములు చెప్పెడి బ్రాహ్మణులలో బృహస్పతి ముఖ్యుడు, మరియు భట్టులవలె పొగడుటకు కావలసినంతమంది దేవతలు లభింతురు. అచ్చట సరదారులవలె పంక్తులుదీర్చి నిలబడియుండు లోకపాలురుందురు. మరియు ఉచ్చైఃశ్రవమువంటి గుఱ్ఱముండును. తనజోలెయందు పుణ్యము వున్నంతవరకు ఇంద్ర-సుఖముతో సమానమగు యీవిధమగు పెక్కుసుఖములను వారనుభవింతురనుటయే యిందలి తాత్పర్యము.

తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకంవిశన్తి
ఏవంత్రయీధర్మమను ప్రపన్నా
గతాగతం కామ కామాలభన్తే॥ ౨౧

"వారు ఆర్జించిన పుణ్యము క్షీణించగానే తిరిగి యీ మృత్యులోకమునకు వత్తురు. వ్యసనుడగు పురుషుడు వేశ్యాలోలుడై తన ఆస్తినంతను పోగొట్టుకొని దరిద్రుడై వచ్చినచో ఆ వేశ్య ఆమె గుమ్మము కడకు పోవుటకు అసంభవమగు వలెనే సంపాదించిన పుణ్యము సమాప్తము అయిన పిమ్మట ఆ యజ్ఞకర్తలు పొందు లజ్జాస్పదమగు స్థితిని నేనేమని వర్ణింతును! ఈ రీతిని నా శాశ్వత ఆత్మను స్మరించక తమ పుణ్యశక్తి ప్రభావముచే స్వర్గభోగములు పొందు వారికి వాస్తవికముగను అమరత్వము లభించదు. మరియు అంతమున వారు తిరిగి యీ మృత్యులోకమునకే రావలసి వచ్చుచున్నది. వారు తల్లియొక్క గర్భాశయపు మురికిలో నవమాసములవరకు వుండి మాటిమాటికి పుట్టుచూ చచ్చుచూ వుందురు. స్వప్నమున అపారమగు ధనసంపదను చూతుము, కాని మెలకువ రాగానే ఆ ధన సంపద యంతయు కనిపించకుండ పోవును. సరిగా యిదేవిధముగ, వేదజ్ఞులకు లభించు స్వర్గసుఖముకూడ మిథ్యయేయని యెరుంగుము. ఓ అర్జునా, ధాన్యపు గింజలు ఏరుకొనిన పిమ్మట మిగిలెడి పొల్లును తూర్పార బట్టుట వ్యర్థముగా నిష్ప్రయోజనము. అదేరీతిని ఒకడు వేదవేత్త అయిన అగుగాక, అతనికి నా శాశ్వత స్వరూప జ్ఞానము కలుగకున్నచో అతని జీవిత మంతయు వ్యర్థమైనదిగనే ఎరుంగుము. కావున, నాజ్ఞానము కలుగకున్నచో వేదోక్తధర్మము లన్నియు నిరుపయోగములే యగును. కాని, నీకు నా స్వరూప జ్ఞానము కలిగి ఆ పిమ్మట మరేవిధమగు జ్ఞానము లేకున్నను నీవు సుఖవంతుడవే యగుదువు.

అనన్యాశ్చిన్తయన్తో మాం యేజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥ ౨౨

"ఎవరు సంపూర్ణమగు మనోయోగపూర్వకముగ తమనుతాను నాకు అర్పణమొనర్చెదరో, గర్భాశయమందలి పిండము మరేయితరకార్యమును

ఏమరుగనిరీతిని ఎవడు నన్ను తప్ప మరెవరిని తలంచడో, ఎవనికి సమస్తజీవిత జ్ఞానము నా నామరూపములందే యుండునో మరియు ఎవడేరీతిని ఏకనిష్ఠుడై నన్నే తలంచుచూ నన్నే ఉపాసించుచుండునో—అట్టివానిని గురించి నేను కూడ అదేవిధముగ శ్రద్ధగలిగియుండును. అతడు పూర్ణమనోయోగపూర్వకముగ ఏకీకరణ మొనర్చి నా ఉపాసనామార్గము నెప్పుడు అంగీకరించెనో, అప్పుడే అతనిని సమస్తవిధముల సువ్యవస్థితు నొనర్చు భారమంతయు నాపై పడును. అప్పుడు అతడు చేయవలసిన కర్మములెల్లను అతనికిగాను నేను చేయవలసివచ్చును. రెక్కలు రానంతవరకు తనబిడ్డలు జీవించుటకు తీసికొనవలసిన జాగ్రత్తనంతను తల్లిపక్షియే గైకొనును. దానికి తన ఆకలి-దప్పులు గురించిన చింతయేయుండదు. అదెల్లప్పుడును కేవలము తనబిడ్డలకు హితకరమగు పనులనే చేయును. ఇదేరీతిని, అన్నివిధముల నాపైవిశ్వాసముంచి నన్నే ఉపాసించువారి యోగక్షేమములను నేనేచూచుచుందును. వారికి నాతో ఏకరూపులై మోక్షముపొందవలెననెడి అభిలాషయున్నచో వారి ఆ వాంఛను నేనే నెరవేర్చెదను; లేదా, వారికి నన్ను సేవించవలెననెడి వాంఛకలుగుచో నేను వారికి ప్రేమదానము నిత్తును. ఈరీతిగా వారు తమ మనస్సునం దేమేమి కావలెనని కోరుకొందురో వాటినన్నిటిని నేను వారికి యిచ్చుచుందును. ఈవిధముగా వారికి నేనిచ్చువస్తువుల యోగక్షేమభారముకూడ నాపైననే యున్నది. వారి యోగక్షేమములను నేనే చూచుచుందును, ఏలనన వారు అన్నింటను నాపైననే ఆధారపడియున్నారు గదా!

యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః
తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్॥ 23

"ఇదిగాక యింకను పెక్కుసాంప్రదాయములు గలవు, కాని వాటి అనుయాయులు నా సర్వవ్యాపక రూపము నెరుంగరు. వారు అగ్ని, ఇంద్రుడు, సూర్యుడు మరియు సోముని ఉద్దేశించి యజ్ఞమొనర్తురు. ఆ యజ్ఞములుకూడ నాకే చెందును. ఏలనన, యీ విశ్వమంతయు నేనేగదా! కాని యీ ఉపాసనా విధానము భిన్నమైనది కాకపోగా వక్రమైనదై యున్నది. చూడుము. చెట్టుయొక్క కొమ్మలు, ఆకులు మొదలగునవన్నియూ ఒకేబీజము నుండి ఉత్పన్నమగుచున్నవి, కాని వీటి అన్నిటికి ఒక్క వృక్షమూలమే

జలగ్రహణ మొనర్చుచున్నది. కావున ఆ వృక్షమూలమునకే నీరు పోయుట ఉచితము. లేదా మనుష్యశరీరమున పది యింద్రియములు గలవు. ఇవన్నియు ఒకే శరీరమునందుండును, మరియు ఆ యింద్రియములు సేవించు విషయము లన్నియు అంతమున ఒకే స్థానమునకు పోవును. అయినప్పటికి ఎవడైన ఖాద్య పదార్థమును తెచ్చి చెవిలో పడవేయునా? లేదా పుష్పము తెచ్చి కంటికి కట్టి నందువలన ఏమైన ప్రయోజనముండునా? వుండదు. ఆహారమును నోటి యందుంచవలెను, సువాసనను ముక్కుతో అనుభవించవలెను. ఇదేవిధమున నా వాస్తవిక స్వరూపమును అర్థముచేసికొనియే నన్ను పాసించవలెను. నాఆత్మ స్వరూపమును తెలసికొనకుండా నన్ను భజించుట వ్యర్థముగ చేసిన పనివలె నిష్ఫలమగును. కర్మలొనర్చుటకు జ్ఞానదృష్టి కావలెను. మరియు ఆ దృష్టి స్వచ్ఛముగను మరియు నిర్మలముగను నుండుట కూడ ఆవశ్యకము.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ
న తు మా మభిజానన్తి తత్త్వేనా ఽతశ్చ్యవన్తి తే॥ ౨౪

"ఓ అర్జునా, వాస్తవముగ చూచినచో, యీ యజ్ఞముల నన్నిటిని భుజించువాడు నేనుగాక మరెవరు గలరు? నేనే సమస్త యాగములకు మూలమును మరియు నేనే యజ్ఞముల అంతిమ మర్యాదను. కాని యీ యాజ్ఞికులకు యీ విషయజ్ఞానము లేదు, అందుచే వారు అన్యదేవతా భజన మొనర్తురు. దేవతలు, పితరుల పేరట గంగయందుగల నీరు గంగయందే అర్పించురీతిని, యజ్ఞాది విధి - విధానముల ద్వారా వారు కూడ నా వస్తువును నాకే అర్పించుచున్నారు; కాని అర్పణ - విధిమాత్రము అన్యదేవతల నుద్దేశించి చేయుచున్నారు. కావ ఓ అర్జునా, వారు యీ విధి - విధానముల ద్వారా నా వద్దకు వచ్చిచేరుటలేదు; కాని యీ యాజ్ఞికులు ఏ దేవతల నుద్దేశించి యీ సమస్త కర్మల నొనర్చుచున్నారో ఆ ఉపాస్య దేవతలనే వారు పొందుచున్నారు.

యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినో ఽపిమామ్॥ ౨౫

"తమ మనస్సు, వాక్కు మరియు యింద్రియములను ఇంద్రాదిదేవతా భజనమున లగ్నమొనర్చువారు శరీరపాతము కాగానే ఆ దేవతారూపమును పొందుదురు లేదా, ఎవరిమనస్సుపితృవ్రతాచరణమున సంలగ్నమైయుండునో, వారు మరణానంతము పితృస్వరూపులగుదురు. ఎవరికి భేతాళుడు, పిశాచములు మరియు హీనగ్రామ్య దేవతలు అన్నింటికంటె శ్రేష్ఠముగ తోచునో మరియు జారణ, మారణాది మంత్రములకై ఎవరు వారిని ఉపాసించుటకు అంగీకరింతురో అట్టివారికిగల శరీరమనెడి తెరను మృత్యువు తొలగించగనే వారు వెంటనే భూత - యోనిని పొందుదురు ఈరీతిని అందరూ తమతమ సంకల్పానుసారము ఆయాకర్మ ఫలములను పొందుదురు. కాని ఎవరి కనులు నన్ను దర్శించినవో, ఎవరి చెవులు నన్ను విన్నవో, ఎవరి మనస్సు నన్ను ధ్యానించెనో, ఎవరివాక్కు నాకీర్తిని గానమొనర్చినదో, ఎవరు తమ అవయవములన్నిటితోను అన్ని తావులందును నన్నే ఉద్దేశించి నమస్కరింతురో ఎవరు తాము చేయు దాన - పుణ్యాదులన్నియు నా ప్రీతికొరకై చేయుదురో, ఎవరు నన్నే అధ్యయనమొనర్చిరో, ఎవరు బాహ్యాభ్యంతరములందంతటను మద్రూపులై సంతుష్టులై యుందురో, ఎవరు తమ జీవితమునంతను నాకే అర్పింతురో, ఎవరు కేవలము హరి - భక్తులచిహ్నములను ధరించుటకు మాత్రమే అహంభావమును స్వీకరింతురో, ఎవరికి నన్నుగురించిన లోభమేవుండెనో, ఎవరు నన్ను పొందవలెననెడి వాంఛచే మాత్రమే సకాములై యుందురో, ఎవరు నన్ను ప్రేమించుటయందు మాత్రమే వ్యాకులురై యుందురో, నా సర్వవ్యాపక స్వరూపముచే నిండియుండుట వలన ఎవరికి లౌకికభావము వుండనేవుండదో, ఎవరు తాము శాస్త్రమంత్ర తంత్రాదులన్నింటిని నాప్రీత్యర్థమై చేయుదురో, అనగా సమస్త కార్యములందును ఎవరు నన్నుభజించుచుందురో, అట్టివారు మృత్యువుకు పూర్వమే నా సత్య - శుద్ధ - బుద్ధ స్వరూపమును పొందుదురు. ఇక మరణానంతరము మాత్రము వారు మరెచ్చటకు పోదురు! కాన తమ సమస్త వ్యవహారములను స్వయముగనే నా స్వరూపముం దర్పించువారు నాయొక్క యాజ్ఞిక లేక ఉపాసక స్వరూపమునే పొందుదురు. ఓ అర్జునా, ఆత్మ స్వరూపానుభవము కానిదే నేనెవరికీ ఎన్నడును ప్రియుడను కాను. నేను మరే ఉపాయమునను ఎవనికిని సాధ్యుడను కానేరను; ఈ విషయములందు తన జ్ఞానమునుగురించి

గర్వించువానిని అజ్ఞానిగా నెఱుంగుము. తన గొప్పతనమును ప్రదర్శించు వాతనియందు ఏదో లోపము మరియు అపరిపక్వతయు గలదని యెఱుంగుము. అభిమాన పూర్వకముగ 'నేను పరిపూర్ణుడనైతిన'ని చెప్పు వాతనియందు ఏమాత్రము మహాత్మ్యము లేదని యెఱుంగుము. ఇదేవిధముగ, ఓ అర్జునా ఎవరు తమ యజ్ఞ యాగాదులనుగురించిగాని తపస్సును గురించిగాని ప్రగల్భములు చెప్పుకొందురో వారి యీ సమస్తకర్మలు గడ్డిపోచమాత్రపు ఉపయోగము కూడ లేనివని యెఱుంగుము. జ్ఞానసామర్థ్యమును నిలుపుటలో వేదములను మించి ఎక్కువ సామర్థ్యముగలది మరేదైన గలదేమో నీవే చెప్పుము! లేదా వక్తృత్వ - శక్తియందు సహస్ర వదనుడగు శేషనాగును మించిన వాగ్బలముగలవాడెవడు? కాని అట్టి శేషుడుకూడ నా శయ్యక్రింద అణగి యున్నాడు. మరియు వేదములుకూడ నా స్వరూపమును వున్నది వున్నట్లుగా వర్ణించుటకు గాబరాపడి 'నేతి నేతి' యనిచెప్పి వైదొలగును. ఈ విషయమున సనకాది జ్ఞానులుకూడ ఉన్మాదులు మరియు స్తంభితులునైరి. తపస్సును గురించి యోచించుచో శూలపాణియగు శంకరునితో సమానముగ కఠోర తపమొనర్చిన వాడెవడు గలడు! కాని అట్టి తాపసశ్రేష్ఠుడగు శంకరుడుకూడ తనకుగల అభిమానము నంతయు విడనాడి నా పాద - తీర్థమును తన మస్తకముపై ధరించుచున్నాడు. సంపదలో లక్ష్మికి సాటివచ్చు వాడెవడు! ఆ లక్ష్మి యింటియందు శ్రీదేవివంటి దాసీలు పనిచేయుదురు. ఆ లక్ష్మీదేవి ఆడుకొనునప్పుడు ఆటబొమ్మగా తయారుచేసిన గృహమే లోకులచే అమరపురియని పిలువబడుచున్నది. ఇట్టిస్థితిలో ఇంద్రుడు మొదలుగాగల దేవాధిపతులు లక్ష్మీదేవి ఆటబొమ్మలు కారా! ఆమె ఆటలో విసుగెత్తి ఆ ఆటబొమ్మను విరుగగొట్టుచో యీ మహేంద్రాదులందరు దీనులగుదురు. ఆమెవద్ద పనిచేయు దాసీలు ఏ వృక్షములను చూతురో ఆ వృక్షములన్నియు కల్పవృక్షములగును. తనయింటియందు పనిచేయు పరిచారికలందే యింత మహిమ యున్నప్పుడు యజమానురాలగు ఆమెయందెంత మహిమ యుండునో యోచించుము. అట్టి అలౌకిక సామర్థ్యముగల ఆ లక్ష్మీదేవి నారాయణునిముందు సామాన్యురాలు. కాన ఓ అర్జునా, ఆ లక్ష్మీదేవి మనస్ఫూర్తిగ నన్ను సేవించుచున్నది. మరియు ఆమె తనకుగల అభిమానము నంతయు విడిచి నారాయణుని పాదపద్మములను కడిగెడి

సౌభాగ్యమును పొందినది. కావున మొట్టమొదట తన గొప్పతనమును గురించిన ఆలోచనలనంతను విడచిపెట్టవలెను. జ్ఞానసంబంధమగు తన అభిమానమును పరిత్యజించవలెను మరియు 'నేను జగత్తునందలి జీవములన్నింటికంటె అల్పుడను' అనెడి సద్భావనను మనము నందుంచుకొని వినయవంతుడు కావలెను. అప్పుడు మానవుడు నా స్వరూపమువద్దకు వెళ్ళి నన్ను చేరగలడు. సహస్రకరుడగు సూర్యుని దృష్టియందు చంద్రుడుకూడ పాలిపోవును. అట్టిస్థితిలో మిణుగురు పురుగు తన తేజోప్రౌఢిమను గురించి ప్రగల్భము లేల పలుకనేల! కాన, లక్ష్మియొక్క మహత్త్వమూ, శంకరుని తపస్సుకూడ అత్యల్పమైన కావున మూఢులు, దుర్బలులునగు సామాన్య మానవులనుగురించి అడుగనేల! కావున శరీరాభిమానమును విడచివేయవలెను. సమస్త సద్గుణ ప్రతిష్ఠను దిగదుడిచి పారవేయవలెను. మరియు సంపదయనెడి మదమును త్యాగమొనర్చి దానిని అంతమొందించి వేయవలెను.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥ ౨౬

"ఇట్టి భక్తుడెప్పుడును అపార ప్రేమ రసపూర్ణుడై ఏ చెట్టు పండును నా కర్పించుటకై చేతబుచ్చుకొని నావైపుకు రాసాగునో, అప్పుడు ఆ పండును గైకొనుటకై ఆ తడా పండు తొడిమను త్రుంచునంతవరకు కూడ ఆగక నా చేతులను జాపి అత్యధిక ప్రేమతో వున్నది వున్నట్లుగా ఆ ఫలమును ఆరగించెదను. ఓ అర్జునా, నా భక్తుడెవడైన భక్తి పూర్వకముగ నా కొక పుష్ప మిచ్చునో దానిని నేను వాసన చూడవలెను; కాని ఆ సమయమున నేను నా భక్తుని ప్రేమచే అత్యధికముగ నిండియుండుటచే ఆ పుష్పమును కూడ నేను నోటియందిడుకొని భుజింతును అంతేగాదు, నా భక్తుడెవడైన నాకొక ఆకును అర్పించునో, నేనా ఆకు మంచిదా లేక కుళ్ళిపోయినదా లేక ఎండిపోయినదాయని కూడ చూడను. నేను చూచునది కేవలము అది ప్రేమరస పూరితముగా నుండుటయే; అట్టి ఆకును కూడ ఆకలిగొన్న మనుష్యుడు తొందరలో అమృతమును త్రాగి తృప్తుడగురీతిని నేను సుఖముగా తిని బలిష్ఠుడ నగుదును. లేదా ఒకొక్కప్పుడు దొచ్చుటకైన ఆకు కూడా లభించకపోవచ్చును. కాని, నీటికి కొదువయుండదు

గదా! అది విలువలేకుండా అంతటను లభించును. అట్టి ఉచితముగా
లభించిన నీటినే నా భక్తుడు తన సర్వస్వముగ భావించి నాకు అర్పించును;
అతని యీ అల్ప సమర్పణమే నాకు ఆ భక్తుడు వైకుంఠము కంటె కూడ
శ్రేష్ఠమగు నివాసస్థానమును కట్టించినటులను, లేదా కౌస్తుభము కంటె
శ్రేష్ఠమైన నిర్మల ప్రకాశవంతమగు నగను నాకు అలంకరించి
నటులను, లేదా క్షీరసాగరము కంటెను యెక్కువ సుఖదాయక
మగు పాలచే నిర్మింపబడిన అసంఖ్యాకములగు నవీన శయన - స్థలము
లను నాకై నిర్మింపించినటులను, లేదా కర్పూరము, చందనము మరియు
కృష్ణాగరు - యీ మూడు వస్తువులతోను కూడిన సుగంధమయమగు
అత్యున్నతమగు మేరుపర్వతమును నేను అనుభవించుటకై ఉత్పన్న
మొనర్చినటులను, లేదా నా దీప - మాలలో మరొక సూర్యుని తెచ్చి
నిలపినటులను, లేదా గరుడునివంటి వాహనమును లేదా ప్రత్యక్షముగ
కల్పవృక్షముల తోటను, లేదా కామధేను సమూహమును నాకు అర్పించి
నటులను, లేదా అమృతము కంటె రుచికరమగు నానా విధములగు దివ్య
పక్వాన్నములు నాకు సమర్పించినటులను నేను భావింతును. నా భక్తుడు
నాకొక నీటిబిందువును అర్పించినంతనే నాకింత అపారమగు సంతోషము,
ఆనందము కలుగును ఓ అర్జునా, భక్తి పూర్వకముగ కుచేలుడు తెచ్చిన
మూడు గుప్పెడుల అటుకుల కొరకై అతని చినిగిపోయిన పైబట్టలో కట్టబడిన
మూటను నేను స్వయముగా విప్పుటను నీ వెరిగినదే. నేను కేవలము భక్తినే
చూతును. భక్తి యున్నచోట కొద్ది - గొప్పయను భేదభావమును నేనెన్న
డును పాటించను. ఏదైన కానిమ్ము, ఎవడైన కానిమ్ము. నాకేవిధముగనైన
ఆతిథ్యమివ్వనిమ్ము - అతనియందు నిజమగు భక్తిభావము కనిపించుచో
నేను వెంటనే ప్రేమ పూర్వకముగ దానిని స్వీకరింతును. నిజము చెప్పవలె
ననిన, పత్రము, పుష్పము, ఫలము మొదలగు సామాన్య వస్తువులు భక్తిని
వెలిబుచ్చు సాధనములు మాత్రమే. వాస్తవమునకు నాకే నిమిత్తములు
మరియు సాధనలతో ఏ విధమగు సంబంధమూ లేదు. నాకు కావలసినది
భక్తితత్త్వ మొక్కటే. కాన ఓ అర్జునా, ఈ యోగమును సాధించుటకు
సహజమగు ఒక ఉపాయమును నీకు చెప్పెదను వినుము. నీవు భక్తితత్త్వ

సాధన మొనర్చదలచుచో నీ మనస్సున నన్నెన్నడును విస్మృతుడను కానివ్వకుము - ఎల్లప్పుడు నన్ను స్మరణమందుంచుకొనుము.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ ! తత్కురుష్వ మదర్పణమ్ ॥ ౨౭

“నీవు ఏ కర్మను చేతువో, ఏ విషయములను భోగింతువో, ఏ యజ్ఞ సంపాదన మొనర్తువో, ఏ దాన మొనర్తువో లేదా నౌకరులను నిర్వహించుటకై ఏ ఏర్పాటు చేతువో, లేదా తపస్సు వ్రతములు మొదలుగాగలవి ఏవి ఆచరింతువో - అనగా నీ చేతులతో ఏ ఏ పనులు జరుగుచుండునో వాటి నన్నిటిని అప్పటప్పట నన్నుద్దేశించి సమర్పించుచుండుము. కాని; యిటుల చేయునప్పుడు లేశమాత్రమైన అహంకార ముండరాదు. ఈరీతిని అహంకార దోషమును కడిగివేయవలెను మరియు సమస్త కర్మలను అహంకారదోషము లేకుండా నిర్మలముగ నుంచి నాకు అర్పించవలెను.

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।
సన్న్యాస యోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥ ౨౮

“అగ్నికుండమున వేగిన గింజ మొక్కగా మొలవనిరీతిని నాకు అర్పించబడిన కర్మలకు కూడ ఏ విధమగు ఫలమును వుండదు. అనగా, నాకు అర్పింపబడిన కర్మఫలబంధమున కర్త యెన్నడును పడడు — అట్టి కర్మలు అతని కెన్నడును బాధకములు గానేరవు. ఓ అర్జునా, కర్మలు అవశిష్టముగా నున్నప్పుడే వాటికి ఫలములు కూడ కలుగును అట్టి ఫలమును అనుభవించుటకై జీవుడు ఏదేనొక శరీరమును ఆశ్రయించవలెను. కాని, ఆ సమస్త కర్మలు పూర్తిగా నాకు అర్పించుటచే, వెంటనే జనన-మరణములకు ఆధారమంతయు నశించిపోవును. ఓ అర్జునా, ‘నేడేమి తొందర ! రేపు చూచుకొనవచ్చును’ అని నేటి పనిని రేపటికి వాయిదావేయదగిన సమయము కాదు. కావున, ఆత్మ-స్వరూపమును పొందుటకు అన్నిటికంటె సులభమగు సహజోపాయము ఫల-సన్న్యాసముతో కూడిన కర్మ-యోగమే. మరియు దానినే నీకు ఉపదేశించితిని. నీవు యీ శరీర బంధమునందుండకుము మరియు సుఖ-దుఃఖములనెడి సముద్రమున మోసపోకుము. మరియు సహజముగనే

యీ సుగమ మార్గమున నడచి ప్రసన్నతాపూర్వకముగ నా ఆనందమయ స్వరూపమున ఐక్యము నొందియుందురు.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥ 29

"'నేనటుల ఏరీతిని వుంటినని' నీవు ప్రశ్నించవచ్చును; నేను సమస్త భూతములందును సమభావమున నుందును. నాయందు స్వపరభేద భావము తిల మాత్రముకూడ లేదు. ఏ జీవులు నా శాశ్వత సత్యస్వరూపమును ఎరుంగుదురో, అహంకారము పేరునకుకూడ లేకుండా నాకె మొనర్తురో, సమస్త భావములు మరియు కర్మలద్వారా నన్నే భజింతురో, అనగా తన జీవితమును మరియు తాను చేయు సమస్తకర్మలను నాకు అర్పింతురో అట్టివారు శరీరమందున్నప్పటికిని వారు వాస్తవమునకు శరీరమందుండరు. మరియు వారు పూర్ణరూపమున నా స్వరూపమందే వుందురు. మరియు నేనుకూడ వారియందే వసింతును. ఇంత పెద్దదగు వటవృక్షము తన సంపూర్ణవ్యాపకత్వముతో ఒక చిన్నగింజయందు లీనమైయుండును, మరియు ఆ బీజము ఆ వటవృక్షమునందే వుంటున్నది. ఇదేరీతిని నాయందును మరియు నా భక్తులయందును కేవలము బాహ్యమునగల నామమాత్రపు భేదమేవుండును. కాని లోపలివస్తుస్థితిని గురించి యోచించినచో 'నేనే వస్తువునో' నా భక్తుడు కూడ అదేవస్తువు మరియు మా యిద్దరియందును ఏ భేదమూ వుండదు. ఎవరి వద్దనుంచియైన ఏదైన నగ ఎరువు తెచ్చుకొని దానిని తాముధరించినప్పటికిని ఎవరును ఆ వస్తువు 'తనది' యని భావించరో, అదేరీతిని నా భక్తులు దేహధారణ మొనర్తురు; కాని వారు దానినెన్నడును తనదిగా తలంచరు. పువ్వు [illegible] సువాసన గాలితో కలసి ముందుకు పోవును, మరియు వెనుకనున్న పువ్వు వాడి క్రిందపడిపోవునంతవరకు తొడిమను అంటిపెట్టుకొని యుండును. ఇదేరీతిని ఆ భక్తుడు కూడ తన మనస్సున 'తనది'యనెడి భావము పోయినవాడై అంత్యకాలము వరకు ఏదోవిధమున ఆయువును వహించియుండును. ఓ అర్జునా, తన కర్తృత్వాభిమానమును నాపై ఆరోపించువాని అభిమానము నాకే చెందును; మరియు ఆ అభిమానము నా భక్తునకు ఏ విధముగను బాధాకరము గానేరదు.

అపిచేత్సు దురాచారో భజతే మామనన్యభాక్।
సాధురేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః॥ 30

"ఎవరికైతిని నిర్మలప్రేమభావముతో నన్ను భజింతురో వారిని శరీరము ఏ విధముగను బాధించదు, వారు ఏ జాతికి చెందినవారైనప్పటికిని ఏ విధమగు బాధయూలేదు. ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా, ఆచరణనుబట్టి అతడు దురాచారుడు అయినప్పటికిని అతడు జీవితాంతమున శరీర పాతమగునప్పుడు భక్తియనెడి అరుగుపైన యొక్క యున్న వాడగునను విషయమును ఎన్నడును మరువకుము. అంత్యసమయమున వుండెడి బుద్ధి ననుసరించియే ముందుగతి యొక్క స్వరూపము కూడ నిశ్చితమగును. కావున అంత్యసమయమున తన జీవితమును భక్తియొక్క చేతికి నప్పగించెడివాడు అంతకుపూర్వము దురాచారుడు అయినప్పటికిని అతడిప్పుడు భక్తియనెడి పావనసామర్థ్యమువలన సర్వశ్రేష్ఠుడుగా గణింపబడవలెను. ఎవడైన మనుష్యుడొకడు ఒకమారొక గొప్ప వరదలో మునిగిపోయి దానినుండి ఏదోవిధమున తప్పించుకొని బయటకు వచ్చినప్పుడు అంతకుముందు జరిగిన మునుగుట యనునది నిరర్థకమైనటుల, అంత్యసమయమున మానవుడు భక్తిగలవాడైనచో అంతకుపూర్వము అతడాచరించిన పాపములన్నియు తుడిచిపెట్టుకొని పోవును. కావున ఎవడైన పురుషుడొకప్పుడు దురాచారియే యగుగాక అతడు పశ్చాత్తాపమనెడి తీర్థమున చక్కగా స్నానమొనర్చి శుద్ధహృదయముతో నా స్వరూపమున ప్రవిష్టుడగుచో అతడు పూర్తిగా పవిత్రుడనియే ఎంచవలెను; మరియు అతని కులీనత పూర్తిగా నిర్దోషమైనదీ మరియు అతడు నిజముగా తన జీవితమును సార్థకమొనర్చుకొనెననీ అంగీకరించవలెను. అతడు విద్య తపస్సు మరియు అష్టాంగ యోగాదులన్నిటిని ఆర్జించినటుల యగును. ఓ అర్జునా, ఇక దీనిని గురించి విశేషించి విస్తరించ నక్కరలేదు. ఇందలి భావము, ఎవనిమనస్సున నాయెడ అఖండానురాగ ముత్పన్నమగునో అతడు పరిపూర్ణముగ సమస్త కర్మలను దాటినవాడగునని చెప్పుటయే. ఎవడు తన మనస్సు మరియు బుద్ధిచే చేయు సమస్తకర్మలను ఏకనిష్ఠయనెడి పెట్టెలో నింపిపెట్టి ఆపెట్టెను పూర్తిగా నా అధీన మొనర్చునో, అతడు యీ విధముగ కర్మాతీతుడగును,

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి।
కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥ ౩౧

"నా భక్తుడు కొంతకాలమైన తరువాత అనగా మరణించిన తరువాత నా సమానుడగుననెడి భావము నీ మనస్సున కలిగియుండవచ్చును. అప్పుడు నిన్నడుగునదిదియే - ఏమన - అమృతమునందే తాను నివసించువానికి మరణ మెటుల కలుగును? సూర్యుడు ఆకాశమున ఉదయించియుండని సమయము రాత్రి యుండును. ఇదేరీతిని నా భక్తిలేకుండా చేయు కర్మలన్నియు మహా పాపములని చెప్పవలదా? కాని, ఓ అర్జునా, ఎప్పుడాతని చిత్తవృత్తి నావద్దకు వచ్చునో, అప్పుడే అతడు పూర్తిగా నా స్వరూపమును పొందును. ఒక మండుచున్న దీపముచే మరొక దీపమును వెలిగించిన పిమ్మట, యిందు మొదటినుంచి వెలుగుచున్న దీపమేదియో, తరువాత నుంచి వెలుగుచున్న దీపమేదియో చెప్ప వలనుపడదుగదా! ఇదేవిధముగ పూర్తిగా నా భక్తియొనర్చు భక్తుడు ఆ క్షణముననే మద్రూపుడగును. ఆపైన, నా అక్షయ శాంతవృత్తి అతనికి ప్రాప్తించును; దానివలన అతని తేజస్సు వృద్ధియగును. అతడు నా జీవితముతోనే జీవించునని చెప్పవలెను. ఓ అర్జునా, యిక దీనిని గురించి చర్విత చర్వణమేల! ఇందలి ముఖ్యతత్వము, నన్ను పొందగోరువారు పరిపూర్ణమగు భక్తిని నాయెడ కలిగియుండవలెనను విషయమును మరువరాదు. వంశ గొప్పదనమును గురించి యోచించవద్దు, కులీనత్వమును గురించి పొగడ్తతో కూడా వర్ణన చేయకుము. మరియు ధనసంపదను గురించిన అహంభావపు పలుకులు పలుకకుము. ఏలనన, నా భక్తిలేనిచో ఇవన్నియు వ్యర్థమే. మొక్కకు ధాన్యపుకంకులు యెన్ని వున్నప్పటికిని ఆ కంకులందు ధాన్యపు గింజలే లేకున్నచో, లేదా పట్టణము పెద్దదైనప్పటికిని అది పాడుపడి నిర్జనముగ నున్నచో దానివలన ప్రయోజనమేమి! సరోవరమైతే వున్నది, కాని అది ఎండిపోయినది, లేదా అరణ్యమున ఒక దీనునకు మరొక దీనుడు జతగూడెను, లేదా చెట్టువున్నది, కాని గొడ్డుమోతు పూలతో నిండియున్నది - సమస్త వైభవము, కుల గౌరవమంతయు లేదా జాతిగౌరవ మంతయూ యిదే మాదిరిగ వ్యర్థమని తలంచవలెను. శరీరమందలి అవయవములన్నియు చక్కగానే వున్నవి, కాని ఆ శరీరము ప్రాణములేని

జరుగుచో అది భ్రాంతిగా నిరుపయోగమే యగును. ఇదే రీతిని నా భక్తిలేని ప్రాణి తిరస్కార పాత్రుడగును. ఏలనన, యీ విధముగా జీవించియుండెడి మనుష్యులందరును, మరియు భూమిపై పడియున్న రాళ్ళయందును భేదమేమి గలదు! బొమ్మజెముడుచెట్టునీడను బుద్ధిమంతుడైనవాడు కూర్చొనక తప్పించుకొను రీతిని పుణ్యముకూడ భక్తుడు కానివానినుండి తప్పించుకొనును, వానియొద్దకు పోదు. వేపచెట్టు మిక్కుటముగ కాసి ఫలభారముచే వంగి పోయినప్పటికి కూడ, దానిని చూచి ఒక్క కాకులు తప్ప మరెవ్వరానందపడెదరు! ఇదే రీతిని భక్తిహీనుడగువాడు ఎంత సంపన్నుడైనప్పటికిని ఎంత శక్తిశాలి యైనప్పటికిని, అవి అతని దోషములనే పెంపొందించును. షడ్రస భోజనమును ఒక కుండ పెంకులో వడ్డించి నాలుగు వీధులు కలసెడి కూడలిలో పెట్టినచో, దానివలన కుక్కలకు చుండు వ్యాధియే వృద్ధి యగును. (అనగా దానిని తినుటచే కుక్కలకు చుండు రోగము వచ్చును) ఇదే రీతిని భక్తిహీనుడగు పురుషుని జీవితముకూడనగును. అతనిచే స్వప్నము నందు కూడ పుణ్య-కార్యములు జరుగవు. అతని జీవితము ప్రపంచమందలి దుఃఖములనెడి పిండివంటలు వడ్డింపబడిన పళ్ళెరము వంటిది కావున, ఉత్తమ కులము లేకుండుగాక, అంత్య కులజుడే యగుగాక, చివరకు పశు శరీరమే యగుగాక, ఏ విధమగు హానియు లేదు. ఓ అర్జునా, మొసలి గజేంద్రుని పట్టుకొనినప్పుడు గజేంద్రుడు నన్ను పిలచెను. అంతే, భక్తి పూర్వకముగ నన్ను స్మరించుటతోడనే అతడు మద్రూపుడయ్యెను. మరియు అతని పశుత్వ మా క్షణమునందే అంతమొందెను.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిమ్॥౩౨॥

"ఓ అర్జునా, ఎవని పేరును ఉచ్చరించుటకూడ నింద్యమో, అట్టి హీనమగు పేరుగలజాతులందు కూడ ఏది అన్నింటికంటె హీనజాతియో, అట్టి హీనజాతియందలి పాపయోని యందెవడు జన్మించెనో, అట్టి పాపయోని యందు జన్మించుటేగాక జ్ఞానవిషయమున ఎవడు రాతివలె జడుడో-యింత హీనుడైనప్పటికి ఎవనియందు నాయెడ పరిపూర్ణమగు భక్తిగలదో, ఎవనివాక్కు నా గీతములనే నిరంతరము గానమొనర్చుచుండునో, ఎవనిచూపు

నిరంతరము నన్నే చూచునో, ఎవని మనస్సు నిరంతరము నన్ను గురించిన యోచనయే చేయుచున్నో, ఎవని చెవులు నా కీర్తిని వినుటయందున్నదుగ ఏమరకయుండునో, ఎవనికి నా పరిచర్యయే తన శరీరమునకు అలంకారముగ తోచునో, ఎవనికి విషయములను గురించిన చింతనయే యుండదో, ఎవడు కేవలము నన్నే ఎరుంగునో మరియు యివన్నియు నున్న పిదప ఎవనికి తాను జీవించియుండుట మరణించుటతో సమానముగ బోధపడునో, ఓ అర్జునా, యీ రీతిని ఎవడు తాను తన సమస్తవృత్తులతోను జీవించుటకు కేవలము నన్నే తనకు ఆధారముగ నొనర్చుకొనియుండెనో, అట్టివాడు పాపయోని యందే పుట్టుగాక మరియు విద్యావిహీనుడే యగుగాక అతనిని నాతో పోల్చిచూచినచో అతడు ఏమాత్రమును నాకు తీసిపోడు. ఓ అర్జునా, జ్ఞాపకముంచుకొనుము, యీ భక్తిసంపద గలవారగుటవలననే రాక్షసులు దేవతలనుకూడ హీనులుగ నొనర్చిరి. నా భక్తుడగు ప్రహ్లాదుడు దైత్యకులము నందే జన్మించెను. కాని అతని నిర్మలభక్తివలన నేను నృసింహావతారము నెత్తవలసి వచ్చెను. ఆ ప్రహ్లాదునకు నామూలమునవే తెక్కురు అనేక కష్టములను కలిగించిరి. దీని ఫలముగా నేనిచ్చగలిగిన దంతయు అతనికి ముందుగనే లభించినది. అటులకానిచో అతనికులము దైత్యకులము. కాని యింద్రుడుకూడ అతనికి సాటి రాలేకపోయెను. ఇటుల చెప్పుటలో గల ఉద్దేశ్యము, భక్తియే ప్రధానముగాని జాతిప్రధానము కాదనుటయే. రాజా క్షరములు తోలుముక్కపై ముద్రించినప్పటికిని దానికి బదులుగా సమస్త వస్తువులు లభించగలవు. కాని రాజాజ్ఞయానెడి అక్షరములు ముద్రించ కున్నచో వెండి - బంగారు ముక్కలనుకూడ ఎవడును గైకొనడు. దీనివలన యీ ముక్కలకుగల మహత్వమంతయు రాజాజ్ఞదేనని బోధపడినది. రాజాజ్ఞ యనెడి అక్షరములుగల తోలుముక్క లభించినప్పటికిని దాని సహాయము వలన మనము మనకు కావలసిన వస్తువులను కొనుక్కొన గలము. ఇదేరీతిని నా ప్రేమచే మనస్సు మరియు బుద్ధి పూర్తిగా నిండియున్నప్పుడే మహత్వము మరియు సర్వజ్ఞత్వముకూడ ఉపయోగకరములు కాగలవు. కావున కులము జాతియను మాటలన్నియు వ్యర్థములే. ఓ అర్జునా, వాస్తవికమగు ధన్యత్వము నా నిజమగు భక్తియందే గలదు. ఆ భక్తిభావము ఏవిధమైనదైనను కానిమ్ము, ఒక్కమారా భక్తిభావముతో నిండియున్న మనస్సు నాయందెప్పుడు

ప్రవిష్టమయ్యెనో, అప్పుడే అంతకుపూర్వముగల ఆతనిచరిత్ర యంతయు సంపూర్ణముగ నశించిపోవును. వాగులు మొదలగువానిని గంగలో కలియు నంతవరకే వాగులని పిలుతుము. కాని ఒక్కమారు గంగలో కలియుట తోడనే అవన్నియు గంగయొక్క రూపమే కలవగును. లేదా ప్రల్లలలో చందనము చంద్ర మొదలగు కర్ర భేదములు అవి అగ్నిలోపడి అగ్నితోపాటు ఏకరూపమును పొందనంతవరకే వుండును. అదేరీతిని ఎవడైన నా స్వరూప ములో కలసి సమరసుడు కానంతవరకు మాత్రమే క్షత్రియ, వైశ్య, స్త్రీ, శూద్ర, అంత్యజాతి రూపములతో భాసిల్లును. సముద్రమున పడవైచిన ఉప్పుబెడ్డ దానియందేకలసి లీనమగురీతిని నాతో సమరసత్వమును పొందుట తోడనే జాతిభేదములను నవి సంపూర్తిగా లోపించును. భిన్న - భిన్న నదీ - నదములనెడి భావము అది సముద్రమున కలియనంతవరకే వుండును; మరియు అంతవరకే ఫలానానది పశ్చిమమువైపునకు ప్రవహించుచున్నది, ఫలానానది తూర్పువైపుకు ప్రవహించుచున్నదనెడి భేదభావము వుండును. కావున ఏ నిమిత్తమునవైనసరే, ఒకమారు చిత్తము నా స్వరూపమందు ప్రవే శించవలెను; అంతటితో అతడు తనంతతానే మద్రూపుడగును. స్పర్శమణిని బ్రద్దలుకొట్టవలెననెడి ఉద్దేశ్యముతోనే కానిమ్ము. ఒక్కమారు యినుము దానిని స్పర్శించుట మాత్రము కావలెను. దానిని తాకుటతోడనే ఆ యినుము బంగారుగా మారిపోవును. ఓ అర్జునా, ప్రేమచే గోపికల అంతరంగము నాయందు సంలగ్నమైనది. వెంటనే వారు మద్రూపులు కాలేదా! ఇదే విధమున భయవశమున కంసుడు, నిరంతరము శత్రుత్వము వహించుటచే శిశుపాలాది శత్రువులు, సగోత్రీకులూ బంధువులూ నగుటచే యాదవులు మమత్వమువలన వసుదేవాదులు నాలోకలసి ఏకరూపమును పొందలేదా! నారదుడు, ధ్రువుడు, అక్రూరుడు, శుక్రుడు మరియు సనత్కుమారాదులకు నేవేరీతిని భక్తిగుణముచే సాధ్యుడనైతినో, అదేరీతిని ఓ అర్జునా నేను కామ భావముచే గోపికలకు, భయభ్రాంతిచే కంసునకు మరియు శిశుపాలాది పెక్కుమంది యితరులకు వారి దుష్టము మరియు నష్టవంతమగు మనోవృత్తుల వలనను లభించితిని. నేను అన్నిటికి అంతిమధ్యేయమును, లోకులు నావద్దకు భక్తిచేగాని, విషయభావనచేగాని, వైరవృత్తివలనగాని లేక మరే యితర మనోధర్మ మార్గములగాని ఏలరారాదు! కాన ఓ అర్జునా, నా స్వరూప

మందు ప్రవేశించు ఉపాయములకు కొదువలేదు-అవి పెక్కులు. మనుష్యుడు ఏ జాతియందైన జన్మించుగాక నన్ను భజించుగాక విరోధించుగాక ఆతడు నా భక్తుడో లేక శత్రువో కావలయును; ఇదే యిందలి ముఖ్యతత్త్వము. మానవునకు ఏదో రూపమున నా తత్త్వము లభించవలెను. అంతటితో ఆతనికి నా స్వరూపము లభించును. కావున ఓ అర్జునా, పాపయోనియే కానిమ్ము, వైశ్యుడే కానిమ్ము శూద్రుడు గాని స్త్రీ గాని కానిమ్ము, అందరును నన్నుపాసించుటవలననే నా స్థానమును చేరెదరు.

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమామ్॥ 33

"వాస్తవస్థితి యిటులుండగా, చాతుర్వర్ణములకు రాజున్నూ, సర్వైశ్వర్య వంతుడును, మంత్ర విద్యకు జన్మస్థానమున్నూ, భూదేవుడున్నూ, శరీరము నందున్న అవతరించిన తపస్స్వరూపుడున్నూ అగు బ్రాహ్మణుడు ఎవని యోగము వలన తీర్థములకు కూడ భాగ్యోదయమగునో, ఎవడు యజ్ఞ-యాగములకు ఎల్లప్పుడు ఆధారుడో, ఎవని కృపాదృష్టి యనెడి ఒడిలో కూర్చొని కళ్యాణము కూడ వృద్ధిని పొందునో, ఎవనిచే సన్మానింపబడుట వలన సత్కర్మలు వ్యాప్తిని పొందునో, ఎవని యిచ్ఛవలన సర్వము జీవించి యున్నదో, ఎవని అభయ వచనముచే అగ్ని ఆయుర్దాయమును పొందినదో, మరియు అగ్నికి సహజ శత్రువగు సముద్రుడు కూడా బడబాగ్నికి తన జలమును సమర్పించి దానిని పోషించెనో, ఎవని పాద-ధూళిని సంపాదించుటకై నేను స్వయముగ లక్ష్మిని కూడ ఒకవైపునకు నెట్టి, మధ్యను అడ్డము వచ్చెడి కౌస్తుభమణిని కూడ తీసి చేతబుచ్చుకుని, నా వక్షస్థల వేదికను వారి పాదముల నుంచితినో; ఓ అర్జునా, నేను భాగ్యశాలిని అనెడి చిహ్నమును నిలిపియుంచుకొనుటకై నేనిప్పటివరకు నా హృదయమునైన ఎవరి శుభమగు పాదచిహ్నములను కాపాడి యుంతునో, ఎవరి క్రోధాగ్ని ప్రత్యక్షముగ రుద్రుని నివాస స్థానమో, మరియు ఎవరి కృపవలన అష్టమహాసిద్ధులు సహజముగ మూల్యము లేకుండనే ప్రాప్తించునో, అట్టి పరమ పుణ్యాత్ములగు బ్రాహ్మణులను గురించి, నాస్వరూపమునందులీనమైయుండు ఆ బ్రాహ్మణులకు నా స్వరూప ప్రాప్తి కలుగునని చెప్పనక్కరయేలేదు, మంచిగంధపు

చెట్టు పైనుంచి వచ్చు వాయు సంసర్గమువలన చుట్టుప్రక్కల నున్న వేప
చెట్లు కూడ సుగంధము గలవగును. మరియు జడములగు ఆ వృక్షములు
కూడ దేవతల మస్తకముపై స్థానము సంపాదించును. ఇట్టి స్థితిలో, మంచి
గంధపు చెట్టు దేవతల మస్తకముపై స్థానము సంపాదించు ననుటలో వింత
యేమిగలదు! శంకరుడు హాలాహల విషపానముచే కలిగెడి తాపము చంద్ర
స్పర్శచే శాంతించునని ఆశయముతో కేవలము అర్ధచంద్రుని యెల్లప్పుడు
తన మస్తకముపై ధరించి యుండును; అట్టి స్థితిలో తాపమును చల్లార్చు
టలో ప్రత్యక్ష నిదర్శనమిచ్చి మరియు పూర్ణత్వము మరియు సువాసన
లందు చంద్రునికంటె శ్రేష్ఠముగ నున్న మంచి గంధము (చందనము) ను
స్వాభావికముగనే శరీరాంగము లన్నింటికి ఏల రాచుకొనరాదు! లేదా
గంగను ఆశ్రయించి మార్గమున ప్రవహించెడి నీరు కూడ పోయి సముద్రమున
కలియుచున్నది; అట్టి స్థితిలో, గంగ సముద్రమున కలవదనుటకు అవకాశ
మెచ్చట గలదు! ఇట్టి స్థితిలో, రాజర్షులు మరియు బ్రాహ్మణులు శుద్ధ
హృదయముతో నన్నే తమకు శరణ్యునిగా తలంచునప్పుడు, అట్టివారిని
గురించి వారి అంతిమ శాశ్వత సుఖ సాధన స్థానము నేనే యగుదుననుటలో
సందియమేమియూ లేదు. ఇట్టి స్థితిలో వందలకొలది రంధ్రములు పడి
యున్న నావలో మానవుడేల నిశ్చింతగా పడియుండవలెను! శస్త్ర వర్షము
కురియుచున్న చోట మానవుడు కవచము ధరించకుండా ఏల నిలచియుండ
వలెను! శరీరముపైన రాళ్ళు పడుచున్నచోట మానవుడు తనచేత ఏ విధ
మగు రక్షణ సాధనమును గైకొనకుండు టెటుల సంభవించును! రోగముచే
శరీరము జర్జరమై పోవుచున్నప్పుడు ఔషధ విషయమున మానవుడెటుల
నిశ్చింతతో నుండగలడు! నాల్గువైపుల నిప్పు అంటుకొనినపుడు బయటకు
పోవు ప్రయత్నము చేయకుండు టెటుల సంభవించును? ఇదే రీతిని
ఓ అర్జునా, దుఃఖములు మరియు సంకటములతో నిండియున్న యీ మృత్యు
లోకమునకు వచ్చిన పిదప నన్ను భజించకుండుట కెటుల వీలగును! మను
ష్యుడు తనలో ఏ బలము గలదని ధైర్యముతో నన్ను భజించక వుండగలడు!
ఇండ్లు - వాకిళ్ళు మరియు విషయ విలాసములు మొదలగువానిలో ఏమున్న
దని అతడు సంతోషముతోను నిశ్చింతగను వుండగలడు! విషయోప
భోగములన్నియు శరీరము ఆరోగ్యస్థితిలో నున్నప్పుడే అనుభవించ వలను

పడును. మరియు యీ శరీర మెల్లప్పుడు మృత్యుముఖమున పడియుండును. ఈ మృత్యులోకమున ప్రబలమగు దుఃఖములనెడి సరుకులు నాల్గు వైపుల బహిరంగముగ అమర్చబడియున్న జనన - మరణములనెడి బజారు తెరువబడి యుండును. మరియు మృత్యువనెడి సామానుతో నిండియున్న మూటలు ఒకటి వెనుక నొకటి యెడతెగక వచ్చును. ప్రాణులు యీ బజారుకు వత్తురు. ఇట్టి స్థితిలో, ఓ అర్జునా, సుఖపడుట కవకాశ మెక్కడ? ఈ లోకమున సుఖమనెడి వ్యాపార మెటుల చేయవగును? బూడిదను వూదుటచే దీప మెన్నడైన వెలుగగలదా?

ఒకానొకడు విషయుక్తమగు దుంపను తెచ్చి దానిని తొక్కి దాని నుండి రసమునుతీసి ఆరసమునకు 'అమృతరస'మనెడి పేరుబెట్టి దానిని త్రాగి, దాని ప్రభావముచే అమరత్వము పొందవలెననెడి ఆశపెట్టుకొనిన రీతిని, యీ విధమగు అమృతరస సమానమగు విషయముల వలన ప్రాప్తించు సుఖములు వాస్తవమునకు మహాదుఃఖములై యున్నవి. కాని చేయగలదేమి! మూర్ఖులగు లోకులు యీ విషయసేవన మొనర్చకుండా వుండజాలకున్నారు. పాదమునందు గాయము తగిలినప్పుడు ఆ గాయమునకు ఎవడైన తనతలను కోసి దానిని కట్టుకట్టుటచే ఆతనికది ఎంతవరకు హితకరము కాగలదు? మృత్యులోకమందలి సుఖములన్నియూ యీ విధమైన కల్యాణకరములేనని ఎరుంగవలెను. ఈ స్థితిలో యీ మృత్యులోకమున నిజమగు సౌఖ్యమనెడి మాట ఎవనికి వినిపించగలదు! తేలువున్న శయ్యపైన ఎవడు నిశ్చింతగా నిద్రించగలడు! ఏలోకమున చంద్రుడుకూడా క్షయరోగముచే పీడింపబడు చున్నాడో, ఎచ్చట సూర్యుడుకూడ కేవలము అస్తమించుటకు మాత్రమే ఉదయించుచున్నాడో, ఎచ్చట కేవలము దుఃఖములే సుఖములనెడి వంచనతో జగత్తునంతయు మోసపుచ్చుచున్నదో, ఎచ్చట శుభగ్రహము ప్రకటమగుటతోపాటు తాత్కాలికముగ అమంగళకీటకములు అంకురములంతే వ్యాపించునో, ఎచ్చట మాతృగర్భమందలి గుప్తగర్భాశయము నందుకూడ మృత్యువు ప్రవేశించి తన పనిని నెరవేర్చుకొనునో, ఎచ్చటి ప్రజలకు ఎల్లప్పుడు అసత్యవిషయములే జ్ఞప్తియందుండునో మరియు అట్టి అనిత్య జీవితము గలవారినే యమదూతలు బలాత్కారముగా తీసికొనిపోదురో మరియు తమను వారెచ్చటకు తీసికొను పోవుచున్నారను విషయముకూడ

ఎచ్చట తెలియదో, ఎచ్చట కంజైపుల చక్కగా వెదకినప్పటికికూడ బయ
టకుపోవు మార్గమే ఎచ్చటను కనిపించదో, ఎచ్చట కేవలము ప్రాణములను
(అనగా అసంఖ్యాకములుగ చచ్చియున్నవానిని) గురించిన చప్పుడే జరుగు
చుండునో, ఎచ్చట బ్రహ్మతో సమానముగ ఆయువుగల మనుష్యుడుకూడ
వస్తుతత్త్వముయొక్క అశాశ్వతత్వమును గురించి ఎంత వివరించి చెప్పినప్పటికిని
దానిని సరిగా గ్రహించజాలడో మరియు ఏలోకమందిట్టి అశాశ్వత స్థితిగలదో,
అట్టి లోకమందు జన్మించి జీవుడు నిశ్చింతుడుగా నుండుటన ఎంతటి ఆశ్చర్య
జనకము మరియు హాస్యాస్పదమునగు విషయము! లౌకికము మరియు పార
లౌకిక లాభమునకై ఒక్క చిల్లిగవ్వకూడ ఖర్చుపెట్టుటకు అంగీకరించని
యీ ప్రజలే, పూర్తిగా హానికరములగు యిట్టి వస్తువుల కొరకు లక్షలు-
కోట్లకొలది రూప్యములను వెచ్చించుటకుకూడ వెనకాడరు! విషయ విలాసము
లందు చిక్కియున్న వానిని చూచి లోకులు 'ఆతడు ప్రస్తుతము చాల సుఖ
ముగా నున్నాడు' అని చెప్పుకొందురు, మరియు విషయ వాసనల భారముచే
నిండియుండి పూర్తిగా పతనమొంది యున్నవానిని లోకులు సజ్జ్ఞానిగా భావిం
తురు. ఆయువు చాల కొద్దిగనే మిగిలియుండి, షష్టిపూర్తియగుటచే పూర్తిగా
బుద్ధిభ్రష్టమును పొందిన వానిని లోకులు పెద్దవాడని అందురు, మరియు ఆతని
పాదములవద్ద మోకరిల్లుదురు. పిల్లవాడు పెద్దవాడగుచున్న కొలదీ తల్లిదండ్రులు
మొదలగువారు ఆనందముచే చిందులు త్రొక్క మొదలిడుదురు. కాని, పిల్ల
వాడు పెద్దవాడగుచున్న కొలదిని, ఆతని ఆయువనెడి తీగ తగ్గిపోవుచున్నదని
వారెన్నడును ఖేదపడరు. జన్మించుటతోడనే మనుష్యుడు నానాటికి కాలుని
కింకను ఎక్కువగా స్వాధీనుడు కావలసి వచ్చును, అయినప్పటికిని లోకులు
జన్మదినోత్సవములు అత్యాడంబరముగ చేయుదురు మరియు ఆనందపతా
కాలను ఎగురవేయుదురు. లోకులకు మరణమనెడిమాటకూడ వినపడదు.
ఎప్పుడైన ఎవడైనమరణించుచో అప్పుడు పెద్దపెట్టున ఏడ్వసాగుదురు.
కాని, వారు తమమూర్ఖత్వమువలన 'మనఆయువుకూడ నానాటికి తగ్గిపోవు
చున్నద'ను విషయము నెన్నడును తలంచరు. కప్పను పాము కబళించసాగి
నప్పుడుకూడ ఆకప్ప దోమలనుతినుతలంపుతో తననోటితో వానిని గట్టిగ
పట్టుకొనియుండును. సరిగా యిదేరీతిని, మానవుడుకూడ తనవాసనలను ఎడ
తెంపులేకుండా వృద్ధిచేసికొనుచూ పోవును, కాని వీటివలన ఆతని క్షేమ

లాభముగలదు! ఈ మృత్యులోకస్థితికూడ ఎంతచెడిపోవుచున్నది! ఓఅర్జునా, నీవు నీకర్మలవలననే యీలోకమున జన్మించితివి. నీవువెంటనే దీనినుండి విడిపడి, నా నిర్దోషఅక్షయపదప్రాప్తిని కలిగించుమార్గమున నడవుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥ ౩౪

"నీవు నీమనస్సును మద్రూపమొనర్చుకొనుము, నన్ను ప్రేమతో భజించుటయందు నిమగ్నుడవుకమ్ము. మరియు అంతటను నేనున్నటుల తెలసి కాని నాకువందనమొనర్పుము. కేవలము నాయందేలక్ష్యముంచి సమస్త సంకల్పములను విడచివేయుటయే నాయజ్ఞమొనర్చుట. నీవీరీతిని నాధ్యాన సంపద గలవాడవైనప్పుడే నీకు నాస్వరూపప్రాప్తి కలుగగలదు. నీకీనాడు నామనస్సునగల రహస్యమును వెల్లడిచేసితిని. నేను నేటివరకు అందరకును తెలియకుండా రహస్యముగానుంచిన యీవిషయమును నీవుసంపాదించి సుఖపూరితుడవయ్యెదవు." సంజయుడు చెప్పెను—"భక్తులపాలిట కల్పవృక్షమగు బ్రహ్మస్వరూపుడైన ఆశ్యాముల కృష్ణుడు యీవిధముగ అర్జునున కుపదేశించెను". వృద్ధుడగు ధృతరాష్ట్రుడీవిషయముల నన్నిటిని శాంతముగా వినుచుండెను. సోమరితనము అలవడిన దున్నపోతు నదీజలము పొంగివచ్చినప్పటికిని మెదలకుండా సుఖముగా కూర్చొనియుండు రీతిని, ధృతరాష్ట్రుడుకూడా కూర్చొనియుండెను. అప్పుడు సంజయుడు తలయూపి తనలో తానిటులనుకొనెను— "ఇచ్చట తెరపిలేకుండా అమృతము వర్షించుచున్నది; కాని యీవృద్ధుడు తానిచ్చట లేనేలేనట్టుల నిశ్శబ్దముగా కూర్చొనియున్నాడు. అయినప్పటికిని, యీతడు నన్ను పోషించుచున్నాడు; కావున యీతని ముందీ విషయమును స్పష్టముగాచెప్పి నావాక్కును దూషితమొనర్చుకొనుట తగదు. ఇంక మరే ఉపాయమూలేదు. ఏలనన యీతని స్వభావమే యిట్టిది. అయినప్పటికిని నేను గొప్ప భాగ్యవంతుడను; ఏలనన యుద్ధక్షేత్ర వార్తల నన్నిటిని తెలియజేయుటకు శ్రీ వేదవ్యాసులవారు నన్ను నియమించిరి." ఈరీతిని ఎంతో ప్రయత్నము చేసి, తన మనస్సును దృఢమొనర్చుకొని సంజయుడు తనలో తానిట్లనుకొనెను; ఆసమయమున సాత్త్విక భక్తి భావావేశము అతని యందు కలిగెను. అందుచే అతడు తనను సంబాళించుకొన జాలక పోయెను. అతని

చిత్తము చకితమయ్యెను. వాక్కు స్తంభించెను మరియు శరీరమంతయూ గగుర్పొడిచెను. అతని అర్ధ నిమీలిత నేత్రములనుండి ఆనందాశ్రువులు ప్రవహింపసాగెను. అతని మనస్సునందు లేచిన సుఖతరంగముల మూలమున అతని శరీరము గజగజ వణకసాగెను. అతని ప్రతి రోమమునందు నిర్మలమగు సూక్ష్మమైన స్వేదబిందువులు ప్రకాశించసాగెను. మరియూ అతడు తన శరీరమందంతటను ముత్యములజాలము కప్పుకొనెనా యనినటుల యుండెను. ఈ విధముగా అపారమగు మహాసుఖరసమున మునిగి యుండుటచే ఆతనికి తన శరీర ధ్యాసకూడా లేకుండా పోయెను; మరియూ వేదవ్యాస మహర్షి తనకు వప్పగించిన యుద్ధవార్తాశ్రవణ కార్యము తనవలన నిక కాజాలదని కూడ ఆతనికి తోచసాగెను. ఇంతలో శ్రీ కృష్ణునివాణి ఆతని కర్ణరంధ్రములందు ప్రవేశించెను; అంత నాతడు స్పృహ తెచ్చుకొని మరల తన ఉద్యోగము చేయుటకు సంసిద్ధుడాయెను. అంత నాతడు తన కన్నీటిని తుడుచుకొని, ఆపైన శరీరముపైగల చెమట నంతనుకూడా తుడుచుకొనెను; అప్పుడు ఆత డీరీతిని చెప్పెను. "ఓ ధృతరాష్ట్ర మహారాజా; ఇక తమకు ఆ పై వృత్తాంతము చెప్పెదను, శ్రద్ధగా వినుడు". శ్రీ కృష్ణుని వాక్కులు సుందర బీజములే, అందుపై సంజయుని సాత్త్వికవృత్తి యనెడి భూమి ఆ బీజములను నాటుటకు సంసిద్ధముగా నుండునట్టి సుందర అవకాశముకూడా వచ్చినది. ఈమాటలనుండి శ్రోతలకు సిద్ధాంతమనెడి శ్రేష్ఠమగు పంట తయారై లభించు ననుటలో ఏవిధమగు సందియమును లేదు. ఓ శ్రోతలారా, మీరీ విషయముపై ధ్యానముంచి ఆనందసింహాసనములపై సుఖాసీనులుకండు. నేడు మీ శ్రవణేంద్రియముల భాగ్యము పండినది. ఇప్పుడు సిద్ధరాజగు శ్రీ కృష్ణుడు అర్జునుని ఎదుట ఈశ్వరీయ విభూతిస్థాన నిరూపణ మొనర్చును. శ్రీనివృత్తినాథ దాసుడగు జ్ఞానదేవు 'మీరీ నిరూపణమును వినుడని' ప్రార్థించుచున్నాడు.

# తెలుగు జ్ఞానేశ్వరి

## పదియవ అధ్యాయము

ఓ గురుదేవా, తామే బ్రహ్మజ్ఞానమును స్పష్టముగ బోధించుటకు సమర్థులు. విద్యయనెడి కమల-వికాసము తామే. పరాప్రకృతి యొక్క శ్రేష్ఠమగు తరుణీమణి మరియు తాము ఆమెతో సుఖముగా క్రీడింతురు. సంసారమనెడి అంధకారమును నాశనమొనర్చెడి సూర్యుడు తామే. తమ స్వరూపము హద్దులేనిది. తమ సామర్థ్యము అనంతము. తురీయావస్థ యనబడెడి ఆత్మసమాధి యిప్పుడే యౌవనావస్థను పొందనున్నది. దానిని సహజముగ పెంచిపోషించెడివారు తామే. కాన, తమకు నేను నమస్కరించుచున్నాను. తాము జగత్తునంతను పోషించువారు మరియు శుభము కల్యాణమనెడి రత్నరాశియైయున్నారు. సజ్జనులనెడి వనమును సుగంధితమొనర్చెడి చందనతరువులు తామే. ఆరాధించదగిన దేవత తామే. కాన నేను మీకు నమస్కరించుచున్నాను. చకోరచిత్తమును చంద్రుడు సంతోషపెట్టి శాంత పరచు రీతిని చతురజనచిత్తమును తాము సంతోషపెట్టి శాంతపరచెదరు. తాము ఆత్మసాక్షాత్కారమునకు సర్వాధికారులు, వేదమందలి జ్ఞాన-రససాగరులు, మరియు జగత్తునంతను మథించెడి కామ-వికారమును మథించెడి వారు నైయున్నారు. కాన, ఓగురుదేవా, తమకు నమస్కరించుచున్నాను. తాము సద్భక్తుల భజనకు పాత్రులు, జగత్తనెడి ఏనుగుయొక్క గండస్థలమును ఛేదించువారు తామే. మరియు జగదుత్పత్తికి ఆదిస్థానముకూడ మీరే, కాన తమకు నేను నమస్కరించుచున్నాను. ఓమహారాజా, తమప్రసాదము యీవిద్యాపతియగు గణేశునే; మరియు ఆగణపతి అనుగ్రహము లభించి నప్పుడు మూఢబాలకుడుకూడ సాహిత్యప్రాంతమున ప్రవేశించగలడు. గురువాక్కు అభయవచన మిచ్చినప్పుడు శృంగారాది నవరసముల మధుర సముద్రపులోతు తేర్పడును.

ఓమహారాజా, తమప్రేమపూరితమగు వాణి ఏమూగవానిపై నైన దయదలచునో, ఆతనుకూడ గ్రంథరచన మొనర్చుటలో స్వయముగ బృహస్పతితో ప్రతిజ్ఞాపూర్వకముగ పోటీచేయగలడు. ఇంతేగాదు, ఎవనిపై తమ

దృష్టిప్రకాశము పడునో, లేదా తమకోమలహస్తము ఎవరిమస్తకము నలంక
రించునో, ఆతడు జీవుడైనప్పటికిని శివునితో సాటియగును. ఇట్టి అపార
మహిమ గలవానిని నాపరిమితమగు వాక్కులనుచే ఎటుల వర్ణించగలను!
ఎవడైన సూర్యుని శరీరమునకు సున్నిపిండిని ఎన్నడైన రాయగలడా!
కల్పవృక్షములను పూలచే ఎంతవరకు శృంగారించగలను? క్షీరసముద్ర
మునకు ఏవిధమగు పిండివంటలతో ఆతిథ్య మివ్వగలను? కర్పూరమును
ఏసుగంధవస్తువుతో సుగంధవంత మొనర్చగలను? చందనమునకు మరే
వస్తువు పూయవచ్చును? అమృతమునకు ఏఅన్నము వండవచ్చును? ఆకాశ
మును యింకనూ పైకెత్తుటకు ఏఉపాయముగలదు? సరిగా యిదేరీతిని
శ్రీగురుదేవుని మహాత్మ్యమును పూర్తిగా ఆకళింపుచేసికొనుటకై ఎచ్చట
ఏవిధమగు సాధనముగలదు? ఇదంతయూ ఆలోచించియే ఏవిధమగు వాచా
లత్వము లేకుండా శ్రీగురుదేవునకు నమస్కరించితిని. ఎవడైన తనకుగల
బుద్ధిబలాభిమానముచే-"శ్రీగురుదేవుని సామర్థ్యమును పూర్తిగను చక్కగను
వర్ణింతును"అని చెప్పచో, ప్రకాశవంతమగు ముత్యముపైన అభ్రకపు కళాయి
చేయుటవలె హాస్యాస్పదముగా నుండును. లేదా, ఆతడుచేయు గురుస్తుతి
స్వచ్ఛమగు బంగారుపై వెండిపూత పూయుటవలె నుండును. కావున,
నిశ్శబ్దముగ గురుదేవుని పాదములకు మోకరిల్లుట మంచిది. ఆపైన శ్రీగురు
నాధునితో నిట్లంటిని—"ఓ ప్రభూ, తాము ప్రేమతో నాపై దృష్టిపాత మొన
ర్చిరి, అందుచే కృష్ణార్జున సంవాదసంగమమున నేనుకూడ 'గంగాయమునల
సంగమమున ప్రయాగయందలి వటవృక్షము'వలె నైతిని. పూర్వకాలమున
శ్రీశంకరులను ఉపమన్యుడు పాలనడిగెను: అప్పుడా శ్రీశంకరులు స్వయముగ
క్షీరసాగరమునే ఆతనిముందు పాలపాత్రవలె పెట్టిరి; లేదా కలహించి
వచ్చిన ధ్రువునకు మిక్కుటమగు ప్రేమతో నచ్చజెప్పి ఓదార్చుటకై వైకుంఠ
పతి ధ్రువ పదమనెడి మిఠాయినిచ్చెను,—అదేరీతిని తాము నాయెడ
ప్రసన్నులరై కృపతో—ఆధ్యాత్మవిద్యలన్నిటను శ్రేష్ఠమైనదిన్ని, సమస్త
శాస్త్రములను తనయందిముడ్చుకొనినదిన్ని, సమస్తశాస్త్ర విషయములను
సుఖపూర్వకముగ ఏకత్రితమై యున్నట్టిదిన్ని యగు భగవద్గీతకు వ్యాఖ్యా
నము రచించుటకు నన్ను సమర్థునొనర్చిరి. వాణి యనెడి ఏఅరణ్యమున
ఎంతగా తిరిగినప్పటికిని సార్థకమనెడి ఫలము నామమాత్రమునకైన నిన

పడనో, అట్టి శోకమలరహితమగు వాణిని తామే నేడు వివేకమనెడి కల్పలతగ నొనర్చిరి. పూర్తిగా దేహభావముతో నిండియున్న నాబుద్ధిని తామిప్పుడు బ్రహ్మానంద సంపదగలదిగా నొనర్చిరి. నామనస్సు గీతార్థమనెడి సముద్రమున ఆనందముతో జల—శయన మొనర్చుచున్నది. శ్రీగురుదేవుని కృత్యము లన్నియును యిదేరీతిని అలౌకికములు. వారి అపారకృత్యములను నేనెంతవరకని వర్ణించను! అయినప్పటికిని, వారిమహిమలను కొన్నింటి నిచ్చట వర్ణించుటకు సాహసించితిని. శ్రీగురుదేవులు నన్ను క్షమింతురుగాక! తమకృపాప్రసాదమువలననే నేను భగవద్గీతయందలి మొదటిఖండమునకు మిక్కుటమగు నుత్సాహముతో వ్యాఖ్యాన మొనర్చితిని. మొదటిఅధ్యాయమున అర్జునునకు తనఆత్మబంధు నాశనమగు ననెడి భావనుచే కలిగిన ఖేదము వర్ణింపబడినది. రెండవఅధ్యాయమున కర్మయోగమన నేమో వివరింపబడినది; మరియు దానితోపాటు సాంఖ్యమందలి జ్ఞాన—యోగముయందు గలభేదము కూడ తెలుపబడినది. మూడవఅధ్యాయమున కర్మయొక్క మహత్త్వము వర్ణింపబడినది; నాల్గవఅధ్యాయమున ఆకర్మలే జ్ఞానముతోపాటు ప్రతిపాదింపబడినవి. అయిదవఅధ్యాయమున యోగతత్త్వ మహత్త్వము వర్ణింపబడినది. ఆరవఅధ్యాయమున ఆ యోగతత్త్వమింకను అధికముగ వివరింపబడినది. ఆరంభమునవచ్చు ఆసనములనుంచి మొదలిడి అంత్యమునందలి బ్రహ్మైక్యస్థితివరకు సమస్తవిషయములు చాలవిపులముగ వివరింపబడినవి. ఇదేరీతిని ఆరవఅధ్యాయమున 'యోగస్థితి యన నేమి? యోగభ్రష్టులకు ఏస్థితి గలుగును? అను విషయముకూడా వివరింపబడినది. ఆ పిమ్మట ఏడవ అధ్యాయమున మొదటి మాయాస్వరూపము మొదలగునవి వర్ణింపబడినవి మరియు ఈశ్వరోపాసనచేయు చతుర్విధభక్తులను గురించికూడా వర్ణింపబడినది. అటుపైన ఎనిమిదవ అధ్యాయమున ఏడు ప్రశ్నలను గురించి వ్యాఖ్యాన మొనర్పబడినది మరియు అధ్యాయాంతమున మరణ సమయమున లోకమెట్టి బుద్ధిగలవారై యుందురో వివరించబడినది. అపారశబ్దబ్రహ్మగా నంగీకరింపబడు వేదములందు లభించు తత్త్వ-జ్ఞానము అంతయూ ఒక లక్షశ్లోకములుగల మహాభారతమున లభించును. మరియు మహాభారత మందంతటను గల జ్ఞానము శ్రీకృష్ణార్జున సంవాదమున లభించును. మరియు కృష్ణార్జున సంవాదమను ఏడువందల శ్లోకములందునుగల

సారము పూర్తిగా గీతయందలి తొమ్మిదవ అధ్యాయమున ఏకత్రితమై నిండి యున్నది. ఆ తొమ్మిదవ అధ్యాయార్థమును వివరించుటకు నేను పూర్తిగా భయపడితిని. అయినప్పటికిని నేను అనవసరముగా ఏలగర్వించును? బెల్లము మరియు పంచదారలు రెండును ఒకే చెఱకురసముచే తయారగుచున్నవి; అయినప్పటికిని వాటి మధుర రుచిలో భేదము గలదు. ఇదే రీతిని యీ అధ్యాయము లన్నియు గీతయందలివే అయినప్పటికిని యిందలి కొన్ని అధ్యాయములు బ్రహ్మతత్త్వమును కడుచక్కగా వివరించును; కొన్ని అధ్యాయములు కొన్ని విషయములను మాత్రము చెప్పి పూరకొనును; మరికొన్ని అధ్యాయములు తనకుగల జ్ఞానగుణముతోపాటు బ్రహ్మమందైక్యము నొందిన వస్తువుల యుండును. గీతయందలి అధ్యాయములన్నియు యిట్టివే. కాని తొమ్మిదవ అధ్యాయ మహత్త్వము శబ్దములచే వర్ణింప నలవికానిది. నేను కేవలము గురుదేవుని సామర్థ్యఫలము వలననే దానిని వర్ణించ గల్గితిని. ఒకడు (వశిష్ఠుడు) అంగవస్త్రము సూర్యునివలె ప్రకాశించచేసెను. ఒకడు (విశ్వామిత్రుడు) సృష్టికి ప్రతిసృష్టి యొనర్చెను, ఒకడు (శ్రీరామచంద్రుడు) రాళ్ళతో వంతెన కట్టించి తన సైనికులను కాలినడకను సముద్రమును దాటించెను. ఒకడు (హనుమంతుడు) సూర్యుని తన చేతితో పట్టుకొనెను, ఒకడు (అగస్త్యుడు) తన దోసిలిలో సముద్రముల నన్నింటిని నింపివేసెను. యిదేరీతిని ఓ గురుదేవా, తాముకూడా నావంటి మూగవానిచే అగమ్యమగు ఆధ్యాత్మ విషయములను చెప్పించితిరి. తమ యీ అద్భుతకార్యమును పోల్చి చెప్పుట అసంభవము. రామ-రావణులకు ఎలాటి యుద్ధము జరిగినదని ఎవరైన అడిగినచో ఆ యుద్ధము రామ-రావణ యుద్ధమువలెనే జరిగినదని చెప్పవలసి వచ్చును. (అన, పోల్చి చెప్పదగినది మరేదియూ లేదు). ఇదేరీతిని యీ తొమ్మిదవ అధ్యాయము దానికదియేసాటి. నేనిప్పటివరకు గీతయందలి మొదటి తొమ్మిది అధ్యాయములను వర్ణించితిని. యిక గీతయొక్క ఉత్తర ఖండమును వినుదురుగాక. ఈఖండ ప్రారంభమున అర్జునునకు శ్రీ కృష్ణుడు తన ప్రధానము మరియు గౌణ విభూతులను గురించి చెప్పును. ఇక యిది వర్ణింపబడును. ఇది దేశభాష అయినప్పటికిని, దీని సౌందర్యమును ఆధారమొనర్చుకొని శాంతరసము శృంగారరసము కంటె కూడా ముందుకు సాగిపోవును మరియు యీ దేశభాషా సుందర సాహిత్యము దానిచే శృంగారించబడును. సంస్కృత మూల శ్లోకములకు దేశ

భావలో చెప్పబడిన ఆశయము, అర్థమును చక్కగా వెల్లడించుటతోపాటు, యిందుమూలమేది? టీకాఏది? యని శ్రోతలు చకితులగునటుల నొనర్చును. ఎటులన, సుందర శరీరము తనకుగల జాతీయ లావణ్యమువలన స్వయముగ నగలకు అలంకారముగ నగును (అనగా సుందర శరీరము కలిగి యుండుటచే ధరించిన నగల సౌందర్యము వృద్ధియగును) మరియు అప్పుడు, నగలవలన శరీర సౌందర్యము పెరిగినదో లేక శరీర సౌందర్యమువలన నగల అందము హెచ్చినదో స్పష్టముగ చెప్ప వీలుపడదు. ఆరీతిగ, తాము శుద్ధము, సరళమునగు మతితో 'దేశభాష మరియు సంస్కృతభాషలు ప్రకృత విషయమున అర్థమనెడి ఒకే ఆసనము నధిష్ఠించి ఏవిధముగ సమానముగ ప్రకాశించుచున్నవో చూడుడు. ఏర్పడిన భావము ఆకారము పొందుట తోడనే రసవర్షము కురియసాగును, మరియు చాతుర్యశోభ పెంపొందును మరియు అది యింకను వికసించ సాగును. యిదేరీతిని, దేశభాషయందలి సమస్తసౌందర్యము మరియు ఆవేశము దోచి తేబడినవి మరియు వాటిద్వారా యీ గహనమగు గీతాతత్త్వము ప్రతిపాదింపబడినది. ఇక, సమస్త చరాచరములకు శ్రేష్ఠుడగు గురువున్నూ చతురజన చిత్తమును సంతుష్ట మొనర్చువాడున్నూ యగు ఆ యాదవనాథుడగు శ్రీ కృష్ణుడేమి చెప్పెనో వినుడు. శ్రీ కృష్ణుడు— 'ఓ అర్జునా, ఆత్మజ్ఞానమునకు సంపూర్ణ ప్రతిపాదనను వినుటకు యిక నీవు, నీ అంతఃకరణ పూర్వకముగ యోగ్యుడవైతివి' అని చెప్పెనని శ్రీనివృత్తినాథుని శిష్యుడగు జ్ఞానదేవుడు చెప్పుచున్నాడు.

శ్రీభగవానువాచః—

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః
యత్తే ఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥1

నే నిప్పటివరకు చెప్పినదంతయు నీకీవిషయమునెడ ఎంతశ్రద్ధ, అనురాగమూ గలదో తెలిసికొనుటకుమాత్రమే చెప్పితిని. ఈపరీక్షలో నీకీవిషయమునెడ పూర్తియైనశ్రద్ధగలదని తేలినది. మొట్టమొదట ఒకపాత్రిలో కొంతనీరుపోసి, ఆనీరు ఆపాత్రిలో నిలచునా లేక పార్లిపోవునా అని చూతురు. అటుల చూచినప్పుడు మొదటపోసిననీరు పార్లిపోనిచో మరికొంత నీటినిపోసి ఆపాత్రిను నింపెదరు. అందువలననే, నీకు మొదట కొద్దివిషయ

ములను మాత్రమే చెప్పితిని; ఇప్పుడు నీకు అన్ని విషయములు చెప్పవచ్చునని ధృవపడినది. క్రొత్తగా నౌకరును పెట్టుకొనినప్పుడు అతనిని పరీక్షించుటకై అతని కంటబడునట్లు ఏదైన విలువగల వస్తువును పెట్టవలెను. అప్పుడాతని కీవస్తువు నెడ అభిలాషకలుగకుండిని నమ్మకముకలిగినపిదప, ఆతనికి ధనసంబంధమగు పనిని వప్పగించవలెను. ఇదేరీతిని, ఓ అర్జునా, నీవు నాపరీక్షయందుత్తీర్ణుడవైతివి. ఇందుచే నీవు నాసర్వస్వమైతివి" ప్రభువగు శ్రీకృష్ణుడీరీతిని చెప్పెను; ఎత్తయిన పర్వతములను చూచి ఉప్పొంగి మేఘములు వర్షించుటకు సిద్ధమగురీతిగ శ్రీకృష్ణుడుకూడ ప్రేమచేనిండియున్నవాడై చెప్పసాగెను— "ఓ వీరశరుడవగు అర్జునా, వినుము. నేను నీకు మొదట చెప్పిన విషయములనే, మరల తిరిగిచెప్పెదను. ప్రతిసంవత్సరము వ్యవసాయముచేసినప్పుడు రైతుకు మంచిపంట ప్రతిసంవత్సరము లభించుచో, ఆరైతు ఆవ్యవసాయమునకై పరిశ్రమచేయుటకు వెనుకాడడు. మాటిమాటికి అగ్నిలో పుటముపెట్టి శుద్ధము చేయుటచే బంగారముయొక్క వన్నె యింకనూ వృద్ధియగుచుండును. కావుననే ఓ అర్జునా, బంగారమును ఎక్కువగా పుటముపెట్టి శుద్ధము చేసినది బాగుగా తళతళలాడును. ఇదేరీతిని, నేను నీకేవిధమగు ఉపకారమును చేయుటలేదు, కాని, నాయొక్క అనురాగముల ననుసరించి నాసంతోషముకొరకే యీమాటలను మాటిమాటికి చెప్పుచున్నాను. ప్రజలు చిన్నచిన్న బిడ్డలకు నగలుపెట్టెదరు. వారికి ఆ నగలనుగురించి ఏమిజ్ఞానము గలదు! కాని, ఆనగలను ధరించుటచే గలుగుఆనందము, సుఖములను తల్లులే పొందెదరు. ఇదేవిధముగ, నీకు ఆత్మహితము లభించుటతోపాటు నాసుఖము కూడ వృద్ధిపొందుచూ వుండును. కాని ఓ అర్జునా, యిక నీ ఆలంకారిక విషయములను పోనిమ్ము. ఇక నీమనస్సును ఏకాగ్రమొనర్చుటకు సంబంధించిన విషయములను వినుము. ఓ అర్జునా, నా రహస్యతత్త్వమును వినుము. ఈవాక్కులందు స్వయముగ పరబ్రహ్మమే అక్షరరూపధారణమొనర్చి నిన్నాలింగనమొనర్చుకొనుటకై వచ్చుచున్నాడు. అయినప్పటికిని, ఓ అర్జునా, నావాస్తవికము, నిశ్చితమునగు జ్ఞానము నీకింతవరకును కలుగలేదు. నీకిచ్చుట కనిపించెడి నేనే, యీసమస్తజగత్తునై యున్నాను.

న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః॥ 2

"నా స్వరూప ప్రతిపాదన మొనర్చుటయందు వేదములుకూడ మౌనము వహించినవి. మనస్సు మరియు వాయువుకూడ అంతవరకు పోలేవు. రాత్రి కాకున్నప్పటికినీ మరియు పగలు వున్నప్పటికినీ సూర్య చంద్రులు నిస్తేజులైరి. తల్లి ఉదరమందుండెడి గర్భము మాతృ కారుణ్యమును చూడజాలని రీతిని ఏ దేవతయును ఎన్నడును నన్ను గురించిన జ్ఞానము కలుగజాలదు. చేప అపారమగు సముద్రమును కొలువ జాలని రీతిని, లేదా దోమ లంఘించి ఆకాశ మండలమును దాట జాలనటుల, యీ మహర్షుల జ్ఞానముకూడా నా స్వరూపమును చూడజాలదు నేనెవరిని, ఎంత పెద్దవాడను, దేనినుండి ఉత్పన్నమైతిని - మొదలగు ప్రశ్నలను నిర్ణయించుటలో ప్రజలు పెక్కు కల్పములను గడపిరి. ఎంతమంది దేవతలు, మహర్షులు మరియు అన్యసమస్త భూతములు గలవో, వాటన్నిటికిని మూలకారణము నేనగుటయే యిందుకుగల కారణము. కావున ఓ అర్జునా, వారికి నా జ్ఞానము కలుగుట చాలకష్టము. పల్లము కు ప్రవహించుచున్న నీరు అందుకు విరుద్ధముగ పర్వతముపై కెక్క గలుగుచో, లేదా పైకి పెరుగుచున్న చెట్టు అందుకు మారు క్రిందికిపోయి దాని మొదలుతో కలియగలుగుచో, నానుండి ఉత్పన్నమగు యీ జగత్తుకూడ నన్ను తెలిసికొన గలదు. వటవృక్షమునుంచి కారెడి జలముతో వటవృక్షమునంతను కప్పుటకు వీలగుచో; లేదా నీటితరంగమున సముద్రమంతయు నింపివేయబడ గలుగుచో, లేదా సూక్ష్మమగు మృత్తికాకణములందీ భూమియంతయు యిముడ గలుగుచో, యీ భూతకోటి, మహర్షులు మరియు దేవతలు మొదలగు నానుండి ఉత్పన్నమైన వారందరు నన్ను తెలిసికొన గలరు.

యోమామజ మనాదించ వేత్తి లోక మహేశ్వరమ్
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥3॥

"అయినప్పటికిని ఎవడు తన సహజము మరియు లౌకికము నగు ప్రవృత్తియొక్క ముందునడకనువిడచి ఇంద్రియ పరాఙ్ముఖుడుగా నుండునో, లేదా ఎవని ముదుకుసాగెడి ప్రవృత్తి వెనుకకు మరలి తనదేహాభావమును మరచి పంచమహాభూత శిఖరముపై కెక్కునో మరియు అచ్చట చక్కగా నిలకడొక్కకొని తన నేత్రములతో నా జనన—మరణములులేని స్వరూపమును చూచునో, మరియు ఎవడీరీతిని మూలకారణమునకు భిన్నమైనదిన్ని

సమస్తలోకములకు నియంతయూ నగు నాయొక్క శుద్ధశాశ్వతస్వరూప మును తెలిసికొనునో, అతడు జీవరూపముననున్న రాళ్ళయందలి స్పటికమణి వంటివాడని నీవు తెలిసికొనుము. అన్నరసములందును అమృతము శ్రేష్ఠమై నటుల, అతడు మనుష్యకోటియందలి సాపరిత్యక్తాంశయేనని నీవు తెలిసి కొనుము. అతని అవయవములు మనుష్యరూపముననున్న వృక్షముయొక్క కోమల అంకురములేనని భావించుము. అతనియందు కనిపించెడి మనుష్యభావము వాస్తవమునకు భ్రమయేనని మరియు కేవలము లౌకికదృష్టివలననే అటుల కనుపించుననియు తెలిసికొనుము. అతని ఆ మనుష్యభావమున సత్యాంశము ఏమాత్రమున్నూ లేదు. కర్పూరమున ఏదోవిధమున వజ్రమణి కలిసిపోయి యున్నప్పుడు, వాటిపైన ఎచ్చటనుంచియో నీరువచ్చిపడుచో, కర్పూరము కరగిపోవును కాని దానితోపాటు వజ్రము కరగిపోదు. ఇదేవిధమున, యిట్టి పురుషుడు మనుష్యలోకమునం దుండుటచే బయటకుచూచుటకు ప్రాకృత మనుష్యులవలె కనిపించినప్పటికిని, అతనియందు మాయాదోషము మేమాత్రి మున్నూ వుండదు. పాపములు తమంతతామే అతనిని విడచిపోవును; మరియు మండుచున్న చందనతరువృక్షమువదలి సర్పము తనంతతానే తొలగిపోవురీతిని సంకల్పములన్నియుకూడ నన్నెరింగిన మనుష్యుని వదలిపోవును. ఈవిధమగు జ్ఞానము మనుష్యున కెటులకలుగునో చెప్పెదను వినుము. నావికారములేవో, నేనెట్టివాడనో, మరియు నాధర్మములేవో నీవు వినుము.

బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమాసత్యం దమశ్శమః
సుఖందుఃఖం భవోఽభావో భయంచాభయమేవచ॥ ౪

అహింసా సమతా తుష్టిస్తపోదానం యశోఽయశః
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః॥ ౫

"భిన్నభిన్నములగు సమస్తభూతములందును నిండియున్న నాభావ ములు (వికారములు) అన్నియు ఎచ్చట నేటియందుండునో, వాటికి అనురూ పమగు స్థితియందే ముల్లోకములందును వ్యాపించియున్నవి. ఈ భావముల (వికారముల) లో ప్రథమస్థానము బుద్ధిది. ఇటుపిమ్మట అపారజ్ఞానము, మోహములేకుండుట, సహనశీలత, క్షమ మరియు సత్యములు. అటుపైన

మనోనిగ్రహము మరియు యింద్రియనిగ్రహములు వచ్చును. ఈరీతిని, ఓ అర్జునా, జగత్తునందలి సుఖ-దుఃఖములు మరియు జనన-మరణములుకూడ నాభావములలోనివే. అంతేగాదు, భయము మరియు నిర్భయము, అహింస మరియు సమత్వము సంతోషము మరియు తపస్సు, దానము, యశస్సు మరియు అపయశస్సు మొదలగు భూతకోటియందు కనిపించెడి భావములు కూడ నానుండియే పుట్టినవి. భూతములన్నియు భిన్నభిన్నముగ నున్నటుల యీ భావములు కూడ భిన్నభిన్నములుగా నున్నవి. కాని, వీటియందు కొన్నిటికి నాజ్ఞానము కలుగును. మరికొన్నింటికి కలుగదు. ప్రకాశము మరియు అంధకారములు రెండునూ సూర్యుని వలననే కలుగుచున్నవి. సూర్యుడు ఉదయించినప్పుడు ప్రకాశము వచ్చును. అస్తమించునప్పుడు అంధకారమగును. ఇదేవిధముగ నన్ను ఎరుగుట, ఎరుగక పోవుటలు ఆ భూతముల కర్మఫలము ననుసరించి యుండును. కాని, భూతకోటి నా భావములను కలిగి యుండుట విషమమగును. ఇటుల ఓ అర్జునా, భూతసృష్టి యంతయు నా భావములచే బంధింపబడి యున్నది. ఇక, యీ సృష్టిని పాలించెడి మరియు సమస్తలోక వ్యవహారములను తన ఆధీనమందుంచుకొనెడి మరి పదునొకండు భావములు గలవు. వానిని వివరించి చెప్పెదను వినుము.

మహర్షయః సప్తపూర్వే చత్వారో మనవస్తథా ।
మద్భావా మానసాజాతా యేషాంలోక ఇమాఃప్రజాః॥ ౬

మహర్షులందరిలోను గుణమునందును జ్ఞానమునందును శ్రేష్ఠులగు కశ్యపాది సప్తమహర్షులున్నూ, మరియు పదునల్గురు మనువులలోను స్వాయంభువు మొదలగు నలుగురు ముఖ్యమనువులున్నూ—ఓ అర్జునా, యీ పదునొకండుగురు నాభావములే. వారు నామనస్సునుండి జన్మించిరి మరియు వారి జనన హేతువు సృష్టివ్యాపారమే. లోకములు ఏర్పడనంత వరకును మరియు యీ త్రిభువనములు వ్యాపించనంత వరకును మహాభూత సమూహము నిష్క్రియతోనే యుండెను. ఆపైన, యీ పదునొకండుగురు జన్మించిరి మరియు వీరే యీ లోకముల నుత్పన్నమొనర్చి, యీ లోకములందు విభిన్నులగు అష్ట లోకపాలురగు అధిపతులను నియమించిరి. ఈ విధముగ యీ పదునొకండుగురును రాజులు; మిగిలిన జగత్తంతయు వీరి ప్రజలు. ఈ జగత్తంతయు నా

వలన వ్యాపించియున్నదని నీవు జ్ఞప్తియందుంచుకొనుము. ఆరంభమున కేవల మొక్క బీజమేయుండును, ఆ పైన ఆ భీజమునుండి మొదలువచ్చును. దాని నుండి మొలకవచ్చును. ఆ మొలకనుండి శాఖలువచ్చును. ఆపైన ఆ శాఖల నుంచి ఉపశాఖలున్నూ, వాటి అన్నిటినుండి ఆకులున్నూ వచ్చును. ఆ ఆకులందు పుష్పములు ఫలములు వచ్చును, ఈరీతిని వృక్షత్వము పూర్ణత్వమును పొందును. ఈ వృక్షత్వమును గురించి చక్కగా యోచించినచో యావం తయు ఆ చిన్నబీజముయొక్క విస్తరణమేనని బోధపడును. ఇదేవిధమున 'నేను' కూడ ఒకేమూలతత్త్వమును. ఆ 'నేనే' మనస్సును జనింపజేసినది మరియు ఆ మనస్సునుండి సప్తమహర్షులు [illegible] నలుగురు మనువులు జన్మిం చిరి. ఈ పదునాలుగురు లోకపాలురను సృజించిరి. ఈ లోకపాలురు పెక్కువిధములగు ప్రజలను సృష్టించిరి. వారినుండి ఈ ప్రపంచమంతయుపుట్టినది. ఈ రీతిని, యీ జగత్తంతయు నేనే వ్యాప్తమై యుంటిని. కాని, యివన్నియు ఎవనికి బోధపడును? ఈ భావోన్నతిని గురించిన శ్రద్ధతో కూడుకొని యున్న మనస్సుగల వానికి మాత్రమే యిది బోధపడును.

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥౭॥

"ఈవిధముగ, ఓ అర్జునా, యీ భావములు నా మూర్తులే, మరియు యివి యీజగత్తు నంతను వ్యాపించి యున్నవి. అందుచే, బ్రహ్మ మొదలుకొని కీటకము వరకు గల యీ సృష్టియందు నేనుతప్ప మరే వస్తువున్నూ లేదు. ఈవిషయము తెలిసినవానియందు జ్ఞానము జాగరితమగును మరియు అప్పు డాతనికి శ్రేష్ఠుడు మరియు కనిష్ఠుడు, మంచి-చెడ్డ మొదలగు భేదభావములతో కూడిన దుస్సంకల్ప స్వప్నములు రావు. ఇదియే నావిభూతి, మరియు సమస్త వ్యక్తులును నా యీ విభూతికి అధీనులే. కావున, ఆత్మయోగానుభవము వలన వీటన్నిటిని ఒకే ఆత్మస్వరూపముగ అంగీకరించుట ఉచితమూ ఆవశ్య కమూనై యున్నది. తన మనోబల సహాయముచే యీ ఆత్మయోగము ద్వారా నాతో కలసి సమరసత్వము నొందినవాడు అత్యంత శుద్ధుడగును. ఈ విషయ మున సందేహించుటకు తిలమాత్రమునూ తావులేదు. మరియు ఓ అర్జునా, ఈరీతిని నన్ను అభేదభావముతో భజించువాని యింట నేను ప్రవేశించి

యుండుట ఆవశ్యకమగును. అందువలననే, నేను చెప్పిన అభేదాత్మక భక్తి యోగమున ఏవిధమగు సంశయమున్నూ కలుగజాలదు; అందు దౌర్భల్యము నకు కూడ ఏమాత్రమూ తావులేదు. ఇంతకు పూర్వము (ఆరవ అధ్యాయమున) భక్తియోగమొనర్చు సమయమున మరణించినను మేలేయగునని స్పష్టముగ చెప్పబడినది. ఇక యీ అభేద స్వరూపమేదో చెప్పెదను వినుము.

అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ॥౮॥

ఈజగత్తున కంతకు మూలము నేనే. మరియు ఓ అర్జునా: నావలననే యివన్నియు వుండుటకు, గతించుటకు జరుగును. తరంగములు నీటియందుత్పన్న మగును; మరియు వాటి ఆశ్రయము మరియు జీవితసాధనమూ రెండునూ నీరే నీరులేనిదే తరంగములు ఏర్పడనే ఏర్పడని రీతిని యీ జగత్తునందు నేను లేన ట్టిన్ని, నేను నివసించనట్టిన్ని వస్తువు వుండనే వుండదు. నాయీ విశ్వవ్యా పక స్వరూపము నెరింగినవారు ఎచ్చటనుండి నన్ను భజించినప్పటికిన్ని, వారు వాస్తవముగ ఉదయించిన ప్రేమ భావముతోనే నాభజన మొనర్తురు. వాయువు గగనరూపమును ధరించి గగనమున సంచరించు రీతిని. దేశ, కాల, వర్తమానాదుల నన్నింటిని నాకు భిన్నమైనవి కావని అంగీకరించినవారు జగ ద్రూపుడనగు నన్ను మనమునందుంచుకొని తమ ఆత్మజ్ఞానముచే త్రిభువనము లందును సుఖముగ రమణమొనర్తురు. భూతకోటిలో కనిపించు ప్రతిదానిని భగవంతుని రూపముగా భావించుటయే నా నిజమగు భక్తియోగమని నిశ్చిత ముగ నీవు తెలిసికొనుము.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తిచ రమన్తిచ ॥౯॥

తేషాం సతతయుక్తానాం భజతాంప్రీతి పూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తితే ॥౧౦॥

ఎవని చిత్తము మద్రూపమగునో, ఎవని అంతఃకరణము నాస్వరూప ముతో పరిపూర్ణ సమాధిని పొందునో, మరియు ఎవడు ఆత్మబోధయందే

ప్రేమయందుపడి జనన - మరణముల నన్నిటిని మరచిపోవునో, అట్టివాడు వృద్ధి పొందుచున్న ఆత్మబోధ ప్రభావమువలన అద్వైతానంద సుఖమున చిందులు త్రొక్కసాగును. మరియు తనలోతాను కేవలము ఆత్మబోధవ్యాపారము నే ఒనర్చును. దగ్గరదగ్గరగా నుండెడి సరోవరములు మీద వచ్చినప్పుడు ఒకదానితో నొకటి కలసిపోవు రీతిని మరియు ఒక సరోవరపు తరంగములు మరొక సరోవరమునందుండు రీతిని అభేద భక్తిగల భక్తులు ఒకరినొకరు కలిసినప్పుడు వారిలో ఏకత్వమేర్పడును. అప్పుడు ఆనంద నిలయములు ఒకదానితో నొకటి ఐక్యమగును. మరియు ఆత్మబోధకు ఆత్మబోధమూలముననే ఆత్మబోధయనెడి అలంకారములభించును. మరియు యీ రీతిని ఆత్మబోధకుగల సౌందర్యము వృద్ధియగును. ఒక సూర్యుడు మరొక సూర్యునకు హారతి యిచ్చినటుల లేదా ఒక చంద్రుడు మరొక చంద్రుని ప్రేమతో ఆలింగన మొనర్చుకొనినటుల, లేదా ఒకే పరిమాణముగల రెండు జలప్రవాహములు ఒక దానితో నొకటి కలసిపోయి నటుల, భక్తి యోగయుక్తులగు భక్తులు ఒకరి నొకరు కలసికొని నప్పుడు వారి సమరసత్వము ఏ పవిత్రమగు ప్రయాగతీర్థముగ నగును మరియు ఆతీర్థజలమున సాత్త్విక భావములనెడి వరదవచ్చును మరియు వారు ఏకత్వముతో కూడియున్న నాల్గుమార్గములకూడలికి అధ్యక్షులుగ గణేశులుగా నగుదురు, ఇటులైనని, అత్యంత ఆత్మానంద సుఖము చేనుండియున్న ఆ భక్తియోగులు దేహభావపాలిమేరను దాటి నన్ను పొందుటచే పూర్ణసమాధిని పొందినవారై ఉచ్చస్వరమున ఘోషించసాగెదరు. ఏకాంతమున శిష్యునకు గురువుపదేశించిన మంత్రాక్షరములను వారు అందరి ఎదుటను మేఘగర్జనవలె గర్జించుచూ జపింతురు. తామర (కమలము) మొగ్గ పూర్ణావస్థను పొందినప్పుడు తనలోగల మధురసమును ఏ విధముగను దాచియుంచ జాలదు మరియు రాజునుండి దరిద్రుని వరకుగల అందరికిని ఒకేరీతిని ఆతిథ్యసత్కారము లొనర్చును. ఇదేవిధమున, ఆ భక్తియోగులు కూడ అతిశయించిన ఆనందముతో నిండియుండి జగత్తున నాజయఘోష నొనర్తురు మరియు ఆకీర్తి ఘోషవలన ఉత్పన్నమగు సంతోషములో వారు చివరకు కీర్తించుటను మరచి స్తబ్ధులగుదురు మరియు ఆ విస్మృతియందే తనువు - మనస్సులతో రమణమొనర్తురు. ఈ ప్రేమాతిరేకమున వారికి రాత్రింబవళ్ల స్మరణకూడ వుండదు. ఈరీతిని నా స్వరూపలాభమును పొందుటద్వారా నిర్దోషమగు సంపూర్ణ సుఖమును పొందినవారికి నే

నిచ్చు వస్తువునందలి సర్వోత్తమ భాగము మొదటినుండియే వారి ఆధీనమం దుండును. ఏలనన, వారు పోవుమార్గమందలి ఏర్పాట్లు చూచుచో స్వర్గ, మోక్షమార్గములుకూడ వాటిముందు తుచ్ఛమైనవి, విడచివేయ దగినవిగను కనుపించును. కావున, వారు తమ మనస్సునందు నాపట్ల ఏకత్ర మొనర్చి యుంచు ప్రేమనే తిరిగి వారికి నేనివ్వ గోరుదును. కాని, వారికి నేనివ్వదల చెడి ప్రేమ వారికి మొదటినుంచియే లభించియుండును. ఇకవారికి కావలసి నది, వారి ప్రేమ - సుఖను క్రమక్రమముగ వృద్ధి పొందుచుండుటయే; అందు కొరకై నేను వారి ప్రేమపైన కాలుని దృష్టిపడకుండుటకును మరియు అదినశించ కుండుటకును కావలసిన ఏర్పాటులను చేతును ఓ అర్జునా, తల్లి తన ప్రియ పుత్రునిపై తన స్నేహపూరితదృష్టి యనెడి ఆచ్ఛాదనమును వేసి, ఆతనిని కాపా డును; మరియు ఆతడు యిటునటు పరుగెత్తునప్పుడు ఆమె ఆతనివెంట పరు గెత్తుచూ వుండును. మరియు ఆతనికి ఏఏఆటలు యిష్టమో ఆ ఆటలకు అను కూలించు ఆటవస్తువులను తయారుచేసి ఆతని ముందుంచును. సరిగా యీవిధ మున, భక్తియోగులగు నాభక్తులకొరకై వారి ఉపాసనా మార్గపోషణ జరుగు పనులను నే నొనర్తును. నేను చేయు ఉపాసనా మార్గపోషణమువలన వారు సహజముగను నిరాపదతోను నన్ను చేరునటుల చూచుటే నేను తప్పక చేయవలసినపని. భక్తులకు నాయెడ అనన్యభావముగల ప్రేమయుండును, మరియు నాకుకూడ వారి అనన్యశరణాగతిని గురించి పూర్తియగు శ్రద్ధ యుంచవలసి యున్నది; ఏలనన, ప్రేమపూరితులగు భక్తులకు ఏదైన కష్టముగలుగుచో, అది నాకే స్వయముగ వచ్చినటుల భావింతును. స్వర్గ-మోక్షములనెడి రెండు మార్గములను వారిసేవకొరకైయే నేను నియుక్త మొనర్తును. ఇంతేగాదు, నేను స్వయముగ లక్ష్మీసహితముగ నా శరీరమునంతను వారి పనికైయే అర్పిం తును. కాని, దేహమునకు భిన్నమైనదీ మరియు ఎల్లప్పుడు సర్వోత్తమదిగను నుండు ఆత్మసుఖమును నా ప్రేమపూర్ణభక్తులకొరకై వేరుచేసి యుంచు దును. కాని యీ విషయము శబ్దములచే చెప్పునలవి కానట్టిది.

తేషామే వానుకమ్పార్థ మహ మజ్ఞానజంతమః।

నాశయా మ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥౧౧॥

"కావున, ఎవరు నాఆత్మస్వరూపమును కలిగియుండుటనే తమ జీవిత

మునకు ఆశ్రయ-స్థలముగా నొనర్చుకొనియున్నారో, ఎవరు నాపైనెప్పు మరి యేయితరమునకంటెను శ్రద్ధకలిగియుందురో, ఓ అర్జునా, అట్టి శ్రేష్ఠులగు తత్త్వజ్ఞులకొరకు నేనెల్లప్పుడు కర్పూరపు దివిటీని వెలిగించి, మరియు వారి కొరకు నేను స్వయముగ దీపము పట్టువాడనై వారికి ముందుగా నడతును. అజ్ఞానమనెడి రాత్రియందుండెడి అంధకారమును నాశనమొనర్చి వారికొరకు నేను అక్షయ ప్రకాశోదయము నొనర్తును. ప్రియభక్తుల ప్రేమవిధానము నీవిధముగా శ్రీకృష్ణుడు చెప్పినమీదట అర్జునుడిట్లనెను—"నేనిప్పుడు పూర్తిగా తృప్తిపొందితిని. ఓ ప్రభూ వినుడు. తాము నాకుగల సంసారమనెడి మాలిన్యమును దూరమొనర్చిరి. నేనిప్పుడు జనన-మరణాగ్నినుంచి ముక్తుడ నైతిని. నేడు నాకు నిజమగు జీవిత రహస్యము బోధపడినది. మరియు నేడు నాజీవితము సార్థకమైనట్లు బోధపడుచున్నది. నేడు నా జీవితము కృతకృత్యమైనది. నేడు నాసౌభాగ్యోదయమైనది; ఏలనన, నేడు పరమేశ్వర ప్రసాద-వాణి నాకర్ణములను సంస్కరించినది. నేడీ వాణీప్రకాశమువలన నా లోపల-బయటాగల భ్రమపటలము తొలగిపోయినది మరియు అందుచే యీ సమయమున నాకు తమ సత్యస్వరూప దర్శనమగుచున్నది.

అర్జున ఉవాచ—

పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమంభవాన్।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవ మజం విభుమ్ ॥౧౨॥

"ఈజగత్తుకు విశ్రాంతి-స్థానమగు పరబ్రహ్మము తామే. ఓజగన్నాథా, తాము పరమపవిత్రులు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురకును పరమ దేవులు తామే. ఇరువదైయైదవ తత్త్వమగు పురాణ పురుషులు తామే. తామే మాయాతీతులు. స్వయంసిద్ధమగు జగత్స్వాములు, జన్మబంధమున ఎన్నడును పడని వారూ తామే. నాకిప్పుడీ విషయము చక్కగా బోధ పడినది. భూత, భవిష్యద్వర్తమానములనెడి త్రికాలములకును తామే సూత్ర ధారులు. ఈ జీవాత్మకు తామే అధిపతులు, యీ బ్రహ్మాండ పరిపాలకులు తామే. ఇదంతయు నాకు చక్కగా బోధపడినది.

ఆహుస్త్వామృషయస్సర్వే దేవర్షిర్నారద స్తథా।
అసితో దేవలో వ్యాసస్స్వయం చైవ బ్రవీషి మే ॥౧౩॥

"ఈజ్ఞానము నింకొకరీతిని కూడా పరీక్షించవచ్చును. ఇప్పటి వరకు పుట్టిన గొప్పగొప్ప శ్రేష్ఠులగు మహర్షులు కూడ తమ్మీవిధముగనే వర్ణించిరి. వారు చేసిన వర్ణన లందలి యాదార్ఢ్యము నాకిప్పుడు చక్కగా అనుభవమైనది. ఈ వరత లందరు తమ ప్రసాద ఫలములే. ఈవిధముగ నారదు డెల్లప్పుడు నావద్దకువచ్చి మీ గుణగీతమును గానమొనర్చుచుండును. కాని అందలి అర్థము నాకు బోధపడెడిది కాదు; అందుచే నేనా గాన మాధుర్యమును మాత్రము ఆస్వాదించుచుండెడివాడను. గ్రుడ్డివాని గ్రామమున సూర్యప్రకాశము కలుగుచో, ఆ గ్రుడ్డివారు కేవలము ఆసూర్యకిరణ సుఖమును మాత్రమే అనుభవించ గలరు. అంతేగాని, వారు సూర్యప్రకాశము నెటుల అనుభవించగలరు? ఇదే విధమున నారదుడు నావద్దకువచ్చి ఆధ్యాత్మ గీతములను గానమొనర్చినప్పుడు ఆ రాగ-రాగిణుల వలన బయటకు కనిపించు మాధుర్యము మాత్రమే నామనస్సుకు రుచించుచుండెడిది. ఇంతకు మించి నాకేదియూ బోధపడెడిదికాదు. అసితుడు మరియు దేవలుడు-అనెడి ఋషుల నోటినుండి కూడ మీ స్వరూపవర్ణనమును వింటిని. కాని ఆసమయమున నా మనోవృత్తి విషయ విషముచే నిండియుండెను. ఆవిషయ-విష ప్రాబల్యాధికము వలన ఆసమయమున మధురమగు ఆధ్యాత్మ విద్యకూడ నాకు కటువుగా నుండెను. మరియు కటువగు విషయములుకూడ మధురముగ తోచుచుండెను. ఇక యితరులను గురించి యేల, స్వయముగ వ్యాసమహర్షికూడ మాయింటికివచ్చి ఎల్లప్పుడు మీస్వరూప వర్ణనములను చేయుచుండెడివారు. కాని, చీకటిలో చింతామణి దొరకినప్పుడు 'యిది చింతామణి కాదని పారవేసి, మరల పగలు వచ్చినప్పుడు ప్రకాశమున, దాని స్వరూపమును గుర్తించి 'యిది చింతామణియే' యన్నటుల, ఆవ్యాసాది మహర్షుల వాణి జ్ఞానరత్నములగని యైనప్పటికిని, ఓ శ్రీకృష్ణమహారాజా, అప్పుడు, సూర్యసమానులగు తాము లేనందువలన తమఃప్రకాశముకూడా లేకుండెను. అందుచే నేను జ్ఞానరత్నములను గుర్తించ జాలకపోతిని.

సర్వమేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ।
నహితే భగవన్ వ్యక్తిం విదుర్దేవాన దానవాః ॥౧౪॥

"కానీ యిప్పుడు, తమ వాక్యకిరణ ప్రసారమైనది; అందుచే నేనిప్పుడు

ఆ ఋషులు చెప్పిన మార్గమును వర్తించసాగితిని. ఓ దేవా, వారి వాక్కులు జ్ఞానబీజములే, అయినప్పటికిని, అవి హృదయమనెడి భూమిలో అనేకవిధముగ పడియున్నవి. కాని, యిప్పుడు నాని (హృదయభూమి) పైన తమప్రసాదమనెడి వర్షము కురియుటచే, ఆ బీజములు మొలకెత్తినవి; మరియు వాటియందు ఏకవాక్యతయనెడి ఫలము కాచినది. నారదాది మహాత్ముల వాక్కులు నదులవంటివి, కాని, ఆనదులద్వారా నేను నేడు ఏకవాక్యతయనెడి అపార సుఖసాగరము నైతిని. ఓ ప్రభూ, నేనీజన్మలో చేసిన ఉత్తమపుణ్య కార్యములన్నింటను, ఓ [illegible], తాము నాకివ్వగలిగిన వస్తువును యివ్వగల సామర్థ్యము లేకపోయెను. తమ కృప కలుగనంతవరకు నాకేదియూ బోధపడుచుండెడిదికాదు. కాని, దైవము అనుకూలించినప్పుడు చేసిన ప్రతిప్రయత్నమున్నూ తనంతతానే ఫలించును. ఇదేవిధముగ, వినినట్టి మరియు చదివినట్టి జ్ఞానము కూడా గురుకృప కలిగినప్పుడే ఫలదాయకమగును. తోటమాలి జీవితమంతయూ చాల ఎక్కువగ కష్టించి మొక్కలకు నీరుపోయుచుండును; కాని వసంతఋతువు వచ్చినప్పుడు మాత్రమే ఆ మొక్కలనుండి ఫలప్రాప్తియగును. ఓ మహారాజా, విషజ్వరము పూర్తిగా తగ్గినప్పుడే మనకువస్తు మాధుర్యము అనుభవమగును. ఇంద్రియములు, వాక్కు మరియు ప్రాణవాయువుల జన్మ ఎప్పుడు సార్థకమగును? వాటియందు చైతన్యము సంచరించినప్పుడే. ఇదే విధమున, సాహిత్యమును మనసార మథించుటవలనగాని, లేదా యోగాదులనభ్యసించుట వలనగాని-వీటివలన వాస్తవిక ఫలిత మెప్పుడు కలుగును? గురుదేవుని కృప కలిగినప్పుడే," ఈ రీతిని ఆత్మానుభవ రంగమున రంగరింపబడిన అర్జునుడు నిస్సంశయుడై కీలుబొమ్మవలె నాట్యమొనర్చసాగెను, మరియు ఇటుల చెప్పసాగెను — "ఓ దేవా! మీ మాటలు చక్కగా నా మనసున నాటుకొనినవి. ఓ పరబ్రహ్మరూపుడవగు శ్రీకృష్ణా! దేవతలు లేదా దానవుల బుద్ధికూడా మీ సత్యస్వరూపమును ఆకళింపుజేసికొనజాలదని నాకిప్పుడు పూర్తిగా తెలిసినది. అంతేగాక, మీబోధ లేకుండా కేవలము తనబుద్ధిబలము వలననే జ్ఞానమును పొందదలచినవాడు నిరాశను పొందితీరవలెనని కూడా నాకిప్పుడు చక్కగా విశ్వాసము కలిగినది.

స్వయమేవాత్మనాఽఽత్మానం వేత్థత్వం పురుషోత్తమ<br>
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే ॥౧౫॥

"ఆకాశము ఎంతవరకు వ్యాపించియున్నదో సరిగా తెలిసికొనుటకు ఆకాశమునకే వీలగునటుల, లేదా పృథ్వియొక్క ఘనత్వమును కొలచుటకు పృథ్వికిమాత్రమే సంభవమైనటుల, ఓ లక్ష్మీనాథా! తాముకూడా, తమ అపారశక్తిని తామే తెలిసికొనగలరు. తాము గాక యితరములగు వేదాదుల బుద్ధి యీ విషయమున వ్యర్థముగనే భ్రమించి తిరుగును. వేగమున మనస్సును మించిపోగలిగినది, లేదా వాయువును తన గుప్పిట పట్టుకొనగలిగినవాడూ, లేదా ఆది శూన్యతత్త్వమును మించి ముందుకు పోగలిగిన శక్తి ఎవరికిగలదు? ఇదేరీతిని, తమను గురించిన పరిపూర్ణజ్ఞానమును పొందుటకు కూడ ఎవరికిని సంభవము కాదు. తమనుగురించిన పరిపూర్ణజ్ఞానము తమ కృపవలనమాత్రమే ప్రాప్తించగలదు. కేవలము తాముమాత్రమే తమ్మెరుగుదురు; మరియు తామే యితరులకుకూడ యీ జ్ఞానము కలుగునటుల చేయగలరు. అందుచే నేనుకూడ ఆ జ్ఞానమునకై పరితపించుచున్నాను. తామొకమారు నాకా జ్ఞానమును ప్రసాదించి నా పరితాపమును పారద్రోలుడు. ఓ దేవా! తామే యీ భూతకోటికి ఆదికారణులు, జగద్భ్రాంతి యనెడి ఏనుగును నాశమొనర్చెడి సింహము తామే, దేవతలందరు తమ్మే ఆరాధించుచున్నారు. తామే ఈసృష్టినంతయు నడపువారు మరియు పోషించి పాలించువారునై యున్నారు. తమ మహాత్త్వమునుగురించి యోచించగా, మీ సమీపమున నిలచుండు యోగ్యతకూడ నాలో లేదని - నేను వినియున్నాను, ఇటుల తలచి నేను భయపడి మిమ్ము ఆత్మజ్ఞానమునుగురించి ప్రార్థించకున్నచో నే నాజ్ఞానమును పొందుటకు మరేసాధనము కనిపించుటలేదు. నలువైపులను ఎన్నినదులు మరియు ఎన్ని సముద్రములు జలపూర్ణముగ నున్నప్పటికిని చాతకపక్షికి ఆ జలాశయములన్నియు వ్యర్థములేయగును, ఏలనన, దానికిపనికివచ్చు నీరు మేఘములనుంచి పడునదే! ఇదేవిధమున, ఓ ప్రభూ! గురువులు అంతటను గలరు. కాని, ఓ కృష్ణదేవా, నాకు తాముతప్ప మరే ఆధారమూ లేదు. తామిక దయదలచి తమ విభూతులను చెప్పుడు.

వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః
యాభిర్విభూతిభిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥౧౬॥

ఓ మహారాజా! తమ దివ్య సామర్థ్యమువలన అంతటను వ్యాపించు

చున్న తమ విభూతులను నాకిక చూపుడు. తా మే విభూతులతో యీ జగత్తునందంతటను నిండియున్నారో, అందలి ముఖ్యముఖ్యవిభూతుల పేర్లను తాము దయతో నాకు చెప్పుడు.

కథం విద్యామహం యోగిన్ త్వాం సదా పరిచిన్తయన్
కేషుకేషుచ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా ॥౧౭॥

"ఓ దేవా! నేను మిమ్మెటుల తెలుసుకొనగలనో మరియు మిమ్మేమని భావించి చింతన మొనర్పవలెనో నాకు దయతో చెప్పుడు, ఇక, యీ జగత్తంతయు తామేనని చెప్పుచో చింతన మొనర్చుటకు తావెద్దియూ వుండనే వుండదు. కావున, తామిప్పుడు చెప్పిన భావములను యింకొంత వివరించి చెప్పుడు. మిమ్ము వేటిద్వారా చింతనమొనర్చుట నాకు కష్టకరము కాదో అట్టి మీ భావములను నాకు చెప్పుడు. మరియు తాము నాకు లభించు ఉపాయమేదో సెలవిండు.

విస్తరేణాత్మనో యోగం విభూతించ జనార్దన
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥౧౮॥

"భూతకోటికి అధిపతివగు ఓ శ్రీకృష్ణా, నేను ప్రశ్నించిన విభూతులను గురించి చక్కగా వర్ణించి చెప్పుడు. మీరిటుల చెప్పిన చెప్పవచ్చును— "నేనొకమారా విభూతులనుగురించి చెప్పియున్నాను. వాటిని గురించి మరల ఏల చెప్పను?". కాని, ఓ దేవా, మీరిటుల సంశయించ నక్కరలేదు; ఏలనన, ఒక్కమారు ఏ స్వల్పముగానో అమృతమును పానము చేయు అవకాశము లభించినవారు 'యిక నాకక్కర లేదని' అనువా? అటులవద్దను నటుల చేయువ దగుచో, అది అమృత మెటులగును? ఏది హాలాహాల విషమునకు సహోదరుడో, మృత్యుభయముచే భీతినొందిన దేవతలు అమరులగుటకు దేనిని పాన మొనర్చిరో, కాని, దేనిని పానమొనర్చినప్పటికినీ బ్రహ్మయొక్క ఒకే దినమున పదునల్గురు యింద్రులు అమరరాజ సింహాసనముపై కూర్చొని, మరియు నాశ మొందుదురో—ఏ అమృత మిటుల క్షీరసముద్రమునుంచి వెలువడిన ఒక సామాన్య రసమో మరియు దేనిని పానమొనర్చుటచే అమరత్వము సిద్ధించు

సనెడి మిథ్యాభ్రమ ప్రజలయందు వ్యాపించి యున్నదో, అట్టి అమృతపు మధురబిందువుకూడ లోకులకు సరిపోయినటుల తృప్తికలుగటలేదు. మరియు ఆకొద్దిగా పానమొనర్చి వారు తృప్తినొందుటలేదు; ఇంత క్షుద్రవస్తు మాధుర్యమే యింత అధికమగు ఆదరమును పొందుచున్నప్పుడు, యిక తమ యీ బోధవాక్యముల మహత్త్వమును గురించి ఏమిచెప్పను! ఇవి ప్రత్యక్ష పరమామృతములే! వీటికొరకు, మందర పర్వతము కవ్వముగా నొనర్చనూలేదు మరియు క్షీరసాగరమును మథించనూలేదు. ఇది అనాదియూ, స్వయం సిద్ధమునూనై యున్నది. ఇది పల్చనిదీ కాదు, చిక్కనిదీ కాదు; యిందు రసము గాని గంధము గాని పేరునకుకూడ లేదు. దీనిని స్మరించుటతోడనే ప్రతి వ్యక్తియూ సహజముగా దీనిని పొందగలడు. ఈ అమృతపుపేరు వినగానే జగత్తంతయు నిస్సారముగ నగును, మరియు వినువానికి ఎన్నడును నాశనము కాజాలని నిత్యత్వము ప్రాప్తించ సాగును. జనన-మరణములు సమూలముగ నశించును, మరియు లోపల-బయట అంతటను ఆత్మానుభవమనెడి మహాసుఖము వృద్ధిపొంద సాగును. అదృష్టవశమున యిట్టి పరమామృత సేవన మొనర్చు అవకాశము లభించునో, అది వెంటనే జీవుని ఆత్మ స్వరూపునిగా నొనర్చును. ఇట్టి అమృతమును మీరు నాకు వడ్డించుచుండగా 'యిక చాలును' అని చెప్పుట ఎన్నటికిని సంభవించదు. ఓ దేవా, మీ నామమే నాకు అతి మనోరముగ నున్నది. అదుపై మీతో ప్రత్యక్ష సమావేశము, మరియు మీ సామీప్యముకూడా ప్రాప్తించుచున్నది. అంతేగాక, మీరు ఎంతో సంతోషముతో నాతో మాట్లాడుచున్నారు. ఇట్టిస్థితిలో, ఓ దేవా, యీ పరమసుఖమెటులున్నదని నేనేమి చెప్పను? నా అంతఃకరణమునకు కలిగిన సంతోషమును వాణిదేవి వర్ణించ లేకున్నది. మీనోటినుండి యీ పరమామృతము తిరిగి వర్ణించ వలెనని మాత్రము చెప్పగలుగుచున్నది. ప్రతిరోజూ అదే సూర్యుడు ఉదయించును, కాని 'యితడు నిన్నటి పాచి సూర్యుడే నని' ఎవడైన చెప్పునా? అన్నింటిని పవిత్రమొనర్చెడి అగ్నినిగురించి 'యిది అపవిత్రమైనదని' ఎవడైన చెప్పగలడా? లేదా నిరంతరము ప్రవహించెడి గంగా జలమును 'పాచినదియని ఎవడైన అనగలడా? నేడు మీ నోటినుంచియే ఆ పరమామృత లాభమును నాకు కలుగ జేయుటచే నేను శబ్దబ్రహ్మ స్వయముగ అవతరించెననియు, లేదా చందన తరువునకు పుష్పములు పూచినవనిన్నీ, మరియు

ఆపుష్పాలందలి సుగంధమును కూడ నేను అనుభవించుచున్నట్లను నాకు తోచుచున్నది." అర్జునుని యీమాటలను విని శ్రీకృష్ణుని ప్రతి అంగమున్ను ప్రేమచే వికసించసాగెను. అతడు తన మనమున నిట్లనుకొనెను-"యీ అర్జునుడిప్పుడు భక్తి-జ్ఞాన భాండారముగ నగుటకు తగియున్నాడు." అంత శ్రీకృష్ణుడిట్లనియె.

శ్రీ భగవానువాచ—

హంతతే కథ యిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః!
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యంతో విస్తరస్యమే ॥౧౯॥

శ్రీకృష్ణుడు ఆసమయమున అర్జునునితో చెప్ప నారంభించిన మాటలనుబట్టి చూడగా శ్రీకృష్ణుడు తాను బ్రహ్మకు పితరుడ ననెడి విషయమునే జ్ఞప్తియందుంచుకొన లేదని తోచును. ఆయన అనెను-"బాబా అర్జునా, నీవు చక్కగా చెప్పితివి." ఈసమయమున శ్రీకృష్ణుడు అర్జునుని 'బాబా' యనుటచే ఆశ్చర్యపడ నక్కరలేదు, ఏలనన అతడు నందపుత్రుడే గదా. అతని నోటినుండి యీమాట ప్రేమాతిరేకముచే వెడలినది. అస్తు. శ్రీకృష్ణుడు అర్జునునితో నిట్లనెను-"ఓధనుర్ధరా, నా మాటలను వినుము. ఓ సుభద్రానాథుడవగు అర్జునా, నీవు నా విభూతులను గురించి అడిగితివి, కాని అవి అపారము. అవి అన్నియు నా విభూతులే. కాని స్వయముగ నా బుద్ధియే వాటినన్నిటిని లెక్కింపజాలనన్ని గలవు. తన శరీరముపైన ఎన్ని రోమములు గలవో చెప్పుట ఎవరికిని ఎటులసాధ్యముకాదో, అదేరీతిని నా విభూతులు కూడా. నేను ఎంత గొప్పవాడనో, ఎంత వ్యాపకము గలవాడనో స్వయముగ నాకే స్పష్టముగ తెలియదు. అందుచే నేను కేవలము నా ముఖ్య విభూతులను గురించియే చెప్పెదను వినుము. ఓ అర్జునా, యీ ప్రసిద్ధ విభూతులను గురించి తెలిసికొనిన పిదప వాటిద్వారా యితర గౌణ విభూతుల జ్ఞానముకూడ నీకు కలుగగలదు. బీజము చేతిలోనికి వచ్చినప్పుడు వృక్షమంతయూ తనచేతి యందున్నదనినటుల, లేదా తోటయంతయు తన చేతిలోనికి వచ్చినటుల లేదా ఫల-పుష్పము లన్నియూ తమంతట తామే ప్రాప్తించునటుల, యీ విభూతులను చూచిన పిదప, యీ జగత్తు సంతను భూత

వచ్చును. అటుల కానిచో, ఓఅర్జునా, నావిస్తారము, నా అఖిల విభూతులు అపారములు. చూడు, యివి లెక్కించరానన్ని కలవు. కాని అవన్నియూ నాయందెచ్చటనో దాగియుండును.

అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయ స్థితః
అహమాదిశ్చ మధ్యంచ భూతానామంత ఏవచ ॥౨౦॥

"మస్తకముపైన ఉంగరములవలె చుట్టుకొనియున్న కేశములను ధరించువాడవును, ధనుర్విద్యలో అపరశంకరుడవును అగు ఓ అర్జునా, వినుము. నేను భూతకోటిలో ఆత్మరూపమున నివసింతును. భూతములలోపలకూడ నేనే వసింతును మరియు వాటి బయట, లేక పైనకూడా నా ఆవరణయే యుండును. వాటి ఆది, మధ్య, అంతములన్నియూ నేనే. మేఘములకు క్రిందను పైనను లోపలను బయటను-అంతటను ఆకాశమే యుండును. అవి ఆకాశరూపమువనే యుండును' మరియు వాటి ఆధారముకూడ ఆకాశమే. మరియు అవి లీనమైనప్పుడుకూడ ఆకాశరూపమును పొందియే యుండును. అదేవిధమున యీ భూతకోటి అంతటిఉత్పత్తిస్థితి, లయములుకూడా నేనే అయియున్నాను. ఈ విధమున నేను విభూతులద్వారా పెక్కువిధములుగ నిండియున్నాను. కావున నీ చైతన్యశక్తినంతను శ్రవణేంద్రియములందేకాగ్ర మొనర్చి వినుము ఓఅర్జునా, నేను నీకు చెప్పెదననిన వానియందలి ముఖ్య విభూతులను చెప్పెదను వినుము.

ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥౨౧॥

ఆపైన కృపాళుడగు శ్రీకృష్ణుడిటులచెప్పెను-"ద్వాదశాదిత్యులలో విష్ణువు నా ప్రధాన విభూతి మరియు కాంతివంతములగు పదార్థములలో సూర్యుడను నేన, నలుబది తొమ్మండుగురు మరుత్తులలోను మరీచిని నేన, మరియూ తారలందు చంద్రుడను నేన.

వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥౨౨॥

"వేదములందు సామవేదము నేన, దేవతలందు ఇంద్రుడు నేన, ఇంద్రియ ములలో పదునొకండవదగు మనస్సు నేన, మరియు భూతకోటియందలి స్వాభా వికమగు చైతన్యశక్తిని నేన.

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహం ॥ ౨౩ ॥

"చతుర్దశ రుద్రులందును శంకరుడు నేన, యక్షరాక్షసులలో కుబేరు డను నేన, అష్టవసువులలో అగ్నిని నేను మరియు పర్వతములన్నింటను అతి శ్రేష్ఠమైనదగు మేరుపర్వతము నేన.

పురోధసాంచ ముఖ్యం మాం విద్ధిపార్థ బృహస్పతిం
సేనానీనామహం స్కంద స్సరసామస్మి సాగరః ॥ ౨౪ ॥

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేక మక్షరమ్
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥ ౨౫ ॥

"పురోహితులందరి యందును స్వర్గాధిపతికి ఆధారమును మరియు సమస్తజ్ఞానమునకు మూలస్థానము నగు బృహస్పతిని నేన. ఈత్రిభువనము లం దలి సేనానాయకులందును కృత్తికాంతుడగు శంకరునిచే జన్మించిన మహా జ్ఞాతయగు కార్తికస్వామి (కుమారస్వామి) నేన. సరోవరములందు అపార జలము గల సముద్రమును నేన. మహర్షులలో మహా తపస్వియగు భృగుడు నేన. సాహిత్యము లందన్నింటను సత్యమునకు క్రీడాస్థలము నేన. కర్మకాండ లను త్యాగమొనర్చి ఓంకారాదుల ద్వారా చేయబడెడిది అన్ని యజ్ఞములం దును శ్రేష్ఠమగు జపయజ్ఞము నేన. నామ జపయజ్ఞము అతి శ్రేష్ఠమయినది. దీని నొనర్చుటకు స్నానాది నిత్యకర్మలనుకూడ చేయనక్కరలేదు. ధర్మా ధర్మములు రెండునూ నామస్మరణచే పావనమగును. వేదార్థముకంటెకూడ నామమే పరబ్రహ్మమై యున్నది. అచరములగు పర్వతములలో పుణ్యరాశి యగు హిమాలయ పర్వతము నేన.

అశ్వత్థ స్సర్వ వృక్షాణాం దేవర్షీణాంచ నారదః
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలోమునిః ॥ ౨౬ ॥

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాంచ నరాధిపమ్ ॥27॥

"పారిజాతము ప్రత్యక్ష కల్పవృక్షమే, మరియు చందనవృక్ష గుణము కూడ అతి ప్రసిద్ధమైనది; అయినప్పటికిని వృక్షములందు అశ్వత్థవృక్షము నేన, ఓ అర్జునా, దేవర్షులలో నారదుడు, గంధర్వులలో చిత్రరథుడను నేన. సిద్ధులలో కపిలుడను నేన మరియు అశ్వములన్నింటను ఉచ్చైశ్రవమును నేన. గజములందైరావతమును నేన సముద్రమును మధించినమీదట దేవతలను లభించిన అమృతముకూడ నే. నరులయందు రాజును నేన.

ఆయుధానా మహం వజ్రం ధేనూనామస్మి కామధుక్
ప్రజన శ్చాస్మి కందర్ప సర్పాణా మస్మి వాసుకిః ॥28॥
అనంతశ్చాస్మి నాగానాం వరుణోయాదసామహమ్
పితౄణా మర్యమాచాస్మి యమ స్సంయమతామహమ్ ॥29॥

"ఆయుధములందు వజ్రమును, గోవులందు కామధేనువును. ఉత్పత్తి కారకులలో మదనుడను నేన. ఓ అర్జునా, సర్పములందు వాసుకి, నాగులందు అనంతనాగుడు నేన. జలచరములందు వరుణుడను నేన. పితృగణములందు అర్యమ యనెడి పితృదేవత నేన. జగత్తునందంతటను శుభాశుభ కర్మల లెక్కవేయుంచువాడును, అందరి అంతఃకరణమును పరీక్షించువాడును మరియు వారి కర్మానుసారము ఫలముల ననుభవింపజేయువాడును మరియు అందరి కర్మలను నిరంతరము చూచువాడును నగు యముడను నేన.

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చపక్షిణామ్॥ 30।

"దైత్యులందు ప్రహ్లాదుండును, గణకులందు మహాకాలమును, అడవి జంతువులందు సింహమును, పక్షులందు గరుత్మంతుడును నేన.

పవనః పవతామస్మి రామశ్శస్త్ర భృతా మహమ్।
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ ।31।

"ఓ అర్జునా, ఈ అపార భూవిస్తారము నందొక్క ఘడియ యైన ఎచ్చటను ఆగక, ఒక్కపరుగున సప్తసముద్రములను ప్రదక్షిణ మొనర్చగల అన్నింటికంటె వేగవంతుడగు పవనుడు నేన, శస్త్రధారు లందరియందును రాముడు నేన; తోకగల జలచరములందు మకరము నేన, నదులందు జాహ్నవి నేన. కాని, ఓ అర్జునా, ఈ విధముగ నేను సృష్టియందలి ఒక్కొక్క విభూతిని లెక్కించ మొదలిడుచో వందల కోటి జన్మములు గడచినప్పటికిని, వాటియందు సగము విభూతులుకూడ పూర్తికాజాలవు.

సర్గాణామాది రంతశ్చ మధ్యం చైవాహ మర్జున।
అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్ ॥32॥
అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వస్సా మాసికస్యచ।
అహమే వాక్షయంకాలో ధాతాఽహం విశ్వతోముఖః ॥33॥

"నక్షత్రములన్నింటిని ప్రోగుచేయవలెనన్నచో ఆకాశమును మూటగట్టవలసి వచ్చునటుల, లేదా భూమియందలి అణువులను, రేణువులను లెక్కించుటకై భూమినంతను చేగొనవలెసినటుల – నా విభూతులనన్నింటిని చూడదలచుచో నన్ను గురించిన జ్ఞానమునే సంపాదించవలెను. శాఖాసహితముగ పుష్పములను ఫలములనన్నింటిని చేగొనదలచుచో మూల సహితముగ వృక్షమునే పెకలించి చేతబుచ్చుకొనవలసినటుల, నా సమస్త విభూతులను గురించిన జ్ఞానమును సంపాదించదలచుచో నా నిర్దోష వ్యాపక స్వరూపజ్ఞానమునే పొందవలెను. అటుల కానిచో నా భిన్న భిన్న విభూతుల నెంతవరకు లెక్కించను! కావున, నీవు వీటన్నింటి సారాంశముగ 'నేనే సమస్తమును' అని తెలిసికొనుము. వస్త్రముయొక్క ఆది, మధ్య, అంతములు అనగా ఉత్పత్తి, స్థితి నాశములనెడి త్రివిధావస్థలందును నూలుపోగులే వుండురీతిని యీ సృష్టియందలి త్రివిధావస్థలందును నేనే నిండియున్నాను. నా యీ వ్యాపకత్వమును గురించి జ్ఞానము కలుగనప్పుడు నా యీ భిన్న భిన్న విభూతులను గురించి చెప్పవలసిన అవుసరమేమిగలదు? నీలో నా వ్యాపకత్వమునంతను తెలిసికొనగల సామర్థ్యము లేనందువలన, నీకింతగా చెప్పితిని నీకిది చాలును. కాని, నీవేదృష్టితో నా విభూతులను గురించి చెప్పితివో, ఆదృష్టితో నేనుకూడా చెప్పెదను, వినుము. ఈ ప్రకరణమునందు నేను వివ

రించుచున్న ఆధ్యాత్మ విద్య అన్ని విద్యలందును నా ప్రధాన విభూతి. వాదన చేయువారియందు వాదము నేను, అక్షరములలో మొదటి అక్షరమగు 'అ' కారము నేను. సమాసములలో ద్వంద్వ సమాసము నేను. పిపీలికాది బ్రహ్మపర్యంతముగల అన్నింటిని భక్షించెడి 'కాలము' నేను. మేరు, మందరాది పర్వతసహితముగ పృధివి నంతను కబళించెడి అనంతకాలము, ప్రళయ కాలమున జగత్తునంతను జలమయ మొనర్చెడి మహాసముద్రమును కూడ ఎండింపజేసెడి మరియు ఆకాశమును తన ఉదరమున యిముడ్చుకొను నట్టిది యునగు. మహాకాలము నేనే. ఇదే విధమున మరల సృష్టించువాడను కూడ నేనే.

మృత్యు స్సర్వ హరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥34॥

"నేనే సమస్త భూతములను పుట్టించుచున్నాను, నేనే వాటిని సంరక్షించుచున్నాను మరియు అంతమందు నేనే వాటిని సంహారించుచున్నాను, యిందుచే మృత్యువునుకూడ నేనే. స్త్రీ సమూహమున నా విభూతులు ఏడుగలవు. ఓ అర్జునా, ఎన్నడును నశించని 'కీర్తి' నేన, ఔదార్యమునకు నెలవగు 'సంపద' నేన, న్యాయాధారమున సుఖముగ వివేకమార్గమున నడచు 'వాక్కు' నేన, కనిపించెడి వస్తువుతోపాటు దానికి సంబంధించిన సమస్త విషయములను జ్ఞాపకము చేయు 'స్మృతి' నేన, ఇదేవిధమున, ఆత్మ హిత సాధన మొనర్చు 'బుద్ధి', 'ధైర్యము' మరియు అంతటను కనిపించెడి 'ఓర్పు' (క్షమ)-నేన. ఈవిధమున స్త్రీసమూహమందలి యీ సప్తశక్తులు కూడ నేన. జగత్తనెడి ఏనుగను నాశ మొనర్చు శ్రీకృష్ణు డీ విషయములను అర్జునున కాసమయమున చెప్పెను.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్।
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః॥ 35

ఆపిదప లక్ష్మీపతియగు శ్రీకృష్ణు డిటుల చెప్పెను—

"మూడు వేదము లందునుగల సామవేదమునందలి బృహత్సామము నేన. ఛందస్సు లన్నింటను గాయత్రి నేన. పండ్రెండు మాసములందును మార్గశీర్షమును, ఋతువులయందు వసంత ఋతువును నేన.

ద్యూతం ఛలయతా మస్మి తేజస్తేజస్వినామహమ్
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥
వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనాః కవిః ॥32॥

వంచనతో కూడిన పనులలో ద్యూతము నేను. ఇందువలననే ద్యూత కర్మద్వారా బహిరంగమున దొంగతనము చేసి ఎవనినైన ఎవడైన దోచుకొనినచో దాని నెవడును నివారింపజాలడు. తేజోవంతములగు పదార్థములలో తేజస్సు నేను. కార్యము లోనర్చవలెననెడి సంకల్పములలో 'విజయము' నేను. ఉద్యోగము లన్నింటను న్యాయమును ఉజ్జ్వలమొనర్చెడి వ్యవసాయము నేను. సత్త్వముగల పురుషులందలి 'సత్త్వము' నేను; మరియు యాదవ కులమున జన్మించిన ఐశ్వర్యవంతులగు దేవకీ వసుదేవుల పుత్రుడై యుండిన్నీ యశోద కుమార్తెకు బదులుగా గోకులమునకు గొనిపోబడినట్టిన్ని, పూతన యొక్క పాలతోపాటు ఆమె ప్రాణములనుకూడ గైకొనినట్టిన్ని తన బాల్యావస్థను దాటుచూ దాటుచునే సృష్టి యందంతటను దైత్యహీనమొనర్చిన వాడున్నూ మరియు గోవర్ధన పర్వతమును నఖాగ్రముపై నెత్తి మహేంద్రుని మహాత్మ్యమును పరీక్షించినట్టిన్ని, యమునానది లోపలినుంచి కాళీయుడనెడి శల్యమును ఊడబెరికినట్టిన్ని, మండిపోవుచున్న గోకులమును రక్షించినట్టిన్ని, గోవులను మరియు దూడలను హరించినప్పుడు బ్రహ్మను తన మాయచే ఉన్మాదు నొనర్చినట్టిన్ని, తన బాల్యావస్థయొక్క తొలి రోజులందే కంసుడు మొదలైనటువంటి గొప్పగొప్ప దుష్టులను నేలగలిపినట్టిన్ని, ఎవని పరాక్రమమును నీవు చూచియుంటివో మరియు వినియుంటివో అట్టి శ్రీకృష్ణుడు యీ యాదవులందరియందును నా ప్రధాన విభూతి. మరియు చంద్రవంశమున జన్మించిన పాండవులందలి అర్జునుడుకూడ నేను. అందువలననే అతనికీ నాకూ ఏవిధమగు భేదభావమూ లేదు; మరియు విముఖత్వముకూడా రాదు. నీవు సన్యాసవేషము ధరించి నాసోదరియగు సుభద్రను లేవదీసికొని పోతివి; అయినప్పటికిని, నిన్ను గురించి నేనే మాత్రము దుర్భావము పొందలేదు. ఏలనన, నీవూ, నేనూ-యిద్దరమూ ఏకస్వరూపులమే!" అటువిమ్మట

యాదవ శ్రేష్ఠుడగు శ్రీకృష్ణు డిటులనెను— “ఓఅర్జునా, మునులలో వ్యాసుడు నేను; కవులలో శుక్రుడు నేను.

దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥౩౮॥

“పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల అందరిని శిక్షించెడి దండము నేను. శాస్త్రములలో మంచిచెడ్డలను నిర్ణయమొనర్చెడి మరియు ధర్మ-జ్ఞాన పక్షమున నుండెడిదియగు నీతి శాస్త్రము నేను. ఓమిత్రుడవగు అర్జునా, రహస్యము లన్నింటను మౌనము నేను, ఏలనన మౌన ధారులను బ్రహ్మకూడ ఏమియూ చేయజాలడు. జ్ఞానులందలి జ్ఞానము నేను, ఈవిభూతుల నింకెంతవరకని వర్ణించును! వీటికి అంతేలేదు.

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున
నతదస్తి వినాయత్స్యా న్మయా భూతం చరాచరమ్ ॥౩౯॥

నాంతోఽస్తి మమదివ్యానాం విభూతీనాం పరంతప
ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరోమయా ॥౪౦॥

“ఓధనుర్ధరుడవగు అర్జునా. వర్షధారలను లెక్కించవచ్చును, లేదా మొలకలు లేదా తృణముల సంఖ్యనుకూడ తెలసికొనవచ్చును, కాని సముద్ర తరంగముల కొలత ప్రమాణమును నిశ్చయించ వీలుకానటుల, నావిభూతులకు కూడ ఒక హద్దులేదు. వీటిలో ఏకొద్ది ముఖ్య విభూతులనూ నీకు చెప్పియున్నాను. ఓఅర్జునా, అవి నీకు పరిచయ మొనర్చుటకు మాత్రమే చెప్పితిని. ఈఅపారమగు విభూతులను నీవేమి వినగలవు. నేనేమిచెప్పను? కాన నా రహస్యమునంతను నీకు చెప్పుచున్నాను. సర్వభూతములకు బీజమునేను; కాన ఎవరినీ కొద్ది-గొప్ప, చిన్న-పెద్ద అనెడి భేదభావముతో చూడరాదు. ఈసృష్టియందుగల సమస్తమానవులు నేను, నీకు మరొక సాధారణ చిహ్నము చెప్పెదను వినుము. ఈగుర్తువలన నీవు నావిభూతులను గుర్తించగలవు.

యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా
తత్తదేవావ గచ్ఛత్వం మమ తేజోఽంశ సంభవమ్ ॥౪౧॥

"ఓ అర్జునా, ఏ ఏ భూతములందు ఐశ్వర్యము మరియు దయాళుత్వము - యీ రెండుగుణములును ఒక చోట కనిపించునో అవన్నియు నా విభూతులుగా నీ వెఱుంగుము.

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥౪౨॥

"ఆకాశమున కేవలమొక్క సూర్యబింబము మాత్రమే వుండును, కాని దాని ప్రభావము త్రిభువనములందును వ్యాపించి యుండును. సరిగా అదేవిధమున, ఏ ఒక్కని ఆజ్ఞను అందరూ పాటించుచుందురో ఆతనిని నీవెన్నడును ఒంటరివాడనిగాని, నిర్ధనుడనిగాని తలంచకుము. కామధేనువు వెళ్ళిన ప్రతిప్రదేశమునకును దానివెంట వస్తుసమూహము లెల్లను కట్టుబడి పోవునా? పోవు. కాని, అది, ఎప్పుడెవ దే పదార్థమునడిగెనో అప్పుడే దానిని ప్రసవించసాగును. ఇదేవిధమున, ఆ ఏక విశ్వ - బీజమునందు జగత్తునందలి సమస్త ఐశ్వర్యము నిండియుండును, దానిని గుర్తించెడి చిహ్నమొకటియే గలదు: మరియు ఆదేవన' జగత్తంతయు దానిముందు నమ్రులై యుండును మరియు దాని ఆజ్ఞను పాటించును. దేనియందీ లక్షణములు కనిపించునో, దానిని నా అవతారముగ నెఱుంగుము. ఈ విధమగు అవతారములలో ఒకదానిని సామాన్యమైనదిగను మరొకదానిని ఉత్కృష్టమైనదిగను తలంచుటయు, మరియు వాటియందు భేదభావము చూపుటయు పాపము; ఏలనన యీ జగత్తంతయు నేనే అయియున్నాను. ఇట్టిస్థితిలో సాధారణము - ఉత్తమము అనెడి భేదములు ఏ దృష్టితో కల్పించనగును? ఈ విధముగ వ్యర్థకల్పన మొనర్చుట బుద్ధిని కళంకిత మొనర్చుటయే. వ్యర్థముగ నేతిని ఏల చిలకవలెను? అమృతమును మరగ కాచుటచే కలుగులాభ మేమి? వాయువునకు కూడ కుడిఎడమ లుండునా? సూర్యుని పొట్ట ఎచ్చటనున్నది, వీపుఎచ్చట నున్నది - అని పరీక్షించుటకై ఎవడైన సూర్యబింబముపై దృష్టిని కేంద్రీకరించునో, తత్ఫలితముగ ఆతని దృష్టియే పోవును. ఈ రీతిగనే నా స్వరూపమున గూడ సాధారణము, విశేషము అనెడి భేదము ఏమాత్రములేదు. నా ఒక్కొక్క విభూతిని విడి విడిగా తీసికొని, నా అపారస్వరూపము నెటుల కొలువగలవు? కావున, ఓ అర్జునా, యీ విధముగ నన్ను తెలసికొను ప్రయ

త్నమును కట్టిపెట్టుము. నాలో ఒక్క భాగమే యీజగత్తు నందంతటను పూర్తిగా వ్యాపించియున్నది. కాన నీవు భేదభావమును పూర్తిగా విడనాడి సమబుద్ధితో నన్నుపాసించుము". జ్ఞానిజనరూపమునమున్న వనమున వికసించెడి వసంతము మరియు విరక్తజనుల సంపూర్ణ ధ్యేయమునగు ఆ ఐశ్వర్య సంపన్నుడగు శ్రీకృష్ణుడు అర్జునునితో నిటుల చెప్పెను. అందుపై అర్జునుడిటుల చెప్పెను - "ఓ మహారాజా, భేదభావమును పూర్తిగా విడనాడమని మీరు నాకు చెప్పియున్నారు. సూర్యుడు జగత్తుతో 'యీ అంధకారమును తొలగించుము' అని చెప్పినటుల మీరు చెప్పిన విషయముకూడ నాకటులనే అనుచితముగ తోచుచున్నది. కేనిటుల చెప్పుట 'పిట్టకొంచెము, కూతఘనము' అన్నటుల వుండవచ్చును. ఎవరి నోటినుంచిగాని, ఎవరి చెవినుంచిగాని మీనామము వెడలుచో లేక పడుచో అతని హృదయమున తత్క్షణమే భేదభావము తొలగిపోవునంత మహాత్మ్యము మీనామము నందున్నది. మీరు-స్వయముగ పరబ్రహ్మలే, మరియు ఆ పరబ్రహ్మయే సౌభాగ్యవశమున నాకిప్పుడు లభించెను. అట్టిస్థితిలో ఏ భేదభావముండగలదు? మరియు ఎవరికది బాధాకరము కాగలదు? చంద్రబింబ గర్భమున ప్రవేశించి నప్పటికికూడ వేడితగులునా? కాని, మహారాజవగు శ్రీకృష్ణా, మీరు మీ మహాత్మ్యము వలననే యిప్పుడిటుల మాట్లాడిరి. "ఇది వినుట తోడనే శ్రీకృష్ణునకు చాల సంతోషమయ్యెను మరియు ఆయన ప్రేమతో అర్జునుని ఆలింగన మొనర్చుకొని యిటులచెప్పెను-" ఓఅర్జునా, నీవు నామాటలకు కోపగించకుము, నేను భేదమును అంగీకరించి భిన్నభిన్న విభూతుల వివయముపై వర్ణించి చెప్పిన విషయములందలి అభిన్నత్వము నీఅంతఃకరణమున అంకితమైనదో లేదో తెలసికొను తలంపుతో నిన్ను పరీక్షించుటకై యిటుల మాట్లాడితిని. కాని, నీకు నా విభూతులను గురించి చక్కగా బోధపడినదని నాకిప్పుడు నమ్మకము కలిగనది." అంత అర్జునుడిటులనెను—"ఓ దేవా, మీ సంగతి మీకే తెలియవలెను, కాని నేనుమాత్రము, 'యీజగత్తంతయు మీ స్వరూపము మాత్రమేనని' నిజముగా చూచుచున్నాను!' సంజయుడు ధృతరాష్ట్రునితో నిటులచెప్పెను-"ఓరాజా, అర్జునుడీరీతిని ఆత్మస్వరూపానుభవము పొందసాగెను." సంజయుని యీమాటలను ధృతరాష్ట్రుడు మాట్లాడకుండా వినుచుండెను. ఇది సంజయునకు చాల చెడుగా తోచెను. అంత నాతడు

తనలో తానిటుల అనుకొనసాగెను-"ఈసౌభాగ్యఫలము తన ఎదుటకువచ్చి
నది. కాని దానిని పొందజాలనంత దూరమున ధృతరాష్ట్రుడున్నాడు! ఇది
కూడ ఒక ఆశ్చర్యకర విషయమే! ఈతనిబుద్ధి బాగుండునని నేను తలంచు
చున్నాను. కాని అటుల జరుగుటలేదు. బాహ్యమునకు చర్మచక్షువులతో
యితడెట్లేతిని అంధుడో, అట్లేతిని అంతరంగమున యీతని అంతశ్చక్షువులు
కూడ గ్రుడ్డివే!" అస్తు. అర్జునుడు భగవానునితో నిటులనెను-"ఓదేవా!
నాఅంతఃకరణమున ప్రతిబింబితమైన ఆత్మస్వరూపానుభవమును బాహ్య జగ
త్తున నాకనులతో నేను చూడవలెననెడి వాంఛతో నామనస్సు వ్యాకులము
చెందుచున్నది." అర్జునుడు గొప్ప భాగ్యశాలి; అందువలననే ఆతనికిట్టి కోరిక
కలిగినది; ఆతడు తన రెండు నేత్రములతోను యీజగత్తునంతను చూడ
గోరినాడు.

ఓ శ్రోతలారా, ఆ అర్జునుడు స్వయముగ కల్పతరుశాఖ, అందువల
ననే ఆతనివాంఛ వ్యర్థము కానేరదు. అందువలననే ఆతడు ఏదిఅడిగిన అది
శ్రీకృష్ణుడు నెరవేర్చుచున్నాడు. భక్తుడగు ప్రహ్లాదుని మాట నిలుపుటకై
స్వయముగ విషరూపమును ధరించిన ఆ శ్రీమన్నారాయణుడే నేడు, యీ
అర్జునునకు సద్గురు రూపమున లభించినాడు. ఇక రానున్న అధ్యాయమున
శ్రీనివృత్తినాథ శిష్యుడగు జ్ఞానదేవుడు శ్రోతలకు అర్జునుడు శ్రీకృష్ణుని విశ్వ
రూపమును చూపుమని ఎటుల ప్రార్థించెనో" వినిపించును.

# తెలుగు జ్ఞానేశ్వరి

## పదునొకండవ అధ్యాయము

ప్రస్తుతపు పదునొకండవ అధ్యాయమున అర్జునునకు విరాట్స్వరూప దర్శనమగుటను గురించిగల కథ ద్వివిధరసములతో నిండియున్నది. ఈ కథలో ముఖ్యమైనది శాంతరసము, కాని దాని యింటికి అద్భుతరసము ఆతిథ్యము గొనుటకై వచ్చినది. మరియు అన్యరసములకు కూడ దానితోపాటు గౌరవము లభించినది. ఓ శ్రోతలారా, వధూవరుల వివాహసమయమున పెండ్లివారు కూడ మంచి బట్టలను, ఆభరణములను ధరించి సంతోషముతో తిరుగురీతిని యిచ్చట దేశభాషయొక్క సుఖాసనముపైన సమస్త రసములు సుశోభిల్లుచున్నవి. కాని, హరిహరులవలె పరస్పరము ప్రేమపూర్వకముగ గాఢాలింగన మొనర్చుకొనిన శాంత, అద్భుతరసములు యీ విధముగ కనులకు కనిపించునంత చక్కగా వున్నవి. లేదా, అమావాస్యా పర్వ-సమయమున సూర్య - చంద్ర మండలములు రెండును ఏకత్రితమగునటుల యిచ్చట యీ రెండు రసములు ఐక్యతను పొందినవి. గంగా యమునల సంగమమువలె యీ రెండును సంగమము పొందుటచే యిచ్చట ప్రయాగక్షేత్ర మేర్పడినది. ఇప్పుడీ జగత్తంతయు యీ పవిత్రతీర్థమున స్నానమొనర్చి ఆనందముచే నిర్మలము కావచ్చును. ఈ సందర్భమున గీతను గుప్తసరస్వతిగా నెరుంగవలెను మరియు కేవలము పైజెప్పబడిన రెండు రస-ప్రవాహములు వ్యక్తములు; కాన ఓ శ్రోతలారా, ఈ అధ్యాయమును త్రివేణీసంగమ మనియే చెప్పవగును. నా ఉదారదాతయగు శ్రీనివృత్తినాథులు - యీ త్రివేణీ తీర్థమందు కేవలము శ్రవణమార్గమున మాత్రమే లోకులు సహజముగ ప్రవేశించగలుగు అవకాశమును కలిగించిరని జ్ఞానదేవుడు చెప్పుచున్నాడు. ఈ సంస్కృత తీర్థమందలి సంస్కృత భాషాత్మకతటము దిగుటకు అతికఠినమైనది; అందువలన శ్రీనివృత్తినాథులు వాటిని బద్దలుకొట్టి దేశభాషా శబ్దములతో 'ధర్మభాండారము సహజముగనే ప్రాప్తించు రీతిని' రేవునుకట్టెను. ఇప్పుడీ ప్రదేశమున శ్రద్ధాళురగు జనులు కోరుచో చక్కగా స్నానమొనర్పవచ్చును.

యీ ప్రయాగలో విశ్వరూపుడగు మాధవుని దర్శించవచ్చును మరియు
జనన-మరణ పరంపరకు అంతముతో తిలాంజలి నివ్వవచ్చును. ఈఅధ్యా
యమునగల రస విశేషము 'జగత్తుకు శివానంద సామ్రాజ్యము లభించి
నదా' యన్నటుల వున్నది. ఈ అధ్యాయమున శాంతి, అద్భుతరసములు ప్రధాన
మైనవి. కాని వాటితోపాటు యితర రసముల మహాత్త్యము కూడ
కొంత వరకు గలదు మరియు కేవలమిందు బ్రహ్మమే స్పష్టపడెను.
ఈ అధ్యాయ మట్టిది. ఈ అధ్యాయము స్వయముగ శ్రీకృష్ణదేవునకు
విశ్రాంతిస్థానము; కాని భాగ్యవంతులగు పురుషులందరి యందును అర్జునుడు
నిజముగ శ్రేష్ఠుడు, ఏలనన, ఆతనికి యీ చోటునకూడ ప్రవేశము లభించినది.
కాని, అర్జునుడు మాత్రమే యీ ప్రదేశమునకు చేరునని యేమేల చెప్పవలెను?
ఎవరు కోరిన వారే చేరగలరు; ఏలనన, యిప్పుడు గీతార్థము దేశభాషా రూప
మున ప్రకటమైనది. కావున ఓ శ్రోతలారా మీరు నా ప్రార్థనను వినుడు,
మరియు సజ్జనులందరు యిటు శ్రద్ధ యుంచుడు. ఈ సమయమున మహాత్ములగు
మీసభలో నేనీ రీతిని అనుచిత సాహసముతో మాట్లాడరాదు; కాని మీరు
నన్ను ప్రేమతో మీబిడ్డనిగ భావింతురు గాక! మీరు ఏదైన చిలుకకు మాట్లా
డుటను నేర్పి, మీవద్ద మాట్లాడుట నేర్చుకొనిన ఆచిలుక మాట్లాడ
సాగుచో, మీరు ఆనందముతో తలలూపెదరు కదా, తల్లి తన బిడ్డని వినోద
కార్యమున నిమగ్నమొనర్చినప్పుడు, ఆ బిడ్డడా పనిలో నిమగ్నుడై యుండు
టను చూచి తల్లి ఆనందించదా? కావున, మీరు నేర్పిన మాటలను మీరే
వినుడు. ఓ మహారాజులారా, యీ సాహిత్యమనెడి మధురవృక్షమును మీ
చేతులతో మీరే నాటిరి; యిప్పుడు మీ అవధానమనెడి అమృత జలముతో
తడిపి దీనిని మీరే పెద్దదాని నొనరుడు. మీరిటుల చేయుచో యీ వృక్షము
రస-భావములనెడి పుష్పములతో నిండియుండును, అనేకార్థములనెడి ఫల
భారము గలదగును మరియు మీ పుణ్యమువలన జగత్తునకు సుఖపడు అవ
కాశము లభించును! ఈమాటలకు సజ్జనులగు శ్రోతలు సంతసించి యిటు
లనిరి-"వహ్వా! నీవు చక్కగా నుడివితివి. అర్జునుడేమనెనో చెప్పుము"
అంత శ్రీ నివృత్తినాధుల శిష్యుడగు జ్ఞానదేవుడిటుల చెప్పుచున్నాడు.
"శ్రీకృష్ణార్జునుల ఆ గంభీర సంవాదమును నిర్బుద్ధినగు నేనేమని చెప్పను!
మీరే నావలన యిదంతయూ చెప్పింతురు, అడవియందలి ఆకులు తినెడి

గోతులచేతకూడా లంకానాథుడగు రావణుడు తిరస్కార పాత్రుడయ్యెను మరియు అతనికి పరాభవము సంభవించెను. అర్జునుడచ్చట ఒంటరివాడు అయినప్పటికిని ఆతడు పదునొకండక్షౌహిణుల సైన్యమును కూల్చెను. కావున, సమర్థులు ఏదికోరిన అది చరాచరములందంతటను జరిగి తీరునని చెప్ప వలసి వచ్చును. యిదేవిధమున మహాత్ములగు మీరుకూడా నేడు నన్ను మాట్లాడునటు లొనర్చిరి. ఇప్పుడు నేను శ్రీవైకుంఠపతి నోటినుండి వెడలిన గీత యొక్క భావార్థమును చెప్పెదను, తాము విందురుగాక! ఈగీతా గ్రంథ మాహాత్మ్యమెట్టిది? వేదములు ప్రతిపాదించిన ముఖ్యదేవతయగు శ్రీకృష్ణుడే యీగ్రంథమందలి వక్త. శంకరునంత వాడుకూడ దీనిని ఆకళింపు జేసికొన జాలనంత అర్థగౌరవము గలసి గ్రంథము. ఈసమయమున హృదయ పూర్వకముగ నమస్కరించుటే ఉచితము. అర్జునుడు ప్రభువుయొక్క విశ్వ రూపముపై ధ్యానముంచి ఏమని చెప్పసాగెనో మీరు వినుడు. అర్జునుని మనస్సున యీ విషయమును గురించి స్ఫూర్తియగు అభిలాషగలదు. ఆదేదన, నామనస్సున యీ జగత్తంతయూ పరమేశ్వరుడనెడి సిద్ధాంతమునెడ దృఢ విశ్వాసము గలిగినది; ఆసిద్ధాంతమును నేనిప్పుడు నాచర్మ చక్షులతో కూడ చూచి, ఆసిద్ధాంతమునెడ యింకను విశ్వాసము గలవాడ నగుదును. కాని మనస్సునగల యీ అభిలాషను భగవానునితో చెప్పుట చాలకష్టము; ఏలనన, విశ్వరూపమువంటి గూఢరహస్య విషయముల గురించి ఆతనిని అడుగుట ఎటులని ఆతడు యోచించుచుండెను. అదిన్నిగాక భగవానుని ఏ ప్రియ భక్తుడు కూడ నేటివరకు అడుగని విషయమును నేడు నేనెటుల అడగనని అర్జునుడు యోచించు చుండెను. ఆతనికి అతి సన్నిహితులగు తల్లి, గరుత్మంతుడు, సనకాదులుకూడ యీకోరిక నెన్నడును కోరలేదు. నేను వారికంటె సన్నిహితుడనా? కాని వారినికూడ భగవానుడు బాల భావముతోనే ప్రసన్నుల నొనర్చెను. అంబరీషాది అనేకమంది భక్తులకొరకై భగవానుడు గర్భవాస కష్టమును సహించెను. కాని, వీరికికూడ తన విశ్వరూపమును చూపించలేదు. ఇట్టి గూఢవిషయమును నే నెట్లడుగను? విశ్వరూపమును చూడనిదే నేను జీవించియుండజాలను. ఈ విధముగ అర్జునుడు యోచనచేసి భయపడుచూ చెప్పసాగెను. అతని యీ భయముకూడ ఎంతో నిగూఢముగ ఒకటి రెండు మాటలు చెప్పినంతనే భగవానుడు విశ్వరూపదర్శన సౌకర్యసటుల యుం

డెను దూడను చూడగానే గోవు వ్యాకులముపొంది దానిని కలసికొనగోరును, దూడవచ్చి పాలుకునందు మూతి నిడగానే పొదుగున పాలూరకపోవుట ఎటుల సంభవించును? పాండవులను రక్షించుటకై శ్రీకృష్ణుడు అరణ్యము లందుకూడ తిరిగెను. అట్టి అర్జునుడు కోరగా శ్రీకృష్ణుడు విశ్వరూపమును చూపించకుండునా?

అర్జున ఉవాచ—

మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ ॥1॥

అర్జునుడు శ్రీకృష్ణునితో చెప్పెను— దయాసాగరుడవగు ఓ దేవా, శబ్దములద్వారా చెప్ప వీలుకాని విషయమును మీరు శబ్దములవలన తెలియునటుల చెప్పిరి. భూతకోటి బ్రహ్మస్వరూపమునం దైక్యమును పొందినప్పుడు, యితర జీవములు మరియు మాయ యనునవి నామ మాత్రమునకైననుండవు. అసమయమున పరబ్రహ్మయే స్వరూపమునసుండునో అదే ఆతని అంతిమరూపము. తాము తమ ఏ స్వరూపమును లోభివాడు ధనమును దాచియుంచినటుల మీ హృదయపు లోతులందు దాచియుంటిరో, మరియు దేనికూడ వేదములకు కూడ తెలియనిదో, అట్టి మీ హృదయ రహస్యమును నేడు మీరు నా ముందు విప్పిచెప్పిరి. శ్రీ శంకరులు ఏ అధ్యాత్మ రహస్యమునకై సమస్తవైశ్వర్యమును త్యాగమొనర్చెనో, ఆరహస్యమును నేడు మీరు నా కొక్కమారుగా చెప్పివేసిరి. కాని, మహామాయ యనెడి అహారసాగరమున తలవరకు నేను మునిగియుండుటను చూచి, ఓ శ్రీకృష్ణా, మీరు స్వయముగ దూకి నన్ను దానినుంచి బయటకుతీసిరి. నా కిప్పుడీ విశ్వ మున మీరు తప్ప మరేదియూలేదు. కాని నా దురదృష్టవశమున నే నిప్పటి వరకు 'మీకు భిన్నుడనే' అనెడి భావముతోనే వున్నాను. ఇప్పటి వరకు 'నేను అర్జునుడనెడి పేరు గల ఒక పురుషుడ' ననెడి దేహాభిమానము నన్నంటిపట్టియున్నది. మరియు యీ కౌరవులను నే నిప్పటివరకు నా 'స్వ జనులని' చెప్పుచుంటిని. ఇంతేకాదు, 'నేను వీరిని చంపుదును, యిందువలన నేను పాపమున పడిపోదును' అనెడి దుస్వప్నములను కూడ చూచుచుంటిని.

ఇంతలో నన్ను మీరు మేల్కొలిపిరి. ఓ లక్ష్మీనాథా, యిప్పటివరకు నేను నిజమగు పట్టణమును విడచి అసత్యమగు గంధర్వనగరమున విహరించుచుంటిని మరియు నీరనెడిభ్రమతో మృగజలమును త్రావుచుంటిని. గుడ్డతో చేసినపాము వాస్తవమునకు అసత్యమైనదీ, కృత్రిమమైనదీ అయి యున్నది; కాని, నాకు 'నిజమగు పాము నన్ను కరచినది' అనెడి కల్పిత భ్రాంతి కలిగినది మరియు, దీనివలన నిజమగు విషలక్షణములు గోచరించుచుండెను, జీవుడు వ్యర్థముగ మరణించుచుండెను, కాని దానినుండి రక్షించుభారము మీదే. ఎటులనిన, ఒక సింహము నూతిలో తన నీడను చూచి, తన ప్రతిస్పర్ధియగు మరొక సింహముగా భ్రమించి, దానిని చంపు తలంపుతో నూతియందు దుముకబోవుచుండగా ఎవరోవచ్చి దానిని పట్టుకొని ఆపి, దానిని ఆ ప్రమాదమునుండి రక్షించెనట. సరిగా యిదేవిధమున నేడు మీరు నన్ను రక్షించిరి. కాకున్నచో ఓ దేవా, సప్తసముద్రములు ఏకమైనప్పటికిన్నీ, ఈ జగత్తంతయు ప్రళయ జలమున మునిగిపోయినప్పటికిన్నీ, పైనుంచి ఆకాశము విరిగి పడినప్పటికిన్నీ, నేను నా యీ కుటుంబీకులతో ఎన్నడును యుద్ధముచేయను - అని నేను నిర్ణయము చేసికొంటిని. ఇట్టి అహంకారాధిక్యమువలన నేను ఆగ్రహమనెడి ప్రవాహమున మునిగిపోయియుంటిని; మరియు యిట్టిస్థితిలో మీవంటి చెలికాడు నావద్ద లేకున్నచో నన్నెవరు కాపాడి బయటకు తీయగలరు? లేనిదానిని వున్నదిగా నేను దృఢముగ నమ్ముచుంటిని. దానికి నేను 'గోత్రము' అనెడి పేరు పెట్టితిని. నాపై నిట్టి విచిత్రమగు భ్రమోన్మాదము ఆవేశించెను. కాని, మీరే నన్ను కాపాడిరి. ఒకమారు మీరు నన్ను మండుచున్న లక్కయింటినుంచి సుఖముగ బయటకు తీసిరి. కాని ఆసమయమున కేవలము నాశరీరముమాత్రమే ప్రమాదమునందుండెను. కాని నేటి యీ భ్రమయనెడి అగ్నిప్రమాదమువలన నా చైతన్యమే (ఆత్మయే) నష్టముపొందునని భయము గలదు. హిరణ్యాక్షుడనెడి అసురుడు భూమినంతను చాపగా చుట్టినటుల, యిప్పుడు మహాగ్రహము కూడ నా బుద్ధిని తన చేజిక్కించుకొనినది. ఇందుచే నాలో కలిగిన ఉపద్రవములవలన నాలో మోహసముద్రపు అలలు లేవసాగెను. ఇట్టి కష్టసమయమున మీ సామర్థ్యమువలన మాత్రమే నాబుద్ధి తిరిగి వశములోనికి వచ్చినది. ఇందుచే మీరు రెండవమారు తిరిగి వరహావతారమెత్తవలసి వచ్చినదని చెప్పవచ్చును; మీరు నా పంచప్రాణములను తిరిగి నాకొసంగిరనుటలో ఏమాత్రము

సంశయములేదు. మహారాజా, తామొనర్చిన యింతగొప్పదగు పుణ్యకార్యము ఎన్నడైన వ్యర్థమగునా? ఓ దేవా, మీరు నా మాయను సమూలముగ తొలగించిరి; అందుచే మీ కత్యుత్తమమగు కీర్తి లభించినది. ఓ మహారాజా, ఆనంద సరోవరమున వికసించిన కమలములవలె గల మీ నేత్రములు ఎవనిపై అనుగ్రహించునో, ఆతనినిగురించి 'ఆతనికి మోహముతోపాటు యోగముకూడా కలుగును - ఆతని నెన్నడైన మోహము కబళించవచ్చునా?' అని భావించుట కేవలము వెఱ్ఱితనమే. బడబాగ్నిముందు మృగజల మేపాటిది? నేనిప్పుడు మీ కృపాప్రసాదమనెడి ప్రత్యక్ష గర్భగృహమున ప్రవేశించి సంతోషముతో బ్రహ్మరసాస్వాదన మొనర్చుచున్నాను. దీనిచే నా మోహము తొలగినదను టలో ఆశ్చర్యమేమి గలదు? ఓ దేవా, నేను మీ పాదస్పర్శచే నేను నిజముగ ఉద్ధరింపబడితిని.

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥ ౨ ॥

"ఓ కమలములవంటి విశాల నేత్రములు మరియు కోటి సూర్య ప్రభలతో వెలుగొందు వాడా, నేడు నేను మీవలన జ్ఞానబోధను పొందితిని. ఏమాయవలన యీ భూతకోటి పుట్టుచున్నదో మరియు దేనికలన యివి అంతమందు లీనమగుచున్నవో - ఆ మాయాస్వరూపమును మీరు నాకు స్పష్టముగ బోధించిరి. ఏ పరబ్రహ్మ గౌరవమును ధరించి వేదములు యిప్పటివరకు జగత్తున సుశోభిల్లుచున్నవో, ఆపరబ్రహ్మ స్థానమును, నా మాయను దూర మొనర్చి నాకు చూపితిరి. యీ సాహిత్య సాగరము వృద్ధిపొంది నిలచి యుండుటయూ, మరియు ధర్మసిద్ధాంతములనెడి రత్నములను ముత్యములను ప్రసవించుటయు కూడా ఆపరమాత్మయొక్క తేజోలాభ పరిణామమే. ఈవిధమున సాధనామార్గము లన్నింటికిని ఒకే ధ్యేయమగు ఏపరమాత్మ గలదో, మరియు కేవలము ఆత్మానుభవము వలన మాత్రమే దేనిమాధుర్య జ్ఞానము కలుగ గలదో, ఆపరమాత్మయొక్క అపారము, అనంతమునగు మాహాత్మ్యమును మీరు నాకు స్పష్టమొనర్చి చెప్పియున్నారు. ఆకాశమున గల మేఘములు వర్షించిన పిదప సూర్యబింబ దర్శనమగునట్టుల, లేదా పైనున్న నాచును చేతితో తొలగించిన పిదప అడుగుననున్న నీరు కనుపించునట్టుల,

లేదా మంచిగంధపు చెట్టును చుట్టుకొనియున్న సర్పమును తొలగించిన పిదప మంచిగంధపు చెట్టు కనిపించురీతిని, లేదా పిశాచములు పారిపోయిన పిదప భూమిలో పాతిపెట్టిన ధనము లభించునటుల, - మధ్యను తెరవలెయున్న మాయను నేడు మీరు తొలగించి నామతిని తత్త్వనిష్ఠ గలదానినిగా నొనర్చిరి. కాన నో దేవా, యీ విషయమున నాకు పూర్తిగా విశ్వాసము కలిగినది; కాని నామనస్సునందిప్పుడు మరొక విషయ ముద్భవించినది. నేనీ విషయము నిప్పుడు సంకోచించి మీకు చెప్పక విడచినచో, మరెవరితో దీనిని చెప్పను? మీరుతప్ప నాకు మరే ఆధారము గలదు? నీటియందుండు ప్రాణి 'తాను చేసెడి ఫలానా పనివలన నీటికి కష్టము కలుగునని' మనస్సున సంశయించుచో, లేదా బాలుడు పెంకె పట్టుదలతో స్తన్యపాన మొనర్తుననకున్నచో— వారు జీవించుటకు మరే ఉపాయముగలదు? కాన, నేను సంకోచించరాదు. నామనస్సునందున్న మాటను చెప్పితీరవలెను". అందుపై శ్రీకృష్ణుడు మధ్యయందడ్డువచ్చి యిటులనెను - "ఓ అర్జునా, వ్యర్థమగు విషయములేల? నీకిప్పుడేమి కావలెనో చెప్పుము."

ఏవమేతద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర।
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ ॥3॥

అర్జునుడు చెప్పెను—"ఓ దేవా, తాము ఉపదేశించిన జ్ఞానమువలన నాకు సమాధిలభించినది. ఎవని ఆదిసంకల్పమువలన యీ జగన్నిర్మాణము జరుగునో మరియు యథా సమయమున లయమును పొందునో, ఎవనిని మీరు స్వయముగ 'నేనని' చెప్పుచున్నారో, మీరు ఏమూల స్వరూపమునుండి దేవతల సంకటములను నివారించుటకై గాను ద్విభుజ, చతుర్భుజాది అనేకవిధ రూపములను ధరింతురో, జలముపై శయనించుటచే గాని లేదా మత్స్యకూర్మాది రూపములతో చేయవలసిన పనులు పూర్తిఅయిన పిమ్మట అప్పటి మీ సగుణత్వము ఏస్థానమున లీనమగునో, ఉపనిషత్తులు ఎవనిని గానమొనర్చుచున్నవో, ఎవనిని యోగులు తమదృష్టిని అంతర్ముఖమొనర్చి చూతురో, మరియు సనకాదిభక్తులు ఎవనిని ఎల్లప్పుడు తమహృదయములందు బంధించుకొని యుందురో, మరియు మీ ఏ అనంత విశ్వరూపవర్ణనమును నేను ఎడతెగక వినుచున్నానో, ఓ ప్రభూ, మీ ఆ విశ్వరూపమును నా కనులతో

చూచుటకై నా మనస్సు ఉవ్విళ్ళూరుచున్నది. ఓ దేవా, మీరు నా సంకటములన్నింటిని తొలగించి యిప్పటివరకు మిక్కుటమగు ప్రేమతో నా ప్రతివాంఛను నెరవేర్చితిరి ఇప్పుడు నా మనస్సున నొక్క కోరిక మాత్రమే నిలచియున్నది. మీ విశ్వరూపమును దర్శించవలెనని ప్రబలముగ వాంఛించుచున్నాను.

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో!
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయం ॥౪॥

"కాని ఓ నారాయణా, యీ విషయమున నా కొక సంశయము గలదు. మీ విశ్వరూపమును దర్శించు యోగ్యత నాయందున్నదో లేదో నాకే బోధపడుటలేదు. ఓ దేవా, మీరు నన్ను 'నీకీ విషయము లేల బోధపడుటలేద'నుచో, మిమ్ము 'ఎవడైన రోగి తన రోగ నిర్ణయమును తాను చేసికొనగలడా?' యని అడుగుదును. అంతేగాక నాకీ విషయమునైన గల ప్రబలమగు వాంఛవలన, నాలో యీ కోరికకు తగిన యోగ్యత కలదా లేదా యనెడి సంగతినికూడ పూర్తిగా మరచిపోతిని. దప్పిగొనియున్నవాని ముందు సముద్రమును తీసికొనివచ్చి పెట్టినప్పటికిని అతడు 'చాలును' అని చెప్పనటుల, ఈ గాఢవాంఛయందున నన్ను నేను సంబాళించుకొనజాలకున్నాను. బిడ్డని యందు గల యోగ్యతను తల్లి మాత్రమే తెలిసికొనగలుగునటుల, ఓ జగదీశా, మీరే నా యోగ్యతను గురించి యోచించి, నాకు మీ విశ్వరూప దర్శనము నొసగుడు. ఓ దేవా, నా మీద మాత్రపు అనుగ్రహమును తప్పక చూపుడు. అటులకానిచో 'నీకొరకు నెరవేరజాలదని' చెప్పివేయుడు. చెవిటివాని ముందు వ్యర్థముగ పంచమస్వరమును ఆలపించుచో అందువలన అతని కేమి సుఖము కలుగగలదు? కేవలము చాతకపక్షి దప్పికను తీర్చు నెపమున నే మేఘములు ప్రపంచమునకంతటికి చాలినంతగా వర్షించుటలేదా! ఆ వర్షము కూడ ఏరాతి బండమైన బడుచో అది వ్యర్థముగ పోవును. చంద్రుడు కేవలము చకోరమునకు కావలసినంత వరకు మాత్రమే తన చంద్రికలను విస్తరింపజేసి, మిగతా ప్రపంచమునంతను వంచించునా? లేదు. కాని కనులు లేనివానికి చంద్రుని ప్రకాశము వ్యర్థమగును. అందుచే, మీరు నాకు విశ్వరూపమును చూపెదరని పూర్తిగా నమ్మకము గలదు. ఏలనన, జ్ఞానులకు,

నత్తి

అజ్ఞానులకు అందరకునూ మీ స్వరూప మెల్లప్పుడు అస్ఫుటము మరియు అలౌకికమునై యున్నది. మీ ఔదార్యము అతి విలక్షణమైనదీ, స్వయం సిద్ధమూ, అనిర్బంధమైనదీ అయియున్నది. తాము దానమిచ్చునప్పుడు యోగ్యా యోగ్యతల నేమాత్రము గణింపరు. మోక్షమువంటి పవిత్ర వస్తువునుకూడ మీరు మీ బద్ధవిరోధులకు కూడ యిచ్చివేసిరి వాస్తవమునకు మోక్షము సంపాదించుటెంత కఠినము! కాని, అదికూడ మీ పాదములనంటి పట్టియేయుండి, మీ రెచటకు పంపిన అచటకు పోవును. విషయుక్తమైన పాలిచ్చి మిమ్ము చంపుటకై వచ్చిన పూతన యనెడి రక్కసికికూడ మీరు సనక, సనత్కు-మారాదులకువలెనే సాయుజ్యముక్తి నొసంగిరి. అంతేగాదు, మా రాజసూయ యాగ సమయమున త్రిభువనములందలి సభాసదుల ఎదుటను పెక్కువిధముల మిమ్ము నిందించి మీకు అప్రతిష్ఠ గలిగించిన మహాదుష్టుడూ, అపరాధియూ నగు శిశుపాలునికూడ, ఓ గోపాలకృష్ణా, మీరు మీ ఆత్మస్వరూపమునం దైక్య మొనర్చుకొనిరి. ఉత్తానపాదరాజకుమారుడగు ధ్రువునకు ధ్రువ (అక్షయ) పదవి కావలెననెడి కోరికగలదా? అతడు కేవలము, తనతండ్రి ఒడియందు కూర్చొను యోగ్యతను సంపాదించుటకు మాత్రమే వనమున కేగెను. కాని, మీరు స్వయముగా అతనికి ధ్రువపదమునిచ్చి చంద్ర, సూర్యులకంటె శ్రేష్ఠునిగా నొనర్చిరి. ఈవిధముగా దుఃఖముచే పీడింపబడుచున్న వారికి వెనుక ముందు లాలోచించకనే ఔదార్యముతో కృపాప్రదాన మొనర్చెడివారు మీరొక్కరే. అజామీళుడు కేవలము తన మమకారమువలన నారాయణుడనెడి తన కుమారుని పిలచెను. కాని, అతడు 'నారాయణ' నామోచ్చారణ చేసిన కారణమున, అతని పాపములనుకూడ యోచించకుండా మీరాతనికి ముక్తినిచ్చిరి. మీ వక్షస్థలముపై కాలితో తన్నిన భృగు మహర్షియొక్క పాద చిహ్నమును యిప్పటివరకు మీరు అలంకారముగ ధరించుచున్నారు; మరియు మీ శత్రువగు శంఖాసురుని శరీరమగు శంఖమును మీరు మీచేతి ఆదరముతో ధరించియున్నారు. ఈవిధమున మీరు అపకారికికూడ ఉపకార మొనర్తురు. అయోగ్యునిపట్లకూడ ఔదార్యమును చూపెదరు. మీరు ముందుగా బలిచక్రవర్తిని దానమడిగి, అందుకు మారుగా మీరాతని ద్వారపాలకులైరి. ఎన్నడును మిమ్ము భజించని, ఎన్నడును మీ పేరైన వినని వేశ్యకుకూడ కేవలము నామోచ్చారణ మొనర్చినంత మాత్రముననే వైకుంఠ సౌఖ్యము లభించునటుల

చేసిరి. ఈవిధముగ, ఏదో సాధనము కల్పించి మీరు కోరికవలననే బలవంతముగ ముక్తిపద దానమును అనేకులకు అందజేసిరి. ఆర్తపరిస్థితిలో, యింతటి ఉదారులగు మీరు నాపట్ల మీ ఔదార్యమును విడచి మరొక విధముగ ఎటుల ప్రవర్తించెదరు? తన ప్రభావముననే జగత్తునందలి కష్టముల నన్నిటిని లేకుండజేయు శక్తిగల కామధేనువు యొక్క బిడ్డ ఎన్నడైన ఆకలితో నుండవలసి వచ్చునా? యిందుచే నేను కోరిన కోరికను, ఓ దేవా, మీరు అవశ్యము నెరవేర్చెదరు. కాని, ముందు నాలో మీ విశ్వరూపమును చూచు యోగ్యతను కలుగ జేయుడు. నాకనులలో మీ విశ్వరూపమును చూచు సామర్థ్యమున్నదని మీరు తలంచుచో, మీరు నా కోరికను నెరవేర్చుడు. అర్జును డీరీతిని ప్రార్థించిన పిమ్మట షడ్గుణైశ్వర్య సంపన్నుడగు శ్రీకృష్ణుడు ధైర్యముతో నుండజాలకపోయెను. శ్రీకృష్ణుడు దయామయుడై అమృతముతో నిండియున్న మేఘమూ, మరియు అర్జునుడు సమీపించిన వర్షాకాలమూ అన్నటు లుండిరి. లేదా శ్రీకృష్ణుని కోకిలయనుకొన్నచో అర్జునుని వసంత ఋతువుగా పోల్చవచ్చును. లేదా పున్నమనాటి ఇందు చంద్రుని పూర్తి ప్రకాశము గల బింబమును చూడగనే క్షీరసాగరము ఆవేశముతో నిండి పొంగులు పెట్టసాగురీతిని శ్రీకృష్ణుడు కూడా మిక్కుటమగు ప్రేమతో నిండియున్నవాడై ఉల్లాసమును పొందెను. అయిన, చిత్త ప్రసన్నావేశములో దయామయుడగు శ్రీకృష్ణుడు గంభీర స్వరముతో నిటుల చెప్పెను. "ఓ అర్జునా, అసంఖ్యాకమూ, అపారమూ నగు నా స్వరూపము నిదిగో చూడుము". అర్జునుడు శ్రీకృష్ణుని విశ్వరూపము నొక్క దానిని మాత్రమే చూడ నభిలషించు చుండెను. కాని, శ్రీకృష్ణుడు తన యీ విశ్వరూపమున సమస్త విశ్వమును చూపించెను. సర్వజ్ఞుడగు దేవుని ఔదార్యము అపరిమితమే. ఎవరైన యీ కోరికను కోరుటకు మాత్రము సంసిద్ధుడై యుండవలెను. అంతే. అతడా యాచకునకు అతడడిగిన దానికంటె కొన్ని రెట్లు ఎక్కువగా యిచ్చును. ఏ గుప్త రహస్య దర్శనమును భగవానుడు శేషనాగుని సహస్ర నేత్రములకు కూడ కానివ్వలేదో, ఏ గుప్త రహస్యమును ఆ వేదములకు కూడ వెల్లడి చేయలేదో, చివరకు లక్ష్మీదేవికి కూడ భగవానుడు తెలియనివ్వలేదో, ఆ రహస్యమునే నేడు శ్రీకృష్ణుడు పెక్కు విధముల వెల్లడించి మహాభాగ్యవంతుడగు అర్జునునకు తన విశ్వరూపత

దర్శనమును కలుగజేసెను. మేల్కొనియున్న పురుషుడు స్వప్నావస్థ నొందినవాడై ఆ స్వప్నమునందే ప్రంకుకీతిని శ్రీకృష్ణుడు కూడా యిప్పుడు అనంత బ్రహ్మాండములుగ నయ్యెను. ఆ దుఃఖిత కృష్ణ రూపమును పూర్తిగా అంతిమొందించి, మాయాదృష్టి యొక్క తెరను తొలగించి, తన యోగము వంతను పూర్తిగా స్వప్నమూ, బహిరంగమూ నొనర్చెను. అప్పుడు శ్రీకృష్ణుని మనము నందు "అర్జునుని యందు నా యీ రూపమును చూచు యోగ్యత యున్నదా, లేదా" యనెడి తలంపే లేకుండెను. అతడు ప్రేమ విహ్వలుండై "ఇదిగో, విశ్వరూపమును చూడుము" అనెను.

శ్రీ భగవానువాచ :—

పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః।
నానా విధాని దివ్యాని నానా వర్ణాకృతీని చ॥ ౫॥

శ్రీకృష్ణుడు చెప్పెను— "ఓ అర్జునా, నీవు కేవలము విశ్వరూపమును చూపవే యనదిగా కోరితివి. కాని, నేను నీకు ఆ విశ్వరూపమును మాత్రమే చూపి యుడినా అందేమి విశేషము గలదు! నా విశ్వరూపమునందే యే వస్తువులు నిండియున్నవో వాటినన్నిటిని నీవిప్పుడు చూడుము. ఇవెన్ని రకములగు ఆకారములు, రూపములున్నవో చూడుము. కొన్ని చాల చిన్నవి మరి కొన్ని చాల పెద్దవి; కొన్ని చాల సూక్ష్మమైనవి, మరికొన్ని చాల విశాలమైనవి; కొన్ని చాలస్థూలమైనవి. కొన్ని వశము కానివి, మరికొన్ని చాల దీనవి, మరియు సరళమైనవి; కొన్ని చంచలమైనవి, మరికొన్ని నిశ్చలమైనవి, కొన్ని విరక్తి గలవి మరికొన్ని మమకారముతో నిండియున్నవి; మరియు అతి తీవ్రమగు ప్రేమతో నిండియున్నవి. కొన్ని మదించినవి, మరికొన్ని జాగరూకతగలవి, కొన్ని గాంభీర్యము లేనివి, మరికొన్ని గంభీరమైనవి. కొన్ని ఉదారమైనవి కొన్ని పిసినిగొట్టువి, మరి కొన్ని క్రోధము గలవి. కొన్ని శాంతమైనవి, కొన్ని అభిమానముతో నిండి యున్నవి, కొన్ని నిర్వికారమైనవి, కొన్ని ఆనందముతో నున్నవి. కొన్ని గర్జించునవి, కొన్ని మౌనము గానున్నవి, మరికొన్ని సత్ప్రివర్తనగలవి. కొం దరు సకాములు, కొందరు విషయులంపటులు, కొందరు మేల్కొనియున్నారు,

కొందరు నిశ్చింతించియున్నారు, కొందరు సంతుష్టిగలిగియున్నారు, కొందరు లోభులు, కొందరు సమాధియుక్తులు, కొందరు సశస్త్రులు, కొందరు శస్త్రవిహీనులు, కొందరు అతిభీకరులు, కొందరు అత్యంత స్నేహపూర్ణులు, కొందరు భయంకరులు మరికొందరు విలక్షణమైనవారు, యింకొందరు సమాధిమగ్నులు కొందరు ప్రజోత్పత్తిచేయుటలో నిమగ్నులైయున్నారు, మరికొందరు సేవతో ప్రజాపాలన మొనర్చుచున్నారు, యింకొందరు క్రోధపూరితులై ప్రజాసంహార మొనర్చుచున్నారు, మరికొందరు కేవలము తటస్థులై యీ వినోదమునంతను చూచుచున్నారు. ఇట్టి అనేకవిధములగు అసంఖ్యాక రూపములిందు గలవు. ఇవిగాక, మరికొందరు దివ్యతేజమున వెలుగొందుచున్నారు, మరియు వారి ప్రకాశపు రంగుకూడ ఒకదాని కింకొకటి భిన్నముగా నున్నది. కొందరు పుటముచేసిన శుద్ధబంగారమువలె కాన్పించుచున్నారు, కొందరుపూర్తిగా పవిమిపన్నితో నున్నారు, మరికొందరు సర్వాంగములందును సింధూరము పూసిన ఆకాశమువలె శోభిల్లుచున్నారు. కొందరు స్వాభావికముగనే మణులు మరియు మాణిక్యములు కల్పిన బ్రహ్మాండమువలె కనిపించుచున్నారు. మరికొందరు కుంకుమతో రంగరింపబడిన అరుణోదయ ప్రకాశమువలె మెరయుచున్నారు, కొందరు స్వచ్ఛ స్ఫటికమువలె నిర్మలులు, కొందరు ఇంద్రనీలమణివలె నీలవర్ణముతో నున్నారు, మరికొందరు కాటుకవలె కారునలుపుగా నున్నారు, యింకొందరు యెఱ్ఱగానున్నారు. కొందరు మెరయుచున్న బంగారమువలె పసిమివన్నెతోనున్నారు, కొందరు వర్షాకాల మేఘమువలె నల్లగానున్నారు, మరికొందరు రక్తచంపకమువలె యెఱ్ఱగా నున్నారు, యింకొందరు ఆకుపచ్చగనున్నారు, కొందరు కరగబెట్టిన రాగివలె యెఱ్ఱగానున్నారు, కొందరు శుభ్రచంద్రునివలె పూర్తిగా తెల్లగా నున్నారు. ఈ రీతిగా నానా వివిధరంగులుగా గల రూపములను చూడుము. వివిధరంగులుండునట్లే యిన్నియు వివిధరూపములందు కూడ గలవు. కొన్ని మన్మథుని కూడ సిగ్గిలునంత సుందరమైనవి, కొన్ని అతి తేలికయైనవి, కొన్నింటి కాంతివంతమగు శరీరము అతిమనోహరమైనవి, కొన్నింటి సుందరస్వరూపము తెరువబడిన శృంగారలక్ష్మీ భాండాగారమా యనునట్లున్నది. కొన్ని అవయవపుష్టి, కండపుష్టి గలవి, కొన్ని పూర్తిగా ఎండుకుపోయియున్నవి. కొన్ని అతి భయంకర రూపము గలవి, కొన్ని పొడుగాటి మెడగలవి, కొన్ని చాలపెద్ద

తలగలవి, మరికొన్ని చాల విలక్షణమైనవి మరియు అనాకారముగ నున్నవి. ఈ ఆకారములందలి ప్రతి ఆకారపు శరీరప్రదేశమునందును నీకు జగత్తం తయు కనిపించును.

పశ్యాఽదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాఽశ్చర్యాణి భారత ॥6॥

"ఈ రూపములందలి ఏ ఒక్కరూపముయొక్క దృష్టియైన తెరుపుడు పడినప్పుడు ఆదిత్యాది ద్వాదశ సూర్యులును జన్మింతురు. కాని, ఆ దృష్టి మూతపడినప్పుడు ఆ ఆదిత్యులందరూ ఏకత్రితమై లీనమగుదురు. ఈ రూప ముల ముఖము లందలి ఉష్ణశ్వాసవలన అంతటను అగ్నిమంటలు నిండిపోవును మరియు ఆ జ్వాలనుండియే పావకుడు మొదలుగాగల అష్టవసువులు జన్మిం తురు. ఈ స్వరూపములయొక్క వంపు తిరిగిన కనుబొమలు క్రోధముచే ఒక దాని నొకటి కలిపినప్పుడు ఏకాదశరుద్రులు అవతరింతురు. కాని, వాటియందు సౌమ్యత ఆవిర్భవించినప్పుడు అశ్వినీకుమారులవంటి అసంఖ్యాకులగు ప్రాణ దాతలు పుట్టుదురు. వీటి చెవులనుండి అనేకవిధములగు పవనులుద్భవింతురు. ఇదేరీతిని ఒకేరూపముయొక్క సహజక్రీడవలన దేవగణాలు, సిద్ధులు ఉద్భ వింతురు మరియు చూడుము, నా విశ్వరూపమున యీ విధమగు అసంఖ్యా కము, అనంతమగు రూపములుగలవు. వీటిని వర్ణించి వర్ణించి వేదములుకూడ పిచ్చెత్తిపోయినవి, కాలుని ఆయుష్యకూడ చాలలేదు, మరియు ప్రత్యక్షముగ బ్రహ్మకుకూడ అంతుచిక్కలేదు, మరియు వీటినిగురించినవార్త యెన్నడును వేదత్రయపు చెవులకుకూడ సోకలేదు; అట్టి అనేక రూపములను నీవు ప్రత్య క్షముగ చూడుము మరియు ఆశ్చర్యముతో కూడియున్న ఆనందముయొక్క పూర్ణసాఫల్యతను అనుభవించుము.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం
మమదేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ॥7॥

"ఓ అర్జునా, కల్పవృక్షముక్రింద గడ్డిరకలు మొలచునటుల యీ మూర్తులయొక్క రోమకూపములందుకూడ స్పష్టముగ ముఖున్నవి. ఇంటి పైకప్పునందలి కంతలనుండి వచ్చెడి కిరణములందు పరమాణువులుతిరుగుచూ

కనిపించుచుండెను యీ మూర్తులయొక్క అవయవములందలి సంధి ప్రదేశము లందు అనేక బ్రహ్మాండములు ఏర్పడుచూ కనిపించుచున్నవి. ఇందలి ప్రతి అవయవప్రదేశమునందును విశ్వవ్యాప్తి కనిపించుచున్నది. ఈ జగత్తుకు అవల ఏదిగలదో నీవు చూడదలచుకొంటివో, దానినికూడా చూడుము”. దయామయుడగు శ్రీకృష్ణుడీ సంగతులను అన్నింటిని చెప్పెను, కాని ‘నీ విదంతయూ చూచితివిగాదా?’ అని శ్రీకృష్ణు డడిగిన ప్రశ్నకు అర్జును డేజవాబునూ యివ్వలేదు అంత శ్రీకృష్ణుని మనస్సులో ‘అర్జునుడిటుల మూగవలె ఏల స్తబ్ధుడగుచున్నాడ’ని సంశయము కలిగెను. ఈ సంశయముతో శ్రీకృష్ణుడు అర్జునునివైపు చూడగా, అర్జునుడు పూర్వమువలెనే ఆసక్తితో నున్నటుల ఆతనికి కనిపించెను.

న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా
దివ్యందదామితే చక్షుః పశ్యమే యోగమైశ్వరమ్ ॥౮॥

శ్రీకృష్ణుడు తన మనమున నిటు లనుకొనెను—

“ఇంతవరకు యీతనికి ఆసక్తి తగ్గలేదు. అందును యీతనికి ఆత్మసుఖ లాభము కలుగలేదు. నే నితనికి చూపించిన నా వాస్తవిక విశ్వస్వరూపమును ఆకళింపు చేసికొను శక్తి యీతనియందు కనిపించలేదు” అని యోచించి నవ్వుకొని, ఆతడర్జునితో నిటులనెను—“నేను నీకు విశ్వరూపమును చూపితిని. కాని నీవు దానిని చూచుటలేదు”. భగవానుని యీ మాటలు విని చతురుడగు అర్జును డిటులనెను—“కాని యిదెవరి తప్పు? మీరు కొంగకు వెన్నెలను ఆహారముగా పెట్టుటకై నిష్ఫలమగు ప్రయత్నము చేయుచున్నారు గ్రుడ్డివానిముందు పరిశుద్ధమైనట్టి అద్దమును పెట్టుచున్నారు; లేదా ఓ ప్రభూ, చెవిటివానిముందు సంగీతమును ఆలపించుచున్నారు. మీరు బుద్ధిపూర్వకముగ పూదేనె కణములను కప్పకు ఆహారముగ నిడుచున్నారు; అందువే ఆ కణములు వ్యర్థముగ నష్టపడుచున్నవి. ఇట్టి స్థితిలో, ఓ నారాయణా, మీరు యితరునిపై క్రోధము నేల చేయుదురు? ఏ వస్తువు యింద్రియాతీతమైనదో, దేనిని కేవలము జ్ఞానదృష్టిమాత్రమే అనుభవించగలదో, ఆ వస్తువును మీరు నా చర్మచక్షువుల ముందుంచుచో నేను దానినెటుల చూడగలను? కాని మీ తప్పుల నెన్నుట నాకు తగదు. కాన నేను మౌనముగా

నుండుటే మంచిది" ఈ మాటలు విని శ్రీకృష్ణుడిటుల చెప్పెను—"సోదరా అర్జునా, నీవు చెప్పునది సబబుగనే వున్నది, నేను నా వాస్తవిక విశ్వరూపమును చూపించుటకు ముందు నా ఆ రూపమును చూడగల సామర్థ్యము నీకు కలుగజేయవలయును. కాని, ప్రేమవశమున నేను మాట్లాడుటలో యీ విషయమును మరచితిని. కాని, దాని ఫలితము, పొలమును దున్నకుండా విత్తులు చల్లుటచే ఎట్టి ఫలితము కలుగునో, అదే అయినది. నీకిప్పుడు విశ్వరూపమును చూడగల శక్తి నిచ్చుచున్నాను. ఓ అర్జునా, ఆ దృష్టిసహాయమువలన నీవు నా విశ్వవ్యాపక ఐశ్వర్యయోగమును ప్రత్యక్షముగ చూచి ఆనందముతో ఆత్మానుభవమున ప్రవేశింపుము" వేదములు ఎవనినిగురించి ప్రతిపాదింపగోరునో, ఎవడు జగత్తునకంతకు మూలబీజమో, ఎవడు జగత్తునకంతకు వందనీయుడో, ఆ శ్రీకృష్ణుడిటుల చెప్పెను.

సంజయ ఉవాచ—

ఏవముక్త్వా తతో రాజన్! మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ ॥౯॥

సంజయుడు ధృతరాష్ట్రునితో నిటుల చెప్పెను—

"ఓ కౌరవ కులశ్రేష్ఠుడవగు రాజా, నాకు [illegible] వుండి ఒక విషయమును గురించి చాల ఆశ్చర్యము కలుగుచున్నది, చూడుడు, ఈ త్రిభువనములందును లక్ష్మినిమించిన భాగ్యశాలి ఎవరు? లేదా ఆత్మస్వరూపజ్ఞానమును కలుగజేయు సాధనము వేదములకు మించి మరేదిగలదు? అదేవిధమున వాస్తవిక సేవాభావమనునట్టిది కేవలము శేషనాగునందే గలదు. అంతేగాదా? నారాయణునిపట్ల ప్రేమచే నిండియున్నవాడై ఎనిమిది ఝాములూ యోగులవలె ఏకనిష్ఠుడై ఆతనిని సేవించు గరుత్మంతునితో సాటివచ్చు భక్తుడు మరెవ్వరైన గలడా! కాని వీరందరు ఒక ప్రక్క పడియున్నారు; కాని, పాండవులు జన్మించిన నాటినుంచి నారాయణ సౌఖ్యమును తమవైపుకు ఆకర్షించుకొనుచున్నారా యనునటుల ఒక వాటిన స్థలము జన్మించినది. ఈ పంచపాండవులలో అర్జునునకు శ్రీకృష్ణుడు పూర్తిగా వశపడినాడు. వీరి సంబంధము, కాముకుడగు పురుషుడు లావణ్యవతియగు స్త్రీకి వశపడినటుల

యున్నది. శ్రీకృష్ణుడు అర్జునుని వలయుండు చిన్నికొనినటుల బహుశః పెంపుడు పక్షికూడ యీ విధముగ మాట్లాడుచుండదు, పేమకొరకు ప్రేమతో పెంచిన హరిణముకూడ యీ విధముగ ఆడుకొనదు. అర్జునునకట్టి అదృష్టము పట్టినదో తెలియదు. పరబ్రహ్మమును పూర్తిగా తన కనులతో చూచు సౌభాగ్యమాతనికి కలిగినది. శ్రీకృష్ణుడాతని ప్రతికోరిక నెటుల నెరవేర్చుచున్నాడో చూచుడు. అర్జునుడు కోపించినప్పటికిని దేవుడు దానిని సంతోషముగ స్వీకరించును. అర్జునునియెడ శ్రీకృష్ణుడిటులుండు టెంతేని ఆశ్చర్యకరముగ నున్నది. విషయవాసనలను జయించిన సమర్థులగు శుక్రాదియోగీశ్వరులే యీ శ్రీకృష్ణుని రాసలీల, మరియు విషయవిలాసములను వర్ణించుచూ వర్ణించుచూ అతని స్తుతిపాఠకులైపోయిరి. యోగులు అత్యుచింతన మనెడి సమాధిగలవారై యీ శ్రీకృష్ణుని ధ్యానించుదురు. కాని, ఓ ధృతరాష్ట్ర మహారాజా, అట్టి శ్రీకృష్ణుడు నేడర్జునునకు పూర్తిగా వశపడిపోవుట నా కెంతేని ఆశ్చర్యమును కలిగించుచున్నది.” అటుపిమ్మట సంజయుడు వెంటనే యిటుల చెప్పెను—“ఓ కౌరవ శ్రేష్ఠా, అటుల కానిచో యిందాశ్చర్యపడవలసిన విషయమేమి గలదు? శ్రీకృష్ణుడెవనిపై ననుగ్రహించునో ఆతని కట్టి సౌభాగ్యమే కలుగును. యిందువలననే దేవాధిదేవుడు అర్జునితో “ఓ అర్జునా, నీకు నేను దివ్యదృష్టి నొసంగుచున్నాను. దీని సహాయమున నా విశ్వరూపమును చూడుము” అని చెప్పలేదు. ఈ మాట శ్రీకృష్ణుని నోటినుంచి పూర్తిగా వెలువడకముందే అజ్ఞానాంధకారము నశింపసాగెను. అవి శ్రీకృష్ణుని నోటినుండి వెలువడిన అక్షరములు మాత్రమే కావు. బ్రహ్మస్వరూప సామ్రాజ్య దీపమును అర్జునుని కొరకు జ్ఞానజ్యోతియగు శ్రీకృష్ణుడు వెలిగించెను. అటుపిమ్మట అర్జునునకు అలౌకికమగు జ్ఞాననేత్రములు లభించెను మరియు ఆ జ్ఞాననేత్రములందే జ్ఞానదృష్ట్యంకురములు జనించెను. ఈ విధముగా శ్రీకృష్ణుడు అర్జునునకు తన విశ్వరూపయోగ వైభవమును చూపించెను. ఆ సమయమున అర్జునునకు ఏ సముద్రమునందు యీశ్వరుని వివిధావతారములు తరంగములను పోలియున్నవో, ఎవని కిరణ సంయోగముచే యీ విశ్వరూపము ఎండమావులవలెడి ఆభాసను కలిగించుచున్నదో, ఆ విశ్వరూపమును వైకుంఠపతి యగు శ్రీకృష్ణుడుచూపెను. ఒకమారు శ్రీకృష్ణుడు బాల్యమున మన్నుతిన్నప్పుడు యశోదకు కోపమువచ్చి ఆతని చేతిని పట్టుకొని

గదమాయించెను. అంత శ్రీకృష్ణుడు భయపడుచూ తననోట మన్నులేదని రుజువుచేయుటకై నోరు తెరచెను. అప్పుడాతని నోటియందామెకు చతుర్దశభువనములు కనిపించెను. ఒకమారు మధువనమున ధ్రువునిపై నిట్టి అనుగ్రహమునే శ్రీకృష్ణుడు చూపెను. అతడొక్కమారు తననోట శంఖమును పెట్టగానే వేదములుకూడ చెప్పనేరని ఎన్నో విషయములను దడదడచెప్పసాగెను. ఓ ధృతరాష్ట్రా, అదేవిధమున నేడు శ్రీకృష్ణుడు అర్జునునికూడ అనుగ్రహించెను. అందువలననే అర్జునునియందు మాయ నామమాత్రముగ కూడ లేకుండాపోయెను. అప్పుడొక్కమారుగా, ప్రభుస్వరూపమనెడి ఐశ్వర్య ప్రభ కనిపించెను మరియు ఆతనికి నలువైపులను చమత్కారముగనే యుండెను. ఇందుచే అర్జునుని చిత్తము ఆశ్చర్యభావనమున లీనమయ్యెను. మార్కండేయుని గురించిన కథలో, బ్రహ్మయొక్క సత్యలోకమువరకు పూర్తిగా నిండియున్న జలమునం దెల్లప్పుడు మార్కండేయు డొక్కడే యీదుచూ కనిపించుచుండునటుల, నేడు విశ్వరూప మహోత్సవమున అర్జునుడొక్కడే ఆనందించుచున్నాడు.

ఆతడిటుల చెప్పసాగెను—"ఇచ్చట ఎంతవిశాలమగు ఆకాశమున్నది. అదంతయూ ఎక్కడిచ్చటకుగొనిపోయెను? స్థావరజంగమాత్మకమగు ఆ భూతసృష్టిఅంతయూ ఎటులేగినది? దిశాచిహ్నములుకూడ నశించినవి. పైన, క్రిందమనెడి కల్పనయే లేకుండపోయినది. అతనికి నేడు మేల్కొనినపిమ్మట స్వప్న విషయములన్నియు లోపించిన విధమున సృష్ట్యాకారముకూడ లోపించిపోయెను. సూర్యతేజ ప్రభావము వలన చంద్రుడు, నక్షత్రములూ అదృశ్యమైపోయినటుల జగత్ప్రభుని యీ విశ్వరూపము సృష్టినంతను కబళించినదాయన్నటులుండెను; ఆ సమయమున అతని మనస్సుయొక్క మనస్త్వముకూడ పోవుచుండెను. బుద్ధి తనను తాను సంబాళించుకొనజాలకపోయెను మరియు ఇంద్రియవృత్తులు తారుమారై హృదయమున నిండియున్నవి. అప్పుడు, స్తబ్ధత్వము మరియు ఏకాగ్రతలు సర్వవిధములగు యోచనలపైన ఎవరైన మోహనాస్త్రమును ప్రయోగించిరా యనునటుల పరమావధిని చేరెను. అర్జును డీరీతిని ఆశ్చర్యమున లీనమై కౌతుకముతో చూడసాగినప్పుడు అతనిముందు చతుర్భుజుడగు శ్రీకృష్ణుని కోమలస్వరూపము కనిపించసాగెను. కాని, అదే రూపము నలువైపులను అనేకవిధములగు వేషములలో కనిపించుచుండెను.

వర్ష కాలమున మేఘసమూహము ఎడతెగక వృద్ధిపొందుచుండుకీతిని, లేదా మహా ప్రళయసమయమున సూర్యతేజస్సు అభివృద్ధిపొందుచునే యుండుకీతిని, ఆ సమయమున జగత్పతిభోని విశ్వరూపము తానుతిప్ప మరేదియూ లేకుండ జేసెను. ప్రథమమున యీ విధముగ ఆత్మస్వరూప సాక్షాత్కారము కలుగుటతోడనే అర్జునుడు సమాధినిపొంది స్తబ్ధుడైపోయియుండెను. ఆ పిమ్మట అతడు సహజముగనే కనులను తెరచెను; అటుల తెరచుటతోడనే అతనికి విశ్వరూపసందర్శనమాయెను. అర్జునునకు తన యీ కనులతోడనే విశ్వరూపమును చూడవలెనని గల కోరిక యీ రీతిగా శ్రీకృష్ణుడు నెరవేర్చెను.

అనేక వక్త్రనయన మనే కాద్భుత దర్శనమ్
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥౧౦॥

ఈ విశ్వరూపమున పెక్కు ముఖములుండెను. లక్ష్మీపతియొక్క రాజమందిరములవలె నున్న, లేదా పెక్కువిధములగు సౌందర్యలక్ష్మీ భాండారములవలెనున్న, లేదా వసంతముతో నిండియున్న ఆనంద వనమువలె నున్న, లేదా లావణ్య సామ్రాజ్యమువలెనున్న ప్రభువుని సుందర ముఖములను అర్జునుడు చూచెను. కాని, యీ సుందరముఖములతోపాటు అచ్చటచ్చట వాటిమధ్య స్వాభావికముగనే చాల భయంకరములుగానున్న పెక్కు ముఖములనుకూడ చూచెను. అవి చూచుటకు, కాళ - రాత్రియొక్క సేనయే వచ్చినదన్నటుల, లేదా మృత్యుముఖములే యున్నటుల, లేదా భయమునెడి కోటలు కట్టబడినటుల లేదా ప్రళయాగ్ని కుండములు తెఱవబడినవన్నటుల వుండెను. ఆ విశ్వమూర్తియందు వీరశ్రేష్ఠుడగు అర్జునుడీ విధములగు పెక్కు విలక్షణము, వికరాలము మరియు భయంకరములగు ముఖములనుకూడ చూచెను. వీటితోపాటు ఆ మూర్తియందే అలౌకికముగ అలంకరించబడిన, సౌమ్య ముఖములుకూడా అసంఖ్యాకములుగ నుండెను, వాస్తవమునకు అజ్ఞాన దృష్టికికూడ ఆ ముఖముల అంత మెచ్చటను కనుపించుటలేదు. అటుపైని అర్జునుతో మిక్కుటమగు కుతూహలముతో ఆ విశ్వరూపమునగల నేత్రములను చూడసాగెను. ఆ నేత్రములు పెక్కువిధముల వికసించిన కమలవనము వలెనుండును. ఈ విధముగనే సూర్యుని రంగువలెనున్న మరియుంకను ప్రకాశవంతమగు నేత్రములనుకూడ అర్జునుడు చూచెను. కల్పాంత సమయమున

నల్లని దట్టమగు మేఘసమూహమునందు మెరపు కనిపించినటుల ఆ నల్లని వంకరయగు కనుబొమ్మలక్రింద అగ్నివలెగల దృక్కిరణములు శోభాయమానముగా నుండెను. ఇటుల ఆ ఒకే రూపమునందు వివిధములగు అనేక చమత్కారములను చూచుటచే అర్జునునకు ఆ రూపమునందలి అనేకత్వము పూర్తిగా విదితమయ్యెను. అతడు తనలో తానిటులను కొనసాగెను— "దీని పాదము లెచటనున్నవి, కిరీటము లెచటనున్నవి, చేతులెచటనున్నవి ?" ఈవిధమున అతనికి విశ్వరూపము దర్శించవలెననెడి అనురాగము కుతూహలముతో పాటు వృద్ధిపొందసాగెను. ఆ సమయమున అర్జునుడు సౌభాగ్య భాండారమేయన్నటులయ్యెను. అట్టి స్థితి నందాతని ఏ మనోరథము నిష్ఫలమగును ! శంకరుని అమ్ములపొదియందుకూడ వ్యర్థమగు బాణములుండునా ! లేదా బ్రహ్మదేవుని జిహ్వాపై ఎన్నడైన వ్యర్థమగు మాటరాగలదా ? అర్జునకప్పుడే ఆ అపార మూర్తియొక్క దర్శనము సంపూర్ణముగ కాసాగెను. వేదములకుకూడా అంతుచిక్కని ఆ భగవానుని విశ్వరూపమునందలి ప్రతి అంగమును అర్జునుడు రెండుకనులతోను ఒకేసమయమున ఒక్కమారుగా చూడసాగెను. ఆపాదమస్తకము ఆ స్వరూపైశ్వర్యమును చూచునప్పుడా మూర్తి నానావిధములగు అలంకారములచే విభూషితుడైనటుల అర్జునునకు తోచసాగెను. ఆ పరబ్రహ్మ స్వరూపుడగు దేవుడు ధరించుటకుగాను అవి పెక్కువిధములగు అలంకారములు, ఆ భూషణములుగనయ్యెను, ఆభూషణములు దేనిని పోలియున్నవో చెప్పుటకిట్టి సమయమున ఎవరి వశమగును ? ఏ తేజమువలన చంద్రసూర్యులుకూడ ప్రకాశవంతులగుదురో మరియు జగత్తునందలి జీవరూపమున నున్న మహాతేజమునకేది జీవిత సర్వస్వమో, అట్టి ఆ తేజమే ఆ విశ్వరూపమునకు సింగారముగానుండెను. యిట్టిది ఎవని బుద్ధికైన బోధపడగలదా ? ఇట్టి తేజోవంతముగ భగవానుడే తన్నుతాను సింగారించుకొనినటుల అర్జునుడు చూచెను. అంత అర్జునుడు జ్ఞానదృష్టితో ఆ విశ్వరూపముయొక్క సరళహస్తమును చూడసాగగా, అందాతనికి కల్పాంతజ్వాలలు వెలువడుచున్నవా యనునటుల ఆ హస్తములందు మెరయుచున్న శస్త్రములు కనిపించసాగెను. అంత అర్జునున కిటుల తోచెను—యీ రూపమునందంగములు అలంకారములు, హస్తములు మరియు ఆయుధములు, శిరములు మరియు శరీర సంధులందలి జంటవస్తువులు అన్నియు స్వయముగ దేవుళ్ళే, మరియు యిదే

విధమున స్థావర - జంగమ జగత్తంతయు క్రిక్కిరిసి యుండి వ్యాపింపబడి యున్నది. ఆ ఆయుధ కిరణములందలి ప్రబలమగు అగ్నిలో నక్షత్రములు వేయించుచున్న తునకలవలె విచ్చుచుండెను, మరియు దాని తాపముచే అగ్ని వ్యాకులమునొంది సముద్రమున ప్రవేశించుటకు సిద్ధమగుచున్న దాయనునటుల యుండెను. ఆటుపిమ్మట అర్జునుడు దేవుని అసంఖ్యాకములగు హస్తములను చూచెను—అందు కాలకూటవిషతరంగములతో చల్లార్పబడినవా యనునట్టి లేదా ప్రచండ విద్యుత్తుచే నిండియున్నవా యనునట్టి అస్త్రములుండెను.

దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖం॥౧౧॥

భయమును పొందినవాడై యీ శస్త్రములతో కూడియున్న హస్తముల వైపునుంచి అర్జునుడు తన దృష్టిని మరల్చినాయన్నటుల, అంత అర్జునుడు ప్రభుని కంఠము, మస్తకమును చూడసాగెను; దేనిచే కల్పవృక్షములు జన్మించినవో, ఏది ఆత్మ సాక్షికి ఆదిస్థానమో ఎచట అలసియున్న శ్రీ లక్ష్మీదేవి విశ్రమించునో, కంఠము మరియు మస్తకమున అతిస్వచ్ఛము మరియు సుందరమునగు పుష్పములను ధరించినవాడై అట్టి ఆభగవానుడు కనుపించెను. మస్తకమున గుత్తులు వివిధ అవయవములపై పూలదండలు, జాలరులు మొదలగు నవన్నీ, కంఠమున దివ్య పుష్పమాలలున్నూ విరాజిల్లుచుండెను. దేవుని నితంబమునగల పీతాంబరము, స్వర్గము సూర్యతేజస్సనెడి పరిధానమును ధరించినదా యన్నటులును, లేదా మేరుపర్వతము బంగారుచే కప్పబడినదాయన్నటులను శోభిల్లుచుండెను. కర్పూరవర్ణమునగల శంకరునకు కర్పూరము రాచినటుల, లేదా కైలాసధవళగిరిపై పాదరసలేపన మొనర్పబడినటుల, లేదా క్షీరసాగరమునకు పాలతో సమానమగు తెలుపురంగుగాగల వస్త్రము కట్టినటుల, లేదా వెన్నెల తొడుగును ఆకాశమునకు తొడగినటుల - ప్రభువరుని శరీరమంతటను చందనము రాచినటుల కనపించెను. ఏ సుంగధమువలన ఆత్మస్వరూప తేజము అత్యధికముగ యింకనూ ప్రకాశించునో, దేనిచే బ్రహ్మానందమనెడి దప్పిక శాంతించునో, దేనిచే పృథ్వికి చైతన్య ప్రాప్తికలుగునో, విరక్తులగు సన్యాసులుకూడ దేని సాంగత్యమును కోరుదురో, అనంగుడగు మన్మథుడుకూడ దేనిని తన అంగములన్నింటికి రాచికొనునో, అట్టి ఆ సుగంధ

మహిమ నెవడు వర్ణించగలడు ! ఈ విధమున ఒక్కొక్క శృంగార శోభను అర్జునుడు చూచుచూ ప్రభువు నిలచియున్నాడో, కూర్చొనియున్నాడో లేక నిద్రించియున్నాడో తెలుసుకొనజాలనంతటి కంగారునం దాతడుండెను. బాహ్యచర్మచక్షువులను తెరచి చూచినమీదట సమస్తము దేవమూర్తిమయముగనే కనుపించుచుండెను. ఈ కనులతో చూడనని అతడు కనులను మూసినప్పుడుకూడ అతనికి సమస్తము దేవమయముగనే కనిపించుచుండెను. ఎదుట అసంఖ్యాకములగు ముఖములు కనుపించుచుండెను. అందుచే అర్జునుడు భయపడి వెనుకకు చూడ నారంభించగా, అచ్చటకూడ దేవుని ముఖములు, హస్తములు, పాదములు మొదలగునవి అన్నియు అదే మాదిరిగ కనిపించసాగెను. ఇట్టి స్థితిలో కనులు తెరచి చూచినప్పుడుకూడ యిదే విధముగ కనిపించెననుటలో ఆశ్చర్యమేమి గలదు ! కాని యిందలి వైచిత్ర్యము - కనులు మూసినప్పుడుకూడ అతడు కనులు తెరచినప్పటివలె దేవుని దర్శించుచుండుటే ! ప్రభుని కృపయందుకూడ యిదొక విచిత్రమగు కార్యమే ! అర్జునుని చూచుట, చూడకుండుట రెండునూ ఒకే విధముగ అగునటుల నారాయణుడొనర్చెను. అర్జునుడు ఒక చమత్కార సాగరమును దాటి ఒడ్డునకు వచ్చుచుండగనే అతడు మరొక చమత్కార సాగరమున పడుచుండెను. ఈ రీతిగా ఆ అనంతస్వరూపుడగు నారాయణుడు తన అలౌకికమగు దర్శన సామర్థ్యమువలన అర్జునుని పూర్తిగా గాబరా పడునటుల చేసెను. ప్రభువు స్వాభావికముగానే విశ్వతోముఖుడు, (సర్వవ్యాప్తి; పైగా, అర్జునుడు అతనిని విశ్వరూపము చూపించవలసినదిగా కోరెను, అందువలన దేవుడు స్వయముగనే సర్వజగద్రూపధారుడై అతనిముందు ప్రకటమయ్యెను. అంతేగాక, నారాయణుడు అర్జునునకు దీపముగాని సూర్యప్రకాశముగాని వున్నప్పుడు మాత్రమే కనిపించెడి స్థూలదృష్టిని ప్రసాదించలేదు. కాన, ఓ ధృతరాష్ట్ర మహారాజా, యీ స్థితిలో అర్జునుడు చూచుగాక, లేక చూడకుండుగాక— యీ రెండు స్థితులందును అతడు తప్పక చూడవలసియే యుండవలసెనను విషయమును మీరు జ్ఞప్తియందుంచుకొనుడు.'' ఈ విధముగా హస్తినాపురమునందు ధృతరాష్ట్రునితో సంజయుడు చెప్పుచూ, మరల యిటులనెను—ఓ రాజా, యిదంతయునూ మీరు గుర్తుంచుకొన లేకపోయినప్పటికిని అర్జునుడు

భగవానుని విశ్వరూపమును చూచెననియు, అది అనేక రకములగు అలంకార ములచే నిండియున్నప్పటికిని సర్వవ్యాపిగానుండెననియు మైన గుర్తించుకొనుడు.

దివి సూర్య సహస్రస్య భవే ద్యుగప దుత్థితా
యది భా స్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః ॥12॥

“ఓ రాజా, విశ్వరూపముయొక్క అంగములందలి కాంతియొక్క అద్భుతదృశ్యము ఎటులున్నదో, దేనికి సాటివచ్చునో చెప్పనలవికానిది. మహాప్రళయ సమయమున ద్వాదశసూర్యులు ఏకమయ్యెదరు. అట్టి వేలకొలది దివ్యసూర్యులు ఒకమారుగా ఉదయించినప్పటికికూడ వా రా విశ్వరూప తేజో మహిమయొక్క లోతును కనుగొనజాలరు. జగత్తునందు గల విద్యుత్తు నంతను ఏకత్రమొనర్చినప్పటికిని, కల్పాంతసమయపు అగ్నియొక్క పూర్తి మొత్తమునంతను ఏకత్రమొనర్చినప్పటికిని, మరియు అందలి ప్రసిద్ధమగు దశ మహాతేజస్సులను సమ్మిళితమొనర్చినప్పటికిని కూడ ఆ విశ్వరూపమునందలి అంగముల ప్రకాశమునందు అత్యల్పముగనే వుండును; యీ తేజస్సుతో సమానముగ పడి కట్టదగు తేజస్సు మరిచ్చటను లభించదు. అతని సర్వాంగములందును గల సర్వత్ర వ్యాపించెడి ఆ తేజస్సును వ్యాసమహాముని కృపా ఫలముచే నేను చూడగలిగితిని.

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్యద్దేవదేవస్య శరీరే పాణ్డవ స్తదా ॥13॥

ఆ విశ్వరూపమునందొకమూల యీ సమస్తజగత్తు తన సంపూర్ణ మగు వ్యాపకత్వముతో మహాసాగరమునందలి చిన్నచిన్న నీటిబుడగలవలెను, లేదా ఆకాశమునందలి వివిధమేఘములవలె, లేదా భూమిపై గల చీమల పుట్టలవలె, లేదా మేరుపర్వతముపైన పెక్కు పరమాణువు లున్నటుల పడి యున్నది. ఈ విధముగా గల యీ జగత్తునంతను దేవదేవుని శరీరమునందా సమయమున అర్జునుడు చూచుచుండెను.

తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః
ప్రణమ్య శిరసాదేవం కృతాఞ్జలి రభాషత ॥14॥

అర్జునుని మనస్సునం దింతవరకు 'యీ జగత్తు వేరు, నేను వేరు' అని గల భేదభావ మిప్పుడు పూర్తిగా నశించెను మరియు అతని అంతఃకరణము పూర్తిగా ద్రవించిపోయెను. అతనిలో ఆనందము సంచరించెను, బాహ్యా శరీరావయవములందలి బలము తాత్కాలికముగ పూర్తిగా నశించెను మరియు నఖశిఖ పర్యంతముగల శరీరమందంతటను రోమాంచమయ్యెను. వర్షముకురిసిన పిదప పర్వతభాగములన్నియు కోమల తృణాంకురములతో ఆచ్ఛాదితమొనర్పబడురీతిని అర్జునుని శరీరమందంతటను రోమాంచమనెడి అంకురములు మొలకరించెను. చంద్రకిరణ స్పర్శమున చంద్రకాంతమణి ద్రవించురీతిని అతని శరీరము చెమటబిందువులతో నిండిపోయెను. కమలకోశమున బంధింపబడిన భ్రమరము అటునిటు ఊగినప్పుడు (తామరమొగ్గ) కమలకళిక కూడ నీటిపై ఊగురీతిని, అంతఃకరణమున సుఖతరంగములు లేచుటచే బయటకు అతని శరీరముకూడ గజగజవణకసాగెను. కర్పూర కదళీదళములు విచ్చినప్పుడు అందణగియున్న కర్పూరకణములు క్రింద రాల నారంభించురీతిని, అర్జునుని కనులనుండి బొటబొట కన్నీటిబిందువులు పడసాగెను. చంద్రోదయము కాగానే నిండియున్న సముద్రము మరియింకనూ నిండిపోవురీతిని అర్జునుడు కూడ ఆనందతరంగములచే మరి యింకనూ నిండిపోయెను. ఈ విధమున ఎనిమిది విధములగు సాత్త్వికభావములు తమలో తాము పోటీ పడుచూ అర్జునుని అంగములందు నిండియున్నవా యనునటుల, అతని జీవమునకు బ్రహ్మానంద సామ్రాజ్యము ప్రాప్తించెను. కాని, యీవిధమగు ఆత్మానందము లభించిన పిమ్మటకూడ అతని దృష్టిలో దేవుడు, భక్తుడు అనెడి ద్వైతభావము నిలచియేయుండెను. ఇందుచే అర్జునుడొక దీర్ఘనిశ్వాసమును విడచి యిటునటుచూచెను మరియు శ్రీకృష్ణుడుకూర్చొనియున్న వైపు ప్రభునకాతడు నమస్కరించి, చేతులు జోడించి యీ రీతిని చెప్పమొదలిడెను.

అర్జున ఉవాచ—

పశ్యామి దేవాం స్తవదేవ! దేహే సర్వాం స్తథాభూత
విశేషసఙ్ఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వానురగాంశ్చ
దివ్యాన్ ॥౧౫॥

అర్జునుడిటుల చెప్పెను—"ఓ ప్రభో, మీకు నేను జయజయలు చెప్పు చున్నాను. మీరు నిజముగనే నాపైన విలక్షణమగు అనుగ్రహమును చూపితిరి; ఆ కృపవలననే నేను నావంటి ఒక సామాన్యునకు కూడ ఈ విశ్వరూపమును చూచు సౌభాగ్యము గలిగినది. కాని, మహారాజా, మీరు చాలమంచిపని చేసితిరి. దీనివలన నాకు కూడ చాల సంతోషము కలిగినది! నేను యీసృష్టి కంతకు మీరే ఆధారమని నాకు ప్రత్యక్షముగ కనిపించినది. ఓ దేవా, మందరపర్వతముపైన ప్రతిప్రదేశమునను వనచరజంతు సమూహములు ఏకత్రితమై యుండునట్లు, అనేకములగు చతుర్దశభువన సమూహములు మీ శరీరముపై వ్రేలాడుచూ కనుపించుచున్నవి, ఆకాశమున నక్షత్రసమూహము లుండునట్లు, లేదా విశాలమగు వృక్షముపై పెక్కు పక్షిగూళ్ళు వ్రేలాడు రీతిని, ఓ నారాయణా, మీ యీ విశ్వమయ శరీరమున స్వర్గము మరియు అందలి దేవగణమూ నాకు కనిపించుచున్నవి. ఓ ప్రభో, ఈ శరీరమున అనేక మహాభూతపంచకములు మరియు భూతసృష్టియందలి ప్రతిఒక్క భూత సముదాయమూ నాకు కనిపించుచున్నారు. ఓ మహారాజా, మీ శరీరమునందంతటను సత్యలోకమున్నది; అట్టి స్థితిలో అందు బ్రహ్మదేవుడు కనిపించుటే దనుట కవకాశ మెక్కడ! మరియొకవైపు చూడగా కైలాసము కనిపించుచున్నది. ఓ దేవా, మీ శరీరమం దొక చిన్న కోణమునందు గౌరీసహితముగా శంకరుడుకూడ నున్నాడు. ఇంతేగాదు, ఓ నారాయణా, మీరు కూడ యీ విశ్వరూపమున కనిపించుచున్నారు. ఇందు కశ్యపుడు మొదలుగాగల సమస్తఋషికులము మరియు నాగసముదాయ సహితముగ పాతాళము కూడ కనిపించుచున్నది. సంక్షేపముగ చెప్పవలెనన్న, ఓ త్రిభువననాథా, మీ రూపమందలి ప్రతిఅవయవ భాగమునందును చతుర్దశభువన చిత్రములు చిత్రింపబడి కనిపించుచున్నవి. ఈ భువనములందు ప్రతిలోకముకూడ చిత్రింపబడి కనిపించుచున్నది. ఈ విధముగా మీ అగాధమహత్త్వపు అలౌకికత్వము నేడు నాకు కనిపించుచున్నది.

అనేక బాహూదర వక్త్రనేత్రం పశ్యామిత్వాం సర్వతోఽనన్త
రూపం

నాన్తం న మధ్యం నపున స్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వ
రూప॥ ౧౬

“ఈ దివ్యదృష్టి సహాయమున నేను నలుదిక్కులందును చూడగా— మీ బాహుదండములనుండి ఆకాశాంతరములను పోలియున్నట్టి అనేక అగ్రహస్తములు మీవి వెలువడియున్నవి, మరియు వాటినుండి ప్రతి అగ్రహస్తమును సమస్త విధములగు వ్యవహారములు మరియూ కార్యములు చేయుచూవున్నటుల—నాకు కనుపించుచున్నది. అవ్యక్త బ్రహ్మమునందనేక బ్రహ్మాండభాండారములు ఉదయించియున్నటుల కనుపించురీతిగా మీ యీ అపారములగు ఉదరములు నాకు కనుపించుచున్నవి. ఈ శరీరమునందొకే సమయమున సహస్రశీర్షత్వముగల కోటానుకోట్ల ఆవృత్తులుగలవు; మరియు పరబ్రహ్మయనెడి వృక్షమునందీ వేలకొలది మస్తకములనెడి ఫలములు ఫలభారముచే ఊగుచున్నటుల కనుపించుచున్నవి. ఓ విశ్వరూపుడవగు దేవా, యీ విధముగాగల మీ ముఖములన్నియు నాకు కనుపించుచున్నవి. మరియు అందలి కనులయొక్క అనేక సముదాయములనుకూడ నేను చూచుచున్నాను. కేవలమింతియేకాదు, స్వర్గము, పాతాళము, భూమి, దిక్కులు మరియు ఆకాశము మొదలగునవి అన్నియు యిచ్చట అంతమును పొందుచున్నవి. మరియు అన్నియూ యిచ్చట మూర్తివంతమును దాల్చి కనిపించుచున్నవి. మీరులేనట్టి పరమాణువుతో సమానమగు ఏదైనా ప్రదేశము కనిపించునేమోయని నేను ప్రయత్నించి చూచితిని. కాని నాయీప్రయత్నము వ్యర్థమైనది, మీరంతట నిండియున్నారు. గణించనలవికానన్ని పెక్కు మహాభూతములిందు ఏకత్రితమైయున్నవి, మరియు ఓ అనంతదేవా, వాటివ్యాప్తియంతయూ మీయందిమిడియున్నది. ఈ విధమగు మహత్త్వముగల మీరెచ్చట నుంచి వచ్చిరో, ఎచ్చట కూర్చుంటిరో, ఎచట నిలచియున్నారో, మీరేమాతృగర్భమందుండిరో మీ ప్రదేశమెంత పెద్దదో, మీ రూపమెట్టిదో, మీ వయస్సెంతో, మీ ఆవలివద్దున ఏమిగలదో, మీ మూలాధారమెట్టిదో—మొదలగు విషయములన్నిటినిగురించి నేను యోచించి చూడగా నాకు మీరే మూలాధారమనిన్ని మీరు మరి దేనినుంచియూ జన్మించలేదనిన్నీ నాకు బోధపడినది. ఈవిధమున మీరు అనాదులు మరియు స్వయంసిద్ధులైయున్నారు. మీరు నిలబ

డియూ నుండలేదు, కూర్చొనియుండలేదు. మీరు ఉన్నతమైనవారూ కాదు, పొట్టివారూ కాదు. ఆదియందును, మధ్యను, అంతమున ఓ ప్రభూ, అంతటను మీరేవున్నారు ఓ దేవా, మీ రూపము, లావణ్యము, పొడవు, పొట్టి—అన్నియూ మీరే. నేనింకేమని చెప్పను! ఓ అనంతదేవా, మాటిమాటికి చూచినప్పటికికూడ మీ సర్వస్వము మీరేయని గోచరమగుచున్నది. కాని ప్రభూ, మీరూపమందు కేవలమొక్క కొరత కనిపించుచున్నది. అదేదన, అందు ఆది, మధ్య, అంతములు—యీ మూడింటియందే ఒక్కటియు నాకెచ్చటను కనిపించుటలేదు. మీరంతటను వ్యాపించియున్నారు. కాని దీనిజాడ ఎచ్చటను కనిపించుటలేదు. కానకే, మీయందలి మూడునూ ఎచ్చటను లేవని నిశ్చయముగ నిర్ణయమగుచున్నది. ఈ విధమున ఆది మధ్యాంతరహితుడవగు ఓ అనంతవిశ్వనాథా, నేను నిజముగా మీ విశ్వరూపమును చూచితిని. ఓ దేవా, మీయీ ప్రచండమూర్తియందే వివిధములగు సమస్తమూర్తులు ప్రతిబింబించుచున్నారు మరియు మీరు అనేకరంగులుగాగల యీ అంగరఖాలను ధరించినటుల కనిపించుచున్నది. లేదా యీ వివిధ మూర్తులు మీశరీరమనెడి పర్వతమున వెలువడిన లతలకలెను మరియు అవి దివ్యాలంకారములనెడి పుష్పములు, ఫలములతోను నిండియున్నటులును కనిపించుచున్నది. లేదా, ఓదేవా, మీరు మహాసాగరము, మరియు యీ మూర్తులనెడి తరంగములచే మీరు కదలుచున్నటులును, లేదా మీరొక విశాల వృక్షముగను, మరియు యీ మూర్తులు ఆ వృక్షమునందు కాచిన ఫలములుగను కనిపించుచున్నది. ఓ ప్రభూ! భూలోకము భూతకోటిచే నిండియుండి కనిపించునటుల, ఆకాశము నక్షత్రములచే నిండియుండునటుల—మీయీ స్వరూపముకూడ అనంతమూర్తులతో నిండియున్నటుల కనిపించుచున్నది. ఇందలి ఒక్కొక్కమూర్తియొక్క అంగములనుండి త్రిభువనములన్నియు ఉత్పన్నమై దానితోపాటు వారివలననే లయమునుకూడ పొందుచున్నవి—యిట్టి మహిమాన్వితులగు మూర్తులు మీ శరీరమునందలి రోమములా యన్నటుల కనిపించుచున్నారు. ఇంతటి అపారరూపముగల మీరు నా రథసారథులగు శ్రీకృష్ణులు. ఓ ముకుందా, యోచించిచూడగా, మీరెల్లప్పుడును ఇదేరీతిని వ్యాపించియుందురనిన్నీ, కేవలము భక్తునియెడగల ప్రేమచే యీవిధమగు ప్రేమమయమగు మధురరూపమునుధరింతురనిన్నీ తెలియుచున్నది. ఆచతుర్భుజములుగలశ్యామల

రూపమును చూడగానే మనస్సు మరియు నేత్రములు శీతలములగును మరియు ఆలింగన మొనర్చుటకై చేతులు జాపుచో ఆ రూపము సహజముగనే లభించును. ఓ విశ్వరూపుడవగు దేవా, యీవిధమగు సుందరరూపమును నాపై ననుగ్రహించుటకుగానే ధరించితిరిగదా! లేదా, మీరు ఈ విధముగా సామాన్యులుగను, మధురముగను కనిపించుట నా దృష్టిదోషము వలననా? ఏదైన కానిమ్ము. ఇప్పుడు నా దృష్టిదోషము పూర్తిగా తొలగిపోయినది. మరియు మీరు నా నేత్రములను సహజముగనే దివ్య ప్రకాశమయముగా నొనర్చిరి. మరియు యిందువలననే నేను మీ వాస్తవిక మహిమతో కూడియున్న స్వరూపమును చూడగలిగితిని. నా రథసారథులగు మీ విశ్వరూపమే యిదియని నాకిప్పుడు స్పష్టముగ బోధపడినది.

కిరీటినం గదినం చక్రిణంచ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తం।
పశ్యామిత్వాం దుర్నిరీక్ష్యం సమన్తా ద్దీప్తానలార్క ద్యుతిమ
ప్రమేయం ॥౧౭

"ఇంతేగాదు, ఓ శ్రీకృష్ణా, మీ శిరస్సుపైన మీ రెల్లప్పుడూ ధరించెడి ముకుటమే యిప్పుడుకూడ నున్నది, కాని, దాని యిప్పటి ప్రతిభ మరియు వైశాల్యములు కొంత విలక్షణముగా నున్నది. పైనగల మీ చేతియందిప్పుడు కూడ ఎవరిపైననూ చక్రము ప్రయోగింపనున్నా రన్నటుల చక్రమును ధరించియున్నారు. ఓ విశ్వరూపా, కాని యిందు పూర్వమెల్లప్పుడు కానిపించు విషయమొకటి యిప్పుడు కనిపించుట లేదు. రెండవవైపున గల గదకూడ పూర్వపుమాదిరిదే గదా? క్రిందనున్న శస్త్రములులేని యీ రెండు చేతులూ గుఱ్ఱముల కళ్లెమును పట్టుకొనుటకై ముందుకు సాగుచున్నవి. మరియు ఓ విశ్వనాథా, నా మనస్సునందీ వాంఛ ఉదయించుచే తడవుగ, మీ రీ విశ్వరూపమును ఒక్కమారుగా ధరించిరని కూడ నాకు బోధపడినది. కాని, యిదెంత ప్రచండమూ, అద్భుతమూ నగు చమత్కారము! ఈ చమత్కారమును చూచి చకితుడనగుటకు కావలసినంత విస్మయబలము కూడ నాలో లేకున్నది. ఈ ఆశ్చర్యమును చూచి చిత్తముపూర్తిగా ఉన్మత్త రాలైతేరును. ఈ విశ్వరూపమిచ్చట నున్నదా, లేదా యని సరిగా నిర్ణయమొనర్చుటకుకూడ వీలుగాకుండావున్నది. ఈ జగత్సముదాయ సంతయ్యూ

యించెంత చక్కగా యిముడ్చబడియున్నది! ఈ విలక్షణమగు తేజో ప్రభావ
మును అగ్నికూడ చూడజాలదు. సూర్యుడుకూడ మిణుగురుపురుగువంటివాడు.
ఈ ప్రచండ తేజోసముద్రమునందు సృష్టియంతయు మునిగిపోయినదా, లేదా
కల్పాంతసమయమందలి విద్యుత్తు ఆకాశమునందంతటను వ్యాపించియున్నదా,
లేదా జగత్ప్రళయ సమయమందలి అగ్నిజ్వాలను తునాతునకలుచేసి గాలి
యందే ఉన్నతమండపములు కట్టబడినవా యని నటులున్నది, నా దివ్యజ్ఞాన
దృష్టికూడ యీ దృశ్యమును చూడజాలకున్నది. దీని దేదీప్యమానమగు ప్రతి
ప్రతిక్షణము పొందుచున్న అపారమగు అభివృద్ధి మరియు అందలి తేజము
మరియు దాహకత్వము నందలి విలక్షణతలవలన అతనివైపు చూచినందువలన
దివ్యనేత్రములుకూడ కంగారుపడుచున్నవి. దీనినిచూడగా, మహారుద్రుని
మూడవకంటియందు దాగియుండు మహాప్రళయకాలమగు అగ్నిబయల్వెడలి
నదా యన్నటులున్నది. ఈ విధముగా వ్యాపించియున్న దాహక ప్రకాశము
నందు పంచాగ్నిజ్వాల లనెడి భ్రమరములు లేవగానే బ్రహ్మాండమంతయూ
కొద్దిగామాడిపోవుచున్నదన్నటుల యున్నది. ఓ దేవా, మీ వ్యాపకత్వము,
తేజస్సులకు హద్దే కనిపించుటలేదు.

త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానం
త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే

“ఓ దేవా, వేదములు ఎవనిని అన్వేషించుటకై ప్రయత్నించునో,
ఆ అక్షరుడు మరియు ఓంకార మనెడి మూడున్నర మాత్రల కళలుగల
వస్తువూ మీరే. ఏది ఓంకారమున కంతకు మూలమో, మరియు దేనియందు
జగత్తంతయు అణగియున్నదో, ఆ అక్షయము, గూఢము మరియూ నాశ
రహితమగు తత్త్వము మీరే. మీరే ధర్మమునకు ప్రాణము, స్వయంసిద్ధులు
మరియు అవికృతులు మరియు జగత్తుకంతకు నిరంతరయూనై యున్నారు.
ముప్పదియారు తత్త్వములకు ఆవలగల ముప్పదియేడవ తత్త్వము మీరే.
పురాణపురుషుడని చెప్పబడువాడుకూడ మీరేనని నేడు నాకుబోధపడినది.

అనాది మధ్యాన్త మనన్తవీర్య మనన్తబాహుం శశిసూర్యనేత్రం
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం
తపన్తం ॥౧౯॥

"మీరు ఆదిమధ్యాంతరహితులు, స్వయంసిద్ధులు, అపారులు మరియు మీ బాహువులు, పాదములు విశ్వవ్యాపములు. చంద్ర సూర్యులిద్దరు మీ నేత్రములు మరియు వాటి కృప మరియు కోపములనెడి ఆట నిరంతరము జరుగుచునే యుండును. మీరు ఒకనిపై క్రోధపూరిత నేత్రములతో కోపించి చూతురు, మరొకనిపై కృపాదృష్టియనెడి క్రీడను ప్రసరింపజేతురు. ఓ దేవా, మీ యీ విధమగు స్వరూపమును నేను చక్కగా చూచుచున్నాను. మీ యీ ముఖము ప్రళయకాలపు మండుచున్న అగ్నిభాండారమువలె నున్నది. పర్వతములపై వ్యాపించియుండు దావాగ్నినుండి వస్తువులను దగ్ధమొనర్చుచున్న అగ్నిజ్వాలలు లేమకీతిని మీ నాలుక దంష్ట్రిలను నాకుచూ దంతములందిటునటు దిరుగుచున్నది. ఈ ముఖదాహము మరియు శరీరమందంతటను గల తేజస్సువలననూ యీ విశ్వమంతయు ఉత్తప్తమగుటచే అత్యంతముగ క్షోభిల్లుచున్నది.

ద్యావా పృథివ్యో రిద మన్తరంహి వ్యాప్తం త్వయైకేన
దిశశ్చ సర్వాః
దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రం తవేదం లోకత్రయం
ప్రవ్యథితం మహాత్మన్ ॥౨౦॥

"మరియు స్వర్గము, పాతాళము, పృథ్వి, అంతరాళము, దశదిశలు మరియు నలువైపుల వ్యాపించియున్న క్షితిజవర్తులములు - అన్నింటను సహజముగనే వ్యాపించియున్నవారై మీరు నాకు కనిపించుచున్నారు. కాని, ఆకాశసహితముగ వీటి నన్నింటిని యీ భయంకరరూపము కబళించినదన్నటులయున్నది, లేదా, మీ యీ రూపమనెడి అద్భుతరస తరంగములందు చతుర్దశభువనములు వచ్చిపడిన వన్నటులయున్నది. ఇట్టి స్థితిలో యీ విధమగు అద్భుతదృశ్యమును నా బుద్ధి ఏవిధముగా ఆకళింపు చేసికొనగలదు? ఈ విలక్షణమగు వ్యాపకత్వము ఏ విధముగను హద్దుగలదిగా నొవర్ప వీలు కానిది, మరియు యీ తేజోతీవ్రత ఏ రీతిగను సహింపవలవి కానిదియునై యున్నది. జగత్సుఖము అనునది లేకపోగ, ప్రాణధారణమే చాల కష్టముగ నున్నది. ఓ దేవా, మీ యీ స్వరూపమును చూచుటచే భయమనెడి వరద ఏల వచ్చుచున్నదో బోధపడుటలేదు. ఇప్పుడీ దుఃఖ తరంగములందు

త్రిభువనములు మునిగిపోవుచున్నవి. వాస్తవముగా చూచినచో మీ యీ మహోత్కృష్టదర్శనమున భయప్రవేశమునకే ఆవశ్యకత గలదు! కాని, నేను ప్రస్తుతము పొందుచున్న మీ దర్శనానుభవమువలన సుఖమే మాత్రము లేదను టలో ఏ విధమగు సంశయము లేదు. మీ రూపము కనిపించనంతవరకు యీ జగత్తుకు సాంసారిక సుఖములు మధురమైనవిగ తోచును కాని, యిప్పుడు మీ విశ్వరూపమును దర్శించినపిమ్మట విషయవాంఛలపట్ల పూర్తిగా విరాగ మేర్పడినది మరియు మనస్సున ఉద్వేగము జనించినది. మీ యీ రూపమును చూచిన పిదప మిమ్ము ప్రేమపూర్వకముగ కౌగిలించుకొనుటకు వీలగునా? అటుల కౌగిలించుకొనకుండా యీ శోకసంకటమున ఎవడైన ఎటులుండ గలడు? మిమ్ము విడచి ఎవడైన తప్పించుకొన జూచుచుచో యీ జనన - మరణములనెడి పరిహరింపరాని యీ జగత్తు నోరుదెరచుకొని ఎదుట నిల బడి అతనిని తప్పించుకొనిపోనిచ్చుట లేదు కూడాను. ఒకవేళ వాడు ముం దుకు సాగుచో మీ యీ అద్భుతము మరియు అత్యుగ్రము నగు రూపము సహింపరానిదిగా నున్నది. ఈ రీతిగా మధ్యయుండే సంకటములందుపడిన దురదృష్టయగు త్రిభువనము కష్టములను పొందుచున్నది. ఈ సమయమున నా అంతఃకరణమునందు యిదేస్థితి సరిగా కలిగినది. ఈ స్థితి ఎటులున్నదనిన. అగ్నిచే దహింపబడి, తన శరీరమంటను తొలగించుకొనగోరు తలంపుతో సముద్రముదరికేగి, అచ్చట సముద్రమున లేచెడి అలలను చూచి యింకనూ భయమును చెందినవాడై వ్యాకులపడిన రీతిగానున్నవి. ఈ జగత్తుకు కూడ సరిగా యిదే స్థితి సంభవించుచున్నది. అది మీ దర్శనముచే కేవలము మిను మిట్లు చెందుచున్నది.

అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి కే చిద్భీతాః ప్రాఞ్జల
యో గృణన్తి
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధ సఙ్ఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః
పుష్కలాభిః ॥౨౧॥

"అటు చూడుడు, యీ స్వరూపమునందే ఆ వైపున పెద్దపెద్ద దేవ తల గుంపులున్నవి. వీరు తమ అంగ - ప్రభావమువలన తమ కర్మబీజము

లను నాశమొనర్చుకొని, తమ సద్రూపమును పొందినవారలై తమ స్వరూపమున లీనమగుచున్నారు. ఇటు మరికొందరు, స్వాభావికముగ భయముగలవారై, సమస్తవిధముల మీ యెడ ప్రశ్రుత్తులై రెండుచేతులు జోడించి ప్రార్థించుచున్నారు. వారు - 'ఓ ప్రభో, మేము మాయాసాగరమున పడియున్నాము, విషయజాలమున చిక్కుకొనియున్నాము, మరియు స్వర్గము మరియు సంసారముల మధ్య విషమావస్థలో చిక్కుబడియున్నాము మీరు తప్ప మరెవరు మమ్ము సంకటమునుండి ఉద్ధరించగలరు ! కాన మేము శుద్ధహృదయముతో అన్నివిధముల మిమ్ము శరణు వేడుకొనుచున్నాము' అని ప్రార్థించుచున్నారు. ఈ విధమగు మాటలనే ఆ దేవతలు మీతో చెప్పుచున్నారు. ఇటు మహర్షులు, సిద్ధులు మరియు పెక్కు విద్యాధర సముదాయములు 'స్వస్తివచనములు' ఉచ్చరించుచూ మిమ్ము స్తుతించుచున్నారు.

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ
గన్ధర్వ యక్షాసుర సిద్ధ సంఘా వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥౨౨॥

"రుద్రులు మరియు ఆదిత్యసమూహము, అష్టవసువులు, ఒకరినొకరు మించి సాధ్యదేవులు, ఇద్దరు అశ్వినీకుమారులు, విశ్వేదేవులు మరియు వాయుదేవులు వీరందరు తమ వైభవసహితముగను మరియు పితృ, దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, ఇంద్రాది దేవతలు మరియు సిద్ధాదులుకూడ తమ తమ చోటులందుండి కుతూహలముతో మీ యీ దేదీప్యమానము, విశాలమునగు ఆకృతిని చూచుచున్నారు మరియు చూచుచూ చూచుచూ విస్మయపూర్ణ హృదయులై, ఓ ప్రభూ, తమ మస్తకములను మీ చరణములపైనుంచుచున్నారు. వారు తమ జయజయ ధ్వానములచే సప్తస్వర్గములను ప్రతిధ్వనింపజేయుచున్నారు. మరియు రెండు చేతులు జోడించి తమ మస్తకముపైనుంచుకొని మీకు నమస్కరించుచున్నారు. యీ వినయ వృత్తములు గల వనమున సాత్త్విక భావము లనెడి వసంతకాలము సుశోభితమగుచున్నది మరియు వారి యీ జోడింపబడిన హస్తములనెడి పల్లవములందు మీ రూపమనెడిఫలములు కమ్మంతగా వే ్రేలాడుచున్నవి.

రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో! బహు
బాహూరుపాదం
బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వాలోకాః
ప్రవ్యథితాస్తథాఽహం ॥23॥

"నేడు వీరి నేత్రభాగ్యము మేల్కొన్నది మరియు మనస్సునకు సుఖమనెడి సుసమయము వచ్చినది; ఏలనన వీరు నేడు మీ విశ్వరూపమును దర్శించిరి. త్రిలోకములందును వ్యాప్తమొనరించు మీ యీ రూపమును చూచి దేవతలుకూడ ఉలికిపడుచున్నారు; కాని, నేడా స్వరూపమును దర్శించు సౌభాగ్యమొక పామరునకు కూడ లభించినది. ఈ విధముగా గలది యీ రూపమొక్కటే, కాని నానావిధములగు భయంకర ముఖములు, అనేక నేత్రములు, శస్త్రములను ధరించియున్న అసంఖ్యాకములగు చేతులు, అసంఖ్యాకములగు తొడలు, పెక్కు బాహుదండములు మరియు చరణములు, అనేకములగు ఉదరములు మరియు పెక్కు వర్ణములతోనూ యీ స్వరూపమున్నది. ప్రతి ముఖము నందును ఆవేశమెటుల నిండియున్నది! విశ్వ పక్షయాంతమున సంతిప్తుడగు యముడు ప్రతిచోటను ప్రళయాగ్ని భట్టీలను అంటించెనా యన్నటుల, లేదా జగత్సంహారమొనర్చెడి రుద్రుని శస్త్రాస్త్రములా యన్నటుల, లేదా ప్రళయమును కలిగించెడి భైరవ సమూహములా యన్నటుల, లేదా భూతకోటిని పులగముగా వండెడి శక్తిగల పాత్రలా యన్నటులున్నవి. ఓ ప్రభూ, యిదేవిధమున మీ ప్రచండముఖములు నలువైపులను కనిపించుచున్నవి. పెద్దదగు సింహము గుహలో యుండగ, దాని కోప పూరిత స్వరూపము గుహబయట చాలదూరమువరకు కనిపించుచున్న రీతిని మీ ఉగ్రములగు దంతములు నోటిబయటకు వచ్చి కనిపించుచున్నవి. ఘోరాంధకారముతో నిండియున్న రాత్రిని ఆశ్రయముగా గొని ఘాతుకులగు పిశాచములు మిక్కుటమగు ఆనందముతో సంచరించుటకు బయల్వెడలు రీతిని ప్రళయ సంహార రక్తముచే తానిన మీ దంష్ట్రలు నోటినుండి బయటకు వచ్చుచున్నవి. ఇంతేగాదు, మీ ముఖమునందున్న భీకరత్వము, కాలుడు యుద్ధమునకు ఆహ్వానించెనా, లేదా ప్రళయము మృత్యువును పోషించినదా యన్నటులున్నది. ఇక యీ నిర్భాగ్యులు, దీనులు నగు భూత

సృష్టిపై మీ దృష్టి యించుకంత పడుచో, యమునానది ఒడ్డున కాళీయుని విషముచే పీడింపబడిన వృక్షములేరీతిని కనిపించునో, అదేరీతిని యీ భూత సృష్టి దుఃఖపీడితమై కనిపించుచున్నది. మీరు మహామృత్యుసాగరులుమరియు అందు యీ త్రిభువన జీవన నౌక శోకమనెడి మేఘములచే ముట్టడింపబడి, తుపానునపడి యిటునటు ఊగులాడుచున్నదా యన్నటుల కనిపించుచున్నది. ఓ మహారాజా, మీ రిందుపై "నీవు వీరినిగురించి యింతగా చింతించనేల? సంతసముతో విశ్వరూపదర్శన సుఖము ననుభవించుము" అందురేని, అందుకు నేను బదులుగా నివేదించునది దిదియే—నేను వీరి కథలనెడి డాలును వ్యర్థము గనే మధ్య తెచ్చితిని. యిటుల నేను తెచ్చుటకు గల కారణము, భయ మూలమున నా ప్రాణములుకూడ గజగజ వణకుచున్నవి. నన్ను చూచి సృష్టి సంహారకు డగు రుద్రుడుకూడ భయపడును, యముడుకూడ నాకు భయపడి దాగుకొనును – అయినప్పటికిని యిట్టి ప్రతిభాశాలి నగు నేనే యీ సమయమున గజగజవణకుచున్నాను. నన్నిట్టి స్థితిలో మీ రిప్పుడుంచిరి. కాని, దయాళుడవగు ఓ ప్రభూ, అన్నిటిని మించిన విచిత్రవిషయమేమన – దీని పేరు విశ్వరూపమేయగుగాక, కాని యిది వాస్తవమునకు ఒక మహామారియే. ఇది తన భయంకరత్వముచే స్వయముగ భయమునుకూడ ఓడిపోవునట్లొనర్చినది.

నభస్పృశం దీప్తమనేక వర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్
దృష్ట్వాహి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం న విన్దామి
శమంచ విష్ణో ॥ ౨౪॥

"భీకరత్వమున మహాకాలునికంటె మిక్కుటముగా గల మీ ఆనేక రసపూర్ణములగు ముఖములున్నవి. దీని వ్యాపకత్వము ముందు ఆకాశము కూడ అల్పమైనదిగనే కనిపించుచున్నది. వీటినుంచి మండుచూ వచ్చుచున్న అవిరిని ఆకాశమునందలి వ్యాపకత్వముకూడ యిముడ్చుకొనజాలకున్నది. మరియు త్రిభువనములందునుగల పవనులుకూడ ముట్టడించలేకుండా మరియు అడ్డగించలేకుండా వున్నారు; మరియు యీ ఆవిరి అగ్నినికూడ కాల్చివేయు చున్నది. కాని, అన్ని ముఖములూ ఒకే విధముగ లేవు, వానియందు వర్ణభేద ములున్నవి. ప్రళయ కాలమందలి అగ్ని విశ్వసంహార మొనర్చుటకై వీటి సహాయమునే గైకొనునా యన్నటుల యునికియున్నవి. ఈ స్వరూపమునకు

గల అధికమగు శరీరతేజస్సునందు త్రిభువనములు తగులబడి భస్మము కా
గలవు, మరియు ఆ శరీరమునకు గల పెక్కు ముఖములందు కూడ యీ విధ
మగు విశాలము దృఢమూనగు దంతములూ, దంష్ట్రిలూ గలవు. వాయువు
కూడ ధనుర్వాతము కలిగినటుల లేదా సముద్రముకూడ ఏదో గొప్పదగు
వరదలోపడి కొట్టుకొనిపోవుచున్నదన్నటుల లేదా వడబానలము వెంట
నిడికొని విషాగ్ని యే సంహారమొనర్చుటకు సంసిద్ధమై యున్నదన్నటుల, లేదా
హాలాహలవిషము అగ్నిని భక్షించుచున్నదన్నటుల, లేదా అన్నింటిని
మించిన ఆశ్చర్యకరమగు రూపమునందు మృత్యువునకు వరొక మృత్యుసహా
యము లభించినదన్నటుల—యీ సర్వసంహారక తేజస్సునందే రీతిని యీ
ముఖములున్నటుల తోచుచున్నది. ఇక యీ ముఖములెంత పెద్దవియను
విషయమును గురించి నే నేమని చెప్పను! ఇది అంతరాళము బద్దలై ఆకా
శమును నలువైపుల ముట్టడించినదా యన్నటుల, లేదా భూమిని చంకయం
దిడుకొని హిరణ్యాక్షుడు బిలమున దూరినటుల లేక పాతాళమునందలి మహా
దేవుడు పాతాళగుహను తెరచెనా యన్నటుల యున్నవి. సరిగా యిదేవిధ
మున యీ ముఖ వైశాల్యముకూడ నున్నది. ఇట్టి ముఖములందు గల నాలు
కల భీకరత్వము యింకనూ విలక్షణమైనది. ఈ మూర్తి యీవిశ్వమంతయూ
కబళించినను తనకొక ముద్దగా కూడా కాదని తలంచి, అందుచే కుతూహల
ముతో దీనిని మ్రింగివేయ కున్నాడా యన్నటులున్నది. పాతాళమున గల
నాగుల ఫుంకారమువలన వెలువడెడి విషజ్వాల ఆకాశమువరకు పోవురీతిని
యీ విశాలమగు ముఖగుహను పోలియున్న దవుడయందు దీ నాలుక కనిపించు
చున్నది. ప్రళయసమయపు విద్యుత్ జాలమున గంధర్వనగరమునందలి మేఘ
సమూహములు అలంకరింపబడి నటుల కనిపించుచుండిన యీ పెదవులపైన
మెరయుచున్న యీ వక్ర దంష్ట్రిలు కనిపించుచున్నవి. మరియు ఈ లలాట
పటముపైన గల కనులు భయమును కూడ భయపెట్టి అణచివేయుచున్నవా
యన్నటుల యున్నవి. మహామృత్యుదళము ఘోరమగు అంధకారమున దాగి
కూర్చొనియున్నదా యన్నటుల తోచుచున్నది. ఓ దేవా, మీరిట్టి భయంకర
రూపమును ధరించి ఏ మహత్తర కార్యము నొనర్పదలచితిరి! నాకు మరేమి
యూ బోధపడుటలేదు, నాకు మరణభీతి అవశ్యము కలుగుచున్నది. ఓ
దేవా, మీ విశ్వరూపమును దర్శించవలెనని నాకు కలిగిన వాంఛకు తగిన

ఫలము లభించినది. ఓ మహారాజా, మీ దర్శనము నాకు లభించినది మరియు నా నేత్రములు తృప్తిఁబొందినవి. ఇక నా యీ జడశరీరము లేకున్నప్పటికిని నాకే విధమగు విశేషనష్టము లేదు; కాని నాకిప్పుడు కలుగుచున్న విచారమేమన, నా యీ చైతన్యముకూడ మిగులునా, మిగులదా యనియే. భయముచే కేవలము శరీరము కంపించుటేగాదు, లేక క్షణకాలమువరకు మనస్సు కూడ అత్యధికముగ సంతప్తమగుననీ కాదు, లేదా బుద్ధి కొంతసేపటివరకు భయమును పొందుననీ కాదు, లేదా అభిమానముకూడ ఎక్కువగుననీకాదు, కాని వీటిఅన్నిటికంటె భిన్నమగు ఆనందమూర్తియగు నా నిశ్చలాంతరాత్మ కూడ నేడు కంపించినది. ఈ సాక్షాత్కారము నందెంత చమత్కారము గలదు! నా బోధయంతయు నేడు పోవుచున్నది. ఇట్టి స్థితిలో గురు-శిష్య సంబంధము మాత్రము నిలచియుండగలదని ఎవరెటుల చెప్పగలరు! ఓ దేవా, మీ విశ్వరూప సందర్శనముచే నా చిత్తమునం దుదయించిన దౌర్బల్యమును సంభాళించుటకై నేను కప్పదలచిన ధైర్యమనెడి ఆవరణ కూడ నేడు నశించిపోయినది; ఏలనన, ఆ ధైర్యమునకు కూడ యీ విశ్వరూప సందర్శన భాగ్యము లభించినది. ఏమైనకానిమ్ము, అయినప్పటికిని, నాకు ఒక చక్కని ఉపదేశము మాత్రము లభించినది. జీవుడు విక్రమించు తలంపుతో యిటునటు అనేకవిధముల భ్రమపడి తిరుగుచుండును, కాని ఆ దురదృష్టుడు యిచ్చటకు వచ్చినమీదట దీని అంతు తెలిసికొన లేడనెడి — ఉపదేశము నాకు లభించినది ఓ దేవా, నే నీ సంగతులన్నిటిని చెప్పనిచో నే నెటుల శాంతము గలవాడనై యుండగలను?

దంష్ట్రాకరాళానిచ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని
దిశో న జానే నలభేచ శర్మప్రసీద దేవేశ! జగన్నివాస ॥౨౫॥

"మహాభయంకరమగు కుండ పగిలి నిరంతరము కనులఎదుట కనిపించుచుండురీతిని మీ యీ మహావికటమూ ప్రచండమూ నగు ముఖము నా ముందు వ్యాపించియున్నటుల నాకు కనిపించుచున్నది. కేవల మింతియేగాదు వాటియందు దంతములు మరియు దంష్ట్రిలు విలక్షణముగ కూడియుండుట చేతను మరియు పెదవులచాటున అవి యిమిడి యుండజాలకపోవుట చేతనూ, రెండు పెదవులపైనను అనేకములగు ప్రళయమును కలిగించెడి శస్త్రవృష్టి

దేర్పడియున్నదా యన్నట్లుల యున్నది. తక్షకునకు నూతనముగ విషము లభించినట్లుల, లేదా చీకటిగాగల కాళరాత్రిలో భూతములు సంచరించుచున్నట్లుల, లేదా ఆగ్నేయాస్త్రముపై విస్ఫోటము తొడగినట్లుల మీ యీ భయంకర ముఖమునందు నిండియున్న ఆవేశము బయల్వెడలుచున్నది; మరియు యీ ఆవేశరూపమున మా పైకి మృత్యుతరంగము వచ్చుచున్నదా యన్నట్లుల యున్నది. విశ్వసంహారమొనర్చెడి ప్రచండవాయువు, మహా కల్పాంతమొనర్చెడి ప్రళయాగ్ని - యీ రెండును కలిసినప్పుడు యీ కంటి సమ్మేళనమువలనను భస్మముకాని వస్తువేదిగలదు! ఇదేవిధమున మీ యీ భయంకరవదనమును చూచి నా ధైర్యము నన్నువిడచి ఏలపోకుండును? నాకీ సమయమున దిక్కులు కనుపించుటలేదు మరియు నాకు నేనే కనిపించనంత భ్రాంతి నొందియున్నాను. మీ విశ్వరూపమునందే కొద్దిభాగమునూ చూచినంత మాత్రముననే నా సమస్తసుఖములు అంతమొందినవి, ఓ దేవా, మీ యీ అపారమగు విశ్వరూపమును ఉపసంహరింపుడు. ఓ దేవా, మీరు నా అనంత స్వరూపులగు గురువులగుచో, నా ప్రాణరక్షణార్థమై మీ డాలును ముందుకుజాపి, యీ మహామారియగు విశ్వాకారక 'ప్రసారమును' ఉపసంహరించి, దీనిని పూర్వమువలె గుప్తపరచుడు. ఓ ప్రభో, ఓ దేవదేవా, మీరు నా మాటలయెడ ధ్యానముంచుడు. ఈ విశ్వమును జీవింపజేసెడి చైతన్యము మీరే. కాని, మీరు నేడీ విషయమును మరచి అందుకుమారు సంహారమొనర్చుటను ప్రారంభించినారు. ఇదేమిటి? ఓ దేవా, మీరు కాంతులు, కృపాళురు. మీరు మీ యీ మాయను అంతమొందింపుడు మరియు నన్ను ప్రచండమగు భయమునుండి ముక్తునొనర్చుడు. నేనింతసేపటివరకు మాటిమాటికి మిమ్ము చాల దీనముగా ప్రార్థించుచున్నాను. ఓ విశ్వరూపుడవగు దేవా, నేను నేనింత పిరికివాడనైతిని. ఇంతకు పూర్వము ఇంద్రుని రాజధానిపై శత్రువులు దండెత్తిరాగా నేనొంటరిగా వారినెదుర్కొంటిని. మరియు ప్రత్యక్షముగ మృత్యుముఖమును చూచినప్పటికి కూడ నాకు నేటి వరకు భయము కలుగలేదు, కాని, ఓ దేవా, నేటి యీ సంఘటన సామాన్యమైనది కాదు. ఈ సమయమున మీరు కాలునికూడ పరాజితునొనర్చి సమస్త విశ్వముతోపాటు నన్నుకూడా పానమొనర్ప గోరుచున్నారు. వాస్తవముగ చూచినచో యిదేవిధమగు ప్రళయకాలమూ కాదు. కాని, మధ్యలోనే ఏల

బ్రాహ్మణుడగు ద్రోణాచార్యుని కూడ మీరు భక్షించుచున్నారు. సూర్య పుత్రుడు, వీరశ్రేష్ఠుడగు కర్ణుడు కూడ యిందున్నాడు. మరియు నా పక్షమున గల ముఖ్యులగు వీరులను చెత్తా-చెదారమువలె మీరు ఊడిచిపెట్టుకొనుచు పోవుచున్నటుల కనిపించుచున్నది. ఓ పరమేశ్వరా, మీ కృపా ప్రసాదమునకు బదులుగా విరుద్ధమగు యీ పరిణామము కలుగుచున్నది. నేను మిమ్ము ప్రార్థన చేసి యీ మహద్భుతమగు ఈ జగత్తునకే సంకటమును కలిగించితిని. మొదట దేవతలు మీ దివ్య విభూతిని గురించి కొంతవరకు వర్ణించి దానిని స్పష్టమొనర్చిరి. కాని, దానితో నా తృష్ణ తీరుటలేదు. నేను మీ విభూతులనుగురించి యింకనూ తెలిసికొనగోరితిని. ఇందుచే సుకృతప్రాపిత దానిని తప్పించుకొన నలవికాదనుటను అంగీకరించవలసి వచ్చుచున్నది. మరియు, ఏది జరుగనున్నదో. దాని ననుసరించియే బుద్ధికూడ వుండునను మాట సత్యమే. పూర్వకాలమున అమృతము లభించినంతమాత్రమున దేవతలకు సంతోషము కలుగలేదు, ఇందుచే అంతమున కాలకూటవిషము ఉద్భవించినది - కాని, ఒక విధముగ చూచినచో కాలకూటవిషముకూడ స్వల్పమైనదిగనే తలంచవలెను, ఏలనన, దానికి ప్రతీకారము గలదు మరియు ఆ సమయమున శ్రీశంకరుడు ఏదోవిధమున ప్రజలను ఆ సంకటమునుండి కాపాడెను - కాని, యిప్పుడీ మండుచున్న వాయువు నెవడడ్డగించగలడు? ఈ విషముతో నిండియున్న గగనము నెవడిప్పుడు భక్షించగలడు? మహాకాలునితో పోరాడుశక్తి ఎవనికి గలదు?” ఈ విధమున దుఃఖపూరితుడై అర్జునుడు తన అంతఃకరణమున శోకించుచుండెను, కాని. శ్రీకృష్ణుని అభిప్రాయమాతనికి బొత్తుగా విదితముకాలేదు. అర్జునుడింకవరకు - నేను చంపువాడను, యీ కౌరవులందరు చచ్చువారు— అని చెప్పుచూ ప్రబలమగు మోహపాశమున పడియున్నాడు; అందుచే ఆతని ఆమోహమును పోగొట్టుట కొరకే ఆ అనంతదేవుడు తన యీ గుప్తరహస్యము నాతనికి వెలువరించెను. శ్రీకృష్ణుడా సమయమున విశ్వరూపమనెడి నెపముతో అర్జునునకు ‘ఎవడూ ఎవనినీ చంపడు’, ‘నేనే అందరిని సంహరింతును’ అనెడి ‘తత్త్వమును బోధించెను. కాని అర్జునున కింకవరకును తన యీ దుఃఖము నిష్కారణమైనదని తెలియలేదు; అందువలననే ఆతని ఆ నిష్కారణము మరియు నిరర్థకమూ నగు కంపముకూడ ఎడతెగక వృద్ధికాసాగెను.

వక్త్రాణితే త్వర మాణావిశన్తి దంష్ట్రాకరాళానిభయానకాని
కేచిద్విలగ్నాదశనాన్తరేషు సందృశ్యన్తేచూర్ణితైరుత్తమాఙ్గైః,

అర్జునుడు చెప్పసాగెను—"అటుచూడుడు. ఆకాశమున మేఘములు నిండియుండురీతిని యిరుపక్షములందలి సేనలు ఖడ్గములు - కవచములు గలిగి యున్నవారై మీముఖమున నిండియున్నారు. విశ్వప్రళయాంతమందు సృష్టిపై కాలుడు కోపించి ఇరువదియొక్క స్వర్గములను పాతాళముతోపాటు చుట్టు చుట్టి మింగివేయురీతిని, లేదా దైవమునకు ప్రతికూలమగుటచే ప్రతి పైసను మూటగట్టిడినవాని సంపద యంతయూ ఎచ్చటిదచ్చట దానంతట అదే నశించు రీతిని, అస్త్రశస్త్రములతో అలంకరింపబడియున్న యీ రెండుసేనలును ఒకటిగానై మీముఖమునం గిమిడియున్నవి, కాని, దైవగతి ననుసరించి అందే ఒక్కటికూడ యీ ముఖమునుంచి తప్పించుకొని బయటకు రాకున్నది. ఒంటె నమలుట కోమలమగు అశోకాంకురములు పూర్తిగా వ్యర్థమైపోవురీతిని వీరుకూడ మీ నోటపడి నాశనమగుచున్నారు. దంతములనెడి కత్తెరలో పడి కిరీటసహితముగ అందరి శిరములు చూర్ణమైపోవుచూ కనిపించుచున్నవి! ఆ కిరీటములందలి రత్నములలో కొన్ని మీ దంతములం దిరుక్కొనినవి, మరి కొన్ని చూర్ణమై ర్ణముగానై తాలుమూలమునందు వ్యాపించియున్నవి మరియు కొన్ని దంష్ట్రిల ముందుభాగమును అనుకొనియున్నవి. ఇదంతయూ చూచుటచే, విశ్వరూపుడగు కాలుడు ప్రజాశరీరములను బలాత్కారముగ కబళించుచున్నటులను, జీవ - దేహములయొక్క మస్తకమును మాత్రము మిగిల్చియుంచినటులను కనిపించుచున్నది. శరీరమున కంతకును మస్తకములు ఉత్తమమైనవి యగుటచే అవి మహాకాలుని ముఖమునపడియుండికూడ అంతమువరకు మిగిలియున్నవని తోచుచున్నది", అటుపిమ్మట అర్జునుడు మరల యిటులచెప్ప నారంభించెను—"జన్మించినవానికి యిది తప్ప మరొకమార్గమేలేదు. ఈ జగత్తు స్వయముగనే యీ గంభీరముఖమున ప్రవేశించుచున్నది. ఇది సరియగునా కాదా? సృష్టింపబడిన అన్ని వస్తువులు తమంతతామే యీ ముఖ మార్గమున పోవుచున్నవి మరియు యీ విశ్వరూపుడగు మహాకాలుడు నిశ్శబ్దముగ తన స్థానమం దున్నాడు; ఇవన్నియు తన దగ్గరకు వచ్చినప్పుడు అతడు వాటిని స్వస్థభావమున భక్షించుచున్నాడు. బ్రహ్మాదులందరు పైనగల

ఉన్నతమైన ముఖమున ప్రవేశించుచున్నారు మరియు యీ సామాన్యభాగత వీరులు యిటుగల చిన్న ముఖమునందు ప్రవేశించుచున్నారు. మరికొన్ని భూపములు పుట్టినచోటునందే భక్షింపబడుచున్నవి, కాని దీనినుండి తప్పించుకొని పోయినవాడొక్కడును కనిపించుటలేదు.

యథానదీనాం బహవోఽమ్బువేగా స్సముద్రమేవాభి
ముఖాద్రవన్తి
తథాతవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభివిజ్వలన్తి ॥౨౮

“పెద్దపెద్ద నదీప్రవాహములు అతిశీఘ్రముగ పోవుచూ సముద్రమున కలిసిపోవుచున్న రీతిని అన్ని దిక్కులనుంచి వచ్చి యీ జగత్తు యీ ముఖమున ప్రవేశించుచున్నది, ఈ ప్రాణులెల్లరు ఆయుష్యమార్గమున రాత్రింబవళ్ళనెడి మెట్లను కట్టుకొని అతివేగముగా యీ ముఖమున ప్రవేశించుటకై సాధన మొనర్చుచున్నారు.

యథాప్రదీప్తజ్వలనం పతంగా విశన్తి నాశాయ సమృద్ధవేగాః
తథైవ నాశాయ విశన్తి లోకాస్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥

“మండుచున్న పర్వత గుహలందు మిడుతలు సమూహములు సమూహములుగా వచ్చి తమంత తాము పడు రీతిని, వీరందరుకూడ గంతులు వేసికొనుచు వచ్చి యీముఖమునందు పడుచున్నారు. కాని. తప్తమొనర్చబడిన లోహము నీటిని పీల్చివేయు రీతిని, యీముఖమున పడినవారందరు భస్మమగుచున్నారు. వారందరు వ్యవహార క్షేత్రమున ఊరు – పేరు లేకుండా నాశన మొందుచున్నారు.

లేలిహ్యసే గ్రసమానస్సమన్తాల్లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః
తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో॥

“కాని యింత అధికముగ భుజించినప్పటికికూడ యీతని ఆకలి ఏమాత్రము తగ్గకపోగా ఆతని యందొక విచిత్రమగు తీవ్రత యేర్పడుచున్నది. రోగి జ్వర విముక్తుడైన పిమ్మటను, లేదా బిచ్చగాడు కరువువచ్చుట వలనను తన పెదవులను నాకుకొను రీతిని, యీతని నాలుకకూడా పెదవులను నాకు

చున్నటుల కనిపించుచున్నది. మరియు యీనోటిని గురించిన మరొక సంగతి కలదు. ఈనోటికి తినరానిది వస్తువను నదేదియూ కనిపించుటలేదు - నోటి ముందుకువచ్చిన ప్రతి వస్తువును తినివేయుచున్నది. ఈ ఆకలికూడ మనుష్యుని ఆశ్చర్యపడునటుల నొనర్చునట్టిదిన్ని, అతి విలక్షణమైనదిన్ని అయియున్నది. ఓ ప్రభూ, ఈస్వరూపమును చూడగా మీకుగల స్వాభావికమగు ఆకలి ప్రతి క్షణము 'ఈ సముద్రమును ఒక్క గుక్కలో త్రాగివేయుదమా, లేక యీ పర్వతమును ఒక ముద్దగా మ్రింగివేయుదమా, లేక బ్రహ్మాండమునంతను ఒక్క మారుగా మీ దంష్ట్రిలక్రింద పెట్టుకొందమా, లేక యీ దశదిశలను కబళింతమా, లేక యీ నక్షత్రములను నాకివేయుదమా—అని తలంచుచున్నటుల కనిపించుచున్నది. విషయసేవనమువలన కామవికారము యింకనూ వృద్ధిపొందుచునే వుండురీతిని, లేదా కట్టెలవేయుటచే అగ్ని యింకనూ ప్రజ్వరిల్లునటుల, ఎడతెగని ఆకలిచే ఎప్పుడూ భక్షించుచు ఉండి యీ నోటికిగల ఆకలి కూడా నానాటికి వృద్ధిపొందుచునే వున్నటుల కనిపించుచున్నది. ఇందుగల ఒకేముఖమును చూడుడు, అదెటుల తెరచుకొని యున్నదో! ఈ ముఖమున గల నాలుకపై పడియున్న త్రిభువనములు బడబాగ్నిలోపడిన కపిత్థము(వెలగ) వలె కనిపించుచున్నది. ఈ స్వరూపమునందీ విధమగు అసంఖ్యాక ముఖములు గలవు; మరియు వీటి అన్నింటికిని సరిపోవునంతటి ఆహారములభించుట సంభవము కాకున్నప్పటికిన్ని వీటిసంఖ్య యింత అధికముగ ఏల వృద్ధిపొంది యున్నదో తెలియరాకున్నది. ఓ ప్రభో, దురదృష్టురాలగు యీ జీవ-లోకము యీ ముఖజ్వాలలో దావాగ్నిలో లేడి చిక్కుబడిన రీతిని చిక్కుబడి యున్నది. ఇప్పుడీ విశ్వమిట్టి స్థితిని పొందుచున్నది. వీరు దేవుళ్లుకారు కర్మ భోగులని తెలియుచున్నది. లేదా, యీ జగత్తనెడి మత్స్యములను కాలమనెడి వలలో చిక్కించుకొని నటుల తోచుచున్నది. ఇక యీ విశ్వరూపాంగ తేజో పాశమునుండి యీ చరాచరములకెటుల విముక్తి లభించును! ఇవి విశ్వరూపమునకు ముఖములుగావు, జగత్తునకై మండుచున్న లక్కయిళ్లే! అగ్నిలోపడి ఎటుల భస్మమగుదురో, దానివలన ఎంత కష్టము కలుగునో - యీ సంగతులు అగ్నికెన్నడును తెలియవు కాని దాని తీవ్రతాపము తగిలినవాడు మాత్రము తప్పక ప్రాణములు విడువవలసి వచ్చును. ఇంతకు మించి ఆకలికి మరొకవిధమగు విముక్తి ఏదియూ కలుగనేరదు, లేదా, శస్త్రములవలె తన

తీవ్రతవలన యితరునికి మృత్యువే రీతిని సంభవించునో తెలియనటుల, నేడా విషయము తన మారక గుణము నెరుగని రీతిని ఓ ప్రభో, నాకు మీ భయంకర రూపమునుగురించి ఏమాత్రము తెలియరాదు. కాని, యీ ముఖములవలన జగత్తంతయు ఒక అఘాతమువలె నైపోయినది. ఓ దేవా, మీరు విశ్వమునందంతటను వ్యాపించియుండు ఆత్మస్వరూపులే అయినచో, నేడు మీరేల మాపై కాలునివలె ఘాతుకత్వమును వహించి విరుచుకుపడు చున్నారు! ఇట్టి వికట ప్రసంగము వచ్చుటచే, నే నిప్పుడు నా ప్రాణములపై మోహమును విడచితిని మరియు, యిక మీరుకూడ ఏ విధముగను సంకోచించక మీ మనమునందుగల విషయముల నన్నిటిని స్పష్టముగ చెప్పివేయుడు. ఈ భయంకర రూపము మరి యింకెంతగా వృద్ధిపొందును? ఓ మహారాజా, జగత్పాలన మొనర్చెదనన్న మీ ప్రతిన మీరు గుర్తుకు తెచ్చుకొనుడు; లేకున్నచో కనీసము నన్నైన అనుగ్రహించుడు.

ఆఖ్యాహి మేకో భవానుగ్రరూపో నమోస్తుతే దేవవరప్రసీద
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యంనహిప్రజానామితవప్రవృత్తిమ్॥

“వేదములకు మాత్రమే తెలిసికొనదగిన వారవు, త్రిభువనములకు మూలబీజము మరియు సమస్త విశ్వమునకు వందనీయుడవును అగు శ్రీప్రభూ, ఒకపరి నా విన్నపము నాలించుము” అని చెప్పి వీరుడగు పార్థుడు శ్రీకృష్ణుని చరణములపై తన మస్తకమునుంచి యిటుల చెప్పనారంభించెను—“ఓ సర్వేశ్వర ప్రభో, మీ రిటు ధ్యానముంచుడు, నన్ను నేను తృప్తిపరచుకొను తలంపుతో విశ్వరూపదర్శనమును కలిగించవలసినదిగా మిమ్ము ప్రార్థించితిని; అంతటితో మీ రౌద్రాకారముగా త్రిభువనములను భక్షింపసాగిరి. ఇట్టి స్థితిలో మీ తలపు తెలిసికొనగోరుచున్నాను. మీ యీ అసంఖ్యాకములగు భయంకరముఖముల నేల గైకొనిరి? మీరు మీ ఈ చేతులన్నింటను ఈ ఆయుధముల నన్నింటి నేల ధరించియున్నారు? మీరు వృద్ధియగుచు వృద్ధియగుచు చివరకు ఆకాశముకూడ మీ ముందు పొట్టిదిగ కనిపించునంత పెద్దవారైరి. మీ రీ భయంకర నేత్రములను విప్పి నన్నేల భయపెట్టుచున్నారు? ఓ ప్రభో, మీ రీ సమయమున సర్వభక్షకుడగు యమునితో ఏల పోటీ పడసాగిరి? మీ రీ కృత్యమొనర్చుటకు గల హేతువేమో స్పష్టీకరించి చెప్పగోరెదను”.

అందుపై అనంతస్వరూపు డగు శ్రీ కృష్ణుడు డిటుల చెప్పెను—"నే నెవ రినో, ఈ విధమగు ఉగ్రరూపమును ధరించి నేనేల యింతగా పెరుగు చున్నానో తెలిసికొనగోరెదవా?

శ్రీ భగవానువాచ—

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తు
మిహ ప్రవృత్తః
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్య
నీకేషు యోధాః ॥3౨॥

"మంచిది, వినుము: నేను నిజముగా కాలుడనే. మరియు ప్రజా నాశనముకొరకే నే నిటుల పెరుగుచున్నాను. ఇటు చూడుము, నా అసంఖ్యాకములగు నోళ్ళు తెరువబడియున్నవి, మరియు యిప్పు డీ సమస్తచరాచరములను నేను భక్షింతును". ఈ మాటను విని అర్జునుడు తనలో ననుకొనెను—"అయ్యయ్యో! నేను యింతకుముందే భయపడి, యీ ప్రార్థన చేసితిని. అందుపై నీతడు, మొదటచూపిన ఉగ్రత్వము చాల స్వల్పమన్నటుల యింకను భయంకరమగు ఉగ్రత్వమును చూపుచున్నాడు". అట శ్రీ కృష్ణుడు కూడ తన మనమునం దిటుల యోచించెను— "నేను కఠోరమగు జవాబునిచ్చితిని; దీనివలన అర్జును డింకనూ నిరాశనుపొంది దుఃఖించును"; అని యోచించి వెంటనే ఆతడిటుల చెప్పసాగెను—"కాని ఓ అర్జునా, ఈ కృత్యములన్నింటను ఒక విలక్షణతగలదు. ఈ సమయమున జరుగనున్న ప్రళయమునకు పాండవులగు మీ రావలనుందురు", ఈ మాట వినుటచే అర్జునునకు కొంచెము ధైర్యముకలిగెను మరియు పోనున్న ప్రాణముల నేదోవిధమున సంబాళించుకొని ఆపుకొనెను. ఆత డా సమయమున మృత్యుముఖమున పడియుండెను; కాని యిప్పుడాతడు స్పృహ తెచ్చుకొనినవాడై శ్రీకృష్ణుని మాటలయెడ చక్కగాయోచించసాగెను. ఆ సమయమున దేవు డిటుల చెప్ప నారంభించెను—"ఓ అర్జునా, పాండవులగు మీరు నావారు. నీ వీ విషయము నెల్లప్పుడు మనసునం దుంచుకొనుము, మిమ్ము విడచి మిగిలిన వారినందరను భక్షించుటకిప్పుడు నేను సిద్ధపడియున్నాను. బడబాగ్నిలో

వెన్నముద్దను పడవేసిన చందమున యీ జగత్తంతయు నానోటపడియున్నది. ఇంతే మాత్రము మిథ్యలేదు. ఈ సేనలన్నియు మిక్కుటమగు అభిమానముతో నిలచియున్నది. కాని యిదంతయూ నిష్ఫలమే. ఈ చతురంగసేనల యొక్క అభిమానము మహాకాలునితో పోటీచేయుచున్నదా యన్నటుల యున్నది. చూడుము, వీటికి తమ అవయవబలమును గురించిన మదమెంతగా గలదో! వారిటుల చెప్పుకొనుచున్నారు—"మనము మరొకసృష్టిని నిర్మించ గలము. ప్రతిన చేసి మృత్యువును కూడ చంపివేయగలము. ఈ జగత్తునంతను ఒక గుక్కలో మ్రింగివేయగలము, ఈ పృథివినంతను తినివేయగలము. ఆకాశమును పైనున్నదానిని పైనవుండగనే భస్మమొనర్చగలము. మరియూ మనబాణ బలముచే వాయువునుకూడ ఒకే ప్రదేశమున ఆపివైచి జర్జరునిగా వొనర్చి వేసెదము". ఈ సేనాసమూహములు ఏకత్రితమై తా మొనర్చిన వీరకృత్యములను గురించి మిక్కుటముగ గర్వించుచున్నవి, మరియు వీరులు తమసైన్యములను ప్రశంసించుచూ వానిని యమునికంటె మించిన భయంకరులుగా చెప్పుచున్నారు. వీరిమాటలు ఆయుధములకంటె కూడ తీక్ష్ణముగనున్నవి, వీరి ఊనికి అగ్నికంటెకూడ ఎక్కువ దహనకారిగానున్నది, మరియు వీరి ఘాతుకత్వము ముందు కాలకూటవిషముకూడ మధురముగనే తోచుచున్నది. కాని, యివన్నియు ఆకాశమునకనిపించు మేఘనిర్మిత గంధర్వనగరమువంటివే. ఈ వీరులు వాస్తవమునకు చిత్రపటమున చిత్రింపబడిన ఫలములవంటివారు. ఓ అర్జునా, ఇది కేవలము మృగజలసమూహము. ఇది సైన్యమే కాదు, గుడ్డతో చేసిన పాము, లేదా అలంకరించిన గుడ్డబొమ్మలు.

తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ
రాజ్యం సమృద్ధం
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ
సవ్యసాచిన్॥ 33

"వాస్తవమునకు చైతన్యశక్తిగల సేవలనన్నిటిని నే నింతకు ముందే భక్షించివేసితిని. ఇక యిక్కడ జీవించియున్నటుల నీకు కనిపించు వీరులెల్లరు కేవలము కుమ్మరివాడు సృష్టించిన నిర్జీవప్రతిమలే. కొయ్యబొమ్మలను నిలిపి

యుంచి, వాటిని ఉపయోగములోనికి తెచ్చి వాటిచే హావభావముల నొనర్చు పట్టి తీగ తెగిపోగానే, ఆ కొయ్యబొమ్మలు తమంత తామే తన్నుటచే విరుచుకుపడురీతిని విరుగబడిపోవును. మరియు ఆబొమ్మలు పడిపోయి తారు మారగును. అదేరీతిని, యీ సేనలన్నియు విరచుకుపడిపోవుట కే మాత్రము ఆలస్యములేదు. కాన ఓ అర్జునా, నీ విప్పుడు త్వరగా లేచి, కొద్దిగా తెలివి తేటలు చూపుము. నీవు గోగ్రహణసమయమున కౌరవ సేన అంతటిపైనను ఒక్కమారుగా మోహనాస్త్రమును ప్రయోగించియుంటివి మరియు ఆ సేన లన్నియు మూర్ఛపొందియున్న సమయమున నీవు పిరికివాడగు విరాటపుత్రుడగు ఉత్తర కుమారునిచే ఆ శత్రువులందరి వస్త్రములను విప్పించి వారిని దిగంబరులుగా నొనర్పించితివి. కాని, యీ సమయమున నీవు చేయవలసినపని ఆ తకంటెను సూక్ష్మమైనది. ఈ రణక్షేత్రమున గల సేనలన్నియును యింతకుపూర్వమే మరణించియున్నవి. ఇంతకుపూర్వమే చచ్చియున్న యీ సేనలను నీ విప్పుడు బయటకు చూచుటకు మాత్రము సంహరించుము మరియు అర్జునుడొక్కడే శత్రువులనందరను చంపి విజయముపొందెననెడి కీర్తిని సంపాదించుము. మరియు, నీ కిందువల్ల కేవలము పట్టి కీర్తిలభించుటయే గాదు, దీనితోపాటు సమస్త రాజ్యలక్ష్మికూడ నీ చే జిక్కును. కాన యీకార్యము అన్నింటను, ఓ అర్జునా, నీవు కేవలము నిమిత్తమాత్రుడవు మాత్రమే కావలసి యున్నది.

ద్రోణఞ్చ భీష్మఞ్చ జయద్రథఞ్చ కర్ణం తథాఽన్యానపి
యోధవీరాన్
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠాయుధ్యస్వ జేతాసి
రణే సపత్నాన్ ॥34॥

“నీవు ద్రోణుని లక్ష్యపెట్టనక్కరలేదు, భీష్మునకు భయపడవలదు మరియు యీ కర్ణునిపై నే పెట్టి ఆయుధములను ప్రయోగించను – అనెడి సంశయముకూడ పొందవలదు. ఈ జయద్రథుని ముందు నేనేమిచేయనని చింతించవలదు. వీరుగాక యింకనుగలగొప్పగొప్పవీరులనందరను నీవు కేవలము చిత్రపటమున చిత్రింపబడిన ప్రచండ సింహములవలెనే తలంచుము. చిత్ర

పటమున చిత్రింపబడిన సింహసమూహములు చేతితో తుడిచివైచినంతమాత్ర
మున ఏ విధముగ నశించిపోవునో, ఆరీతిని యీ శత్రుసమూహములను
కూడ సంహరింపుము. ఓ అర్జునా, నీ కింతగా చెప్పినప్పటికికూడ రణక్షేత్ర
మున సమకూడియున్న యీ సైనికులలో ఏ విశేషము మహత్త్వమైన గలదని
నీ వింకను భావింతువో, అదియంతయు కేవలము భ్రమగా నెరుగుము. ఈ
వీరులు నా నోటబడుటను నీ వెప్పుడు చూచితివో అప్పుడే వీరి ఆయువు
ముగిసిపోయినది. ఇప్పుడు నీకు కనిపించున దంతయు నిస్సారమగు పొల్లు
మాత్రమే. కాన నీవు త్వరితముగ లెమ్ము. నాచే యింతకుపూర్వమే చంప
బడియున్న వీరి నంతను నీ విప్పుడు చంపుము. వ్యర్థముగ కల్పితశోకమున బడి
చింతించకుము. ఆటలో ఒక కల్పిత లక్ష్యము నేర్పరచుకొని దానినే బాణ
ముతో ఛేదించుకొనిన, నేనే ప్రతిదానికిని కర్తనూ, సంహారకుడను అయి
యున్నాను. నిన్ను నేను కేవలము బయటకు చూచుటకు మాత్రము సాధ
నముగ నొనర్చుకొంటిని. ఓ సఖుడవగు అర్జునా, నీ వింతవరకు దేనిని
గురించి చింతించుచుంటివో, అది యిప్పుడు పూర్తిగా నివారితమైనది. కాన
నీవిప్పుడు సమస్తరాజ్య సుఖములతో కూడియున్న యశస్సును సంపా
దించుము. ఓసోదరుడవగు అర్జునా, నీవు జగత్తనెడి నాలుకపై 'తన వైభవ
ముచే మదించియున్న వారును, తమ బలపరాక్రమముల వలన జగత్తునకు భార
ముగ కనిపించుచున్న వారును నగు వారిని సహజముగనే ఏ విధమగు శ్రమయు
లేకుండ అర్జునుడు పూర్తిగా నాశనమొనర్చివేసెను', అని వ్రాయించుకొని విజ
యమును సంపాదించుము.

సంజయ ఉవాచ—

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య॥

ఓ శ్రోతలారా, యీ విధముగ గల గాథనంతను సంజయుడు
నిరాశుడగు ఆ కౌరవపతియగు ధృతరాష్ట్రునకు వినిపించుచున్నాడు. సత్య
లోకమునుంచి తప్పివచ్చిన గంగ ప్రచండఘోషతో ప్రవాహము పెట్టుకొనుచూ
క్రిందికి వచ్చిన విధమున, గంభీరమగు మాటలతో శ్రీకృష్ణుడు అర్జునునితో

నిటుల చెప్పినపుడు, లేదా భయంకర మేఘసమూహము ఒక్కపెట్టున శిరముపైకివచ్చి ఘోషలుపెట్టు విధమున, లేదా మందర పర్వతముచే క్షీర సాగరమును మథించినప్పుడు కవ్వము త్రిప్పునప్పుడెట్టి భీకరధ్వని బయల్వెడలెనో, ఆ విధముగాగల గంభీరవాణితో జగత్తున కంతకు బీజభూతుడగు శ్రీకృష్ణుడు, అనంతస్వరూపుడగు ఆ భగవానుడు యీ వాక్యములను పలికినప్పుడు భగవానుని శబ్దములు అర్జునునకీ విధముగనే కొంతవరకు వినిపించెను; మరియు ఆతనికీమాటలు వినినందువలన సుఖమే కలిగినదో లేక భయమే కలిగినదో తెలియదుగాని, ఆసమయమున ఆతని శరీరమంతయూ గజగజ వణకసాగెను. ఆతని శరీరమును పొట్లముగా చుట్టిరా యనునంతగా వంగిపోయెను మరియు ఆ స్థితియందే చేతులు జోడించి మాటిమాటికి శ్రీకృష్ణుని చరణములపై తన మస్తకము నుంచసాగెను. ఆదేసమయమున ఆతని మనస్సునందిటులనుస్ఫురించెను, 'నేనిప్పుడేమైన చెప్పవా?' కాని నోటినుండి మాటయే వెడలజాలనంత ఇక్కట్టుగ ఆతని గొంతు బొంగురుబోయెను. శ్రీకృష్ణుని మాటలవలన ఆతనికి సుఖమే కలిగెనో, లేక భయమే కలిగెనో - దీనినిబట్టి మీరే యోచించుకొనుడు. అర్జునుని అప్పటిస్థితి మీకెటుల తెలిసినదని మీరు నన్నడుగుచో 'ఈశ్లోకమునందలి శబ్దములందే - భగవానుని మాటలను వినుటచే అర్జునుని కట్టిస్థితి సంభవించెనని - స్పష్టముగ చెప్పబడి యున్నదని' నా జవాబు.

అర్జున ఉవాచ—

స్థానే హృషీకేశ తవప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశోద్రవన్తి సర్వేనమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః ॥3౬

ఆదేరీతిని భయపడుచూ భయపడుచూ—చరణములకు నమస్కరించి అర్జునుడు చెప్పెనే—"ఓ దేవా, మీ రింతకుముందే - 'ఓ అర్జునా, నేను కాలుడను. విశ్వమును భక్షించుట నా కొక ఆట' అని చెప్పియున్నారు. ఓ దేవా, మీ యీ మాట అటుల సత్యమని నే నంగీకరింతును. కాని, దీనిని గురించి యోచించగా, నేడు విశ్వస్థితి (అస్తిత్వసమయము) అయినప్పటికి కూడ, ప్రళయ సమయము కాకున్నప్పటికి కూడ, మీరు కాలునిరూపమును

ధరించి యీ విశ్వమునంతను భక్షించుట - అసంభవముగా కనిపించుచున్నది. అవయవములందు నిండియున్న తారుణ్యమేకీతిని తొలగింపబడి, దాని స్థానమున అసమయమునందు శరీరమున వార్ధక్యమేకీతిని తీసికొనిరాబడగలదు! ఇందుచే, మీరు చెప్పునదంతయు అసంభవముగా తోచుచున్నది. ఓ అనంత స్వరూపులగు దేవా, నాల్గుయుగములు పూర్తిగాకముందే, మధ్యలోనే, సూర్యుడెన్నడైన అస్తమించునా? వాస్తవముగ చూచుచో, మీరు అఖండస్థితులు, మరియు సతత కాలస్వరూపులు, అంతేగాక మీ రొనర్చెడి త్రివిధములగు భిన్నభిన్నమగు పనులకొరకై భిన్న-భిన్న సమయము లేర్పడియున్నవి. వాటియందలి ప్రతి ఒక్క సమయము తమతమ పాలనలో సర్వ-సమర్థులుగా నుండును. సృష్టికార్యము జరుగ నారంభమగు సమయమున స్థితి, ప్రళయములు లోపించును. మరియు స్థితి-కాలమున ఉత్పత్తి, స్థితులు లోపించును. ఈ నిశ్చితమగు శృంఖలము ఏ కారణమువలనను ఎన్నడును విచ్ఛిత్తము కాదు. అది అనాదియైనది, ఇప్పుడు జగత్తున అనుభవించవలసినది స్థితికాలము; ఇందుచే మీరీ సమయమున యీ జగత్తును భక్షించి నాశనమొనర్తురను మాటలు నాకు చక్కగాబోధపడుటలేదు". అంత శ్రీకృష్ణుడు సంక్షేపముగా నిటుల చెప్పెను—"ఓ అర్జునా, నేనింతకుముందే - యీ ఉభయసేనల ఆయుర్దాయము పూర్తియైనదని ప్రత్యక్షముగ చూపితిని. కాని వాస్తవముగ చూచుచో యీ సంగతి తగు సమయము వచ్చినప్పుడే జరుగును." ఈ విధముగ సూచించు మాటలను శ్రీకృష్ణుడు చెప్పునంత సమయములో అర్జునుడు కొద్దిగా వెనుకకు దిరిగి చూడగా, అతని కంతయు పూర్తిగా పూర్వమువలెనే వున్నదున్నట్లుగా కనిపించెను. అంత నాతడు భగవానుని అడిగెను - "ఓ దేవా, మీరీ జగన్నాటక సూత్రధారులు. జగత్తు మరల తన పూర్వస్థితికి వచ్చినటుల నేను చూచుచున్నాను. కాని యీ సమయమున దుఃఖసాగరమున మునకలు వేయువాని నుద్ధరించువారుకూడ మీరేనన్న మీ కీర్తి జ్ఞప్తికి వచ్చుచున్నది. మరియు ఆ యీ సమయమునందు మీ యీ కీర్తి జ్ఞప్తికి వచ్చుటచే పొందుచున్న అపారమగు సుఖానుభవమనెడి అమృత తరంగములందు నే నిప్పుడు తేలియాడుచున్నాను. ఓ దేవా, జీవించియుండుటవలననే మీపై ప్రేమాసక్తురాలై యుంటున్నది మరియు దుష్టనాశనము అత్యధికముగ కూడ జరుగుచున్నది. వాస్తవమునకు త్రిభువనములందు గల

దుష్టరాక్షసులకు మీరు అతి భయంకరులుగ కాన్పింతురు. అందువలననే వారందరు దశదిశలను కూడ దాటి బయటకు పారిపోగోరెదరు. మరియు యిట పరిసరములందు, ఓ దేవా, మానవులు, కిన్నరులు మాత్రమే గాదు, యిచ్చటగల స్థావర, జంగమ జగత్తంతయు మీ దర్శనము వలన ఆనందమును పొందినదై, మీకు నమస్కరించుచున్నది.

కస్మాచ్చతే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణో
ఉప్యాదికర్త్రే
అనన్త! దేవేశ! జగన్నివాస! త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥

కాని ఓ దేవా, యీ రాక్షసులు మీ చరణములందు లీనముగాక దూరముగ పారిపోవుచున్నారు – దీనికిగల కారణమేమి ? అయినను యీ సంగతిని గురించి మిమ్మడుగనేల ? నేను స్వయముగనే తెలసికొనగలను, సూర్యుని ముందంధకారమెటుల వుండగలదు? ఓ దేవా, మీరు ప్రకాశమునకు ఉత్పత్తిస్థానమై యున్నారు. మరియు అట్టిస్థితిలో మీ ఎదుటనుంచి యీ రాక్షసరూపమాలిన్యము తనంత తానే తొలగిపోవుటలో ఆశ్చర్యమేమి గలదు? ఇంతకాలమువరకు నాకీ సంగతి బోధపడలేదు; కాని ఓ దేవుడవగు శ్రీరామా, మీ మహిమ నాకిప్పుడు పూర్తిగా తెలిసినది. ఎవనినుండి యీ సృష్టియనెడి వివిధలత లుద్భవించునో, ఎవనివలన యీ భూతకోటి యనెడి లతలు వ్యాపించునో, అట్టి యీ విశ్వబీజమగు మహద్బ్రహ్మయే మీ యిచ్ఛాసంకల్పముచే జన్మించెను. ఓ దేవా, అపారమగు తత్త్వము మరియు స్వయంసిద్ధమగు నేవాలక్షణము గల తత్త్వము మీరే అయి యున్నారు. మీ గుణములు అపారములు, అనంతములు. ఓ దేవా, అఖండితమగు అత్యంత సామ్యావస్థ మీరే. మీరు దేవతలకెల్లరకు అధిపతులు. ఓ దేవా, యీ త్రిభువనములకు మీరే జీవము. మీరు అవ్యయులు, నిత్యమంగళస్వరూపులు. మీరు సదసత్తులు రెంటికిని అతీతముగనుండు తత్త్వమై యున్నారు

త్వమాది దేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్
వేత్తాఽసి వేద్యఞ్చ పరఞ్చ ధామ త్వయా తతం విశ్వమనన్తరూప॥

"ప్రకృతి, పురుషులిద్దరికి జన్మస్థానము మీరే. మాయ యనబడెడి

మహత్తత్త్వమునకు కూడ మీరే ఆధారులు. మీరు స్వాభావికముగనే అనాది సిద్ధ పురాతనులు. ఈ జగత్తున కంతకు శీశము మరియు మూలకారణము మీరే. భూత, భవిష్యములను గురించి తెలిసినవారు మీరొక్కరే. ఓ భేదరహితుడవగు ప్రభూ, వేదములు వైదికనుల ద్వారా మీ స్వరూప దర్శన సుఖము కలుగును. త్రిభువన సాధారమునకు కూడ మీరే ఆధారము. ఇందువలననే లోకులు మిమ్ము 'పరమమహాధామ' మందురు. మహద్బ్రహ్మ మగు మహామాయ బ్రహ్మప్రళయ సమయమున మీయందే ప్రవేశించి లీన మగును. సంక్షేపముగ చెప్పవలెనన్నచో, ఈ విశ్వమునంతను మీరే సృజించి, వ్యాపింప జేయుచున్నారు. ఇక నో అనంతప్రభో, మిమ్మెవరు వర్ణించగలరు.

వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాఙ్కః ప్రజాపతిస్త్వం
ప్రపితామహశ్చ ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చభూయోఽపి
నమో నమస్తే ॥ ౩౯.

నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవసర్వం ।
అనన్త వీర్యామిత విక్రమస్త్వం సర్వం సమాప్నోషి
తతోఽసి సర్వః ౪౦.

మీరు లేని వస్తువేది కలదు? మీరులేని ప్రదేశ మెద్దిగలదు? ఇదంతయు నేల! మీ రేవిధముగనైన నుండుడు, మీకు నేను నమస్కరింతును. ఓ అనంతా, మీరు వాయువులు, అన్నింటిని నియమించు యములు, మరియు ప్రాణికోటియందు నివసించు అగ్ని కూడా మీరే. వరుణుడు, సోముడు, సృష్టికర్తయగు బ్రహ్మ మరియు ఆ జగత్పితామహుడగు బ్రహ్మకు జనకులు - అంతయూ మీరే. ఇవిగాక యింకెన్నెన్ని రూపములు, అరూపములు గలవో అవన్ని కూడ మీరే. ఇట్టి జగన్నాథునకు నేను నమస్కరింతును. పార్థుడీరీతిని ప్రేమపూరిత మనస్సుతో శ్రీకృష్ణునకు నమస్కరించి నాళ్ళ యిట్టుల చెప్ప మొదలిడెను. — "ఓ ప్రభో, నేను మీకు వందన

మొనర్తును. వందన మొనర్తును" ఇటుపైని అతడు శ్రీకృష్ణుని మూర్తిని ఆపాద మస్తకము చక్కగా చూచి మాటిమాటికి 'నమస్కారము నమస్కారము' అని చెప్పెను. ఆ మూర్తియొక్క భిన్నభిన్న అవయవములను చూచి అతడు మిక్కుటముగ తృప్తిపొందెను. మరియు మరల అదేరీతిని "ప్రభో, నమస్కారము నమస్కారము' అని చెప్పసాగెను. ఈ స్థావర, జంగమ జగత్తునందలి జీవకోటి యందాతనిని చూచి మరల 'ప్రభో, నమస్కారము; నమస్కారము' అనెను. అతనిని ఈ విధముగ ప్రభువుయొక్క అత్యంతాశ్చర్యజనకములగు అనంత స్వరూపము లే యే రీతిని జ్ఞప్తికి రాసాగెనో, ఆయారీతిని నమస్కారము, నమస్కారము' అని గానమొనర్చసాగెను. ఇంతకుమించి మరేరీతిని ప్రభుని స్తుతించవలెనో ఆతనికి బోధ పడలేదు. అందుకని ఆతడు మౌనముగా నుండజాలకుండెను. దానితోపాటు ఆతనికి ప్రేమావేశమున తానేమనుచున్నాడో కూడా తెలియకుండెను. ఈ రీతిని ఆతడు మొత్తము మీద ఒక వెయ్యిమారులు నమస్కరించెను. అటు పిమ్మట ఆతడు మరల నిటులనెను—ఓ శ్రీహరీ, నేను మీముందు నమస్కరించుచున్నాను. మీకు వీపు వున్నదో, పొట్టవున్నదో లేదో తెలిసికొనవలసిన అగత్యము లేదు. అయినప్పటికిని, ఓ మహారాజా, నేను మీపృష్ఠభాగమునకు కూడ నమస్కరించుచున్నాను. మీరు నా వెనుకను నా పక్షమునను నిలచి యున్నారు. అందుచే నేను మీ పృష్టభాగము పేరు తలంచు కొంటిని. కాని, వాస్తవమునకు, మీరీ జగత్తునకు ముందునూ లేరు, వెనుకను లేరు, నేను మీ భిన్న భిన్న అవయవముల రూప భేదమననుసరించి పృథక్కరణ మొనర్పజాలను, కాన సర్వాత్మకుడవగు ఓదేవా, మీ రూపము అన్నింటికిని నేనొక్కమారుగా నమస్కరించుచున్నాను, ఓ దేవా, ఎవనిబలప్రభావమనంతమో, ఎవని పరాక్రమమున కేవిధమగు పరిమాణములేదో. ఎవడు భేదభావరహితుడో మరియూ సర్వ రూపుడో, అతనికి నమస్కారములు. ఆకాశమే ఆకాశమునంతను వ్యాప్తమొనర్చి అవకాశరూపమున నుంచురీతిని మీరు కూడ మీ సర్వస్వముతో అన్నిటను వ్యాపించి యుందురు, అంతేగాదు, మీరే సమస్తవిశ్వము. కాని క్షీరసాగరమున క్షీరతరంగములు లేచుట వంటిదే మీ యీ సంబంధము కూడాను, కాన ఓ దేవా మీ రీ జగత్తున

కంతకు భిన్నులు కారనిన్నీ యిదంతయూ మీరేననిన్నీ—నాకు చక్కగా బోధపడినది.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ! హే యాదవ!
హే సఖేతి
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ప్రణ
యేనవాఽపి ॥41॥

"కాని ఓమహారాజా, మీ యీస్వరూపము నాకిప్పటివరకు తెలియనందువలన, మీతో యిప్పటివరకు నా సోదరులు - చుట్టపక్కములు మొదలగు వారితో వ్యవహరించునటుల వ్యవహరించితిని. నే నెంత అనుచితము నొనర్చితిని! నే నమృతమును కళ్ళాపిచల్లుటకై ఉపయోగించితిని. కామధేనువును గుర్రపు పిల్లగా తలచితిని. స్పర్శమణి లభించగా దానిని విసుగగొట్టి యింటి ప్రనాదిరాతిగా పాతితిని. కల్పవృక్షమును నరికి దాని పుల్లలతో పొలమునకు చుట్టూ కంచెగానమర్చితిని. చింతామణులు గల గని దొరుకగా అజ్ఞానముచే అందలి చింతామణులను కంకరరాళ్ళుగా తలంచి వాటిని పశువులను అదలించుటకు, పక్షులను కొట్టుటకును వుపయోగించిన విధమున, నేనుకూడ నేటివరకు మీతో నా సోదరులు - చుట్టముల వలెనే భావించి స్నేహమొనర్చితిని. అంతవరకు పోనేల; నేటి ఈ ప్రత్యక్ష ప్రసంగమును చూడుడు. ఇదెంతటి పెద్ద యుద్ధము, మరియు యిందు మిమ్ము నా సారథిగ నొనర్చుకొంటిని. ఈ కౌరవుల గుమ్మమువద్దకు మిమ్ము మధ్యవర్తిత్వ మొనర్చుటకై పంపితిని. ఈ రీతిని ఓ జగదీశ్వరా, మా స్వార్థమునకై మిమ్ము మేము కొనుక్కొనినరీతిని ప్రవర్తించితిమి. యోగీశ్వరులు సమాధియందు మిమ్ము ధ్యానించి సుఖము ననుభవింతురు. కాని మూర్ఖుడ నగు నాకిదేమాత్రము బోధపడలేదు. ఇంతేగాక, మాటిమాటికి మీతో వేళాకోళములు, పరసములాడుటకూడ నొనర్చుచుంటిని.

యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు
ఏకోఽథవాఽప్యచ్యుతతత్సమక్షం తత్ క్షామయే త్వా మహ
మప్రమేయమ్ ॥42॥

"మీ రీ విశ్వమునకు స్వయంసిద్ధమగు బీజము. మీరు సభలలో కూర్చొనియున్నప్పుడు మీ - నా బాంధవ్యమును పురస్కరించుకొని మీతో వినోదములు, పరిహాసములు కూడ పలుకుచుంటిని. అప్పుడప్పుడు నేను మీ యింటికివచ్చి మీరొనర్చు గౌరవ - మర్యాదల ననుభవించుచూ కూడ నుంటిని. మీ రా రీతిని నన్ను గౌరవించుటలో ఏమాత్రమైన కొరతకలిగించుచో నాకు గల చనువుకొలది మీపై కోపమునుకూడ పొందుచుంటిని. ఓ దేవా శార్ఙ్గధరా, మీపట్ల నేను పెక్కుమారులు, మీపాదములపైబడి క్షమాపణకోర వలసినంతటి చెడుగాకూడ వ్యవహరించితిని. స్నేహముకొలది నేను పెక్కుమారులు మీ ఎదుట కూర్చొనరాని విధమున కూర్చొంటిని. కాని ఓ దేవా, యిటులొనర్చుట నా కెన్నడైన తగునా ! ఛీ ఛీ! నేను గొప్ప తప్పిదము నొనర్చితిని. ఓ దేవా, అప్పుడప్పుడు నేను మీ భుజములపై చేతులు వేయుచుండెడివాడను, వ్యాయామశాలలో మీతో కుస్తీ పట్టుచుండెడివాడను. మరియు పాచికలు యాడునప్పుడు కపటముగ ప్రవర్తించి మీతో పోట్లాడుచుండెడివాడను. ఏదైన మంచివస్తువును చూచినప్పుడు నా కే ఆ వస్తువు కావలె నని మీతో మొండిపట్టుదల గలవాడనై యుంటిని. ఓ భగవానుడా, మీకు తెలివితేటలు నేర్పుటలోకూడ నే నే కొరతను చేయలేదు. నే ననేకమారులు 'నాకూ నీకూ సంబంధమేమిటి?' యని అవమానకరముగ ననియుంటిని. నేను చేసిన యీ అపరాధము యీ త్రిభువనములందును పట్టనంత పెద్దది. కాని ఓ దేవా, నే నిదంతయు పూర్తిగా అజ్ఞానవశమున చేసితినని - మీ పాదముల పట్టుకొని చెప్పుచున్నాను. ఓ దేవా, మీరు భోజనసమయమున నన్ను తలచుకొనుచుండెడివారు, కాని, నేను నా దౌష్ట్యముకొలది మీతో కలహించుచుండెడివాడను. మీ విశ్రాంతిగృహమున మీతో ఆనందముగ ఆడుకొనుచుండెడివాడను, మీ శయ్యపై మిమ్మానుకొని నిద్రించుచుండెడివాడను. నేను 'కృష్ణా' యని మిమ్ము పిలచుచుండెడివాడను, మిమ్ము కూడ అన్య యాదవులవలెనే భావించుచుండెడివాడను. నేను పిలచినప్పటికిని మీరు వినిపించుకొనక పోసాగినప్పుడు, నేను ఒట్టుపెట్టి మిమ్మాపుచుండెడివాడను——యీ రీతిగా నేను తరచుచేయుచుంటిని. మిమ్మానుకుని ఒకేఆసనముపై కూర్చొనుచుండెడివాడను. మీ మాటలను లక్ష్యపెట్టెడివాడను కాను. చుట్టరికము మూలమున యీ విధముగ పెక్కుమారులు అనుచితముగ మీతో

వ్యవహరించితిని. ఓ దేవా, వీటిని నే నెంతవరకని చెప్పను! నేను అపరాధము లన్నింటి చేసితిని. కాన ఓ ప్రభో, నేను మీతో ప్రత్యక్షముగాని, పరోక్షముగ గాని జరిపిన అనుచిత ప్రవర్తనల నన్నింటిని మీరు తల్లివలె మీ మమత్వమనెడి ఉదరమునం దుంచుకొని నన్ను క్షమించుడు. ఏదైన నది మురికినీటిని గొనివచ్చినప్పటికిని, సముద్రుడు దానిని గ్రహించవలసియేయుండును. ఇం తకుమించి ఆతనకి మరే ఉపాయమును లేదు. ఇదేవిధమున, ప్రీతివలనగాని, లేదా పొరబాటుచేగాని మీకు విరుద్ధముగ నొనర్చిన పనులన్నింటిని, ఓ ప్రభో, ముకుందా మీరు మీ క్షమాగుణమువలన సహించవలసియే యుండును. మరియు నో దేవా, మీకు క్షమావంతులైనప్పుడే యీ భూతసృష్టి యందు యమునిరాజ్యము దగలదు. కాన నో పురుషోత్తమా, యిందును గురించి నేను మిమ్మెంతగా ప్రార్థించినప్పటికిని, అదంతయు స్వల్పమేయగును. కాన నో అతర్క్యశ్రీ భగవానుడా, మిమ్ము శరణుజొచ్చితిని, నా యీ అప రాధముల నన్నింటిని క్షమించుడు.

పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ
గురుర్గరీయాన్
నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యోలోకత్రయేఽప్య
ప్రతిమ ప్రభావ ॥౪౩॥

"కాని ఓ దేవా, నాకు మీ మహిమ యిప్పుడు పూర్తిగా బోధ పడినది. ఈ స్థావర జంగమములతో కూడియున్న విశ్వమునకు మీరు మూల బీజమని - నేను తెలిసికొన్నాను. హరి, హరాదులగు దేవతలందరియందును పరమదైవతము మీరే. మరియు వేదములకు కూడ మీ వలననే జ్ఞానము లభించును. మీరు సమస్తగుణములందును అప్రతిములు మరియుఅద్వితీయులు నై యున్నారు. ఇక యిట్టి స్థితిలో మీకు సాటివచ్చువా రెవరును లేరని చెప్పవలసిన దే మున్నది? మీరు ఆకాశము, మరియు యీ విశ్వమంతయు మీ యందు దిమిడియున్నది. ఈ స్థితిలో మీ వలె సర్వవ్యాపకులగువారు లేరని చెప్పుట కేవలము లజ్జాస్పదమే యగును. ఇంక దీనినిగురించి వివే క్షించి చెప్పనేల! కాన, త్రిభువనములలో కేవలము మీరే అద్వితీయులు.

మీతో సాటివచ్చునట్టి, లేదా మిమ్ము మించునట్టిదీ మరేదియూ లేదు. మీ మహిమ ఏ రీతిగను వర్ణించ నలవికానంత విలక్షణమైనది!

తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్ ॥౪౪॥

అర్జును డీ మాటలను చెప్పి శ్రీ కృష్ణునకు దణ్ణము పెట్టెను. మరియు ఆ వెంటనే అతని శరీరమున అష్ట సాత్త్విక భావములు సంచరించెను. అతడు గద్గద స్వరముతో మరల నిట్లులనెను—"ఓ దేవా, మీరు ప్రసన్నులు – ప్రసన్నులు. యీ అపరాధ సముద్రమునుంచి నన్ను రక్షించుడు. మీరు విశ్వమున కంతకు హితవొనర్చువారు. కాని, కేవలము మన బాంధవ్యము వలన మిమ్మెన్నడును విశేషించి గౌరవించలేదు. ఓ విశ్వేశ్వరా, మీతో నేనీ విధముగ ఆశ్చర్యము, లజ్జాకరము నగు విధమున వ్యవహరించితిని. వాస్తవముగ ప్రశంసార్హులు మీరే. అయినప్పటికిని, నిండుసభలో నన్ను మీరు ప్రశంసించితిరి మరియు నేను మిక్కుటమగు అభిమానముతో కూర్చొని బీరములు పలికితిని. ఓ ముకుందా, యీ విధమగు నా అపరాధములకు మేరలేదు. కాన, మీరు నన్నీ అపరాధములనుండి రక్షింపుడు. నా యం దీ విధముగ క్షమాప్రార్థన మొనర్చు యోగ్యతకూడ లేదు. కాని, బాలుడు తన తండ్రిముందు ముద్దుగా మాట్లాడురీతిని, కుమారుడెంతటి ఘోరమగు అప రాధమును చేసినప్పటికిని ప్రేమభావముతో ఆతని తప్పుల నన్నింటిని తండ్రి క్షమించురీతిని, మీరుకూడా నా అపరాధముల నన్నింటిని క్షమించుడు. మిత్రుని ఔద్ధత్యమును మిత్రుడే సహించగలడు. ఇదేవిధమున నా దౌష్ట్య మును మీ రోర్చుకొనగోరెదను. తన యిష్టులైన వారినుంచి ఎవడును ఏ విధ మగు గౌరవ – మర్యాదలను అపేక్షింపడు. ఇదేరీతిని, ఓదేవా, మాయింట మీరు ఎంగిలివస్తువులను తీసికొనగా, నేను తీసికొననిచ్చితిని, అందుకైగూడ మీరు నన్ను క్షమించవలెను. లేదా, అతి ఘనిష్ఠము, ప్రియమునగు మిత్రుని కలిసికొనినప్పుడు, అతనితో తాను సంసారమునం దనుభవించిన కష్టములను

వివరించి చెప్పుట కెవడును సంకోచింపడు. దేవా, మనస్సు, శరీరము,ఆత్మ-మూటినీ పూర్తిగా తన పతికి అర్పించియున్న పతివ్రతయగు భార్య లభించి నప్పుడు, అట్టి భార్యతో ఆభర్త దాపరికములేకుండా, ఆమెకు హృదయ మర్పింపకుండా ఎన్నడును వుండ నేరడు. ఇదేరీతిని, ఓ సద్గురుమహారాజా, నేను కూడ మిమ్ము ప్రార్థించితిని. ఇంతేగాక యిదంతయూ చెప్పుటకు మరొక కారణముకూడ గలదు.

అదృష్టపూర్వం హృషితోఽస్మిదృష్ట్వాభయేనచ ప్ర
వ్యథితం మనోమే
తదేవమే దర్శయ దేవరూపం ప్రసీద దేవేశ జగన్నివాస ॥౪౫॥

"ఓ దేవా, చూడుడు, నేను చాల ధార్ష్ట్యముతో నాకు మీ విశ్వ రూపమును చూపించవలసినదిగా పట్టుబట్టితిని. మరియు యీ విశ్వమునకు తల్లి-దండ్రు లగు మీరు మిక్కుటమగు ప్రేమతో నావాంఛను నెరవేర్చితిరి. నేనీ విధమగు పెక్కు మూర్ఖపట్టుదలలను పట్టితిని - నా యింటిముంగిలి యందు కల్పవృక్షములు మొలవవలెను, కామధేనువుయొక్క దూడ నే నాడుకొనుటకు కావలెను, నేను పాచికల ఆట యాడుటకు నక్షత్రపాచి కలు కావలెను, నే నాడుకొనుటకు చంద్రుడనెడి బంతి కావలెను - మొద లగు కోరికలను కోరితిని; మీరు ప్రేమపూరిత యగు మాతవలె నా ఆసమస్త కోరికలను నెరవేర్చితిరి. ఏ స్వల్పమగు ఒక్క అమృతబిందువుకొరకై అపా రములగు కష్టములను సహించవలెనో, అట్టి అమృతమును మీరు నాల్గుమాస ములు పూర్తిగా వర్షింపజేసితిరి మరియు భూమిని దున్ని పాదుపాదునందును చింతామణులను విత్తిరి. ఓ దేవా, మీ రీ రీతిని నన్ను ధన్యునొనర్చితిరి మరియు మిక్కుటమగు ప్రేమతో నన్ను పెంచితిరి. శంకరుడు, బ్రహ్మ అంతటివారు చెవినికూడ విననట్టి విశ్వరూపమును నాకు మీరు జూపిరి. మీజీవిత రహస్యమును చూడకపోవుటటుండగా, ఉపనిషద్విచార క్షేత్రమునకుకూడ యోచించుటకు నలవికాని ఆ రహస్యమును మీరు నాకు విప్పిజెప్పిరి. ఓ మహారాజా, జగత్ప్రారంభమునుండి నేటివరకు నే నే జన్మముల నెత్తితినో, ఆ జన్మముల నన్నింటిని బాగా శ్రద్ధగా పరికించి జూచినప్పటికిని, ఆరహస్య మును చూచుటగాని, వినుటగాని యనెడి ప్రసంగమే లేదు. మరియు నా

అంతఃకరణమున కీ విషయమును గురించిన తలంపే కలుగలేదు. ఇక యిట్టి స్థితిలో యీ వస్తువును కనుల జూచుటన్నదెటుల సంభవించును! నేటివరకు నే నీ విశ్వరూపమును చూడలేదు, వినలేదు. కాని, ఆ విశ్వరూపమే నేడు నాకు మీ వలన దర్శించుభాగ్యము గలిగినది. అందుచే నా మనస్సున కపారమగు ఆనందము కలిగినది. కాని, యీ సమయమున మీతో హృదయము విప్పి మాట్లాడవలెనని, మీ వద్ద వుండమని, మిమ్ము ఆలింగన మొనర్చుకొనవలెనని—మనస్సున తలంపు కలుగుచున్నది. మీ యీ విశ్వరూపముతో యీ మాటలు చెప్పుదమనిన యీ అసంఖ్యాకములగు ముఖములలో ఏముఖముతో మాట్లాడవలెనో, దేనిని ఆలింగన మొనర్చుకొనవలెనో నాకు బోధపడుటలేదు. ఏలనన, మీ యీ స్వరూపము హద్దులేనిది. ఇట్టి స్థితిలో వాయువుతో పరుగెత్తుట, ఆకాశమును ఆలింగనమొనర్చుకొనుట, సముద్రమున జలక్రీడ యొనర్చుట—ఎటుల సంభవమగును ? ఓ దేవా, మీ యీ స్వరూపమనిన నాకు భయముకలుగుచున్నది. మీ యీ స్వరూపమును ఉపసంహరించవలసినదిగా నేను మిమ్ము ప్రార్థించుచున్నాను. కుతూహలముతో యీ స్థావర, జంగమ జగత్తునంతను అవలోకించిన పిదప యిక యింటియందు మెదలక పడి యుండమని మనస్సునందుద్దేశము కలుగు రీతిని మీ సౌమ్యమగు చతుర్భుజ స్వరూపము నాకు విశ్రాంతి స్థానముగ కనిపించుచున్నది. నేను యోగాభ్యాసమొనర్చినప్పటికి కూడ చివరకు యీ అనుభవమునే పొందవలసి వచ్చెడిది. శాస్త్రాధ్యయన మొనర్చినప్పటికిని అంతమున యీ సిద్ధాంతమే నాపాలపడెడిది. యజ్ఞ—యాగములొనర్చినప్పటికిని అంతమున యీ ఫలమే కలిగెడిది. తీర్థయాత్రలుకూడ యిందులకై చేయవచ్చును. ఇంతేగాక యింకను గల దాన—పుణ్యాదులొనర్చినప్పటికిని వాటి అన్నింటిఫలము మీ యీ చతుర్భుజ స్వరూపమే. ఈరీతిని ఆరూపమును చూడవలెనని నాకు మిక్కుటమగు అభిలాషకలదు మరియు దానిని దర్శించుటకై అధికముగ అధీరుడనగుచున్నాను. నా యీచింతను మీరతి శీఘ్రముగ తొలగింపుడు. ఓ సమస్తజీవ హృదయాంతర్వేదీ, ఓ జగద్వ్యాపకా, ఓ దేవతలకుకూడ పూజనీయుడా, ఓ దేవాదిదేవా, మీరిప్పుడు ప్రసన్ను లగుడు.

కిరీటినంగదినం చక్రహస్తమిచ్ఛామి త్వాంద్రష్టుమహం తథైవ॥
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహోభవ
విశ్వమూర్తే ॥ ४६.

"ఎవని అవయవ కాంతి నీల కమలములకు కూడ ఆదర్శవంతమై నదో, ఎవడు ఆకాశ వర్ణపు శోభనుకూడ పెంపొందించునో, మరియు నీల మణికి కూడ ప్రకాశము నిచ్చునో, ఎవని కటి (నడుము) శోభచే మదనుని శోభ కూడ మరకతమణికి సుగంధము, లేదా ఆనందమున మొలకెత్తిన రీతిని— వృద్ధియగునో, ఎవనిని గురించి—మస్తక శోభను ముకుటము పెంపొందించుచున్నదో, లేక ముకుటశోభను. మస్తకము పెంపొందించు చున్నదా—యనెడి భ్రాంతి కలుగునో—ఏలనన ఆతని అవయవశోభయే శృంగారమునకు భూషణ మగుచున్నది. ఆకాశమున యింద్రధనస్సు పై మేఘములు కనిపించు రీతిని ఏ శార్ఙ్గపాణి వైజయంతీమాలను ధరించి యున్నాడో, మరియు దైత్యులకు దానవులకుకూడ మోక్షదాన మిచ్చు నంతటి ఉదారుడెవడో, మరియు ఓ గోవిందా, ఎవని చక్రప్రతిమ సౌమ్య తేజస్సుచే మెరయుచుండునో, ఆ సుందర రూపమును చూచుటకై నే నధీరుడనగుచున్నాను. కావుననో దేవా, మీరు మీ ఆ రూపమును ధరిం చుడు. ఈ విశ్వరూపమును దర్శించి నా నేత్రములు మిక్కుటముగ తృప్తి నొందినవి; మరియు అవి యిప్పుడు మీ సౌమ్యమగు కృష్ణమూర్తిని చూచు టకు ఆతుర పడుచున్నవి. వీటి కిప్పుడిక ఆ సుందర కృష్ణమూర్తిని చూచు టకు మినహా మరేదియూ నచ్చదు. ఈ రూపముముందు వీటికీ విశ్వరూప మే విధముననూ ఎక్కువ మహత్వమైనదిగ కనిపించుటలేదు. మాకా కృష్ణ మూర్తి తప్ప మరెచ్చటను భోగ—మోక్షములు లభించ నేరవు. కావు ననో దేవా, మీరిప్పుడు మీ యీ విశ్వరూపము నుపసంహరించి, మీ పూర్వపు సగుణరూపమును ధరించుడు"

శ్రీ భగవానువాచ—

మయా ప్రసన్నేన తవాఽర్జునేదం రూపం పరందర్శిత
మాత్మయోగాత్ ।

తేజోమయం విశ్వమనన్త మాద్యం యన్మేత్వదన్యేన
నదృష్టపూర్వమ్ ॥ ౪౭.

అర్జునుని యీ మాటలను వినుటచే ఆ విశ్వరూప భగవానునకు అత్యధికమగు ఆశ్చర్యము కలిగి యిటులనెను—"నీవంటి అనాలోచనగల వానిని నేనెచ్చటనూ చూడలేదు. నీ కెంతటి అలౌకికవస్తువు లభించెను! అయినప్పటికిని, నీకు దానివలన కూడ సుఖము కలుగలేదు. నీ వీ మాటలు పిరికితనముచే చెప్పుచున్నావో లేక మూర్ఖత్వముచే చెప్పుచున్నావో తెలియదు. నేను సహజరూపమున ప్రసన్నుడనైనప్పుడు యీ జడమర్యాదలతో కూడియున్న వాటినన్నిటిని అనుగ్రహింతును; నా నిజమగు భక్తుడు లభించనంతవరకు యీ గూఢరహస్య మెవరికి చెప్పను. నేడు కేవలము నీ కొరకై నా యీ ఆంతరిక రహస్యమును బహిరంగ పరచి యీ విశాలరూప ధారణ మొనర్చవలసి వచ్చినది. నీపై నేను ప్రసన్నుడనై పూర్తిగా పిచ్చివాడనైతిని. మరియు నేను నా ఆంతరిక గూఢరహస్య మూర్తిని ప్రపంచము ముందు ప్రత్యక్ష రూపమున నిలిపితిని. నా యీ స్వరూపము అపారము కంటెకూడ అపారమైనది. కృష్ణాది అవతారములన్నియు యీ స్వరూపము నుండియే ఉద్భవించినవి. ఈ స్వరూపము జ్ఞాన తేజ సారసర్వస్వము. ఈ విశ్వరూపము శుద్ధము, అంతములేనిది, నిశ్చలము మరియు అన్నింటికిని మూలబీజమునై యున్నది. ఓ అర్జునా, నీవుతప్ప యింతకుపూర్వ మెవడును యీ విశ్వరూపమును చూడలేదు మరియు ఎవరును ఎన్నడును వినియుండలేదు. ఏలనన, యీ స్వరూప మే విధమగు సాధనవలనను లభించునది కాదు.

నవేదయజ్ఞాధ్యయనైర్న చక్రియాభిర్నతపోభిరుగ్రైః ॥
ఏవంరూపశ్శక్యఅహం నృలోకే ద్రష్టుం త్వదన్యేనకురుప్రవీర॥౪౮

"ఈ స్వరూప మార్గము వరకు చేరుటతోడనే వేదములు మౌనము నవలంబించినవి. యజ్ఞకర్తలగువారు స్వర్గమునుండి మరలి వచ్చిరి. యోగ సాధనవలన కూడ యీ స్వరూపము లభించకపోగా, వ్యర్థముగ కష్టపడుట కూడ యగుచునని సాధకులకు తెలియగనే వారు యోగాభ్యాసమునే విడచి

గ్రైః” ఇదేవిధమున కేవలము అధ్యయనమువలన కూడ యిది లభించునది కాదు. పూర్తిగా ప్రథమకోటికి చెందిన పుణ్యకృత్యముల నొనర్చినవారుకూడ మిక్కుటముగా ఆవేశములో పోయి ఏకోన్ముఖమున సత్యలోకమువరకు మాత్రమే చేరగలిగిరి. తపస్సు కేవల మీ స్వరూపైశ్వర్యమును మాత్రమే చూచినది. అంతవరకు వచ్చినపిమ్మట దాని ఉగ్రత మటుమాయమై పోయినది. ఈ రీతిని తపోక్షేత్రమున కావలనున్నదేగాక మిక్కుటముగా దూరమునందున్న విశ్వరూపము నే నీకు ఏవిధమగు పరిశ్రమయు లేకుండ లభించినది. అటుల కానిచో మానవలోకమున ఎవనికిని యీ స్వరూపదర్శనము కాదు. ఈ ప్రపంచమున నీవొక్కడవే యీ రూప సంపదను పొందుట కర్హుడవు. ఈ విధమగు పరమభాగ్యము బ్రహ్మకుకూడ లభించదు.

మా తేవ్యథా మాచవిమూఢ భావోదృష్ట్వారూపం ఘోర
మీదృఙ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వంతదేవ మే రూపమిదం ప్రపశ్య ॥౪౯

“కావున యీ విశ్వరూపమును దర్శించి నీవు ఆనందింపుము, అల మాత్రముకూడ భయపడకుము, దీనిని మించిన పదార్థము మరొకటి వుండ గలదని నీ వెన్నడును తలంచకుము. అమృతముతో నిండియున్న సముద్రము అకస్మికముగవచ్చి మనపైపడుచో, ఎవడైన దీనియందు నేను మునిగిపోవుదు నను భయముతో దూరముగ పారిపోవునా? లేదా, ఎవనికైన బంగారుకొండ కనిపించుచో యింతపెద్దకొండను యిచ్చటినుంచి ఎటుల తీసికొని పోగలనని తలంచి వదలివేయునా? అదృష్టవశమున చింతామణి లభించుచో దానిని ధరించవలెనా, లేక బరువగు నని ఆవల పారవేయవలెనా? ఎవడైన కామధేనువును దాని పోషణభారముచే యింటినుంచి వెడలగొట్టునా? సూర్యుడింటిలోనికి వచ్చుచో ‘నీవలన మా శరీరము దగ్ధమయ్యెను గాన వెళ్ళిపొమ్మ’ని ఎవడైన చెప్పునా? ఇంటిలోనికి చంద్రుడు వచ్చుచో ‘నీ ప్రతిబింబము మా యింటపడుచున్నది గాన వెళ్ళిపొమ్మని’ ఎవడైన అనునా? ఈ విధముగ ఎవడైన చెప్పుచో అది తెలివిగల మాటగా ఎంచబడునా? ఇదేవిధమున, నా విశ్వరూపముయొక్క పరమతేజోఐశ్వర్యము నేడు నీకు సహజముగనే లభించినది, దీనిని చూచి నీవేల శంగారుపడెదవు? కాని నీవు

మూర్ఖుడవు, నీకీ సంగతి బోధపడుటలేదు. ఓ అర్జునా, ఇప్పుడు నీపై నే కోపమని కోపించను! నీవు యదార్థమగు శరీరమును విడచి, దానినీడను కౌగిలించుకొనగోరుచున్నావు. అది నా వాస్తవిక స్వరూపము కాదనిన్నీ, ఇదియే నా వాస్తవిక స్వరూపమనిన్నీ, నీవు చక్కగా నెరుంగుదువు. నీవు నా యీ వాస్తవిక స్వరూపమును చూచి భయపడి, అవాస్తవికమగు ఆ చతుర్భుజరూపమును ప్రేమించుచున్నావు. అయినప్పటికీ ఓ అర్జునా, నీవిప్పుడు నీ యీ మూర్ఖత్వమును విడువుము, మరియు యీ చిక్కులో పడకుము; ఈ విశ్వరూపము చూచుటకు భయంకరముగ తోచుచున్నప్పటికిని, ఇది ప్రచండమగు వ్యాపకత్వము కలిగి యున్నప్పటికిని, కేవల మిదియే వాస్తవికము, యదార్థమైనను స్వరూపమై యున్నది— నీ వీ విషయమును చక్కగా నెరుంగుము. మిక్కుటమగు లోభిత్వముగల వాని మనస్సెల్లప్పుడు డబ్బుపైననే నిమగ్నమైయుండి, అతడు కేవలము శరీరముతోనే వ్యవహరించుచుండు రీతిని, లేదా ఆడుపక్షి యింకను రెక్కలురాని గూటియందున్న తన బిడ్డలవద్ద తన ప్రాణమునుంచి, ఆకాశమునం దెగురుటకు పోవు రీతిని, లేదా ఆవు తన వాత్సల్యముతో నిండియున్న మనస్సును తనబిడ్డవద్దవిడచి, అడవిలో మేసివచ్చుటకు పోవురీతిని, నీవుకూడా నీ ప్రేమ నెల్లప్పుడు యీ స్వరూపముపైననే స్థిరముగా నుంచుము. బయటకును మాత్రము, కేవలము స్నేహ-సుఖలాభమునకై, ఆ చతుర్భుజుడగు కృష్ణమూర్తిని ధ్యానించుము; అయినప్పటికిని, నీవు నా ఉపదేశము నొకదానినెన్నడును మరువవద్దని మాటిమాటికిని చెప్పుచున్నాను. అదె, నీవు నా యీ విశ్వరూపమునుండి నీ శ్రద్ధనెన్నడును తప్పనివ్వవలదనుటయే. నీవు దీని నిదివరకెన్నడును చూడకయుండుటవలననే నీకీ విశ్వరూపమును చూచుటచే భయముకలుగుచున్నది. కాన నీ భయమునంతను విడచి యీ విశ్వరూపముపైననే నీ ప్రేమనంతను స్థిరముగనుంచుము". అటుపిమ్మట శ్రీ కృష్ణుడిటుల చెప్పెను— "ఇక నీవు కోరినటుల నొనర్తును. ఇక నా పూర్వరూపమును నీవు సంతసముతో తనివిదీర చూడుము",

సంజయ ఉవాచ—

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా స్వకంరూపం దర్శయామాస
భూయః

ఆశ్వాసయామాస చ భీతమేనం భూత్వా పునః సౌమ్య
వపుర్మహాత్మా ॥ ౫౦ ॥

భగవానుడీ మాటలను చెప్పినాక, తన పూర్వ మానవరూపమును ధరించెను. ఇందాశ్చర్యపడవలసినదేమియూ లేదు. కాని అర్జునుని యెడ అతనికి గల ప్రేమసూత్రము ఆశ్చర్యజనకముగ నున్నది. శ్రీకృష్ణుడు కైవల్యధామమువంటివాడు, అందలి సారసర్వస్వము విశ్వరూపము, దానిని నాతడు అర్జునునకు స్పష్టముగ చూపెను. కాని అతని ఆ రూపము అర్జునునకు నచ్చలేదు. ఎటులనిన, ఏదైన వస్తువుకొరకు వెళ్ళి, ఆ వస్తువును చూచి అందలి దోషములను చూపుచుండు కతన, లేదా పెండ్లికొమార్తెను చూచుటకు వెళ్ళి, చూచినపిమ్మట ముఖము చిట్లించుకొనిన— అర్జునుడు కూడ నీ విశ్వరూపము నెడ అటులే ప్రవర్తించెను. శ్రీకృష్ణుడు అర్జుననియెడ గల అపార ప్రేమవలన, తన ఉపదేశమందలి సారాంశమగు విశ్వరూపమును కూడ అతనికి చూపించెను. ఇంతకంటె గురువు అర్జునునకేమి చేయగలడు! బంగారమును కరగించి దానితో మన యిచ్ఛవచ్చిన వస్తువులను చేయించుకోవచ్చును; ఒకవేళ ఆ వస్తువు నచ్చకపోయినచో దానిని కరిగించుట తప్ప మరే ఉపాయముగలదు? తన శిష్యుడగు అర్జునునికొరకు కూడ భగవానుడీ సమయమున యీ రీతిగనే చేసెను. మొదట ఆతని చతుర్భుజ కృష్ణరూపముండెను, మరియు అందుచే ఆతడు విశ్వరూపమును ధరించెను. కాని ఆ రూపము శిష్యునకు నచ్చలేదు; అందుచే ఆతడు మరల లేని పూర్వపు కృష్ణరూపమునే ధరించవలసి వచ్చెను. తన శిష్యుని మాటపట్టుదల నింతగా మన్నించు గురువెట లభించును? సంజయుడు ధృతరాష్ట్రునితో నిటులనెను—"శ్రీకృష్ణునకు అర్జునునియెడ యింత అధికమగు ప్రేమయుండుటకు గల కారణమేమో బోధపడదు". అటుపిమ్మట జగత్తునంతను వ్యాప్తమొనర్చిన ఆ రూపము శ్రీకృష్ణరూపమున సమావిష్టమయ్యెను. ఆత్మవిచారమొనర్చునప్పుడు 'త్వం' (నీవు) పదము 'తత్' (అది) పదమునందు సమావేశమగును. లేదా సమస్త వృక్షస్వరూపము సూక్ష్మబీజమునందంతర్భావమగును, లేదా స్వప్నమున చూచిన విషయములన్నియు జీవుడు మేల్కొనినపిదప లోపించును—అదే రీతిని శ్రీకృష్ణుడు తన సగుణస్వరూపమున యీ విశ్వరూపయోగమును

ఏకత్రితమొనర్చియుంచెను. ఈ విషయ మెటులున్నదనిన, సూర్యకాంతి సూర్యునియందు, మేఘసమూహములు ఆకాశమునందు, సముద్రప్రవాహంగు సముద్రమునందును లీనమగునుగదా! కృష్ణమూర్తి ఆకారమున విశ్వరూప వస్త్రపు మడత చేరియున్నది. దానిని శ్రీకృష్ణుడు అర్జునుని ప్రేమచే ప్రేరేపింపబడినవాడై, దానిని తెరచి అర్జునునకు చూపించెను. వస్త్రమునొక్క-నిడివి – వెడల్పు, రంగు మొదలగునవి చక్కగా చూచుకొనినపిమ్మట కొనువానికి ఆ వస్త్రము నచ్చకపోవుటచే, తిరిగి ఆ వస్త్రమును యథాకీతిగా మడతబెట్టి దానిచోటున పెట్టెను. ఈ రీతిని, తన అపారమగు వ్యాపకత్వము వలన అంతటను వ్యాపించియున్న ఆ స్వరూపము, యింపైన కాంతియు, మనోహరము మరియు పూర్తిగా సౌమ్యముగను అయ్యెను. అన, ఆ అనంత భగవానుడు తన పూర్వపు చిన్నదగు రూపమునే ధరించి, భయభీతుడగు అర్జునుని మరల సంతృప్తునొనర్చెను. స్వప్నావస్థలో ఎవడైన మానవుడొకమారు స్వర్గమునకు బోయి సుఖించి, ఆకస్మికముగా మేల్కొనిన పిమ్మట అతడు విస్మితుడగురీతిని, అర్జునుని స్థితికూడ యీ సమయమున అటులేయుండెను. లేదా, సద్గురు కృప లభించుటచే సంసార సంబంధమగు ప్రాపంచిక జ్ఞానము నశించి, వాస్తవిక తత్త్వజ్ఞానము లభించురీతిని, ఆ సమయమున శ్రీకృష్ణ దర్శనముచేసిన పిదప అర్జునుని స్థితికూడ అటులే యుండెను. ఆ సమయమున, అంతవరకు తన కనుల ఎదుట గల విశ్వరూపమనెడి తెరగూడ తొలగిపోయినదనీ, యిటుల జరుగుట బాగుగానేయున్నదనీ అర్జునుడు భావించుచుండెను. ఆ విశ్వరూపమును దర్శించినపిదప శ్రీకృష్ణుని ఆ పూర్వరూపమును చూచుటతోడనే అర్జునునకు కాలునితో పందెమువైచికొని జయించినట్లును, మేఘములను వాయువునుకూడ పోటీలో ఓడించినట్లును, లేదా చేతితో నీటిని చిమ్ముకొనుచు సప్తసముద్రములను దాటి వచ్చినట్లును-అపారమగు ఆనందము గలిగెను. సూర్యాస్తమయమైన పిమ్మట ఆకాశమున నక్షత్రములు కనుపడ నారంభించురీతిని, అతనికి పృథివి మరియు పృథివియందలి జనులెల్లరును కనిపించసాగిరి. అంత నాతడు తనవు నాల్గువైపులను చూడగా పూర్వపు కురుక్షేత్రము కనిపించెను. తన కిరువైపులను గల తన చుట్టపక్కములందరినికూడ చూచెను. ఆ రణక్షేత్రమున శూర-వీరులెల్లరు ఒకరిపై నొకరు శస్త్రాస్త్ర వర్షమును కురిపించుచుండిరి. ఆ వీరుని భాణమం

దపము క్రింద తన రథము కూడ పూర్వమువలె నిలచి యుండుట నాతడు చూచెను. అంతేగాక, శ్రీకృష్ణుని రథముయొక్క నాడిపై కూర్చొని యుండుటను తాను క్రింద భూమిపై నిలచియుండుటను కూడ నాతడు చూచెను.

అర్జున ఉవాచ—

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన
ఇదానీమస్మి సంవృత్తః సచేతః ప్రకృతింగతః ॥ ౫౧.

వీర్యశాలియగు అర్జునుడు శ్రీకృష్ణుని ఏ విషయమునకై ప్రార్థించెనో, ఆతని కా విషయము దర్శనమే లభించెను. ఆతడిట్లనెను— "ఇప్పుడు నా ప్రాణములు కుదుటబడినవి. లేకున్నచో ఇప్పటివరకు నాబుద్ధికిగల జ్ఞానము నశించినది మరియు నలువైపులను భీకరాంధకారమే కనిపించుచుండెను. మరియు అహంభావ సహితముగ మనస్సు మూర్ఛమునొంది పోయియుండెను. ఇంద్రియములు పూర్తిగా స్తబ్ధము, నిశ్చలములై పోయినవి. వాక్కు గూడ ప్రాణము లేనిదై మూగదిగనైపోయినది. నా శరీరమునకీ విధమగు దుస్థితి సంభవించినది. కాని, యిప్పుడా జీవాత్మయు తనయొక్క యథాస్థితికి వచ్చినది మరియు క్రొత్తగా నాకు ప్రాణములు వచ్చినవా యన్నట్లుల యున్నది. శ్రీకృష్ణమూర్తిని దర్శించుటచే మరల నాకు ప్రాణములు వచ్చినవి." అటుపైని ఆతడు శ్రీకృష్ణునితో నిట్లనెను—"ఓ దేవా, నేను మీ యీమానవ రూపమును చూచితిని. ఓ దేవరాజా, మీరు మీ యీరూపమును నాకు చూపి, తల్లి తన అపరాధియగు బిడ్డని హృదయమునకు హత్తుకొని ప్రసన్నపాడ మొనర్చు రీతిని, నాపై అనుగ్రహించితిరి. నేనా విశ్వరూప దర్శన సముద్రమున రెండు చేతులతోను అంజలిలో పోరాడుచుంటిని; కాని యిప్పుడు మీ యీ సగుణరూప మనెడి రేవుకు చేరితిని. ఓ ద్వారకావాసుడవగు శ్రీకృష్ణా, మీరిచ్చిన యీ దర్శనము, ఎండిపోయిన వృక్షముపై మేఘవృష్టి వంటిది. నేను స్వాభావిక తృషచే బాధపడుచుంటిని. ఇట్టి సమయమున మీ యీ సుగుణాకారము నాకు అమృత సముద్రమువలె లభించినది. ఇప్పుడు నాకు 'నేను జీవించి యున్నాను' అనెడి విశ్వాసము కలుగుచున్నది. నా అంతఃకరణమనెడి భూమిపై ఆనంద మనెడి లత ఊగిసలాడుచున్నది మరియు నాకు అత్యంతమగు సుఖము లభించుచున్నది"

శ్రీభగవా నువాచ—

సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ
దేవా అప్యస్యరూపస్య నిత్యం దర్శన కాఙ్క్షిణః ॥౫౨॥

అర్జునుని యీమాటలను విని శ్రీకృష్ణుడనెను—

"ఓ అర్జునా, నీవిటుల మాట్లాడు చుంటివేమి? నవీ విశ్వరూపమునెడ ప్రేమభావము గలవాడవై యుండవలెను; అయినను, నాయీ సగుణమూర్తిని నిశ్శంకతో సేవించుచు డవలెను. నేనింతకుముందు చెప్పిన మాటలన్నిటిని నీవు మరచిపోతివా? ఓ అ ధుడగు అర్జునా, నీ చేతిలోనికి మేరుపర్వతము వచ్చినది, కాని నీవు దానిని మరచి, దానినొక తుచ్ఛ వస్తువుగా తలంచితివి. కాని, నీకింతకుముందు నేను చూపించిన విశ్వరూపము శంకరునకుకూడ తన తపో బల మంతటివలనను లభించనేరదు. యోగమునందలి అష్టాంగములను సాధన చేయుటనెడి కష్టము ననుభవించు యోగులకుకూడ లభించని విశ్వరూపమును, దేవతలు యీ మహాత్మ తమైన దర్శించిన చాలునని తలంచుచుండెడి యీవిశ్వ రూపమును నీకు చూపించితిని. ఆశ యనెడి చేతిని తన హృదయమనెడి మస్తకముపై జోడించి (అనగా అత్యధికమగు ప్రార్థనా పూర్వకముగను మరియు ఆశతోడను) చాతకము మేఘమునకై ఎదురు చూచుచూ ఆకాశము వైపు ఏకాగ్రదృష్టితో చూచు విధమున, గొప్పగొప్ప దేవతలందరును యీ విశ్వరూపమును దర్శించుటకై యిరువదినాల్గు గంటలు చింతన మొనర్చినప్ప టికిని స్వప్నమునందైన దర్శనము కానట్టి, ఆవిశ్వరూపమును నీవు నేడు సహ జముగ ప్రత్యక్షముగ చూచితివి.

నాహం వేదైర్నతపసా న దానేన న చే జ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥౫౩॥

"ఓ అర్జునా, యీ విశ్వరూపమునకు దగ్గరగనైన చేరుట కనుకూ లించునట్టి మార్గమునుచూపు సాధన యేదియును లేదు. వేదములు, షట్ శాస్త్ర ములుకూడ యీ విషయమున ఓడిపోయినవి. ఓ అర్జునా, గొప్పగొప్ప తపస్సులవలనకూడ ఎవరును నాయీ విశ్వరూప మార్గమునకు చేరజాలరు.

మరియు దానాదిపుణ్య కర్మలవలనకూడ యీ మార్గము వరకు చేరుటకు శక్యముకాదు. నీవు నన్ను గురించి యీ సమయమున కలిగిన జ్ఞానము యజ్ఞవిధానాదుల వలనకూడ ఎవనికిని సహజముగ ప్రాప్తించదు. నీకు నేను లభించిన రీతిని, లభించుటకొక్కటే మార్గమున్నది. ఆ మార్గమేదో చెప్పెదను వినుము. అంతఃకరణము ప్రేమపూర్ణమగు భక్త్యధీనమైనప్పుడే నేనీ విధమున సాధ్యుడనగుదును.

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥54॥

ఆ భక్తి యేవిధముగ నుండవలెనో వినుము: వర్షపుచినుకు భూమిపైన తప్ప మరెచ్చటను పడజాలనిరీతిని, లేదా నీటినంతను గొనిపోయి మార్గమునం దెచ్చటను ఆగక నదులు సముద్రమును వెదుకుకొనుచూ సముద్రమున పోయి కలియురీతిని, భక్తుడుకూడ తన భావనల నన్నిటిని ఏకత్రితముచేసి ప్రేమతో నిండియున్నవాడై నావైపునకు రావలెను మరియు నాలో కలసి నాతో సమరసత్వమును పొందవలెను—నాతో కలసి ఐక్యము పొందవలెను. మరియు భక్తుడు 'నేను' అనెడి స్వరూపమున కలసి ఐక్యమునొందవలెను; ఆ 'నేను' క్షీరసాగరము ఒడ్డునను, మధ్యను ఎచ్చటచూచినను క్షీరమేవుండు రీతిగా నుండును. మానవుడు చిన్నదగు చీమనుకూడ 'నేనే' అని తలంచవలెను, మరియు స్థావర జంగమముల నన్నిటిని కూడ నాకు భిన్నమైనవిగా తలంచకుండుటయే నిజమగు భక్తియగును. ఇంతకుమించి మరేవిధమగునట్టివి నిజమగు భక్తికాదు. ఈ విధమగు ఐక్యావస్థ లభించినప్పుడు నా స్వరూపమును గురించిన సరియగు జ్ఞానముకలుగును. ఈ రీతిని స్వరూపజ్ఞానము కలుగుటతోడనే ఆతనికి స్వాభావికరూపమున నా దర్శనముకూడ నగును. కొయ్యయందగ్ని మండురీతిని, అటుల మండినపిదప కొయ్యయొక్క నామరూపము లేమాత్రము మిగిలియుండనిరీతిని, అది అగ్నిరూపమునే పొందురీతిని, లేదా ప్రకాశావిర్భావము కానంతవరకు ఆకాశమంతయు అంధకారమయముగనుండి సూర్యోదయము కాగానే నలువైపుల ప్రకాశము వచ్చురీతిని—నా స్వరూప సాక్షాత్కారము కలుగుటతోడనే అహంకారమంతమొందును. మరియు అహంకారము అంతమొందుటతోడనే ద్వైతభావముకూడ తనంతతాను

నాశనమొందును. అంత 'నేను'—'వాడు' అనునవి రెండును స్వాభావిక ముగనే కలసి 'నేనే' అగును, మరియు ఆభక్తుడు నాలోకలసి ఏకరూపుడగును.

మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః
నిర్వైర స్సర్వ భూతేషు యస్సమామేతి పాణ్డవ ॥౫౫॥

"ఎవడు కేవలము నా ప్రీతికొరకై యే సమస్త కర్మలనుఆచరించునో, ఎవనికి సంసారమున నేను తప్ప మరేదియూ నచ్చదో, మరియు ఎవనికి ఇహ పర లోకములు రెండునూ నేనేఅ యియున్నానో, మరియు ఎవని జీవిత మును సార్థకమొనర్చువాడను నేనే అయియున్నానో, ఎవడు 'భూత' శబ్ద మునే పూర్తిగా మరచిపోవునో—ఏలనన, ఆతని దృష్టియందంతటను నేనే నిండియుండును - మరియు యీ విధమున, ఎవడు తన మనస్సున వైరభావ మున కే మాత్రమును తావివ్వక అందరిని సమ బుద్ధితో చూచునో, అట్టి భక్తుని కఫ - పిత్త - వాతాత్మక మగు త్రిధాతువులతోకూడియున్న యీ జడ శరీరము నశించినప్పుడు, ఓ అర్జునా, ఆ భక్తుడు నా స్వరూపముతో కలసి ఐక్యమొందును".

ఇంతవరకు చెప్పి సంజయుడు ధృతరాష్ట్రరాజుతో నిటులనెను— "ఎవని ఉదరము యీ బ్రహ్మాండమంతయు పట్టునంత పెద్దదియో మరియు ఎవడు దయారసముచే నిండియున్నాడో, ఆ శ్రీకృష్ణదేవు డర్జునునితో యీ విషయములన్నిటిని చెప్పెను. అటుపైని అర్జునున కత్యధికమగు ఆనందము కలిగెను. శ్రీ కృష్ణునికి నిజమగు భక్తియొనర్చు యోగ్యత యీ జగత్తునందు కేవల మర్జుననియందే గలదు. అతడు భగవానుని ఉభయమూర్తులను చక్కగా చూచెను. మరియు అతనికి విశ్వరూపముకంటె కృష్ణమూర్తియే ఎక్కువ ప్రియముగనుండెను. కాని, దేవుడు ఆతని యీ ప్రేమనుగాని, ప్రియత్వమునుగాని ఆదరించలేదు. ఏలనన, విశ్వరూపము వ్యాపకమైనది, మరియు కృష్ణమూర్తి ఏకదేశీయుడు, అన, దిక్కు, కాలము మొదలగువానిచే పరిమితు లేర్పరుపబడినవాడు. దీనిని రుజువుచేయుటకై శ్రీకృష్ణుడొకటి రెండు చక్కని ఉదాహరణముల నిచ్చి యీ విషయమును నిరూపించెను. ఆ వివరణమును విని సుభద్రాపతియగు అర్జునుడు తన మనసునం దిటులనుకొనెను

—"ఈ రెండు రూపములందును అత్యుత్తమ స్వరూపమేది – యని మరల నడుగుదునా?" ఇటుల మనమున్న వేళల, అతడేదేని యుక్తాయుక్తముగ ప్రశ్నించెనో, రానున్న అధ్యాయమున వినుడు. సాధారణ ఛాందస్సులో నేసిన కథ నతి ప్రేమతో చెప్పెదను. మరియు 'మీ కీ కథను ప్రేమతో వినవలసినదని' జ్ఞానదేవుడ నగు నేను ప్రార్థించుచున్నాను. ప్రేమాంజలిలో నేనీ పంక్తులనెడి పుష్పములను గైకొని ప్రభువుయొక్క విశ్వరూపపు చరణ ద్వయముపై అర్పింతును.



# తెలుగు జ్ఞానేశ్వరి

## పంద్రెండవ అధ్యాయము

ఓ సద్గురు కృపాదృష్టీ, నీవు శుద్ధము, సుప్రసిద్ధము, ఉదారము మరియు అఖండానందమును వర్షింపజేయునట్టి దానివి. నేను నీకు నమస్కరించు చున్నాను. విశ్వరూపమనెడి సర్పము కాటందిన పిదప అవయవములు నిర్జీవములు కాకుండుటకును, మరియు విషవేగమును తగ్గించుటకును కావలసిన శక్తి నీయందున్నది. ఇప్పుడిక నీ అనుగ్రహమనెడి రసతరంగములు బయలుదేరి ప్రవహింప సాగుచో, యిక సంతాప మెవరిని సంతప్త మొనర్పగలదు మరియు శోక మెవరిని దహించగలదు! ఓ గురుకృపాదృష్టీ. నీవు అత్యంత ప్రేమ పరిపూర్ణురాలవగుటచే తన సేవకులకుగల బ్రహ్మానందమనెడి వాంఛ నెరవేరును మరియు వారి ఆత్మసాక్షాత్కార వాంఛలుకూడ నెరవేరును. మూలాధార చక్రరూపమునగల శక్తి యొడిలో ఆ శిష్యబాలుర నుంచుకొని వారిని నీవు ప్రేమతో బుజ్జగింతువు, మరియు హృదయాకాశమనెడి ఉయ్యాలలో వారినుంచి ఆత్మజ్ఞానమనెడి ఊపుల నూపెదవు. నీవు వారికిగల జీవాత్మ భావమును వారిపైనుంచి తొలగించి మనస్సు మరియు ప్రాణవాయువులను వారికి ఆడుకొనుటకై యిచ్చెదవు మరియు వారి అవయవములపై ఆత్మానంద మనెడి ఆభూషణములను ధరింప జేతువు. పదునేడవదగు పూర్ణామృత కళ యనెడి దుగ్ధమును వారికి నీవు పట్టెదవు. వారి వినోదార్థమై నీవు అనాహతనాద ఘోషమనెడి పాటలు పాడెదవు. మరియు వారిని సమాధి సుఖముచే శాంతుల నొనర్చి నిద్రబుత్తువు. ఇందుచే సాధక జనులందరి సంగోపనము నొనర్చు మాతవునీవే. నీ చరణముల నుండియే కవిత్వకళ జన్మించును. కావున నేను నీశీతలచ్ఛాయ నెన్నడును విడువను. ఓ సద్గురుకృపాదృష్టీ, నీదయామృతము లభించినవాడు సమస్త విద్యల నిష్పత్తి యొనర్చుటయందును బ్రహ్మయే యగును. కాన ఓ తల్లివగు గురు కృపాదృష్టీ, నీవు వైభవశాలివి, మరియు నీసేవకుల వాంఛలను నెరవేర్చు కల్పలతవు. అయినప్పటికిని, నీవు నాకు గ్రంథ నిరూపణ మొనర్చుటకు ఆజ్ఞా

పించుము. ఓ మాతా, నీవు నాద్వారా యీ నిరూపణమునందు నవరస సాగరములను నింపించుము. ఉత్తమ సిద్ధాంతరత్నములను తయారు చేయించుము, మరియు భగవంతుని నిజార్థమనెడి పర్వతము నెత్తనిమ్ము. ఈ దేశభాషా ప్రదేశము వాఙ్మయ సౌందర్య సహిత నిర్మింపబడనిమ్ము, మరియు నలువైపుల వివేకమనెడి లతలను నాటుకొననిమ్ము. ఇట్టి మహాసిద్ధాంత వృక్షముల గొప్పవి, నిండియున్న నీడగు తోటను నిర్మింపనిమ్ము, అందు ఏకవాక్యమనెడి ఫలములు సమృద్ధిగా నుండనిమ్ము. నాస్తికుల గుహలు, వితండవాదుల వక్రమార్గములు మరియు కుతర్కికుల హింసక శ్వాపదములను పూర్తిగా నాశనము కానిమ్ము. నీవు నాకు 'శ్రీకృష్ణుని గుణములను సదా వర్ణించగలుగునట్టిదియూ, శ్రోతలకు నాద శ్రవణానంద సామ్రాజ్యము లభించునట్టిదియూ నగు సామర్థ్యమును ప్రసాదించుము. ఈ దేశ భాషానగరము బ్రహ్మవిద్యచే పూర్తిగా నిండివైచి, ప్రజలు యీ విద్యను యథేచ్ఛగా గైకొననిమ్ము. ఓ సద్గురుకృపాదృష్టీ, నీవు నాపై నీ ప్రేమపూర్ణమగు కొలనును నిండగా బట్టి, నా అదృష్టమున యీ భాగ్యమనుభవించు రేఖ యున్నచో, ఓ మాతా, నేను దీనినంతను యీక్షణమునకే నిర్మించగలుగుదును. నాయొక్క యీ ప్రార్థనను విని నివృత్తినాథుడు నావైపు ప్రసన్నదృష్టితో చూచి యిటుల చెప్పెను—"ఇక గీతార్థ నిరూపణమును ప్రారంభించుము, ప్రస్తావనను యింకను విస్తరించ వలసిన పనిలేదు." అందుపై శిష్యునకు స్వాభావికముగనే అత్యధికానందము కలిగి యిటులనెను—"ఓ స్వామీ, అటులే యొనర్తును; ఇది మీ మహాప్రసాదము"— అంత నాతడు శ్రోతలతో నిటులనెను—"ఇక గ్రంథ నిరూపణమొనర్తును, మీరు శ్రద్ధతో వినగోరెదను."

అర్జున ఉవాచ—

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే
యేచాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥౧॥

అటుపైని వీరులందరియందును శ్రేష్ఠుడును, సోమవంశ విజయ - పతాకయూ, పాండునందనుడును నగు అర్జునుడు శ్రీకృష్ణునితో నిటులనెను— "ఓ దేవా, మీరు నా మాటను వింటిరిగదా? మీరు నాకు చూపించిన విశ్వరూపము అత్యద్భుతమైనది; ఇందువలననే నా మనస్సు మిక్కుటముగ

వ్యాకులతను పొందినది. నేను నీ సుందర కృష్ణమూర్తి నెల్లప్పుడు ఎరుగుదును, అందుచే యీ రూపమునే ఆధార మొనర్చుకొనుటకు నా మనస్సు వాంఛించు చుండెను. కాని మీరు నన్నిట్టుల చేయవలదని నిషేధించిరి. కాని వ్యక్తము మరియు అవ్యక్తము (సగుణము, నిర్గుణము) ననెడి రెండునూ మీరూపములే. భక్తివలన సగుణరూపసాధన మొనర్పబడును మరియు యోగమువలన నిర్గుణ రూపసాధన మొనర్పబడును. ఓ వైకుంఠాధిపతీ, యీ రెండుమార్గములు మాత్రమే మీవద్దకు చేర్చునవై యున్నవి. సగుణ నిర్గుణములు యీ మార్గములకు గుమ్మములు. మచ్చురాతిపై నిండు కానుయొక్క వన్నె చూచుటచే ఏ వన్నెకు వచ్చునో, ఆ కానునందలి చిన్న బంగారుతునకను గీసినప్పటికిని అదే వన్నెకు వచ్చును. కాన, ఏక-దేశీయమగు సగుణము మరియు సర్వవ్యాపకమగు నిర్గుణము - యీ రెంటి యోగ్యతయు సమానమే. అమృతసాగరమున ఎంతటి సామర్థ్యముగలదో, అందేసామర్థ్యము ఆ సాగరమునుంచి తీసికొనిన ఒక దోసెడు అమృతమునందును వుండును. ఓ మహారాజా, నాకిప్పుడీ విధమగు నిశ్చితజ్ఞానముకలిగినది. కాని యోగీశ్వరుడవగు ఓ దేవా, యింతకు ముందు కొద్ది సమయమువరకు తాము ధరించిన విశ్వవ్యాపకస్వరూపము వాస్తవమైనదా, లేక కల్పితమైనదా యని మిమ్ము డుగవలెనని నాకు కోరిక గలదు. ఒకరు భక్తియోగులు, వారు తమ సమస్తకర్మలను మీ ప్రీత్యర్థమై చేతురు, కేవలము మిమ్మే సర్వశ్రేష్ఠునిగ తలంతురు, తమ మనోధర్మముల నన్నింటిని మీ భక్తిచే కూడియున్న వానినిగ నొనర్చుకొందురు, మరియు అన్ని విధములను మిమ్ము తమ హృదయమునం దుంచుకొని ఉపాసింతురు. రెండవ వారు జ్ఞానయోగులు, వీరు ఆత్మైక్యభావముతో, ఓంకారమునకు కూడభిన్న మయినవియు, సాటిలేనట్టియు, అవినాశి, నిర్గుణము, అవర్ణనీయము, స్థలహీన మయినదియు నగు వస్తువును ఉపాసింతురు. ఓ అనంతప్రభో, ఆ భక్తియోగు లందును, యీ జ్ఞానయోగులందును వాస్తవిక జ్ఞానమెవరికి లభించునో దయతో నాకు చెప్పగోరెదను." అర్జునుని యీ మాటలను వినుటచే భగవానునకు సంతోషము కలిగి యిట్టుల చెప్పెను—"ఓ అర్జునా, నీకు ఏవిధముగ ప్రశ్నించవలెనో చక్కగా తెలియును.

శ్రీ భగవానువాచ—

మయ్యావేశ్య మనోయేమాం నిత్యయుక్తాఉపాసతే.

శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః ॥౨॥

"మంచిది వినుము : పశ్చిమదిక్కున అస్తాచలముకడకు చేరినపిమ్మట మరియు సూర్యుడు చాటున నున్నప్పటికిని, ఆ అదృశ్యబింబము వెనుకకూడ సూర్యకిరణములు సంచరించుచునే యుండును. లేదా ఓ పార్థా, వర్షఋతువు వచ్చినపిమ్మట నదీజలము వృద్ధి కాసాగును. అదేవిధమున, మానవుడు సాధన చేయునప్పుడు అతని శ్రద్ధకూడ దిన దినాభివృద్ధి గాంచుచుండును. నది సముద్రము వద్దకు చేరినప్పుడుకూడ దానివెనుకనుండు ప్రవాహవేగము యథా ప్రకారముగ ఎడతెగక యుండును. ఈ నదీప్రవాహ విధమువలెనే ప్రేమ భావముకూడ నుండును. ఇదేవిధమున, ఎవడు తన ఇంద్రియములన్నింటి తోడను తన మనోభావమును నాకర్పించి, రాత్రింబవళ్లు, సమయాసమయము లనెడి యోచన ఏ మాత్రమును లేకుండా ఎల్లప్పుడు నన్నుపాసించుచుండునో, మరియు యీ విధమున ఏ భక్తుడు తన సర్వస్వమును సమర్పించునో, అతనినే నేను పరమయోగ యుక్తునిగ, లేక యోగి శ్రేష్ఠునిగ తలంచెదను.

యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగమచింత్యంచ కూటస్థమచలం ధ్రువమ్ ॥౩॥

సంనియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః ॥౪॥

"ఓ అర్జునా, ఇతర యితరులను ఆత్మసాక్షాత్కారమును పొందువారు నిర్గుణ అవినాశి తత్త్వమును చూతురు. ఎవనికడకు మనస్సెన్నడును చేరజాలదో, మరియు ఎవనియందు బుద్ధికిరణముకూడ ప్రవేశించజాలదో, అతనిగురించి యింద్రియములతో ఏ రీతిని సాధన మొనర్పనగును ? కేవల మింతేకాదు, అతడు ధ్యానమునకు కూడ లభింపడు, మరియు యిందువలన అతడే ఒక్క ప్రదేశమందును లభించజాలడు. మరియు ఏ ఆకారమునందును నుండనేరడు. ఎవడు అన్ని ప్రదేశములందును, అన్ని భావములందును, అన్ని కాలములందును వుండునో, కాని, ఎవనినిగురించి యోచించుచూ యోచించుచూ నుండగా చింతనాశక్తికూడ చింతితము కాసాగునో, ఎవనిని గురించి 'అతడుండును, అతడుండడు' అని ఏదిచెప్పుటకును వలనుపడదో,

మరియు యిందువలననే ఎవనిని గురించి సాధనచేయుటకు ఏ ఉపాయమును లేదో, ఎవడు చలనము లేనివాడో, ఎవడు కదలికకూడ లేనివాడో, ఎవడెన్నడును సమాప్తముకాడో, మరియు ఎన్నడును దూషితుడుగాడో, అట్టివానినెవరు స్వయముగా తమ సామర్థ్యమువలన లభింపజేసికొందురో, ఎవరు వైరాగ్యమనెడి తీవ్రాగ్నిలో విషయసమూహములను భస్మమొనర్తురో, మరియు యింద్రియములను తత్పస్థితియందు మిక్కిలి ధైర్యముతో నియమించి యుంతురో, మరియు ఆపైన, ఇంద్రియ సంయమ మనెడి బలముపై నెవరు తమ యింద్రియములను మరల్చి తమ హృదయగుహయందు బంధించి యుంతురో, తనయందలి ద్వారములను చక్కగా బంధించి, మరియు చక్కగా ఆసన-ముద్రను సాధనమొనర్చి మూలబంధమనెడి కోటబురుజును బంధించి వైతురో, ఎవరు ఆశతో గల సమస్త సంబంధములను త్రెంచివైచుకొందురో, సర్వవిధములగు భయమును నాశమొనర్చివైతురో, మరియు అజ్ఞాననిద్రయనెడి కాలిమను చక్కగా తొలగించి దానిని నాశమొనర్తురో, ఎవరు వజ్రాసనము అనగా మూలబంధాగ్ని జ్వాలలతో శరీరమందుండెడి సప్తధాతువులను దగ్ధమొనర్చి రోగములయొక్క మస్తకముపై షట్చక్రములనెడి ఫిరంగులను కాల్తురో, మరియు స్ఫురించెడి కుండలిని యొక్క తేజోవంతమగు దివ్వెను ఆధారచక్రముపై నుంచి దాని ప్రభావమువలన మస్తకమువరకు తన శరీరమునంతను దేదీప్యమానముగ నొనర్చుకొందురో, మరియు అంత ఇంద్రియముల నవద్వారములందును మేకులు బిగించి కేవలము సుషుమ్నానాడి యనెడి కిటికీని మాత్రమే తెరచియుంతురో, ప్రాణవాయువనెడి శక్తిరూపియగు చాముండికొరకై సంకల్పరూపియగు గొఱ్ఱెలనుకోసి మనస్సనెడి మహిషాసురుని శిరమును బలిగానిత్తురో, ఎవరు చంద్రసూర్యులు అనగా ఇడా పింగళ నాడులను ఏకీకరణమొనర్చి నాదఘోషయొక్క సహాయముచే పదునేడవదగు పూర్ణామృత కళ యనెడి జలమును శీఘ్రముగ తమ వశమొనర్చుకొందురో, మరియు అంత, మధ్యమ అనగా సుషుమ్నా నాడీ వివరమనెడి మార్గముగుండా పోయి అంతిమ బ్రహ్మరంధ్రమువరకు చేరుదురో, కేవలమింతియేగాదు, ఎవరు మకారము అనగా సుషుమ్నా వివరపు మెట్లు నెక్కి- మరియు మహదాకాశమును చంకలో అదిమిపట్టి, బ్రహ్మమునందు లీనమగుదురో, మరియు ఈ రీతిని సమబుద్ధిగలవారై ఎవరు శాశ్వతమైన బ్రహ్మ

సాక్షాత్కారమును పొందుటకై యోగమనెడి మెట్ల-పల్లములుగాగల మార్గమును తమ వశమొనర్చుకొందురో, మరియు ఎవరు తమ మనోభావమునకు బదులుగా నిర్గుణ నిరాకారమైన స్వరూప బ్రహ్మను తత్క్షణమే పొందెదరో, ఓ అర్జునా, అట్టివారు వచ్చి నాయందు కలసెదరు. వారికి యోగబలము వలన యింతకంటె మరెక్కువగా లభించునది లేదు. కాని, వారికి దీనికంటె ఎక్కువగా లభించునదొక్కటిమాత్రము గలదు, అది కేవలము కష్టము.

క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాఽఽసక్తచేతసామ్
అవ్యక్తాహి గతి ర్దుఃఖం దేహవద్భిర వాప్యతే ॥౫॥

"ఎవరు భక్తిలేకుండా సమస్తభూతములకు కళ్యాణమొనర్చు ఆ నిరాధారము, అవ్యక్తము నగు తత్త్వమును సాధన మొనర్పగోరుదురో, అట్టివారి మార్గమునందు మహేంద్రాది పదవీ వాసనలు బాధకములగును. మరియు బుద్ధి-సిద్ధులు కూడ వారి కార్యమున విఘ్నములను కలిగించును. వారి మార్గమందు కామ-క్రోధముల ఉపద్రవము లధికముగనుండును. మరియు వీటన్నింటితో పాటు వారు శూన్యబ్రహ్మ బలముపై పోరాడవలసి యుండును. వారు దప్పికతో దప్పికను తీర్చుకొనవలసి యుండును మరియు ఆకలితోనే ఆకలితో పోరాడవలసి యుండును. మరియు రాత్రింబవళ్ళు చేతులతో విసరికొనవలసి యుండును. వారు పగటియందు మేల్కొనియుండవలసిన సమయమున నిద్రించవలసి యుండును, ఇంద్రియనిగ్రహ సుఖము ననుభవించవలసియుండును మరియు వృక్షములతో సఖ్యభావము కలిగియుండవలెను, వారు శీతోష్ణములనే తమ వస్త్రములుగను మరియు దుప్పటిగను శయ్యగను చేసికొనవలసి యుండును. మరియు వర్షపు చినుకులందే తమ నివాసస్థానము ఏర్పరచుకొనవలసి యుండును. ఓ అర్జునా, ఇందలి తాత్పర్యము, యీ యోగము భర్త లేనిస్థితియందు ఎవరైన స్త్రీ చితిపై కూర్చొని సహగమన మొనర్చుటవంటిది. ఈ యోగమార్గమున ఏ ప్రభువూ ఏ పనియూ చేయనక్కరలేదు, మరియు ఏ విధమగు కులాచారమును పాటించవలసిన పనియూ లేదు. కాని, మృత్యువుతో పాటు నిరంతరము యుద్ధమొనర్పవలసి యుండును. ఈ రీతిని మరణముకంటె కూడ తీవ్రమగు యీ విషమును త్రాగుటెటుల ?

పర్వతమును మ్రింగుటకై ఎవడైన తన నోరును తెరచుచో ఆతని నోరు బ్రద్ద లవదా? కావున, యీ యోగమార్గమున నడచువారి అదృష్టమున దుఃఖములే అత్యధికముగ నుండును. ఓ అర్జునా, చూడుము ; దంతములూడిపోయి బోసి నోరైనవారు యినుపశనగలు నమలి తినవలసివచ్చుచో ఆతనిపొట్టనిండునా? లేక ప్రాణములు పోవా? కేవలము బాహుబలమువలన యీది సముద్రము నెవ్వడైన దాటగలుగునా? ఆకాశమున ఎవడైన కాళ్ళతో నడువగలడా? రణరంగమున దుమికిన పిరికి శరీరముపై ఒక శస్త్రదెబ్బయైన పడకుండా సూర్యలోకపు మెట్లెక్కుట కెవనికైన సాధ్యమగునా? కాన ఓ అర్జునా, కుంటివాడు వాయుదేవునితో పోటీచేయుటకు అయోగ్యుడగురీతిని, నిర్గుణో పాసనకై శరీరధారులు ప్రయత్నించుట ఉచితముకాదు. కాని, అయినప్ప టికిని, యింత అనుచిత సాహసము, ధృష్టత గలిగినవారై శూన్యమును పొం దుటకు సంసిద్ధులగువారు అత్యధికముగ క్లేశములను సహించవలసియుండును. కాని ఓ అర్జునా, భక్తిమార్గము నవలంబించు యోగులు యీ దుఃఖముల నెన్నటికిని అనుభవించనక్కరలేదు.

యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥౬॥

"తమ వర్ణభేదము ననుసరించి తమ వంతుకు వచ్చిన కర్మలనన్నిం టిని ఎవరు తమ కర్మేంద్రియముల ద్వారా సుఖపూర్వకముగ నొనర్చు చుందురో, సమస్త శాస్త్రోక్తకర్మల నొనర్చుచుందురో, మరియు నిషిద్ధ కర్మలను పరిత్యజించుచుందురో, మరియు సమస్త విధములగు కర్మ లను నాకు అర్పించి వాటి బంధకగుణములను నాశమొనర్చుకొందురో, మరియు యీ రీతిని ఓ అర్జునా, సమస్తకర్మలను నాయందు సమాప్తమొం దింపజేసి వాటిని నాశమొనర్తురో, మరియు శరీరము, వాక్కు మనస్సులతో కూడియున్న మరి ఏ యే ప్రవృత్తులు గలవో వాటినిగూడ నాలోనికి తప్ప మరెచ్చటకును పోనివ్వరో, మరియు యీ విధమున ఎవరు నా అఖండో పాసన మొనర్తురో, ఎవరు ధ్యానము మూలమున నానిరంతర నివాసస్థానముగ నగుదురో, ఎవరు తమ ప్రేమపూర్ణగుణముతో కేవలము నాతోనే వ్యవహ రింతురో మరియు విషయభోగములు మరియు మోక్షపదవి యను ఈ రెంటి

యొక్క దుర్బలము, దరిద్రము నగు కులమును విడచినవైతురో, మఱియు యీ రీతిని ఏక నిష్ఠతో కూడియున్న భక్తియోగముచే ఎవరు తమ సమస్త మనో భావములు, అంతఃకరణము మరియు శరీరములను కేవలము నా అధీనమే యొనర్తురో అట్టివారిని గురించి నే నెంతవఱకని వర్ణించను! వారి కోరికల నన్నింటిని నేను నెరవేర్పవలసి యున్నది.

తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్
భవామి న చిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్ ॥2॥

“ఓ అర్జునా, సంక్షేపముగ నీ విది తెలిసికొనుము—తల్లి గర్భము లోనికి వచ్చినవాడు తల్లికెంత ప్రియముగ నుండును! ఇదేవిధమున, ఆభక్తులు కూడ ఏ విధముగ నున్నప్పటికిని నాకు ప్రియమైన వా రగుదురు. కలికాల మందలి విఘ్నబాధల నన్నింటిని వారికి దూరముగనుంచి వారిని రక్షించుటకై నేను పట్టావ్రాసియిచ్చితిననుకొనుము. ఇటుల కానిచో, ఒకవైపు నాభక్తి, రెండవవైపు సంసారచింత; ఇదెంత విలక్షణము, అసంబద్ధమూ నగు ఊహ! సంపన్నుని భార్యకూడ ఎన్నడైన పంచపచికిని అన్నముకై యెవరినైన యాచించగలదా? ఇదేవిధమున నా భక్తుడుకూడ నాకు ప్రేమపాత్రుడగును. అప్పుడాతనిలోటు, నాలోటు కాదా? జనన-మరణములనెడి తరంగములు వృష్టియందంతటను సంభవించును. ఇది చూచి, నా మనస్సున ‘ఈ సంసార సాగర తరంగ దుఃఖము ననుభవించనివాడెవడు?’ యని తలంపుకలిగినది. ఇట్టి స్థితిలో, నా భక్తులుకూడ భయపడుట సంభవమే. అందుచే ఓఅర్జునా, నేను రామకృష్ణాదిరూపములలో సగుణరూపధారినై వారివద్దకు పరుగిడి వత్తును. నా రామకృష్ణాది వేలకొలది నామములను నీవు వేలకొలది నావలుగా నెరుంగుము. ఈ నౌకలను యీ సంసారసాగరమునం దమర్చి నేను నా భక్తులయెడ తారకుడనైతిని. ఇక, సంగహీనులు, అందరికిని భిన్నముగనుండు నా భక్తులకొరకై నేను నా ధ్యానమనెడి ఆధారమును కలుగజేసితిని. మరియు సంసారులు లేక గృహస్థులైన వారిని నే నీ నౌకలందు కూర్చుండజేసితిని. కొందరు భక్తుల పొట్టక్రింద ప్రేమయనెడి పెట్టెను కట్టితిని. ఈ రీతిని నా భక్తులందరిని నేను ఆత్మైక్యమనెడి రేవువద్దకు తీసికొనివచ్చి యుంచితిని. కేవలమింతియే కాదు, యెవరెవరు నన్ను భజించిరో, వారినందరిని, అధి

చతుష్పాదులే కానిమ్ము, పశువులే కానిమ్ము. నా భక్తులుగా నంగీకరించి వారిని వైకుంఠ సామ్రాజ్యమునకు అధిపతులుగా నొనర్చితిని. ఇందుచే నా భక్తుల కేవిధ మగు చింతయు కష్టమును కలిగించను. మరియు వారిని తరింపజేయుటకై నే నెల్లప్పుడు సిద్ధముగ నుందును. భక్తులు తమ చిత్తవృత్తిని నా కర్పించుట తోడనే, వారు తమ జగన్నాటకమున నన్నుకూడ తమ సహచరునిగా నొనర్చుకొని కలసికొందురు. ఇందుచే ఓ అర్జునా, నీవు నిరంతరము 'జీవుడెప్పు డీ అనన్య భక్తిమార్గమును గ్రహించునో, అప్పుడే వాడు శ్రేష్ఠుడగు భక్తుడై పోవు' ననెడి మంత్రపాఠము నొనర్చుచుండుము.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥౮॥

"బుద్ధిచే నిశ్చయమొనర్చుకొని మనోవృత్తుల నన్నింటిని నా స్వరూపమున స్థిరముగా నుంచుము. ఓ అర్జునా, బుద్ధి, మనస్సు లనెడి రెండును ప్రేమపూర్వకముగ పూర్తిగా నా యందు రమించసాగినప్పుడు నీవువచ్చి నాలో కలసిపోదువు. ఏలనన, మనోబుద్ధులు రెండునూ నా స్వరూపమున స్థిరపడి విహరించసాగునప్పుడు, యిక 'నేను', 'నీవు' అనెడి భేద మెచ్చట మిగిలియుండును ? గాలిచే విసరుటచే దీపమారిపోవురీతిని మరియు దాని తేజము లేకుండాపోవురీతిని, లేదా జీవుడు పైవైపుకు పోసాగినప్పుడాతని యింద్రియములుకూడ శరీరమును విడచిపెట్టురీతిని, మనోబుద్ధులతో పాటు అహంకారముకూడ తనంతతానే నా వైపు రాసాగును. ఇందుచే, నీవు నీ మనోబుద్ధులను నా స్వరూపమున ప్రవేశపెట్టి వాటినచ్చటనే స్థిరముగ నుంచుము : అప్పుడు దీనిసహాయమువలన నీవు నా సర్వవ్యాపక స్వరూపమును పొందెదవు. నేను స్వయముగ నాపై ఒట్టుపెట్టుకొని 'యీ సిద్ధాంతమునం దే విధమగు అపవాదమును లేదని' నీతో చెప్పుచున్నాను.

అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరమ్
అభ్యాస యోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనఞ్జయ ॥౯॥

"మనోబుద్ధి సమేతముగ నీవు నీ చిత్తమును పూర్తిగా నా అధీన

మొనర్పజాలకున్నచో మరొక విధముగ చేయుము. రాత్రింబవళ్ళందలి ఎని మిదిఝాములందును కనీసము ఏకాద్దిసేపైన మనోబుద్ధులతో నీ చిత్తమును నా కర్పించుచుండుము. అటుపైని, ఏ సమయములందు నా సుఖానుభవము నీకు లభించగలదో, కనీసము ఆ సమయములందైన నీ మనస్సున విషయ విరాగము కలుగును. మరియు, అప్పుడు శరత్కాలము వచ్చినపిదప నదులు క్రమక్రమముగ తగ్గిపోవు రీతిని నీచిత్తముకూడ క్రమక్రమముగ ప్రపంచవేగము నుండి బయటకు పోసాగును! ఇటుల జరిగినపిమ్మట, పూర్ణిమనుండి చంద్ర బింబము దినదినము క్షీణించుచూ అంతమున అమావాస్యనాడు పూర్తిగా కని పించనిరీతిని, విషయభోగములనుంచి తప్పించుకొనుచూ నా స్వరూపమున ప్రవేసించుచూవుండగా ఓ అర్జునా, నీ చిత్తము క్రమక్రమముగ నా స్వరూ పముతో సమానమగును. అభ్యాసయోగమని చెప్పబడున దిదియే. ఈ సంసార మున, యీ అభ్యాసయోగముచే సాధింపరాని దేదియూలేదు. ఈ అభ్యా సమువలననే కొందరు గాలిలో నడువగలుగుచున్నారు, కొందరు పులులను సర్పములను తమ వశమొనర్చుకొనుచున్నారు, కొందరు విషమును జీర్ణ మొనర్చుకొనుచున్నారు, మరికొందరు సముద్రముపై కాళ్ళతో నడువసాగు చున్నారు. ఈ అభ్యాసబలము వలననే కొందరు వేదవిద్యాపారంగతులైరి. కావున, అభ్యాససాధనచే లభించని దేదియూలేదు. కావున, నీవు అభ్యాస యోగమువలననే నన్ను పొందుము!

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మ పరమోభవ
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి ॥౧౦॥

"ఈ విధమగు అభ్యాసమొనర్చెడి సామర్థ్యముకూడా నీయందు లేకున్నచో, నీవు ఏ ప్రదేశమున ఏవిధముగ నుంటివో, ఆ ప్రదేశమున అదే విధముగనుండుము. ఇంద్రియముల నడ్డగించకుము, భోగములను విడువకుము, నీ జాత్యభిమానమును కూడ విడువకుము. కులాచారమును పాటించుచుం డుము, విధి-నిషేధములను గురించి శ్రద్ధవహించుము. ఈ విధముగ ఆచరించ మని నీకు బహిరంగముగ ఆజ్ఞాపింపబడుచున్నది. కాని, మనస్సు వాక్కు- శరీరములచే ఏ ఏ కర్మలు జరుగునో వాటిని గురించి 'నేనే నీ కర్మలను చేసి తిన'ని ఎన్నడును చెప్పకుము. చేయుట, చేయకుండుటలు - వీటినిగురించి

ఏకమాత్రుడగు విశ్వమును నడపెడి పరమాత్మయే యెరుంగును. నీ మనస్సు నం దెన్నడును 'యీ కర్మ న్యూనమైనది, యీ కర్మ పూర్ణమైనది' అనెడి యోచన చేయకుము. మరియు నీ మనోభావమును స్వయముగ నీ ఆత్మతో ఏకరూపముగ నొనర్చి, నీ జీవిత కార్యముల నన్నింటిని చేయుము. తోట మాలి నీటిని ఏ వైపుకు తీసికొనిపోవునో ఆ వైపునకే నీరు మెదలకుండ పోవును. అదేరీతిని నీవుకూడ నీ కర్తృత్వాభిమానమును విడచి శాంతముగ నుండుము. అన, ప్రవృత్తి నివృత్తులనెడి బరువును నీ చిత్తముపై పెట్టుకొనకుము. నీ చిత్తవృత్తిని నిరంతరము నాయందే స్థిరముగనుంచుము, ఓఅర్జునా రథమెన్నడైన యీ దారి తిన్ననైనది, యీదారి వంకరటింకర యైనదని యోచించునా? ఇదేవిధమున, నిన్ను నీవు దూరముగ నుంచుకొని, నీవలన జరుగుచుండు కర్మలను వేటినీ 'యివి న్యూనమైనవి, యివి అధికమైనవి' అని ఎన్నడును అనుకొనకుము, మరియు శాంతిపూర్వకముగ ఆ కర్మల నన్నిటిని నా కర్పించుచుండుము. ఓ అర్జునా, యీ విధమైనదిగా నీ భావన యున్నప్పుడు, శరీరపాతము కాగానే నీవు నన్ను పొందుదువు.

అథైత దప్యశక్తో౽సి కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥౧౧॥

"మరియు ఓ అర్జునా, యీ కర్మ సమర్పణమునుకూడ నీవు చేయజాలవేని, నీవు నా భక్తినొనర్చుము. కర్మను ఆరంభించునప్పుడును అంతమునందును నీ బుద్ధి యంతటితోను నన్ను స్మరించుట నీకు కఠినముగాతోచుచో దానిని కూడ వదలుము. నన్ను ధ్యానించకున్నప్పటికిని అడ్డంకులేదు. కాని ఇంద్రియనిగ్రహము విషయమునమాత్రము నీబుద్ధి అవశ్యము జాగరూకతగలదై యుండవలెను. అప్పుడు, ఎప్పుడే కర్మ నీచే జరుగునో అప్పుడు నీ వా కర్మఫలముల నన్నింటిని త్యాగమొనర్చుకొనుచు పొమ్ము. వృక్షములుగాని తీగలుగాని అంతమున తమ ఫలములను క్రింద రాల్చువిధమున నీవలన జరుపబడు కర్మఫలముల నన్నిటిని త్యాగమొనర్చుము. కేవల మింతియేగాదు, ఆ కర్మల నొనర్చునప్పుడు నన్ను స్మరించనక్కరలేదు కూడాను. మరియు వాటిని నా ప్రీత్యర్థము అర్పించవలసిన ఆవశ్యకత కూడ లేదు. నీవు ఆనందముతో ఆకర్మలను వాటి ఫలసహితముగ శూన్యమున లీనము కానిమ్ము. శాంతిపైన

వర్షించినసీరు, లేదా అగ్నిలో నాటిన విత్తులు నిష్ఫలమగు రీతిని నీవు నీ సమస్తకర్మలనుకూడ స్వప్నమువలె నిష్ఫలముగా తలంచుము. తనకుమాత్రె విషయమై ఎవడునూ ఏ విధమగు విషయవాసనయు కలిగియుండనిరీతిని, నీవుకూడ నీ సమస్తకర్మలను గురించి కూడ ఎల్లప్పుడు నిష్కామముతో నుండవలెను. అగ్నిజ్వాల ఆకాశమున ప్రవేశించి నశించురీతిని నీవుకూడ నీ సమస్త కర్మలను శూన్యమున లీనము కానిమ్ము. ఓఅర్జునా ఈ కర్మ ఫల త్యాగము చూచుటకు సుగమముగ కనిపించినప్పటికిని యిది యోగము లన్నిం టను అత్యధికముగ శ్రేష్ఠమగు యోగము. ఈ ఫలత్యాగమువలన నాశనమగు కర్మలు మరెన్నడును వృద్ధినొందవు – వాటివలన ఎన్నడును యితరకర్మ లుత్పన్నముకావు. వెదురునుండి ఒక పర్యాయము గింజలువచ్చుచో యిక ఆ వెదురు వంధ్యయగును. అంతటితో అది అంతమొందును. సరిగా యిదే విధమున ఫలత్యాగమువలన వర్తమాన శరీరము నాశమొందినప్పుడు ఆ మాన వుడు మరల ఎన్నడును శరీరమును ధరించనక్కరలేదు. కేవల మింతియే గాదు, జనన మరణ చక్రముకూడ శాశ్వతముగ ఆగిపోవును. ఓ అర్జునా, అభ్యాసమనెడి మెట్లనెక్కి జ్ఞానమును పొందనగును. మరియు జ్ఞానసాధన మైనపిదప ధ్యానమును పొందనగును. ఆపైన ధ్యానమునందు వృత్తులెల్లను రింగరింపబడును. అప్పుడు కర్మసమూహములన్నియు మనుష్యునినుండి విడిపోవును. ఈ విధమున కర్మలు తొలగిపోయినప్పుడు తనంతటతానే ఫలత్యాగము జరుగును, మరియు యీ ఫలత్యాగమువలన మానవునకు అఖండ మగు శాంతి లభించును. ఓ అర్జునా, శాంతినిపొందుట కీ మార్గమున మను ష్యుడు క్రమక్రమముగ పోయి మెట్లనుదాటుచూ ముందుకు పోగలుగును. అందుచే అభ్యాసమును అంగీకరించుటే ఉచితమగును.

శ్రేయోహిజ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మ ఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్॥ ౧౨

"ఓ అర్జునా, అభ్యాసముకంటె జ్ఞానము శ్రేష్ఠమైనది. జ్ఞానముకంటె ధ్యానము శ్రేష్ఠమైనది, ధ్యానముకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠమైనది, కర్మఫలత్యాగముకంటె శాంతిసుఖము పొందుట శ్రేష్ఠమైనది. ఈ మార్గ మున క్రమక్రమముగ ముందుకు పోయెడి పరంపర యిదియే. ఓ పార్థా, యీ

విధమున ఒక్కొక్క అడుగు ముందుకుపోవుచూ శాంతి మరియు బ్రహ్మా
నందములను పొందనగును.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ ।
నిర్మమో నిరహఙ్కారస్సమదుఃఖ సుఖఃక్షమీ॥ ౧౩॥
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పిత మనోబుద్ధి ర్యోమద్భక్తస్సమే ప్రియః॥ ౧౪॥

"ఏ మనుష్యుడు భూతకోటి పట్ల ఎన్నడును ఏవిధమగు ద్వేషమును
కలిగి యుండడో, ఎవనిని చైతన్యము వలె 'యిది నాది, యిది పరునిది'
యనెడి భేదభావ మెన్నడును స్పర్శించదో, ఎవని మనస్సున భూమాతవలె,
'ఉత్తమునకు ఆశ్రయమివ్వవలెను, నీచుని యిటులే విసరివేయవలెను'
అనెడి యోచన యే రాదో, ఎవడు ప్రాణవాయువువలె తన మనస్సున,
'రాజు శరీరమునందుందును, బీదవాని శరీరమును స్పర్శించను' అనెడి భేద
భావముగల్గియుండడో, నీరుఎన్నడును 'ఆవుయొక్క దప్పికను తీర్తును, వ్యాఘ్రము
నెడ విషముగనై దానిని చంపివేతును' అనెడి భావమెన్నడును లేక ఎవడు
ప్రాణకోటిని ఏకరూపముగ తలంచి వాటితో మైత్రి గలిగియుండునో,
మరియు సమభావముతో వారిపై కృపగలిగి యుండునో, ఎవడు 'ఇది నేను,
ఇది నాది' యను మాట నెన్నడును ఎరుగడో, ఎవనికి సుఖ – దుఃఖము
లనెడి యోచన ఎన్నడును కష్టమును కలిగించదో, ఎవనియందు సమస్త
మును ఓర్చుకొను భూమియందున్నంత ఓర్పు వుండునో, ఎవడు సంతో
షము నెల్లప్పుడు తన ఒడియం దాడించుచుండునో, ఎవడు సంతోషముతో
ఎల్లప్పుడూ, వర్షపు నీరు లేకున్నను సముద్రము పరిపూర్ణముగ నిండియున్న రీతిని
నిండి యుండునో, ఎవడు తన అంతఃకరణమును ప్రతిజ్ఞా పూర్వకముగ
వశమునందుంచుకొనునో, ఎవని నిశ్చయ మెల్లప్పుడు అఖండముగ నుండునో,
ఎవనియందు జీవుడు మరియు శివుడు—యిద్దరును పూర్ణరూపమున ఐక్యమై
ఏకత్రముగనే నివసింతురో, మరియు ఎవడీ రీతిని యోగయుక్తుడై తన మనో
బుద్ధులను పూర్ణ రూపమున నా కర్పించునో, లోపలను బయటను ఉత్తమ
మగు యోగ విధానము వలన దృఢమైన వాడగుటచే ఎవడు నా ప్రేమ

పూర్ణముగు భక్తితో రంగరింప బడునో, ఓ అర్జునా, ఆతనినే భక్తుడు, ఆత నినే యోగి, ఆతనినే ముక్తునిగా నెరుంగవలెను. భర్తకు భార్య ప్రాణము కంటెను ప్రియమగు రీతిని ఆ భక్తుడు కూడ నాకు ప్రాణముకంటె కూడ ప్రియమైన వాడు. కేవల మంత్రియేకాదు. ఆతని యెడ నాకుండు ప్రేమ ప్రాణసమానమని చెప్పుటకు కూడ చాలనట్టిది. కాని యీ ప్రేమగాథ భ్రమపెట్టెడి గారడీ ఆట వంటిది. ఈ ప్రేమగాథ వాస్తవమునకు శబ్దము లచే చెప్ప నలవి కానిది. కాని యీ కొద్ది వర్ణన కేవలము శ్రద్ధా బలము వలననే చేయబడినది. అందుచే భర్త—భార్యలయొక్క ప్రేమ ఉపమాన ముఖమునుండి వెడలినది. కాని యీ అపార ప్రేమను వాస్తవముగ వర్ణించుట కే విధముగను వలనుపడదు. కాని ఓ అర్జునా, ప్రియభక్తుని ప్రసంగము వచ్చినప్పుడెల్ల ఆతని పట్ల నా మనస్సునందుగల ప్రేమ ద్విగుణీ కృత తీవ్రతతో వృద్ధిపొంది గంతులు వేయసాగినది. అందుపై శ్రోతలు కూడ అదేవిధముగ ప్రేమపూరితులు లభించుచో, యీ విషయ మాధుర్య మును తూచనగు త్రాసెక్కడ లభించును ? కాన ఓ అర్జునా, అట్టి ప్రియ భక్తుడు మరియు ప్రేమపూర్ణుడగు శ్రోతయూ నీవేనని చెప్పుచున్నాను. అందు పై ప్రియభక్తుని వర్ణనను గురించిన ప్రసంగము కూడ సహజముగనే వచ్చినది. యిందుచే మాటలు చెప్పుచూ చెప్పుచూ నేను స్వాభావికము గనే యీ వర్ణనానందమున లీనమైతిని." అని చెప్పి వెంటనే భగవానుడు ప్రేమానందమున నోల లాడసాగెను. ఆ పైని భగవానుడు—" ఓ అర్జునా యీ విధమగు భక్తునికై నేను నా అంతఃకరణమున స్థాన మిత్తును; ఇక ఆ భక్తుని లక్షణములను వినుము.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతేచయః
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్సచమేప్రియః॥ ౧౫

అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారమ్భ పరిత్యాగీ యోమద్భక్తస్సమేప్రియః॥ ౧౬

"ఏవిధమున సముద్రగర్జనమువలన జల చరములకు భయముకలుగదో మరియు ఆవెన్నడును సముద్ర మనిన వ్యాకులతనుగాని విసుగునుగాని

చెందవో, అదేవిధమున ఎవనికి జగత్తునందలి ఉన్మత్తతవలన ఎన్నడును ఖేదము కలుగదో, మరియు ఎవనివలన జగత్తునకుకూడ ఎన్నడును ఏవిధమగు కష్టమును కలుగదో, మరియు, ఓ అర్జునా, శరీరమెన్నడును తన అవయవము లనుచూచి వ్యాకులపడనిరీతిని ఆత్మైక్య భావముతో ఎవడెన్నడును జీవ కోటిచే దుఃఖితుడుకాడో, ఎవనిమనస్సున యీ ప్రపంచమంతయు నాదే యనెడి భావముండునో, ఎవనిమనస్సున ప్రియాప్రియభేదముండదో, మరియు ద్వంద్వభావము లేనందువలన ఎవనియందు హర్షశోకములు పేరునకుగూడ లేకుండా పోవునో, యీ విధమగు ద్వంద్వబుద్ధితో కూడియున్న జంజాటము నుండి విముక్తినిపొంది ఎవడు భయోద్వేగాది వికారములకు అలిప్తుడై యుండునో, మరియు వాటితోపాటు ఎవడు నాభక్తుడుకూడా నైయుండునో, అట్టి పురుషునియెడ నామనస్సున మోహముగాని ప్రేమగాని కలుగును. ఆ మోహమును గురించి దాని ప్రేమను గురించిగాని నేనేమని వర్ణింతును! అతడు నా జీవమునకుకూడ జీవమగును. ఎవడు ఆత్మానందముచే తృప్తుడయ్యెనో, ఎవడు కేవలము స్వాభావిక పరిణామమువలన జన్మమును పొందెనో, కాని ఎవడు పూర్ణత్వమునుపొంది నాకు ప్రియుడయ్యెనో, ఓ అర్జునా, ఎవని అంతఃకరణమున వాసనలెన్నడును ప్రవేసించవో, ఎవని అస్తిత్వమువలననే సుఖాభివృద్ధియగునో, అతడే నా ప్రియభక్తుడగును. కాశీక్షేత్రము ఔదార్యముగ మోక్షప్రాప్తిని కలిగించును. కాని ఎవనికి? ఆక్షేత్రమున మరణించినవానికి మాత్రమే. హిమాలయముకూడ పాపములను నాశమొనర్చును. కాని, యీ పాపప్రక్షాళనలో ప్రాణహానికూడ కలుగును. కాని సజ్జనులందుండెడి పవిత్రత మాత్ర మిట్టిదికాదు. గంగాజలము తన పావనగుణమువలన పవిత్రమైనది. మరియు అది పాపతాపములను నాశ మొనర్చును. అయినప్పటికిని, దీనికొరకై దానిలో స్నానము చేయవలసి యున్నది. దీనియందు మునిగిపోదుమేమోయని లోకులు భీతిల్లుచుందురు. కాని యీ భక్తియనెడి నదియొక్క లోతు యింతవర కెవరికిని అంతుపట్ట కున్నప్పటికిని భక్తుడెన్నడును దీనియందు మునిగి ప్రాణములు కోల్పోవుట యనునదుండదు. అతడు మరణింపక పూర్వమే, జీవించియుండగనే అతనికి యదార్థమగు మోక్షము లభించును. ఏ మహనీయుల సంసర్గమువలన గంగకు శుచిత్వము, పావనత్వము వచ్చునో, ఆమహనీయుల శుచిత్వమెంతటి శ్రేష

మైనదై యుండవలెను? ఈరీతిని ఎవడు తన శుచిత్వమువలన తీర్థములకు కూడ ఆశ్రయుడగునో, ఎవడు తన మనోమాలిన్యమును సమస్తదిక్కులకు ఆవలిఒడ్డునకు పారద్రోలునో, ఎవడు లోపలను బయటను సూర్యునితో సమానముగ స్వచ్ఛము నిర్మలము నైనవాడో, ఎవడు తత్త్వార్థ రహస్యమును 'పాదములనంపు చూచెడి శక్తిని కలుగజేయువానికి భూమిలోపలగల ద్రవ్యములు స్పష్టముగా కనిపించురీతిని' ఎరుంగునో, అతడే నా భక్తుడు. ఆకాశము సమస్తమును వ్యాప్తమొనర్చును అయినప్పటికిని అది అన్నింటిలోను అలిప్తముగానే యుండును. సరిగా యిదేరీతిని ఎవనిమనస్సు ఎల్లప్పుడూ అంతటను వ్యాపించియున్నప్పటికిని అన్నింటిపట్లను ఉదాసీనముగ నుండునో, ఎవడు సంసారతాపములనుండి 'వేటగాని చేతులనుండి పక్షి తప్పించుకొని పోవురీతిని' తప్పించుకొనునో, మరియు ఎవడీరీతిని వైరాగ్యమునందు పూర్ణ పారంగతుడగునో, ఎల్లప్పుడు ఆత్మసుఖమున నిండియుండుటచే ఎవనికి ఏవిధమగు కష్టములు దుఃఖపెట్టవో, ఎవనిని మరణించినవారిని స్పర్శించని రీతిని లజ్జస్పర్శించదో, ఏనైన కర్మ నారంభించుటలో ఎవనిని అహంకారము ఏమాత్రముకూడ బాధించదో, కట్టెలు లభించనందువలన అగ్నియందే రీతిని శాంతి తనంతతానే వచ్చునో, మోక్షప్రాప్తికి కావలసిన అట్టి సహజశాంతి ఎవని భాగమున వచ్చిపడునో, ఓ అర్జునా, ఎవడు యీ ఉచ్ఛత్వమువరకు చేరుటకు యోగ్యమగు బ్రహ్మైక్యభావమున ఓతప్రోతముగ నిండియుండున్నాడో, మరియు ద్వైతముయొక్క ఆవలిఒడ్డువరకు చేరియున్నాడో, లేదా ముక్తిసుఖానుభవమును పొందుటకొరకై ఎవడు స్వయముగనే రెండుభాగములుగా విభక్తమైపోవునో, మరియు ఒక భాగమునందు స్వయముగ తన సేవకత్వము నుంచి, రెండవభాగమునకు 'నేను' అనగా 'దేవుడు' అనెడి పేరుపెట్టునో, మరియు ఏయోగి భక్తిలేనివారికి భక్తిపై నమ్మకము కలుగజేయునో, అట్టియోగియగు భక్తుడు నాకెక్కువ ప్రేమపాత్రుడు. నేను స్వయముగ యిట్టి భక్తులను ధ్యానించుచుందును. ఇట్టి భక్తుడు లభించగనే నాకు మిక్కుటముగ సంతోషము కలుగును. ఇట్టిభక్తుల కొరకై నేను సగుణరూపమును ధరింతును. వారికొరకే నేనీ సంసారమున సంచరింతును, మరియు వారికై నేను నా హృదయప్రాణములనుకూడ బలియొనర్తును.

యోన హృష్యతి నద్వేష్టి నశోచతి నకాఙ్క్షతి ।
శుభాఽశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్సమే ప్రియః ॥ ౧౭॥

"ఎవడు ఆత్మ స్వరూప ప్రాప్తితో సమానమైన విషయమేదియూ లేదని అంగీకరించునో, మరియు, యిందువలన ఎవనికి ఏ విధమగు విషయ భోగముల వలనను ఆనందము కలుగదో, 'నేనే యీ విశ్వమంతయూ' ననెడి జ్ఞాన మెవనికి కలుగునో, మరియు యిట్టి జ్ఞానమువలన సహజముగనే ఎవనికి భేదభావము నశించునో, 'మన వాస్తవిక తత్వము కల్పాంతమున కూడ నశించద'ని ఎవరికి పూర్తి విశ్వాసము కలుగునో, మరియు యీ విశ్వాసమువలన ఎవడు నిత్యమూ జరుగుచుండెడి విషయములకై శోకించడో, ఏ ఆత్మ స్వరూపమును మించిన వస్తువేదియూ లేదో, ఆ ఆత్మ స్వరూపము లభించుటవలన ఎవడు మరేవస్తువును వాంఛించడో, ఎవనికి మంచి—చెడ్డల భేదములు 'సూర్యునికి రాత్రింబవళ్ళనునవెన్నడును లేన నటుల' లేకుండునో, మరియు యీ విధమున ఎవడు ప్రత్యక్ష జ్ఞానస్వరూపుడగునో, మరియు వారియందు కూడ ఎవడు నా ప్రేమపూర్ణ భక్తుడగునో, అట్టి భక్తునితో సమానముగ నాకు మరేదియు ప్రియముగాదు. నేను చెప్పిన యీ విషయము లన్నియు పరిపూర్ణ సత్యములని నీపై ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను.

సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానాఽవమానయోః ।
శీతోష్ణ సుఖ దుఃఖేషు సమస్సఙ్గ వివర్జితః ॥ ౧౮॥

తుల్య నిన్దా స్తుతిర్మౌనీ సంతుష్టోయేన కే నచిత్ ।
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్ మేప్రియోనరః ॥ ౧౯॥

"ఓ అర్జునా, ఎవనియందు విషమభావము పేరునకుమాత్రమైన యుండదో, ఎవడు శత్రువులను మిత్రులను సమానముగ తలంచునో, ఎవడు దీపమువలెనుండి ఎన్నడును 'నాయింటియందలి వారికి ప్రకాశము నిత్తును, బయటివారికి చీకటినే వుంచెదను' అనెడి భావమును మనస్సున రానివ్వడో, అతడు నా పరమప్రియభక్తుడగును. ఒక్కొక్కడు గొడ్డలిపుచ్చుకొని వృక్ష

మును నరుకసాగును. మరొక్కడు విత్తులునాటి చెట్లను మొలిపించును. కాని వృక్షము ఆ యిద్దరికిని సమానముగనే తన శీతలచ్ఛాయనిచ్చును. పొలమున నీరుచల్లి చెరకు మొక్కకు నీరుపెట్టిన రైతుకుకూడ చెరకు తన మాధుర్యము నిచ్చుచున్నది. మరియు దానిని గానుగలోవైచి త్రిప్పిన వానికికూడా తన మాధుర్యము నిచ్చుచున్నది. ఇందు నీరుపోసిన వానియెడ మాధుర్యముగ నుండి, గానుగలోవైచి త్రిప్పువానియెడ చేదుగానుండు ననునదిలేదు. అది యిద్దరకును సమానముగనే తన మాధుర్యము నిచ్చుచున్నది. ఇదేవిధమున ఎవడు తన శత్రులతోడను—మిత్రులతోడను ఒకేవిధమున సమభావముతో వ్యవహరించునో, ఎవడు మానావమానములను రెంటిని సమానముగ తలంచునో, ఎవడు శీతోష్ణాది ద్వంద్వములందును ఆకాశము మూడు ఋతువు లందును సమానముగను ఏకరూపముగ నుండువిధమున, సమానముగను ఏకరూపముగను నుండునో, ఎవడు సహజభావముచే ప్రాప్తించు సుఖదుఃఖ ముల మధ్యను దక్షిణపుగాలి ఉత్తరపుగాలి యీ రెంటిమధ్యను మేరుపర్వ తము అచలముగను వికారరహితముగను నుండురీతిని' అచలుడుగను వికార రహితుడునునై యుండునో, ఎవడు భూతకోటియెడ 'చంద్రుని వెన్నెల రాజు పట్లను దరిద్రుని పట్లను—అందరియెడను సమానముగనే వ్యవహరించి వారికి ప్రియముగను మధురముగను నుండురీతిని' సమాన భావముతో వ్యవహరించునో, 'ప్రపంచమంతయు నీటిని ఏరీతిని కోరుచుండునో అదే రీతిని' ఎవనిని త్రిభువనములు కోరుచుండునో, ఎవడు లోపలను బయటను విషయాభిలాషను విడచి మరియు స్వయముగ తనలోతానే రమించుచూ ఏకాంతవాస మొనర్చుచుండునో, ఎవడు నిందను ఏమాత్రము లక్ష్య పెట్టడో, మరియు స్తుతివలనకూడ ఆనందించడో, ఎవడు 'ఆకాశము మేఘాదులతో నిర్లిప్తముగ నుండురీతిని' నిందాస్తుతులకు ఒకేస్థానమిచ్చి నిర్లిప్తుడైయుండునో, ఎవడు పట్టణమునందును నిర్జనవనము నందును సమా నముగను అచంచల వృత్తితోడను సంచరించునో, ఎవడెన్నడును అసత్య మునుగాని సత్యమునుగాని చెప్పకపోవుటేగాక ఎల్లప్పుడు మౌనముగ నుండునో, మరియు ఉన్మనీ యనెడి బ్రాహ్మీస్థితిని అనుభవించుచుండునో, మరియు ఎన్నడును దానికి విముఖుడుగాడో, ఎవడు యెల్లప్పుడు సముద్రము వలె 'వర్షముకురియకున్నప్పటికిని నిండియుండునటుల' నిండుగానుండునో,

యెవడు లాభముకలిగినప్పటికిని ఆనందముచే ఉబ్బిపోడో, మరియు హానికలిగి నప్పటికిని దుఃఖముచే దుఃఖించడో, మరియు 'వాయువు నిరంతరము ఆకాశమునందంతటను|సంచరించుచుండురీతిని' యెవడు జగత్తునంతను తన విశ్రాంతి స్థానముగ నొనర్చుకొనునో, ఎవడీవిధమగు జ్ఞానమును పొంది తనమనస్సు నెల్లప్పుడు 'యీ విశ్వమంతయూ నాయిల్లు' అని స్థిరముగ నుంచుకొనునో, అంతేగాక 'జగత్తునగల చరాచరములన్నియు నేనేయని' ఎవడెరుంగునో, మరియు తలంచుచుండునో, మరియు ఓ పార్థా, ఇట్టిస్థితికి చేరినపిమ్మటకూడ ఎవనికి నా భక్తియెడ ఆసక్తి శ్రద్ధలుండునో, అట్టివానిని నేను స్వయముగ నామస్తకముపై ముకుటమువలె ధరింతును. ఎవడైన ఉత్తముడు శ్రేష్ఠుడూ నగు వ్యక్తియందు శిరసొగ్గుటలో ఆశ్చర్యపడవలసిన విషయమేమిగలదు? కాని త్రిభువనములుగూడ ఆతని పాదతీర్థమును అత్యాదరముతో తమ మస్తకముపైనుంచుకొనును. నేను నా శ్రద్ధాశీలుడగు భక్తుని యెంత యెక్కువగా ఆదరింతునో సరిగా తెలిసికొనుటకు స్వయముగ సదాశివునివంటి సద్గురువే వుండవలెను. ఇందునుగురించి యింతమాత్రము చెప్పినచాలును. ఏలనన నేను శ్రీశంకరుని గురించి వర్ణించుచో అది నన్నునేను స్తుతించుకొనుటయే యగును. అందుచే అభిమానము చెందినటుల యగును. అందువలన రమాపతి యగు శ్రీకృష్ణుడిటుల చెప్పెను—"ఇందునుగురించి నేనింక అధికముగ వర్ణించను. కాని ఓ అర్జునా, అట్టి భక్తుని నామస్తకముపై ధరింతునని మాత్రము తప్పక చెప్పెదను.

చతుర్థ పురుషార్థమగు మోక్షము నాతడు స్వయముగ తన చేతగొని భక్తిమార్గమున ప్రవేశించును. మరియు అంత నాతడు జగత్తునకంతకు మోక్షము నివ్వసాగును. కైవల్యము నాతడు చేతియందు దిడుకొనును. మరియు మోక్షమనెడి ద్రవ్యము నాతడెటుల కోరిన అటుల తెరచును – మూసివేయును, మరియు ఎటుల కోరిన అటుల వుంచును లేక తీసికొనును. అయినప్పటికిని ఆతడు జలప్రవాహమువలె పల్లపు ప్రదేశమునే గైకొనును, మరియు ఎల్లప్పుడు నమ్రతతోనుండును. ఇందుచే నేనుకూడ యిట్టి భక్తునకు వంగి ఆతనిని ముకుటమువలె నా మస్తకముపై ధరించుచుందును. మరియు ఆతని కాలి తన్నునుకూడ నావక్షస్థలమున సహింతును. ఆతని గుణములను వర్ణించి నేను నావాణిని భూషిత మొనర్తును. మరియు ఆతని గుణశ్రవణమనెడి కుండల

ములను సాకర్ణములందు ధరింతును. ఇట్టి భక్తులను దర్శించుట కత్యధికముగ
వాంఛించుట వలననే నేను చక్షువులులేని వాడనైనప్పటికిని చక్షువులు గల
వాడనైతిని. ఈ హస్తమునకు భూషణమగు కమలముతో నేనాతనిని పూజింతును. నేను నా రెండు భుజములకు పైనను మరిరెండు భుజములను ధరించు
టకుగల కారణము—నేనిట్టి భక్తుని రెండు చేతులతోను చక్కగా ఆలింగన
మొనర్చుకొను తలంపుతోనే. ఇట్టి భక్తుని సాంగత్య సుఖమును పొందుట
కొరకే నేను దేహములేని వాడనైనప్పటికిని దేహధారినగుచున్నాను. ఇట్టి
భక్తుడు నాకెంత ప్రియమైన వాడో పోల్చి చెప్పదగిన దేదియూ లేదు—ఇక
నిట్టి భక్తునితో నేను నిర్మలమైత్రి నెరపుదుననుటలో నాశ్చర్యమేమి గలదు?
ఎవరట్టి భక్తుల చరిత్ర విందురో, లేదా వారి గుణగాన మొనర్తురో — అట్టి
వారుకూడ నాకు ప్రాణములకంటెను ఎక్కువ ప్రియమైన వారగుదు
రనుటలో సందియమేమియూ లేదు. ఓ అర్జునా, నేడు నీకు నేను భక్తియోగ
మనెడి పేర సర్వశ్రేష్ఠమగు యోగమును పూర్తిగా చెప్పితిని. ఇదే నేను
భక్తులను ప్రియులుగ తలంచునట్టిదీ, వారిని ధ్యానించునట్టిదీ, నామస్తకమున
వారిని ధరింపజేయునట్టిదీయగు యోగము.

యేతు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥౨౦॥

“ఇంత అత్యధికమగు మహాత్త్వముగల యోగము యొక్క మనో
హరము, పవిత్రము మరియు అమృత ధారతో సమానమైన మధుర విషయము
నెవరు విని దాని ననుభవింతురో, ఎవరు అతి శ్రద్ధతో యిట్టి విషయములను
వ్యాపింప జేతురో, మరియు ఎవరీ విషయమును నిరంతరము తమ హృద
యము నందుంచుకొని దీని ననుసరించి ఆచరింతురో, పైనచెప్పిన పరిపూర్ణ
మగు మనోస్థితి కలిగినపిదప సారవంతమగు భూమిలో విత్తిన విత్తులవలన
కలిగెడి ఉత్తమ ఫలము లభించినప్పటికికూడ ఎవడు నన్నత్యంత శ్రేష్ఠునిగా
తలంచునో, మరియు నాభక్తియెడ ప్రేమగలవాడై దానినే తన సర్వస్వముగ
నెంచునో, ఓ అర్జునా, యీసంసారమున ఆతడే నిజమగు భక్తుడు, మరియు
నిజమగు యోగియనని యెరుంగుము. నాకు నిరంతరము ఆతనిపై వాంఛ
యుండును. యెవరికి భక్తిసంబంధమగు కథలయెడ ప్రేమపూర్ణమగు అను

రాగము వుండునో, వారే తీర్థములు, వారే క్షేత్రములు మరియు వారే సంసార
మున వాస్తవముగ పవిత్రులు. నేను వారినే ధ్యానించుచుందును. వారే
నా దేవార్చన మరియు వారినిమించిన వస్తువు మరేద్దియు నాకు కనిపించదు.
నాకు వారినిగురించిన వ్యసనమే యుండును, మరియు వారే నా ధనాగార
ములు. ఇట్టి భక్తులు లేనిచో నామనస్సునకు తృప్తియే యుండదు. ఓ అర్జునా,
ఇట్టి ప్రియభక్తులగాథలను గాన మొనర్చువారిని నేను శ్రేష్ఠులగు దేవతలతో
సమానముగ ఆదరింతును." భక్తులకు ఆనందమిచ్చువాడును, జగత్తునకంతకు
మూలకారణుడునగు శ్రీకృష్ణ భగవానులు అర్జునునకీవిషయములు చెప్పిరి.
ఈ సంగతుల నన్నింటినిచెప్పి సంజయుడు ధృతరాష్ట్రునితో నిటులనెను—
"ఓ ధృతరాష్ట్రరాజా, ఏ భగవానుడగు కృష్ణుడు శుద్ధుడు దోషహీనుడు,
దయాళుడు, శరణాగత రక్షకుడు, మరియు రక్షకుడో, యెవడు దేవతల
కెల్లప్పుడు సహాయమొనర్చుచుండునో, లోకములను పెంచి పోషించు
చుండునో, లోకపాలన మొనర్చుటయే యెవనికి శాశ్వతముగు ఆటయో, యెవని
పవిత్రయశస్సు అతినిర్మలమో, యెవడు సరళుడు, అపారమగు ఔదార్యము
గలవాడో, యెవనిబల మపారమో, మరియు యెవడు బలిష్ఠులను తనఆజ్ఞలోనికి
తెచ్చుకొనకుండా విడువడో, యెవడు భక్తులను ప్రేమించునో, తన్ను
ప్రేమించువారిపట్ల స్నేహముతోనుండునో, సత్యపక్షము గైకొనెడి మరియు
సమస్తకళా—కౌశలమునకు ఆగారమో, అట్టి భక్తసమ్రాట్టగు వైకుంఠాధిపతి
శ్రీకృష్ణుడు స్వయముగా యీవిధముగ చెప్పుచుండెను. మరియు ఆ భాగ్య
శాలియగు అర్జును డీ మాటలనన్నిటిని వినుచుండెను. ఇక నేను రాబోవు
కథను చెప్పెదను వినుడు." ఈరీతిని సంజయుడు ధృతరాష్ట్రునితో యీ
విషయములన్నియు చెప్పెను. సంజయుడు చెప్పిన ఆ రసపూర్ణమగు కథయే
యిప్పుడు దేశభాషలో చెప్పబడును. శ్రోతలు యీకథపట్ల శ్రద్ధనుంతురు
గాక! శ్రీనివృత్తినాథుని శిష్యుడగు జ్ఞానదేవుడు శ్రోతల నిటుల ప్రార్థించు
చున్నాడు "ప్రభువగు నివృత్తిదేవులు 'మహాత్ములగు మిమ్ము సేవించవలసి
నదిగా నాకు బోధించిరి."

★

# జ్ఞానేశ్వరి

## ( భగవద్గీత )

[ 13 నుండి 18 అధ్యాయములు ]

సంత్ - శిరోమణి శ్రీ జ్ఞానేశ్వర్ విరచితము



అనువాదం:

దిగవల్లి శేషగిరిరావు



ఆధ్యాత్మిక గ్రంథమండలి

విజయవాడ - 2

# తెలుగు జ్ఞానేశ్వరి

## పదమూడవ అధ్యాయము

స్మరించినంత మాత్రముననే శిష్యునకు సమస్తవిద్యలు ప్రాప్తింప జేయునట్టి గురుచరణములకు నేను నమస్కరింతును. ఎవరిని స్మరించుటతోడనే కావ్యశక్తి లభించునో, సర్వవిధములైన రసాల వక్తృత్వములు జిహ్వాగ్రము పైకి వచ్చియుండునో, ఎవని స్మరణము వలన కలుగు వక్తృత్వ మాధుర్యము ముందు అమృతము గూడ చప్పగా తోచునో, ప్రతి అక్షరము నెదుట రసములన్నియు సేవకులవలె చేతులు జోడించి నిలచియుండునో, ఉద్దేశించిన అర్థము బోధపడునో, రహస్యము బోధపడునో మరియు ఆత్మబోధయంతయు హస్తగత మగునో అట్టి గురుచరణములు అంతఃకరణమున నిలచుటతోడనే జ్ఞానప్రకాశ వైభవము ప్రాప్తించును. అందుచే నేను ఆ గురుచరణములకు వందన మొనర్చి, జగత్పితామహుడగు బ్రహ్మకుకూడ తండ్రియైన రమా వల్లభుడగు శ్రీకృష్ణు డేమని చెప్పెనో చెప్పెదను.

శ్రీ భగవా నువాచ :—

ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్ర మిత్యభిధీయతే
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ ౧

శ్రీకృష్ణు డిటులచెప్పెను – ఓ అర్జునా, వినుము. దేహమును క్షేత్ర మందురు. ఈ క్షేత్రమును గురించిన జ్ఞానముకలవానిని 'క్షేత్రజ్ఞుడు' గా నెరుంగవలెను.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత !
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ॥ 2.

ఈ క్షేత్రమున నేనే 'క్షేత్రజ్ఞుడ' నని నీవు నిస్సందేహముగ తెలిసికొనుము. ఏలనన, నేనే సమస్త క్షేత్రములను అనగా శరీరములను పోషింతును. క్షేత్రము మరియు క్షేత్రజ్ఞుని గురించిన నిజమగు జ్ఞానమే, నా మతమునను సరించి అన్నిటికంటె ఉత్తమమైన జ్ఞానము.

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు॥ 3

"ఈ శరీరమును 'క్షేత్రము' అనుటలో గల ఉద్దేశ్యమేమో చెప్పెదను వినుము. దీనిని ఎందువలన క్షేత్రమందురు, ఇది ఎటుల ఎచట జన్మించును? మరియు ఏ ఏ వికారముల వలన నిది విస్తరించును? మూడున్నర మూరల పొడవుగల యీ అత్యల్పమైనదేనా యీ క్షేత్రము ? లేదా, యింతకంటె పెద్దదగునో ఎంతపెద్దది. ఏ ఆకారము గలది ? ఇది నిస్సారమైనదా లేక సారవంతమైనదా ? దీని ప్రభు వెవడు ? మొదలగు ప్రశ్నలన్నింటికి నేను సాంగోపాంగముగ స్పష్టీకరించెదను గాన నీవు సావధానుడవై యుండుము. ఓ అర్జునా! యీ ప్రశ్నలకు మీమాంస యొనర్చుటలో వేదములు వ్యర్థ ప్రలాపములొనర్చుచున్నవి. మరియు తర్కముయొక్క శాబ్దిక రాట్నము నిరంతరము తిరుగుచుండును. ఈ ప్రశ్నలను నిరాకరించుచూ నిరాకరించుచూ షడ్దర్శనములు అంతమొందినవి. కాని నేటివరకవి ఏకాభిప్రాయము గలవిగా కాజాలకపోయినవి. ఈ విషయములను గురించి శాస్త్రములు తమలో తాము పోట్లాడుకొనుచుండును, జగత్తునందంతటను యీ విషయములను గురించియే వాద - వివాదములు జరుగుచుండును. ఈ విషయములలో ఒకరిమాటతో మరొకరిమాట కలవదు, ఒకరి ముఖ మొకరు చూచుకొనరు. ఈ మతములలో ఒకదానికీ మరొకదానికీ సరిపడదు. ఊహాపోహలనెడి దుస్థితి ఏర్పడినది, నలువైపుల అశాంతి వ్యాపించినది. అయినప్పటికీ, యిప్పటివరకును, యీ క్షేత్ర

మునకు ప్రభువెవడో ఎవరికిని తెలియరాలేదు. కాని, అహమ్మన్యత్వ లోభము అతి ప్రబలముగ నుండుటచే యీ విషయమై ప్రతియింటను జగడములు జరుగుచున్నవి. నాస్తికుల నెదుర్కొనుటకై వేదములు మిక్కుటమగు ఆడంబరములను రచించినవి. పాషండులు వేదవిరుద్ధముగ అక్రమమైన వాచాళుత్వమును ప్రారంభించిరి.

ఈ వేదములకు ఆధారమేదియూ లేదు. యివి కల్పితమైన శబ్దజాలమును వ్యాపింప జేయుచున్నవి. మీరు మా మాటను అసత్యముగ తలంచునెడల, మే మీ విషయమును ఋజువు చేసెదమని ప్రతిన చేయుచున్నాము. సాహసమున్నచో లేచిరండు మేముకూడా చూచెదము అని పాషండులు పలుకుదురు. చాలమంది పాషండమతమున ప్రవేశించి వస్త్ర పరిత్యాగమొనర్చిరి. కాని, వారి వితండవాదము స్వయముగ తనంతతాను వారినే పరాజితుల నొనర్చుచున్నది మృత్యువునకు గల పరమ ప్రబలమైన సామర్థ్యమును చూచి యోగులు, దీని భయముచే యింకొంత ముందునకేగి యీ దేహ - క్షేత్రము మృత్యువు వచ్చినప్పుడు వ్యర్థమగునని చెప్పిరి. మృత్యువునకు వెరచెడి యీ యోగులు జన - నివాసమునకు దూరముగపోయి ఏకాంత ప్రదేశమున నివసించ సాగిరి. యమ - నియమములనెడి జగడమును తమకు తగిలించుకొనిరి. ఈ దేహ క్షేత్రము గురించి వివేచనమొనర్చుటకై శ్రీశంకరుడు శివ-లోకమును పరిత్యజించి, నలువైపులను ఉపాధులను చూచి కేవలము స్మశానమును మాత్రము ఆశ్రయముగా గొనెను. శంకరుని ప్రతిజ్ఞ మిక్కిలి ప్రబలమైనది; అందువలననే ఆతడు స్వయముగ దిగంబరుడై, లోకులను ప్రలోభనముల చేజిక్కించువాడగుటచే మన్మథుని భస్మమొనర్చివైచెను. సామర్థ్యమును పెంపొందించుటకై బ్రహ్మకు ఒకటికి మారు నాల్గుముఖములు లభించినవి; అయినప్పటికిని అతని కీవిషయమును గురించిన జ్ఞానము కలుగలేదు.

ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః ౪

ఈ దేహక్షేత్రము వాస్తవముగ చూచినచో జీవునియొక్క పొలము (క్షేత్రము) అనిన్ని, మరియు ప్రాణము (జీవుడు) యిందు వ్యవసాయము నప్పగైతు, లేక ఆసామియనిన్ని, ఈ ప్రాణియొక్క గృహమున అపాన, వ్యాన, సమాన, ఉదానములనెడి నలుగురు సోదరులు పని - పాటులు చేయుచుందురు. మరియు మనస్సు వీరందరి యందును ముఖ్యుడుగ నుండి నాగలి తోలి, విత్తులు చల్లుట మొదలగు పనులు చేయును. ఈ మనస్సునకు నాగలి దున్నుటకు ఇంద్రియములనెడి ఎడ్లుగలవు. ఈ మనస్సు, పగటిని పగలుగను, రాత్రిని రాత్రిగను తలంచకపోవుటేగాక, ప్రతిక్షణము విషయములనెడి పొలమున పని చేయుచుండును. మన స్వీకృతిని పొలమును దున్ని క్రిందిమట్టి పైకి, పైమట్టి క్రిందికిపోవునటుల చేయును. ఇటుల చేయుటవలన దానినుండి కర్తవ్యకర్మాచరణమనెడి తత్వము బయటకు వచ్చును. అంత నా ఆసామి యీ తత్వమును నాశమొనర్చి, తదితరములగు విత్తులు నాటి, కుకర్మములనెడి ఎరువును వేయును. ఆపైన ఆవిత్తులు, ఎరువుకు తగిన పాపములనెడి పంట పండును; అందువలన జీవునకు కోట్లకొలది జన్మములవరకు దుఃఖము ననుభవింపవలసి వచ్చును కాని, యిటుల చేయక, కర్తవ్యకర్మ లనెడి తత్వము స్థిరముగ నుండనిచ్చి, సత్కర్మములనెడి విత్తులు నాటునెడల, ఆజీవుడే కోట్లకొలది జన్మములవరకు సుఖము ననుభవించును—అని కొందరందురు. దీనిపై మరికొందరిటులనందురు.ఈచెప్పినది వాస్తవముగాదు.ఈదేహ–క్షేత్రము కేవలము జీవునదేనని చెప్పుటకు వలను పడదు. ఈ క్షేత్రమును గురించిన అన్నివిషయములు మనము తెలిసికొన వలసియున్నది. ఈ జీవుడు కేవలము ప్రవాసి మాత్రమే. ఈతడు ప్రయాణ మొనర్చుచూ, మార్గమధ్యమున కొంతసేపు విశ్రమించుటకై యీ క్షేత్రమందుకూడ వసించును. ప్రాణి యీ క్షేత్రాధికారి. ఆతడు ఎల్లప్పుడు మేల్కొని యుండి దీనిని కాపలా కాయుచుండును. సాంఖ్యశాస్త్రమున అనాది ప్రకృతియని చెప్పబడునట్టి దానికే వాస్తవమునకు యీ క్షేత్రవృత్తి ప్రాప్తించును. ఈ యింటి

యందలి తగవు లనబడెడి ప్రపంచమంతయు దానిదే. కావున యీ క్షేత్రమును దున్నుట - విత్తులు నాటుట మొదలగు పనులన్నియు దాని నౌకరులే చేయుచుందురు. ఈ ప్రపంచమున యీ సాగుబడి చేసెడి వగు ముఖ్యమైన త్రిగుణములు యీ ప్రకృతి గర్భమునుండియే జన్మించినవి. రజోగుణము దున్నును, సత్త్వగుణము పంటకు కాపలా కాయును, మరియు తమోగుణము ఆ పంటలు కోసి, రాశిగా యొనర్చును. ఆపిమ్మట మహత్తత్త్వమనెడి పంట కళ్ళము తయారు చేయబడి, కాలస్వరూపము గల ఎడ్లచే నూర్చబడును. ఇంచుమించు ఆసమయముననే అవ్యక్తమనెడి సాయంకాలమగును. అందుపై మరికొందరుబుద్ధిమంతులిటు లందురు. వాస్తవమునకు పరతత్త్వము బ్రహ్మమే. అట్టి సందర్భములో ఆ బ్రహ్మముందు ప్రకృతిని ఎవరు తలంతురు ? మీ యీ క్షేత్ర సంబంధమైన యోచనలను వినుట వ్యర్థమగు వాగాడంబరమును వినుట వంటిదే. శూన్యబ్రహ్మ శయనాగారమున సత్యావస్థ యనెడి మంచముపై నిద్రించుచున్న ఆదిసంకల్పము ఆకస్మికముగ మేల్కొనును. ఆతడు చాల చంచలుడు, మరియు ప్రయత్నశీలుడు నగుటవలన ఆతడు తన మనస్సున చెలరేగిన తరంగముల ననుసరించి యీవిశ్వమనెడి రూపము (ఆకారము) ను తయారుచేసెను. నిర్గుణ పరబ్రహ్మయొక్క విహారస్థలము త్రిభువనములంతపెద్దది. ఆతనికి యీ ఆదిసంకల్ప కృత్యము మూలమున రూపమేర్పడినది. ఆపిదప, చాలపెద్దదిగ పడియున్న మహాభూతములనెడి బంజరు నాల్గు భాగము లొనర్పబడెను. ఈభాగములు,జరాయుజము, స్వేదజము,అండజము మరియు ఉద్భిజ్జమనెడి పేర్లుగల నాల్గు భూత-గ్రామములు, అటుపైన, పంచమహాభూతములనెడి పిండము బ్రద్దలుకొట్టబడి, భిన్నభిన్నవిభాగములొనర్పబడి, పాంచభౌతికసృష్టి చేయబడెను. పిమ్మట, కర్మ మరియు అకర్మల నెడి రాళ్ళుదగ్గరకుజేర్చబడి, యిరుపైపులందును కట్టవేయబడెను; వాటి వలన ఊషరక్షేత్రములు, అరణ్యములు ఏర్పడెను. ఈ ప్రదేశములోనికి రాకపోక లనెడి క్రమము శాశ్వతముగ జరుగుచుండుటకై జనన-మరణములనెడి రెండు సొరంగములు త్రవ్వబడెను. ఇవి సృష్టినుండి బయలుదేరి నిరాలంబ బ్రహ్మమువరకు చేరుటకు వీలగురీతిని ఆ ఆదిసంకల్పము యీ సొరంగముల నేర్పరచెను. అటుపైన యీ ఆదిసంకల్పము అహంకారముతో మైత్రి

నెఱపి, బుద్ధియొక్క మధ్యవర్తిత్వమువలన, యీ క్షేత్రక్రమము ఎల్లప్పుడు సాగు చుండురీతిని వ్యవహరించెను. ఈరీతిని, ప్రారంభమున ఆ నిర్గుణ నిరాలంబ బ్రహ్మమునందే ఆదిసంకల్ప మనెడి అంకురము బయలుదేరెను. కావుననే యీ ప్రపంచమునకు మూలము ఆ ఆదిసంకల్పమేనని ధృవపడుచున్నది." ఈ విధమున సంకల్పవాదులు తమమనస్సనెడి ముక్తాఫలమును ముందరపెట్టగనే, మరియొకమతస్థు లీ రీతిని చెప్పసాగిరి. "మహారాజా! తాము చాలా మంచి చికిత్సకులుగ కాన్పించుచున్నారు. పరబ్రహ్మవద్ద ఆదిసంకల్పమనెడి శయనాగారకల్పనమే చేయవలసి వచ్చుచో సాంఖ్యమతస్థులు చెప్పెడి పరబ్రహ్మకు గల ప్రకృతిని వాస్తవికము సమంజసము నని అంగీకరించుటలో ప్రమాదమేమి గలదు ? యివన్నియు నిజమైనయెడల, దీనిని గురించి చర్చించుటలో అర్థమూ ప్రయోజనము ఉండును. కాని, పోనిండు. సోదరులారా! మీరెవ్వరును యీ మాటలనెడి వలలో చిక్కుపడకుడు. ఈప్రశ్నయందలి వాస్తవికమగు పుట్టుకనంతయు, మేమిప్పుడు చెప్పెదము, వినుడు ఆకాశమున మేఘసమూహము నెవ డేర్పరచుచున్నాడు ? ఆకాశమున నక్షత్ర సమూహము నెవడు అలంకరించి స్థాపించుచున్నాడు ? ఆకాశమనెడి పైకప్పును ఎవడెప్పుడు నిర్మించెను ? వాయువు ఎల్లప్పుడు వీచుచునే వుండవలెనని ఎవడు ఆజ్ఞాపించెను ? రోమముల నెవడు సృజించెను ? సముద్రము నెవడు నింపెను ? వర్షధారల నెవడు నడపును ? ఇవన్నియు స్వాభావికధర్మము ననుసరించి జరుగు విధముననే, యీ దేహ - క్షేత్రముకూడ స్వభావసిద్ధమైనది. ఇది ఎవడిసొత్తు కాదు. దీనియందు కష్టించువానికే ఫలప్రాప్తి కలుగును, లేనివానికి ఆఫలము లభించదు" ఈరీతిగా స్వభావవాదు లీ సిద్ధాంతమును, ప్రతిపాదించుచుండగా, మరికొందరు లేచి యిటులనిరి. "పోనీ, మీరు చెప్పెడి విషయమును ఒప్పుకొందుమనిన యీ దేహక్షేత్రముపై నిరంతరము కాలునకు మాత్రమే ఏల అధికార ముండవలెను ? కాలుని ప్రభావము తప్పించుకొన నలవికానిదని మీరు చక్కగా నెరుంగుదురు, అయినప్పటికిని, మీకు మీమతముపై అసత్యమగు అభిమానమేల యుండవలెను ? ఇది క్రుద్ధుడగు మృత్యు గుహవలె నున్నది. కాని, చేయగలదేది ? మిమ్ముబోలిన వ్యర్థవాచాళురకు యీవిషయ మెటుల నచ్చును ? ఈ కాల - సింహము మహాకల్పము యొక్క అవలి

ఒడ్డుకు పోయి బ్రహ్మలోకమనెడి ఏనుగుపైకూడ దాడి వెడలును అంతేగాదు, యిది స్వర్గమనెడి ఉద్యానవనమునగూడ ప్రవేశించి అచ్చటి నూతన లోకపాలురు దిగ్గజముల సమూహమును కూడ సంహరించి వేయును. వీరుగాక తదితరులగు జీవరూపమున గల లేళ్ళు మొదలగునవి, యీ కాల - సింహము యొక్క శరీరపుగాలి సోకినంతమాత్రముననే నిర్జీవులై, జనన-మరణములనెడి గోతులలో తిరుగుదురు. ఆ కాలసింహముయొక్క దవుడ యెంత విశాలముగ నున్నదో చూడుము! ఈదవుడయందు విశ్వాకారముననున్న సింహముకూడ పట్టును. మరియు అందు ప్రవేశించిన తరువాత అది నామరూపములుకూడ లేకుండపోవును. ఇందువలన, కాలవాదులమగు మేము-యీ క్షేత్రముపై ఒక్కకాలునకుమాత్రమే అధికారము గలదని విశ్వసించెదము.”
ఓఅర్జునా! యీ దేహక్షేత్రమును గురించిన, యీవిధమగు పెక్కు పక్షములుం గలవు. నైమిశారణ్యమందలి ఋషులుకూడ యీవిషయమై పెక్కు తర్జన భర్జనలు చేసిరి. పురాణములందు కూడ యిందును గురించిన చర్చలు గలవు, అనుష్టుప్ మొదలుగాగల ఛందస్సులలో యీవిషయమును గురించి పెక్కు విధములగు చర్చలు జరిగినవి. వేదములందు జ్ఞానదృష్టితో చూచినచో బ్రహ్మసూత్రములు అత్యధికముగ పవిత్రమైనవి. కాని, దానికికూడ యీ క్షేత్రమునుగురించిన పూర్ణమగు అంతు చిక్కలేదు. వీరుగాక, మరి పెక్కురు దూరదర్శిత్వము గల మహాకవులుకూడ యీ క్షేత్రమును గురించి యోచించుటలో తమ బుద్ధియనెడి సంపదను వ్యయ మొనర్చిరి. కాని, నేటి వరకు - యీ క్షేత్ర మిట్టిది, యిది యింత వ్యాప్తిగలది, ఇది వాస్తవముగ ఫలానావానిది - అని ఎవరికిని సరిగా బోధపడలేదు. నేనిక యీ క్షేత్రమును గురించిన ఆద్యంతములు నీకు తెలియ జెప్పెదను వినుము.

మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ
ఇన్ద్రియాణి దశైకఞ్చ పఞ్చ చేన్ద్రియగోచరాః॥ ౫

ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనాధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్॥ ౬

“పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తప్రకృతి, దశేంద్రియములు, మరియు యివిగాక, మనస్సు, దశవిషయములు, సుఖ - దుఃఖము, ద్వేషము, సంఘాతము, ఇచ్ఛ, చేతన మరియుధృతి - వీటన్నిటి యొక్క వ్యక్తస్వరూపమే యీ క్షేత్రము. క్షేత్రమందలి తత్త్వముల పేళ్ళను నీకిప్పుడు చెప్పితిని. నీకిప్పుడిక మహాభూతములన నేమో, విషయము లేవియో, ఇంద్రియముల స్వరూప మేదియో విడివిడిగ చెప్పెదను. పృథ్వి, అప్పు జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అను నీ ఐదింటిని పంచమహా భూతములుగా నెరుంగవలెను. జాగ్రదవస్థలో స్వప్నావస్థ యుండ నటుల, పగటియందు చంద్రుడు అదృశ్యముగా నుండునటుల, ప్రౌఢా వస్థను సమీపించిన మగవానిలో తారుణ్యము అణగియుండు రీతిని, ముకుళించుకొని యున్న మొగ్గలో సుగంధము దాగియుండు రీతిని, కట్టెలలో అగ్ని గుప్తముగ నివసించురీతిని - ప్రకృతి యనెడి మాయాగర్భమున దాగియుండి రుధిరము మొదలుగాగల ధాతువులలో దాగియున్న తాపము కుపథ్యమునకై ఎదురుచూచుచుండి, కుపథ్యము జరుగగనే దాని నవకాశ ముగ గొని వెంటనే రోగియొక్క శరీరమున లోపలను - బయటను అంతటను వ్యాపించురీతిని, పంచమహా భూతములు ఏకమై యీ దేహాకారము దాల్చినప్పుడు యీ శరీరమును నలువైపుల చిందులు ద్రొక్కించునట్టి దానినే, ఓ అర్జునా! అహంకారముగ తెలిసికొనుము. దీని మాటలు అతి విచిత్రముగ నుండును. ఇది, అజ్ఞానుల నంత ఎక్కువగ వెంటాడదు. కాని జ్ఞానులను మాత్రము అతిగాఢముగ ఆలింగన మొనర్చుకొని అనేక కష్టములం పాల్పడజేసి ఆడించుచుండును. ఇకముందు చెప్పబోవు లక్షణముల ననుస రించి బుద్ధిని గుర్తించవలెను. ఓ అర్జునా! నీ కాలక్షణములను దెల్పెదను వినుము. కామవాసన బలవత్తర మైనప్పుడు ఇంద్రియవృత్తులను భేదించి విషయ - సమూహములం లోపల దూరును. అటుపైని, జీవు డనుభవించు సుఖ - దుఃఖాదులలో, సుఖ - దుఃఖాదులను గురించి సరిగా తెలియజెప్పు

నట్టిదిన్నీ, ఇది సుఖము - యిది దుఃఖము, ఇది పుణ్యము - యిది పాపము ఇదిమంచి - ఇదిచెడ్డ - యని నిర్ణయమొనర్చు నట్టిదిన్నీ, మంచి - చెడ్డ, చిన్న - పెద్ద మొదలు గాగల జ్ఞానము కలుగుటకు సహాయ పడునట్టిదిన్నీ, జీవుడు విషయములను పరీక్షించుటకు కావలసిన దృష్టియున్ను, జ్ఞాన - తేజస్సుకు మూలకారణమున్ను, సత్త్వగుణపు ఉన్నతావస్థయూ, జీవునకూ శివునకూ సంబంధము గల్పించునట్టిదియూ నగుదానినే, ఓ అర్జునా ! బుద్ధియని యెరుంగుము. ఇక అవ్యక్త ప్రకృతి లక్షణములను వినుము. సాంఖ్యశాస్త్రము, యోగశాస్త్రముల ననుసరించి ప్రకృతిద్వివిధములు; అవి యింతకుపూర్వము (ఏడవ అధ్యాయములో చెప్పబడినవి.) వాటిలో రెండవది యగు పరా - ప్రకృతియే జీవ - దశ (జ్ఞానదేవి), యిచ్చట దానికి గల మరొక పేరే 'అవ్యక్తము'. రాత్రి అంతమొందగనే నక్షత్రము లన్నియు ఆకాశమునందే లుప్తమగురీతిని, పగలు అంతమొందగనే ప్రాణి కోటి సంచారము ఆగిపోవురీతిని, ఓ అర్జునా, దేహము నశించినపిదప చేయ బడిన కర్మలలో దేహాదివికారములన్నియు గుప్తముగ నుండు రీతిని, బీజస్వ రూపములో వృక్షమంతయు మూఢస్థితియం దిమిడియుండు రీతిని, దారపుపో గులు వస్త్రరూపమున నుండునటుల, స్థూలధర్మమునంతను వదలి మహాభూత ములు మరియు భూతసృష్టియూ లయమును పొంది సూక్ష్మరూపమున దేని యందునివసించునో, ఓఅర్జునా, దానినే 'అవ్యక్త' మందురు.ఇక ఇంద్రియభేద ములనువినుము. చెవి, కన్ను, చర్మము (త్వచ), ముక్కు, నాలుక-యీ ఐదిం టిని జ్ఞానేంద్రియములుగ నెరుంగుము. ఈఐదు ఇంద్రియములు ఐక్యమొందిన ప్పుడువీటిద్వారా బుద్ధి సుఖ-దుఃఖ విచారణ మొనర్చును. ఇదిగాక, వాక్కు హస్తము, పాదము, గుదద్వారము, శిశ్నము - యనెడి మరి యైదు పదార్థ ములు గలవు. వీటిని కర్మేంద్రియము లందుము. ఓ అర్జునా! ప్రాణములకు ప్రియసఖియూ, శరీరమున నివసించునట్టిదియూ నగు క్రియాశక్తి యీఐదు ద్వారములగుండా రాక - పోకల నొనర్చును. ఈరీతిని పంచజ్ఞానేంద్రియ ములు, పంచకర్మేంద్రియములను దెలిపితిని, ఇక ఓ అర్జునా ! 'మనస్స'న నేదియో చెప్పెదను వినుము. ఇంద్రియములు మరియు బుద్ధికి మధ్య గల సంధిపై రజోగుణభుజముపై నెక్కి నిరంతరము ఆడుచుండునదియు (ఆకాశపు నీలవర్ణము, లేదా సూర్య కిరణములందలి మృగ - జలమువలె,

కేవలము భాసమానమగుచుండు వాయువుయొక్క మెరపే మనస్సు. పురుషుని శుక్రము మరియు స్త్రీయొక్క శోణితములు రెండును కలియుటవలన ఏర్పడు పంచమహాభూతములలో పదివిధములగువాయుతత్త్వముగలదు. ఆపైన, ఆదశవిధవాయువులు శరీరమందలి పదిభాగములందు, తమతమ విశిష్ట ధర్మములతో కూడియున్నవై విడివిడిగా నుండును. కాని, వాటి అన్నిటియందును ఒకవిధమగు చంచలత్వము వుండును. దానివలన వాటికి రజోగుణ బలప్రాప్తి కలుగును. ఈ చంచలత్వము బుద్ధికి బయట, అహంకారపు సరిహద్దున అనగా మధ్యప్రదేశమున ప్రబలముగా నుండును. దీనికే మనస్సని పేరు పెట్టబడినది. కాని, వాస్తవముగ చూచినచో యిది కేవలము కల్పనా మూర్తియే. దేని సాంగత్యమువలన బ్రహ్మకు జీవదశ ప్రాప్తించునో, ఏది మాయకు మూలమో, దేనివలన కామ - వాసనకు బలము లభించునో, ఏది నిరంతరము అహంకారమునకు ఉత్తేజము కలిగించుచుండునో, ఏది ఇచ్ఛలను నెరవేర్చుచుండి కూడా ఆశలను పెంపొందించి భయమును బలిష్ఠమొనర్చునో, ఏది ద్వైతభావమును కలుగజేయునో, మరియు అవిద్యను అధికమొనర్చి యింద్రియములను విషయభోగములలో చిక్కుబడునటుల చేయునో, ఏది కేవలము కల్పనము వల్లనే సృష్టిని రచించి మరియు నాశమొనర్చునో' ఏది మనోరథము లనెడి ఘటము (కుండ) ను సృష్టించి మరల బ్రద్దలు కొట్టునో, ఏది భ్రమానిలయము, మరియు వాయుసారమో, ఏది బుద్ధి ద్వారమును మూసివేయునో; ఓ అర్జునా! దానినే 'మనస్సు' గా నెరుంగవలెను. ఇందు సంశయమున కేమాత్రము తావులేదు. ఇక విషయములను గురించి చెప్పెదను వినుము- స్పర్శ, శబ్ద, రూప, రస, గంధము లైదును జ్ఞానేంద్రియ విషయములు. పచ్చగడ్డిని చూచి పశువు అతికోరికతో విహ్వలయై దానిపై పునకు పరుగెత్తిపోవు రీతిని, యీ అయిదు ద్వారములద్వారా జ్ఞానముకూడ బయటివైపుకు పరుగిడుచుండును. స్వరము, వ్యంజనము. మరియు విసర్గలను ఉచ్చరించుట, ఏదైనా పదార్థమును పట్టుకొనుట లేదా విడుచుట, నడచుట మరియు మలవిసర్జన మొనర్చుట - యీ అయిదున్నూ కర్మేంద్రియ విషయములు. వీటివ్యాప్తి యనెడి ఆధారముపై క్రియా - ప్రవృత్తి యుండును. ఈ రీతిని యీ శరీరమున దశ విషయములు గలవు. ఇక

యిచ్ఛను గురించి వర్ణించెదను, వినుము. ఏదైనా గతించిన విషయము జ్ఞప్తికి వచ్చినప్పుడు, లేదా దానికి సంబంధించిన ఏదైన వినిపించినప్పుడు క్షుబ్ధతను పొందునట్టిదన్నీ, ఇంద్రియములు మరియు విషయముల యొక్క సంయోగము కలుగగనే వెంటనే కామముయొక్క చేతిని పట్టుకొని లేచి నిలబడునట్టిదన్నీ, ఏది లేచుటతోడనే మన స్సెటునటు పరుగులిడసాగునో, మరియు ఇంద్రియములు కాలుకూడ ఎన్నడును పెట్టరాని ప్రదేశమున ముఖము పెట్టసాగునో, ఏభావన మనెడి వలలో పడి బుద్ధి ఉన్మాదులవలె నగునో మరియు దేనికి విషయము లనిన అత్యధికమగు లాలస యుండునో, ఓ అర్జునా! ఆ భావనయే ఇచ్ఛ. మరియు ఇంద్రియములకు వాటి యిచ్ఛానుసారముగ విషయోప భోగ ప్రాప్తి కలుగనప్పుడు, ఆ విషయము మనకు తప్పక లభించి తీరవలెనని పట్టుదలతో కూడియున్న వికారము కలుగును. ఆ వికారమునే 'ద్వేషము' అని చెప్పవలెను. ఇక 'సుఖము' అననేమో వినుము. దేనివలన జీవుడు తదితర సంగతుల నన్నింటిని మరచిపోవునో, ఏది మనస్సు, వాక్కు మరియు దేహములను శపథమిచ్చి బంధించునో, ఏది దేహస్మృతిని నిరాధార మొనర్చునో, ఏది జన్మించుట తోడనే ప్రాణములను కుంటివానినిగ నొనర్చి, సాత్త్విక భావములను ద్విగుణీకృత మొనర్చుటేగాక, సమస్త యింద్రియ వృత్తులను జోకొట్టి హృదయమునందు శాంతభావముతో నిద్రపుచ్చునో, మరియు జీవునకు ఆత్మస్వరూపమార్గము ప్రాప్తించుస్థితిలో ఏదిభావించునో, అదియే సుఖము. మరియు ఓ అర్జునా! ఏఅవస్థలో యిది యోగించదో ఆఅవస్థనే పరిపూర్ణమైదుఃఖముగ ఎరుంగుము. సంకల్ప-వికల్పము లున్నంతవరకు సుఖమెన్నడును నకలుగ జాలదు. సంకల్ప-వికల్పములు నాశమగుటతోడనే సుఖము స్వయం-సిద్ధముగ ప్రాప్తించును. కావున, సంకల్ప - వికల్పములు వుండుట మరియు లేక పోవుట యనెడి రెండు కారణముల వలననే క్రమశః దుఃఖము మరియు సుఖము కలుగును. ఓ అర్జునా, ఈ శరీరమందలి సంగ - హీనము మరియు ఉదాసీనము నగు చైతన్యశక్తి యొక్క పేరే చేతనము. నఖశిఖ పర్యంతము శరీరమం దంతటను సమాన రూపముగ జాగరితమై యుండునట్టిదన్నీ, జాగ్రదాది త్రివిధావస్థలందును అఖండముగ నుండునట్టిదన్నీ, మనస్సు మరియు బుద్ధి మొదలగు వానిలో జీవత్వమును తెచ్చి వాటిని వికాసవంతముగ

నుంచు నట్టిదిన్నీ, ప్రకృతియనెడి వనమునందలి స్వయముగ వసంతలక్ష్మియే యైనట్టిదిన్నీ, సజీవ, నిర్జీవపదార్థములందుకూడ అంశాభేదము (హెచ్చు - తగ్గులుగ) ననుసరించి నిరంతరము సంచరించునట్టిదియే చేతనయై యున్నది. ఓ అర్జునా, యిందు తిలమాత్రము కూడ అసత్యము లేదు. ఓ అర్జునా! రాజుకు తనసైనికులను గురించిన వ్యక్తిగత జ్ఞానముండదు. అయినప్పటికిని, అతని ఆజ్ఞ శత్రుచక్రమును పరాభవించును. లేదా చంద్రుడు షోడశకళా పరిపూర్ణుడైనపుడు సముద్రమున తనంతతానేపోటు (సముద్రమున తరంగములు మిక్కుటముగ లేచుట) వచ్చును. లేదా, సూదంటురాయి సమీపమున నున్నప్పుడు యినుపముక్క తనంతతానే కదలసాగును. లేదా, సూర్యోదయము అయినప్పుడు లోకులు తమంతతామే మేల్కొందురు. లేదా, ఆడతాబేలు తనబిడ్డను తనచూపుల ద్వారానే పోషించు రీతిని, చేతనకూడా ఆత్మయొక్క సాంగత్యము వలన శరీరమునందుండి జడమును సజీవముగ నొనర్చును. ఇది చేతనను గురించిన వృత్తాంతము. ఇక ధృతిని గురించి చెప్పెదను వినుము. ఈపంచమహాభూతము లనెడి పేరుగల తత్త్వములందు స్వాభావికముగ నిరంతరము వైరము వుండును. నీటివలన పృథ్వీనాశనము కాకుండుట యనునదియెన్నడును జరుగనేరదు. నీటిని తేజస్సు శోషిలజేయును, తేజస్సు - వాయువుల మధ్య పోరాటము జరుగుచుండును. మరియు గగనము అతిసహజముగ వాయువును కబళించివేయును. ఈ రీతిని ఆకాశము మరేతత్త్వముతోనూ కలియదు. కాని, అది అన్నింటి యందును దూరియుండును మరియు ప్రతిచోటను తన స్వతంత్ర అస్తిత్వము నేర్పరచుకొని యుండును. ఈ రీతిని, యీ పంచభూతములకు ఒకదానితో మరొక దానికి సరిపడదు. అయినను యీ అయిదు భూతములును యీ దేహ - క్షేత్రమున ఏకత్రితమై కలియును. అవి తమ స్వాభావికవైరమును విడచి దేహమునం దొకేచోట, వసించును. మరియు అన్నియూ తమతమ గుణములతో ఒకదానిని మరొకటి పోషించును. వాటియందు ఆకస్మికముగ సంభవించని యీ ఐక్యత సంభవించుట మరియు నిలచియుండుటలకు కారకురాలైన ధైర్యమునే ధృతి యందురు. మరియు ఓఅర్జునా ! జీవునితో యీ ముప్పదియారు తత్త్వములు కలసి యుండుటనే యీ ప్రకరణమున ‘ సంఘాతము ’ అందుము. ఈరీతి

నీకు యీ ముప్పదియారు తత్త్వముల లక్షణములను వివరముగ చెప్పితిని. వీటి అన్నిటి యోగమునే క్షేత్రమందుము. రథముయొక్క వివిధభాగముల అమరిక అనబడెడి యోగమునే 'రథ' మని చెప్పునటుల, క్రిందను పైనను గల అవయవసమూహమును 'దేహ' మనినటుల, లేదా ఏనుగులు – గుఱ్ఱములు మొదలగువాని సంఘటనమును 'సేన' యనునటుల, లేదా అక్షరముల సమూహమును 'వాక్య' మనినటుల, మేఘ సముదాయమును 'అభ్రము' అన్నటుల, లోకసముదాయము నంతను 'జగత్తు' యన్నటుల, నూనె-వత్తి మరియు అగ్నుల సంయోగము సంభవించినప్పుడు 'దీపము' అన్నటుల-యీ ముప్పదియారు తత్త్వములనూ ఏకరూపమును పొందింప జేయుటనే సాముదాయక దృష్టితో 'క్షేత్ర' మందురు. ఈ మహాభూతములే ఏకరూపమును పొంది పనిచేయుటచే దీనియందు పాప – పుణ్యములనెడి పంట పండును. అందువలననే మేముకూడ ఆలంకారిక దృష్టితో దీనిని 'క్షేత్ర' మందుము. కొందరు దీనిని 'దేహ'మని కూడ యందురు. ఇక వీటిని విస్తరించ నక్కరలేదు. నిజము చెప్పవలెననిన దీనికి అనంత నామములు గలవు. కాని పరబ్రహ్మమునుంచి స్థావర-జడ జగత్తు వరకును జనన – మరణముల నొందుచున్న ప్రతి పదార్థమును క్షేత్రమే. కాని వాటియందలి దేవ, మానవ నాగాది యోని భేదములుగాని భిన్న భిన్న వస్తువర్గములుగాని – అవన్నియు సత్త్వ రజస్తమోగుణములు, మరియు కర్మలయొక్క సంయోగమువలన జన్మించుచున్నవి. ఓ అర్జునా ! ఈగుణ – వ్యవస్థను గురించి నీకు ముందుముందు తెలిపెదను. నీకిప్పుడు జ్ఞాన స్వరూపమును విపులీకరించి చెప్పెదను. క్షేత్రము మరియు దాని వికారముల సంపూర్ణ స్వరూపమును నీకు చెప్పి యుంటిని. మరియు నీకిక నిర్మలము మరియు శ్రేష్ఠమగు జ్ఞానమేదో చెప్పెదను. ఏజ్ఞాన ప్రాప్తికొఱకై యోగులు స్వర్గమనెడి డొంకతిరుగుడు మార్గమును దాటిఆకాశమునుకూడ కబళించివైతురో, బుద్ధి – సిద్ధులమోహమున పడక యోగసాధనవంటి దుర్ఘట విషయమును కూడ సహింతురో, తపము లనెడి కఠిన పర్వతమును దాటుదురో, కోట్లకొలది యజ్ఞ – యాగములను త్యాగమొనర్తురో, మరియు కర్మ-కాండ నంతయు తారు-మారు చేతురో, లేదా మిక్కుటమగు ఆవేశముతో భజనమార్గమున

దుముకుదురో మరియు ఒక్కొక్కడు సుషుమ్నా సొరంగము లో వరకు ప్రవేశింతురో మరియు యీ రీతిని ఏ జ్ఞానప్రాప్తికొరకై మునులయొక్క ఆశాపూరితమగు యిచ్ఛ వేద-వృక్షము యొక్క ఆకు-ఆకుపైన భ్రమణమొన ర్చుచుండునో, మరియు ఓ అర్జునా ! ఏజ్ఞానముకొరకై ఏనాటికైన గురువు అనుగ్రహించుననెడి ఆశతో వందలకొలది జన్మములు గురుసేవలో గడుప బడునో, ఏజ్ఞానము జీవుని శివునితో ఏకమొనర్చి చూపునో, ఏజ్ఞానము యింద్రియ ద్వారములను మూసివేయునో, ప్రవృత్తియొక్క పాదములను విరచి వేయునో మరియు మనోదుఃఖమును పారద్రోలునో, దేనివలన ద్వైతమనెడి అకాలము పోయి సమ - భావనయనెడి ఐక్యముతో కూడిన సు - కాలము సంభవించునో, ఏజ్ఞానము - మదముయొక్క ఆధారమునే నాశమొనర్చునో, ప్రబలమగు మోహమును భక్షించునో మరియు 'నేను - అతడు' అనెడి ద్వైతభావమును ఏమాత్రము వుండనివ్వదో, ఏది సంసారమును సమూల ముగ పెరకివేయునో, సంకల్పపుమురికిని కడగివైచి శుభ్రపరచునో మరియు జ్ఞేయవస్తువగు పరమాత్మతత్త్వముతో ఆతనిని కలుపునో, దేనిని సాధారణముగ ఆకళింపు చేసికొనుటకూడ చాలకరినమో, ఏది ఉదయించుటతోడనే జగత్సం చాలన మొనర్చెడి ప్రాణములు నితాంత నిర్బలతను పొందునో ఏ జ్ఞానప్ర కాశమువలన బుద్ధి నేత్రములు తెరువుడు పడునో, మరియు జీవుడు ఆనంద రాశిపై దొర్లసాగునో, ఏ జ్ఞానము అత్యంతపవిత్రమైనదో, దేనివలన దోషము లతో నిండియున్న మనస్సు నిర్మలమగునో, దేని యోగమువలన ఆత్మకు గల్గి గిన జీవభావమనెడి క్షయరోగము పూర్తిగా నివారణయగునో - అట్టి ఆ జ్ఞాన మును నిరూపించుట అసంభవమైనప్పటికిని నేను దానిని నిరూపింతును. ఈ జ్ఞాన నిరూపణను విని బుద్ధివలననే దానిని తెలిసికొనవలెను. ఏలనన బుద్ధి లేని కనులకు అది ఎచ్చటను కనుపించనేరదు కాని, బుద్ధిద్వారా ఒక పర్యా యము దానిని తెలిసికొనుటచే, అదితనశక్తిని యీశరీరముపై ప్రసరింపజేయును. అప్పుడది యింద్రియక్రియల రూపమున నేత్రములకు కూడ కనిపించ సాగును. చెట్లు చిగిర్చి కళ - కళలాడుచూ నుండుటనుబట్టి వసంతాగమనము తెలియు రీతిని, ఇంద్రియముల స్థితిని చూచి జ్ఞానమును కూడ ఊహించనగును. చెట్టు మొదలుకు భూగర్భమునందుకూడ నీరు లభించును. మరియు ఆనీరు

కొమ్మలందలి ఆకులందుకూడ తన కాంతిని చూపును. లేదా భూమియం దుండెడి మృదుత్వము సుందరమగు మొక్కలను చూచినప్పుడు కూడ బోధపడ గలదు. లేదా కులీనుల మహత్త్వము వారి ఆచరణలందే తెలియనగును. ఇతరుని సత్కరించ వలెనని చూపుటలో గల ఆతురతయే ఆతనికి వచ్చిన వాని యెడగల స్నేహమును వెల్లడించును లేదా శాంతముతో కూడిన భవ్యాకృతి వలననే ఆ మానవుడు పుణ్యశీలుడని తెలియును. లేదా కర్పూర - కదళిలో కర్పూరము నిండియున్నదని దాని సుగంధము వలననే బోధపడును. లేదా, అద్దాల లాంతరులో పెట్టబడిన దీప ప్రకాశము నలువైపుల వ్యాపించును ఇదేరీతిని, మానవుని హృదయమున జ్ఞానము ప్రవేశించినప్పుడు దాని చిహ్నములు పెక్కులు బయటకు ప్రకటముకాసాగును. నీకు నే నాలక్షణములను చెప్పెదను, సావధానుడవై వినుము.

అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మ వినిగ్రహః 8

ఎవనికి ఏ లౌకిక విషయమునకును లోలుడైయుండుట ఏమాత్రము యిష్టముగాదో, ప్రజలతో తనగొప్పదనము ననుసరించి కలియుట ఎవనికి కష్టకరముగా నుండునో, ఎవనికి తనగుణస్తుతిగాని పొగడ్తగాని జరిగినప్పుడు గాని, తనను సన్మానించుటకు ఏర్పాటు జరిగినప్పుడుగాని లేదా విశేషమగు యోగ్యత తనపై ఆరోపింపబడినప్పుడుగాని, వ్యాధుని చేతజిక్కిన హరిణము వలె కంగారు మరియు వ్యాకులత గలుగునో, లేదా ఈదునప్పుడు సుడిగుండమున పడుటచే యీతగాడు పొందునట్టి విధముగా వ్యాకులము గలుగునో, ఓ అర్జునా! ఎవనికి లోకులు తనకు చేయు 'సన్మానము ఆపదవలె కష్టకరముగతోచునో, ఎవడు లౌకిక గొప్పదనములను తనను స్పర్శింపనైన నివ్వడో, ఎవడు తన సన్మానమును తనకనులతో చూడజాలడో, ఎవడు తన లౌకిక కీర్తిని వినజాలడో, లోకులు నన్ను స్మరించవలెను మరియు వారు నన్నుగురించి చర్చించుకొనవలెను - అను విషయమును కూడ ఎవడు సహించనేరడో, అట్టివానికి యిక తనను లోకులు ఆదరించవలెను, సత్కరించవలెను- అను విషయమెటుల రుచించును? లోకులు తనకు

నమస్కరించునప్పుడు ఎవరికి తన మృత్యువే ఎదుట కనిపించునో, బృహస్పతితో సమానుడుగా జ్ఞానవంతుడైనప్పటికిని తన మహత్త్వ - భయము వలన ఎవడు ఉన్మాదునివలె నగునో, ఎవడు లౌకిక ప్రసిద్ధికి కంగారు పడునో, ఎవడు శాస్త్రములను గురించిన వ్యర్థప్రలాపముల నాడుటను విసర్జించి మౌనముగ ఏకాంతముగ నుండుట నభిలషించునో; 'లోకము నన్ను అవమానించుగాక మరియు తిరస్కరించుగాక, నా చుట్ట - పక్కములు నా వైపు కన్నెత్తియైన చూడకుందురుగాక- యని ఎవడు హృదయపూర్వకముగ వాంఛించుచుండునో, హీనత్వము మరియు తుచ్ఛత్వముకూడా శోభించునట్లును మరియు తన అవయవములపై హీనత్వమనెడి అలంకారముచే అలంకరింపబడు నట్లును - ఎవడు తరచు తన ఆచరణను వుంచుకొనునో, లోకులుతన్నుగురించి ఇతడు జీవించలేడు ఇతడు పరిపూర్ణముగ లేనేలేడు, ఇతని ఉనికియే లేదు అని భావించుచుండవలెనని ఎల్లప్పుడు ఎవడో వాంఛించుచుండునో, ఎవని ప్రవర్తనమును చూచి లోకులు ఇతడు నడచుచున్నాడా లేక గాలితోపాటు దొర్లుకొనుచు పోవుచున్నాడా? యను భ్రాంతిని కలుగజేయునో, నాఉనికియే వుండకుండుగాక నా నామ-రూపములు కూడ నశించుగాక, నన్ను చూచి భూతకోటి భయపడి దూరముగ పారిపోవుగాక యని ఎవడు సదా వాంఛించుచుండునో, ఎవడు ఎల్లప్పుడు ఏకాంతమందేవుండునో మరియు నిర్జనప్రదేశమనెడి తలంపు వచ్చినంత మాత్రముననే ఎవ్వనికి ప్రాణము వచ్చినటుల వుండునో, ఎవనికి వాయువుతో మాత్రమే సరిపడునో, ఎవనికి ఆకాశముతో మాట్లాడుట మాత్రమే యిష్టముగనుండునో మరియు ఎవనికి వృక్షములు మాత్రమే అన్నిటికంటె ఎక్కువగ నచ్చునో, ఓ అర్జునా ఎవనియందు వీకీ లక్షణము లన్నియు కనిపించునో ఆతడు జ్ఞానమున తల్లీనుడయ్యెనని తెలిసికొనుము. ఈలక్షణములవలన మాత్రమే 'ఒకనియందు అమానిత్వముగలదా లేదా యని' ఎరుంగవలెను. ఇకనీకు 'అదంభిత్వము' (డాంబికము లేకుండుట)ను ఏవిధముగ గుర్తించనగునో చెప్పెదను వినుము. 'అదంభిత్వము' కూడ పైనచెప్పిన విధముగనే వుండును. ఓ అర్జునా, లోభియగు మానవుడు తన ప్రాణము పోయినప్పటికిని డబ్బు ఎచ్చట దాచియుంచెనో చెప్పని విధమున, అదంభిత్వము గలవాడు (డాంబికము లేని

వాడు) కూడ అదేరీతిని తన ప్రాణ ప్రమాదసమయము వచ్చినప్పటికి కూడ 'నేను ఫలానా ఫలానా పుణ్య కార్యములు చేసితినని' చెప్పుకొనడు. ఓఅర్జునా! దొంగఆవు పొదుగులోనికి వచ్చిన పాలుకూడ దొంగిలించురీతిని, లేదా వేశ్య తన వయస్సు మరుగుపరచు రీతిని, అరణ్యమున దారితప్పిన సంపన్నుడు ఎవని వద్దను తన సంపన్నత్వమును వెలిబుచ్చని రీతిని, కులీనస్త్రీ తన అవయవము లన్నిటిని చక్కగా మరుగుపరచి యుంచురీతిని, లేదా రైతు భూమిలో చల్లిన విత్తనముల నన్నింటిని మట్టిక్రింద చక్కగా దాచియుంచు రీతిని, ఎవడు తన దానాది పుణ్యకర్మల నెల్లప్పుడు గుప్తముగ నుంచునో, ఎవడు కల్పిత మైన శారీరక నటనలు చేయడో, ఎవడు లోకులను ప్రసన్నుల నొనర్చవలె నను జంజాటములో పడడో, మరియు తన ధర్మకార్యములను గురించిన చర్చయే తీసుకురాడో, ఎవడు తాను చేసిన ఉపకారముల నెన్నడును నోటితో ఉచ్చరించుట కూడ చేయడో, ఎవడు తాను నేర్చికొనిన విద్యను లోకులలో ప్రదర్శించుచు తిరుగడో, మరియు తాను ఆర్జించిన జ్ఞానమును లౌకికమగు కీర్తికొరకై అమ్ముకొనడో, ఎవడు శరీరసంబంధమగు విషయ ముల ననుభవించుటకై చిల్లిగవ్వయైన ఖర్చుపెట్టడో, మరియు ధర్మకార్య ముల నొనర్చుటకై తనధనము నంతను వెచ్చించుటకైనను వెనుకాడడో, ఎవని యింట ప్రతివిషయమునందును దారిద్ర్యము కనిపించునో, మరియు శరీరము పూర్తిగా దుర్బలముగను దీనముగను, హీనముగను కనిపించినప్పటికిని దాన మిచ్చుటలో స్వాయముగ కల్పతరువుతోకూడ ప్రతిజ్ఞాపూర్వకముగ పోటీ చేయునో, (అనగా ఎవడు ధర్మకార్యములనొనర్చుటలో అతిచతురుడు, దాన మిచ్చుటలో అత్యంత ఔదార్యము గలవాడు మరియు అధ్యాత్మచర్యలో నిపు ణుడు, మరియు అన్నివిషయములందును చూచుటకు వెర్రివాడుగా కనిపిం చునో, అట్టివానిని దంభహీను (డాంబికము లేనివాని) నిగా ఎరుంగవలెను. అరటిమ్రాను తేలికగను, మరియు లోపల బోలుగను ఉండును. అయినప్ప టికిని రసవంతమైన పెద్ద పెద్ద ఫలములు దానియందే కాయును. మేఘ ములు అతిస్వల్పమైన గాలివీతవల్లనైన ఎగిరిపోవునంత పల్చగను, తేలికగను వుండును; కాని, ఆశ్చర్యకరవిషయ మేమన, అట్టి మేఘముల నుండియే పెద్దపెద్ద జలధారలు వర్షించుచున్నవి. ఈ విధముగనే అతడు పరమ — సాధనా మార్గమును పూర్తిగా ఎరిగియున్నవాడైనప్పటికిని, లౌకిక విషయ

ములయెడ పూర్తిగా దీనుడు—హీనుడుగా కనిపించును. ఓ అర్జునా! ఎవని
యందీ లక్షణము లన్నియు చక్కగా కనిపించునో, అట్టివానికి జ్ఞానము వశ
పడినదని ఎరుంగుము. ఇప్పటివరకు అదంభిత్వమును గురించి వివరించితిని.
ఇక, అహింస యననేమో చెప్పెదను వినుము. ప్రప్రథమముగ, అహింసను
అనేకులు అనేకవిధములుగ వ్యాఖ్యానింతురని తెలిసికొనుము. ప్రతివారు
తమతమ మతముల ననుసరించి వర్ణింతురు. ఒకానొక వృక్షశాఖలను కోసి
దాని మ్రానుకు నాల్గువైపుల వానిని కట్టి రక్షించుటలోను, లేదా చేపని తొలచి
దాని మాంసమును వండి దానివలన తన ఆకలి తీర్చుకొనెననుటలోను, లేదా
దేవాలయములను పడగొట్టి దేవతలను స్థాపించుటకు మట్టి అగసులు వేసి
రనుటలోను ఎంత విశిష్టత గలదో, వీరు చెప్పు మాటలయందు కూడ
అంతటి అవివేకమే గలదు. ఈ విధముగా పూర్వ మీమాంసకులు 'హింస
చేసి అహింసను సాధించవలెనను' యని యొక విచిత్రమగు నిర్ణయము చేయ
బడినది. 'వారి మతప్రకారము' అనావృష్టి సంభవించినప్పుడు మరియు
ఆ ఆపద ప్రపంచమంతటను వ్యాపించుచున్నట్లు కనిపించినప్పుడు
వర్షము కురియుటకుగాను పెక్కు విధములగు యజ్ఞముల నొనర్చవలెను. కాని
ఆ యజ్ఞములలో స్పష్టముగ పశుహింస జరుగుచున్నది. అట్టి స్థితిలో, అచ్చట
అహింస ఎటుల కలుగగలదు? శుద్ధహింస యనెడి విత్తును నాటి అహింస
యనెడి పంటను ఎటుల కోయగలము ? కాని యీ యాజ్ఞికుల సాహసము
కూడ కొంతవరకు విలక్షణమైనదే. మరియు ఓ అర్జునా! ఆయుర్వేదము కూడ
యీ దారినే పోవుచున్నది. ఒక జీవియొక్క ప్రాణములను కాపాడుటకు
మరియొక జీవియొక్క ప్రాణములు తీయవలెనని దాని సిద్ధాంతము. అనేక
విధములగు దుఃఖములచే పీడింపబడుచు రోగములలో చిక్కుకొని బాధపడు
చున్న జీవులను చూచి, వారి హింసను నివారించుటకై రోగచికిత్స చేయుట
సమంజసమే. కాని ఆచికిత్స చేయుటకై, మొట్టమొదటగా ఏదో చెట్టుయొక్క
దుంప (కందమూలము)ను త్రవ్వవలెను. మరియు యింకొక మొక్క యొక్క
ఆకులు సమూలముగ పెరికి వేయవలెను. ఒక చెట్టును మధ్యలోనే విరచి
వేయవలెను. మరియు ఒక చెట్టుతోలు ఒలువవలెను. మరియు కొన్ని మొక్కల
కోమలమగు మొలకలను పాత్రలో మరగగాయవలెను. ఆపిమ్మట వాటిచే
చికిత్స చేయడ మగును. పుట్టినప్పటినుంచి ఎవరితోనూ వైరము నెరుగని చెట్ల

రసమును తీయుటకై వాటి సర్వాంగము లందును గాట్లు పెట్టబడును. మరియు ఓ అర్జునా! యీరీతిని చెట్ల ప్రాణములు తీసి రోగుల రోగనివారణ మొనర్పబడు చున్నది. మరియు, జంగమములు మరియు సజీవ ప్రాణులను కూడ చంపి, వారి శరీరమునుండి పైత్యరసము మొదలుగాగల పదార్థము లను తీసి, వాటిచే తయారుచేయబడిన మందులవలన కొందరు రోగుల పోవుచున్న ప్రాణములు కాపాడబడుచున్నవి. నివాసమునకై కట్టుకొను గట్టి కట్టడములను పడగొట్టి ఆ సామగ్రిలో దేవాలయములు కట్టించుట, వ్యాపారములో బీదలను దోచి అన్నసత్రములు నడపుట, ఇండ్లు పడగొట్టి మంటపములు కట్టించుట, గుడ్డను నిప్పంటించి సెగ కాచుట. ఏనుగును స్నానము చేయించుట, లేదా ఎడ్లను అమ్మి యిండ్లు కట్టుట, లేదా చిలు కను ఎగురవేసి పంజరమును తయారు చేయించుట మొదలగునవి పనులా? లేక పరిహాసములా? ఇట్టికార్యములను చూచి ఎవరెంత వరకు నవ్వకుండా నుండగలరు? కొందరు నీటిని వడపోసి త్రాగి. దీనిని పుణ్యకార్యములకు మార్గమందురు. కాని, నీటిని వడపోయుటలో కూడ సూక్ష్మజీవులు నశించు చున్నవి. కొందరు హింస జరుగునను భయముతో ఒకప్పుడు ఆహారమును కూడ తినరు కాని, ఆకలిలో ప్రాణములు పోవునట్లు వారి ప్రాణములు గిజగిజ లాడు చుండును. ఇదికూడ హింసయే. కావున, ఓ అర్జునా! [illegible]యొక్క 'హింసయే అహింస' యనెడి సిద్ధాంతము యిదియే. ప్రథమముగా 'అహింస'ను గురించిన భావము రాగనే యీ మతస్వరూపములను స్పష్టీకరించి చెప్పవలెనని తలంపు కలిగినది. అందుచే నీ కిది యంతయూ చెప్పితిని. నీవు కూడ ఆ దృష్టితోనే దీనిని అర్థము చేసికొనుము. ఇంక ఓ అర్జునా! పైన చెప్పిన విషయములకు అహింసతో ప్రధానమైన సంబంధమున్నది. అట్లు గానిచో దీని నింత డొంకతిరుగుడుగా చెప్పనేల? మరియు ఓ అర్జునా! మరొక విషయమేమన, తన మతమును చక్కగా స్పష్టపరచుటకై ఎదుట గల యితర మతములనుకూడ ఉచితరీతిని వివేచన మొనర్చుటకూడ ఆవశ్యకమే. ఇందుచే, యిప్పటివరకు నేను చేసిన నిరూపణము యీ కారణమువల్లనే చేసితిని. ఇటుపైని, నేను స్వయముగ నా ప్రతిపాదనము నొనర్తును. ఏవిధమగు అహింస యనెడి దుస్తును ధరించుటచే అంతర్జ్ఞానము వ్యక్త మగునో ఆ అహింసా స్వరూపమును నీకు వివరించి చెప్పెదను. ఇతనిలో

అహింసాభావము పూర్తిగా గలదు, లేదు - యనెడి విషయము ఆతని ఆచరణవలన మాత్రమే తెలియనగును. మచ్చురాతిపై మాత్రమే బంగారు వన్నెవచ్చురీతిని, జ్ఞానము మనస్సుతో మేళనము చెందినప్పుడు, సత్వరమే మనస్సున అహింసోదయ మగును. ఈ అహింసోదయ మెటుల జరుగునో చెప్పెదను వినుము. తరంగములను త్రెంచివేయకనే, నీటిని కదలించకుండానే వేగవంతముగ నైనప్పటికిని అతి తేలికపాదములతో కేవలము మత్స్యము పైపే ధ్యాన ముంచి కొంగ ఏ విధముగ అతి జాగ్రత్తగా నీటియందు పాదము నుంచునో, లేదా భ్రమరము తనలోపల గల పుష్పాది రాలిపోవునేమో యనెడి భయముతో కమలముపైన అతినెమ్మదిగ పాదము నిడురీతిని, ప్రతిపరమాణువుతోను పెక్కు అల్పమగు జీవములు చేరియుండు నని మనస్సునం దెరిగి, యీ కారణముచే, అతినెమ్మదిగ అడుగు లిడుట అహింసయొక్క లక్షణము. ఇట్టి మనుష్యుడు ఏ మార్గమున పోవునో, ఆ మార్గము కృపాపూర్ణ మగును. మరియు ఆత డేదిశను చూచునో ఆదిశను దయ, మరియు ప్రేమలతో నింపివేయును. ఇతర జీవులను రక్షించుటకై ఆతడెల్లప్పుడును తన జీవితము నర్పించుటకు సంసిద్ధుడై యుండును. ఓ అర్జునా! ఇట్టి పురుషుని ధ్యానపూర్వకమగు నడక శబ్దములతో వర్ణించుటకు అలవిగానిది. మరియు దానికి తగిన కొలమాన మేదియు లేదు. ప్రేమపూరితయై పిల్లి తనబిడ్డలను నోటితో కరచిపట్టుకొనినప్పుడు, అది తన దంతపు గొనలను ఎంత తేల్చి యుంచునో, లేదా ప్రేమభరిత యగు తల్లి తన బిడ్డలకై ఎదురు చూచుచున్న ఆమె దృష్టియం దెంత అధికమగు కోమలత్వము వచ్చునో, లేదా కమల పత్రమును ఊపుటచే దానిగాలి కనులకు ఎంతకోమలముగ తాకునో, అంత కోమలత్వముతోనే ఆతనిపాదములు కూడ భూమిపైపడును. ఆపాదము లెచ్చట పడునో అచ్చట నుండెడి జీవులకుకూడ సుఖమే కలుగును. ఓ అర్జునా! ఈ రీతిని నెమ్మదినెమ్మదిగా పాదము నిడునప్పుడు ఆతనికి మార్గమునం దెచ్చటనైన ఏదైన క్రిమి-కీటకము కనిపించుచో, ఆతడు నెమ్మదిగా వెనుకకు తొలగిపోవును. 'నేను తొందరగా నడచుచో నా స్వామియొక్క ఆత్మ సమాధికి భంగము కలుగును. మరియు ఆతని స్థిరప్రకృతికి దెబ్బతగులును' అని ఆ పాదము లనుచున్నవా యన్నటుల వుండును. ఈ చింతనతో ఆ పాదము వెనుకకు తొలగిపోవునేగాని అది ఏజీవినీ త్రొక్కివేయదు. తృణమునుకూడ

జీవముగ తలచి, దానిని తనపాదములచే త్రొక్కనివ్వని అత్యధికమగు జాగరూ
కతగల మానవులందు నిర్లక్ష్యముగ అడుగిడుట యనెడి చేటుల సంభవించును?
చీమ మేరు పర్వతమునులంఘించజాలని రీతిని, లేదా దోమయీదిసముద్రమును
దాటజాలని రీతిని, మార్గమున పడియున్న జీవికూడ ఆతని పాదములచే
త్రొక్కబడ నేరదు. నడకయందే యింత మిక్కుటమగు దయ నిండియున్న
ప్పుడు, యిక ఆతని వాక్కునందు మూర్తిత్వమును దాల్చిన సజీవముగ
నున్న దయయే నీకు కాన్పించును. ఆతని శ్వాసకూడ చాల మందముగను
కోమలమును నుండును. ఆతని ముద్ర 'ప్రేమకు పుట్టినిల్లా' - యన్నటుల
వుండును. ఆతని దంతములు మాధుర్యాంకురములే యగును. ఇట్టి వాని నోటి
నుండి అక్షరములు వెడలినప్పుడు, ఆ అక్షరముల ముమ్మందు స్నేహము
ప్రవహించుచూ పోవుచున్నదా యన్నటుల వుండును. ఆ అక్షరముల
విధానము 'కృప ముమ్మందు నడచు చుండగా దాని వెనుక ఆతని
నోటినుండి వెలువడిన శబ్దములు నడచుచున్నటుల' యుండును. సాధార
ణముగ ఆత డేమియూ మాట్లాడడు. ఒకవేళ ఆతడెప్పుడైన ఏదైన చెప్పవలె
నని మనస్సునందు సంకల్పించుకొనినప్పుడు, ఆ శబ్దములు ఎన్నడును ఎవనికిని
ఏమాత్రము కష్టము కలిగించనంత కోమలములుగ నుండును. ఆతడు మాట్లాడ
నారంభించినప్పుడు ఒక్కొక్కప్పుడు చాల ఎక్కువగా కూడ మాట్లాడును;
అయినప్పటికిని ఎన్నడును ఎవని మనస్సునకును ఏమాత్రపు కష్టము కలుగుట
గాని, భయముకలుగుటగాని వుండ నేరదు. 'తాను మాట్లాడినదానివలన ఎవని
కిని కార్యభంగము జరుగకుండునటులను, భయము కలుగుటగాని తొట్రు
పాటు నొందుటగాని జరుగకుండు' రీతిని ఎల్లప్పుడు జాగరూకత
వహించును; నావలన ఎవరికిని ఏమాత్రమైన కష్టము కలుగరాదు.
ఈ సంగతుల నన్నింటిని ఆతడు ధ్యానమం దుంచుకొని సాధారణముగ
మాట్లాడనే మాట్లాడడు. ఒకవేళ ఎవరి అనురోధము వల్లనైన ఆతడు మాట్లా
డుచో, శ్రోతలకు తమ తల్లి - దండ్రులు మాట్లాడుచున్నా రన్నటుల
వుండును. ఆతని శబ్దములు వినుటకు స్వయముగ నాద - బ్రహ్మయే అవత
రించె నన్నటుల, గంగా - జలమే పొరలి వచ్చుచున్న దన్నటుల, పతి-
వ్రతకు వార్ధక్యము వచ్చిన దన్నటుల - అంత శుద్ధముగను, కోమలముగను
వుండును. ఆతని యీ తూచి మాట్లాడెడి మధుర శబ్దములు అమృత - తరంగ

ములవలె తోచును. విరుద్ధమగు తర్కవాదము, హాస్యవాదము, జీవులకు సంతాపమును కలిగించు కఠోరత, పరిహాసము, కపటవాదము, మర్మస్పర్శ మగు మాటలు, యితరులను విరోధించుట, లేదా ఎవని మాటలనైన బాధించుట, కోపించుట, కటుత్వము, ఆశపెట్టుట, కళంకలు వెలి బుచ్చుట, మరియు గప్పాలు చెప్పకొనుట మొదలగు దుర్గుణములు అతని మాటలయం దేమాత్రము వుండవు. మరియు ఓ అర్జునా! అతని దృష్టిపాతము — కనుబొమలు పూర్తిగ జారి విడచినటులను మరియు వాటి యందు బలములేకుండ వున్నటులను వుండును. అత డిటుల చూచుటలో గల కారణము భూతకోటియందు పరబ్రహ్మ నివసించునని తలంచుటయే; ఇందుచే తన దృష్టి ఎవరికైన వ్యథగ తోచునేమోయనెడి భయముచే అతడు ఏవస్తువుపై పునః గంభీరముగ చూడడు. అతనియం దెల్లప్పుడీవృత్తి యుండును. అందుచే అత డెప్పుడైన తన హృదయమునం దుప్పొంగుచున్న కృపా బలముచే ప్రసన్నతను పొందిన కనులను తెరచి ఎవరిపైనైన ఒకటి — అర మారు చూచినప్పుడు, ఆ చూడబడిన వానికి చంద్రబింబమునుంచి వెలువడు అమృతధారను చూచుటతోడనే చకోరముయొక్క కుక్షి వెంటనే నిండిపోవు టచే అదెట్లు తృప్తిపొందునో ఆరీతిని–తృప్తి కలుగును. అతని కృపాదృష్టిపడుటతోడనే జీవులన్నియూ యిట్టిస్థితినే పొందును. ఆడతాబేలుయొక్క చూపు అత్యంత ప్రేమపూర్ణముగ నుండుననుట ప్రసిద్ధమే. అయినప్పటికిని, యిట్టి సత్పురు షుని చూపునందుండు మహత్త్వము ఆ ఆడతాబేలు చూపునందుకూడ వుండదు. భూతకోటియెడ యిట్టి చూపునే గలిగియున్నప్పుడు, అతని హస్త ములుకూడ సరిగా యిదేరీతిని ఉండుననుటలో ఆశ్చర్యమేమి గలదు? కృతార్థులైనందువలన సిద్ధపురుషుల మనోరథము లన్నియు ఎచ్చటి వచ్చట శాంతి పొందురీతిని, ఎవని చేతులు నిశ్చలములు మరియు నిష్క్రియలు యగునో, ఎవనిచేతులు మొదటనుండియు పనులను చేయుటలో అసమర్థ ములై యుండి – అందుపైన, సన్న్యాసము, లేదా పనులు చేయకపోవుట యనెడి ప్రతిన బూని యున్నవో, లేదా ఎవనిచేతులు మొట్టమొదట కాలుట యనునేమోకూడా యెరుగనివై యుండి, అందుపైన అందలినిప్పు చల్లారిపోయి యున్న కట్టెల వంటివో, లేదా ఎవనిస్థితి మూగతనముతోబాటు మౌనవ్రతము బూనిన మానవుని చందముగ నుండునో, యిదేరీతిని నితాంత వ్యాపార

శూన్యుడు మరియు నిష్క్రియుడునగు పురుషుని శరీరమునందున్న వగుటచేత-
ఎవని చేతులకు చేయవలసిన దేదియూ మిగిలియుండదో, వాయువుకు దెబ్బ
తగులునని గాని, లేదా ఆకాశమునకు గోళ్ళు గుచ్చుకొనునని భయముచేత
గాని-ఎవడు తన చేతులను ఊగనైననివ్వడో, యట్టివాడు తన శరీరముపై వాలిన
యీగను తోలుకొనునని గాని, లేదా కనులయందు దూరుచున్న ఏ క్రిమినైన
దులిపి ఆవలకు నెట్టివేయునని గాని, లేదా పశు-పక్షులను బెదరించి పార
ద్రోలునని గాని చెప్పుటకు వలనుపడదుగదా! ఓ అర్జునా! తనచేత ఎన్నడును చువ్వ
గాని కొరడా గాని పట్టబట్టి వానిని గురించి శస్త్రముల నెన్నడు ముట్టనేనుట్టదని
చెప్పనక్కరలేదు. అతడెన్నడును కమలమునుగాని పూలచెండునుగాని ఎగుర
వేయు ఆటనుకూడ ఆడడు. ఏలనన, అతనికి తన చేతియందలి కమలముగాని,
పూలచెండుగాని ఎవరిపైనైన పడి దెబ్బతగులు నేమోయనెడి భయముండును.
రోమములు అణగి పోవుననెడి భావముతో అతడెన్నడును తన అంగములపై
చేతితో నిమురుకొనడు. గోళ్ళకు కష్టము గలుగ జేయకుండు తలంపుతో
వాటిని కత్తిరించడు, మరియు, వ్రేళ్ళపై నఖకుండలము లేర్పడు రీతిని వాటి
నాతడు పెంచుచుండును. ఈరీతిని యిట్టి పురుషునందు పూర్తిగా కార్యా
భావముండును. ఇటు లున్నప్పటికిని, అతడేకార్యమునైన ఉపక్రమింప
వలసివచ్చెనో, పైన చెప్పిన రీతిని చేయుటే అతని చేతులకు అభ్యాసమై
యుండుచు అతని చేతులు ఎవనికైన అభయ మిచ్చుటకే పైకి లేచును. ఎవని
కైన ఆశ్రయ మిచ్చుటకొరకే ముందుకు సాగును. మరియు ఎవరైన దుఃఖ
ముతో నున్నవానిని కోమలత్వముతో స్పర్శించుటకే చలించును. మరియు
యీపనులన్నియు కూడ అతని వలన తప్పనిసరియైన పరిస్థితియందే జరుగును,
దుఃఖముగల వారి భయమును పోగొట్టుటకై అతనియందుండు చల్లదనము,
చంద్రికిరణములందు కూడ కానరాదు. అతని చేతులు ఏదైన పశువును
చమిరినప్పుడు, వాటి (చేతులు) స్పర్శ సుగంధిత మలయ వాయుస్పర్శతో
సమానముగ నుండును. ఆహస్తములెల్లప్పుడు నిర్లేపముగను, స్వతంత్రము
గను నుండును. మరియు, చల్లనగు చందన తరుశాఖలవలె వాటియందు ఫల
ములెన్నడును కాయవు, అయినప్పటికిని ఆహస్తము లెన్నడును నిష్ఫలములు
గావు; ఏలనన, వాటి శీతలత్వము మరియు ప్రేమార్ద్రతలు బహుమూల్యము,
అక్షయము మరియు సర్వవ్యాపియునై యున్నది. ఓ అర్జునా, ఆతని అరచేతులు

సాధువులు-మహాత్ములయొక్క శుద్ధము-శీతలమునగు శీలమును బోలియుండునని తెలిసికొనుము. ఇట్టి పురుషుని మనస్సును గురించికూడ వర్ణించవలసి యున్నది. ఇప్పటివరకు నేను వర్ణించిన పురుషుని ఆచరణ, ఆతని మనస్సుయొక్క ఆచరణకాదా? కొమ్మలు చెట్టువి కాకుండా వుండునా? నీరు లేకుండా సముద్రమెటుల వుండగలదు? తేజస్సు మరియు తేజస్సుగల పదార్థమూ - యీ రెండును ఎన్నడైన ఒకదాని కొకటి భిన్నముగ నుండునా? అవయవము మరియు శరీరము, లేదా రసము మరియు నీరు - యివి విడివిడిగా ఎన్నడైన వుండగలవా? కావున, నేనిప్పటివరకు అట్టిపురుషుని బాహ్యాచరణమును గురించి చెప్పిన సంగతులను యిట్టి అవయవములతో కూడియున్న ఆమనస్సు యొక్క విషయములుగా నెరుంగుము. భూమిలో విత్తునునాటెదరు. అదే వృక్షరూపమునబయటకు వెడలివచ్చును. ఇదే రీతిని లోపలగల మనస్సేయీయింద్రియములద్వారా బయటకు ప్రకటమగునని తెలిసికొనుము. ఏలనన, మనస్సులో అహింస లేకున్నచో, అది బయటకు ఎటుల వెడలి రాగలదు? ఓ అర్జునా! ప్రప్రథమముగా అహింసా భావము మనస్సునందే ఉద్భవించుననిన్నీ, అటు పిమ్మట అది వాక్కు, చూపు మరియు చేతులద్వారా ప్రకటమగుననిన్నీ నీవు జ్ఞప్తియం దుంచుకొనుము. అటుల కానిచో, మనస్సులో లేని విషయము వాగ్రూపముగా బయట కెటుల రాగలదు? విత్తులేనిదే భూమినుండి మొక్క మొలచునా? ఇందువలననే మనస్సుయొక్క మనత్వము నశించుటకు పూర్వమే ఇంద్రియములు పూర్తిగా దుర్బలమై పోవును, ఏలనన సూత్రధారుడులేని కొయ్య బొమ్మలు వ్యర్థమే యగునుగదా! సెలయేటియొక్క జన్మస్థానమే యెండిపోవునెడల దాని ప్రవాహమునందు నీరెచ్చటినుంచిరాగలదు? జీవుడే వెళ్ళిపోయినప్పుడు, యిక ఆదేహవ్యాపారము లెచట మిగిలియుండును? కాన ఓ అర్జునా! సమస్తయింద్రియ వ్యాపారములకును మూలము మనస్సే. ఇంద్రియములద్వారా మనస్సే సమస్తవ్యాపారముల నొనర్చును. అంతస్థమైన మనస్సు ఏ సమయమున ఏస్థితియం దుండునో, ఆ సమయమునందాస్థితిలో అది క్రియలరూపమున యింద్రియములద్వారా ప్రకటమగును. పక్వమైన ఫలముయొక్క సుగంధము వేగముగ బయటకు వెడలివచ్చురీతిని, మనస్సుయొక్క వాస్తవికమగు అహింసకూడా అణచిపెట్టినప్పుడు ఆవేశముతో బయటకు వెడలును. అంతట, ఆ అహింసయనెడి మూలధన

మును గైకొని యింద్రియములు అహింసా వ్యాపారము చేయసాగును. సముద్రమున పోటువచ్చినప్పుడు దానియందలి నీరు అఖాతములను నింపివేయును. ఇదేరీతిని మనస్సుకూడ తనసంపదలతో ఇంద్రియములను సంపన్నమొనర్చును. గురువు కుర్రవాని చేతిని పట్టుకొని తానే అక్షరములు వ్రాయునట్టి, మనస్సుకూడ కాళ్ళు - చేతులు మొదలగు యింద్రియములలో ప్రవేశించి వాటి ద్వారా దయాపూరితమగు పనులను చేయించును. మరియు వాటితో అహింసను ఆచరింపజేయును. కావున, "ఓ అర్జునా ! నే నిప్పుడు చేసిన యింద్రియ క్రియల వర్ణనము వాస్తవమునకు మనస్సుయొక్క వ్యవహారవర్ణనమే. కాన, ఏ పురుషునియందు మనో వాక్కాయ కర్మలచే పూర్తిగా త్యజించబడిన హింస నీకు కనిపించునో, ఆ పురుషుని వాస్తవముగ జ్ఞానవిలాసి లేదా జ్ఞానమునకు నివాసస్థానముగనే తెలిసికొనవలెను. కేవలము యింతేగాదు. అతడు మూర్తివంతమైన జ్ఞానిమే యని యెరుంగుము. మన మిప్పుడు చెవులతో వినిన మరియు గ్రంథములలో వర్ణింపబడిన అహింసా మహిమను ప్రత్యక్షముగ చూడవలెనని నీకు తలంపు గలుగుచో నీవాపురుషుని చూచి తీరవలెను." ఈరీతిని శ్రీకృష్ణ భగవానులు అర్జునునితో చెప్పిరి. వాస్తవమునకు యీ విషయముల నన్నింటిని ఏ కొద్ది మాటలలోనో చెప్పవలసి యుండెను. కాని వీటిని వివరించుట యనెడి ఆవేశమునకు లోనై నేనింత ఎక్కువగా చెప్పితిని. కాన మీరు నన్ను క్షమింతురుగాక, ఓ శ్రోతలారా! తరుచు మీరు "పచ్చగడ్డిని చూచి పశువు తన వెనుక మార్గమును మరచునట్టి, వాయు తరంగముతో పాటుగా ఎగిరెడి పక్షి ఆకాశమున ముందుకే సాగిపోవు రీతిని, యీ ప్రేమ స్ఫురణ ఒక్కమారు కలుగుతోడనే మరియు యీ రసాల భావ ప్రవాహమున పడినప్పుడు యీతని చిత్తము యీతని వశమునందుండదు" అని అనవచ్చును. కాని, నన్ను గురించి మీ రిటుల అనుట తగదు. దీనిని విపులీకరించుటలో మరొక కారణము గలదు. వాస్తవముగ చూచినచో 'అహింస' యనెడి శబ్దమునందు మూడే అక్షరములు గలవు. పైకిచూచుటకు, దీని అర్థము అతికొద్దిలో వివరించవచ్చునన్నటుల కనిపించును. కాని, అహింసయొక్క అర్థమును పూర్తిగను, స్పష్టముగను, నిస్సంశయముగను చెప్పవలెనన్న భిన్నభిన్నమతములను ఖండించవలసి యున్నది. అటులచేయనిచో భిన్నభిన్న మతములు కాన్పించును. అటు

లోపగ్రహకుండా, నేను నా అభిమానము కొలది, ఆమతములన్నిటిని ఒకప్రక్కన విడచి, కేవలము నా వివరణమునే చెప్పుదు నేని, అది మీకు నచ్చదు. రత్న విక్రేతవద్దకు మనము వెళ్ళినప్పుడు, రత్నపరీక్ష చేయుటకుగాను గండశిలను తీసి వచ్చినవారియెదుట పెట్టుట ఆతనికి తగియుండును. అంతేగాని, అచ్చట స్ఫటికమణిని ప్రశంసించి నందువలన కలుగు ప్రయోజన మేమి వుండును? ఇందుకు సుస్పష్టముగ, పిండికూడ అమ్ముడుకాని ప్రదేశమున, కర్పూరమువంటి సుగంధవస్తువులకు ఆదరణ యెట్లు లభించును? మీవంటి మహాత్ములుగల సభలో కొంతఎక్కువగ ముచ్చటించినప్పటికిని దోషములేదు. సామాన్యశ్రోత లన్యావిశేషాధికారముగల శ్రోతలనూ వారివారి సంస్కారభేదము ననుసరించి విడదీయక, అందరిని ఒకేమాలలో గ్రుచ్చదగునా? నాచుతో నిండియున్న నీటి వైపు హంసలెన్నడును చూడనే చూడవు. చంద్రుడు మేఘముల చాటున మరుగుబడి పోయినప్పుడు చకోరపక్షి తన చంచుపుటములను ఉత్సుకతతో పైకెత్తి చూడదు ఇదేరీతిని నేనుకూడ నా వాదనను నిర్వివాదముగను, నిస్సంశయముగను నిరూపించకున్నచో, మీరుకూడ శ్రవణవిషయమునం దాదరణ చూపరు. మరియు యీ గ్రంధమును చేతబట్టరు. ఇంతేగాదు. నాపై కోపమునుకూడ చెందెదరు. ఇతరమతముల నిరాకరణ, ఆక్షేపణల ఖండనమూ లేని వివరణము మీకెన్నటికిని గ్రాహ్యము కానేరదు. వాస్తవిక దృష్టితో చూచినచో మీరే యీగీతార్థమునకు దగ్గరిబంధువులు. ఇది తెలిసియే నేను యీగీతను హృదయమునకు ఆలింగన మొనర్చుకొంటిని. అంతేగాక, మీరు మీజ్ఞానము నంతయిచ్చి దీనిని నావద్దనుంచి విడిపించుకొని పోదురనికూడ నే నెరుంగుదు. ఈ గీత గ్రంథము గాదు. మీరు నావద్ద కుదువబెట్టిన మీ వస్తువే. మీరు మీ లోభిత్వమువలన మీ జ్ఞానము నంతను నావద్దనుంచి దొంగిలించుకొని పోవుచో, మరియు యీ గీత నావద్ద యీరీతిగనే కుదువగా వుండిపోవలసి వచ్చుచో, యీగీతకు మరియు నాకు ఒకే పరిణామము సంభవించును. సారాంశ మేమన, నేను మీ కృపను సంపాదింప దలంచుచున్నాను. ఈ ఉద్దేశ్యముతోనే నేనీ గ్రంథ రచన మనెడి నెపము కల్పించితిని. ఇందుచే మీకు నచ్చు రీతిని శుద్ధము, నిర్దోషమునగు విధమున నేను దీనిని నిరూపించవలసి వచ్చినది. ఇందుచే నేను భిన్నభిన్నమతములను గురించి ముచ్చటించితిని. కాన నన్ను క్షమింపగోరెదను. అన్నపు కణములందలి కంకరపలుకును

తీసివేయుటకు కొంచెము సమయము పట్టుచో అందేదోషము లేదు. ఏలనన, కావలసినది ఆ రాతిని తీసివేయుటయే గదా ! బాలునకు మార్గమున నొక వంచకుడు కలసినప్పుడు, ఆ వంచకుని బారినుండి తప్పించుకొని యింటికి వచ్చుటలో కొంత ఆలస్యమగును. ఆ బాలునిపై తల్లి కోపము చెందవలెనా, లేక అతనికి దిష్టి తీసి కౌగలించుకొనవలెనా? కాన దీనిని గురించి విస్తరించనక్కరలేదు. ఇక శ్రీకృష్ణభగవాను డేమి చెప్పెనో వినుడు.

భగవాను డిటుల యనెను "సోదరా అర్జునా! జ్ఞానాంజనము వలన నీ దృష్టి తెరపుడు పడినది, ఇక నీవు సావధానుడవు కమ్ము. నీ కిప్పుడు వాస్తవిక జ్ఞానము నెరుక పరచెదను. ఎవనియం దీరీతిని క్షమ విరాజిల్లు చున్నదో, ఎవనియందు ఖేదము పేరుకుకూడ లేదో, అట్టివానికే నిజమైన మరియు వాస్తవికమైన జ్ఞానము లభించినదని నీ వెరుంగుము. లోతైన సరోవరమున కమలములు, భాగ్యవంతుల యిండ్లయందు సంపదయు వుండురీతిని, ఓ అర్జునా! నిజమైన జ్ఞానముగల పురుషునందు క్షమ నిండి యుండును. 'ఈ క్షమను ఏ లక్షణములవలన గుర్తించవగునో'? చెప్పెదను వినుము. మనకు చక్కగా నుండెడి నగను అతిప్రీతితో శరీరముపై ధరించురీతిని, అట్టి పురుషుడు అన్ని సంగతులను అంత ప్రీతితో ఓర్చుకొనును. త్రివిధ తాపములనెడి పర్వతము వచ్చి ఆతనిపై పడినప్పటికిని, ఆత డించుకంతయైన విచలితుడుకాడు. ఇష్టవస్తువులవలె అనిష్టవస్తువులనుకూడ ఆతడు అత్యాదరముతో స్వీకరించును. ఆతడు మానావమానములను సహించును, సుఖ దుఃఖముల నన్నింటిని సమానముగ భావించును, మరియు నిందాస్తుతులకు చలించడు. ఆతడు ఉష్ణమునకు తపించడు, చలికి వణకడు, ఎంతటి వికట పరిసంగమైన వచ్చుగాక, ఆతడు పారిపోడు. మరియు భయపడనూ భయపడడు. మేరుపర్వతమునకు తన శిఖరభార మేమాత్రము తెలియనటుల, నారాయణుని మూడవ అవతారమగు యజ్ఞ-వరాహావతారము భూభారము నేమాత్రము ఎరుంగనటుల, అసంఖ్యాకములగు భూతకోటియొక్క బరువుచే భూమి అణగిపోనిరీతిని సుఖ-దుఃఖాది ద్వంద్వములు శరీరముపై వచ్చిపడి నందువల్ల ఆత డించుకయు కంగారుపడడు. పెక్కు నదీ-నద సముదాయముతో పాటు వచ్చు అపరంపార జల సమూహముకొరకై సముద్రము

తన కుక్షిని విశాలవంతముగ నొనర్చుకొని వాటి అన్నిటికి తన కుక్షిలో స్థానమిచ్చురీతిని, యిట్టివానికికూడ అతడు సహించని విషయమేదియూ ఎన్నడును నుండదు. ఇంతయైనప్పటికిని ఆతనికి నేను ఫలానా ఫలానా విషయములను ఓర్చుకొంటిననెడి ఆభాసయే వుండదు. ప్రాప్తించిన ప్రతిదానిని ఆత్మ స్వరూపముగ నెంచి అతడు సహించును. మరియు ఆతనికి తన యీ సహనశీలతను గురించి అభిమానము పొందవలసిన కారణమేదియు నుండదు. సఖుడవగు ఓ అర్జునా! యీ విధమగు భేద - భావ - రహితమగు క్షమ ఎవనియందు గలదో, అట్టి పురుషుని మూలమున జ్ఞానముయొక్క మహిమవృద్ధి నొందగలదని ఎరుంగుము. ఓపార్థా! ఇట్టి పురుషుడు జ్ఞానమునకు ఆధారుడే. ఇక ఆర్జవమును నిరూపించెదను, వినుము. ప్రాణికోటిపట్ల ప్రాణతత్త్వ మేరీతిని ఒకేవిధమగు సౌజన్యము చూపునో, ఆదేరీతిని ఆర్జవముకూడ అందరి యెడను భేదభావరహితముగ వ్యవహరింప జేయును. సూర్యుడు ఎన్నడును ఎవని ముఖమును చూచియైన (ఎవనినైన తన కిష్టుడుగతలంచి) ఆతనిపై తానెక్కువగ ప్రకాశించనిరీతిని, ఆకాశతత్త్వము ఆకాశము నంతను సమభావముననే వ్యాప్తమొనర్చియుంచురీతిని, ఆర్జవము గలవాని మనస్సు భిన్నభిన్న మానవులతో భిన్నభిన్నరీతిని వ్యవహరించక, అందరితోను ఒకేరీతిని వ్యవహరించును. ఏల నన, యిట్టి పురుషుడు జగత్తుయొక్క స్థితిని చాల చక్కగ ఎరిగియుండి యుండును. మరియు ఆతనికి 'జగత్తుతో నాకు గల ఆత్మైక్యము అతి ప్రాచీనమైనది. మరియు అతిదగ్గర సంబంధముగలది' యనెడి జ్ఞానము పరిపూర్ణముగ కలిగియుండును. ఇందుచే ఆతనికి 'నాది-పరునిది, యనెడి ఆభాసయే ఎన్నడును కలుగజాలదు. ఆతడు నీటివలె ప్రతి మనుష్యునితోను కలిసిపోవును, ఆతడు తన మనస్సునం దెవరి విషయమునను ద్వేష ముంచుకొనడు, అతని యోచనలెల్లప్పుడు వాయుప్రవాహముతో సమానముగ పూర్తిగా సరళముగనుండును, మరియు ఆతనిని ఏవిధమైన సంశయముగాని ఏవిధమైన భావముగాని స్పర్శించనేలేదు, తల్లిఎదుటకు పోవుటకు బాలునకేవిధమగు సంశయము వుండనిరీతిని, లోకులయెదుట తన మనోవృత్తిని ప్రకటించుటలో కూడ అతనికేవిధమైన సంశయము కాన్పించదు. ఓ అర్జునా! కమలము వికసించినప్పుడు, దాని యందలి ఏ భాగమున్నూ అటుపైని మూసికొని యుండనేరదు. ఇదే

విధమున, ఆతని మనస్సు కూడ పూర్తిగా తెరువబడియుండును. మరియు అందు మూసియున్న, లేక దాచియుంచిన భాగమేదియూ నుండదు. ప్రథమమునసే రత్నము స్వచ్ఛమైనది. అందుపై పైనుండి తేజోవంతమగు కిరణములుకూడ పడినరీతిని, ఆతని మనస్సు మొదటినుండియే పూర్తిగా నిర్మలమైనది. అందుపై ఆతని మానసిక క్రియలుకూడ అంత నిర్మలముగనే వుండును. 'నే నీ విషయము చెప్పనా – వద్దా ' అనెడి ముందు – వెనుక లాడవలసిన విషయ మేదియు ఆతని కెన్నడును వుండదు; మరియు అతడు తన వాస్తవిక అనుభవములను పూర్తిగా యథాప్రకారముగ వెలిబుచ్చును. తన మనస్సునందలి విషయమును కొంత వెలిబుచ్చి, కొంత దాచియుంచుటను ఆత డెరుగనే యెరుగడు. ఆతని దృష్టిలో కపటము నామమాత్రమునకైన వుండదు. మరియు ఆతని మాటలయందు దాపరికముగాని అస్పష్టతగాని వుండనే వుండదు. అతడు ఎవరితోను తుచ్ఛముగ వ్యవహరించడు. ఆతని దశేంద్రియములు పరిపూర్ణముగ నిష్కపటము, సరళము, మరియు శుద్ధమైనవిగ నుండును. అంతేగాక రాత్రింబవళ్ళు ఆతని పంచప్రాణద్వారములు పూర్తిగ తెరచుకొనియుండును. ఆతని అంతరంగము అమృతధారవుబోలి సరళముగ నుండును. ఈ లక్షణములన్నియు చక్కగా ఎవనియందు కనిపించునో, ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా! ఆతడు ఆర్జవగుణమూర్తి యనియు, ఆతనియందు జ్ఞానము యిల్లు కట్టుకొని యుండుననియు ఎరుంగుము. ఓ చతురశ్రేష్ఠుడవగు అర్జునా! యికనీకు గురుపూజ ఎటులచేయవలెనో చెప్పెదను. సావధానుడవై వినుము. ఈ గురుసేవ భాగ్యమునకు జననివంటిది; ఏలనన, శోచనీయస్థితియందున్న జీవునకుకూడ యిది బ్రహ్మస్వరూప ప్రాప్తిని కలిగించును. ఈ గురుభక్తికి సంబంధించిన విషయములు నీకు విస్పష్టముగ తెలిపెదను; ఏకాగ్రచిత్తుడవు కమ్ము. జలసంపద నంతను తన వెంటనిడుకొని నదిసముద్రమువైపు పోవురీతిని, మహాసిద్ధాంతములన్నిటి తోడను వేద-విద్య బ్రహ్మపదమునందు స్థిరపడు రీతిని, పతివ్రతా స్త్రీ తన పంచప్రాణములను ఏకత్ర మొనర్చి తనగుణావగుణములన్నింటితోడను తనప్రియభర్తకు అర్పించురీతిని. ఎవడు తన సర్వస్వమును గురు-కులమున కర్పించునో మరియు ఎవడు తాను గురుభక్తికిపుట్టినిల్లగునో,ఎవడు గురు గృహస్థానమును 'విరహస్త్రీ తన పతినిగురించి తలపోయుచుండురీతిని'

తలచుచుండునో, గురుగృహ స్థానమువైపునుంచి గాలి వచ్చుటను చూచి దానిని సమ్మానించుటకై పరుగెత్తిపోయి దానిముందు నిలబడునో, మరియు దానిముందు నేలపైపవళించి 'నాయింటిలోనికి రమ్ము' అని దానిని ప్రార్థించునో, నిజమగు ప్రేమవలన ఎవనికిగురు గృహముగల దిశతో మాట్లాడుటయిష్టముగనుండునో, మరియు, ఎవడు తన జీవనమును గురుగృహమునకు హక్కుదారుగా చేసుకొనునో, ఎవని శరీరము గురుని ఆజ్ఞతో బంధింపబడి యుండుటవలన గురునకు దూరముగ తన యింటియందు వున్నప్పటికిని చూడ పలుపుచే బంధింపబడి గోశాలలోపడి యుండుదూడవలెను బంధితుడైయుండి కూడ ఆదూడ సదా నిరంతరము తన మనస్సున 'ఈ పలుపు యనెడి బంధమెటుల తెగిపోవునా' యని తలంచుచుండునో మరియు 'గురుదేవుని దర్శనమెటుల ఎప్పుడు లభించునా యని తలంచుచుండునో, ఎవనికి గురువియోగముగల ప్రతిక్షణము ఒక్కొక్క యుగముకంటె అధికముగ తోచుచుండునో మరియు, యిట్టి స్థితిలో తన గురుని నివాసస్థానమునుంచి ఎవరైన వ్యక్తి వచ్చునెడల, లేదా, ఆతని గురువు ఎవరినైన తనవద్దకు పంపించునెడల చావునున్న వ్యక్తికి ఆయువు లభించినప్పుడు, లేదా ఎండిపోవుచున్న మొలకకు అమృతవర్షము లభించినప్పుడు, లేదా చిన్నగుంటలో వసించుచుండు మత్స్యమునకు సముద్రమున ప్రవేశించినప్పుడు, లేదా పరమదరిద్రునకు ఎచ్చటనైన పాతిపెట్టబడిన ధనములభించినప్పుడు, లేదా గ్రుడ్డివానికి దృష్టిలభించినప్పుడు, లేదా దరిద్రునకు యింద్రపదవి లభించినప్పుడు ఎంత ఆనందము లభించునో అంతటి ఆనందము అతనికి లభించును. ఇదేరీతిగ ఆతను గురుకులముపేరువినుటతోడనే సౌభాగ్యరసమునం దైక్యముచెందినవాడై పట్టరానంత ఆనందమును పొందును. ఆకాశమునుగూడ సహజముగ ఆలింగనము చేసుకొనును. గురుకులమునెడ ఎవని యందిట్టి ప్రేమ కనిపించునో ఓ అర్జునా! అతనికి సేవాజ్ఞానము నిరంతరము స్థిరమైయుండునని నీవు తెలిసికొనుము. ఆతడు తన ప్రేమ బల సామర్థ్యమువలన తన అంతఃకరణమునందు తన గురుదేవుని మూర్తిని స్థాపించుకొని, ధ్యానముద్వారా అతనిని ఉపాసించును. ఆతడు తన హృదయమనెడి నిర్మలమగు కోటలో తన ఆరాధ్య గురుదేవుని దృఢముగా స్థాపించుకొని తా నత్యధికమగు భక్తి భావముతో ఆతనికి సర్వవిధములగు పరివారముగ నగును. జ్ఞానమనెడి అరుగుపై ఆత్మానంద

మనెడి మందిరములో తన గురుదేవునిమూర్తిని స్థాపించి జ్ఞానా
మృతము[illegible] సేవించుచు, బ్రహ్మబోధయనెడి సూర్యోదయమునట తోడనే
తన బుద్ధియనెడి బుట్టను సాత్త్వీక భావములతో నింపి తన గురుదేవుడనెడి
లింగముపై ఆ భావములనెడి అక్షుపత్రిపూజ చేయును. పగటియందలి
ప్రాతఃకాల, మధ్యాహ్న, సాయంకాలములనెడి త్రికాలములందును
శాస్త్రోక్తసమయములందు జీవభావమనెడి ధూపమును వెలిగించి
జ్ఞానదీపము అతిగొల్లప్పుడు గురుదేవుని కర్పూర హారతులిచ్చును.
ఆ పిమ్మట, ఆ ప్రతి [illegible] ఐక్యమనెడి నైవేద్యము
నర్పించును. ఈ [illegible] అతడు తానే పూజారియై, తన గురుదేవుని ఆరాధ్యదేవ
తగ నారాధించుకొనును. అప్పుడప్పుడు అతని బుద్ధి జీవమనెడి శయ్యపై గురురాజును
పతిగా కల్పించుకొని, అతని సహవాససౌఖ్యము ననుభవించును. మరియు
ప్రేమానందము ననుభవించును. ఒక్కొక్కప్పుడు అతని అంతరంగమున ఒక
దివ్యమగు ప్రేమ తరంగము లేచును, అప్పుడాతడు దానికి క్షీరసాగరమని పేరు
పెట్టును. అతని యాప్రేమ సముద్రమున జ్ఞానసుఖమనెడి నిర్మలమగు శేష-
పాన్పుపై ఆ[illegible] నారాయణుడు [illegible]
మొందును. [illegible] నారాయణుని పాదములను ఒత్తెడి
లక్ష్మి [illegible] సేవలు చేయుచు [illegible]
[illegible]. ఆ గురుమూర్తి నారాయణుని
[illegible] బ్రహ్మనుకూడ అతడు [illegible]
కల్పించుకొనును. ఈ [illegible] అతడు గురుమూర్తిపైగల ప్రేమలో మానసిక
ధ్యానసుఖమును అనుభవించును. ఒక్కొక్కప్పుడాతడు గురుదేవుని తనతల్లిగ
భావించి ఆమె ఒడియందు పవళించి స్తన్యపానమనెడి కల్పితసుఖమును అను
భవించును. ఓ అర్జునా, ఒక్కొక్కప్పుడాతడు జ్ఞానమనెడి వృక్షముయొక్క
చల్లని నీడలో శ్రీగురుదేవుని ధేనువువలెను, తనను దాని దూడవలెను -
భావించుకొనుచుండును. లేదా మరొకప్పుడు గురుకృపను జలమువలెను,
తానందలి మత్స్యముగనూ భావించును. వేరొకప్పుడు గురుకృపను వర్షపునీరు
గనూ, తానా వర్షపునీటిచే వృద్ధినొందెడి సేనావృత్తియనెడి మొక్కగనూ తలం
చును. ఇంకొకప్పుడు తాను రెక్కలురాని పక్షిపిల్లననీ, గురువు తనతల్లి పక్షి
యనీ, మరియు ఆతనినుండి తాను ఆహారము గైకొనుచున్నటులను కల్పన

మొనర్చుకొనును. గురుదేవుడు నావవంటివాడనీ, తానాతనిని ఆశ్రయించితి ననీ భావించును. పోటు వచ్చినప్పుడు సముద్రమునం దెడతెగకుండా అలలు లేచు రీతిని, ఆతని ప్రేమ తరంగములు కూడ ధ్యానపరంపరను అవిరామముగ నడుపుచూ పోవుచుండును. ఈ రీతిని ఆతడు తనమనస్సునందు నిరంతరము గురుమూర్తిని ఉపభోగించుచుండును. ఇక ఆతడా గురుదేవుని దృశ్యసేవ, లేదా ప్రత్యక్షసేవ నెటులొనర్చునో వినుము. ఆతని మనస్సునందెల్లప్పుడును తనసేవకు గురువు ప్రసన్నుడై "శెబాసుశిష్యా! నీకేమి వరము కావలెనో కోరుకొనుము" అని అనురీతిని సేవించవలెననెడి భావముండును. గురుదేవు డీ రీతిని ప్రసన్నుడైనప్పుడు తాను వినయముతో "ఓ మహారాజా! మీపరివార మంతయూ నేనే అగుదునుగాక' మీకు ఉపయోగించెడి ఉపకరణములన్నింటి రూపములను నేనే ధరించెదను. గాక-అని కోరుదుమని" ఆత డనుకొనును. నేనీ రీతిని వారిని వర మడిగినప్పుడు, వారు ప్రసన్నులై 'తథాస్తు' అందురు. మరియు నేనొక్కడనే అప్పుడు వారి పరివారమంతయు నగుదును. గురుదేవుని సేవించు ఉపకరణములన్నియూ నేనే అయినప్పుడు నాకుగురుసేవయొక్క వాస్తవిక కౌతుకము చూచుటకు లభించును. ఈ రీతిని గురుదేవుడు అందరికి-తల్లియైనప్పటికిని నేను, వారు నా ఒక్కరికే తల్లియైయుండు రీతిని వారిని ఒత్తిడిచేసెదను. వారు నాతో ఏకపత్నీవ్రతస్థునివలె నుండురీతిని వారిప్రేమ ఎల్లప్పుడు నా సీమయందే వుండురీతిని వారిచే క్షేత్రసన్యాస వ్రతమును కూడ ఆచరింప జేసెదను. నిత్యమూ వీచుగాలి నాల్గుదిక్కులందలి సరిహద్దులను దాటి బయటకు పోనిరీతిని, నేనుకూడ ఒకపంజరమునై గురుదేవుని కృపనంతను నాయందేఆబద్ధమొనర్చుకొని యుంచుకొందును. గురుసేవయనెడి యజమానురాలును నాసమస్త సద్గుణములనెడి నగలతో అలంకరింతును. ఇంతియేకాదు, నేనేగురుభక్తి కంతటికి ఆచ్ఛాదనముగ నయ్యెదను, మరెవ్వరినిఅట్టి ఆచ్ఛాదనముగ కానివ్వను. గురుప్రసాదమనెడి వర్షము కురియనారంభించినప్పుడు నేనే పృథివిగానై దానిక్రిందనుందును. ఈ రీతిని ఆతడు తన మనస్సు నందనేకములగుమనోరథములను రచియించుకొనుచుండును. తానుగురుదేవునిగృహముగ కావలెననీ, ఆ యింటియందు తానే గురుదేవుని సేవకుడుగనుండి ఆతని పనులన్నిటిని చేయుదుననీ — తలంచుచుండును. ఉదారుడూ, దాతయూనగు గురుదేవుడు రాక - పోకలప్పుడు దాటెడి వీధిగుమ్మముగకూడ

తానే అగుపననీ మరియు ద్వారపాలకుడుగానై తానే గుమ్మమువద్ద కాపలా కాయుచుందుననీ—అనుకొనును. నేనే ఆయన పాదుకలుగ నయ్యేదను, మరియు నేనే ఆయనకు పాదుకలను తొడగెదను. నేనే ఆతనికి నీడనిచ్చు గొడుగు నయ్యేదను, మరియు ఆతనికి గొడుగు పట్టుటనుకూడ నేనే చేసెదను. దారియందలి మిట్ట—పల్లములు చెప్పెడి చోపుదారుగకూడ నేనే అయ్యేదను. నేనే ఆయన చేతికర్ర నయ్యేదను, నేనే వారిముందు దీపము పట్టెడి మషాల్చీగా నయ్యేదను. నేనే వారి జారీ చెంబుగ నయ్యేదను, నేనే వారిని పుక్కిలించి ఉమియునట్లుగాకూడ నొనర్చెదను; వారు పుక్కిలించి ఉమిసెడి పదార్థమును మోసెడి డబ్బాగాకూడా నేనే అయ్యేదను. నేనే వారి తమలపాకుల పెట్టెగా నయ్యేదను. మరియు తమలపాకులు నమిలి ఉమిసెడి ఉమ్మిగాకూడ నేనే అయ్యేదను. వారిని స్నానమునకు కూడ నేనే సంసిద్ధ మొనర్తును, వారి ఆసనము, అలంకారము, వస్త్రము, మరియు చందనము మొదలగు నలుగుపిండిగా కూడ నేనే అయ్యేదను. నేనే వారి వంటవాడనై వారిముందు సిద్ధముచేసెడి మహానైవేద్యము నుంతును. మరియు నేనే వారికి నా ఆత్మ హారతి నిత్తును, గురుడెప్పుడు భోజనమునకు కూర్చున్నప్పుడు నేను కూడ వారి సరసను కూర్చొని భోజనానంతరము నేనే ముందుగావెళ్ళి వారికి తాంబూలము నిత్తును. వారి ఎంగిలి పళ్ళెము, మరియు పాత్రి మొదలగు వాటిని నేనే ఎత్తెదను నేనే వారికి పక్క వేసెదను. నేనే వారికి పాదము లొత్తెదను, నేనే వారు కూర్చొను సింహాసనముగ నయ్యేదను, ఆ సింహాసనముపై వారు కూర్చున్నప్పుడు నా గురుసేవా పరాకాష్ఠను తెలిపి కొందును. గురువరుని మనస్సునకు ఆహ్లాదమును కలిగించెడి చమత్కార పూర్ణము మరియు మనో వినోదకరములునగు మాటలుగా కూడ నేనే అయ్యేదను, వారు గ్రంథశ్రవణ మొనర్చునప్పుడు, శబ్దసమూహముగ కూడ నేనే అయ్యేదను; వారు తమ ఏ అవయ-

వమునైన గోకు కొనునప్పుడు నేను వారి స్పర్శ - జ్ఞానముగ నయ్యేదను. ఏఏ రూపములను గురుదేవులు స్నేహపూర్ణ దృష్టితో చూచెదరో ఆరూపము లన్నియు నేనే అయ్యేదను. వారి నాలుకకు ఏయేరసము లిష్టమగునో నాసికకు ఏ యే సుగంధములు బాగుండునో ఆయా రసములు మరియు సుగంధములు కూడా నేనే అయ్యేదను. ఈ రీతిని శిష్యుడు తన ద్వైతసేవ విషయమై తనమనస్సునందెప్పుడును తన గురువుకు ఉపయోగించెడి వస్తువు లన్నియు తానే అయ్యేదననీ, తానొక్కడే గురుని అన్నివిధముల సేవింతుననీ అనుకొనుచుండును. శరీరము వున్నంతవరకు ఆతడీరీతిని గురుని సేవించును. దేహపాతానంతరము గురుని సేవించు మరొకవిధానము అతని బుద్ధికి తోచును. దేహపాతానంతరము నా యీ శరీరమృత్తికను గురుదేవు డెచ్చట తన పాదముల నుంచి నిలచునో ఆ భూమిలో కలిపెదను. నా గురుదేవుడు సహజముగ ఏజలమును స్పర్శించునో ఆ నీటియందు నా శరీరమందలి జలభాగమును కలుపుదును. ఏ దీపముతో గురుడు హారతి నిచ్చునో, లేదా ఏదీపము గురుదేవుని యింట వెలుగునో ఆ దీపమందలి తేజస్సులో నా శరీర మందలి తేజోఅంశమును కలిపెదను. గురుదేవునిచామరమునందు నా ప్రాణవాయువు నుంతును. యిందువలననాకుగురుదేవుని సేవాభాగ్యము మరియు స్పర్శసుఖమూ రెండునూ లభించును. ఏయే స్థలములందు గురుమూర్తి యుండునో ఆ యా స్థలములందలి ఆకాశ తత్త్వమున నా శరీర మందలి ఆకాశ భాగమును లీన మొనర్తును. నేను జీవించియుండునుగాక, లేక మరణించియుండునుగాక, ఈ గురుసేవా వ్రతమును మాత్ర మెన్నడును విడువను. నేను యీరీతిగా కల్పాంతము వరకు సేవించుచూ వుందును. మరియు ఒక క్షణమునైన నే నీ సేవను యితరులను చేయనివ్వను. ఏ శిష్యునం దీ విధమగు ధైర్య ముండునో, ఎవని గురుసేవకు స్థల - కాల పరిమితు లేవియూ నుండవో ఎవడు సేవించుటలో రాత్రింబవళ్ళనెడి వ్యత్యాసమును పాటించడో, అట్టివానిని గురించి యీతడు అల్పముగ సేవించెనా, లేక అధికముగ సేవించెనా యని చెప్పు

టకు వలనుపడదు. పైగా, గురుదేవుడు చెప్పిన కార్యకాఠిన్యమువలన ఆత డింకను నూతనుడు మరియుబలిష్ఠుడునగును: గురువు చెప్పినపని ఆకాశము కంటెకూడ పెద్దదైనప్పటికిని, ఆతడు దానిని ఒంటరిగనే చేసివేయును; ఏపనిని గురించియైన గురుదేవుని ఆజ్ఞయగుటతోడనే మనస్సు కంటెముందుగా ఎవరిశరీరము ముందుకు పరిగెత్తిపోవునో, ఆపనిని నెరవేర్చుటకై మనస్సుతో పోటీపడి ఎవడు వెంటనే ఆపనిని చేసివేయునో, గురునినోటినుండి పరిహాస ముగ వెలువడినమాటను పూర్తిచేయుటకైకూడ ఎవడు తన జీవితము నంతను అర్పించివేయునో, ఎవడు గురుసేవయందే తన శరీరమును కృశింపజేసికొని నప్పటికిని గురుని ప్రేమవలననే తిరిగి పుష్టివంత మగునో, ఎవడు గురుని ఆజ్ఞకొరకై ఒంటరిగనే ఆధారుడై యుండునో, ఎవడు గురు - కులముద్వారానే తన్నుతాను కులీనునిగ ఎంచుకొనునో, ఎవడు తన గురుసోద రులతో సౌజన్యపూర్వకముగ వ్యవహరించుటనే సజ్జనత్వముగ మన్నించునో, ఎవనికి కేవలము గురుసేవా వ్యసనమే గలదో, ఎవనికి గురుసాంప్రదాయ నియమములే వర్ణాశ్రమ ధర్మమో, గురుభక్తియే యెవని నిత్యకర్మయో, ఎవడు గురుదేవునే క్షేత్రదేవతగను, తల్లి-దండ్రులు మొదలగు సమస్తముగ భావించునో, మరియు ఎవడు ఆత్మకళ్యాణమునకై గురుసేవతప్ప మరేమార్గ మును ఎరుగడో, గురుద్వారమే ఎవనికి సారము, సర్వస్వము, వాస్తవికమగు సత్యతత్త్వమునై యున్నదో. ఎవడు తన గురుసేవకులపట్ల సహోదరులతో వలె ప్రేమతో వ్యవహరించునో, ఎవనినోట నెల్లప్పుడు గురునామమంత్రమే వుండునో, మరియు ఎవడు గురువాక్యములను విడచి మరే యితర శాస్త్రముపైనను ధ్యాస ముంచడో, ఎవడు గురుపాదతీర్థమునే త్రిభువనము లందలి తీర్థములన్నింటి కంటెను శ్రేష్ఠముగ తలంచునో, అవకాశము కొలది గురుని ఎంగిలి అన్నము లభించినందువలన ఎవడు దాని ముందు ఆత్మసమాధినికూడ అల్పముగ తలంచునో, ఓ అర్జునా! గురు దేవుడు నడచునప్పుడు లేచెడివారి పాదధూళిని ఎవడు మోక్షసుఖము

నకు బదులుగా స్వీకరించుటకు ఉత్సాహపడునో, అట్టివాడే వాస్తవము-నకు గురువునకు నిజమగు సేవకుడు, మరియు శిష్యుడు నగును. ఇం కెంతవరకని వీటిని విస్తరించి చెప్పను! వాస్తవముగ చూచినచో గురుభక్తికి హద్దే లేదు. ఓ అర్జునా! ఎవని మనస్సునందీ భక్తి యెడ అనురాగ ముండునో, ఎవని మనస్సున దీనిపై ఆసక్తి యుండునో, ఎవనికి గురుసేవతప్ప మరేదియూ నచ్చదో, అట్టి పురుషుడే తత్త్వజ్ఞానమునకు ఆధారుడు. అట్టివాని వలననే జ్ఞానమున కస్తిత్వ మేర్పడినది. ఇంతియే గాదు. అజ్ఞాని యగు భక్తుడు ప్రత్యక్షదేవతయే యగును. ఇట్టి భక్తునివద్ద జ్ఞానము తనద్వారముల నన్నిటిని ముక్తమొనర్చి యుంచును. మరియు ప్రపంచమునంతను నింపివైచిన పిమ్మట కూడ మిగిలియుండునంత అపారముగ ఆతనిజ్ఞానము వుండును" ఓ శ్రోతలారా! గురుసేవపట్ల నా అంతఃకరణములో గల ఉత్కట ఉత్కంఠ వలన నేనింత మిక్కుటముగ గురుసేవను వర్ణించితిని. అటులు కానిచో నేను చేతు లుండికూడ అవిటివాడను, భజన మొనర్చుటలో అంధుడను, గురుసేవా కార్యములో అతి కుంటివాడను, గురుమహిమను వర్ణించుటలో నేను మూగవాడిని, ఉచితముగ వచ్చిన పదార్థములను తిని పడియుండు శుద్ధసోమరిని అయినను, నా మనస్సున నిజమైన గురుప్రేమ వుండుటవలన దాని మూలమున నేనింతగా యీ విషయమును విస్తరించితిని. జ్ఞానదేవుడనగు నేనువిూతో చెప్పునదిదియే. ఓ శ్రోతలారా! మిమ్ము౦కనూ సేవించెడి అవకాశమునునాకు లభింపజేతురుగాక. ఇక నేను గ్రంథార్థమును విశదీకరించి చెప్పెదను, వినుడు. సృష్టిభారమునంతను సహించగల సమర్థుడగు నారాయణుని పూర్ణాంశస్వరూపుడగు శ్రీకృష్ణులు చెప్పుచున్నారు, అర్జునుడు వినుచున్నాడు. శ్రీకృష్ణుడిట్లనెను—"ఓ అర్జునా! వినుము. ఎవనియందు ఆతని అంగములన్నియున్నూ మనస్సున్నూ కర్పూరముతోనే చేయబడినవా యన్నటుల అధికమగు శుచిత్వము గలదో, ఎవడు లోపలను బయటను సమముగ సూర్యునితో సమానముగ తేజోవంతుడుగ నుండునో, బయటతన కర్మాచరణము వల్లనూ-లోపల

జ్ఞానము వల్లనూ ప్రకాశవంతుడగుటవలనఎవడు రెండువిధములనుసమానముగ నిర్మలుడో, వేదమంత్రములను ఉచ్చరించుట వలనను, మరియు మృత్తికా జలసంయోగము వలనను ఏరీతిని బాహ్యశుద్ధియగునో, ప్రతి పనియందును బుద్ధియే యేరీతిని బలిష్ఠురాలగునో, ఇసుకరేణువులు అద్దమును స్వచ్ఛ మొనర్చురీతిని, లేదా చాకలివాడు కొన్నివస్తువుల సంయోగముచే వస్త్రము పై గల మరకలను పోగొట్టి శుభ్రపరచు రీతిగ, బాహ్యమున నిర్మలుడై యుండి, అంతరంగమందుకూడ జ్ఞానదీపము ప్రజ్వలించుటవలన ఎవడు శుద్ధుడయ్యెనో, అతడే జ్ఞానియని యెరుంగుము. అటుల కానిచో – ఓ అర్జునా! అంతరంగము శుద్ధముకానియెడల, బాహ్యకర్మాడంబరము కేవలము యితరులను మోసగించుటకే యగును. ఈ బాహ్యకర్మాడంబరము ఎటు లుండుననిన, శవమును శృంగారించుట, గాడిదను తీర్థమున స్నానము చేయించుట, చేదుసొరకాయకు బెల్లమును లేపన మొనర్చుట, పాడుపడ్డ యింటికి తోరణములు కట్టుట, బోలుగానున్నకలశమునకు గిల్టువేయుట, లేదా మట్టితో తయారు చేసిన ఫలమునకు రంగువేయుటవలె – నిష్ప్రయోజనమే యగును. రసము లేని దానికి అధిక విలువ యుండదు. కల్లుముంతను గంగా జలముచే కడిగినప్పటికిని శుద్ధము కానేరదు. కావున హృదయమున జ్ఞానో దయము కావలెను. హృదయమున జ్ఞానమున్నచో బాహ్యశుద్ధి దానంతట అదే ప్రాప్తించును. శుద్ధికి సంబంధించిన బాహ్యాడంబర క్రియలవలన జ్ఞానము లభించు టను నదెన్నడైన సంభవించెనా! కావుననే, సత్కర్మలవలన బాహ్య భాగము చక్కగా శుద్ధమూ స్వచ్ఛమూ అగుటతోపాటు, జ్ఞానమువలన అంత రంగముకూడ ఎవనికి నిష్కళంకమైనది యగునో, ఆతనియందు బాహ్యాభ్యం తర భేదమేదియూ నుండదు. మరియు అంతటను నిర్మలత్వము సమానముగనే కనిపించును. అన, ఆతనియందు కావలసిన దానికంటె హెచ్చుగా శుచిత్వము వుండును. అందువలన, గాజు ఆవరణలోపల పెట్టబడినట్టి దీప ప్రకా శము బయటకూడ చక్కగా వ్యాపించురీతిని, ఆతని అంతరంగ

మందలి శుద్ధభావములుకూడ ఇంద్రియములద్వారా బయటకు వెల్లడియగు
చుండును. సంశయములను కలిగింపజేసి, వ్యర్థముగా ఆలోచనలు చేయు
నటుల నొనర్చి, కుకర్మబీజములను మొలకలెత్తురీతిని చేసెడి విషయములను
ఆతడు చూచినను, లేదా విన్నను, లేదా ఆ విషయములు వచ్చి ఆతనియందు
ప్రవేశించినప్పటికిని — మేఘముల రంగులవల్ల ఆకాశ మెన్నడును మలినము
కాని రీతిని — ఆతని మనస్సుపైనకూడ యీ విషయ సంస్కార మేమాత్రము
జనించదు. చూచుట కాతడు ఇంద్రియ సమూహములతో సహా విషయము
లందు లిప్తుడైనటులే కాన్పించుచుండును. కాని, వికారము లాతనిని
ఏమాత్రము వశపరచుకొన నేరవు. ఒకే స్త్రీ తన భర్తను కౌగిలించు
కొనును, కుమారుని కౌగిలించుకొనును; కాని, ఆమెకుగల పుత్రప్రేమలో
కామవికారమేదియూ ప్రవేశించజాలనిరీతిని, హృదయము శుద్ధమైనవాని
వద్ద సంకల్ప - వికల్పములు సాగనేరవు. అయినప్పటికిని, ఆతడు ఏ పని
చేయదగినది, ఏది చేయరానిది - యనెడి సంగతిని చక్కగా నెరుంగును.
నీటిచే వజ్రము మెత్తబడనిరీతిని, రొసరునీటివల్ల కంకరరాళ్ళు ఉడుకనిరీతిని,
ఆతని మనోభావములుకూడా వికల్పముల వలన దూషితములుకావు.
ఓ అర్జునా! ఇట్టి స్థితినే శుచిత్వ మందురు; ఇట్టి శుచిత్వము గలచోట
జ్ఞానముకూడ తప్పక వుండునని నీ వెరుంగుము. ఇక ఏ పురుషునందు
స్థిరత్వము(నిలుకడ)యిల్లుకట్టుకొని యుండునో, ఆతడు జ్ఞానమునుజీవఘోసూతముగ
కాపాడగలడని ఎరుంగుము. శరీరము తన పక్షమునుండి బాహ్యాచర
ణము నొనర్చు చుండును. కాని ఆ ఆచరణమువలన ఆతని మన
స్సేమాత్రము విచలితము కాదు. గోవుయొక్క వాత్సల్య భావము తన బిడ్డ
యెడగాక అరణ్యమున తిరుగుట పట్ల లగ్నముకాని రీతిని, పతివ్రతాస్త్రీ
యొక్క విలాసము విషయప్రేమతో కూడియుండని రీతిని, లోభివాడు ఎంత
దూరమున కేగినప్పటికిని, ఆతని ధ్యాస పాతిపెట్టిన ధనముపైననే లగ్నమై
యుండురీతిని, శారీరక కార్యముల వలన స్థిరత్వముగల పురుషుని మనోనిశ్చ

లత్వము ఎన్నడును నాశనము కానేరదు. వేగముగ పరుగెత్తుచున్న మేఘము లతో పాటు ఆకాశము పరుగెత్తని రీతిని, తారాగణము తిరుగుచుండుటవల్ల ధృవతారతో ఎన్నడును తిరుగనారంభించని విధమున, బాటసారుల మూలమున బాట ఎన్నడును నడువబోని రీతిని, యీ పంచభూతాత్మక శరీర వ్యాపారముల వలన, ఏ భూతబలము వలన కూడ అతని అంతరంగము ఎన్నడును విచలితము కాదు. తుపాను వేగమువలన భూమి కదలని రీతిని, సుఖ-దుఃఖాది ఉపాధుల యొక్క తీవ్రోపద్రవము వల్లకూడ ఆ స్థిరపురుషు డెన్నడును చలించడు. ఆతడెన్నడును దీనత్వ దుఃఖములవలన సంతప్తుడు కాడు, భయశోకముల వలన ఎన్నడును కంపించడు, మరియు, అంతేగాదు, ఆతని శరీరమునకై మృత్యువువచ్చినప్పటికిని ఆతడెన్నడును వ్యాకులపడడు. వాసనలు మరియు వాంఛలనెడి ఆవేశము వలన, లేదా వివిధ రోగోపద్రవములవలన ఆతని సరళచిత్తమెన్నడును త్రొట్టుపాటునొందదు. నింద, అవమానము, లేదా శిక్షింప బడినప్పటికిని లేదా కామ-క్రోధోపద్రవముల వల్లనైనను ఆతని స్థిరత్వముగల మనస్సు ఏ మాత్రము చలించదు. ఆకాశము విరిగి పడుగాక, భూమి బ్రద్దలగుగాక - అతని చిత్తవృత్తి ఎన్నడును వెనుదిరుగదు. పూలతో కొట్టినందువలన ఏనుగు ఎటూ తప్పుకుపోని రీతిని, దుర్వచనములనెడి బాణముల వల్లకూడ ఆతడెన్నడును చలించడు. సముద్రమథన సమయమున క్షీరసాగర తరంగముల ముందు మందరపర్వతము తన శిరస్సును వంచని రీతిని, లేదా అడవికి అంటుకొనిన నిప్పువల్ల ఆకాశ మెన్నడును దహింపబడని రీతిని సుఖ - దుఃఖాదుల తరంగములెంత మిక్కుటముగ లేచినప్పటికిని ఆతని మనస్సేమాత్రము విచలితముకాదు; కల్పాంతమే యగుగాక ఆతని ధైర్యము ఆతనికి గల సామర్థ్యమువలన యథాప్రకారముగనే వుండును. ఏ గుణము స్థైర్యమనెడి పేరిట ఉల్లేఖింపబడినదో, ఓ అర్జునా! ఆ గుణము యీ విధమగు మానసికస్థితి గలదని ఎరుంగుము. ఈ విధమగు శారీరకమానసిక నిశ్చలస్థిరత్వము సిద్ధించిన శరీరముగల పురుషుని జ్ఞానధనముయొక్క తెరువబడియున్న భాండా-

రముగ నెరుంగుము. పిశాచము తాను నివసించువృక్షమును, ద్వంద్వయుద్ధ మొనర్చువాడు తన ఆయుధమును, లేదా లోభివాడు తన ధనమును తన కను మరుగు కానివ్వనిరీతిని, లేదా తల్లి తనఏకపుత్రుని రొమ్మునకు అదుముకొనివుంచు కొనురీతిని, లేదా తేనెటీగకు ఎల్లప్పుడు మధువుపైననే అనివార్యమగు లోభ ము వుండురీతిని, ఓ అర్జునా! ఎవడు తన అంతఃకరణమునందు నిరంతరము హృదయపూర్వకముగ ప్రయత్నించునో, మరియు దానిని యింద్రియ ద్వారములవద్ద అడుగైన నిడనివ్వడో (అనగా తన అంతః కరణమును యింద్రియముల కేమాత్రము వశము కానివ్వడో), లేదా దురాచారిణి యగు భార్యను ఉద్దండుడగు భర్త ఎల్లప్పుడు తనబంధనమునం దుంచురీతిని తన ప్రవృత్తుల నెవడు చక్కగా నిగ్రహించి యుంచుకొనునో, దేహము కృశించి ప్రాణములు పోవుసమయము వచ్చినప్పుడు—ఎవడు తనమనస్సుయొక్క ముఖ్య ద్వారమున లేదా వృత్తులయొక్క పహారావద్ద, తన శరీరమనెడి దుర్గము నందు శమ — దమములను శాశ్వతముగ కాపలాకాయు వారివలె నియమించి మేల్కొనియుంచునో, ఎవడు మూలాధారము, మణిపూరము (నాభిస్థానము) విశుద్ధము (కంఠస్థానము) లనెడి చక్రత్రయమునందు వజ్ర, ఉడ్యాణ, జాలంధరములనెడి త్రిబంధములయొక్క గస్తీని ఏర్పరచి, తన చిత్తమును ఇడ—పింగళ లనెడి రెండు నాడులయొక్క సంధియందును, ప్రవిష్టమొనర్చి సమాధి యనెడి శయ్యపై తన ధ్యానమును చక్కగా నిద్రపుచ్చి యుంచునో, మరియు ఎవని చిత్తము చైతన్యముతో ఏకరూపమును పొంది ఎల్లప్పుడు దానియందే రమించుచుండునో, అట్టివాని విషయమై, ఆతడు తన అంతఃకరణమును పూర్తిగా నిగ్రహించెనని తెలిసికొనుము. అంతఃకరణమును యీ రీతిని నిగ్రహించుట జ్ఞానవిజయమే. ఏ పురుషుని ఆజ్ఞను అతని అంతఃకరణము ప్రశాంతముగను, గౌరవపూర్వకముగను పాలించునో, ఆపురుషుని మూర్తిత్వమును దాల్చిన జ్ఞానముగనే ఎరుంగవలెను.

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ,
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్॥ ౮

ఎవని మనస్సున విషయముల పట్ల పూర్తియగు విరక్తి జాగరితమై యుండునో, ఆతడే జ్ఞాని. వమనము జేసికొనిన పదార్థమును చూచి ఎవనికిని నోరూర నటుల, మృతినొందిన పురుషుని కౌగిలించుకొనుటకై ఎవరును ముందుకు రానటుల, విషము నెవడును త్రాగ నటుల, తగులబడుచున్న యింటియం దెవడును ప్రవేశించ నటుల, పెద్దపులి గుహలో ఎవడును తన నివాసస్థానము నేర్పరచుకొన నటుల, కరిగి పొంగులు పెట్టుచున్న లోహ (ఇనుము) రసమునం దెవడును దుముక నటుల, అజగరము (కొండచిలువ) ను దిండుగా నమర్చుకొని ఎవడును నిద్రించనటుల,—విషయములకు సంబంధించిన సంగతులు ఎవనికి నచ్చవో, ఎవడు యింద్రియములద్వారా ఏ విషయమునూ గ్రహించడో, ఎవని మనస్సు సదా విషయముల పట్ల ఉదాసీనముగ నుండునో, ఎవని శరీరము చాల శుష్కించియుండి మరియు శమ - దమాదుల యెడ ఎవని మనస్సునం దత్యుత్సాహము వుండునో, ఓ అర్జునా! ఎవని యందు తపోవ్రతము లన్నియు ఏక త్రితమై యుండునో, మరియు గ్రామమునగాని, నగరమునగాని జనముతో క్రిక్కిరిసియున్న పట్టణమునందుగాని నివసించుట కల్పాంతమువలె ఎవనికి దుఃఖకరముగ తోచునో, ఎవనికి యోగాభ్యాసము చేయవలెనను అత్యధిక లాలస గలదో, ఎవడు నిర్జనము, మరియు ఏకాంతమునగు ప్రదేశము వైపుకు పరుగిడుచుండునో, మానవసంఘముయొక్క పేరుకూడ ఎవనికి అయిష్టముగ నుండునో, బాణశయ్యపై నిద్రించుట లేదా చీములో దొరలుటలవలె ఎవడు ఐహిక విషయములకు సంబంధించిన భోగవిలాసములు చెడుగను, విసర్జింప దగినవిగను తలంచునో, ఎవడు స్వర్గసుఖముల వర్ణనమును విని ఆ సుఖములను కుక్కలయొక్క కుళ్ళిపోయిన మాంసమువలె తలంచునో, అట్టి వానికి

యీ వైరాగ్యమే ఆత్మలాభమనెడి వైభవమగును. ఈ విధమగు వైరాగ్యము వల్లనే జీవుడు బ్రహ్మానంద సుఖానుభవ యోగ్యుడగును. ఈ రీతిగా ఐహిక - పారలౌకిక సుఖ - భోగముల పట్ల సంపూర్ణమగు విరక్తి ఎవని యందు నీకు కనిపించునో, అట్టివానియందు మాత్రమే విపులమగు జ్ఞానము నివసించునని నీ వెరుంగుము. ఎవడు స-కాముని వలె నూతులు - చెరువులు మొదలగునవి త్రవ్వించుట యనెడి లోకోపయోగకరములగు పనుల నన్నింటిని చేయుచుండికూడ వాని కర్తృత్వాభిమానము శరీరమును స్పృశింపనైన నివ్వడో, ఎవడు వర్ణాశ్రమ ధర్మపాలనమున కావశ్యకమగు నిత్య - నైమిత్తిక కర్మలను చేయుచుండికూడా 'నేను ఫలానా పనిని చేసితిని అనెడిభావము ఏమాత్రముకూడ లేకుండా వుండునో, అట్టివాడే నిజమగు జ్ఞాని యగును. వాయువు తన స్వభావమువల్లనే అంతటను సంచరించురీతిని, సూర్యుడు అహంకారరహితబుద్ధితో ఉదయించు రీతిని, వేదము సహజముగనే జ్ఞానమును చెప్పురీతిని, గంగ అకారణముగనే ఎల్లప్పుడు ప్రవహించుచుండురీతిని, ఎవడు అభిమానరహితుడై సమస్త ఆచార వ్యవహారముల నొనర్చునో, తమ తమ ఋతువు వచ్చినప్పుడు వృక్షములు కాయలు కాచినప్పటికిని 'మేము యితరులకు ఫలముల నిచ్చుచుంటి'మనెడి అహంకారముతో నిండియున్న జ్ఞానములేనివై యుండు రీతిని' ఎవడు అహంభావరహితుడై నిత్యకర్మముల నాచరించుచుండునో, మరియు యీ రీతిని ఎవని మనస్సు కర్మ, మరియు వాక్కునందు అహంకారము పూర్తిగా నాశనమగునో, అట్టివాడే నిజమగు జ్ఞాని. ఆకాశమున మేఘము లిటునటు సంచరించి నప్పటికిని మేఘములు ఆకాశము నంటని రీతిని, శరీర కర్మలు జరుగుచుండినప్పటికిని ఎవడు ఆ కర్మలకు నిర్లిప్తుడై యుండునో, మద్యపాన మొనర్చువానికి తన శరీరముపై గల వస్త్రములు, బొమ్మకు తన చేతియందలి శస్త్రము, ఎద్దుకు తనవీపుపై కట్టబడిన శాస్త్ర గ్రంథముల ధ్యాసయూ యేమాత్రము వుండని రీతిని, ఎవని అహంభావము

పూర్తిగా వ్యర్థమగునో, మరియు ఎవనికి ఆ అహంభావమును గురించిన స్మర
ణయే యుండదో, అట్టి పురుషునకు కలిగియుండు యీస్థితిని 'నిరహంకారి
త్వము' అందుము. ఎవనియం దీవిధమగు నిరహంకారిత్వము పరిపూర్ణముగ
కాన్పించునో. ఆతనియందే జ్ఞానము నివసించును. యిందేమాత్రము సంశయము
లేదు. ఎవడు జనన - మరణాది దుఃఖములను మరియు రోగము - వార్ధక్యము
మొదలుగా గల సంకటములనూ తన శరీరమునకు సోకనివ్వడో, మరియు
నిర్లిప్తుడై వాటి అన్నింటివైపు చూచుచుండునో, మరియు ఆ చూచుటకూడ,
సాక్షకుడు పిశాచమును, యోగి ఉపాధిని, మేస్త్రీ మూలమట్టము సహాయముతో
గోడయొక్క హెచ్చుతగ్గులను, తానున్న ప్రదేశమునుంచి కదలకయే చూచురీతిని
ఎవడు మృత్యువు, రోగము మొదలగు వానిని నిర్వికారుడై చూచుచుండునో,
సర్పము తన పూర్వజన్మమందలి వైరమును కూడా జ్ఞాపకమునందుంచు
ని ఎన్నడును మరచిపోని రీతిని ఎవడు తన పూర్వజన్మము లందలి దోషము
నుకూడ జ్ఞప్తియందుంచుకొనునో, కంటియందు యిసుకరేణువు కలకపెట్టు
తిని, గాయమును బాణపుమొన కలకవేయు రీతిని, ఎవడు నిరంతరము 'నేను
ముగుంటలో పడియున్నాను, మూత్రద్వారము నుండి నేను బయటకు
చ్చితిని అయ్యయ్యో నేను స్తనముపైగల చెమటను అతిప్రీతితో నాకితిని'
ని ఎల్లప్పుడు అనుకొనుచూ యీ సంగతులవలన ఎవనికి జీవితము నెడ ఏవ
గింపు కలిగియుండునో, మరియు యిక 'నేనెన్నడును పునర్జన్మ మెత్తవలసి
వచ్చు పనిని దేనినీ చేయనని' ఎవడు తన మనస్సున నిశ్చయించుకొనియుండునో,
కోల్పోయిన సంపదనుతిరిగి సంపాదించుటకై జూదగాడు తిరిగిపందెము వేయు
కు సిద్ధమగురీతిని, తన తండ్రియొక్క వైరమునకు ప్రతీకారము చేయుటకై
పుత్రుడెల్లప్పుడు అవకాశమును వెదకురీతిని, దెబ్బతినుటచే కోపించి తనను
కొట్టినవానిని వెంబడించి ఆతడు కొట్టిన దెబ్బకు పగతీర్చుకొనుటకై దెబ్బ
తిన్నవాడు ఆకొట్టిన వానిని వెంటాడు రీతిని, ఎవడు జన్మబంధమును త్రెంచి
వేయుటకై తీవ్రముగ కృషిచేయునో, జన్మమెత్తితి ననెడి లజ్జచే ఎవని

మనస్సునం దెల్లప్పుడు 'గౌరవము గలవానికి మానహానిబాధ కలుగచేయు రీతిని బాధ కలుగుచుండునో.' ఓ అర్జునా, ఈదనున్నవానికి ముందుగనే 'ముందు చాలా లోతున్న'దని చెప్పినప్పుడు అతడు ఒడ్డునందే చక్కగా గోచీ బిగించికట్టుకొని, నీట దిగవలెననెడి తలంపును విడనాడు రీతిని, బుద్ధిమంతు డైనవాడు రణరంగమున నిలచుటకు పూర్వమే తన్నుతాను హద్దునం దుంచుకొను రీతిని, గాయము తగులకపూర్వమే డాలును ముందుంచుకొనవలసి వచ్చురీతిని, ప్రవాసనమయమున రేపు తన కేదో గొప్ప ఆపద రానున్నదని ముందుగా తెలిపినప్పుడు ముందుగనే అట్టి పురుషుడు జాగరూకుడై వుండు రీతిని, ప్రాణములు పోకపూర్వమే ఔషధము నక్కై పరుగులిడు రీతిని, 'మృత్యువు నేడే వచ్చుగాక లేక కల్పాంతమందు వచ్చుగాక, అది అవశ్యము వచ్చును' అని తెలిసికొని ముందుగనే అప్పటప్పట ఎవడు జాగరూకుడై వుండునో, మరియు యీ రీతిని ముందుగనే జాగరూకుడై వుండనివాని స్థితి తగుల బడుచున్న యింటియం దున్నవాడు- ఆ అగ్నిని చల్లార్పుటకై అప్పటప్పట నుయ్యి త్రవ్వుటకై తగిన అవకాశము లేకపోవుటచే వున్నవాడున్నటుల నుండుటచే ఆతని కే స్థితి గలుగునో యీతనికికూడ అట్టిస్థితియే కలుగును. లోతగు నీటియందు పడవేసిన రాయి నిశ్శబ్దముగ పడియుండు రీతిని మరియు అది ఎంత బిగ్గరగ పిలచి నప్పటికిని ఎవరికిని వినిపించకపోవుటచే అది యిరువదినాల్గు గంటలు ఆదే రీతిని జాగరూకతతో నుండు విధమున, ఎవరో బలవంతు డగు శత్రువుతో వైరము గలిగి యున్నవాడు చాల జాగ్రత్తగా వుండురీతిని ఎవడు జాగరూకుడై వుండునో, వివాహయోగ్య మగు వయస్సువచ్చిన కన్య ముందుగనే తన పుట్టినింటి వియోగమునకు సంసిద్ధయై యుండురీతిని, సన్యసించు పురుషుడు అంతకుముందుగానే సంసారత్యాగ మొనర్చుటకు సంసిద్ధుడై యుండు రీతిని, ఎవడు మరణమునకుపూర్వమే మృత్యుభ్యాసగలవాడై వ్యవహరించుచుండునో మరియు యీరీతిని ఏ పురుషుడు తన యీజన్మనుండి మొదలుకొని

తన భవిష్యజ్జన్మ లన్నింటియొక్క మరియు యీజన్మమందలి మృత్యువు నుండి మొదలుకొని భవిష్యజ్జన్మ లన్నింటియందలి చావునూ అంత మొందించునో, మరియు తాను కేవలము ఆత్మస్వరూపముతో మిగిలి యుండునో, అట్టివాని యింటియందు జ్ఞానమున కెన్నడును ఏమాత్రపు కొరతయు నుండ నేరదు. ఎవనికి జనన-మరణము లనెడి చింతయే వుండదో, ఎవని శరీరమును వృద్ధావస్థ ఎన్నడును స్పర్శించదో, యిందుమూలమున ఎవడు నిరంతరము తనను తాను యౌవనోద్వేగము నందుంచు కొనునో అట్టివాడే జ్ఞాని అతడు తనతో తానటుల చెప్పుకొను చుండును - పుష్టివంతముగ నున్న నేటి నాయీ శరీరము త్వరలోనే ఎండిపోయిన బుడమువరుగువలె నగును, దురదృష్టుని వ్యవహారమువలె ఏదో ఒకనాడు నాయీ చేతులు-కాళ్ళు అలసిపోయి వ్యర్థమైనవిగ నగును. నాయీ బలిష్ఠావస్థ పరామర్శచేయు మంత్రిలేని రాజుయొక్క స్థితివలెనగును. పూలు ధరించవలె ననెడి ఆసక్తిగల నేటి నాయీ మస్తకము త్వరలోనే ఒంటెయొక్క మోకాలువలె నగును. ఆషాఢమాసపుగాలి తోలుటచే పశువులగిట్టలకు 'గాళ్ళు' యనెడి వ్యాధి తగిలినప్పుడు ఎట్టి దుస్థితి సంభవించునో అదే దుస్థితి నాయీ మస్తకమునకుకూడ సంభవించును. కమలదళములతో సాటి వచ్చుచున్న నేటి నా యీ నేత్రములు పండిన పొట్లకాయవలె నిస్తేజములగును. కనుబొమలు జారిపోవును, వక్షస్థలము కన్నీటిచేనాని కుళ్ళిపోసాగును. కలువచెట్టుమీదికి వచ్చుచూ పోవుచుండెడి తొండలు జిగురుకు అంటుకుపోయి వుండుకీతిని నా యీనోరు కూడ ఉమ్మిచే అంటుకుపోయి యుండును. వంటయింటి ముందు వుండెడిగుంట మురికియైన మరియు బూడిదయునుగల నీటితో నిండియుండుకీతిని నా యీ ముక్కుకూడ శ్లేష్మముతో నిండియుండును. నేటి యీ సుందరమగు పెదవులు నవ్వునపుడు బయటకువచ్చు సుందర దంతములుగల నాయీ ముఖము, సుందరమగు మాటలు పలుకుటకు ఆధారభూతమగు నేటి నా యీ నోటినుండి రేపు చొంగకారుచుండును. దంతము

లూడిపోవును. ఋణభారముచే అణగియున్న రైతు, జడివాన వలన పశువులూ మెదలకుండా పడియుండి తేచెడిమార్గముననే ఎరుగని రీతిని, ఎంతప్రయత్నించినప్పటికిని యీ నాలుక ఏవిధముగను కదలనేరదు. ఎండు గడ్డిపోపులు గాలివీత వలన యిటునటు ఎగురు రీతిని, నోటియందలి కోరలకు కూడ యిదే దుస్థితి ప్రాప్తించును, ఆకాశవర్షము వలన కొండశిఖరములపై నుండి కొండవాగులు ప్రవహించసాగు విధమున నా నోరనెడి కిటికీనుండి చొంగయనెడి వాగులు ప్రవహించసాగును. వాక్కు మాట్లాడలేదు. చెవులు వినలేవు. శరీరము కోతి రూపమున కన్పించసాగును. గడ్డితో తయారుచేసి పొలమున నిలబెట్టిన దిష్టిబొమ్మ గాలివీతచే వెనుకకు ముందుకు ఊగుచుండు రీతిని నాయీ శరీరమంతయు గజగజ వణకసాగును. నడచునప్పుడు పాదములు మెలికలు తిరుగును. చేతులు ఏపనిని చేయజాలని స్థితియందుండును. అప్పుడు సౌందర్యమనెడి ఒక కల్పిత వేషము తనముందు చిందులు త్రొక్కుచున్నటుల అనిపించును. మలమూత్ర ద్వారములందు నిరోధశక్తి తొలగిపోవును అచ్చట గలవారందరూ 'యీతడు ఎప్పుడుచచ్చునా ? యీతని పీడ ఎప్పుడు విరగడై పోవునా ' యని తలంచ సాగుదురు. లోకమంతయు నావంక చూచి ఊమియసాగును, 'ఏదో విధముగ త్వరగావచ్చి నన్నుతీసికొనిపొమ్మని' మృత్యుదేవతను మాటిమాటికి ప్రార్థించవలసి వచ్చును, నాసోదరులు - బంధువులుకూడ నేననిన ఏవగించుకొను చుందురు. స్త్రీలు నన్ను భూతమనియందురు, పిల్లలు నన్నుచూచి గాబరా పడుదురు మరియు భయపడుదురు; ఈ రీతిని నేను అందరికిని ఘృణాపాత్రుడ నగుదును. కఫప్రకోపము వలన నేను దగ్గినప్పుడు, నా యిరుగు - పొరుగు వారికిని భంగమగును; అంత వారు ' యీ ముదుసలి మమ్ము కెంతకాలము పీడించునురా !' యని విసుగుకొన సాగెదరు. ఈ రీతిని, ఎవడు తన యౌవనావస్థయందే తనకు రానున్న వృద్ధావస్థయందలి లక్షణములను ధ్యానమం దుంచుకొని, అప్పటినుండియే ఆ లక్షణముల నన్నింటిని ఏవగించుకొన సాగునో ఆతడే జ్ఞాని. ఆతడు తన

మనస్సునందు 'చివరకు యీ శరీరమున కిట్టి దుస్థితి సంభవించును. మరియు శారీరక భోగముల ననుభవించిన తరువాత శరీరాంత మగును. అప్పుడు నాకు కల్యాణమును చేకూర్చు సాధనల నొనర్చుటకు నావద్ద ఏమి మిగిలియుండును?' అని యోచించును. కావున చెవుడురాకపూర్వమే సమస్తమును వినవలెను. శరీరమున అంగవైకల్యము రాకపూర్వమే యాత్రల నన్నటిని సేవించవలెను. నేత్రములందు దృష్టి యున్నంతవరకు చూడవల సినవాటిని చూడవలెను. వాక్కు వున్నంతవరకు మధురముగ భాషించుచుండ వలెను. చేతులందలిశక్తి నశించకపూర్వమే ఈ చేతులతో దానాది పుణ్య కర్మలనొనర్చవలెను. ముందుముందు చిత్తము ఉన్మాదస్థితిని పొందును.అందు వలన అట్టి దుస్థితి సంభవించక పూర్వమే శుద్ధమగు జ్ఞానసంగ్రహము నొనర్చవలెను. రేపు దొంగవచ్చి ఆస్తిని దోచుకొని పోవునని తెలిసినప్పుడు నేడే దాని రక్షణకై తగుజాగ్రత్త పడవలెను. దీపము ఆరిపోక పూర్వమే, దానిని గాలినుండి సంరక్షించవలెను. వార్ధక్యము వచ్చినప్పుడీ శరీరమంతయూ వ్యర్థమైపోవును. కావున నేటినుండియే యీ శరీరముతో నిర్లిప్తుడై యుండు టను ఆరంభించుట తగినపని. ముందురక్షణ యేర్పాట్లు లేవనిగాని ఆకాశము నుండి పిడుగు పడుననిగాని తెలిసియుండికూడ వీటిని లక్ష్యపెట్టక యింటి నుండి బయటకు బయలుదేరు వానికి తప్పక కీడు వాటిల్లును. ఈ విధముగనే వార్ధక్యము వచ్చినప్పుడు శరీరధారియై యుండుట పూర్తిగా వ్యర్థమే యగును; ఇట్టి స్థితిలో మానవుడు నూరు సంవత్సరములు ఆయువు గలవాడై యున్నప్పటికిని ఆ దీర్ఘాయువు వలన ప్రయోజన మేమి? ఒకసారి దులిపిన తరువాత ఆ నువ్వుల కాడలనే మరల దులు పుచో నువ్వులు మరొకమారు రాలనేరవు! అగ్ని ఎంత ప్రతాపముగల దైనప్పటికిని బూడిదను దహింప జాలదుగదా! వార్ధక్యము వచ్చిన తరువాత అతడు నూరేండ్లు ఆయువు గలవాడై నప్పటికిని ఏమియూ చేయజాలడు. కాన, వార్ధక్యము తప్పక వచ్చునని తెలిసికొని, యౌవనమునందే వృద్ధా

వస్థచేత చిక్కకుండురీతిని ప్రయత్నించువాగే నిజమగు జ్ఞానియని యెరుంగుము. కావున, నానావిధ వ్యాధులు తనను ముట్టడించ నంతవరకు మాత్రమే తన యీ వ్యాధి రహితమగు శరీరమును పూర్తిగా వినియోగించుకొనును. సర్పపు నోటినుంచి వచ్చిన అన్నపు ముద్దను బుద్ధిమంతుడైనవాడు త్యజించురీతిని జ్ఞానికూడ దుఃఖము, సంకటము శోకము మొదలగు వానిని వృద్ధిపొందించు ఐహిక మమకారముల నన్నింటిని త్యజించి, ఆత్మసుఖము గలిగి, నిస్పృహుడై వుండును. దోషములను యీ శరీరమున ప్రవేశింపజేయునట్టి కర్మద్వారముల నన్నింటిని ఆతడు యమనియమముల సహాయమువలన పూర్తిగా మూసివేయును. ఈ రీతిని అత్యంతమగు యుక్తితో సావధానుడై సమస్త కర్మముల నొనర్చు వానినే జ్ఞానమనెడి సంపదకు ప్రభువుగా ఎరుంగవలెను. ఓ అర్జునా ! నీకు నేను మరొక లక్షణమును చెప్పెదను వినుము.

శ్లో॥ అసక్తి రనభిష్వఙ్గః పుత్రదార గృహాదిషు
నిత్యఞ్చ సమచిత్తత్వ మిష్టా నిష్టోప పత్తిషు॥

ప్రయాణీకుడు ప్రయాణ సమయమున ఒకటి రెండు రోజులు బసచేసెడి సత్రము పట్లవలె ఎవడు యీ శరీరమునెడ ఉదాసీనుడై వుండునో, మరియు బాటను నడచునప్పుడు నీడనిచ్చెడి చెట్లయెడ వుండెడి మాత్రపు మమకారము కూడ ఎవనికి తన యిల్లు లేదా శరీరముయెడ వుండదో, ఎల్లప్పుడు తనవెంట వుండెడి నీడయెడ లోభము వుండని రీతిని మరియు దానిని గురించిన స్మరణయే వుండని విధమున ఎవనికి స్త్రీలోభము ఏ మాత్రమూ వుండదో, తన ముందు తన బిడ్డలు వున్నప్పటికి కూడ వారిని దారినిపోవు యాత్రికులవలె కొంత కాలమువరకు తనవద్ద బసచేయుటకు వచ్చిరని గాని లేదా ఆబిడ్డలను చెట్టునీడక్రింద విశ్రాంతి గైకొను పశువుల మందగను ఎవడు తలంచునో, ఓ అర్జునా ! రాసులుంగనున్న సంపద గలిగి

యున్నవాడై యుండికూడ ఎవడు మార్గమున పోవు పరాయివానివలె సాక్షి మాత్రుడుగానే వుండునో, పంజరమున బంధింపబడియున్న చిలుకవలె ఎవడు వేదముల ఆజ్ఞను మర్యాదను, పాటించుచూ నీతిపూర్వకముగ ఆచార వ్యవహారముల నొనర్చుచూ వున్నవాడై భార్యాబిడ్డల మాయా మమకార జాలమున చిక్కుకొనడో, అట్టివానినే జ్ఞానపాలనము నొనర్చు వానినిగ ఎరుంగవలెను. సముద్రము గ్రీష్మఋతువునందును వర్షఋతువు నందును ఒకే తీరున నిండియుండు రీతిని యిష్టానిష్టములెన్ని ప్రాప్తించి నప్పటికిని సదా అవికారుడైయుండు వానినే జ్ఞానసంపన్నునిగా నెరుంగవలెను. లోకులు పగటిని మూడుభాగములుగ నొనర్తురు. కాని సూర్యుడు ఎన్న డును ఆ మూడు భాగములందును మూడు విధములుగ నుండడు. ఈ విధ ముగా సుఖదుఃఖముల మూలమున ఎవనియందు భిన్నత్వము ఏర్పడదో, ఎవనియందు ఆకాశ సమానముగ ఎల్లప్పుడు పూర్తియైన సమభావమే కనిపిం చునో, ఓ అర్జునా! అట్టివానిని గురించి ఆతని జ్ఞానము పరిపూర్ణమైనదనిన్నీ ఆతడెల్లప్పుడు సమస్థితియం దుండుననిన్నీ ఎరుంగుము.

శ్లో॥ మయి చానన్య యోగేన భక్తి రవ్యభిచారిణీ ।
వివిక్త దేశ సేవిత్వ మరతి ర్జన సంసది ॥ ౧౦

“ నన్ను గురించి ఎవడు తన మనస్సున నన్ను (శ్రీకృష్ణుని) మించిన దేదియూ ప్రపంచమున లేదని దృఢనిశ్చయము చేసికొనెనో, ఎవని శరీరము వాక్కు మనస్సులు ఈ దృఢనిశ్చయ సత్వమును పాన మొనర్చినవో మరియు ఎవడు నావైపు తప్ప మరెవరివైపును చూడడో, అంతఃకరణము నిరంత రము నా సమీపమందే వసించుటవలన ఎవడు నాతోపాటు ఏకశయ్యు డైననే నిద్రించునో, భార్య తన భర్త వద్దకు దాపరికము లేకుండా నిర్భయ ముగ పోవురీతిని ఎవడు నా వద్దకు దాపరికము లేకుండా వచ్చునో, గంగా జలము సముద్రములోనికి పోయి కలపి సమరసత్వము పొందురీతిని

ఎవడు నా స్వరూపముతో సమరసత్వము పొందునో, ఎవడు పూర్తిగా నా భక్తినే యొనర్చునో, సూర్యునితో ఉదయించి అతని తోనే అస్తమించుట వలన సూర్యుని ప్రకాశమునకు సూర్యునితో ఏకత్వము శోభిల్లు విధమున నీటియందలి పృష్ఠభాగము సహజముగ కదలినప్పటికిని దానిని లోకులు 'అల' యని మరొకపేర పిలుచువిధమున (వాస్తవమునకు అదికూడా నీరే గదా!) ఏ ఏకనిష్ఠుడగు భక్తుడు నాతో ఏకరూపమును పొంది నన్నుసేవించునో అతడు జ్ఞానస్వరూపుడే యని యెరుంగుము. ఎవనికి తీర్థములందును పవిత్ర నదీతీరము లందును శుద్ధ తపోవనములందును అరణ్యమునందలి గుహలందును మరియు యిదేవిధములగు ఏకాంతస్థానములందు నివసించవలె ననెడి ఆసక్తి యుండునో, ఎవడు పర్వతశ్రేణులందలి గుహలను లేదా సరోవరసమీప ప్రదేశములనూ అత్యాదరపూర్వకముగ సేవించునో, మరియు ఎవడు నగరములలో కెన్నడును రాడో, ఎవనికి ఏకాంతవాసము ప్రియముగనుండునో, మరియు జనావాసముల కెవడు సదా దూరముగనుండ గోరునో, అట్టి పురుషుని మానవ దేహమును ధరించిన జ్ఞానముగనే ఎరుంగవలెను. ఓ అర్జునా! జ్ఞానమును చక్కగా వివరించుటకు నీకు మరియొక లక్షణమును చెప్పెదను వినుము.

శ్లో॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ॥
ఏతత్ జ్ఞాన మితిప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా॥ 11

"ఏ జ్ఞాన సహాయమువలన పరమాత్మ అనగా ఆ ఏకమే వాద్వితీయ వస్తు గోచరమగునో అదియే నిజమగు జ్ఞానము. ఇదిగాక ప్రపంచము మరియు స్వర్గాదులకు సంబంధించిన జ్ఞానముల నన్నింటిని ఎవడు తనమనమ్మున నిశ్చయపూర్వకముగ వాస్తవమగు అజ్ఞానముగ తెలిసికొనునో, ఎవడు స్వర్గసంబంధమగు జ్ఞానమునకు తిలాంజలి నిచ్చునో, ఎవడు ప్రాపంచిక విషయములకు సంబంధించినసంగతుల నెన్నడును తన చెవులకు సోకనైన నివ్వడో, మరియు

నిర్మలభావనతో ఆధ్యాత్మికజ్ఞానమున నిమగ్నుడై యుండునో, ఎవడు అన్యజ్ఞానముల నన్నింటిని ఒక ప్రక్కగానుంచి 'యాత్రికుడు దారితప్పి నప్పుడు సందుగొందులను విడచి రాజబాటనే పోవుటకు ప్రారంభించు విధముగ' తన బుద్ధిని ఆధ్యాత్మ జ్ఞానమార్గమున పురోగమింప జేయునో,ఎవడు తన మనస్సున 'ఇదొక్కటే సత్యము' అన్యసమస్త విషయజ్ఞానము కేవలము మిథ్యయే యని తెలిసికొని ఎవడు దృఢనిశ్చయ పూర్వకముగ తన మనస్సు నందు మేరుపర్వత సమానమగు స్థిరత్వముతో నుండునో, ఈరీతిని ఆకాశ మండలి ధ్రువనక్షత్రముతో సమముగ ఎవని నిశ్చయము ఆధ్యాత్మిక జ్ఞాన ద్వారమువద్ద అచల రూపమునస్థిరపడి యుండునో, అట్టివానియందే జ్ఞానము వసించును. జ్ఞానమున స్థిరపడిన మనస్సుగలవాడైనప్పుడే ఆతడు జ్ఞానస్వరూపు డయ్యెనని యెరుంగవలెను. భోజనమునకు కూర్చొనిన కొంతసేపటి తరు వాత జరుగు విషయము (అనగా తాను చేయనున్న భోజనమువలన కలుగు ఆనందము, వాటిరుచులు) భోజనమునకు కూర్చొన బోవునప్పుడు వెంటనే తెలియదు, కాని, పురుషుని మతి జ్ఞానమున స్థిరపడుటతోడనే, ఆతనికి కలిగి యుండెడి స్థితి సాధారణముగ పూర్ణజ్ఞానియొక్క స్థితినే పోలియుండును. ఇదిగాక, శుద్ధతత్త్వజ్ఞానము యొక్క ఏకమాత్ర ఫలమగు జ్ఞేయవస్తువు, ఆతనికి సహజముగనే కాన్పించసాగును. అటులగాక, బోధ జరిగినప్పటికి కూడ ఆతని మనస్సునకు జ్ఞేయవస్తువు కన్పించకున్నచో, ఆతనికి జ్ఞానలాభము కలిగినదని అంగీకరించుటకు వీలుకాదు. గుడ్డివాడు చేతదీపము గైకొన్నప్ప టికిని, ఆతనికి దానివలన కలుగు ప్రయోజనమేమి ? కావుననే, జ్ఞేయవస్తువు కాన్పించకున్నచో నిశ్చయముగ జ్ఞాన మంతయు వ్యర్థమై పోయిన దనియే యెరుంగవలెను. జ్ఞానప్రకాశము వలన పరమాత్మ తత్త్వము గాన్పించకున్నచో, ఆ జ్ఞానస్ఫూర్తి పూర్తిగ అంధురాలై వుండిపోవును. గాన జ్ఞానముచూపువస్తువులన్నియు పరమాత్మ వస్తుస్వరూపములో కన్పించు నంతటి నిర్మలత్వము బుద్ధికి వచ్చితీరవలెను. ఈ విధమగు నిర్మలస్ఫూర్తి.

కల్గినవానికి మాత్రమే నిర్దోషజ్ఞానము చూపించిన పరతత్త్వము కన్పించ సాగును. తనకు గలిగిన విశదజ్ఞాన సహాయమున పరమాత్మతత్త్వమునుకూడ చూడగలవానికి ఆతని బుద్ధికూడ అట్టివిశాలమైనదిగనే వుండును. ఇట్టి పురుషుడు జ్ఞానస్వరూపుడగునని విశేషించి చెప్పనక్కరలేదుగదా! వాస్తవమునకు జ్ఞానతేజముతోపాటు ఎవనిబుద్ధి జ్ఞేయవస్తువువరకు చేరునో, ఆతడు ఆత్మతత్త్వమును ప్రత్యక్షముగ చేతితో స్పర్శించుననియే చెప్పవలెను. ఇట్టి స్థితిలో ఓ అర్జునా! ఇట్టిపురుషుని ప్రత్యక్ష జ్ఞానమనియే చెప్పినచో ఆశ్చర్య పడనేల! సూర్యుడు సూర్యుడుగనే వుండును.

ఇదంతయు విని శ్రోత లిట్లనిరి – "ఇంక దీని నధికముగ విస్తరించకుడు. గ్రంథ నిరూపణమున యీ లౌకాభి రామాయణపుమాటల నేల చెప్పెదరు? మీరు జ్ఞానమునుగురించి విపులీకరించి చెప్పిన సంగతులవలన మాకు కావలసిన ఆతిథ్యము లభించినది. నిరూపణము చేయుటలో అత్యధికమగు రసాళుత్వమును తేవలెననెడి కవులయొక్క మంత్రమును మీరు చక్కగా నేర్చుకొనిరి. మీరు మమ్ము ఆహ్వానించి ఉపయుక్తమగు ప్రసంగము వచ్చినప్పుడు లౌకిక వృత్తాంతములను చెప్పి మమ్ము మీశత్రువులనుగా ఏల చేసికొందురు? కూర్చొని భోజనముచేయు సమయమైనప్పుడు ముందు వడ్డింపబడిన అన్నమును చేతగొని పారిపోవు వ్యక్తికి ఆతనికి చేసిన ఆదరసత్కారములన్నియు ఏవిధముగ ఉపయోగించును? అన్నివిధముల అనుకూలముగ వుండి పాలు పితుకబోయినప్పుడు తన్నులు తన్నెడి ఆవును ఎవడు పెంచుకొనును? ఇదే విధమున, జ్ఞానమున బుద్ధి ప్రవేశము కానందువలన యితర నిరూపణ మొనర్చువారు రకరకములుగ చెప్పెదరు.

చివరకు వారేమి చెప్పిరో వారికే తెలియదు. కాని, మీరు చక్కగనే నిరూపించితిరి. ఏ జ్ఞానపు ఒక్క కణమైన ప్రాప్తించుటకై లోకులు యోగసాధనాది పెక్కు కష్టములను ఓర్చుకొందురో, ఆ జ్ఞానమే వాస్తవమునకు సమాధానమును కలిగించునదియై యున్నది. అందుపై మీవలె

రసవత్తరముగ నిరూపణముకూడ జరుగుచో, యిక చెప్పవలసిన దేమి ? అమృతవర్షము కురియసాగుచో,అందువలన నష్టమేమి గలదు?సుఖవంతమగు కోటానుకోట్ల దినములు లభించుచో, యీ సుఖవంతమగు రోజులు ఎప్పుడు సమాప్తమై పోవునా యని లెక్కబెట్టబూనుకొనువా డెవడైన వుండునా ? పూర్ణిమరాత్రి యుగపరిమితి గలది అయినప్పటికిని చకోరము దాని వంక ఏకాగ్రతతో నిరంతరము చూచుచూ వుండదా ? ఇదే విధమున జ్ఞానవిషయము - అందుపై రసవత్తరమగు మీ నిరూపణము లభించుచో ఎవడైన 'యిక చాలును. ఆపివేయుడు' అని అనునా ? భాగ్యవంతుడగు అతిథి వచ్చుట, అందుపై నైపుణ్యముగ వడ్డించునామె దొరకుట— యీ రెండునూ సంభవించినప్పుడు ఎంతసేపు భోజనము నొనర్చినప్పటికిని, అది స్వల్పకాలముగనే కన్పించును. సరిగా నేడిట్టిపరిస్థితియే కలిగినది. ముందుగనే మాకు జ్ఞానపిపాస గలదు. అందుపై జ్ఞాననిరూపణ మొనర్చ వలెననెడి ఉత్సాహము మీకు గలదు. అందుచే యీ కథపట్ల మాశ్రద్ధ అతిశయించినది. మీరు జ్ఞానద్రష్టలని మేము చెప్పి తీరవలెను.

కాన, మీరు మీ బుద్ధియందు జొచ్చి,దానిపరిభావముచే,దీనిముందు గల 'అజ్ఞానం యదతోఽన్యథా' పదమును నిరూపణ మొనర్చగోరెదము.

సాధుజనుల యీమాటలను విని నివృత్తి నాథదాసుడగు జ్ఞానదేవు లిటు లనిరి. మహారాజా! నామనస్సుకూడ యిదే కోరుచున్నది. అందుపై సమర్థులగు మీరుకూడ అదేచెప్పుమని ఆజ్ఞాపించిరి. ఇక నేను వ్యర్థముగ నావక్తృత్వ మును పొడిగించను. ఈరీతిని శ్రీకృష్ణులు అర్జునునకు జ్ఞానముయొక్క అష్టా దశ లక్షణములను వివరించిరి. శ్రీకృష్ణులు యిట్లనిరి.

ఈ లక్షణములవలన జ్ఞానమును గుర్తింపవలెను. ఇది నా ఒక్కని అభిప్రాయమేగాదు. జ్ఞానులందరి అభిప్రాయము యిదియే. అరచేతియం దుంచిన ఉసిరికపండు (కరతలామలకము) స్పష్టముగ కాన్పించురీతిని, నేను

చెప్పిన లక్షణములవల్ల జ్ఞానమును స్పష్టముగ చూచి గుర్తించవగును. ఇక, ఓ అర్జునా ! లోకులు 'అజ్ఞానము' అని దేని నందురో, దాని స్వరూపమును కూడ నీకు లక్షణసహితముగ చెప్పెదను. వాస్తవముగ చూచినచో, జ్ఞాన స్వరూపము చక్కగా బోధపడిన పిమ్మట సహజముగనే అజ్ఞాన మననేమో తెలియును. ఏల నన ఓ అర్జునా! ఏది 'జ్ఞానము' కాదో, అది అజ్ఞానమే యగును. పగలు అయిపోవగనే రాత్రి వచ్చును. ఆసమయమున మరొక మూడవది సంభవించనేరదు.

ఈ విధమున జ్ఞానములేనిచోట అజ్ఞానము వున్నదని ఎరుంగవలెను. అయినప్పటికిని, నేను అజ్ఞాన లక్షణములను విపులముగ చెప్పెదను. ఎవడు కేవలము మహత్త్వము లేదా ప్రతిష్ఠను సంపాదించుట కొరకే జీవించునో, ఎవడు కేవలము మానముకొరకై ఎదురు చూచుచుండునో, ఆదర సత్కారములు కలుగుటవల్లమాత్రమే ఎవనికి సంతసము కలుగునో, ఎవడు పర్వత శిఖరమువలె ఎల్లప్పుడు పైననే వుండగోరునో, మరియు ఉన్నత పదవినుండి క్రిందికి దిగుటను ఎన్నడును అభిలషించడో, అట్టివానియందు అజ్ఞానము సమృద్ధిగా గలదని ఎరుంగుము. రావిఆకుల తోరణములను లోకులు కట్టుకొను రీతిని, ఎవడు తా నొనర్చిన దానాది పుణ్యకర్మల తోరణములను ఆడంబరముగా గల శబ్దములతో అలంకరించి కట్టుకొనునో, ఎవడు బుద్ధిపూర్వకముగ దేవాలయమునందలి చామరమువలె ఎల్లప్పుడు శిరమెత్తి నిలచి యుండునో, ఎవడు తన విద్యను గురించి విపులముగ వర్ణించుకొనునో, తన పుణ్యకర్మలను చాటించుకొనుచు తిరుగుచుండునో, మరియు ప్రతి పనిని లౌకికకీర్తిని సంపాదించుటకుమాత్రమే చేయునో, ఎవడు బాహ్యామునకు తన శరీరమును చాల ఆడంబరముగ అతి ప్రశంసనీయముగ నుంచుకొని తనవలయందు చిక్కుపడి, లేదా తనను అనుసరించెడివారిని ఎల్లప్పుడు భ్రమ పెట్టుచుండునో అట్టివానిని అజ్ఞానపుగని యని యెరుంగవలెను.

అరణ్యమున దావాగ్ని వ్యాపింప సాగినప్పుడు ఆ అరణ్యమునం దుండెడి సమస్త ప్రాణులు మరియువనస్పతులు సమానముగనే ఆ అగ్నిబాధను సహింపవలసియుండురీతిని, ఎవని ఆచరణవలన జగత్తు దుఃఖమును అనుభవింపవలసివచ్చునో,ఎవని సహజమగు సంభాషణముకూడా లోకులను గొడ్డలి దెబ్బ వలె బాధించునో, మరియు ఎవడు తనమనస్సున బయట పెట్టకుండా దాచియుంచుకొనిన ఉద్దేశ్యము సిద్ధించుటకై విషముకంటెకూడ ఘాతకుడుగ నుండునో, అట్టివానియందు అత్యధికమగు అజ్ఞానము నిండియున్నదని ఎరుంగవలెను. అంతేగాదు, ఆతనిని అజ్ఞాన భాండారముగనే భావించవలెను; ఏలనన ఆతనిజీవితము కేవలము హింసామయముగనే యుండును. లోపల గాలి నిండినపిమ్మటనే కొలిమితిత్తి ఉబ్బియుండి,నొక్కగానే అదిమరలనొక్కుకుపోవు రీతిని ఎవడు సంయోగ వియోగములవలన క్రమముగా లేచుచూ-పడుచుచూ, లేదా వృద్ధిపొందుచూ- తగ్గిపోవుచూ నుండునో, ఎవడు తనను స్తుతించినందువలన 'గాలివీతకు ధూమకణములు ఆకాశమువరకు ఎగిరిపోవు రీతిని ఆనందముచే ఆకాశమంత పైకి లేచి, తనను ఏ మాత్రము నిందించినను నెత్తిని చేతులు పెట్టుకొని విచారముగ కూర్చునునో, మానావమానములవలన ఎవనిస్థితి బురదవలె రెండు నీటిబిందువులు పడుటవలన తడిగా నుండుట, కొద్దిగా గాలి వీచుటచే మరల ఆరుకుపోవుటవలె నుండునో, (అనగా ఏవిధమగు మనో వికారములను సహించలేక పోవుట) అట్టివానియందు అజ్ఞానము పరిపూర్ణముగ నిండియున్నదని ఎరుంగవలెను.

మనస్సునం దొక ఉద్దేశ్యముంచుకొని బయటకు మరొకరీతిని, లోపల ఏవిధమగు దురభిప్రాయము లేనివానివలె ఎవడు ప్రవర్తించునో, అదేవిధముగ ఎవడు బయటకు సరళముగ నున్నట్లుండి కపట అనురాగమును నటించుచూ ఇతరులను తన వశమొనర్చుకొనునో, లేళ్ళు మొదలగువానిని చంపుటకై వ్యాధుడు వాటిని మోసగించి భ్రమపెట్టు తలంపుతో వాటిముందు వాటికి కావలసిన ఆహారమును పెట్టి వంచనతో వాటిని వశపరచుకొనురీతిని

ఎవని బాహ్యానటన యీ విధముగ మంచిదిగా నుండునో, మరియు నాచుతో కప్పబడిన రాతివలె నుండునో, అట్టి వానియందు అజ్ఞానము పూర్తిగా నిండియుండు ననుటలో లేశమాత్రము సందియము లేదు. తన గురుకులమును తలంచుకొనుటవలన ఎవనికి సిగ్గు గలుగునో, ఎవనికి గురుభక్తి నచ్చదో, ఎవడు గురువువద్ద విద్యాగ్రహణమొనర్చి ఆయనకంటె నేను విద్యావంతుడనని విర్రవీగునో, అట్టివాని పేరు తలచుటకూడ మహాదోషమే యగును. కాని తప్పని సరివలన యీ లక్షణములను చెప్పవలసి వచ్చినది. ఇక నేను గురుభక్తుల నామములను స్మరించి యీ దూషితమైన జిహ్వకు ప్రాయశ్చిత్త మొనర్తును. ఏలనన, గురుభక్తుల నామములు సూర్యునివలె నలుదిశలందును ప్రకాశమును వ్యాపింపజేయును. గురుద్రోహుల నామోచ్చారణచే గలుగు పాపభారము నుండి విముక్తుడగుటకు వాణికి యీ మాత్రపు ప్రాయశ్చిత్తము ఆవశ్యకమే. ఇప్పటివరకు గురుద్రోహుల నామములను తలచుకొన్నందువల్ల కలిగిన పాప మంతయు గురుభక్తుల నామోచ్చారణచే తొలగిపోవును.

ఇక అజ్ఞానముయొక్క యితర లక్షణములను వినుము. ఆచరణయందు సదా విచలితుడుగను అస్థిరుడుగను ఎవడుండునో, ఎవడు ఎల్లప్పుడు సంశయముతో నిండియుండునో, ఏ మానవుడు లోపలను బయటను అరణ్యమునందలి పైన ముళ్ళ కంచలతోను, లోపల ఎముకలతోను నిండియున్న నూతివలె త్యజింపబడినవాడై యుండునో, ఎవడు ద్రవ్యమును ఆర్జించవలెననెడి లోభమునకు లోబడి నాది - పరునిది యనెడి ఆలోచన లేనివాడై ‘ కుక్క ఆకలిగొన్నదై బహిరంగముగ యుక్తా యుక్తముల నాలోచింపకుండా ఏది దొరికిన దానినే తిను రీతిని ’ ధనార్జన చేయునో, ఎవడు కుక్కవలె నీతి, అవినీతి యనెడి యోచన లేకుండా అనాలోచితముగ ఎచట తోచిన అచటనే సంభోగ మొనర్చునో, ఎవడు కర్తవ్య - కర్మల నొనర్చవలసిన సమయము తప్పిపోవుటవలన గాని లేదా నిత్య నైమిత్తిక కర్మల నొనర్పకపోవుట వలన గాని మనస్సునం దించుకేని దుఃఖించడో, ఎవనికి పాపాచరణ

మొనర్చుటలో ఏమాత్రము విఘ్న కలుగదో, పుణ్యకార్యము లొనర్చుటకు ఎవనియం దేమాత్రము ఉత్సాహము వుండదో, మరియు ఎవని చిత్తము నందెల్లప్పుడు సంశయము నిలచియుండునో, అట్టివానిని నిస్సంశయముగ అజ్ఞానస్వరూపుడని యెరుంగవలెను. ఎవని దృష్టి ఎల్లప్పుడు ధనసంపాదన పైననే వుండునో, ఎవడు అతిస్వల్పమగు స్వార్థమునకు కూడ 'చీమతాకుడు మాత్రముననే తృణబీజము జారి పడురీతిని' ధైర్యమును కోల్పోవునో, ఎవడు 'భయ' మనెడి పేరు వినుటతోడనే 'పాదము పెట్టుటతోడనే గుంటయందలినీరు మురికి యగురీతిని విచలితుడగునో, ఎవడు తన మనోరథ తరంగములతోపాటుగా తన మనస్సును 'ప్రవాహమునపడిన సార కాయ కొట్టుకొనిపోవు రీతిని' పోనిచ్చునో, ఎవడు దుఃఖపుమాట వినుట తోడనే 'గాలిసోకినంత మాత్రముననే దుమ్ము చాలదూరముపోవు రీతిని' తన నిశ్చితస్థానమునుండి చాలదూరమువరకు పోవునో, ఎవ డెన్నడును ఒక ప్రదేశమున స్థిరముగ నుండడో మరియు మేఘములవలె యిటునటు సంచ రించుచుండునో, ఎవని మనస్సునం దెన్నడును ఏదైన క్షేత్రము, తీర్థము, లేదా నగరమునందు వసింప వలెననెడి ఆలోచనయే కలుగదో, లేదా ఎవడు ఎన్నడును ఒక ప్రదేశమునం దుండడో, ఎవడెల్లప్పుడు 'వెర్రితొండ వలె ఒక్కొక్కప్పుడు చెట్టుకొమ్మల చివరకూ మరియొకమారు అచ్చటనుంచి వృక్షమూలమువద్దకు' వ్యర్థముగ యిటు-నటు తిరుగుచుండునో, శయనించు నప్పుడు తప్ప మ రేసమయము నందును ఎవడు ఒకప్రదేశమున నిలకడగ నుండక ఎల్లప్పుడు నిటు - నటు తిరుగుచుండునో, అట్టి వానియందు అజ్ఞానము పూర్తిగా నిండియుండును. ఆతడు కోతివలె చంచలముగ నుండును.

మరియు ఓ అర్జునా! ఎవని అంతఃకరణమున నిగ్రహబలము లేదో, ఎవడు నిషిద్ధమును ఎదుట చూచికూడ 'కాలువయందు వచ్చిన జలప్రవాహము యిసుకతో వేసిన కట్టను చూచి భయమందక, దానిని కూడ నెట్టుకొని పోవురీతిని' భయభీతుడు కాడో, ఎవడు తన ఆచరణవలన వ్రత

ఖండన మొనర్చునో, తన ధర్మమును పాదములతో మట్టగించునో, మరియు యమ నియమములను నిరాశ బొందించునో, ఎవడు పాపమనిన ఏమాత్రము భయపడడో, మరియు పుణ్యముపట్ల ఎవనికి అనురాగము లేదో, ఎవడు లజ్జ యనెడి లతను సమూలముగ పెరకివేయునో, ఎవడు తన కుల - పరంపరను ఏమాత్రము లక్ష్యపెట్టడో, ఎవడు వేదాజ్ఞను తన కెల్లప్పుడు దూరముగ నుంచునో మరియు ఏది చేయదగినపని - ఏది చేయరాని పని యనెడి నిర్ణయ మొనర్చుట యెన్నడును ఎవడెరుంగడో, ఎవ డీరీతిని యిష్టము వచ్చిన ఆటల నాడుచుండునో, ఆబోతు స్వేచ్ఛగా విహారించు రీతిని, లేదా వాయువు విశాలముగ వీచురీతిని, లేదా నిర్జనస్థానమున నదీ - నదములు తమ యిష్టానుసారము ప్రవహించురీతిని ఎవని చిత్తము విషయములందు సమస్త బంధనములను త్రెంచివైచి సంచరించుచుండునో, గుడ్డిఏనుగు నలువైపుల సంచరించురీతిని, లేదా పర్వతముపైన దావాగ్ని నలువైపులను దహించు రీతిని ఎవడు నిరంకుశముగ సంచరించుచుండునో, అట్టివాడే అజ్ఞాని యగును. పెంటకుప్పపై పడవేయగూడని వస్తు వేదియుండును ? అడవి జంతువుల నెవడు పట్టుకొనును ? గ్రామ పొలిమేరను ఎవడు లంఘించగలడు ? అన్నసత్రములో కోరినవాడు వెళ్ళి భుజించవచ్చును; వేశ్యలో తారుణ్య తేజము వచ్చినప్పుడు కోరిన ప్రతివ్యక్తి ఆమె ఆనందము ననుభవింప వచ్చును; వ్యాపారస్తుని తెరచియున్న దుకాణములోనికి వెళ్ళదలచిన ప్రతివాడు వెళ్ళవచ్చును. ఇదే రీతిని, అంతఃకరణముగలచోట సర్వవిధములగు అజ్ఞానులు సమృద్ధిగ నుందురు.

నీవీ విషయమును జ్ఞప్తియం దుంచుకొనుము. జీవించియుండుగాక మరణించి యుండుగాక - విషయ వాసనలు ఏ స్థితియందును వదలిపోవు; స్వర్గమున విషయముల ననుభవించియే తీరవలెగదాయని తలంచి ఎవ డీ లోకమున సమస్త విషయసుఖములను అనుభవించునో, ఎవడు నిరంతరము విషయ భోగములను గురించియే జపము చేయుచుండునో, ఎవని అనురాగము సదా

-సకామ కర్మాచరణముపైనే పునందే వుండునో, మరియు ఎవడు విరాగులదర్శన మగుటయే తడవుగ 'తాను బట్టలుతడిపి స్నానముచేసి తీరవలెను'నంత చెడుగా తలంచునో, విషయములకు ఆతనిపట్ల విరక్తికలిగిన స్థితియందుకూడ ఎవడు విషయముల ననుభవించుచుండునో, మరియు మహారోగి తనచెయ్యి కుళ్ళిపోయి నప్పటికిని ఆకుళ్ళిపోయినచేతితోనే అన్నము తినుచూ తన క్షేమమునకు సంబంధించిన విషయమున జాగరూకుడై యుండనిరీతిని ఎవడువిషయసేవన మొనర్చుచుండునో, మగ గాడిద ఆడ గాడిద వెంట గుడ్డిగా పోవురీతిని మరియు ఆ ఆడ గాడిద మాటిమాటికి తన్నులు తన్నుచున్నప్పటికిని మగ గాడిద దానిని విడచిపోని రీతిని ఎవడు విషయసుఖములను వాంఛించి వెంటాడుచుండునో, ఎవడు విషయభోగముల కొరకై మండుచున్న అగ్నియందైన దూకునో, మరియు అనేక రకములగు వ్యసనములను అలంకారములవలె ధరించునో, తన రొమ్ము బిడ్డలు కానంతవరకు జలమనెడి భ్రమతో లేడి పరుగెత్తి, అప్పటికిని అది జలముకాదనీ, ఎండమావియనీ విశ్వసించని లేడిస్థితివలె విషయప్రాప్తిపట్ల ఎవనిస్థితి యుండునో, ఎవడు పుట్టినప్పటినుంచి మరణించునంతవరకు విషయములవలన అనేక విధముల పీడింపబడినప్పటికిని వాటియెడ విసుగుజెందక, అందుకు విరుద్ధముగ వాటిని యింకనూ ఎక్కువ ప్రేమతో అనుభవించవలెననెడి ప్రయత్నము చేయుచుండునో ఆతడే అజ్ఞాని.

ప్రథమమున, బాల్యమున ఆతని తల్లి దండ్రులు ఆతని నెత్తినెక్కి స్వారీ చేయుదురు. ఆ తరువాత స్త్రీ దేహసౌందర్యమనెడి భ్రమలో పడును. ఆ పిమ్మట స్త్రీ సాంగత్యములో అత్యధిక కాలము గతించి పోవుటతో వార్ధక్యము రా సాగును. అప్పుడు బిడ్డలపట్ల ప్రేమయనెడి ఉన్మాదము ఆతనిపై స్వారీ చేయును. పిల్లికిగాని కుక్కకుగాని సంతతికలిగి నప్పుడు ఆ సంతతి కనులు తెరుపనంత వరకు కదల - మెదలక పడి యుండును. ఇదేరీతిని, ఎవడు, నిరంతరము తన భార్యాబిడ్డల జాలము

లందు చిక్కుకొని పడియుండి, మరణించునంతవరకు విషయములపట్ల ఏమాత్రము విసుగుజనింపని వాడుగా నుండునో, ఓ అర్జునా! అట్టిమానవుని అజ్ఞానమునకు పరిమితియేలేదని యెరుంగుము. అజ్ఞానమునకుగల మరికొన్ని లక్షణముల నింకనూ చెప్పెదను వినుము, ఎవడు యీ దేహమే ఆత్మయ నెడి భావము మనస్సున గలవాడై కర్మారంభము నొనర్చునో, ఎవడు తా నాచరించిన మంచిచెడ్డ కర్మల నన్నింటిని ధ్యానమందుంచుకొని హర్షప్రఫుల్లి తుడగునో, ఎవడు తనవిద్యా యౌవనావస్థల మూలమున 'భక్తుని తలపై దేవ తాప్రతిమ నుంచినప్పుడు ఆతడు ఠీవిగానడచు రీతిని' ఠీవిగానడచునో, "నాతో సాటివచ్చువా డెవడును లేడు. సంపదగలవా డెవడైన నున్నచో 'ఆవ్యక్తిని నే నొక్కడనే', నన్ను మించిన ఉత్తమ ఆచారము గలవా డెవడు? నాకు సాటివచ్చునట్టి గొప్పవా డెవడును లేడు? నేను సర్వజ్ఞుడను, నేను ఏది చెప్పిన అదే అంతటను మన్నింపబడును' అని ఎవడు నిరంతరము చెప్పుచుండునో, ఎవ డీరీతిని గర్వముతో తనకు గల విషయ తృప్తివలన ఆనందమును పట్టజాలకుండునో, రోగి ఏవిధమగు భోగమును సహించని రీతిని ఎవడు పరుల మేలును చూడజాలడో, ఎవడు గుణము (అన, సద్భావన) లను దీపము గుణము (అన, వత్తి) ను నాశ మొనర్చురీతిని నాశ మొనర్చునో, ఎవడు స్నేహము (ప్రేమ) ను దీపము స్నేహము (నూనె) ను కాల్చివేయురీతిని కాల్చివేయునో, మరియు ఎవడు దీపమువలె ఎచ్చటనున్న అచ్చటనే దుఃఖమనెడి కాలిమను నలువైపుల వ్యాపింపజేయునో, నీటితుంపురు పడుటచే చిటచిటమనెడిన్నీ కొద్దిగాలితగులుటచే ఆరిపోవునట్టిన్నీ మరియు సహజముగనే ఏవస్తువునకు తాకినప్పటికిని యింటినంతను దగ్ధమొనర్చి బూడిదచేసీ ఒక్క పూచికనైనను మిగిల్చి యుంచనట్టి దీపమువలె ఎవని స్థితియుండునో, ఎవడు ఎంత బోధించినప్పటికినీ అంగీకరింపకపోగా పైగా పోట్లాడసాగునో మరియు అవకాశము వచ్చినప్పుడు యితరులకు కీడుచేయు టలో వెనుకాడడో, ఎవడు తనకుగల అల్పమగు విద్యవల్లనే 'కొద్ది

ప్రకాశము నిచ్చెడి దీపముకూడ తనకు గల ఆ కొద్ది ప్రకాశమువల్లనే మిక్కుటమగు తాపమును కలిగించురీతిని' అందరకు అసహ్యాకరముగ నుందునో, గుణవంతుడై నప్పటికిని మత్సరమువలన ఎవనిస్థితి 'ఔషధముగ పుచ్చుకొన్నప్పటికిని జ్వరమును ప్రకోపింపజేయు పాలస్థితివలె' నుండునో, లేదా సర్పముముందు పెట్టబడిన పాలవలె ఎవడు విషపూరితుడో, (అనగా సుగుణవంతుడైనప్పటికిని అందరిపట్లను మత్సరముతో నుండువాడు, జ్ఞానియై యుండికూడ అహంకరించువాడు.)

మరియు ఎవనికి తన తపస్సు మరియు జ్ఞానములను గురించిన అపారమగు గర్వము గలదో, ఎవడు గర్వమువలన 'అంత్యజుడు రాజసింహాసనముపై కూర్చున్నందు వలన ఉప్పొంగురీతిని,' లేదా కొండ చిలువ (అజగరము) స్తంభమును మ్రింగి ఉబ్బిపోవురీతిని' ఉప్పొంగునో, ఎవడు రోలింగు రాతివలె ఎన్నడును ఎవని ఎదుటను వంగడో, మరియు రాతివలె ఎన్నడును ద్రవించడో, మరియు బుసకొట్టుచున్న సర్పము మాంత్రికుని వశమునందుండని రీతిని, ఎవడు ఏ గుణవంతుని వశమునవుండడో, ఓ అర్జునా! ఈ ల క్ష ణ ము ల న్ని యు ఎవనియందుండునో అట్టి వానియందు సదావృద్ధిపొందుచూ అజ్ఞానము నిండియుండును. మరియు ఓ అర్జునా! ఎవ డీ శరీరమనెడి గృహమునే ఎల్లప్పుడు పోషించుకొనుచుండునో మరియు తన గతించిన మరియు భవిష్య జన్మలను గురించి ఎన్నడును ఏవిధమగు ఆలోచనయు చేయడో, అతడే అజ్ఞాని. కృతఘ్నునికి చేసిన ఉపకారము, చోరుని చేతికిచ్చిన ధనము, మరియు లజ్జలేనివారికి చేసిన హెచ్చరిక - వ్యర్థమగురీతిని, ఇంటియందు దూరెడి కుక్కకు చెవులు, తోక కోసి యింటినుంచి పారద్రోలినప్పటికిని ఆకుక్క చెవులు - తోక యందు కారెడి రక్తము తగ్గిపోక పూర్వమే సిగ్గులేకుండా మరల యింటి యందు దూరురీతిని, లేదా సర్పము నోటిలోనికి పోవుచున్న సమయమందు కూడ కప్ప యీగలను పట్టుకొనుటకై తన నాలుకను బయటకు జాపురీతిని,

ఎవనికి తన శరీరమందలి ఇంద్రియ ద్వారములు తొమ్మిదీ చక్కగానుండి మరియు శరీరము లోలోపలనే కృశించుటకు పోవుచున్న స్థితియందుకూడ ఖేదము కలుగదో, ఎవడు మాతృగర్భమనెడి గుహలో మల మూత్రములందు తొమ్మిదిమాసములవరకు పడియున్నప్పటికిని గర్భావస్థయందలి దుఃఖములు, లేదా జన్మించునప్పుడు కలిగెడి కష్టములనుకూడా స్మరించడో, ఎవడు బిడ్డలు మల - మూత్రములనెడి మాలిన్యమున దొరలుచున్నప్పుడు చూచి కూడ ఏవగించుకోనడో, మరియు యిట్టి విషయములనిన వ్యాకులపడడో మరియు విరక్తిని పొందడో, ఎవడు 'యింతకుముందే గత జన్మ సమాప్తమైనది. త్వరలోనే మరల నూతనజన్మ రానున్నది. అనెడివిషయమును గురించి ఎన్నడును యోచించడో, ఎవనికి తన జీవితమునందలి మంచిరోజులప్పుడు మృత్యుస్మరణరాదో, ఎవడు తన మనస్సునందెల్లప్పుడు 'ఇప్పుడు నేనున్న మంచిస్థితియందే ఎల్లప్పుడు వుందును' అనెడి విశ్వాసము గలవాడైయుండునో, మరియు యిట్టి విశ్వాసమువలన 'మృత్యువనెడిది ఒకటి గలదనెడి భావమే ఎన్నడును ఎవనికితోచదో, ఎవనిస్థితి చిన్నగుంటయందుండి, చేప 'యీ గుంట ఎన్నడును ఎండదు' అనెడి భావముతో లోతైన ఏ ప్రవాహమునకు పోని చేపస్థితివలె నుండునో, లేదా వేటగాడు పాడెడి పాటలో నిమగ్నరాలై ఆ వేటగానిని చూచుటచే మరచిపోవు హరిణమువలె నుండునో, లేదా యెర్రిక లోపలగల ముల్లును చూడక ఆ యెర్రను తిన ప్రయత్నించు మత్స్యమువలె నుండునో, లేదా దీప జ్వాలను చూచుటతోడనే ఆ దీపము తనను కాల్చివేయునసెడి ధ్యాసనే మరచిపోవునట్టి మిడుతవలె ఎవని స్థితి యుండునో, అట్టివాడే అజ్ఞాని.

మూర్ఖుడు యిల్లు తగులబడుచున్న సమయమందుకూడ నిద్రించుచునే యుండురీతిని, లేదా తెలియనప్పుడు విషాన్నమును భుజించురీతిని, అజ్ఞాని కూడా రాజస సుఖమునందు నిమగ్నుడై యిది జీవితరూపమందున్న మృత్యువని తెలియక యిది ఎరుగనేరకున్నాడు. ఆతడు రాత్రింబవళ్ళు తన శరీరపోష

ణము నొనర్చుకొనుచు నుండును. మరియు విషయ సుఖవైభవమునే వాస్తవముగ తలంచుచున్నాడు. కాని, ఆ దురదృష్టుడగు మూఢునకు 'వేశ్యకు తన సర్వస్వమును అర్పించుట తనను తాను నాశమొనర్చుకొనుటయే' యనిగాని, లేదా మోసగానితో స్నేహముచేయుట తన ప్రాణములను కోల్పోవుటయే యనిగాని, లేదా గోడపై రంగులతో చిత్రించిన చిత్రమును శుభ్రమొనర్చుటకుగాను కడుగుట – ఆ చిత్రమును తుడిచివేయుటయే యనిగాని, లేదా పాండురోగమువలన శరీరము ఉబ్బుట తాను నాశమగుటయే యగుననిగాని బోధపడకున్నది. ఇదేవిధమున ఆతడు అహోర నిద్రలలో మునిగి బుద్ధిహీనుడగుచున్నాడు. ఎదుటనున్న శూలము (ఉరికంబము) వైపుకు పరుగెత్తువానికి ఒక్కొక్క అడుగు ముందుకు పోయినకొలది మృత్యువు సమీపమగు రీతిని, అతని శరీరము వృద్ధిపొంది రోజులు గడచుచూ విషయభోగాను భవము కలుగుచున్న కొలది అతని ఆయువుపై మృత్యుచ్ఛాయలు క్రమ క్రమముగ వృద్ధిపొందుచుండును. నీటిలో ఉప్పు కరిగిపోవు రీతిని యీతని జీవితము కూడ కరిగిపోవు చుండును, మరియు మృత్యువు సమీపించు చుండును. అయినప్పటికిని, యీ ప్రత్యక్షమగు సంగతి అతనికి బోధపడదు. ఓ అర్జునా! ఎవనికి విషయములనెడి సుడిగుండములో నిరంతరము శరీరమును అంటిపెట్టుకొనియుండు మృత్యువు కాన్పించదో, అట్టివాని విషయమై, అతడు అజ్ఞాన రాజ్యాధిపతియని ఎరుంగుము.

ఇట్టివానికి జీవితమునందలి సుఖములనెడి సుడిగుండములో మృత్యువు జ్ఞప్తికిరాదు; అదే విధమున యీతడు తన యౌవనమదమున వృద్ధావస్థను లక్ష్యపెట్టనేరడు. పర్వత శిఖరముపైనుంచి దొరలినబండి, లేదా పర్వతముపైనుంచిపడినరాయి ముందేమున్నదో చూడనిరీతిని అతడుకూడ ముందుముందు రానున్న వార్ధక్యమును చూడడు. కొండవాగునందు నీరు వృద్ధి కాసాగినప్పుడు, వరదలు వచ్చినప్పుడు, లేదా దున్నపోతుకు యౌవన మదము కలిగినప్పుడు, వీటికి ఎదుటనున్న వస్తువేదియూ కనిపించదు. మరియు అది తన

యిష్టానుసారము నలువైపులకు పరుగులిడ సాగును. ఇదేవిధమున ఆతడు కూడ యౌవనమదముచే అంధుడగును. ఆతనికి అంగములు నిర్బలము లైనప్పటికిని, తేజస్సు తగ్గిపోవు చున్నప్పటికిని, తల వ్రేలబడ సాగినప్పటికిని, గడ్డము నెరసిపోయి నప్పటికిని, కంఠము వణకసాగినప్పటికిని ఆతడు తన (మాయా) సంపదను పెంపొందించుచునే వుండును.

గుడ్డివానికి ఎదుటినుంచి వచ్చు మనుష్యుడు తన రొమ్మువద్దకు రానంతవరకు కనిపించనిరీతిని, లేదా సోమరిపోతు తన యింటికి అంటుకొనిన నిప్పురవ్వలు తన ముఖమువద్ద పడసాగినప్పుడుకూడ ఆనందముతో పడుకొనియుండురీతిని, ఏ పురుషునకు నేడు యౌవనావస్థను అనుభవించుచున్న సమయమున రేపు రానున్న వార్ధక్యావస్థ కాన్పించదో, ఓ అర్జునా! అట్టి పురుషుడు మూర్ఖత్వమును దాల్చిన అజ్ఞానమే యగును. ఎవరైన అశక్తుడు గాని గూనివాడుగాని కనిపించినప్పుడు ఎవడు ఆతనిని అహంకారముతో వేళాకోళము చేయుట, మరియు ఆతనికి నకలుగా చేయసాగుటను చేయుచూ, తనకుకూడ ముందుముందు అదే స్థితి సంభవించ సున్నదని తలంచక మృత్యువును సూచించెడి వార్ధక్యలక్షణములు శరీరమునందు కాన్పించినప్పటికికూడ ఎవనికి యౌవన కాలపు భ్రమ పోదో, అట్టి పురుషుని అజ్ఞానమునకు పుట్టినిల్లుగా నెరుంగవలెను.

ఓ అర్జునా! అజ్ఞానముయొక్క తదితర లక్షణములనుకూడ చెప్పెదను వినుము. పెద్దపులిగల ఏదేనొక అడవిలోనికి ఒకపశువు మేతమేయుటకు వెళ్ళి అదృష్ట వశమున ఏదో విధమున పులిబారినుంచి తప్పించుకొని వచ్చితి ననెడి విశ్వాసముతో మరల అదే ఆతనికి ఆపశువు మేతమేయుటకై వెళ్ళురీతిని, లేదా పాము పుట్టయందు పెట్టి యుంచిన ధనమును పాముకాటునుంచి ఏదో విధమున తప్పించుకొని ఒకమారొక పురుషుడు తీసికొని వచ్చినప్పుడాతడు 'ఆ పుట్టలో పామేలేదు, ఉన్నట్లైతే అది కాటువేయదా? అని చెప్పనారంభించు రీతిని, ఎవడైన ఒకటి రెండుమారులు కుపథ్యము చేసి

నప్పుడు కూడా ఆతని శరీరము ఆరోగ్యవంతముగ నున్నందువలన, తన శరీరము వ్యాధి రహితముగ నున్నదని తలంచు రీతిని, లేదా తన శత్రువు నిద్రించియుండగా చూచి స్వస్థుడు, నిశ్చింత గలవాడుగను అయి ఆతనితో నాకుగల వైరము మరియు అందువలన కలుగనున్న సంకటములుకూడ తొలగి పోయినవని తలంచి అంతమందు తన బిడ్డల ప్రాణములతోపాటు తన ప్రాణములుకూడా కోల్పోవురీతిని, లేదా ఆహార - నిద్రలు నియమిత ముగ జరుగుచున్నంతవరకు మరియు వ్యాధి తన శరీరమున పూర్తిగా పాదు కొననంతవరకు ఎవడు వ్యాధినిగురించి నిశ్చింతగా నుండునో, ఆతడే అజ్ఞాని. ఆతడు, తన భార్యా బిడ్డలు, పరివారము మొదలగు వాటితోపాటు తన సంపదవల్ల అత్యధికముగ విషయసంపాదన మొనర్చుచూ పోవుచున్నకొలది ఆతడు తన్నుతానింకనూ అంధునిగా నొనర్చుకొనుచున్నాడు.

' ఆకస్మికముగ నాకీ విషయములతో వియోగము కలుగును, మరియు ఒక్క క్షణములో నాపై నొక గొప్ప ఆపద వచ్చి పడ నున్నదనెడి, భవిష్యమున రానున్న దుఃఖము ఎవనికి కాన్పించదో, ఓ అర్జునా! ఆ పురుషుడు కేవలము అజ్ఞానుడే. మరియు, ఇంద్రియ ములయొక్క ఉదరమును విషయము లనెడి ఆహారముతో యథేచ్ఛగా నింపుచుండువాడు కూడ అజ్ఞానియే. ఎవడు యౌవనావేశము మరియు సంపదల వలన సేవ్యాసేవ్యములను గురించి ఏ మాత్రము యోచించ కుండా గ్రుడ్డిగా ప్రతివిషయమును అనుభవించుచుండునో, ఎవని మనస్సు చేయరానిపనినే చేయుచుండునో,ఎవడు అసంభవమగు విషయములను ఆశించు చుండునో, మరియు ఎన్నడును యోచించగూడని విషయములను గురించి ఎవడు చింతన మొనర్చుచుండునో, శరీరమూ మనస్సులు ప్రవేశించ గూడని చోటున వాటిని ఎవడు ప్రవేశపెట్టునో, గైకొనరాని వస్తువునే ఎవడు అడు గునో, పొరపాటుగా కూడ స్పర్శింపరాని దానిని ఎవడు నిరంతరము స్పర్శించు చుండునో, పోరాని చోటునకే ఎవడు పోవునో, చూడగూడని

దానినే ఎవడు చూచునో, తినరానిదానిని తిని ఎవడు ఆనందమును పొందునో,సాంగత్యము పనికిరాని దానితోనే ఎవడు సాంగత్య మొనర్చునో, దేనితో సంలగ్నము పనికిరాదో దానితోనే ఎవడు సంలగ్నుడగునో, ఏ మార్గమున పోరాదో ఆమార్గముననే పోవునో, ఎవడు వినరాని మాటలను వినునో, మరియు పలుకరాని మాటలను పలుకునో, మరియు తన యీ ఆచరణము వలన ఎంతటి దోషము ప్రాప్తించునో ఎరుగడో, ఓ అర్జునా! మనస్సుకు రుచికరముగా నున్నందువల్ల ఎవడు యీ పని చేయ దగునా – చేయరాదా – యని ఏమాత్రమును యోచించడో, మరియు ఎవ డిట్టి మనస్సుకు రుచివంతముగనున్న పనులను తనకర్తవ్యములుగా తలంచి చేయుచూ – తా నీ పనులను చేసినందువలన తనకు పాపము వచ్చుననిన్నీ మరియు భవిష్యత్తున నరకయాతనలను అనుభవించవలసి యుండుననిన్నీ యోచించని పురుషుని సాంగత్యము వలన 'జ్ఞానులతోకూడ వాదవివాదములు చేయ సమకట్టునంతి' మిక్కుటముగ యీ ప్రపంచమున అజ్ఞానము వృద్ధి యగును. ఇక దీనిని విడచి, అజ్ఞానమును స్పష్టముగ తెలిసికొనుటకు వీలగు కొన్ని లక్షణములను నీకు చెప్పెదను వినుము.

నూతనముగ తీయబడిన సుగంధితపరాగమునందు భృంగికి (ఆడతేనీగ) వుండెడి ప్రీతివలె ఎవడు గార్హస్థ్య సుఖములందు ప్రీతిగలవాడైయుండునో, చక్కెరపై వ్రాలిన యీగ ఎల్లప్పుడు దానిమీదనే వుండవలెననీ మరియు దానిపైనుంచి లేచుటకు దాని మనస్సు ఏవిధముగను అంగీకరించనిరీతిని ఎవడు స్త్రీ ఆజ్ఞానుసారమే నడచుకొనెడి యిచ్ఛగలవాడై యుండునో, నీటిగుంటలో వున్న కప్ప దానిని విడచి బయటకు రాగోరనిరీతిని, లేదా దోమ చీమిడిని వదలిపెట్టగోరని రీతిని, లేదా పశువులు ఎల్లప్పుడు బురదలో పడుకొనియుండుటను వాంఛించు రీతిని ఎవని జీవము మనస్సు మరియు ప్రాణములు సాంసారిక జంజాటముల నుంచి బయటకు రాజా లవో, సర్పము బంజరుగానున్న ప్రదేశమునందుండి అచ్చటినుంచి ఏ విధము-

గను తొలగిపోవుటను వాంఛించనిరీతిని ఎవడు తన సంసారమునే పట్టుకొని వ్రేలాడుచుండునో, స్త్రీ తన ప్రాణనాథుని తన శక్తినంతను వినియోగించి ఆలింగన మొనర్చుకొను రీతిని ఎవడు తన గార్హస్థ్యమును గట్టిగా పట్టుకొని యుండునో, తేనెను సంపాదించు నుద్దేశ్యముతో, తేనెటీగలు నిరంతరము పరిశ్రమ చేయురీతిని ఎవడు తన కుటుంబ సంరక్షణార్థమై నిరంతరము కృషి చేయుచుండునో అదృష్టవశమున వార్ధక్యములో కలిగిన ఏకపుత్రునిపై ఆతని తల్లిదండ్రులకు వుండెడి అనురాగమువలె ఎవనికి తన కుటుంబముపై అంత మిక్కుటమగు అనురాగము వుండునో, మరియు ఎవనికి తన భార్యయే సమస్తముగ నుండునో, ఎవడు కేవలము స్త్రీ శరీరమునే భజించుచూ మరియు ఉపాసించుచూ వుండునో, మరియు 'నేనెవడను, నేనేమి చేయవలెను ?' అనెడి జ్ఞానము నామ మాత్రమునకైనను ఎవనికి లేదో, మహాజ్ఞానులగు వారి చిత్తము కేవలము బ్రహ్మమందే రమించుచూ ఆ బ్రహ్మము ముందు దానియొక్క యితర వ్యవహారములన్నియు లోపించు రీతిని, ఎవడు తన సమస్తేంద్రియముల తోను స్త్రీపై ఏకాగ్రభావముతో అనురాగమును ఏర్పరచుకొనునో,

ఎవడు స్త్రీ సంబంధమగు అనురాగము నందు లజ్జ మరియు హానులను గాని లోకాపవాదములను గాని లక్ష్యపెట్టడో, ఎవడు ఎల్లప్పుడు స్త్రీ యిష్టానుసారమే నడచుకొనుచుండునో, మరియు ఆమె వలయందు చిక్కుకొని గారడీవాని కోతివలె చిందులు త్రొక్కుచుండునో, పరమలోభియగు వాడు తాను స్వయముగ కష్టపడుటేగాక యిష్ట - మిత్రులనుకూడ దుఃఖపెట్టి డబ్బును కూడబెట్టురీతిని ఎవడు దానము-పుణ్యకార్యములనొనర్చుటయందు లోభిత్వముతోనుండునో, ఎవడు తనచుట్ట - పక్కములను కూడ మోసగించి మరియు వారిని ఆదరించుటయందుకూడ కొఱత జేయుటకు వెనుకాడక తన భార్యయొక్క వాంఛితములం దేమాత్రము లోటు లేకుండ అన్నింటిని నెరవేర్చుచుండునో,ఎవడు అతి స్వల్పమగు ఖర్చుతో ఆరాధ్యదేవతలను సంతుష్టుల నొనర్చగోరునో,

గురు జనులనుకూడ ఇటులనే మోసగించునో॰ మరియు తనతల్లి- దండ్రులకై
కూడ ఖర్చుపెట్టుటలో తన అసమర్థతను వెల్లడించుచూ తన భార్యయొక్క-
సౌఖ్యమునకై చూచిన ప్రతి గొప్పవస్తువును ఎంతవిలువగలదైనప్పటికిని
వెనుకాడక కొనితెచ్చునో, ప్రేమపూరితుడగు భక్తుడు తన కులదేవతను
ఉపాసించి భజించురీతిని ఎవడు తన భార్యను ఉపాసించు చుండునో,
అసలైనది మరియు శ్రేష్ఠమైనవి యగు వస్తువులను తనభార్యకొరకై
ప్రత్యేకించి వుంచి యితర సామాన్యమగు వస్తువులనుకూడ యితరులకు
ఎవ్వడివ్వడో, తన భార్య వైపు ఎవడైనా కన్నెత్తి చూచునెడల లేదా
ఆమెను విరోధించునెడల ఆతనికి ప్రళయసమానమగు అనర్థము కలుగునని
ఎవడు భావించునో, శరీరముపైదద్దుర్లు లేచుననెడి భయముతో దేవతలకు
భక్తిపూర్వకముగా వెండి నాగేంద్రుని అర్పించుకొనురీతిని ఎవడు తన
భార్యయొక్క- అతిస్వల్పమగు వాంఛనుకూడ భక్తిపూర్వకముగా నెరవేర్చు
చుండునో, ఓ అర్జునా! తాత్పర్యమేమన, ఎవడు తన భార్యనే సర్వస్వముగ
తలంచునో, మరియు ఆమె కడుపున పుట్టిన బిడ్డలను ప్రేమించుటమాత్రమే
ఎరుగునో, మరియు ఎవనికి తన భార్యయొక్క- వైభవమంతయు తన
ప్రాణములకంటె కూడ ప్రియమైనదిగ నుండునో, అట్టి పురుషుడు
అజ్ఞానమునకు ఆధారమైనవాడు. ఆతనివలన అజ్ఞానముయొక్క- ప్రతిభ
పెంపొందుచుండును. మరియు ఆతడు ప్రత్యక్షముగ అజ్ఞానమే యగును.

విక్షుబ్ధ సముద్రమునందు విచ్చలవిడిగ వదలబడిన నావ అలలతో
పాటుగా ఊగులాడుచుండు రీతిని ప్రియవస్తువు ప్రాప్తించినందువలన ఆతడు
పొందెడి ఆనందము ఆకాశమునందు కూడ పట్టజాలనంత మిక్కుటమైనది
గానై, అప్రియ విషయము జరిగినప్పుడు ఆతడు పొందెడి దుఃఖము రసాత
లమువరకు పోవునట్టి భేదభావమనెడి బంధనమున పడియున్న అంతః కరణము
గలవాడు ఎంతటి బుద్ధిమంతుడైనప్పటికిని ఆతనిని అజ్ఞాన స్వరూపునిగానే
ఎంచుకొనవలెను. ద్రవ్య సంపాదన మొనర్చవలె ననెడి తలంపుతో వైరాగ్య

వేషము బూనురీతిని ఎవడు తనమనస్సునందేదో ఫలమును ఆశించి నాభక్తి
యొనర్చునో, లేదా వ్యభిచారిణియగు స్త్రీ తన మిండగానివద్దకు పోవుటకు
వీలు కలిగించుకొను తలంపుతో తనపతిని సంతోషపెట్టి మరియు ఆతనికి నమ్మ
కము కలిగించుటకై బయటకు కపటముతో కూడిన శుద్ధ వ్యవహారము మరియు
ఆచరణము గలదై యుండురీతిని, ఓ అర్జునా ! ఎవడు బయటకు నటనగా నా
భక్తి యొనర్చుచూ వాస్తవమునందు విషయసుఖములను పొందవలెననెడిదృష్టి
గలవాడై, ఆ విధమగు భక్తి వలన తాను వాంఛించిన ఫలము కలుగనందు
వలన యీ భక్తి యంతయూ, నిరర్థకమని తలంచి నా భక్తిని విడనాడునో,
ఎవడు యీ రీతిని, రైతు ప్రతిరోజు క్రొత్త క్రొత్త భూములను తీపికొని
దున్ను రీతిని దినదినము క్రొత్త క్రొత్త దేవతలను ఆరాధించుచుండునో,
మరియు తన ప్రతి క్రొత్తదేవతను తా నిదివరకు సేవించిన పాతదేవతవలెనే
సేవించునో, ఏవడు ఏదైన నూతన గురు-సాంప్రదాయమునందలి విశేషమగు
ఆడంబరమును జూచి ఆ ఆడంబరమునకు లోనై ఆ మంత్రగ్రహణ
మొనర్చునో మరియు అన్యమంత్రము లన్నిటిని క్షుద్రముగ తలంచి వాటిని
స్వీకరింపడో, ఎవడు సజీవప్రాణులపట్ల నిర్దయతో వ్యవహరించుచూ
వృక్షములు, పాషాణములు మొదలుగా గల స్థావర వస్తువులను
దేవతలుగా భావించి వాటిని పూజించుచుండునో మరియు యీ
రీతిని ఎవనికి ఎవనిపైనను ఏకనిష్ఠతో కూడియున్న శ్రద్ధయుండదో,
ఎవడు నావిగ్రహమును తన యింటియం దొకమూల స్థాపించియుండి తాను
స్వయముగ యితర దేవతలను దర్శించుటకై మరియు యాత్రలకై బయలు
దేరునో, ఎవడు నన్నెల్లప్పుడు పూజించుచుండి కూడ మంగళకార్యము
లందు కులదేవతలను అర్చించుచుండునో, మరియు కొన్ని విశేషపర్వదినము
లందు అన్యదేవతలను ఆరాధించునో, ఇంటియందు నావిగ్రహమును స్థాపించు
కొని యితర దేవతలకు ఎవడు ముడుపులు కట్టుచుండునో, మరియు
శ్రాద్ధ సమయములందు తన పితరుల భక్తుడగునో, ఎవడు ఏకాదశి

నాడు నన్నెంతగా ఆరాధించునో, అంత మిక్కుటముగ శ్రావణశుక్ల పంచమినాడు నాగులను కూడ అదేరీతిని ఆరాధించునో? ఎవడు భాద్రపదశుక్ల చతుర్థినాడు గణపతికి భక్తుడై, చతుర్దశి వచ్చినప్పుడు దుర్గాదేవికి భక్తుడు కాసాగునో, ఎవడు నవమి వచ్చుటచే నవచండీ అనుష్ఠానమునకై కూర్చొని ఆదివారమునాడు కాలభైరవునకు పుల గము పెట్టసాగునో, మరియు సోమవారము వచ్చినప్పుడు బిల్వపత్రము గైకొని శివలింగముపై పు పరుగిడునో, అనగా యీరీతిని ఎవడు నానావిధము లగు దేవతల నందరిని ఆరాధించుచూ మరియు ఉపాసించు చుండునో మరియు యీరీతిని తొందరపాటుతో ఎవడు క్షణము సేపుకూడ శాంతము లేనివాడై అన్ని విధములగు దేవతలను ఆరాధించుటకై పరుగిడునో అయా దేవతలను అయా సమయములందు భజించు చుండునో, అట్టివానిని గురించి అతడు మూర్తిత్వమును దాల్చిన అజ్ఞానమే నని నీవు నిశ్చయముగ తెలిసికొనుము.

నిర్జనము మరియు స్వచ్ఛమగు తపోవనము, తీర్థము మరియు నదీతీరము లను చూచినప్పుడు ఏవగింపుగాని అయిష్టముగాని పొందువానిని కూడ మూర్తిత్వమును దాల్చిన అజ్ఞానముగనే ఎరుంగుము. ఎవనికి జనసమ్మర్దము నందుండుటే యిష్టముగ నుండునో, ఎవడు యీసాంసారిక జంజాటములందే మైమరచియుండునో, మరియు ఎవడు లౌకిక విషయములయెడ అనురాగము గలవాడై మాట్లాడుచుండునో, అట్టివాడుకూడ మూర్తిత్వమును దాల్చిన అజ్ఞానమేయగును. ఆత్మదర్శన ప్రాప్తిని కలిగించెడి విద్యను గురించిన చర్చ వచ్చినప్పుడు దానిని గురించి ఏవిద్వాంసుడు పరిహసించునట్టి బుద్ధి కల వాడై యుండునో, ఎవడు పొరబాటుగా నైన ఉపనిషత్తుల వైపు దృష్టిని మరల్చడో, ఎవనికి యోగశాస్త్రము నచ్చదో, మరియు ఆధ్యాత్మిక జ్ఞానమువైపుకు ఎవని ప్రవృత్తి మరలదో, ఎవనియందు ఆత్మచర్యకు సంబంధించిన శ్రద్ధ పూర్తిగా కొరవడియుండునో, మరియు యీవిషయము

యోచింపదగినదే కాదని ఎవడు తలంచుచుండునో, మరియు ఎవని మనస్సు పలుపు తెంచుకొని పారిపోవు పశువువలె ముక్తము మరియు స్వేచ్ఛా చారముగలదై యుండునో, ఎవడు కర్మకాండయందు నిపుణుడైయుండునో, ఎవనికి పురాణములన్నియు కంఠస్థమో, మరియు ఎవడు జ్యోతిషమునందు గూడ పారంగతుడో, ఎవడు శిల్ప - కర్మలందు చతురుడో, పాకవిద్య యందు నిష్ణాతుడో, మరియు అథర్వణవేద మందలి అఘోరీమంత్ర - తంత్రములందు కౌశలము గలవాడో, ఎవనికి కామశాస్త్రము నందు నేర్చుకొనవలసిన విషయ మేదియూ మిగిలి లేదో, ఎవనికి మహాభారత మందలి సంగతు లన్నియు తెలియునో, మరియు వేదములు మూర్తిమును దాల్చి ఎవని కరతలము నందుండునో, ఎవనికి నీతిశాస్త్రజ్ఞానము గలదో వైద్యశాస్త్ర జ్ఞానము గలదో, మరియు కావ్య-నాటకముల యందు ఎవడు సాటిలేని జ్ఞాతయో, ఎవడు స్మృతులనుగురించి చర్చించునో, గారడీ విద్యారహస్యముల నెరుంగునో, మరియు శబ్దకోశమునుఎవడు తనబుద్ధికి సేవ కునిగ నొనర్చుకొనెనో, వ్యాకరణ శాస్త్రమునందగాధమగు జ్ఞానముగలవాడో అనగా ఎవడు సర్వవిషయములందును గొప్పపండితుడై యున్నప్పటికిని ఒక్క ఆధ్యాత్మిక విద్యయందు సంపూర్తిగ జన్మాంధుడో, ఎవడు ఆధ్యా త్మిక శాస్త్రము మినహా తతిమ్మా శాస్త్రములన్నింటి సిద్ధాంత ప్రతిపాదమును చేయగలసమర్థుడో, అట్టివానికిగల యీజ్ఞానమునకంతకును నిప్పంటించవలెను.

తల్లి-దండ్రులకు కీడు కలుగజేయునట్టి మూలానక్షత్రమున పుట్టినబిడ్డని వలె యిట్టి అన్యమగు జ్ఞానముగలవానిని చూడనేరాదు. నెమలి శరీరమునం దంతటను రెక్కలుండును. ఆ ప్రతి రెక్కయందును నేత్రములుం కూడ వుండును. అయినప్పటికిని, ఆ నేత్రము లన్నింటను దృష్టి కొరవడి యుండు రీతిని యిట్టి జ్ఞానమునందు కూడ వాస్తవిక దృష్టికొరవడి యుండును. సంజీవినీలత యొక్క పేమాత్రపు ముక్క చేజిక్కినప్పటికిని చాలును. అన్య ఔషధములూ, మూలికలూ బండ్లకొలది వున్నప్పటికిని

దానియందు అల్పమైనవేగదా! ముప్పదిరెండు సౌందర్య లక్షణములు వున్నప్పటికిని ఆయువు లేకున్నయెడల, లేదా అనేకములగు ఆభరణము లున్నప్పటికిని వానిని ధరించుటకు మస్తకమే లేనియెడల, లేదా పెక్కుమంది వాద్యగాండ్రు మరియు మంగళహారతు లిచ్చువారు వున్నప్పటికిని వధూవరులు లేకున్నచో — వీ టన్నిటి ఉపయోగమేమి యుండును ! ఇదేరీతిని ఒక్క అధ్యాత్మశాస్త్రము మినహా మిగత అన్నిశాస్త్రములు తమ అపూర్ణత్వము వలన కేవలము నిష్ఫలము మరియు భ్రామకములూ నగును.

కావున, ఓ అర్జునా ! ఆధ్యాత్మిక జ్ఞానము బోధపడని చదువుకొన్న మూర్ఖుని శరీరమును అజ్ఞానాలయముగ నెరుంగుము. ఆతని జ్ఞానమంతయు ఒక్క అజ్ఞానమనెడి తీగయందు కాచిన ఫలముగానే యగును. ఆతని ప్రతి మాటనూ అజ్ఞానపుష్పముగ నెరుంగవలెను. మరియు ఆతనికి లభించు పుణ్య ఫలములు కూడ అజ్ఞానముగనే యగును. ఆధ్యాత్మిక శాస్త్రమును గురించిన ఆదరణలేని మనస్సుగల వానికి జ్ఞానవస్తు వెన్నడూను కాన్పించనేరదు. నది యొక్క యీవలితీరము వరకు రాక వెనుకకు మరలి పారిపోవునట్టి వానికి దానికి ఆవలి ఒడ్డునగల సంగతులను గురించిన జ్ఞానమెటుల కలుగగలదు ? లేదా, గుమ్మముపద్దనే కుత్తుకవొక్కి వేయబడిన వానికి యింటి యందలి విషయము లెటుల తెలియును ? ఇదేరీతిని, ఓ అర్జునా ! ఆధ్యాత్మిక జ్ఞాన పరిచయ మేమాత్రము లేనివానికి సత్యజ్ఞాన ప్రాప్తికి తావెచట గలదు ? కావున ఓ అర్జునా ! ఇట్టి వానికి వాస్తవిక జ్ఞానతత్త్వము ఏమాత్రము తెలియ దని విశేషించి చెప్పనక్కరలేదు.

గర్భిణీ స్త్రీకి అన్నముపెట్టినందువల్ల ఆమె గర్భమందలి పిండము లేదా బిడ్డవృద్ధిపొందు రీతిని పైచెప్పబడిన జ్ఞానపదములందే అజ్ఞానపదము కూడ అంతర్భావముగ నగును. పెండ్లివానిని ఆహ్వానించి నప్పుడు అతడు తన

వెంట తెలిసిన మరొకనిని వెంట నిడుకొని వచ్చురీతిని అజ్ఞాన లక్షణములను నీకు చెప్పినందువల్ల జ్ఞానలక్షణములు వాటంతట అవే నీకు బోధపడసాగును. అందువలననే, ప్రస్తుతప్రకరణమునందు అమానిత్వాదిజ్ఞానలక్షణములకు భిన్నమగు అజ్ఞానలక్షణములే ప్రతిపాదింపబడినవి. పైన చెప్పబడిన పదునెనిమిది జ్ఞానలక్షణములకు విరుద్ధమగునవన్నియు అజ్ఞానలక్షణములగును. గత శ్లోకమందలి ఒకపాదమునందు శ్రీకృష్ణుడు 'జ్ఞానలక్షణములను మార్పుచేసినచో అవియే అజ్ఞాన లక్షణములగును' అనిచెప్పిరి. అందుచే నేనీ ప్రణాళికను అనుసరించియే యీ విషయమును వివరించిచెప్పితిని. మూలమునం దీప్రణాళిక అనుసరింపబడలేదు; అయినను నీరుపోసి పాలను పెంపొందింప జేసెడి సిద్ధాంతము ననుసరించి వ్యర్థమగు సంగతులను పెంచి విషయమును విస్తరింపను. నేను మూల శ్లోకములందలి శబ్దమర్యాదను విడనాడక మూలమున ధ్వనించెడి అర్థమును స్పష్టీకరించుటకు ప్రయత్నము నొనర్చితిని. ఈ మాటలను విని శ్రోతలిటులనిరి.

"ఓ కవిపోషకా ! మీకే భయము కలుగ నక్కరలేదు. గీతయందు గర్భిత మొనర్పబడిన విషయములను మాకు వివరించి చెప్పవలసినదిగా శ్రీకృష్ణభగవానులు మిమ్ము ఆజ్ఞాపించియున్నారు. భగవానుని ఆ మనోరథమును మీరు నెరవేర్చుచున్నారు. మీ రావిషయములను చెప్పునప్పుడు మీ మనస్సు ప్రేమచే గద్గదమగును. అందుచేతనే నేడు మాకు శ్రవణసుఖమువలన జ్ఞాననౌక లభించినది. అటుపైని శ్రీహరి యింకా ఏమని చెప్పెనో మాకు త్వరగా చెప్పుడు." మహాత్ములయొక్క యీమాటలను విని శ్రీనివృత్తినాథదాసులగు శ్రీజ్ఞాన దేవులు "ఓ శ్రోతలారా! యిక వినుడు" అని చెప్పిరి. అంత శ్రీకృష్ణులు అర్జునునితో యిటులనిరి– "ఓ అర్జునా! అంతమున నేను చెప్పిన లక్షణములన్నియు అజ్ఞానలక్షణములే. నీవీ అజ్ఞానమును విడచి జ్ఞానమువైపు దృఢనిశ్చయము గలిగియుండుము." జ్ఞానమును గురించి యీ రీతిగా చెప్పగానే అర్జునునకు ఆ జ్ఞేయము ఎటుల ప్రాప్తించునో! తెలసి

కొనవలెననెడి కోరిక జనించెను. దానిని సర్వాంతర్యామి యగు భగవానుడు తెలిసికొని జ్ఞేయమన నేమో చెప్పెదను వినుము అనిరి.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృత మశ్నుతే।
అనాది మత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥ ౧౨

సర్వతం పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥ ౧౩

“బ్రహ్మ వస్తువును లోకులు జ్ఞేయమని చెప్పుటకు గల కారణము” జ్ఞానము తప్ప మరే ఉపాయమువలనను అది లభించక పోవుటయే. ఏ జ్ఞానము ప్రాప్తించుటవలన మరే యితర కార్యము మిగిలియుండదో, ఏ జ్ఞానము లభించుటచే దానితోపాటు తద్రూపత్వము జనించునో, ఏ జ్ఞానము లభించిన పిమ్మట యీ జగత్తును తీరమునందుంచి జ్ఞానులు నిత్యానందసాగరమున యీదులాడుచూ దానియందు కలసిపోదురో, ఆ జ్ఞేయమునకు ఆది యనునట్టి దేదియూ లేదు. అనగా అది సనాతనము. దాని కొక నామ ముండవలెనను తలంపుతో లోకులు దానిని పరబ్రహ్మ మని యందురు. ఎవరైన ఆ వస్తువు లేదని యనుచో, వారికి విశ్వరూపమున అది ప్రత్యక్షముగ కనిపించుచున్నదనియే మా జవాబు. ఒకవేళ దానిని విశ్వ మందు మన్న యీ విశ్వము కేవలము మాయావంతమూ, మరియు అశాశ్వతమునై యున్నది. ఆకారము, రంగు మొదలుగాగల భేదములు, మరియు దృశ్యత్వము మరియు ద్రష్టత్వము మొదలుగాగల భావములే లేనిదానిని గురించి ‘అది గలదు (అస్తిత్వము)’ అని ఎవడెటుల చెప్ప గలడు? ఒకవేళ అది వాస్తవముగ లేనేలేకున్నచో ‘అది లేనిదే మహ త్తత్వము ఎచ్చటినుంచి స్ఫురించును? మరియు దేనివలన స్ఫురించును?’ అనెడి ప్రశ్న ఉదయించుచున్నది. ఇందువలననే, దేనిని గురించిన జ్ఞానము కలుగుటచే ‘వున్నది’-‘లేదు’

అనెడి జగడము లేదా ప్రశ్న వుండనేరదో, మరియు యోచనాశక్తి దేనిని చేరజాలదో, ఏది సమస్త పదార్థములందును మరియు సమస్త ఆకారములందును కుండ, బాన మొదలగువానియందు పృథ్వీతత్త్వము స్వాయముగ ఆ పదార్థముల ఆకారమునందే వుండు రీతిని' నివసించుచుండునో, స్థలకాలములచే భిన్నముకాకుండా సమస్తస్థలములందును మరియు సమస్తకులములందు ఏక్రియ సమస్త స్థూల సూక్ష్మ భూతములద్వారా జరుగుచుండునో, ఆక్రియ (కార్యము) ఏ బ్రహ్మ - వస్తువుయొక్క చేతియందున్నదో, ఆ వస్తువునే విశ్వబాహువు అందుము. ఈ బ్రహ్మవస్తువే సర్వాకారములను దాల్చి ఎల్లప్పుడు సమస్త కార్యములను చేయుచుండుట వల్లనే - యీ విధముగ పిలువబడుచున్నది.

మరియు ఓ అర్జునా ! ఆవస్తువు అన్ని ప్రదేశములందును మరియు ఎల్లప్పుడు ఒక్క శ్రేణిలోనే ప్రాప్తించును.అందువలననే దానిని విశ్వాంఘ్రి యనికూడ అనవచ్చును. సూర్యబింబమునందు నేత్రరూపమున వేరొక అంగము లేకున్నప్పటికిని బింబమంతయూ ప్రకాశైకస్వరూపముగ నుండురీతిని, ఏ వస్తువు తన శరీరమంతటితోను విశ్వద్రష్టగా నగునో (అనగా విశ్వమును ప్రకాశమానముగ నొనర్చి చూచునో) ఆ అ - చక్షువగు (నేత్రహీనమైన) బ్రహ్మ వస్తువునే వేదములు అత్యాదర పూర్వకముగ "విశ్వతశ్చక్షువు, యనెడి పేర సంబోధించినవి. విశ్వ - మస్తకముపై నెల్లప్పుడు సర్వదా ఆత్మ సత్తాతో విరాజిల్లు నాతనిని 'విశ్వమూర్ధుడు' అందుము. అగ్నియొక్క రూపమంతయూ అతని ముఖమగు రీతిని తన సర్వాత్త్వము వలన శేషించిన భూతకోటిని ఉపభోగించు నాతనిని, ఓ అర్జునా ! విశ్వతోముఖు డనదగును. మరియు వస్తువులయం దాకాశము వ్యాపించియుండు రీతిని శబ్దకోటియందు వ్యాపించియుండు ఆ బ్రహ్మవస్తువునే మనము సర్వశ్రోత్ర యందుము. ఇదే విధమున సమస్త విశ్వమునందును వ్యాపించియుండి సమస్తమును చూచుచుండు ఆ వస్తువునే విశ్వతశ్చక్షువు అందుము. ఓ బుధ

మంతుడవగు అర్జునా ! వాస్తవిక దృష్టితో చూచినచో వేదాదులు ఆతనిని విశ్వతశ్చక్షువు అని పొగడుచూ చేసిన వర్ణనము కేవలము ఆ బ్రహ్మవస్తువు యొక్క వ్యాపకత్వము తెలియజేయుటకై రూపము లేనివానికి రూపమును కల్పించిచేసిన రూపకాలంకారము మాత్రమేనని యెరుంగుము. ఆబ్రహ్మవస్తువుకు వాస్తవమునకు చేతులు-కాళ్ళు-కనులు మొదలుగాగల అంగములు లేనే లేవు. కావున వీటికి సంబంధించిన ఏమాటయూ ఆతనివిషయమై చెల్లనేరదు.

పోనీ, శూన్యత్వరూపమున ఆతనిని వర్ణింతమన్న అదికూడ ఆతని విషయమై చెల్లనేరదు. ఉదాహరణముగా, ఒక నీటితరంగము మరొక నీటితరంగమును కబళించినదనుకొందము. వాస్తవమునకు యీ భక్షించెడి మరియు భక్షింపబడెడి తరంగములలో స్వరూపతః ఏదైన భేదము కలదా ? ఇదే విధమున, ఆ ఒక్క బ్రహ్మవస్తువే సత్యమైనప్పుడు, అందు వ్యాపించియుండుట మరియు వ్యాపించబడుట యనెడి భేద మెచట గలుగును ? అయినప్పటికిని యీ భేదము కల్పించుటలో గల ఉద్దేశ్యము సులభముగ బోధపరచుటకు అనువుగా నగుట కొరకే. చూడుము, ఎవనికైన శూన్యము చూపించ వలసి వచ్చుచో, ఒక బిందువును ఏర్పరచ వలయును. ఇదే రీతిని, శబ్దముల వలన అద్వైతమును నిరూపించవలసి వచ్చుచో ద్వైతమును గురించిన భాషను ఉపయోగించవలసి వచ్చును. ఓ అర్జునా ! ఇటులచేయకున్నచో, గురుశిష్య సాంప్రదాయమే లోపించిపోవును. మరియు సమస్తములగు కతనములు అంతమగును. ఇందువలననే వేదములు అద్వైతమును గురించి వర్ణించుటకై ద్వైతమునకు సంబంధించిన ఆలంకారిక భాషను వాడుటను పరిపాటి యొనర్చినవి.

కాన, యిక నేను యింద్రియముల ద్వారా గ్రాహ్యమగు వస్తువు లన్నింటియందును ఆ బ్రహ్మ వస్తువే రీతిని వ్యాపించి యున్నదో చెప్పెదను వినుము.

సర్వేంద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥౧౪॥

ఓ అర్జునా! అవకాశమును ఆకారము వ్యాప్త మొనర్చు రీతిని, లేదా వస్త్ర రూపమున భాసిల్లుచూ నూలుపోగులు ఆ వస్త్రమును వ్యాపించియుండు రీతిని యీ బ్రహ్మ వస్తువు కూడా యీ విశ్వము నంతను వ్యాపిత మొనర్చియున్నది. ఉదకరూపమున రసతత్త్వము ఉదకము నందుండు రీతిని, దీపరూపమునందు ప్రకాశతత్త్వము దీపమునం దుండు రీతిని, కర్పూరరూపమున గంధతత్త్వము కర్పూరమునందుండు రీతిని, శరీర రూపమున కర్మతత్త్వము శరీరమునం దుండు రీతిని ఓ అర్జునా, బంగారు కణమునందు బంగారమే వుండురీతిని ఆ బ్రహ్మవస్తువుకూడా సర్వస్వరూపియై అన్నింటియందును లోపలను బయటను వ్యాపించి యున్నది.

కాని, బంగారము పొడి (కణము) రూపమున నున్నంతవరకు దానిని స్వర్ణకణములనియే యందుము; కాని ఆకణరూపము నశించినప్పుడు ఆ స్వర్ణ కణములే బంగారముగ నగును. లేదా ప్రవాహముయొక్క రూపము ఎంత వంకర టింకరలుగా నున్నప్పటికిని అందలి నీరు ఎల్లప్పుడు సరళముగనే వుండును. లేదా అగ్నియందు కాల్చినందువలన యినుము ఎర్రనగును. అంతే గాని అగ్ని ఎన్నడును యినుము కాజాలదు. కుండ గుండ్రని ఆకారమునం దున్నందువలన అందలి ఆకాశముకూడ గుండ్రని రూపముననే వుండును. మరియు కుటీరము చతురముగ నుండుటవలన అందలి ఆకాశము చతుష్కోణాకృతితో నుండును. అయినప్పటికిని ఆ గుండ్రతనముగాని, చతుష్కోణాకృతిగాని వాస్తవమునకు ఆకాశముయొక్క రూపముకాదు. ఇదే విధమున బ్రహ్మవస్తువునందు ఏ విధమగు వికారము కనిపించినప్పటికిని అది ఎన్నడును వికారములతో కూడియున్నది కాజాలదు.

ఓ అర్జునా, బయటకు చూచుటకు మాత్రము ఆ బ్రహ్మవస్తువుమనస్సు మొదలుగాగల యింద్రియములు మరియు సత్త్వాదిత్రిగుణముల మూలమున

భిన్నభిన్న ఆకారములు గలదిగా కనుపించుచున్నది. కాని, బెల్లముయొక్క మాధుర్యము బెల్లపు అచ్చుయొక్క ఆకారమునందు వుండనిరీతిని, గుణము మరియు ఇంద్రియములు వాస్తవమునకు అసలైన బ్రహ్మతత్త్వము కావు. పాలు పాలరూపమున నున్నంతవరకు నెయ్యికూడా ఆ పాలరూపమునసే వుండును, అయినప్పటికిని, పాలే ఆ నెయ్యికూడాను అని ఎవడును చెప్పజాలడుగదా! ఇదేవిధమున, ఓ అర్జునా, గుణము మరియు ఇంద్రియములమూలమున బ్రహ్మ వస్తువునందు కనిపించు వికారములవలన వాస్తవమునకు బ్రహ్మ వస్తువునం దేవిధమగు వికారములును ఎన్నడును కలుగనేరవని నీవు తెలిసికొనుము. బంగారమును మనము అనేక రూపములుగల ఆభరణములుగా మార్చి, దానిని కంటె, గొలుసు, వడ్డాణము మొదలుగాగల అనేక పేళ్ళతో మనము పిలుచుచుందుము. కాని, అందలి వాస్తవికమగు బంగారము అది ఏ ఆకారమునం దున్నప్పటికిని, ఎల్లప్పుడు బంగారముగనే వుండును. అనగా, ఓ అర్జునా! సూటిగా చెప్పవలెననిన, వాస్తవమునకు బ్రహ్మ వస్తువు గుణములు మరియు యింద్రియములకు పూర్తిగా భిన్నమైనదీ మరియుస్వతంత్రమైనదీ అయియున్నది. నామరూపాది సంబంధములు మరియు జాతి క్రియాది భేదములూ యీ ఆకారములందే వుండును.

మరియు ఆ ఆకారములను గురించి చెప్పబడు విషయము లన్నియు, ఆ బ్రహ్మవస్తువునకు చెందనే చెందవు. ఆ బ్రహ్మము గుణము కాదు. దానియందు గుణవాసనయే లేదు; ఆ గుణములు బ్రహ్మమునందు కేవలము భాసిల్లుచుండును. కాని ఓ అర్జునా! యీరీతిని భాసిల్లుచుండుట వలన మోహమున చిక్కుకొనినవారు 'ఆ వికారము లన్నియు బ్రహ్మమందే గలవ'ని తలంతురు. కాని బ్రహ్మయందు కాన్పించెడి యీ వికారము లన్నియు ఆకాశమున మేఘములు వచ్చురీతిని, లేదా అద్దమునందు ప్రతిబింబము కనిపించురీతిని, లేదా జలము సూర్య ప్రతిబింబరూపమును ధరించురీతిని, లేదా సూర్యకిరణములు ఎండమావుల రూపమును చెందురీతిని పోలియున్నవి.

ఆ నిర్గుణ బ్రహ్మము కూడ యీ వికారముల నన్నింటిని, వాటితో ఏవిధమగు సంబంధము లేనివాడై ధరించి యుండును. కాని, బ్రహ్మమందు కలిగెడి ఆ వికారము లన్నియు నిష్ఫలములే యగును. మరియు అవి కేవలము చూచుటకు మాత్రము కాన్పించుచుండును. కాని వాస్తవమునకు అవి అసత్యములే. మరియు ఆ నిర్గుణుడు యీ గుణములను 'దరిద్రుడు స్వప్నమున రాజ్య పాలనము నొనర్చిన రీతిని' అనుభవించుచుండును. కావున, ఆ నిర్గుణుని విషయమై 'అతనికి యీ గుణములతో సంబంధము గలదని గాని, ఆతడు వీనిని అనుభవించునని గాని, ఎన్నడును చెప్పరాదు.

బహి రన్తశ్చ భూతానా మచరం చరమేవచ
సూక్ష్మత్వాత్త దవిజ్ఞేయం దూరస్థం చాన్తికేచతత్॥ ౧౫

ఓ అర్జునా, ఏది స్థావర జంగమాది భూతములన్నింటి యందును వుండునో, మరియు ఏది అన్ని పదార్థములు మరియు జీవములందును 'అన్నియు భిన్నభిన్న రూపములం దున్నప్పటికిని వాటి అన్నింటి యందును ఉష్ణత్వము సమానముగనుండు రీతిని' శాశ్వతముగ సూక్ష్మరూపమున వ్యాపించియుండునో దానినే యీ ప్రకరణమునందు 'జ్ఞేయము'గ నెరుంగుము, ఏది కేవలము ఒక్కటిగా నున్నప్పటికిని లోపలను – బయటను, దగ్గరను – దూరమునను అంతటను వుండునో, మరియు దేనిస్వరూపమునం దెన్నడును ఏవిధమగు అంతరము వుండదో. అదియే 'జ్ఞేయము'.

అవిభక్తంచ భూతేషు విభక్త మివచస్థితమ్
భూత భర్తృచ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ॥ ౧౬

"క్షీరసాగరముయొక్క మాధుర్యము లోతుగాగల మధ్యభాగమునం దెక్కువగను, ఒడ్డున తక్కువగను వుండుట యనునదే వుండదు. ఇదేవిధమున, ఏది అంతటను సమానరూపమున వ్యాపించియుండునో, ఏది

జరాయుజ, అండజ, స్వేదజ ఉద్భిజ్జములనెడి చతుర్విధ జీవములందును సదా పూర్ణరూపమున వ్యాపించి యున్నప్పటికిని – యీ విధమగు వ్యాపకత్వమువలన దేనిస్థితి ఎన్నడును ఏవిధముగను ఖండితముకాదో, అంతేగాక, ఓ అర్జునా, వేలకొలది కుండలందు గల జలములందు చంద్రప్రకాశము ప్రతిబింబించు చున్నప్పటికిని, ఆ ప్రకాశమునం దెన్నడును ఏ విధమగు భేదభావము జనించనిరీతిని, లేదా ఉప్పురాశులందలి ప్రతియొక్క రాశి యందును వ్యాపించియుండు ఉప్పదనము ఒకే విధమున వుండు రీతిని, లేదా చెరకు మోపునందలి ప్రతిచెరకు గడ యందునను మాధుర్యము ఒకేతీరున వుండురీతిని ఏది భిన్నభిన్నములుగా గల భూతములం దన్నింటను ఏకరూపమున వ్యాపించియున్నదో మరియు ఓ సుజ్ఞాడవగు అర్జునా, ఏది యీ విశ్వరూపమునగల కార్యమునకు మూలకారణమో మరియు యీ నామరూపాత్మకమగు భూతకోటి దేనివలన సముద్రమున తరంగములు జనించురీతిని జనించినవో, వాటి అన్నింటికిని ఆ తరంగములకు సముద్రము ఆధారమైన విధముననే ఆ బ్రహ్మము ఆధారుడై యున్నాడు. బాల్య యౌవన వార్థక్యములనెడి త్రివిధావస్థలందును ఒకేశరీరము వుండురీతిని భూతకోటియొక్క ఆదిమధ్యాంతము లనెడి త్రివిధావస్థ లందును అది అభిన్న రూపమున నుండును. సంధ్యాకాలము, ప్రాతఃకాలము మరియు మధ్యాహ్నము మొదలుగాగల దినమానముక్రమముగ గడచు చున్నప్పటికిని ఆకాశమునం దెన్నడును ఏవిధమగు మార్పునురాని తెరంగున బ్రహ్మమందుకూడ ఎన్నడును ఏవిధమగు మార్పు రాదు." సఖుడవగు ఓ అర్జునా! ఎవడు జగత్సృష్టి కాలమున బ్రహ్మ మనెడి పేరుగలవాడో, జగత్స్థితికాలమున విష్ణువని పిలువబడియున్నాడో, మరియు అంతమున యీ నామరూపాత్మకమగు జగత్తు లోపించు సమయమున రుద్రుడని ఎవడు పిలువబడుచున్నాడో మరియు యీ త్రిగుణములు లోపించినప్పుడు ఎవడు శూన్యరూపమున మిగిలియుండునో, మరియు ఎవడు ఆకాశముయొక్క శూన్యత్వమును

శాశ్వ మొనర్చి, సత్వాది త్రిగుణములనుకూడ లోపింపజేసి, శూన్యరూప మున అవశిష్టుడై యుండునో, అతడే వేదములచే ప్రతిపాదింపబడిన మహా శూన్యమై యున్నాడు.

జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥౧౭॥

“ఏది అగ్నికి ప్రకాశము చంద్రునకు వెలుగును యిచ్చునో, దేనివలన సూర్యునియందు చూడగలశక్తి వచ్చునో, దేని తేజస్సు వలన తారాగణము ప్రకాశించునో, మరియు దేనిఆధారముచే మహాతేజస్సు సుఖముగ ప్రపంచము నందంతట ప్రకాశించునో, ఏది ఆదికికూడ ఆదియూ వృద్ధికికూడ వృద్ధినొంద ర్చునట్టిదియూ, బుద్ధికిగూడ బుద్ధియూ జీవముకుగూడ జీవమూ మనస్సుకు కూడ మనస్సూ నేత్రములకుకూడ నేత్రమూ చెవులకుకూడ చెవియూ వాక్కుకుకూడ వాక్కూనూ ప్రాణములకుకూడ ప్రాణమున్నూ గమనమునకు కూడ పాదములును, క్రియకుకూడ క్రియాశక్తియూ ఆకారములకుకూడ ఆకారమున్నూ వ్యాపకత్వమునకుకూడ వ్యాపకత్వమున్నూ సంహారములకుకూడ సంహారమున్నూ పృథివికికూడ పృథివియూ జలమునకుకూడ జలమునూ తేజమునకుకూడ తేజ మున్నూ, వాయువుకుకూడ శ్వాసోచ్ఛ్వాసయూ మరియు ఆకాశమునకుకూడ ఆకాశమున్నూ, అనగా ఓఅర్జునా ఏది వీటిఅన్నింటికి చైతన్యబీజమో మరియు దేని వలనయివన్నియుస్ఫురించుచున్నవో, ఓఅర్జునా! ఏదిఒక్కటైయుండికూడఅన్నిం టియందును సర్వస్వరూపమై యున్నదో, మరియు దేనియందు ద్వైతభావము కలుగుటకే వీలులేదో, దేని దర్శనము కలుగుటతోడనే దృశ్యము మరియు ద్రష్ట అనెడి యిద్దరునూ ఐక్యమై ఏకత్వమును పొందుదురో అదియే జ్ఞానము. అపైన అదియే జ్ఞానము మరియు జ్ఞేయము అని రెండుగానూ అగును, మరియు జ్ఞానము వలన లోకులు పొందగోరు స్థలముకూడ అదియే యగును. లెక్క సరిగా కుదిరినప్పుడు, ఆ లెక్కను కుదుర్చుటకుగాను ఉపయోగింపబడిన అంకెలందు ఏవిధమగు భిన్నత్వమును వుండనేరదుగదా!

ఆదేవిధమున ఆ బ్రహ్మప్రాప్తి కలిగినప్పుడు సాధ్యము మరియు సాధన మొదలగు నవన్నియూ కలసి ఒక్కటిగనై పోవును. ఓ అర్జునా! ద్వైత మని చెప్పుటకు వీలు కానట్టిన్నీ అందరి హృదయములందు నివసించునట్టి వాడున్నూ అగు ఆతడే బ్రహ్మము.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోప పద్యతే ॥౧౮॥

సుజ్ఞుడవగు ఓ అర్జునా, యీరీతిని ముందుగా నీకు క్షేత్రమన నేమో వివరించి చెప్పితిని. దానితోపాటు క్షేత్రప్రకరణమున జ్ఞానముయొక్క లక్షణములుకూడ చెప్పబడినది. వినుచు వినుచు చకితుడవగు రీతిని అజ్ఞాన స్వరూపమును గురించికూడ నీకు విపులముగ చెప్పితిని. ఇప్పుడే నీకు జ్ఞేయ స్వరూపముకూడ స్పష్టీకరించి చెప్పితిని. ఓ అర్జునా, ఈ విషయములన్నియు చక్కగా బోధపడినప్పుడు నా భక్తుల మనమునందు నన్ను పొందవలెననెడి ప్రబలమగువాంఛ జనించును. ఎవరు శరీరాది సమస్తవిషయ పరిత్యాగము (సన్యాసము) నొనర్చి తమ ప్రాణములను నాసేవకై అర్పింతురో, ఓ అర్జునా! వారు నా బ్రహ్మ స్వరూపమును తెలిసికొని, అంతమున తమ వ్యక్తిత్వ మునుకూడ మరచిపోవుదురు. మరియు, నా స్వరూపమున కలసిపోయి మద్రూపులగుదురు. మద్రూపుడగుటకు నేను చెప్పిననూటియైనమార్గమును నీవు చక్కగాజ్ఞప్తియందుంచుకొనుము. శిఖరము మొదలగువానిపైఎక్కుటకు మెట్లు కట్టవలసివచ్చురీతిని, లేదాఎత్తుగా వుండవలెనన్న మంచెకట్టవలసి వచ్చురీతిని, లేదా వరదలు వచ్చినప్పుడు మునుగ కుండుటకై నావకావలసి వచ్చు విధ మున, మద్రూపుడగుటకు కూడ యీ పనులన్నియు చేయవలసి యున్నది. అటుల కానిచో, ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా! యీ సమస్తమూ ఆత్మయే యని నేను ఒక్కమాటలో చెప్పుచో నీ మనస్సుకు సంతోషము కలుగ నేరదు. ఇందు వలననే, నీ బుద్ధి మాంద్యమును జ్ఞప్తియం దుంచుకొని ఒకే పరబ్రహ్మమును నాలుగు విభాగములుగ నొనర్చి, వాటి అన్నింటిని

విడివిడిగా వర్ణించి చెప్పితిని. చంటి బిడ్డకు కడుపునిండా అన్నము పెట్టుటకై, ఒకే ముద్దను చాల చిన్నచిన్న అన్నపుముద్దలుగా నొనర్చి పెట్ట వలసి వచ్చు రీతిని, నేనుకూడ ఒకే బ్రహ్మమును నాలుగుగా విభజించి వాటిని విడి విడిగా వర్ణించి చెప్పితిని. నీకుగల గ్రహణశక్తిని ఊహించియే నేను బ్రహ్మమును క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము మరియు అజ్ఞానము - అనెడి నాల్గు విభాగములుగ జేసితిని. మరియు ఓ అర్జునా, ఇప్పటికికూడ నీకీవిషయము చక్కగా బోధపడకున్నచో, మరియొకమారు చెప్పెదను. కాని, యిప్పుడు, ఆ బ్రహ్మమును నాల్గుగానూ విభజించను. మరియు ఆ నాల్గింటి ఏకత్వమునూ ప్రతిపాతించను, కాని ఆత్మ మరియు అనాత్మలను ఒక్కటిగా వివరించి చెప్పెదను. కాని, నేను అడిగెడి దానిని నీవిచ్చుటకు సిద్ధపడి యుండవలెను. నేను అడుగునది 'చక్కగా మనస్సును లగ్నమొనర్చి చెవిలో నేను చెప్పునట్టి విషయములను వినుమని'యే. శ్రీకృష్ణుని యీ మాటలను వినుటతోడనే ఆనందముచే అర్జునునకు రోమాంచమయ్యెను. అంత భగవానులిటు లనిరి- 'నీవు శాంతుడవుకమ్ము, అంతేగాని యీ రీతిని ప్రేమ విహ్వలుడవు కాబోకుము.' ఈ మాటలు అర్జునుని హృదయమున నెలకొనుటను చూచి శ్రీకృష్ణభగవాను లిటు లనిరి- 'నేను నీకిక ప్రకృతి పురుషులకు సంబంధించిన కొన్ని విషయములను చెప్పెదను. తత్త్వజ్ఞానమందలి ఏ సాంప్రదాయమును యోగులు సాంఖ్యయోగమందురో, మరియు దేని మహత్త్వమును లోకమున ప్రసిద్ధ మొనర్చుటకై నేను కపిలుండుగ నవతరించితినో, అట్టి ప్రకృతి పురుషులను గురించిన దోషరహి ప్రసంగమును' వినుము.

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్॥ ౧౯

"పగలు, మరియు రాత్రి అనెడి జంటవలె పురుషుడు మరియు ప్రకృతియను యీ రెండును అనాదియైనవని నీవెరుంగుము.

ఓ అర్జునా, రూపము మిథ్యకాదు, కాని నిజమగు రూపముతోపాటు దాని ఛాయకూడ వచ్చుచుండును. లేదా వరిగింజలో గల బియ్యపు పలుకుతోపాటు దానికి పైనవుండెడి ఊకపొర గూడ వృద్ధిపొందుచునే యుండును. ఇదేవిధమున పురుషుడు మరియు ప్రకృతి యనెడి రెండునూ ఒకదానితో నొకటి ఘనిష్ఠ సంబంధము గలవై యున్నవి. మరియు వాని యీ సంబంధము అనాది సిద్ధమై యున్నది. ఇదేవిధమున క్షేత్రశబ్దముచే ప్రదర్శింప బడినదంతయూ యీ ప్రకృతియే. కావున దీని ననుసరించి క్షేత్రజ్ఞుడనబడువాడే పురుషుడగునని నీకు విప్పిచెప్పవలసిన పని యుండదు వీటికి భిన్నభిన్నమగు పేర్లున్నప్పటికిని వీటిని నిరూపించు తత్త్వము ఒక్కటియే. ఈ సంగతిని మరువరాదు. ఇందువల్లనే నేను నీకు మాటిమాటికి చెప్పుచున్నాను' ఓఅర్జునా ఇందుగల సత్యాంశమునే పురుషునిగా నెరుంగవలెను. మరియు దానిని ఆధారముగ చేసికొని జరిగెడి క్రియను ప్రకృతిగా నెరుంగవలెను. బుద్ధి, ఇంద్రియములు, అంతఃకరణము మొదలుగాగల వికారములను పుట్టించుశక్తి, మరియు సత్త్వాది త్రిగుణములూ – వీటి అన్నింటి సమూహమూ ప్రకృతినుండి కలిగినవి. మరియు అదియే సమస్త విధములగుక్రియలకుమూలమై యున్నది.

> కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ।
> పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥20॥

"ఈ వ్యవస్థలో ప్రకృతి అన్నిటికంటె ముందుగా అహంకారముతోపాటు ఇచ్ఛా, మరియు బుద్ధులను జనింపజేయును. మరియు అవి వాటిని కారణ మనెడి చింతనమునందు లగ్న మొనర్చును. ఈ రీతిని ఆరంభింపబడిన కర్మను సిద్ధింపజేసికొనుటకై ఏ యే భిన్నభిన్నములగు యుక్తు లనెడి నాలుపోగులు అల్లబడునో, వాటినే కార్యమందురు. ఆపిమ్మట, ఇచ్ఛ యొక్క ఉన్మాదము ద్వారా ఆ ప్రకృతి మనస్సును

నడపించును. మరియు ఆ నడచుచున్న మనస్సు ఇంద్రియము లను నడపించును, దీనినే ప్రకృతి యొక్క కర్తృత్వ మందురు. “ఇందువలననే సిద్ధశ్రేష్ఠుడగు శ్రీకృష్ణుడు, కార్యము, కర్తృత్వము మరియు కారణము - అనెడి మూటికిని మూలము ప్రకృతియే' యని, నుడివెను. ఈరీతిని యీ త్రిపుటిద్వారా ప్రకృతి కర్మరూపమును ధరించును. కాని సత్వాది త్రిగుణములందలి ఏగుణముచే విశేషించి ఉత్కర్ష గలదై యుండునో, ఆ గుణమునందు రంగరింప బడియుండును సత్త్వగుణము వలన జరుగు కర్మలను సత్కర్మలందురు; రజోగుణముచే జరుగు కర్మలు మధ్యమ కర్మలని పిలువబడును; కేవలము తమోగుణముచే జరుగు కర్మలు అధమ కర్మలగును, మరియు వాటి నన్నింటిని నిషిద్ధములుగా నెరుంగ వలెను. ఈ రీతిని మంచి చెడ్డ కర్మ లన్నియూ ప్రకృతినుండియే జనించు చున్నవి. మరియు ఆకర్మలచే సుఖదుఃఖములు కలుగుచున్నవి, దుష్కర్మము లచే దుఃఖము, సత్కర్మలచే సుఖమూ కలుగుచున్నది; మరియు పురుషుడు యీ రెంటినీ అనుభవించుచున్నాడు. ఈ సుఖ - దుఃఖములు సత్యము లుగ తోచినంతవరకు, ప్రకృతి యీ సుఖ దుఃఖములను ఎడతెగ కుండా జనింపజేయుచుండును, మరియు పురుషుడుకూడ వాటినన్నింటిని అనుభవించుచునే యుండును. ఈ పురుషుడు మరియు ప్రకృతియొక్క గృహ నిర్మాణ విధానము అతి విచిత్రమైనది. ఇందు, స్త్రీ ఆర్జించుకువచ్చు పదార్థమును భర్త మెదలకుండా కూర్చొని భుజించుచున్నాడు. ఈ భార్యా భర్తలు ఎన్నడును ఒకరితో నొకరు కలసి వుండరు. మరియు వీరెన్నడును సరిగా కలియరు. అయినప్పటికిని, ఆ స్త్రీ గర్భమునుండియే యీ జగత్తం తయు జనించుచున్నది; ఇదిఎంత ఆశ్చర్యమైన విషయమో చూడుము !

పురుషః ప్రకృతిస్థో హిభుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణ సఙ్గోఽస్య సదసద్యోని జన్మసు ॥౨౧॥

“ పురుషుడైన ఆతడు, నిరాకారుడు, నిష్క్రియుడు, కేవలుడు, నిర్గుణుడు మరియు పురాణపురుషుడునైయున్నాడు, పురాణపురుషుడేకాదు,

ప్రాచీనమైనవాటి అన్నిటికంటెకూడ ప్రాచీనుడై యున్నాడు. అతనిని పురుషుడని పిలుచుట నామమాత్రమే. వాస్తవిక దృష్టితో చూచినచో ఆతడు స్త్రీయునూ కాదు, నపుంసకుడునూ గాదు. అంతేకాదు. ఆత డెవ్వడో కూడ నిశ్చయముగ తెలియదు. ఆతనికి కనులు, చెవులు, పాదములు, వర్ణము పేరు మొదలగున వేవియూ లేవు. ఓ అర్జునా, ఏదియూ గలదని చెప్పుటకు వీలులేని యీతడు ప్రకృతికి భర్తయున్నూ, ఆ ప్రకృతిమూలమున భర్తయగు తానుకూడ సుఖ దుఃఖాదులను అనుభవించవలసినవాడునూ అయి యున్నాడు. భర్తయగు పురుషుడు స్వయముగ తానేమియూ చేయడు, ఏలనన, ఆతడు పరిపూర్ణముగ ఉదాసీనుడై యుండును, మరియు ఆతనికిభోగ వాసనమే యుండదు; కాని, పతివ్రతయగు యీ ప్రకృతియే ఆతనిని బల వంతముగ అనుభవింప జేయును. ఆమె తన రూపగుణముల సహాయముతో తన యిచ్ఛ వచ్చినటుల ఆతనిని ఆడించును. అప్రకృతియొక్క పేరే గుణ మయి; అంతేగాదు, ఆమెను ప్రత్యక్ష గుణస్వరూపిణి యనికూడ చెప్ప వచ్చును. ఆమె ప్రతిక్షణము తన రూప గుణములను నూతన నూతన విధములుగ ప్రదర్శించు చుండును, అందువలన జడపదార్థములు కూడ మైకము గలవగును. ఆమెయే నామములను ప్రసిద్ధ మొనర్చును, ప్రేమను ప్రేమ పూరితముగ నొనర్చును, మరియు యింద్రియములను మేల్కొలుపును. ఈ మనస్సును మనము నపుంసకమని ఎటుల చెప్పగలము ? ఏలనన యీప్రకృతి, యీమనస్సును త్రిలోకములందలి భోగములను భోగింపజేయుచున్నది. ఈ స్త్రీ యొక్క చరిత్ర యీవిధముగ విలక్షణమైనది. ఇది భ్రమయొక్క అపారప్రదే శము, అమర్యాదయొక్క స్వరూపము. మరియు సమస్తములగు వికారములను జనింపజేయునట్టిదియునై యున్నది. ఇది వాసన అనెడి పూలను — ఫలములను కాయునట్టి లతామండపము; ఇది భ్రాంతి యనెడి వనమునందలి వసంత లక్ష్మి; అందువలననే దీనికి దైవీమాయ యనెడి సుప్రసిద్ధ మగు పేరు పెట్టబడినది. శబ్దసృష్టిని యీమెయే వ్యాపింపజేయును, నామరూపాత్మక

జగత్తునుకూడ యీమెయే సృష్టించును, మరియు ప్రపంచము లన్నింటిని ఎడతెగకుండా యీమెయే నిర్మించుచుండును. కళ, విద్య, ఇచ్ఛా, జ్ఞానము మరియు క్రియ – మొదలగున వన్నియు దీనినుండియే ఉత్పన్న మగును. నాద మనెడి నాణెములను పోతపోసెడి టంకసాల యీమెయే. చమత్కారమందిరముకూడ యీమెయే, అంతేగాదు. యీ జగన్నాటకము నంతను యీమెయే రచియించినది. జగదుత్పత్తి మరియు లయములు యీ ప్రకృతికి ప్రాతస్సంధ్యా సాయంసంధ్యల వంటివి. అనగా యీ ప్రకృతి ఒక అద్భుతమగు మోహినీశక్తి. ఇది అద్వైతమును జోడించు నట్టిది. మరియు సంగరహితులకు బంధువు అయియున్నది. ఏలనన ఆమె శూన్యమునందు గృహమును నిర్మించి, దానియందే ఆనందముగ నివసించును. చూచిన ప్రతిపురుషుని తనవశ మొనర్చుకొను సామర్థ్యము యీమెయందు న్నది. వాస్తవముగ చూచినచో ఆపురుషుడు ఉదాసీనుడు, ఆతనియందే వికారమును లేదు, కాని యీ ప్రకృతియే ఆతనికి అన్నింటిని సమకూర్చును. ఆస్వయంభువుయొక్క ఉత్పత్తి ఆ నిరాకారమూర్తియొక్క స్థితియూ – యీ ప్రకృతియే యగును. ఈ ప్రకృతియే ఆ వాసనా రహితునకు వాసన. ఆ స్వయంపూర్ణునకు సంతోషము. అజాతునకు జాతిగోత్రములు, పేరులేని వానికి పేరు. జన్మలేనివానికి జన్మ, నిష్కర్మికికర్మ, నిర్గుణునకు గుణము, చరణములు లేనివానికి చరణములు, చెవులు లేనివానికి చెవులు, కనులు లేనివానికి కనులు, భావము లేనివానికి భావములు, అవయవరహితునకు అవయవములు అంతేగాదు, ఆ పురుషుని సమస్తముగనూ యీ ప్రకృతియే యగును. ఈ రీతిని, యీ ప్రకృతికి గల వ్యాపకత్వము వలన యీ వికార రహితుడగు పురుషుడు కూడ వికారములచే చుట్టి వేయబడినవా డగును. ఈ పురుషునందు గల పురుషత్వముకూడ కేవలము యీ ప్రకృతియొక్క అస్తిత్వము వలన ఏర్పడినట్టిదే, అమావాస్యచే జిక్కుటచే చంద్రుడుకూడ నల్లగా అయిపోవునటుల, లేదా మేలిమి బంగారునం దేమాత్రము రాగి

కలపి నప్పటికిని దానివన్నె తగ్గిపోవునటుల, లేదా పిశాచము ఆరోపించి నందువలన సజ్జనుడు కూడ నిందనీయమగు ఆచరణము గలవాడగు రీతిని, లేదా మేఘముల సాంగత్యము వలన సుదినముకూడ దుర్దినమగు రీతిని, లేదా పశువుయొక్క పొదుగులోపల పాలు దాగియుండు రీతిని, లేదా కాష్ఠము లోపల అగ్ని అణగియుండు రీతిని, లేదా రత్నదీపము వస్త్రముచే కప్పివేయ బడియుండు రీతిని, లేదా రాజువంటివాడుకూడ పరులపన్నాగమున చిక్కుబడి పోవురీతిని, లేదా సింహము ఏదేనివ్యాధిచే జర్జరమగు విధమున యీప్రకృతి యొక్కసాంగత్యమున తగుల్కొనిన యీ పురుషుడు కూడ తన తేజమునంతయు కోల్పోవును. మేల్కొనియున్న మనుష్యుడొక్కమారుగా నిద్రావశుడై స్వప్నవాసన లనెడి నుడిగుండమున పడిపోవురీతిని యీ ప్రకృతి సంసర్గము వలన పురుషుడుకూడ గుణములను అనుభవించ వలసిన వాడగుచున్నాడు. విరక్తపురుషుడుకూడ స్త్రీ సంయోగమువలన సాంసారిక బంధనములందు చిక్కుబడువిధమున యీ జన్మరహితుడు, శాశ్వతుడునగు పురుషుడుకూడ ప్రకృతి సంయోగమువలన అనేక విధములగు బంధనములలో తగుల్కొనును. మరియు గుణసంగమువలన అతనికికూడ జనన మరణములనెడి దెబ్బలు తగులుచుండును. కాని ఓ అర్జునా, యీ విషయము ఎటులున్నదనిన, అగ్నియందు కాల్చబడిన యినుముపై సమ్మెటతో కొట్టబడెడి దెబ్బలను చూచి లోకులు ఆ దెబ్బలు అగ్నికి తగులుచున్నవని తలంచు రీతిగా నున్నది; లేదా జలము కదలినప్పుడు ఆ జలమునందు ఒక చంద్రబింబమునకు బదులు అనేక ప్రతిబింబములు కాన్పించును, మరియు ఆ ప్రతిబింబములయొక్క అనేకత్వమును అనాలోచనగల లోకులు ప్రతి బింబించుచున్న చంద్రునిపై ఆరోపింతురు. లేదా, అద్దము చాల దగ్గరగా నున్నప్పుడు ప్రతిబింబమువలన ఒకటికి బదులు రెండు ముఖములు కాన్పించును, లేదా కుంకుమ తగులుటచే స్వచ్ఛమగు స్ఫటికమునందుకూడ కొంత ఎరుపూ, కొంత నలుపూ కనిపించు రీతిని గుణసంగమువలన జన్మ లేని

వానికికూడ అనేక జన్మము లున్నటుల కాన్పించును. కాని, యీ గుణ సంగము పోయినప్పుడిక జన్మ లనునవి యుండవు. ఇదే విధమున సన్యాసి జాతి హీనుడగుచు, కాని అప్పు డప్పు డాతనికి స్వప్నమునందు నేను అంత్య జాది ఏదో జాతి వాడనను భావము కలుగుచుండును. ఇటులనే, పురుషు నకుకూడ ఉచ్చా నీచ యోనులందు జనించుట మరణించుట యను భావము కలుగుచుండును. కావుననే, వాస్తవమునకు, ఆకేవలరూపియూ, నిస్సంగుడు నగు పురుషుడు ఎన్నడును ఏవిధ మగు భోగమును అనుభవించడు. ఈ భోగ – ప్రకరణమునకు మూలబీజ మంతయూ గుణసాంగత్యమే.

ఉపద్రష్టాఽనుమన్తాచ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥౨౨॥

"ఆకాశమల్లెతీగను సంబాళించి నిలబెట్టి యుంచు స్తంభములు తిన్నగా నిలువుగా వుండురీతిని యీ పురుషుడుకూడా ప్రకృతిమాయచే ఎల్లప్పుడు తిన్నగా నిలచియుండును. ఈతనియందును ప్రకృతియందును ఆకాశ పాతాళములను బోలినంత భేదము గలదు. ప్రకృతి యనెడి నదీతట మున పురుషుడు మేరుపర్వత సమానుడై వుండును. ప్రకృతికి జనన మరణ ములు కలుగుచునే వుండును. కాని పురుషుడు శాశ్వతుడై యుండును. మరియు యిందువలననే ఆతడు బ్రహ్మనుండి మొదలుకొని క్రిమి కీటక ముల వరకు గల అన్నిటియొక్క శాసకుడు, మరియు నియంతయునై యున్నాడు. ప్రకృతికి యీ పురుషునివలన జీవనప్రాప్తి కలుగును, మరియు యీతని సామర్థ్యమువలననే ఆమె జగదుత్పత్తి యొనర్చుచున్నది. ఆతడు ప్రకృతికి భర్త. ఓ అర్జునా, అఖండకాల ప్రవాహమున ప్రకృతి చేయు చుండు సృష్టియంతయూ కల్పాంతసమయమున యీ పురుషుని ఉదరము నందే లీనమైపోవును. ఈ మహద్బ్రహ్మ ఆ ప్రకృతియొక్క ప్రభువు, మరియు యీ బ్రహ్మాండముయొక్క సూత్రములన్నియూ యీ మహా

ద్బ్రహ్మ చేతులందే వుండును. దీని వ్యాపకత్వము యీ సమస్త ప్రపంచము లను కొలవగలిగినంత అపారము, ఈ శరీరమునందుండి లోకులచే పర మాత్మయని చెప్పబడు వస్తువు, యీ పురుషుడే. ఓ అర్జునా, లోకులచే ప్రకృతికి భిన్నమగు మరొక వస్తువు కలదని చెప్పబడునట్టి ఆవస్తువు వాస్తవమునకు యీ పురుషుడే.

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ !
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥ ౨౩

ఏమానవుడీ పురుషుని స్వరూపమును స్పష్టముగ నెరుంగునో,మరియు దానితోపాటు ఎవడు యీ త్రిగుణాత్మిక సృష్టి యీ ప్రకృతి యనెడి మాయవలననే జనించిన దన్నవిషయమునుకూడ జ్ఞప్తియుం దుంచుకొనునో ఓ అర్జునా! ఎవడు యిదిమూలవస్తు వనిన్నీ యిది దాని ప్రతిబింబము, మరియు యిది మాయయనెడి మృగజలమనిన్నీ నిర్ణయించుకొనగలడో, మరియు యీ రీతిని ఎవడు ప్రకృతి పురుషుల వ్యవస్థను చక్కగా అర్థము చేసికొనునో, ఆ మనుష్యుడు యీ దేహము ప్రాప్తించినందువలన సమస్తములగు కర్మలను చేసిన చేయుగాక, కాని ఆతడు ఆకాశము ఎన్నడునూ ధూళిచే మలినము కాకుండా ఎల్లప్పుడు దానికి భిన్నముగను నిర్లిప్తముగను ఉండు రీతిని యీ కర్మలకు దూరముగ నిర్లిప్తుడైయుండును. యీ శరీరము లున్నంతవరకును ఆతడెన్నడును యీ శరీరభ్రాంతిలో తగుల్కొనడు; మరియు ఆతడు శరీర మును కోల్పోయినప్పటికిని మరల జన్మించడు. కావున, ప్రకృతి పురుషు లను గురించిన యీ వివేకము యింత మిక్కుటమగు కల్యాణ సాధనమై యున్నది. గాన దీనిని నీ వెల్లప్పుడును జ్ఞప్తియందుంచుకొనుము. ఈవివేకము యొక్క అంతఃకరణమునందు సూర్యప్రకాశముతో సమముగ ఉదయించు అనేక వుపాయములున్నవి. నీకా వుపాయములను తెలిపెదను, వినుము.

ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మాన మాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥ ॥౨౪॥

ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా! కొందరు ధ్యానాగ్నిని రగుల్కొల్పి ఆత్మానాత్మ వివేచనచేసి బ్రహ్మతత్త్వమును కనుగొని, అటుపిమ్మట వారు ఆత్మధ్యానదృష్టితో ఆ బ్రహ్మతత్త్వమునందు స్వయముగ తమ్ముతామే చూచుకొనసాగుదురు. కొందరు దైవవశమున సాంఖ్యయోగము ననుసరించి బ్రహ్మతత్త్వమును ధ్యానించెదరు; మరికొందరు కర్మయోగము ననుసరించి ఆ సాధ్యవస్తువును సాధించెదరు.

అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే
తేఽపిచాతి తరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ ౨౫॥

“లోకులు భిన్నభిన్న మార్గములద్వారా యీ భవ - భ్రమ యనెడి సుడిగుండము నుండి తప్పించుకొందురు. మరికొందరు సర్వవిధములగు అభిమానమును విడనాడి శ్రద్ధా పూర్వకముగ ఒకానొకని ఉపదేశమును తమకు ఆధారముగను మరియు ఆశ్రయముగను చేపట్టుకొందురు. ఏ సత్పురుషులకు హితాహితములు స్పష్టముగ కాన్పించునో, ఎవరు పరమ దయాళురుగ నుందురో, ఎవరు అన్యుల నడిగి యడిగి వారి క్లేశములను తొలగింతురో, మరియువారికిసౌఖ్యమునుకలుగజేయుదురో, ఆసత్పురుషులనోటినుండి వెడలు ఉపదేశములను వారు అత్యంత శుద్ధముగను,ఆదరముగనుమరియు శ్రద్ధతోనూ విని, తమ మనోవృత్తిని తద్రూప మొనర్చుకొందురు. ఈ ఉపదేశములను వినుట యందే సమస్తము గలదని భావించి వారి ఉపదేశములను అక్షరశః పరిపూర్ణముగ ఆచరణలో బెట్టెదరు. ఓ అర్జునా! యీ విధమగు శ్రద్ధావంతులగు శ్రవణమార్గావలంబకులు కూడ యీ జనన - మరణ సాగరము నుండి చక్కగా ఆవలియొడ్డునకుచేరి సురక్షితు లగుదురు.కావున ఆ ఒకేబ్రహ్మమును చేరుటకు అనేకమార్గములు గలవు. ఓఅర్జునా! దీనినంతటినిబట్టి నీకు సమాజ

ముగనే బ్రహ్మానుభవము కలుగ గలదనిన్నీ దానికొరకై విశేష శ్రమపడవల పినపని లేదనిన్నీ తెలిపి యుండును. దీనికొరకై నే నీ విషయమును గురించి వివేచన మొనర్చి నానావిధ మతములను ఖండించి వాటి అన్నింటియందును గల శుద్ధము మరియు సత్యమూ నగు సిద్ధాంతమును నీకు తెలియజెప్పెదను.

యావత్సఞ్జాయతే కిఞ్చిత్సత్త్వం స్థావర జఙ్గమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్తద్విద్ధి భరతర్షభ! ॥౨౬॥

నేను క్షేత్రజ్ఞ మనెడి పేర ఏ ఆత్మతత్త్వమును నీకు తెలిపితినో, మరియు వేటి నన్నింటిని క్షేత్రమని చెప్పితినో, ఆ రెండింటి సమ్మేళనము వలననే భూతకోటి జన్మించినది. వాయుసంయోగము వలన తరంగములు లేచురీతిని, సూర్యప్రకాశము మరియు యిసుకనేలయొక్క సంయోగము వలన మృగజలపు తరంగముల యొక్క ఆభాస కలుగురీతిని, మేఘధారలు భూమిపై వర్షించుటచే అనేకములగు వనస్పతులు మొలకరించు రీతిని, మనము జీవులని పిలచుచుండెడి. యీ స్థావర జంగమము లన్నియు యీ క్షేత్రము మరియు క్షేత్రజ్ఞ సంయోగముచే జనించు నట్టివే. కావున ఓ అర్జునా, వీటియందు ప్రధానమగు ముఖ్యతత్త్వమైన క్షేత్రజ్ఞునకు యీ నామ రూపాత్మకమగు భూతసృష్టి భిన్నమైనది కాదు.

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి సపశ్యతి ॥౨౭॥

“పటత్వము వాస్తవమునకు తంతువులు కాదు, కాని అది యీ తంతువుల మూలముననే భాసిల్లుచున్నది. ఇదే రీతిని, యీ క్షేత్రము మరియు క్షేత్రజ్ఞులయొక్క ఏకత్వమునుకూడ అత్యంత గంభీరదృష్టితో చూడవలసి యున్నది. ఈభూతములన్నియు ఆఒక్కనియొక్క అనేక రూపములేయనిన్నీ మరియూ అవి యన్నియూ వాస్తవమునకు ఒక్కటేయనిన్నీ నీవు అనుభవించ వలెను. ఈ భూతము లన్నింటికిని భిన్నభిన్న నామములుగలవు, మరియు వీటి

స్థితి - గతి మరియు వీటి రూపు - రంగులన్నియు భిన్నభిన్నములుగ కనిపించును. కాని ఓ అర్జునా ! నీవీవిభేదము లన్నింటిని చూచి, నీ మనస్సున భేదభావమునకు తావిచ్చినచో, కోట్లకొలది జన్మము లెత్తినప్పటికిని యీ సంసారమునుండి నీవు ఎన్నడును బయట పడజాలవు. సొరతీగెకు పొడుగాటివి, వంకరవి మరియు సుందరివియగు అనేకరకములగు ఉపయోగకరములైన కాయలు కాయుచుండిని, లేదా రేగుపండు ఎంత అనాకారముగా వున్నప్పటికిని దానిని రేగుపండే అందురుగాని మరొకపేర పిలువరు. అదేవిధమున ఈ భూతకోటి భిన్నభిన్న ఆకార - ప్రకారములుగలదై వున్నప్పటికిని, యీ భూతము లన్నింటికిని ఆధారము మరియు మూలకారణమగు వస్తువు పూర్తిగా సదృశమైనదై యున్నది. నిప్పుకణములు ఎంతఎక్కువగ భిన్నభిన్నములై వుండినను వుండుగాక. వాటి అన్నింటియందు ఉష్ణత్వము సమానముగనే వుండురీతిని జీవకోటి భిన్నభిన్న రూపములందుండిన నుండుగాక. పరమాత్మమాత్రము ఏకరూపుడే. వర్ష ధారలు ఆకాశమంతటను వ్యాపించియుండవచ్చుగాక. వాటిఅన్నింటి యందును జల మొకేరూపముననుండును. ఇదేవిధమున ఈ భూతకోటియొక్క భిన్నభిన్న ఆకారములందు ఆ పరమాత్మ కూడ అంతటను సమాన రూపముగనే వుండును. ఈ భూతసముదాయము భిన్నభిన్న రూపు-రంగులలో నుండిన నుండుగాక, ఘటము మరియు మఠము మొదలగువాని అన్నింటను ఆకాశము సమానరూపముగ వుండురీతిని వాటి అన్నింటియందును, ఆపరమాత్మ సమానరూపముగనేయుండును. మనము ధరించు నగలు రకరకములగు రూపములుగా వానిని తయారుచేయించు సమయములందు మార్పు చెందుచుండిన మార్పు చెందుగాక. కాని వాటియందలి బంగారము ఎల్లప్పుడు బంగారముగనే వుండురీతిని, వివిధ నామరూపములుగా కనిపించు యీ నాటకము నశ్వరమైన దైనప్పటికిని, వాటి అన్నింటను వసించు ఆత్మమాత్రము శాశ్వతమైనదే. ఈ రీతిని ఏ మానవుడు ఆత్మతత్త్వమును జీవధర్మముతో అలిప్తమైన దైనప్పటికి జీవునకు అభిన్నమైనదిగ

ఎరుంగునో, అట్టివానినే జ్ఞానులందరి యందును వాస్తవిక నేత్రములుగల వాడుగను వాస్తవమును చూచువాడుగను ఎరుంగవలెను. ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా! అట్టిపురుషుడు జ్ఞానదృష్టియే యగును. మరియు అతనిని ద్రష్టలందరి యందును వాస్తవమును చూచువానిగా నెరుంగవలెను. అట్టిమానవుడు వాస్తవమునకు అత్యంత భాగ్యశాలియే యగును.

సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్
నహినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతిపరాంగతిమ్॥ ౨౮

"ఈ శరీరము గుణములు మరియు ఇంద్రియముల సంచి, మరియు కఫవాత పిత్తము లనెడి త్రిధాతువులు గల త్రికూటము దీనియందే పంచమహాభూతములు కలియును. మరియు యిది అతిభయంకరమైనది. వివరించి చెప్పవలెననిన, యిది అయిదు కొండెలు గల వృశ్చికముతో సమానమైనది, లేదా అయిదు వైపులనుంచి మండుచున్న భయంకరమైన అగ్నిగా దీని నెరుంగవలెను. లేదా యీ జీవరూపమున నున్న హింసా ప్రవృత్తిగల సింహమునకు లభించిన జాలివొంద నగు, లేళ్ళు నివసించు ప్రదేశముగా నెరుంగవలెను, ఈ విధమగు శరీరమునందుండి నిత్యబుద్ధియొక్క బాకును అనిత్యభావ మనెడి పొట్టలో పొడిచి నిశ్చింతుడుకానివాడెవడుండును? కాని ఓ అర్జునా! జ్ఞాని యగువాడు యీ శరీరము వహించినంతకాలము ఎన్నడును ఆత్మఘాతము నొనర్పడు. మరియూ శరీరపాతమైన పిదప అతడు ఆత్మతత్త్వమున కలసి ఏకరూపు డగును. యోగులగు వారు తమకు గల యోగజ్ఞాన సామర్థ్యమువలన కోట్లకొలది జన్మములను దాటి ఏ ప్రదేశమున ప్రవేశింతురో మరియు యీప్రదేశము విడచి మ బయట కెచ్చటకును పోమని చెప్పుదురో ఏది నామరూపాత్మక భూతసృష్టికి అవలి ఒడ్డో, ఏది నాదమునకు అవలిఒడ్డున గలదియో మరియు తురీయావస్థకు జన్మ స్థానమో, దేనిని పరబ్రహ్మమందురో

నదులన్నియూ సముద్రమునందు లీనమగు రీతిని దేనియందు మోక్షము మొదలుగాగల పరమ గతులన్నియూ లీనమగునో, ఆ పరబ్రహ్మ ప్రాప్త్యానంద సుఖములు తమంతతాము భూత కోటి యొక్క భేదభావమునకు తమమనస్సునందు చోటివ్వక ఆత్మబుద్ధి ద్వారా అన్నింటి యెడలను సమభావముతో వ్యవహరించు వారియొక్క పాదము లను కడుగుటకై వచ్చును. కోట్లకొలది దీపములలోగల ప్రకాశము ఒకేవిధ ముగను మరియు సమభావముగను వుండురీతిని ఆ అనాదియగు పరమాత్మ కూడా ఎల్లప్పుడు అంతటను సమానరూపమున నివసించుచుండును. ఓఅర్జునా! తన జీవితావసయందే యీ విధమగు సమత్వమును అనుభవించునట్టి పురుషుడు మరి ఎన్నడును జననమరణ బంధనమున పడడు. కావుననే, నేనుకూడ అట్టి భాగ్యవంతుడగు పురుషుని మాటిమాటికి స్తుతించుచుండును; ఏలనన, అతని దృష్టి సదా సమభావమునందే లగ్నమై యుండును.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి॥ ౨౯

"ఏమానవుడు 'మనస్సు మరియు బుద్ధిమొదలగు సమస్తేంద్రియముల ద్వారా ప్రకృతియే సమస్తకర్మలను చేయునని' బాగుగా నెరుంగునో, ఇంటియందు వసించువాడే పని - పాటుల నన్నింటిని చేయును గాని, ఇల్లు తనంతట తానేపనిని చేయదని ఎవడెరుంగునో, లేదా ఆకాశమున మేఘములు స్వేచ్ఛగా తిరుగుచుండునే గాని ఆకాశము తానెన్నడును కద లనిరీతిని, ప్రకృతికూడ ఆత్మతేజమువలన, త్రిగుణముల సహాయముతో అనేకవిధములగు ఆటలను ఆడినప్పటికిని, ఆ ఆట లన్నింటియందును ఆత్మ కేవలము కేంద్రీయ స్తంభమువలె ఉదాసీనముగా నుండునే గాని, అది యీ ఆటలనేమాత్రము ఎరుగదనెడి నిశ్చిత జ్ఞానప్రకాశము పడిన అంతః కరణముగల వానిని కర్తృత్వ హీనుడగు ఆత్మయొక్క వాస్తవిక తత్త్వము నెరింగిన వానినిగా నెరుంగ వలయును.

యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా ॥30॥

"ఓ అర్జునా ! వాస్తవముగ చూచినచో, మానవుని దృష్టియందెప్పుడు భూతకోటి యొక్క ఆకృతులందలి నానాత్వభేద భావము వుండదో, మరియు ఆ ఆకృతులన్నియు ఏకరూపముగ కాన్పించ సాగునో, అప్పుడే ఆతనికి 'యివన్నియు బ్రహ్మ స్వరూపములే' యని ప్రతీతమగును. నీటియందు అలలు, స్థలములందు మృత్తికాకణములు, రవిమండలమునందు కిరణములు, శరీరమున అవయవములు, మనస్సునందు భిన్నభిన్న భావములు లేదా ఒకే అగ్నియందు అనేక సాకారపు నిప్పురవ్వలూవుండు రీతిని" యీ భూతాకారములన్నియు ఆ ఏకాత్మవేనని జ్ఞానదృష్టికి కాన్పించ సాగినప్పుడే మానవునకు బ్రహ్మ సంపత్తియనెడి ఓడ చేజిక్కును. అప్పుడా మనుష్యుడు ఎటుచూచిన అటు అతనికి కేవలము బ్రహ్మ స్వరూపమే కాన్పించును. మరియు ఆతడందు వలన అపారమగు సుఖమును పొందును. ఓ అర్జునా, ఈ తలంపుతోనే నీకు ప్రకృతి పురుషుల వ్యవస్థను బోధించితిని. అమృతము లభించినటులును, లేదా దాచియుంచిన ధనము లభించినటులను నీకీ పరమయోగ్యతా లాభము కలిగినది. కాని ఓ అర్జునా, నీకీ విషయము పూర్తిగా అనుభవములోనికి రానంతవరకు నీ మనస్సున దీనిని గురించిన దృఢనిశ్చయము కలుగ నేరదు. అయినప్పటికిని, మహత్త్వ పూరితమగు ఒకటి రెండు సంగతులను నీకు చెప్పదలచితిని. ముందుగా నీ మనస్సును నావైపు మరల్చి నేను చెప్పునట్టి విషయములను వినుము " అని శ్రీకృష్ణుడా పైవిషయములను చెప్పసాగెను. అర్జునుడు తన చిత్తమును ఏకాగ్రమొనర్చి విన నారంభించెను.

అనాదిత్వాన్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః ।
శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే ॥ 31

శ్రీకృష్ణుడిటులచెప్పెను. ఓ అర్జునా, సూర్య ప్రతిబింబము నీటియందు పడును, కాని, ఆనీరు ఆ సూర్యునకంటదు. పరమాత్మస్వరూపము యిట్టి

సూర్యునివంటిది. ఏలనన, సూర్యుడు నీటికి పూర్వమూవుండెను. అటుతరు-
వాతకూడా వుండును. మరియు ఓ అర్జునా, కేవలము ఆమధ్యకాలమునందు
మాత్రమే ఆతడు ప్రతిబింబరూపమునలోకులకు ఆనీటియందు పడియున్నటుల
కాన్పించును; కాని, వాస్తవమునకు ఆతడు యథాప్రకారముగనే
వుండును. 'ఆత్మ శరీరమునందుండును' అని చెప్పుటకూడ సమంజసము
కాదు; ఏలనన, అది ఎచ్చటనున్నదో అచ్చటనే, స్వయముగ తనయందు
తాను తన స్థానమునందే వుండును. ఎటులనిన, అద్దమునందు ప్రతిబింబము
పడినప్పుడు, అద్దమునందు ముఖమున్నదని లోకులు చెప్పుకొనురీతిగనే యీ
ఆత్మ శరీరమునం దున్నది – అనుమాటకూడ చెప్పబడుచున్నది. ఆత్మతో
శరీరమునకు సంబంధము గలదని చెప్పుటకూడ పూర్తిగా నిరర్థకమే.
ఎన్నడైన వాయువుకు యిసుకరేణువులతో సంయోగము కలుగునా?
అగ్నినీ ప్రత్తినీ రెంటినీ కలిపి ఒక్కటిగా బంధించునట్టి దార మేదైన
గలదా? ఆకాశమునకూ పాషాణమునకూ ఎటుల సంబంధ మేర్పరచ
నగును? వీటిలో ఒకటి తూర్పుదిశకు పోవు స్వభావము గలది మరొకటి
పడమర దిశకుపోవు స్వభావము గలదియూ యైయున్నది. రెండు విరుద్ధము
లగు దిక్కులకు పోవు యాత్రికులు మార్గమున ఎదురుపడుటవంటి
సంబంధమే – ఆత్మకూ శరీరమునకూ గలదు. ప్రకాశము మరియు
అంధకారము – జీవితుడు మరియు మృతునియందూ ఎట్టి పోలిక గలదో,
అట్టి పోలికయే ఆత్మకూ మరియు శరీరమునకూ గలదు. రాత్రి
మరియు పగలు బంగారము మరియు ప్రత్తియందు ఎంత భేదముకలదో
ఆత్మ మరియు శరీరమునందుకూడ అంత భేదము గలదు. ఈ శరీరము పంచ
భూతములతో సృష్టింపబడినది, కర్మబంధములచే బంధింపబడినది. మరియు
జనన మరణములనెడి సుడిగుండమున శాశ్వతముగా తిరుగుచుండునట్టిదీ యైయు
న్నది. ఈ శరీరము కాలుండనెడి అగ్నియొక్క ముఖమున పడిన అతి చిన్నదగు
వెన్నముద్ద వంటిది. ఈగ తన రెక్కలను విదలించుకొనుటకు పట్టునంత

స్వల్పకాలములో యీ శరీరము నాశన మొందును. సంయోగవశమున్న యీ శరీరము అగ్నిలో పడిపోవుచో వెంటనే బూడిదయై పోవును; అట్లు గాక కాకులు, కుక్కలచేత జిక్కినచో అది విష్ఠా (మలము) రూపము గనే యుండును. ఈ రెండింటను ఏఒక విధముగను కాకున్నచో అది, పురుగులప్రోగుగా నగును. కాని ఓ అర్జునా! యీ పరిణామములలో ఏ విధమైనదిగా మార్పు చెందినను, అది శరీరమునకు చెడుగే. శరీరము యొక్క గాథ యిట్టిది, కాని ఆత్మయో, అది అనాదియగుటచే శాశ్వతము. మరియు స్వయంపూర్ణమునై యున్నది. అది నిర్గుణమగుటవలన కళాసహితమూ (పూర్ణము) కాదు, కళారహితమూ (అపూర్ణము) కాదు. అది కర్మలు చేయనదీకాదు, చేయునట్టిదీ కాదు, సూక్ష్మమైనదీ కాదు, స్థూలమైనదియు కాదు. అది రూపము లేనిది, అందుచే దానికి ఆభాసగాని నిరాభాసగాని, ప్రకాశముగాని, అప్రకాశముగాని, అల్పత్వముగాని విస్తృతత్వముగాని – యిట్టివేవియూ గలవని చెప్పజాలము. అది శూన్యస్వరూపము, అందువలన, అది బోలుదీగాదు. గట్టిదీగాదు, ఏదియైన వున్నదీగాదు ఏదియూ లేనిదీ గాదు, మూర్తివంతమూగాదు, మూర్తిరహితముగాదు. అది కేవలము ఆత్మరూపము. అందుచే, అందు ఆనందమూ లేదు, ఆనందము లేకపోవుటయూ లేదు, ఏకత్వమూ లేదు, అనేకత్వమూలేదు. అదిముక్తమూకాదు, బంధింపబడినదియూ కాదు. అది అలక్ష్యమైనది, అందుమూలమున, అది యింతవున్నది. అంత వున్నది, అది తనంతతానే చేయబడినది. యితరులచే తయారు చేయబడినది. అది మాట్లాడును లేదా మూగది – అని చెప్పుటకు వీలుకానిది. అది సృష్టితో పాటు జన్మించుటయూలేదు, సృష్టిసంహారముతోపాటునాశనమూ చెందుట లేదు; ఏలనన, అది ఉత్పత్తి మరియు నాశనములు రెంటికీ లయ – స్థానమై యున్నది. అది అవ్యయము, అందుచే, అది కొలచుటకుగాని వర్ణించుటకు గాని వీలుకానిది; అది పెరగదు, మరియు తరగదు, అది ఎన్నడును సారము

లేనివీకాదు, మరియు అంతమూ పొందదు. ఇట్టి స్థితిలో, ఇట్టి స్వరూపమున ఆత్మ వున్నప్పుడు ఆత్మ శరీరమునం దుండునని చెప్పుమాటలు ఓసఖుడవగు అర్జునా, మఠముయొక్క ఆకారము ననుసరించిఆకాశమునకు నామకరణము చేయుట వంటిది. ఆత్మకూడ ఆ ఆకాశమువలె సర్వవ్యాపి. శరీరాకృతులు వచ్చును-పోవును కాని ఆత్మ ఒకేరీతిని వుండును. రాత్రింబవళ్ళు నిరంతరము వచ్చుచూ పోవుచుండురీతిని, ఆత్మయొక్క శక్తి వలన యీ శరీరములు కూడ ఏర్పడుచుండును. మరియు నాశమొందుచుండును. కావున నే, ఆ ఆత్మ యీ శరీరమునం దున్నప్పటికినీ దేనినీ చేయించదు. మరియు ఏదియును చేయదు. మరియు ఎదుటకు వచ్చిన కర్మలతో దానికి ఏ విధమగు సంబంధమూ వుండదు, కావున దాని స్వరూపమునం దెన్నడును ఏ విధమగు లోటూ రాదు. మరియు పూర్ణత్వమును రాదు; అది శరీరమం దున్నప్పటికిని, శరీర భావములతో ఎన్నడును లిప్తము కాదు.

యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే॥ 32

"ఆకాశములేని ప్రదేశమేదియు లేదు; కాని ఏ ప్రదేశముయొక్క మాలిన్యముగాని దోషముగాని దానిని మలిన పరచజాలదు. దూషితముగ చేయజాలనూ లేదు. ఇదే విధమున, ఆత్మకూడ అన్నిప్రదేశము లందును, అన్నిశరీరము లందును గలదు, కాని అది ఎన్నడును ఏ ప్రదేశము లేక శరీరముయొక్క సాంగత్య దోషమువలన మలినము కానేరదు. నీకీవిషయము మాటిమాటికి చెప్పుటలోగల ఉద్దేశ్యము, 'క్షేత్రజ్ఞుడు వాస్తవమునకు క్షేత్రహీనుడని బోధపడునటుల చేయుటయే'.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోక మిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథాకృత్స్నం ప్రకాశయతి భారత॥ 33

"సూదంటురాయి యొక్క సంసర్గము వలన యినుము చలించును, కాని యినుమెన్నడును సూదంటురాయి కానేరదు." క్షేత్రము మరియు

క్షేత్రజ్ఞునికి గల సంబంధముకూడ యిట్టిదే. దీప ప్రకాశమున యింటిపను లెల్ల చేయబడును, కాని దీపమునకు మరియు యింటికి అపారమగు భేదము గలదు. ఓ అర్జునా ! కొయ్యలోపల అగ్ని వుండును అంతమాత్రము చేత 'అగ్నియే కొయ్య' అనుటకు వలనుపడదు. ఈదృష్టితోనే క్షేత్రజ్ఞుని గురించి కూడ భావించవలెను. ఆకాశము మరియు మేఘములు, సూర్యుడు మరియు మృగజలము నందునూ గల భేదమును చక్కగా బోధపరుచుకొనినచో క్షేత్రజ్ఞుడు మరియు క్షేత్రమునందు గల భేదము కూడ బోధపడును. ఆకాశము నందుండెడి సూర్యుడు భిన్న భిన్నములగు భువనముల నన్నింటిని ప్రకాశింపజేయు రీతిని క్షేత్రజ్ఞుడు కూడ భాసమాన మగుచున్న క్షేత్రముల నన్నింటిని ప్రకాశింప జేయును.

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మన్తరం జ్ఞాన చక్షుషా ।
భూతప్రకృతి మోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్ ॥౩౪॥

క్షేత్రము మరియు క్షేత్రజ్ఞునియందు గల భేదమును గురించిన జ్ఞానము కలిగిన బుద్ధిమాత్రమే వాస్తవదృష్టిగల దగును. మరియు అదియే శబ్దార్థముయొక్క సారాంశమును సరిగా గ్రహించగలదు. క్షేత్రక్షేత్రజ్ఞ భేదము నెరుంగుటకొరకై గొప్ప గొప్ప బుద్ధిమంతులగువారు జ్ఞానులను పూజించి వారిని ఆశ్రయించుకొని యుందురు. ఇది ప్రాప్తించుట కొరకే మహనీయులు శాస్త్రియనెడి ధనమును కూడబెట్టుదురు. మరియు శాస్త్రాధ్యయనము నొనర్తురు. ఈ జ్ఞానమును ఆశించియే కొందరు యోగాభ్యాస మనెడి ఆకసమున ఎగురుటకు సాహసింతురు. కొందరు శరీరాది సమస్త పరిగ్రహములను గడ్డిపోచవలె భావించి మహాత్ముల పాదసేవారతు లగుదురు. ఈ విధమున లోకులు భిన్న భిన్న మార్గములద్వారా జ్ఞానలాలసచే ప్రేరితులై ముందుకుపోవుటకు ప్రయత్నింతురు. ఈ విధములగు ప్రయత్నములద్వారా వాస్తవమైనటువంటి క్షేత్ర క్షేత్రజ్ఞ భేద జ్ఞానమును పొందిన వారికి నేను మిక్కుటమగు ప్రేమతో హారతు లిత్తును.

మరియు మహాభూతాది అనేక భేదభావములతో కూడియుండిన యే మాయావిని
యను ప్రకృతి విస్తరించియున్నదో, ఏది శుకనళికాన్యాయముచే వాస్తవమునకు
బంధకరము కాకున్నప్పటికిని తమతమ భావనల ననుసరించి 'ప్రకృతి వాస్త
వమునకు పురుషునకు భిన్నమైనది మరియు వేరైనది' యనెడి భావము తమ
అంతఃకరణమున గలవారికి 'త్రాటిని చూచి సర్పమని భ్రమించినవానికి
ఆ భ్రాంతి తొలగినప్పుడు యిది త్రాడే యనెడి నిజమైన జ్ఞానము
కలిగిన రీతిగ బంధకారియో, లేదా ముత్తెపుచిప్పను చూచి వెండి యని
భ్రాంతి చెందినవానికి ఆ భ్రాంతి తొలగిన పిమ్మట దానియొక్క
వాస్తవిక రూపము కాన్పించ మొదలిడురీతిని, యిట్టి భావము గలవారే
బ్రహ్మస్వరూపమును పొందుదురు. ఏది ఆకాశము కంటె కూడ విశాల
మైనదో, ఏది అవ్యక్త ప్రకృతికి ఆవలితీరమున గలదో, ఏది ప్రాప్తించిన
పిమ్మట సామ్యము మరియు అసామ్యము లనెడి భేదభావ మించుకయు
మిగిలియుండదో, దేనియందు ఆకారము, జీవత్వము మరియు ద్వైతములు
ఎన్నడు వుండనేరవో, ఏది శుద్ధద్వైత హీనమైనదో, అట్టి పరమ తత్త్వ
స్వరూపమును ఆత్మానాత్మ వ్యవస్థ నెరింగిన వారు మాత్రమే 'రాజహంస
అసారమునుండి సారమును మాత్రమే గ్రహించు రీతిని' పొందగలరు."

ఈ రీతిని శ్రీకృష్ణుడు తనకు పరమ ప్రియుడగు అర్జునునకు ఆత్మా
నాత్మ తత్త్వమును సర్వవిధముల స్పష్టీకరించిచెప్పెను. ఒక కలశమందలి
జలము మరొక కలశమున గ్రుమ్మరించిన రీతిని శ్రీకృష్ణుడు తన వద్దగల
ఆత్మజ్ఞానము నంతను ఏ మాత్రమూ మిగుల్చుకొనకుండా అర్జునునకు ప్రసా
దించెను. ఇచ్చట యిచ్చువాడెవడు? మరి పుచ్చుకొనువాడెవడు? ఫలమున
నరుడగు అర్జునుడు కూడ నారాయణుడేగదా! శ్రీకృష్ణుడు కూడ స్వయముగ
'అర్జునుడు కూడ నేనే' నని అంగీకరించుచున్నాడు, సారాంశమేమనగా
శ్రీకృష్ణుడు తన జ్ఞానమునంతను అర్జునునకు అర్పించెను. కాని, దీని
పరిణామము, అర్జునుని మనస్సునకు ఏవిధముగను తృప్తికలుగ దాయెను.

ఆతని జ్ఞానశ్రవణ లాలస యింకనూ అధికము కాసాగెను. దీపపుకొడి దులిపిన తరువాతను, మరియు నూనె నింపిన పిమ్మటను దీపప్రకాశము యింకనూ అధికమగు రీతిని యీ శ్రవణమువలన అర్జునుని అంతఃకరణముయొక్క ఉత్సుకత్వము యింకనూ పెంపొందెను. భోజనము వడ్డించు గృహిణి చతురురాలు, సుందరి, మరియు ఔదార్యమూ గలదైవుండి, భోజనము చేయువారు కూడ రసజ్ఞులై వున్నప్పుడు వడ్డించువారి హస్తమూ భుజించువారి హస్తమూ తీరికలేకుండా వుండును. ఈ సమయమున శ్రీకృష్ణుని స్థితికూడ యిటులనే వుండెను. అర్జునునకు గల శ్రవణోత్సుకతను చూడగనే భగవానుడగు శ్రీకృష్ణునకు కూడ యింకనూ ఉపన్యసింపవలెననెడి ఆసక్తి కలిగెను. అనుకూలమైనగాలి వీచినప్పుడు మేఘములు వచ్చి ఆకసమున ఏకత్రితమగురీతిని, లేదా చంద్రదర్శనముచే సముద్రమునపోటువచ్చురీతిని, శ్రోతలు ఉత్సాహము చూపించినప్పుడు వక్తకుకూడ ఉత్సాహము యినుమడించును. అంత సంజయుడిట్లనెను- "ఓ ధృతరాష్ట్రరాజా ! ఇప్పుడు శ్రీకృష్ణుడు జగత్తునంతనూ ఆనందముతో నింపివేయనున్నాడు. మీరా వృత్తాంతమును వినుడు" ఈరీతిని మహాభారతమున శ్రీవ్యాసదేవుడు తన అగాధమగు బుద్ధిబలముచే భీష్మ పర్వమున చెప్పినగాథ యందలి శ్రీకృష్ణార్జున సంవాదమును నేను సుందరము మరియు శిష్టమూనగు దేశభాషలో వివరించి చెప్పితిని. ఇక నేను చెప్పనున్నది శుద్ధ శాంతరసమునకు చెందిన గాథ. అది శృంగార రసమునుకూడ తనముందు తుచ్ఛమైనదిగ నొనర్చగల దనుటలో ఏమాత్రము సందియములేదు. నాది దేశభాషగానే వుండును. కాని, అది లలిత సాహిత్య సంజీవినిగా నుండి, తన మాధుర్యము ముందు అమృతమును కూడ మధురము లేనిదిగ చేయునంత కౌశలముతో రచియించెదను. దేశభాషలోచెప్పబడిన యీ మాటలు తమ రసార్ద్రమగు శీతలత్వము వలన చంద్రునితో దీటువచ్చినవిగా నుండును, మరియు దీని రసాళుత్వ మనెడి సుడిలోబడి స్వాయముగ నాద బ్రహ్మముకూడ లీనమైపోవును. ఈ శబ్దరచనమువలన పిశాచముల అంతఃకరణమునందుకూడ సాత్వికవృత్తితో కూడిన స్రోతస్సులంకొంగులు పెట్టును. మరియు

దీనిని వినుటవలన మహాత్ముల మనస్సులకు ఆత్మసమాధి సిద్ధించును. నేని ప్పుడు వెలువరించుచున్న వాగ్విలాసముచే విశ్వమంతయు గీతార్థముచే ఓతప్రోతమై నిండిపోవును. మరియు నేను యీ జగత్తునకంతకుగాను ఒక ఆనందమయ మందిరమును నిర్మించెదను. వివేకముకూడ మాట్లాడ మొదలిడు నటులును, చెవులూ మరియు మనస్సూ సార్థకమగురీతిని, ప్రతి ఒక్కనికి బ్రహ్మవిద్య ప్రాప్తించురీతిని, లోకులందరికినీ యీ కనులతోనే పరమాత్మ తత్త్వ దర్శనము కాసాగురీతిని అందరకును సుఖ పర్వముగు రీతిని, మరియు విశ్వమున కంతకు బ్రహ్మజ్ఞాన ప్రాప్తి యనెడి ప్రయోజనము కలుగువిధముగను నే నిప్పు డుపన్యసించెదను. ఏవిషయ మేమన, శ్రేష్ఠుడగు నివృత్తినాథుని కృపాప్రసాదము నాకు ప్రాప్తించి నది. ఇందువలననే నేను ఉపమ మరియు శ్లేషాదులరాశిని కూర్చెదను. మరియు గ్రంథమందలి ప్రతి పదార్థమునూ అతివివరముగ తెలిపెదను. ఈ ఉద్దేశ్యము సిద్ధించుటకై నా పరమసంపన్న గురుదేవుడు నన్ను వాక్ప్రాగల్భ్యము మరియు అర్థజ్ఞానముచే పరిపూర్ణు నొనర్చెను. నా గురుదేవుని కృపాసహాయ ముచే నేనేదిచెప్పిన అది అంగీకరింపబడును. మరియు నేనిందువలననే మీ వంటి శ్రోతల ఎదుటకూడ గీతార్థమును ప్రవచించుటకు సంసిద్ధుడ నైతిని. మహాత్ములగు మీ చరణసన్నిధికి నేను వచ్చితిని. అందుచే నా మార్గమున ఏ విధమగు అడ్డంకూకలుగ నేరదు. మహారాజా! సరస్వతి కడుపునుండి పొర బాటునైనను ఎన్నడైన మూగవాడు జన్మించునా? లక్ష్మీదేవిలో ఏదైన సాముద్రిక శుభలక్షణము కొరవడుట ఎన్నడైన సంభవించునా ? కావున మీవంటి మహాత్ములవద్దకు నేను వచ్చినప్పుడు నానోటినుండి అజ్ఞానముతో కూడిన ఏమాటయూ రారాదు. అందుచే 'నా ఉపన్యాసమువలన నవరస ములను వర్షింప జేయుదు'నని చెప్పుచున్నాను. మీరుమాత్రము నాకుమాట్లా డుటకు అవకాశ మిచ్చినచాలును. అంతట యీ జ్ఞానదేవుడు గీతాగ్రంథము యొక్క అర్థము నంతను అతి విస్పష్టముగా చెప్పివేయును.

# తెలుగు జ్ఞానేశ్వరి

## పదునాల్గవ అధ్యాయము

---

ఓ ఆచార్య దేవా, నేను నీకు జేజేలు పలికెదను. దేవత లందరి యందు మీరే శ్రేష్ఠులు. బుద్ధి యనెడి ప్రభాత సమయపు సూర్యుడు మీరే. ఆత్మభావనను మీరే సాక్షాత్కరింప జేసెదరు. ఈ నానాస్వరూప ములుగా గల పంచభూతాత్మక సృష్టితరంగములు లేచెడి సముద్రము మీరే. మీ యిట్టి స్వరూపమునకు జయజయలు. ఓ దుఃఖిత బాంధవా, అఖండ కృపాసముద్రడవు మరియు శుద్ధమగు ఆత్మవిద్యకు ప్రియమైన ప్రభువు నగు గురుదేవా! వినుడు. మిమ్ము గాంచనివారికి యీ మాయావిశ్వమును మీరు చూపింతురు. మరియు వారిపట్లనే యీ నామరూపాత్మక వస్తుజాత మును ప్రకటింతురు. పరుని దృష్టికి భ్రమను కలిగించుటనే కనికటు యందురు. కాని మీ అద్భుతమగు కౌశల మెట్టిదనిన మీ స్వరూపమును మీరే స్వయముగ మరుగు పరచెదరు. ఓ గురురాజా! మీరే యీ విశ్వమునకు సర్వస్వమునైయున్నారు. ఇదంతయూ మీ నాటకమే. మీరు కొందరికి మాయను తోపింపజేతురు. మరికొందరికి ఆత్మ బోధ కలిగింపజేతురు. మీ యిట్టి స్వరూపమునకు నేను నమస్కరించు చున్నాను. ఈజగత్తున 'అప్' (జలము) అనుదానికి మీ శబ్దముల వలననే మాధుర్యము ప్రాప్తించినదని — నా బుద్ధికి తట్టుచున్నది. భూమికి 'ఓర్పు' యనెడి గుణము మీవలననే లభించినది. సూర్యుడు, చంద్రుడు మొదలుగా గల యీ జగత్తున ఉదయించెడి తేజోవంతులగు పిపాయిల తేజముకు మీ ప్రతిభ వలననే తేజస్సు లభించుచున్నది. వాయువు యొక్క చాంచల్యము

కూడ మీ దివ్య సామర్థ్యమే. మరియు ఆకాశము కూడ మిమ్ము ఆశ్రయించియే యీ దాగుడుమూతల ఆటను ఆడుచున్నది. సారాంశమేమన, మీ సామర్థ్యము వలననే యీ మాయ యంతయు జనించును. మరియు జ్ఞానమునకు దృష్టి లభించును. ఈ రీతిని, వేదములు కూడ మిమ్ము వర్ణించి వర్ణించి అలసిపోయినవి. మీ ఆత్మ స్వరూపదర్శనము కానంతవరకు వేదము లందలివర్ణనాశక్తి చక్కగా ఉపకరించును; కాని, ఆత్మస్వరూపము నకు సమీపమునగల మజిలీని చేరగనే వేదములూ, నేనూకూడ మూగవాళ్ళమై ఒకేపంక్తియందు కూర్చుందుము. నలువైపులను సముద్రమే వ్యాపించియుండి, ఒక్క బుద్బుదముకూడ విడిగా కాన్పించనప్పుడు పెద్దపెద్ద నదులజాడ దీయుట్లనే మానివేయవలెను. సూర్యుడు ఉదయించినప్పుడు చంద్రుడు మిణుగురు పురుగువలె కాంతిహీనుడగును, ఇదేవిధమున, మీ ఆత్మ స్వరూపమునందు వేదములు మరియు నేను ఇద్దరమును ఒకేవిధముగ నగుదుము. అట్టిస్థితిలో, ద్వైతముయొక్క ఊరు - పేరులే నాశనమైంది, పరావాణితో పాటుగా వైఖరీవాణికూడా లోపించినప్పు డిక నేనే నోరు పెట్టుకొని మిమ్ము వర్ణించగలను? కావుననే నేను మిమ్ము స్తుతించుట యనెడి సుడిగుండమున పడను. మరియు నిశ్శబ్దముగ మీ చరణములకు వంగి ప్రణమిల్లుటయే శ్రేష్ఠమైనపనియని తలంతును. కాన ఓ గురుదేవా, మీ రేస్వరూపముతోనైన నుండురుగాక ! నేనా స్వరూపమునకే వందనము లర్పింతును. ఓ ప్రభూ, నేనీ గ్రంథరచన మొనర్చుటలో సఫలుడ నగునటుల నన్ననుగ్రహింపుడు ! ఇక మీరు మీ అనుగ్రహమనెడి మూలధనమును తీసి, నాబుద్ధియనెడి సంచిలో దానిని నింపుడు మరియు నాకు జ్ఞానపదవిని లభింపజేయుడు. దీనిని ఆధారముగ గొని నేను వ్యావహారికముగ ముందుకు సాగెదను. మరియు మహాత్ముల కర్ణములకు వివేక - వచనములనెడి కర్ణభూషణములను ధరింపజేతును. మీరు గీతయొక్క గూఢార్థ భాండారమును తెరచుడు. ఇదియే నావాంఛ. మీరు నా నేత్రము

లకు మీ కృపయనెడి దివ్యాంజనమును పెట్టుడు. మీరు మీ నిర్మల కరుణా సూర్యుని 'నాబుద్ధి నేత్రములు చక్కగా వికసించి, సాహిత్యసంపద స్పష్ట ముగ కనిపించసాగు విధమున' ఉదయింపజేయుడు. ఓ స్నేహితు లందరి యందును శ్రేష్ఠుడా! మీరుస్వయముగ వసంతకాలముగనై, మీప్రభావముచే నాబుద్ధియనెడి లతయందు కార్యమనెడి ఫలములను కాయింపజేయుడు. ఓ మహారాజా, మీరు మీ ఉదారమగు కృపాదృష్టిచే 'నాబుద్ధి యనెడి గంగా నదిలో తత్త్వసిద్ధాంత రంగములనెడి వరద మిక్కుటముగ వచ్చురీతిని వర్షింప జేయుడు. విశ్వమునకు విశ్రాంతి స్థలమగు ఓ శ్రీగురుదేవా! మీ అను గ్రహమనెడి చందురునిచే నాకు స్ఫూర్తి యనెడి పున్నమను ప్రాప్తింప జేయుడు. మరియు ఆపూర్ణిమాదర్శనమగుట తోడనే, నా జ్ఞానమనెడి సముద్రమున వచ్చెడి పోటువలన, నా నవరస శ్రోతస్సులు పూర్తిగా నిండి పొంగులు వెట్టుచూ బయటకు పొరలి ప్రవహించునటుల అనుగ్రహించుడు.

ఇదంతయూ విని గురుదేవు లిటుల యనిరి - "ప్రార్థన మొనర్చుట యనెడి నెపముతో నీవు నన్ను స్తుతించ నారంభించితివి. ఇక యీవ్యర్థమగు స్తుతులను కట్టిపెట్టుము. జ్ఞానమనెడి సుగంధముచే నిండియున్న నా గ్రంథ మును కొనసాగించుము. నాకుగల ఉత్సుకత్వమును వ్యర్థముగ త్రెంచి వేయకుము". శ్రీ గురుదేవులు శెలవిచ్చిన యీ పలుకులను విని నేనిటుల అం టిని - "అదేమి మహారాజా! మీరిటుల ఎప్పుడు శెలవిత్తురా యనియే నేను ఎదురు చూచుచుంటిని. గరికమొక్కకు స్వాభావికముగనే చావులేదు. పైగా దానిమీద అమృత బిందువులు కూడ పడినచో యిక చెప్ప వలసిన దేమున్నది? ఇచ్చటి పరిస్థితికూడ అదే విధముగా నున్నది. అయినను నేను మీ కృపా ప్రసాదము వలన విపులముగను స్పష్టము గను మూలగ్రంథమందలి శబ్దములను వివరింతును. కాని నాకొక్క కోరిక గలదు- గురుకృపయనెడి గృహమందిడిన భిక్షవలన నా వాక్కునందు జీవుని మనస్సునం దుండెడి సందేహమనెడి నావ మునిగిపోయి వినవలెననెడి ఆసక్తి

అధికమగు నటుల మాధుర్యము ప్రాప్తించునటుల అనుగ్రహింపుడు" అస్తు.
గడచిన పదమూడవ అధ్యాయమున శ్రీకృష్ణు డర్జునునకు క్షేత్రము మరియు క్షేత్రజ్ఞులయొక్క సంయోగమువలన యీ జగన్నిర్మాణ మగుచున్న దని చెప్పి యున్నాడు, మరియు గుణసంగము వలన ఆత్మ సంసారి యగు చున్నది. ప్రకృతి చేత జిక్కుటవలన ఆ ఆత్మ సుఖదుఃఖముల ననుభవించు చున్నది. మరియు తన కైవల్యస్వరూపమువలన ఆ ఆత్మ గుణములకు పూర్తిగా భిన్నమైనదై యున్నది. ఇట్టి స్థితిలో యీ అసంగునకు సంగ ప్రాప్తి ఎటుల కలుగుచున్నది? ఆ క్షేత్రజ్ఞునకు సుఖదుఃఖాదు లెటుల అనుభవించవలసి వచ్చుచున్నది? క్షేత్రము మరియు క్షేత్రజ్ఞుడు అనగా పురుషుడు మరియు ప్రకృతు లెటుల కలియుదురు? గుణము లెన్ని? వాని స్వరూపము లెట్టివి? అవి ఎటుల బంధకరము లగును? గుణాతీతుని లక్షణము లెవ్వి? ఈ ప్రశ్న లన్నింటికిని యీపదునాలుగవ అధ్యాయమున జవాబు లివ్వబడినవి. ఇక యీ విషయములను గురించి వైకుంఠపతి యగు శ్రీకృష్ణు లేమి చెప్పిరో వినుడు.
శ్రీ భగవానువాచ—

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమ్
**యద్ జ్ఞాత్వామునయస్సర్వే పరాం సిద్ధిమితోగతాః ॥ ౧**

భగవాను లిట్లనిరి— "ఓ అర్జునా, ఏకాగ్ర లక్ష్యముతో యీ జ్ఞానము నెరుంగవలెను. దీనిని నీకు అనేక యుక్తి వాదములతో తెలిపితిని; నీ కిప్పుడు మరల దాని ఉపపత్తిని తెలిపెదను; మరియు నేను నీకా 'పర' శబ్దముయొక్క ఉపపత్తినిగూడ దెలిపెదను. వాస్తవముగ చూచినచో యీ జ్ఞానమునాదియే; అయినప్పటికిని, యిది 'పరము' అనగా 'పరకీయము' అగుటకు గల కారణము, లోకులు వ్యర్థముగ ఇహలోక, పరలోకము లనెడి జగడ మును తెచ్చి పెట్టుటయే. మరియు, నేను దీనిని 'పరము' అనగా సర్వో

త్తమమనికూడా యందును; ఇటులయనుటకు గలకారణము, సమస్తములగు జ్ఞానములూ గడ్డివరకల వంటివి, కాని యీజ్ఞానమో వాటినన్నింటిని కాల్చి బూడిదగ నొనర్చు అగ్నివంటిది. మర్త్యలోక స్వర్గలోకములను సత్యమైనవిగా నంగీకరించి, యజ్ఞకర్మములే మంచివి యనుచూ భేదభావము వలన ద్వైతమునే సత్యముగ తోచునటుల జేయు జ్ఞానములన్నియు యీ జ్ఞానోదయమైనతోడనే స్వప్నసమానముగ మిథ్యగా బోధపడును. గాలివీతలు అంతమందు ఆకాశమున కలసి లీనమగురీతిని, లేదా సూర్యోదయమైన పిమ్మట చంద్రుడు మొదలగువారు కాంతిహీనులగు రీతిని, లేదా ప్రళయకాలమందలి జలప్రసారమైన పిమ్మట నదీనదములన్నియు దానియందు లీనమగురీతిని యీ జ్ఞానోదయమైన పిమ్మట తదితర జ్ఞానములన్నియు పూర్తిగా విలీనమై పోవును. కావుననే ఓఅర్జునా! యీ జ్ఞానమును తదితర జ్ఞానము లన్నింటికంటెను ఉత్తమమైనదిగా ఎరుంగవలెను. ఓపాండవా! నామూలస్వయంసిద్ధముక్తస్థితినే మోక్షమందురు; జ్ఞానయోగమువలననే ఆమోక్షము లభించును. మరియు యీజ్ఞానానుభవమైన పిమ్మట బుద్ధిమంతుడగు శూరపురుషుడు జననమరణరూప సంసారమును తల ఎత్తనివ్వడు. మనస్సుతోనే మనస్సును నిగ్రహించి స్వాభావిక విశ్రాంతిని పొందు లోకులు, దేహధారులై యున్నప్పటికిని దేహాధీనులుకారు. వారు దేహబంధమునుండి పూర్తిగా విముక్తులగుదురు. మరియు నాతో సమానులుగా నగుదురు.

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః ।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే నవ్యథన్తి చ ॥ 2

ఓ పార్థా! యిట్టివారు నానిత్యత్వమువలననే నిత్యులగుదురు. మరియు నా పరిపూర్ణత్వము వలననే పరిపూర్ణులగుదురు. నేను శాశ్వతానందముతో వాస్తవముగ పూర్ణరూపమున నుండు రీతిని, వారు కూడ అట్టులే యుందురు. నా స్వరూపమే విధముగ ఎంతగానుండునో వారిస్వరూపముకూడ ఆదేవిధమున అంతటియే యగును. ఘటము బ్రద్దలైన పిమ్మట అందలి ఆకాశముకూడ ఆకా

శతత్త్వములో కలియురీతిని, లేదా దీపముయొక్క అనేకజ్యోతులు ఆరిపోయినప్పుడు ఆజ్యోతులన్నియూ ఆమూలజ్యోతి లేకతేజమున కలసిపోవు రీతిని, ఓ అర్జునా! ద్వైతమునకు సంబంధించిన జగడములన్నియు నశించిన పిదప, మరియు నీవు-నేను మొదలుగాగల భేదములన్నియు నశించిన పిమ్మట, నామ-రూపాత్మక పదార్థములన్నియూ వచ్చి ఒకేవరుసలో జేరును, మరియు అవియన్నియు ఒకటిగనే యగును. కావుననే, మరల సృష్టి జరిగినప్పుడు కూడవారు ఆ సృష్టియ వడి సుడిగుండమున చిక్కు పడనక్కరలేదు. వారు ఆనూతనసృష్టి యందుకూడ జన్మించ నక్కరలేదు. అటుతరువాత, ఆదిసృష్టి సమయమందుకూడ వారు దేహబద్ధులు కానక్కరలేదనిన, యికప్రళయకాలసము వారికి మృత్యు వెటుల ప్రాప్తించును? ఓ అర్జునా! కావుననే, ఈ జ్ఞానము ననుసరించువారు జనన - మరణ పరంపరను దాటుదురు. మరియు వారు నాస్వరూపమున విలీను లయ్యెదరు."

ఈరీతిని శ్రీకృష్ణు డర్జునునితో జ్ఞానమాహాత్మ్యము నింత ప్రేమతో, ఆతని మనస్సున యీ జ్ఞానమును పొందవలె ననెడి ఆసక్తి మరియు అనురాగమూ వృద్ధిపొందుటకు గాను చెప్పిరి. శ్రీకృష్ణుని యీ మాటలను వినుటచే అర్జునుని స్థితి ఒక విలక్షణమైనదిగ నగుచుండెను. అతని ప్రతి రోమము సందును చెవులు మొలచినవా - యన్నటుల కాన్పించ సాగెను. మరియు వాటి ఏకాగ్రత వలన ఆతడు తన్మయుడగు చుండెను. ఆపైని భగవానుని ప్రేమ ఆతనిని ఆవరించిన విధమును చూడగా, అది ఆకాశమునందు కూడ పట్టనంత అపారమైనదిగా నుండెను. అంతట భగవానులు అర్జునునితో నిటులనిరి - "ఓబుద్ధిమంతుడవగు అర్జునా! నేడు నా వక్తృత్వము ధన్యతను చెందినది. ఏలనన నా వాణికి తగిన యోగ్యుడగు శ్రోత వగు నీవు నాకు నేడు లభించితివి. త్రిగుణము లనెడి వేటగాడు నన్నేరీతిని దేహపాశమున బంధించునో మరియు మాయాసంగమువలన నే నేరీతిని అనేక జగత్తులను [illegible]ంతునో వివరించెదను, సావధానుడవై వినుము.

మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।
సమ్భవ స్సర్వ భూతానాం తతో భవతి భారత ॥3॥

ప్రకృతిని క్షేత్రమనుటకు గల కారణము అది నా సంగ మనెడి బీజము వలన భూతకోటి యనెడి పంటను పండించుటయే యైయున్నది. ఈప్రకృతియొక్క పేరే మహద్బ్రహ్మ; ఇందుకు గలకారణము, మహదాది తత్త్వము లన్నింటికిని యిది విశ్రాంతిస్థానమగుటయే. ఓ అర్జునా ! దీనివలననే వికారములకు నానావిధములగు బలములు ప్రాప్తించుచున్నవి; కావుననే దీనిని మహద్బ్రహ్మ యందురు. అవ్యక్తవాదులు దీనిని అవ్యక్తమందురు, సాంఖ్య మతస్థులు ప్రకృతియందురు. వేదాంతులు దీనినే మాయ యందురు. కాని ఓ జ్ఞాతవగు అర్జునా యీ విధముగాగల పేళ్ళ నెన్నింటిని వ్యర్థముగా చెప్పను. ఈ ప్రకృతియే అజ్ఞానమని నీవెరుంగుము. ఓఅర్జునా! తన ఆత్మస్వరూపమును మరచిపోవుటయే యీ అజ్ఞానస్వరూపము, ఇదిగాక దీనియందు మరొక విశేషముకూడ గలదు. ఆదేదన దీపము వెలిగించి చూచినప్పుడు అంధకారము కనిపించని రీతిని, విచారణ స్ఫురించగానే యీ అజ్ఞానముకూడ తొలగిపోవును. పాలను నిప్పుపైపెట్టి గిరగిర త్రిప్పుచున్నచో మీగడకట్టదు. ఆ పాలను నిలుకడగ నుండనిచ్చినచో మీగడ కటును. జాగ్రదవస్థయూ గాక, స్వప్నమూ లేక, ఆత్మరూపసమాధియూ లేని గాఢనిద్రావస్థవలె, లేదా వాయువు వీచనప్పుడు ఆకాశతత్త్వము పూర్తిగా శాంతముగను నిలుకడ కలదిగను వుండురీతిని, యీ అజ్ఞానముకూడ అట్టిస్థితినే కలిగియున్నది. ఎదుట కనుపించుచున్నవస్తువు స్తంభమో లేక మనుష్యుడో తెలిసికొన లేనంత దుస్థితిలో నీ అజ్ఞానమున్నది. ఈ రీతిని ఆత్మవస్తువుయొక్క యదార్థ జ్ఞానమూ కలుగుటలేదు. అంతేగాక అది ఫలానా వస్తువు అనెడి దృఢనిశ్చయమూ కలుగుటలేదు. సంధ్యా సమయమున పూర్తిగా పగలూవుండక, పూర్తిగా రాత్రియూ యుండని విధమున యీ అజ్ఞానముకూడ ఆత్మవస్తువు

లకు విరుద్ధముగానూ వుండదు, అనుకూలముగానూ వుండదు. ఈ తీరున సత్యజ్ఞానము మరియు విరుద్ధజ్ఞానముల మధ్యనుండెడి సందేహావస్థనే అజ్ఞానమందురు; మరియు యీ అజ్ఞానమున చిక్కుకొనియున్న ఆత్మతత్త్వమునే క్షేత్రజ్ఞుడందురు. అజ్ఞానమును వృద్ధిచేయుటయూ మరియు ఆత్మస్వరూపమును విస్మృత మొనర్చుటనే క్షేత్రజ్ఞునియొక్క విశిష్టలక్షణముగా నెరుంగవలెను. ఓ అర్జునా, ప్రకృతి మరియు పురుషుడు, లేదా క్షేత్రము మరియు క్షేత్రజ్ఞుల సంయోగ మన నిదియే. ఈ (సం) యోగము ఆత్మ తత్త్వముయొక్క స్వాభావిక ధర్మమే. ఇక, నీ అజ్ఞానమును అనుసరించి ఆత్మ ఆత్మస్వరూపమునే చూచును, కాని దానికి అది అనేక స్వరూపములుగా తోచును, మరియు యిటుల తోచుటవలన 'వీటిలో ఏ స్వరూపము నిజమైనదీ మరియు వాస్తవికమైనదో, ఏది అసత్యమైనదీ మరియు అవాస్తవికమైనదో' దానికి బోధపడదు. దరిద్రుడు ఉన్మాదియై 'నేను రాజును' అనిచెప్ప మొదలిడు నటుల, లేదా మూర్ఛనొందినవాడు మూర్ఛనుండి లేచిన పిమ్మట 'నేను స్వర్గలోకమునకు పోయి వచ్చితిని' అని చెప్పు విధమున, ఒక్కమారు దృష్టి భ్రమాపూరితమైన పిమ్మట ఏ ఏ పదార్థములు వున్నదిగా తోచునో, వాటి అన్నింటిని సృష్టియందురు. ఈ సృష్టి నా నుండి, అనగా మూల ఆత్మతత్త్వమునుండి ఉత్పన్నమగును. స్వప్నమునందు ఒకే మనుష్యుడు భ్రాంతివలన మేము పెక్కురుమనుష్యులము అని చెప్పురీతిని ఆత్మస్వరూపమును మరచిన పిమ్మట ఆత్మకూడ అదేవిధనుగు స్థితి గలది యగును. ఇక నీకీసిద్ధాంతమును ఏ మాత్రము సంశయము లేకుండు రీతిని వివరించి చెప్పెదను. అయినప్పటికిని, నీవు దీనిని స్వయముగ అనుభవించుము. నాయీ అవిద్యయనెడి కాంత అనాదియు శాశ్వతయౌవనముతో నుండు నట్టిదియు మరియు అవర్ణనీయ గుణములచే కూడియున్నదియునై యున్నది. ఇది 'దీని స్వరూప మిట్టిది' అని ఎన్నడును ఏ విధముగను చెప్పుటకు వలను పడనిది. దీని వ్యాపకత్వము అసీమము మరియు అపరంపారమునై యున్నది.

ఇది నిద్రించుమానవులవద్ద వుండును. మరియు మేల్కొనియున్నవారికి దూరముగానుండును. నేనుస్వయముగ నిద్రించియున్నప్పుడిది మేల్కొనియుండి ఆత్మసత్తుతో సంయోగమును పొందిన పిదపనే గర్భమును ధరించును. అటుపైని యీమూలమాయ తన ఉదరమునందు ప్రకృతి జన్యమగు అష్ట వికారములనెడి గర్భమును పెంపొందజేసికొనును. ఈప్రకృతి పురుషుల సంయోగము వలన, ప్రథమమున బుద్ధితత్త్వము జన్మించును మరియు అంతట, బుద్ధితత్త్వముతో ఓతప్రోతమై నిండియున్న మనస్సు జన్మించును. ఈ మనస్సుకు యౌవనావస్థ వచ్చినప్పుడుఅహంకారతత్త్వమును కనును, మరియు ఆ అహంకారమునుండి మహాభూతములు కలుగును, భూతములయొక్క స్వభావమెట్టిదనిన, అవి విషయములుమరియు ఇంద్రియములతో తమంతతామే సంలగ్నమై యుండును; దీనివలనభూతములతోపాటు ఇంద్రియములు మరియు విషయములు కూడ జన్మించును. వికారము లీరీతిని వృద్ధి పొందినప్పుడు త్రిగుణములు వాటి వీపులపైనెక్కి కూర్చొనును, మరియు వాటితోడ్తోడనే వాసనకూడజన్మించును. నీటిసహాయము లభించగనే బీజముమొలకరించసాగురీతిని నా సంయోగము లభించగానే అవిద్యయనెడి మూలమాయ తనంతతానే అనేక నామ - రూపాత్మక జగత్తులనెడి అంకురములను పుట్టించసాగును. ఇక నో సుజనశ్రేష్ఠా, ఆ గర్భమునకు రూపమెటుల వచ్చునో చెప్పెదను వినుము. అందు, అండజములు, స్వేదజములు, ఉద్భిజములు మరియు జారజములని నాల్గు విభాగము లేర్పడును. ఆకాశముమరియు వాయువుయొక్క కలయిక వలన మణిజము లనబడెడి అండజమను పేరుగల విభాగము జనించును. ఉదరమున తమస్సు మరియు రజస్సు - అనెడి గుణములతోకూడియుండి తేజస్సుతోపాటు జలతత్త్వము ప్రాబల్యము వహించినప్పుడు స్వేదజ విభాగము జన్మించును. జలము మరియు పృధివీతత్త్వములు ప్రాబల్యముగనున్న సమయమున, అందు కేవలము తమోగుణమే వున్నప్పుడు నిమ్నకోటికి చెందిన స్థావరవర్గము జనించును. దీనిని ఉద్భిజవిభాగముగ నెరుంగ

పడెను. ఐదు కర్మేంద్రియములు మరియు ఐదు జ్ఞానేంద్రియములు పరస్పరము సహాయకములుగా కాసాగి, మనస్సు మరియు బుద్ధి మొదలగువానితో కూడియున్నప్పుడు జారజ విభాగము వృద్ధించును. ఈకీర్తిని మూలమాయ యనెడి గృహ మిట్టి విలక్షణమైన పుత్రుని గనును ఈ నాల్గు విభాగములు ఆతనికి నాల్గు కాళ్లూ చేతులూ నని ఎరుంగుము. మూలమైన అష్టవిధప్రకృతిని ఆతని మస్తకముగా నెరుంగుము. ప్రవృత్తి ఆతని బాగా పెరిగిన పొట్ట నివృత్తి తిన్నని వీపు, అష్టదేవయోనులు ఆతని శరీరము యొక్క ఉపరి భాగములు. స్వర్గము ఆతనికి వికసించు కంఠ ప్రదేశము. మర్త్యలోకము ఆతని వక్షము, పాతాళలోకము ఆతనికి నడుమునకు క్రింద నుండు పిర్రలు. త్రిలోకములయొక్క విస్తారమును యీ బాలుని యొక్క పెరుగుచున్న బాల్యావస్థ. ఎనుబదినాల్గులక్షల యోనులూ ఆతనికి ఎముకలు మరియు ప్రక్కటెముకలయొక్క సంధులునై యున్నవి. ఇట్టి బాలుడు దినదినప్రవర్ధమానుడు కాసాగెను. ఈమాయ ఆబాలుని అవయవములందు నానావిధములగు నామ-రూపములుగల నగలను అలంకరించి నిత్యనూతనమగు అజ్ఞాన దుగ్ధమును త్రాగించును. ఆబాలకుని చేతులకు భిన్నభిన్న ప్రవృత్తులనెడి ఉంగరముల నామె ధరింపజేసెను. అందలి ప్రతి ఒక్క ఉంగరముయొక్క ప్రకాశము కొంత విలక్షణతను గలిగియుండును. ఈ విధమున, తన ఏకైక చరాచర స్వరూపుడగు ఆ ప్రతిమ సుందరబాలుని ప్రసవించి, ఆ ప్రకృతి తనను తాను ధన్యురాలినిగా తలంచుకొనసాగెను. ఈ బాలుని ప్రభాత కాలము బ్రహ్మ, మధ్యాహ్నకాలము విష్ణువు మరియు సంధ్యాకాలము శంకరుడును నై యున్నారు. ఈబాలుడు ఆటలాడియాడి అలసి పోయినప్పుడు మహాప్రళయమనెడి శయ్యపై స్వస్థుడై నిద్రించును; అటుపైన, నవీన కల్పోదయమైనప్పుడు విపరీత జ్ఞానముతో, అనగా అజ్ఞాన మోహముచే మేల్కొనును. ఓ అర్జునా! యీ విధముగా అజ్ఞాన గృహమునం దీబాలుడు క్రీడించుచూ యుగపరంపరలనెడి అడుగులనిడసాగును. సంకల్పము మరియు

వికల్పము లీబాలునకు ప్రియమిత్రులు. మరియు అహంకారము ఆటలాడు కొనుటలో యీతనికి సహచరుడుగా నుండును. ఈ బాలుడు కేవలము సత్యజ్ఞానము వలననే అంతమొందును. ఈ రీతిని మాయ యీ విశ్వమును రచించినది. మరియు యీపనియందు నాశక్తిని అది ఉపయోగించు కొనెను.

సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయ స్సమ్భవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా ॥4॥

"కావున, ఓ అర్జునా! నేను తండ్రిని, మహద్బ్రహ్మ యగు మూల మాయ తల్లియూ, యీ కాన్పించెడి జగత్తు మాకు పుత్రుడున్నూ అయి యున్నారు. కాని, నీవు సంసారమునం దనేక విధములగు శరీరములను చూచి నీ మనస్సున భేదభావమును కలుగనివ్వకుము. ఏలనన, మనస్సు మరియు బుద్ధి మొదలగునవన్నియు ఏకరూపముగలవే. ఒకేశరీరమున భిన్నభిన్న అవయవము లుండవా? ఇదేరీతిని నానారూపములుగా కాన్పించు యీవిశ్వము మూలమందొక్కటే. ఒకేబీజము నుండి వృక్షముయొక్క పెద్దవీ చిన్నవీయగు అనేకానేకముల కొమ్మలు బయల్వెడలు రీతిని, లేదా మట్టినుండి ఘటమనెడి కొడుకు జన్మించు సంబంధమువలె, లేదా ప్రత్తితో తయారైన నూలుపోగుల గర్భమునుండి వస్త్రమనెడి మనుమడు జన్మించు రీతిని లేదా సాగరమునకు తరంగము లనెడి సంతతి కలుగునట్టి సంబంధము వలెనే యీ చరాచర జగత్తుతో నాకుకూడ అట్టి సంబంధమే వున్నది. కావుననే అగ్నియు మరియు జ్యోతియూ – రెండునూ కేవలము అగ్నియే అయినరీతిని యీ విశ్వమంతయూకూడా నేనే. ఈ నిజమూ మరియు నిర్దోషమూ నగు జ్ఞానమును నీ మనస్సున దిటవుగ పదిలపరచు కొనుము. నేను స్వయముగ నన్ను నేనే భిన్నభిన్న శరీరములలో భిన్నభిన్నముగ కాన్పించునటుల చేతును. ఇటుల చేయుటకు గల కారణము, నేను ఉత్పన్నమొనర్చిన త్రిగుణము లనెడి బంధనమే నని నీవెరుంగుము. ఓ అర్జునా! స్వప్నములో మనము మన మరణమునే చూచు

రీతిని, లేదా కామెర్ల వ్యాధిచే రోగియొక్క కనులే పసుపువన్నె గలవిగా అయినప్పటికిని, ఆతనికి ప్రపంచమందలి వస్తువు లన్నియు పసుపురంగుగానే కాన్పించసాగురీతిని, లేదా సూర్యుడు ప్రకాశించిన పిమ్మట మేఘములు కన్పించురీతిని, మరియు మేఘములచే సూర్యుడు కప్పివేయ బడినప్పుడుకూడ ఆమేఘములు సూర్య ప్రకాశమువల్లనే కన్పించురీతిని, లేదా మన నీడను మనమే చూచి భయపడురీతిని (వాస్తవమునకు ఆ నీడ మనకు భిన్నమైనది కాకున్నప్పటికిని) నేనే అనేక విధములగు శరీరములను చూపించి భేదభావమును పొందెదను. ఈకార్యమునందు నాకొక బంధనము గలదు. దానిని తెలిపెదను వినుము. మన ఆత్మస్వరూపమునకు గలిగిన అజ్ఞానమువలననే 'నేను బద్ధుడను, నేను ముక్తుడను' అనెడి ప్రశ్న కలుగుచున్నది. కావున సోదరుడవగు అర్జునా! నే నేగుణములవలన నాకు నేను బద్ధుడనుగా కాన్పించుచున్నానో చెప్పెదను వినుము. గుణములెన్ని? వాటి ధర్మములెవ్వి? వాటి లక్షణములు మరియు నామములేవి? మరియు అవి ఎచటినుంచి జన్మించును? ఈ రహస్యమును తెల్పెదను వినుము.

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః
నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్ ॥౫॥
తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్
సుఖ సఙ్గేన బధ్నాతి జ్ఞాన సఙ్గేన చానఘ॥ ॥౬॥

" ఈ గుణములు మూడు, మరియు వాటి పేళ్ళు – సత్త్వరజస్తమములు. ఇవి ప్రకృతివలననే జనించు చున్నవి. వీటిలో సత్త్వగుణము ఉత్తమమైనది. రజోగుణముమధ్యమము, మరియుతమోగుణము అధమము. ఈత్రిగుణములు ఒకే మనోవృత్తియందుకూడా వుండవచ్చును. ఒకే శరీరమున బాల్యము, యౌవనము, మరియు వార్ధక్యమనెడి త్రివిధ వికారములు కాన్పించు రీతిని లేదా మేలిమి బంగారులో కల్తీ ఎక్కువైనకొలది దానివన్నె

తగ్గిపోవుకీతిని లేదా జాగరూకత బద్ధకమున మునిగిపోయినప్పుడు నిద్రవచ్చి తన పెత్తనము చెలాయించు రీతిని, అజ్ఞానమును కౌగిలించుకొని విస్మృతిని పొందెడివృత్తి సత్త్వగుణము మరియు రజోగుణములచే అంకితమై అంతమున తమో గుణముచేకూడా నిండిపోవును. ఓ అర్జునా! వీటిపేళ్ళు గుణములే కాని యీ గుణములు ఎటుల బంధకరము లగునో వినుము. ఆత్మక్షేత్రజ్ఞ స్థితిలో అనగా జీవాత్మ స్వరూపమున శరీరమున ప్రవేశించుటే తడవుగ 'ఈశరీరమే నేను' అనిచెప్ప నారంభించును. జన్మించినది మొదలుకొని మరణపర్యంతము దేహధర్మము లన్నింటివిషయమున దానికి సదా యీ అభిమానమే నిలిచి యుండును. మత్స్యము నోట ఆమిషము పడుటతోడనే చేపలవాడు దానిని పట్టుకొని బయటకు లాగును. ఈవిధమగు అభిమానము ఏమాత్రమైన కలుగుట తోడనే సత్త్వరూపియగు వ్యాధుడు సుఖము, మరియు జ్ఞానమనెడి వలను లాగసాగును. మఱియు జీవాత్మ ఆవలలో లేడివలె బాగుగా చిక్కుకొనును. ఇది జ్ఞానాభిమానముచే వాగును. జ్ఞాతృత్వము వలన గిలగిల కొట్టుకొనును. మరియు చేజిక్కిన ఆత్మసుఖమును కోల్పోవును. అట్టిస్థితిలో, ఎవరైన దాని విద్వాంసత్వమును ఆదరించుచో దానికి అత్యంత సంతోషము కలుగును; దానికి ఏకొద్దిగా సౌఖ్యము లభించి నను చాల ఆనందము కలుగును. మరియు అంత 'దానికి వాస్తవముగ నేను చాల సుఖపడు చున్నానని' గర్వము గలుగసాగును. ఆ సమయమున జీవాత్మ 'ఇది నాసౌభాగ్యము కాదా? నావలె ఎవడు సుఖించుచున్నాడు? అని' అనుకొనును. ఈవిధముగ చెప్పుచుండగనే దానియందు సాత్త్వికభావము లెనిమిదిన్నీ వేగపూర్వకముగ సంచరించ సాగును. కాని యీ బండి యిచ్చటనే ఆగిపోదు. దీని మార్గమున మరియొక్క అడ్డంకు ఏర్పడును. విద్వాంసత్వమనెడి భూతగాలి దాని అవయవములందు ప్రవేశించి చిందులు త్రొక్కసాగును. 'నేను మూలమున జ్ఞానస్వరూపుడను, నా ఆ మూల స్వరూపమును నేను నాశము చేసికొంటి న'నెడి దుఃఖము దానికించుకయు

కలుగదు. ఇటుల దుఃఖము కలుగక పోవుటకు గల కారణము, అది స్వయముగ తన జ్ఞానమువలననే ఉబ్బిపోయి ఆకాశ సమానముగ నగును. రాజు స్వప్నమున బిచ్చగాడై, ఆ దీనావస్థలో స్వయముగ తన రాజధానియందే ప్రవేశించి, భిక్షము లభించినమీదట గర్వముతో "నేను యింద్రునితో సమానముగ భాగ్యవంతు డనుకానా ?" యని చెప్పుకొన మొదలిడురీతిని నిరాకారియగు కేవలాత్మ దేహవంతమైన జీవాత్మ రూపమును ధరించినప్పుడు అదికూడ బాహ్యజ్ఞానముచే భ్రమ గల దగును. అది వ్యావహారిక శాస్త్రమున చతురురా లగును. యాజ్ఞిక విద్యయందు దానికి చక్కని జ్ఞాన మలవడును. కేవల మింతియేగాదు. తన జ్ఞానగర్వమువలన దానికి స్వర్గముకూడ తుచ్ఛముగ తోచసాగును. ఆకాశమునందు చంద్రుడు విలసిల్లు రీతిని, నాచిత్తమున చాతుర్యము విలసిల్లును. ఈ రీతిని సత్త్వగుణము జీవాత్మను సుఖము మరియు జ్ఞానమనెడి ద్వారమున బంధించును. మరియు దానిస్థితిని అపాహీజుని ఎద్దుతో సమానముగ నొనర్చును. ఇక యీ శరీరధారియగు జీవాత్మయే రజోగుణముచే నెటుల బంధింపబడునో తెలిపెదను వినుము.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గ సముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌన్తేయ ! కర్మ సఙ్గేన దేహినమ్॥ ౭

దీనిని రజస్సనుటకు గల కారణము, దీనివలన జీవాత్మకు రంజనము కలుగుటవల్లనే. ఇది ఎల్లప్పుడు విషయవాసనలతో లిప్తమై యుండును. ఈ రజస్సు ఏ కొద్దిగనైన జీవాత్మలో ప్రవేశించుటతోడనే అది విషయ భోగ వాంఛామార్గమును పట్టును. మరియు వాసనయనెడి వాయువును ఆరోహించును. నేతితో తడిపి, మండుచున్న నిప్పురవ్వలతో నిండియున్న హోమకుండ మెల్లప్పుడు కొద్దిగనో గొప్పగనో జ్వలించుచునే వుండు రీతిని, విషయములపట్ల కలిగెడి అనురాగముకూడ ఎడతెగకుండా నిలచి యుండును. మరియు వృద్ధిపొందుచునే యుండును. దుఃఖమిశ్రితములైన విషయములుకూడా మధురముగనే తోచసాగును. మరియు ఇంద్రవైభవము

లభించి నప్పటికిని వీనిముందు అల్పమైనదిగనే తోచును. ఈ తృష్ణ బాగా ప్రాబల్యమును పొందినప్పుడు మేరుపర్వతము చేత బడినప్పటికిని, విషయ ప్రాప్తికై జీవుడు దానికంటెకూడ ఎక్కువ భయంకరమైన సాహసకార్యము నొనర్చుటకు సంసిద్ధుడగును. ఈ విధమగు పనులకొరకై ఆతడు తనప్రాణ ముల నతితుచ్ఛముగ తలచి, వాటినిబలియిచ్చుటకుకూడ సంసిద్ధపడును; మరియు ఆప్రయత్నములో ఏ స్వల్పముగ చేజిక్కినప్పటికిని ఆతడు తన జన్మమును సార్థకముగ తలంచసాగును. ఈ సమయమున నా చేతగలదాని నంతనూ నేడే ఖర్చు పెట్టి నప్పటికిని హానిలేదు. కాని రేపేమి చేయుదును?' అని యోచించును. ఈ విధమగు విచిత్రమగు ఆశను మనసునం దిడుకొని ఆతడు తన వ్యవహారములను విస్తరింపజేసికొనును 'స్వర్గము పోదగినదే, కాని అచ్చటకు వెళ్ళినపిదప భుజించున దేమిగలదు' అనును. ఈభవిష్య చింతతోనే ఆతడు యజ్ఞకర్మలందు తగుల్కొనును. అంత నాతడు వ్రతక్రమమును ప్రారం భించును. మరియు సార్వజనిక కూపములు మరియు చెరువులు మొదలగు వానిని నిర్మింపించి, తన యిష్టము నెరవేరు కార్యములను చేయును. కాని, మనస్సున కామవాసన లేకుండా ఆత డేకార్యమూ ఎన్నడును చేయడు. ఓ అర్జునా! గ్రీష్మఋతుపవనము విశ్రమించుటనే యెరుగని రీతిని ఆజీవుడు కూడ విశ్రమిం చుట నెరుగడు, మరియు రాత్రింబవళ్ళు వ్యవహార ధోరణియందే నిమగ్నమై యుండును. వాసనలచే పూర్తిగా లిప్తుడైన ఆజీవుడు ఆతనిముందు మత్స్యము యొక్క చాంచల్యముగాని లేదా కామినీ కటాక్ష చాంచల్యముగాని చాలనంత మిక్కుటమగుతీవ్రత మరియు వేగముతో తన ఉద్దేశ్యమును సిద్ధించుకొనుటలో నిమగ్నమగును. ఈవిధమగు విలక్షణమైన తొందర మరియు వేగముతో ఐహికము మరియు పారలౌకికమూ నగు విషయ లోభముగల ఆ జీవుడు క్రియా - కర్మ లనెడి అగ్నిలో దూకును. ఈ రీతిని ఆ దేహధారియగు జీవాత్మ వాస్తవిక శరీరమునుండి భిన్నుడై పోయినప్పటికి కూడ, స్వయముగనే వాసన లనెడి సంకెలలను తగిలించుకొనును. మరియు నానావిధములగు కర్మము లనెడి

శృంఖలలను తన కంఠమున ధరించును. ఈ రీతిని రజోగుణమనెడి భయంకర బంధనము యీ దేహమునం దుండెడి మరియు దీనిని ధరించెడి జీవాత్మను గట్టిగా బంధించును. ఇక తమోగుణ మేరీతిని బంధించునో చెప్పెదను వినుము.

తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత॥ ౮

ఏది తెలివిలేన వ్యావహారిక జ్ఞానదృష్టికూడ మందగించునో, ఏది మోహ మనెడి చీకటిరాత్రికి నిలయమున్న కారుమేఘమువంటిదన్న అయి యున్నదో, దేనియందు అజ్ఞానమే సదా జీవించి యుండునో, దేని భ్రాంతిలో పడి యీ విశ్వము మదాంధమై నాట్యము చేయుచుండునో, ఏది అనాలోచనకు మూలమంత్రమో, ఏది మూర్ఖత్వ మనెడి మద్యము గల పాత్రయో, అంతేగాదు ఏది జీవులకు కేవలము మోహనాస్త్రమో, ఓ అర్జునా! అదియే తమస్సు. అది తన యుక్తివలన దేహాభిమానములను నలు వైపులను గట్టిగా బిగించి కట్టివేయును. అది ఒంటరిగా స్థావర-జంగమములం దొక్కమారుగా వృద్ధిపొందసాగినప్పుడింక మరే గుణముయొక్క ఆటలును అచ్చట సాగవు దీనిమూలమున యింద్రియము లన్నింటియందును జడత్వము వచ్చును మూర్ఖత్వము వచ్చి మనస్సును అణచివేయును. మరియు ఆలస్యము వృద్ధిపొంద సాగును. అంత నా జీవుడు తన ఒడలు విరచుకొన సాగును. పని - పాటలు చేయుటకు అయిష్టముగ నుండును. మరియు ఆతనికి కేవలము ఆవలింతలమీద ఆవలింతలు రా నారంభించును. ఓ అర్జునా! అట్టి స్థితిలో కనులు తెరచి యున్నప్పటికిని ఆజీవున కేమియూ కాన్పించదు; మరియు ఎవడును పిలువకున్నప్పటికిని ఎవరో పిలచు చున్నటుల భ్రమపడినవాడై వ్యర్థముగ తనంత తానే 'ఆఁ' యని పలుకును. రాయి ఒకమారు భూమిపై పడినతరువాత ఎన్నడును అది తానున్న ప్రదేశము నుండి అటు - యిటు కదలుట యెరుగని రీతిని మానవుడు యీరీతిని పడు

కొనిన తరువాత ప్రక్కలకు దొరలుటనుకూడ ఎరుంగడు. భూమి క్రుంగి పోయి పాతాళములోనికి పోవుగాక, లేక పైకిలేచి ఆకాశమును చేరుగాక అతడు రాతివలె తా నున్నచోటుననే పడి యుండును. లేచుటను నామ మాత్రమునకైన అత డెరుంగడు. ఇందువలన అతనికి ఉచితా నుచితములను గురించిన ధ్యాసయే వుండదు. 'నేను యథా ప్రకారముగనే వున్నానని' మాత్రము అతడు మనసున తలంచుచుండును. అతని కొక్క మాఱు నిద్ర వచ్చినంత మాత్రముననే 'తనకు స్వర్గము లభించినదని' భావించుచుండును. నాకు బ్రహ్మతో సమముగ ఆయువు కావలెననిన్నీ, ఆ ఆయువునంతను నిద్రలోనే గడుప వలెననిన్నీ అతడు వాంఛించుచుండును. మార్గమున పోవు నప్పుడు ఎచ్చటనైన కొద్దిసేపు ఆగుచో, ఆచ్చటకూలబడి కునికిపాట్లు పడ సాగును. నిద్రావస్థ పొందిన సమయమున ప్రత్యక్షముగ అమృతము నెవరైన యిచ్చుటకై వచ్చి మేల్కొల్పినను లేచి దానిని గైకొనుటకు నిరాకరించును; అతనికి ఆ నిద్రముందు అమృతముకూడా తృణప్రాయముగనే తోచును. అత డేదైన పనిని బలవంతముగ చేయవలసి వచ్చుచో క్రోధాంధు డగును. అట్టి సమయమున అతనికి ఎవరితో ఎటుల వ్యవహరించ వలయునో తెలియదు. ఎవనితో ఎటుల మాట్లాడవలెనో తెలియదు. మరియు ఫలానా కార్యము చేయదగినదో, చేయగూడనిదో బోధపడదు. పతంగము కేవలము తన రెక్కల సహాయము వల్లనే అడవికి అంటుకొనిన నిప్పును చల్లార్చవలెనని మనస్సున నెంచురీతిని అతడుగూడ సాహసమున ప్రవృత్తుడై అనుచిత సాహసముతో అసంభవ కార్యములలో పాల్గొనును. ఆలోచన చేయకుండా వుండుటయే అతనికి నచ్చును. ఈ రీతిని ప్రమాదము, ఆలస్యము, నిద్ర - అనెడి బంధత్రయముచే తమోగుణము వస్తుతః నిరంజనుడు మరియు శుద్ధుడునగు ఆత్మను బంధించును. కట్టెకు నిప్పంటుకొనినప్పుడు ఆ నిప్పు కట్టెయొక్క ఆకారరూపములోనే కాన్పించును. మరియు ఘటములో గల ఆకాశము ఘటరూపముగనే కన్పించును.

దానిని లోకులు ఘటాకాశమందురు. నిండుగానున్న సరోవరమున చంద్రబింబము పడి యున్నటుల కనిపించును. ఇదే రీతిని యీ గుణము లతో కూడియున్నప్పుడు ఆత్మ తత్త్వముకూడ బద్ధమైనటుల తోచును.

సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత !
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత ॥౯॥

రజస్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత !
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥౧౦॥

"కఫవాతములను నిర్మల మొనర్చి శరీరమున పిత్తము ప్రబల మైన ప్పుడు శరీరమున తాపము కలుగును. వర్షము మరియు గ్రీష్మముల యొక్క బలమును త్రుంచివేసి శీతలత్వము వచ్చినప్పుడు వాతావరణమున శీతలము సంచరించును. స్వప్నము మరియు జాగ్రదవస్థలు రెండునూ లోపించి, కేవలము సుషుప్త్యవస్థయే మిగిలి యున్నప్పుడు కొంతసేపటి వరకు చిత్తవృత్తి సుషుప్తిమయముగనే యగును. ఇదేవిధమున సత్త్వగుణము ప్రబలమైనప్పుడు రజస్సు మరియు తమస్సులు రెంటినీ అణచివైచును. అప్పుడు జీవుని నోటి నుండి నే నెంత మిక్కుటముగ సుఖముగనున్నాను అను మాటలు వెలువరించ బడును. ఇదేరీతిని సత్త్వము మరియు రజోగుణములను అణచివైచి తమో గుణము వృద్ధిపొంది వప్పు డది సహజముగనే జీవుని ప్రమాదమునకు వశ పడు నటుల చేయును. ఇటులనే సత్త్వము మరియు తమస్సులను అణచి వైచి రజోగుణము ప్రబలమైనప్పుడు దేహమునకు ప్రభువైన జీవాత్మ 'కర్మను మించిన మంచిది మ రేదియూ లేదని' నిశ్చయించుకొనసాగును. ఈ త్రిగుణములయొక్క వృద్ధికి సంబంధించిన విషయము మూడు శ్లోకములలో చెప్పబడినది. దానిని మీరు సావధానులరై వినుడు.

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత ॥౧౧॥
లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణామశమః స్పృహా ।
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ! ॥౧౨॥
అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన! ॥౧౩॥
యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే॥ ౧౪
రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే ।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే॥ ౧౫

“రజస్సునూ తమస్సునూ అణచివైచి సత్త్వము తన ఏకాధిపత్యమును స్థాపించుకొని నప్పుడు మనుష్యులం దీదిగువ వివరింపబడిన లక్షణములు కాన్పించును. వసంత ఋతువునందు కమలముయొక్క సుగంధము కమలము నందు మాత్రమే నిలచియుండక నలువైపులను వ్యాపించసాగురీతిని ఆమను ష్యుని జ్ఞానముకూడ లోపల యిమిడియుండ జాలనందువలన బయటకు వెడలసాగును. ఇంద్రియము లన్నింటను వివేకబుద్ధి వసించియుండును. మరియు అందువలన చేతులకు మరియు పాదములకును ఒక అద్భుతమైన దృష్టి లభించునని కూడ చెప్పవచ్చును. రాజహంసయెదుట ‘పాలేవి ? నీళేవి ? ’ యనెడి ప్రశ్న వచ్చుచో, దాని చంచువే దీనిని నిర్ణ యించురీతిని, యోగ్యాయోగ్యములు పాపపుణ్యములు మొదలగు వానిని పరీక్షించి వాటిని నిర్ణయించుటను ఆతని యింద్రియములు తమంతతామే కొనసాగించును. మరియు నియమము అనగా ఇంద్రియనిగ్రహము ఆతని సేవకుని వలెనే యగును. వినరాని మాటను ఆతనిచెవులే తమంతతాము త్రోసి

పుచ్చును. చూడరాని వస్తువులను ఆతని దృష్టియే స్వయముగ బహిష్కరిం
చును. చెప్పరాని మాటను ఆతని నాలుక ఎన్నడును పలుకనే పలుకదు. దీప
జ్యోతి ముందునుంచి అంధకారము పారిపోవురీతిని నిషిద్ధకర్మలుకూడ ఆతని
యింద్రియములముందు ఆగలేక వెంటనే పారిపోవును. వర్షఋతువులో పెద్ద
నదులు బాగావృద్ధిపొందురీతిని ఆతని బుద్ధికూడా అన్నిశాస్త్రము లందును
పూర్తిగా సంచరించును. పున్నమనాడు చంద్రునిప్రతిభ ఆకాశమున బాగా
వ్యాపించియుండురీతిని ఆతనివృత్తులుకూడా జ్ఞానప్రాంతమున పూర్తిగా స్వతం
త్రముగ నలుదిశల విహరించును. వాసనావృత్తి ఒకచోట స్థిరపడిపోవును. ప్ర
వృత్తులు ముందుకుసాగక నిలచిపోవును. మరియు మనస్సు విషయభోగముల
పట్ల విరక్తికలది యగును. ఇటుల చెప్పుటలో గల భావము, సత్త్వగుణము
వృద్ధిపొందినప్పుడు మానవునిలో యీలక్షణములన్నియు స్పష్టముగ కాన్పిం
చసాగును. ఇట్టిస్థితిలో ఒకవేళ ఆతనికిమరణము సంభవించుచో ఆతనికి మంచి
రోజులువచ్చినప్పుడు, మరియు యింటియందు మంచి పిండివంటలు చేసినప్పుడు
మరియు స్వర్గమునుంచి యిష్టమైన అతిథి వచ్చినప్పుడు పొందెడి ఆనందమును
బోలిన ఆనంద యోగమాతనికి ప్రాప్తించును. ఇంటియందున్న సంపదను
అనుసరించి అంతరంగికవృత్తికూడా ఉదారముగను, ధైర్యముగను వున్నచో
పరలోకసాధనముతో పాటు ఇహలోక సాధనముకూడ ఏల కారాదు ?
ఓఅర్జునా! యిట్టి పురుషుని పోల్చి చెప్పదగిన వస్తువేదియు లేదు. ఈరీతిని సత్త్వ
గుణ సంపన్నుడుగానున్న వానికి మరింకేస్థితి సంభవించును? దీనికి గల కార
ణము జీవాత్మ చరమసీమకు చేరిన శుద్ధసత్త్వమును వెంటగొని, యీ భోగ
సాధకమగు దేహమనెడి గూడును విడచి బయటకు పోయినప్పుడు
మరియు యీవిధమగు సత్త్వసంపన్నస్థితిలో ఆకస్మికముగ శరీరమును
విడచిపెట్టినప్పుడది కేవలము సత్త్వమూర్తియే యగును. మరియు
ముందు ముందు అది జ్ఞానులగువారిలో జన్మించును. ఓ అర్జునా! రాజు తన
సంపదనంతను వెంటదీసికొని ఏదైన పర్వతముపైకి వెళ్ళె ననుకొనుము. అట్టి

స్థితిలో ఆతని గొప్పదనమున కేవిధమైన కొరతయైన సంభవించునా? లేదా, ఓ అర్జునా! ఒక గ్రామమందలి దీపమును తీసి మరొక గ్రామమున నుంచితి మనుకొనుము. అయినప్పటికిని అది దీపముగాగాక మరొకటిగా మార్పుచెందుట ఎచటనైనా గలదా? ఇదే విధమున, ఆ శుద్ధసత్త్వము వలన జ్ఞానము విలక్షణమగు వృద్ధినిపొందును. మరియు బుద్ధి వివేకమనెడి సాగరమున యీదులాడసాగును. అటుపైని, మహదాది తత్త్వముల నన్నింటిని గురించి యథాసాంగముగ వివేచన మొనర్చి అంతమున ఆత్మస్వరూపమున కలసి సమరసమును పొందిన జీవుడు, ముప్పదియారు తత్త్వములకు అతీతమైనట్టి ముప్పది యేడవతత్త్వ (పదమూడవ అధ్యాయ ప్రారంభమున చూడుము) మగు ఆ శుద్ధ బ్రహ్మమును పొందును, లేదా సాంఖ్యమునందు చెప్పబడిన యిరువదినాల్గు తత్త్వములకును అతీతమైన యిరువదియైదవ తత్త్వమేదియో, ఏది గుణ-త్రియ, దేహ-త్రియ అవస్థాత్రియాదులన్నింటికి పైన గలదియు మరియు నాల్గవదియు, మరియు ఏది శుద్ధసత్త్వమో, ఆ సర్వోత్తమ సత్త్వబలము నాధారముగ గొని ఆత డీ ప్రపంచమున సాటిలేని శరీరమును పొందును. ఈరీతిని తమస్సు మరియు సత్త్వము - లనెడి యీ రెండు గుణములను అణచివైచి రజోగుణము బలిష్ఠురాలైనప్పుడు ఆతడు తన కార్యక్రమము వలన యీ శరీరమనెడి గ్రామమున ఉపద్రవమును కలిగించును. ఆసమయమున మానవునియందుండెడి లక్షణములను తెలిపెదను. వినుము, తుఫాను ప్రారంభమైన పిమ్మట పెక్కువస్తువులను ఏకత్రిత మొనర్చి ఆకసమునం దెగురగొట్టు విధమున రజోగుణము ప్రబలముగా నున్నప్పుడు విషయభోగముల ననుభవించుటకై యింద్రియములకు పూర్తిగా స్వేచ్ఛ నిచ్చును. పరస్త్రీని కాముక దృష్టితో చూచుటను ఆతడు నీతి విరుద్ధముగ నెంచడు. మరియు మేకనోటివలె ఆతడు తన యింద్రియములను నిర్బంధము లేకుండా నలువైపుల చరింపనిచ్చును. ఏదోవిధమున ఆతని చేజిక్కని వస్తువుమాత్రమే తప్పించుకొనుటకు

వీలగునంత మిక్కుటమగు విషయ లాలసత్వ మాతనికి వుండును. ఓ అర్జునా ! ఆతనికి తలా-తోక లేని ఏ పనితోచిన ఆ పని చెయ్యక విడచిపెట్టనిరీతిని ఆతని ప్రవృత్తి వుండును. ఒక్కొక్కప్పుడు ఏదైన గొప్ప భవనము కట్టించవలెనని గాని, దేవాలయము కట్టించవలెనని గాని లేదా అశ్వమేధ యాగము చేయవలెననిగాని ఆతనికి సంకల్పము కలుగుచుండును. ఇంతేనాడు. ఏదైనా నగరమును కట్టించవలెనని, నూతులు చెరువులు మొదలగునవి త్రవ్వించవలెనని లేదా అనేక రకములగు పెద్ద పెద్ద తోటలు వేయించవలెనని కూడా ఆతడు తలపోయుచుండును. ఆత డీరీతిని చాల గొప్ప గొప్ప పనులను ప్రారంభించును, మరియు ఆతని పారలౌకికము మరియు ఐహిక సుఖలాలసత్వ మెన్నటికిని పూర్తి కాదు. ఆతని అంతఃకరణమునం దున్న అపారము మరియు ప్రచండమూనగు శాశ్వతమగు సుఖాభిలాష ముందు మహాసాగరముయొక్క అపారమగు వ్యాప్తియూ లోతున్నూ సాటిరావు. మరియు అగ్నికిగల దహనశక్తికూడ దాని మహత్వమునకు సాటికాదు. ఆతని మనస్సునకు ముఖ్యముందు భోగలాలసత్వము ఆశకు వశీభూతమై నిరంతరము పెరుగుచుండును మరియు ఆభోగలాలసత్వము షోకుగా పెరుగుచూ జగత్తు నంతయు తన పాదములక్రింద త్రొక్కివేయును. ఈ రీతిని మానవునియందు రజోగుణము అధికమైనప్పుడు పైన చెప్పిన విషయము లన్నియు ఆ మనుష్యునందు సహజముగ కాన్పించును. మరియు, యిట్టి గడబిడలో దేహపాతము జరుగుచో, యీ గడబిడల నన్నింటిని వెంటగొని మరియొక శరీరమున ప్రవేశించును. కాని ఆతనికి మనుష్యయోనియే ప్రాప్తించును. ఒక బిచ్చగాడు అన్ని విధములగు సౌఖ్యములను మరియు వైభవములతో కూడియున్నవాడై ఏదైన రాజభవనమున కూర్చున్నంత మాత్రమున ఆతడెన్నడైన రాజు కాగలడా? ఎద్దుకు ఆహారముగా చొప్పయే కావలెను. అది ఎంతగొప్పవానియింట పెండ్లికి వెళ్ళినప్పటికిని దానికి యింతకంటె ఎక్కువగా ఏమిలభించును? కావున అట్టి

వాడు రాత్రింబవళ్ళైడతెగకుండా క్షణము సేపైనా తీరికలేక ప్రాపంచిక వ్యవహారముల నొనర్చుచుండువారి పంక్తియందే కూర్చుండబెట్ట బడును. అనగా రజోగుణవృత్తులలో మగ్నుడైయున్న సమయమున మరణించినవ్యక్తి మరల కర్మఠులందే జన్మించును. ఇదేవిధమున రజస్సు మరియు సత్త్వములను రెంటినీ అణచివైచి తమోగుణము బలవంతురాలైనప్పు డీదిగువ చెప్పబడిన లక్షణములు కాన్పించును. ఈ తమోగుణమువలన సూర్యుడుగాని చంద్రుడు గాని వుండనట్టి అమావాస్య రాత్రియందలి ఆకాశమువలె మనస్సుండును. ఆ అమావాస్యరాత్రి యందలి ఆకాశమువలెనే ఆతని అంతఃకరణముకూడా శూన్యము నిశ్చేతనము మరియు ఉదాసీనముగా నుండును. అట్టిస్థితిలో ఆతని మనస్సునందు యోచించుటకు తావే వుండదు. ఆతనిబుద్ధియొక్క మృదుత్వము కఠోరత్వమున పాషాణము కూడ దానితో సాటిగానంత మిక్కుటముగ నాశ మొందును. ఆతని స్మరణశక్తి సంపూర్తిగా భ్రష్టమగును. అనాలోచన ఆతని శరీరమునకు లోపలను బయటను ప్రబల వేగముతో నిండియుండును. ఆ జీవుడు నిరంతరము ఒక్క మూర్ఖత్వమునే వ్యాపార మొనర్చుచుం డును. సదాచారోల్లంఘన మెల్లప్పుడు మూర్తిత్వమును దాల్చి ఆతని యింద్రి యములయందు నిలచియుండును. మరియు యిందువలన ఆతనికి మరణముతో సమానమగు యాతనలు ప్రాప్తించినప్పటికిని ఆతడు తన అనాచారములతో నిండియున్న ఘాతుక కృత్యములనే నిరంతరము చేయుచూ వుండును. ఇందు మరొక వింతయైన సంగతి కలదు. గుడ్లగూబకు అంధకారమున మాత్రమే కాన్పించు రీతిని ఆ తామస జీవునకు సదా దుష్కార్యము లొనర్చుటయందే అత్యధికమగు ఆనందము లభించును. ఇదే విధమున, ఏదైన ఫలానా పని నిషిద్ధమైనదని ఆతనితో చెప్పుచో, ఆపనినే చేయవలె ననెడి ప్రబల మగు వాంఛ ఆతని మనస్సున జనించును. మరియు ఆ వాంఛతో పాటుగా ఆతని యింద్రియములు కూడ ఆపనిని చేయుటకై పరుగు లిడును. ఇట్టి జీవుడు మద్యమును త్రాగకున్నప్పటికిని మద్యపాన మొనర్చిన

వారివలెనే వదరుచుండును. శరీరమున వాయువేగము లేకున్నప్పటికిని వాగుచుండును. మరియు హృదయమున ప్రేమ లేకున్నప్పటికిని ఉన్మాదుల వలె మోహమున చిక్కుకొని యుండును. అతని చిత్తము ఒక హద్దులో వుండదు. పోనీ, ఉన్మనీస్థితిలో వుండునా యనిన ఆవిధముగనూ వుండదు. ఈరీతిని ఆతడెల్లప్పుడు మాదక మోహముచే ఆక్రాంతుడై యుండును. అనగా, తమోగుణము తన పరివార సహితముగ బలవత్తరముగా నున్నప్పుడు యీ లక్షణములన్నిటిని ప్రబలముగ కాన్పింప జేయును. మరియు, అట్టిస్థితిలో ఆ మనుష్యునకు మృత్యుదేవత పిలుపు వచ్చుచో, తన శిరముపై యీ తమోగుణ భారమును గైకొనియే యీ శరీరమునుండి బయలుదేరును. ఆవాలు తన విశిష్టగుణము, మరియు స్వరూపమును తన బీజమునందుంచుకొని స్వయముగ ఎండి మరణించును. కాని, ఆబీజము మరల మొలకరించినప్పు డది, ఆవ మొక్కగాతప్పమరే మొక్కగానూ మొలవదుగదా ! దీపజ్యోతిని వెలిగించెడి అగ్ని, ఆదీపము ఆరిపోయినప్పు డేమగును? అది వెలిగించిన దీపజ్యోతి వెలుగుచున్నంతవరకు ఆమూలాగ్ని యొక్క స్వరూప మంతయు ఆ జ్యోతి యందే యుండును. ఇదేమాదిరిగా జీవుడు తన సంకల్పములను తమోగుణపు మూటలో కట్టి తన నెత్తిపై పెట్టుకొని యీ శరీరమును విడచిపోయినప్పుడు మరల ఆతనికి తామసశరీరమే ప్రాప్తించును. తమోగుణము వృద్ధిగా నున్నప్పుడు మరణించిన మనుష్యుడు పశు-పక్షులు లేదా క్రిమి - కీటక యోనులలోనికి పోవును.

కర్మణ స్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్ ॥౧౬॥

“కావుననే శ్రుతులు ‘సత్త్వగుణమువలన కలిగిన పనులు పుణ్య కార్యము’లని చెప్పుచున్నవి. మరియు ఆ నిర్మలసత్త్వమువలన సహజముగ లభించు అపూర్వఫలములగు సుఖము మరియు జ్ఞానములను సాత్త్విక

ఫలములని పలుకుచున్నది. రజోగుణకృత్యము అనగా దానివలన కలిగెడి ఫలమును ఇంద్రాయణఫలము వంటిదిగా నెరుంగవలెను; ఏలనన్న, ఆఫలము ఇంద్రాయణ (పాపర) ఫలమువలె బయటకు చూచుటకు సుందరమగు సుఖములతో కూడియున్నదిగా కాన్పించును, కాని అంతమున ఆ ఇంద్రాయణఫలమువలెనే కటువైన దుఃఖములతో కూడియున్నదగును. లేదా, వేపపండు బయటకు చూచుటకు చక్కగా నుండును. కాని లోపలచూచినచో విషవంతము మరియు చేదుగానూ వుండును. ఇదేరీతిని రాజసకార్యములవల్ల కలుగుఫలములు కూడ పైకి చూచుటకు మంచివిగా నుండును, కాని లోపలచూచిన చాల చెడ్డవి. విషపుచెట్టుయొక్క ఫలములు కూడ విషవంతములుగానే వుండురీతిని, తామసకర్మము లొనర్చుటచే కలుగు ఫలము అజ్ఞానమే యగును.

సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ ।
ప్రమాద మోహౌ తమసో భవతోఽజ్ఞానమేనచ॥ ౧౭

కావున, సోదరుడవగు అర్జునా! పగటికి కారకుడు సూర్యుడైనటుల, జ్ఞానమునకు కారణము సత్త్వగుణమైయున్నది. ఇదే విధమున ఆత్మస్వరూపమును మరచిపోవుటచే ద్వైతము జనించు విధమున రజోగుణముచే లోభము జనించును. మరియు సువిజ్ఞుడవగు ఓ అర్జునా! మోహము, అజ్ఞానము మరియు ప్రమాదము మొదలుగాగల పెక్కు దోషములు ఏకత్రితముగ కాన్పించుటకు గల కారణము తమోగుణమే యగును. అరచేత నుంచిన ఉసిరికాయ స్పష్టముగ కాన్పించురీతిని యీ త్రిగుణముల యొక్క లక్షణములనూ నీకు స్పష్టముగ చెప్పితిని. అందుచే అదికూడ నీకు అరచేతబెట్టిన ఉసిరికాయవలె స్పష్టముగ కాన్పించును. రజస్సు మరియు తమస్సులను కేవలము సత్త్వగుణమే పతన మొనర్చగలదు. సత్త్వముతప్ప మరే గుణమున్న జీవాత్మను జ్ఞానమువైపుకు గొనిపోజాలదు. కావున కొందరు

తమ సర్వస్వమును పరిత్యజించి నాల్గవభక్తి యగు సన్యాస భక్తిని స్వీకరించు రీతిని చెప్పుచుండె లోకులు జీవిత మంతటను కేవలము సాత్త్వికవృత్తిని కలిగి యుండుట యనెడి వ్రతాచరణమునే యొనర్తురు.

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః।
జఘన్యగుణ వృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః ॥౧౮॥

“అర్జునా, కేవలము సాత్త్వికవృత్తితోనే తమ వ్యవహారముల నన్నింటిని నడపువారు మరణానంతరము స్వర్గమునకు ప్రభువు లగుదురు. రజోగుణమునందే జీవించి అందే మరణించువారు, మరణానంతరము యీ మర్త్య లోకమునందే మనుష్య యోనిలో జన్మింతురు. వారు యీ లోకమున ఒకే పళ్లెమున సుఖదుఃఖము లనెడి పులగమును తిందురు, మరియు వారి మార్గమున బాధాకరముగా నుండెడి మృత్యు వెన్నడును తన ప్రదేశమునుండి తొలగదు. అనగా, వారిసుఖము లెల్లప్పుడు దుఃఖ మిశ్రితములై యుండును, మరియు వారెన్నడును మృత్యువునుండి కాపాడబడజాలరు— ఎల్లప్పుడు జన్మించుచు మరణించుచుందురు. తమోగుణమునందే పెరిగి తమోగుణావస్థయందే మరణించినవారు, తామసస్థితిని పొందుదురు మరియు వారి కెల్లప్పుడును నరకభూమియందు దుండు పట్టాయే లభించును – వారు నరకమునుండి ఎన్నడును ముక్తులుకారు. ఓ అర్జునా, యీరీతిని బ్రహ్మయొక్క సామర్థ్యమువలన జనించి, వృద్ధిపొందు యీత్రిగుణస్వరూపము మరియు వాని శక్తులను నీకుస్పష్టీకరించి తెలిపితిని. వాస్తవికదృష్టితో చూచినచో, బ్రహ్మ స్వరూపమునం దెన్నడును ఏవిధమగు భేదమూ వుండదు; కాని ఆ బ్రహ్మయే స్వయముగ భిన్నభిన్న సమయములం దీ గుణ లక్షణముల ననుసరించి పనులు చేయును. ఒకానొక పురుషుడు స్వప్నమున రాజుగా నైనప్పుడు, ఎవరో మరొకరాజు తనపై దాడివెడలినట్లునూ, అంతతానువిజయము పొందినటులో లేక అపజయము పొందినటులో కలలో గాంచును, అట్టి స్థితిలో

ఆ పురుషుడే ఆ రాజ్య విజయపరాజయములవలన వచ్చు సుఖదుఃఖముల ననుభవించును. ఇదే విధమున యీ గుణములకు నేను చెప్పిన ఉత్తమ, మధ్యమ, అధమము లనెడి త్రివిధవృత్తి భేదములూ కేవలము పైకి కాన్పించునవిమాత్రమే అయియున్నవి. వాస్తవముగ చూచినచో ఆ బ్రహ్మ యీ భేద దృష్టులకు పూర్తిగా భిన్నమైనవాడూ, అచంచలుడూ మరియు శుద్ధుడూనై యున్నాడు,

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి !
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥౧౯॥

"నీవా ఒక్కబ్రహ్మముతప్ప మరేదియులేదని దృఢముగా నెరుంగుము. ఇంతకు పూర్వము చెప్పిన విషయమునే మరొకమారు నీకు చెప్పెదను వినుము. ఈ త్రిగుణములు యీ దేహమును నిమిత్తముగా నొనర్చుకొనియే తమ తమ సామర్థ్యమును చూపించునను సంగతిని నీవు జ్ఞప్తియందుంచుకొనుము. అగ్ని కట్టెలయొక్క రూపమును ధరించురీతిని, లేదా భూమిలోపల నుండెడి రసము వృక్షరూపమున కాన్పించురీతిని, లేదా పాలు పెరుగు రూపముగ మారు విధమున లేదా మాధుర్యము చెఱకును నిమిత్తముగ చేసికొని ఆ చెరకు రూపమున ప్రకటమగు విధమున యీత్రిగుణములుకూడ అంతఃకరణముతో కూడియున్నవై యీ శరీరరూపమును ధరించును. మరియు, యిందువలననే అవి బంధనమునకు కారణమైయున్నవి. ఓ అర్జునా, యిందొక అతి విచిత్రమగు సంగతి గలదు, యీ త్రిగుణములకు శరీరముతోగల ఘనిష్ఠ సంబంధమువలన జీవాత్మకు గల సహజ స్వతంత్రమునందు నామమాత్రమునకైన ఎన్నడును కొరతరాదు. ఈ త్రిగుణములు తమ తమ ధర్మముల ననుసరించి శరీరమున సంచితము మరియు క్రియమాణ కర్మముల నొనర్చుచుండును. కాని వాటి వలన నిర్గుణ ఆత్మ తత్త్వమునం దేవిధమగు న్యూనతయురానేరదు. ఈగుణముల నెఱిచిక్క

వున్నప్పటికిని జీవాత్మకు సహజముగ నెట్టుల ముక్తి లభించగలదో వివరించెదను. వినుము. నీవు జ్ఞానమనెడి కమలమున రమణ మొనర్చు రసిక భృంగమవు. నీకు యింతకు పూర్వము (పదమూడవ అధ్యాయ ప్రారంభమున. గుణముల మధ్యనున్నప్పటికిని చైతన్యతత్త్వమెన్నడును గుణము సమానముగ కాదనెడి రహస్యమును చెప్పియున్నాను. ఇదే యిచ్చటకూడ అన్వయించును. కాన ఓ అర్జునా! జీవునకు ఆత్మబోధ కలిగినప్పుడే సంగతిని తెలిసికొన సాగును. మేల్కొనిన పిమ్మట స్వప్నము యొక్క మిథ్యాత్వము బోధపడురీతిని లేదా మనము ఒడ్డున శాంతముగ కూర్చొని యున్నప్పుడు, జలతరంగములందు యిటునటు ఊగుచూ కనిపించునట్టిది మన శరీరము కాదనిన్నీ, అది మన శరీరముయొక్క ప్రతిబింబమేననిన్నీ తెలియురీతిని, లేదా అభినయకళలో అతినిపుణుడైనప్పటికికూడ నటుడు తన్నుతానెన్నడు మోసగించుకొన దనిన్నీ మరియు తానే వ్యక్తిని గురించి అభినయించుచున్నాడో ఆవ్యక్తి తాను కానని పూర్తిగా తెలిసికొని యుండు రీతిని, జీవాత్మకూడ తన్నుతాను యీ త్రిగుణములకు దూరముగా నుండి చూచుకొను చుండుట ఉచితధర్మమైయున్నది. ఆకాశము భిన్న భిన్నములగు ఋతువులను మూడింటిని ఒప్పుకొనును, కాని, తానుతన స్వరూపము నందెన్నడును ఏవిధమగు భిన్నత్వమును రానివ్వని రీతిని, యీ త్రిగుణములందుండికూడ వాటికి భిన్నముగ నుండెడి ఆ స్వయంసిద్ధమగు ఆత్మతత్త్వమెల్లప్పుడును 'అహం బ్రహ్మాఽస్మి' యనెడి మూలపీఠముపై ఆరూఢమైయుండును. ఆ మూలపీఠముపైనుంచి చూచుచు ఆ ఆత్మతత్త్వమీరీతిని పలుకును. "నేను కేవలము సాక్షిని, నేనెద్దియూ చేయను, ఈ గుణములే యీ కర్మవ్యూహమును రచించును." సత్త్వము, రజస్సు మరియు తమస్సులకుగల భిన్నభిన్న లక్షణముల వలన కర్మవ్యాపకత్వము వృద్ధిపొందుచూ వుండును. మరియు యీ కర్మకాండ అంతయూ యీ గుణముల వికారమే. గుణములు మరియు కర్మల మిశ్రణమున నేనెటు

లున్నాను ? సరిగా యిదేవిధమున, వనమున కాన్పించు వనశోభకంతకు మూలకారణము వసంతమైనటుల, లేదా నక్షత్రములు ముందుగా కాంతి విహీన మైనవిగా కాన్పించినపిమ్మట అదృశ్యమై పోవురీతిని, లేదా సూర్య కాంతమణి ప్రజ్వరిల్లురీతిని, లేదా కమలము పుష్పించు రీతిని, లేదా అంధ కారము నాశమొందురీతిని, లేదా సూర్యోదయమైన పిమ్మట ఆ సూర్యో దయముతోపాటు పైనిచెప్పిన వానిని పోలిన ఎన్నోకార్యములు జరుగు చుండు రీతిని,— సూర్యోదయముతో పాటుగా జరిగెడి యీ కార్యము లన్నియు ఎన్నడును సూర్యుని అంగములు కానిరీతిని, నేనుకూడ నా సామ ర్థ్యమువలన సమస్తవిధములగు కర్మలకు కారకుడ నైనప్పటికిని ఎల్లప్పుడు అకర్తగనే వుందును. మరియు నాయందీకర్మలేపము కలుగదు. నేను ప్రకట మగుటవలననే గుణములు ప్రకటమగును. మరియు వాటికి నేనే సామర్థ్యమును కలుగజేతును; ఈ గుణములు నిశ్శేషముగ నైనప్పుడు మిగిలి యుండు తత్త్వ మేదిగలదో,ఆనిర్గుణ శాశ్వతతత్త్వము నేనే అయియున్నాను. ఓ అర్జునా! యీవిధమగు వివేకబుద్ధితో వృద్ధిపొందు పురుషుడు పరమగతిని పొందె, గుణముల కావల గల ప్రదేశమును చేరును.

గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్ ।
జన్మ మృత్యు జరా దుఃఖై ర్విముక్తోఽ మృతమశ్నుతే॥ ౨౦

“ఈ గుణముల నన్నింటి నతిక్రమించిన పురుషుడు ఆ స్వతంత్ర తత్త్వమును పూర్తిగా నెరుంగును. ఏలనన అతనిపై జ్ఞానముద్ర చక్కగా పడును. ఓ అర్జునా! సారాంశ మేమన,నది సముద్రమున కలసి దానితోపాటు ఏకత్వమును చెందురీతిని యిట్టి జ్ఞానికూడ నాతో ఏకమై సారూప్యమును పొందును. నళికాయంత్ర భ్రమణమునుండి విముక్తి పొందిన రామచిలుక స్వతంత్రురాలై వృక్షశాఖపై కూర్చొనురీతిని జ్ఞానియగు జీవుడుకూడా మాయనుండి విముక్తిపొంది ‘అహంబ్రహ్మాఽస్మి’ యనెడి మూల-అహం

తత్త్వస్థితుడగును. మరియు ఓ అర్జునా! ఇందుకుగల కారణము ఇప్పటివరకు అజ్ఞాన నిద్రయందుండి గుర్రులు పెట్టుచున్న ఆతడే, యిప్పు డాత్మస్వరూప బోధ ప్రాప్తినిపొంది మేల్కొనును. ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా, బుద్ధిభేదమును కలుగజేయు మోహమనెడి అద్దమాతని చేతినుండి క్రిందికి జారి పడినప్పు డాతనికి ప్రతిబింబపు ఆభాస వుండనే వుండ నేరదు. దేహాభిమానమనెడి గాలి దెబ్బ లాగిపోయినప్పుడు అలలు మరియు సముద్రమును పోలినజీవుడు మరియు శివుడనెడి యిద్దరును కలసి ఏకరూపు లగుదురు. ఇందువలననే, వర్ష ఋతువు చివర మేఘములు ఆకాశమున లీనమగు రీతిని జీవాత్మకూడ బ్రహ్మ తత్త్వమునందు లీనమై తద్రూపుడగును. మరియు, యీతీరున బ్రహ్మభావము ప్రాప్తించిన పిదప, ఆతడు దేహాంతమువరకు యీ శరీరమునందే వున్నప్పటి కిని శరీరమునుండి జనించెడి గుణములనెడి చిక్కులో ఆతడెన్నడును పడడు. గాజు లేదా అభ్రకపు ఆచ్ఛాదనమువలన దీపప్రకాశమెన్నడును అడ్డగింప బడజాలని రీతిని, లేక సముద్రజలము వలన బడబాగ్ని చల్లారిపోని రీతిని గుణసంచారము వలన జీవబోధ ఎన్నడును మలినము కాజాలదు. ఆకాశము నందలి చంద్రుడు జలమునందు ప్రతిబింబించి నప్పటికిని సదా జల ముతో లిప్తుడు కాకుండా వుండురీతిని, ఆతడు దేహమునం దున్నవాడుగా కాన్పించిన కాన్పించుగాక, ఆతనికి దేహధర్మము లంటవు. త్రిగుణములు తమ తమ సామర్థ్యము వలన శరీరమనెడి కపటరూపమును కల్పించి ఆతనిని ఆడించును, కాని జ్ఞానియగు పురుషుడు వాటిని చూచుటకై పొరబాటున నైన కూడ తన అహం బ్రహ్మాస్మి భావమును క్షణము సేపైనకూడ తననుండి వేరు కానివ్వడు. ఆతని అంతఃకరణమున ఆత్మస్వరూపమును గురించి గల అత్యధిక దృఢనిశ్చయము వలన మన మీ శరీరమునందుండి యీ పనులు చేయుచున్నాము, లేదు ' అనెడి భావమే కలుగదు. పాము తన కుబుసము విడచి ఒక్కమారు తన పుట్టలో ప్రవేశించి నప్పుడిక అది తన కుబుసమును గురించి ఎప్పుడు జ్ఞాపకము చేసికొనును ? ఇచ్చటకూడ అదే విధముగ జరు

గును. లేదా, సుగంధిత కమలము వికసించినప్పుడు దాని సుగంధమంతయు ఆకాశమున కలసి లీనమైపోవును, మరియు ఆ సుగంధము మరల తిరిగివచ్చి ఎన్నడును ఆ కమలకోశములోనికి రాదు. ఇదేవిధమున, బ్రహ్మసారూప్యము ప్రాప్తించినప్పుడు 'ఈ శరీరమెద్ది? దానిధర్మములెవ్వి?' యనెడి తలంపే వుండదు. ఇందువలననే, శరీరమునకుగల జననము, జరామరణము లాదిగాగల షడ్గుణములు శరీరమునందే యుండును. మరియు జ్ఞానియగు జీవునితో వాటి సంపర్కమే వుండదు. కుండ బ్రద్దలై చిన్న చిన్న ముక్కలుగా మార్పు పొందినప్పుడు ఘటాకాశము తనంతతానే తత్కాలముననే మహదాకాశమున సమ్మిళితమై, దానిరూపమునేపొందును. ఈవిధముగనే, దేహాభిమానము లోపించి, తన ఆత్మస్వరూప స్మరణము కలిగినప్పుడు ఆ ఆత్మస్వరూపముతప్ప మరింకేమి మిగిలియుండును? ఈఅతి శ్రేష్ఠమగు ఆత్మబోధతో కూడి యున్నవాడై ఈశరీరమునందు నివసించువానినే నేను గుణాతీతుడని చెప్పుచున్నాను." మేఘములు గర్జించి తనను పిలిచినప్పుడు మయూరము ఆనందమును పొందురీతిని, యీ మాటలను భగవానుని వలన విని అర్జునుడు ఆనందమును పొందినవాడాయెను.

అర్జున ఉవాచ—

**కైర్లింగైస్త్రీన్ గుణానేతానతీతో భవతి ప్రభో!**
**కిమాచారః కథం చైతాంస్త్రీన్ గుణానతివర్తతే ॥౨౧॥**

ఈ విధముగా సంతోషమునుపొంది అర్జును డిటుల అడిగెను. "ఓ భగవానుడా! ఈ విధమగు ఆత్మబోధ కలిగినవాని లక్షణము లెటు లుండును? ఆతడు తన వృత్తి నెటుల నిర్గుణముగ నుంచును? ఆతడు గుణబంధమునుండి ఎటుల తప్పించుకొనును? ఓ కృపానిధీ! నాకీవిషయములు తెలియజెప్పుము" షడ్గుణైశ్వర్య సంపన్నుడగు శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు కలిగిన యీ సందేహముల కీరీతిని సమాధాన మిచ్చెను. "ఓ అర్జునా

నీకీ సందేహములు కలిగినందుకు నాకు చాల ఆశ్చర్యము కలుగుచున్నది. నీవు గుణాతీతుని ఆచరణమును గురించి అడుగుచున్నావు. ఆచారవంతుని గుణాతీతుడని చెప్పుట అనుచితముకాదా ? గుణాతీతుడని చెప్పదగినవాడు గుణక్షేత్రములోని కెన్నడును పోనేపోడు. లేదా ఒకవేళ, ఆతడు గుణక్షేత్రమున ఏమైన పనులను చేసినప్పటికిని ఆతడా గుణములం దెన్నడును చిక్కుకొనడు. బహుశః, నీ మనస్సుకు కలిగిన సందేహము, గుణములు తమ తమ వ్యాపారములను చేసికొనుచున్నప్పటికిని, ఆ గుణముల మధ్యనే ఉండి సమస్తములగు కర్మముల నొనర్చుచూ వున్నప్పటికిని, ఆతడా గుణముల చేతుల చిక్కుకొనడో ? అని నీ సంశయమై యుండవచ్చును. ఈ ప్రశ్నను నీవు సంతోషముగా నడుగవచ్చును. దీనికి జవాబు చెప్పెదను వినుము.

శ్రీ భగవానువాచ:—

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ !
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి॥ ౨౨

"రజోగుణ ప్రభావమువలన శరీరమున కర్మాంకురములు ఉద్భవించును. మరియు జీవుడు ప్రవృత్తులచే ముట్టడింపబడినవాడగును. ఆ స్థితిలో కేవలము నే నే కర్మల నొనర్చు చున్నాననెడి అభిమాన మెవనిని తాకనైన తాకదో, లేదా తన కర్మలు నిష్ఫలము లైనప్పటికిని ఎవనికి ఏ దుఃఖమూ కలుగదో, లేదా సత్త్వగుణాధిక్యతవలన యింద్రియము లన్నింటియందును జ్ఞానతేజము ప్రసరించినప్పుడు విద్యాభిమానముచేగాని సంతోషముచేగాని ఎవడు ఆనందమును పొందడో, లేదా తమోగుణము వృద్ధిచెందినప్పుడుకూడ ఎవడు మోహమున చిక్కుకొనక, మనస్సునందు అజ్ఞాన ఖేదమును బొందడో, ఎవడు మోహము కలిగినప్పుడు జ్ఞానమునకై ఉత్కంఠితుడుకాడో, జ్ఞానము కలిగినప్పుడు కర్మపరిత్యాగము

చేయ్యడో, మరియు తనచేత కర్మలు జరిగినప్పటికిని దుఃఖించడో, అదే విధమున సూర్యుడు ప్రాతఃకాల మధ్యాహ్న సాయంకాల భేదములను ఒనర్చు రీతిని ఎవ డీ గుణముల భేదమును తనపై కలుగనివ్వడో అట్టి పురుషునియందు జ్ఞానోత్పత్తి యొనర్చుటకు యితరుని జ్ఞానప్రకాశముతో అవసర మేమిగలదు ? సముద్రమును నింపుటకు వర్షఋతువు కావలెనా ? లేదా, ఆతడు కర్మాచరణ మొనర్చినప్పటికినీ కర్మకర్తృత్వ మాతనికి అంటుకొనునా ? ఓ అర్జునా! హిమాలయ మెన్నడైన చలిచే వణకునేమో నీవే చెప్పుము ? మోహ విషయము ప్రాప్తించినప్పు డాతడు జ్ఞానము నెన్నడైన పరిత్యజించగలడా ? గ్రీష్మము ఎంత ఎక్కువగ ఉగ్రముగను తీవ్రముగను నుండిన నుండుగాక, అది ఎన్నడైన అగ్నిని కాల్చగలుగునా ?

ఉదాసీనవదాసీనో, గుణైర్యో న విచాల్యతే
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే॥ ౨౩

“ఇదే రీతిని, యీ గుణముల పనులుకూడ తమంత తామే జరుగుచుండును మరియు అవి ఆత్మ సత్తాత్మకమై యున్నవి. కావున నీ వాగుణ విశ్లేషణ మొనర్చుట యనెడి చిక్కులో పడబోకుము. ఆతనికి యీ విధమగు పూర్ణజ్ఞానము కలిగియుండుటచే నత డీ శరీరమును యాత్రికుడు ప్రయాణ సమయమున ఏదైన ధర్మశాలలో కొద్ది సేపటివరకు బసచేయు రీతిని ఆశ్రియించుకొని యుండును. యుద్ధ భూమికి జయాపజయములతో ఏ విధమగు సంబంధము లేనటుల, ఆతఁడు కూడ లాభనష్టముల కేవిధమునను భాగస్వామి కాడు. అతడు గుణములతోనూ కలియడు, కర్తృత్వమునూ అంగీకరించడు. శరీరమునం దుండెడి ప్రాణము, లేదా పరుని యింటికి అతిథిగా వెళ్ళివుండెడి బ్రాహ్మణుడు, లేదా నాల్గువీధుల కూడలివద్ద పాతబడిన స్తంభము తమ చుట్టుప్రక్కల, మరియు నలువైపుల జరుగుచుండెడి విషయములపట్ల పూర్తిగా ఉదాసీనముగా నుండురీతిని, జ్ఞానికూడా తన శరీరమునందు

పూర్తిగా ఉదాసీనభావముతో నుండును. మరియు, ఓ అర్జునా! మృగజల తరంగములవలన మేరుపర్వతము విచలితముకాని రీతిని గుణములు యిచ్ఛానుసారముగా జరుపుచుండు ఉపద్రవములవలన జ్ఞానియగువాడుకూడ విచలితుడుకాడు. గాలిదెబ్బలవలన ఆకాశ మెన్నడును ఎగురగొట్ట బడజాలదు. అంధకారముతో సూర్యుడెన్నడును మరుగుపరుప బడజాలడు. స్వప్న మెన్నడును మేల్కొనియున్న మనుష్యుని మోసగించలేదు. ఇదేవిధమున జ్ఞానియగు పురుషునికూడా గుణములెన్నడును బంధింపలేవు. అత డెన్నడును గుణముల చేజిక్కడు; కాని, ఆతడు దూరమునుండి తటస్థుడుగానుండి వాటివైపు చూచినప్పుడు, 'నాటక గృహమందలి దర్శకుడు తటస్థుడై యుండి కొయ్యబొమ్మల నృత్యమును చూచురీతిని' ఆగుణములను అవలోకించును. సత్త్వ మెల్లప్పుడు శుద్ధకర్మములందును, రజస్సెల్లప్పుడు విషయ సంబంధమగు కర్మములందును, తమస్సెల్లప్పుడు మోహము మరియు అజ్ఞానాదులందును విహరించుచుండును; గుణము లీరీతిని ఆత్మతత్త్వ సామర్థ్యము వలననే విహరించుచుండు నను సంగతిని నీవు చక్కగా తెలిసికొనియుండుము. దీనికి ఉదాహరణము, సూర్యుడు లోకులందలి వ్యాపార వ్యవహారములను సంచాలన మొనర్చు చున్నప్పటికిని వాటినన్నిటి నాతడు పూర్తిగా తటస్థుడై యుండి చూచుచుండును. లేదా చంద్రోదయ మైనప్పుడు సముద్రమున పోటువచ్చును. చంద్రకాంతమణి ద్రవించసాగును. మరియు కుముదములు వికసించును కాని, చంద్రుడు వీటి అన్నింటికి భిన్నుడై నిర్లిప్తుడై యుండును. వాయువు బాగా తీవ్రముగ వీచుగాక, లేక శాంత భావముతో చాల నెమ్మదిగ వీచుగాక, ఆకాశముమాత్ర మెల్లప్పుడు అవిచలముగను అవికృతముగనే వుండును. ఇదేరీతిని గుణసంసర్గమువలన జ్ఞానియగు పురుషు డెన్నడును విచలితుడుకాడు. ఓఅర్జునా! గుణాతీతుని యీలక్షణము లన్నింటి వల్లను గుర్తించవలెను. ఇక ఆతని ఆచరణ మెటుల యుండునో చెప్పెదను వినుము.

సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాఞ్చనః ।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిన్దాత్మసంస్తుతిః ॥ ౨౪

"ఓ అర్జునా! వస్త్రమునకు లోపలను బయటను నూలుపోగులు తప్ప మరేదియు వుండనిరీతిని, జ్ఞానియగు పురుషుడుకూడ ఈ స్థావర జంగమ జగత్తు ఆత్మతత్త్వమేగాని మరేదియూ కాదని చూచును. పరమేశ్వరుడు తన వైరులకూ మరియు భక్తులకు కూడ ఒకే విధమగు పరమగతి నిచ్చు విధమున జ్ఞానియగు పురుషుడుకూడ సుఖదుఃఖములను రెంటినీ సమానముగనే తలంచును. వాస్తవిక దృష్టితో చూచినచో మత్స్యము జలమున విహరించు చందముననే జీవుడీ శరీరమున విహరించునన్నప్పు డాతనికిసుఖదుఃఖములు రెండునూ సహజముగనే అనుభవించవలెను. కాని జ్ఞానియగు పురుషుడు సుఖదుఃఖముల నన్నింటిని పూర్తిగా విడచివైచి యుండుటవల్ల ఎల్లప్పు డాత్మస్వరూపమున నిమగ్నుడై యుండును. పొలమునందు పంట తయారైనప్పుడు కంకులలో గింజలునిండియుండి బయటకు రా సాగురీతిని లేదా నది తన ప్రవాహమును విడచి సముద్రమున కలసిపోయినప్పుడు దాని పరవళ్ళు త్రొక్కుటయంతయు తగ్గిపోవురీతిని, మనుష్యుడు ఆత్మస్వరూపమున రమించ సాగినప్పుడు ఆతనికి శరీరసుఖదుఃఖములు తోచనే తోచవు. మరియు అవియన్నియు ఆతనికి సమానముగనే తోచును. స్తంభమునకు రాత్రింబవళ్ళు రెండునూ సమానముగనే తోచురీతిని, ఆత్మస్వరూపమున రమించువారికిశారీరకసుఖదుఃఖములుహాని-లాములు మొదలుగాగల ద్వంద్వము లన్నియు ఒకేవిధమున నుండును. లోతైన నదిలో నిద్రించియుండు మానవునకు సర్పస్పర్శకూడ ఊర్వశివంటి ఏ అప్సరసయొక్క అంగస్పర్శవంటిదిగనో వుండును. ఇదే విధమున, ఆత్మస్వరూపమున మగ్నుడైయుండు పురుషునకు శారీరక - ద్వంద్వములు కూడ సమానముగనే వుండును. కావుననే, యిట్టి పురుషుని దృష్టిలో బంగారము మరియు పేడ, లేదా వజ్రము మరియు రాయి - వీటి భేద మేమియూ నుండదు.

స్వర్గసుఖములు తమంతతాము ఆతని యింటివద్దకు వచ్చుగాక, పులి వచ్చి ఆతనిపై పడుగాక - ఆతని బ్రహ్మైక్యస్థితియందు దించుకయు అంతరము రాదు. నరికి చంపి వేయబడిన వ్యక్తి మరల ఎన్నడును లేచిరాడు; వేయించబడిన గింజ మొలకరించదు - ఇదే విధముగా, ఆతనికిగల వృత్తి - సమత్వమునందు కూడ ఎన్నటును భంగము రాదు. ఎవరైన ఆతనిని 'బ్రహ్మ' యని గొప్పగా పొగడిన పొగడుగాక, 'నీచు' డని అత్యధికముగ నిందించిన నిందించుగాక. ఆతడు బూడిదరాశివలె మండనూ మండడు. ఆరిపోనూ ఆరిపోడు. సూర్యునియింట ఎన్నడును చీకటియే వుండనట్లుల, మరియు దీపమే వెలిగించబడనటుల, జ్ఞానియగు పురుషునకు నిందాస్తుతు లేమాత్రమును లెక్కలోనికి రావు.

మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే ॥ 25

"ఎవరైనా ఆతనిని 'ఈశ్వరు'డని పూజించుగాక,'దొంగ'యని నిందించుగాక, ఎడ్లు మరియు ఏనుగుల చాలలలో నుండునుగాక, రాజుగా చేయునుగాక, ఆతనివద్దకు ఆతని మిత్రులువచ్చి కలియుదురుగాక, పెక్కురు శత్రువులు వచ్చి నలువైపుల ముట్టడింతురుగాక - ఏది జరిగినప్పటికిని ఆతని మనస్సు 'సూర్యతేజమునకు రాత్రియనిగాని, ప్రాతఃకాలమనిగాని వుండనిరీతిని' యీ విషమత్వములవల్ల ఎన్నడును మాలిన్యము పొందదు; లేదా వసంతాది ఋతువులు ఆరున్నూ వచ్చినను పోయినను ఆకాశమెల్లప్పుడు నిర్లిప్తముగనే వుండురీతిని, ఆతనిమనస్సుకూడ యీ సుఖ దుఃఖములచే మలినతను పొందకుండావుండును ఈతని ఆచరణలో మరొకలక్షణముకూడ కాన్పించును. ఆతనికి తా నొక పనిని చేయుచున్నా ననెడి భావమే ఎన్నడును తట్టదు. ఆతడు కర్మల నన్నింటిని తొలగించి దూరముగ విసరి పారవైచును. మరియు ప్రవృత్తియొక్క మూలమునే పెకలించివేయును. ఆతని కర్మఫలము

అన్నియు దగ్ధమై బూడిదగ నగును. ఏలనన, అతడు తన జ్ఞానము వలన అగ్ని సమానముగ నగును. అతని మనస్సునం దేవిధమగు ఐహికమునకుగాని పారలౌకికమునకు గాని సంబంధించిన వాంఛయే జనించదు; యిందుచే, అతనికి సహజ (స్వాభావిక) ముగ ఏది లభించిన, దానినే అతడు ఉదాసీనుడై అంగీకరించును. అతడు సుఖము వలన సుఖియూ కాడు, దుఃఖము వలన దుఃఖియూ కాడు. అతని మనస్సు పాషాణమును పోలియుండును, మరియు అది అన్నివిధములగు సంకల్ప - వికల్పములనూ విడచిపైచి యుండును. ఎవనియం దీవిధమగు ఆచారము కాన్పించునో, అతనినే గుణాతీతునిగ నెరుంగవలెను." అటుపైన శ్రీకృష్ణభగవాను లిటుల యనిరి—— "ఇక ఏ ఉపాయముల వలన గుణాతీతుడు కాగలుగునో చెప్పెదను వినుము.

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥౨౬॥

"ఓ అర్జునా! ఎవడు అవ్యభిచారి భావముతోను, మరియు భక్తియోగముచేతను నన్ను సేవించునో, ఆతడే యీ గుణము లన్నింటిని దగ్ధమొనర్చ గలుగును. ఇక యిందు చెప్పబడిన 'నేను' ఎవరో, 'నాభక్తి' యన నేమియో, 'అవ్యభిచారి భావము'న నేమియో చెప్పవలసి యున్నది. ఓ అర్జునా! నీకు నేను చెప్పున దేమన, రత్న ప్రకాశమున్నూ, రత్నమున్నూ ఒక్కటియే యగురీతిని, యీ విశ్వమునందు 'నేను' న్నాను. లేదా పాతాళమునకు అర్థము నీరు, అవకాశమునకు అర్థము ఆకాశము, మాధుర్యమునకు అర్థము చక్కెర, లేదా జ్వాలకు అర్థము అగ్ని, లేదా దళమునకు అర్థము కమలము, కొమ్మలూ ఫలములు మొదలగు వాని అర్థము వృక్షము, హిమరాశియొక్క అర్థము హిమాలయము, తోడుకొనిన పాలయొక్క అర్థము పెరుగూ అగు రీతిని, యీ విశ్వముయొక్క అర్థముకూడ 'నేనే' యగుదును. అనగా 'నేనే' యీ విశ్వము నగుదును. చంద్రస్వరూపమును గురించి తెలిపి

కొనుటకై చంద్రబింబమును చీల్చనక్కరలేనటుల, లేదా పేరుకొనిన నేతిని వెచ్చపెట్టి కరుగపెట్టక పోయినప్పటికిని అది నెయ్యిగనే యగురీతిని, లేదా కంకణమును కరుగపెట్టక పోయినప్పటికిని అది బంగారమే యగు రీతిని, లేదా బట్టనుండి దారము విప్పకపోయినప్పటికిని అది దారపుపోగుల సమూహమే యగు రీతిని, కుండను బద్దలుకొట్టి నప్పటికిని అది సదా మట్టితో ఏర్పడి నట్టిదే యగు విధమున యీ విశ్వమంతయూ కూడా 'నేనే' అయి యున్నాను. కావుననే ముందుగా 'యీ విశ్వభావనను నాశమొనర్చిన పిమ్మట నేను లభింతునని యనుట సరియైనదికాదు;' ఏలనన, ఈ సమస్తమూ 'నేనే'. ఈ విధమైన జ్ఞానమును కలిగి యుండుట నా 'అవ్యభిచారభక్తి' యగును. ఇట్టి జ్ఞానమునం దేమాత్రము కొరతగల్గినను అది 'వ్యభిచారమే' యగును. కావుననే, సమస్తములగు భేదభావములను విడనాడి సంపూర్ణమైన ఏకాగ్ర మనస్సుతో తన సహితముగ నన్నెఱుంగవలెను; ఓ అర్జునా! బంగారపుగెంజను బంగారముపైన పెట్టినప్పుడు దానియం దేవిధమగు భిన్నత్వము కలుగనేరదు. ఇదే విధమున జగత్తును తనకు భిన్నమైనదిగ అంగీకరించుట తగదు. తేజస్సునుండి బయల్వెడలి మరల తేజస్సునందే లీనమగు తేజోభాగమును 'కిరణ' మందురు. ఆత్మస్వరూపము కూడ యీ కిరణములవంటిదే. పృథ్వీతలమున సూక్ష్మకణము లుండు రీతిని లేదా హిమాలయమున హిమకణములు వుండురీతిని నాయందు 'అహం' వున్నది. నీ వీ సంగతిని చక్కగా జ్ఞప్తియం దుంచుకొనుము. 'అల' ఎంత చిన్నదైనప్పటికిని అది సముద్రమునకు భిన్నమైనట్టిది కాదు, ఇదే రీతిగా, "నేనుకూడ ఈశ్వరునకు భిన్నమైనట్టిదికాదు. ఈ విధమగు ఏకత్వభావనతో" కూడియున్న దృష్టియొక్క ఆనంద పూర్ణవృత్తినే నేను భక్తియందును. ఈ పరిఫుల్లిత దృష్టియే సమస్తజ్ఞానసారమూ యోగసర్వస్వమూ నై యున్నది. సాగరమూ మరియు మేఘములకు మధ్యను అఖండ ధారావృష్టి కలుగుటవలన అవిరెండునూ ఒకటిగా కాన్పించురీతిని, ఓ అర్జునా! ఈ ఉల్లాసపూర్ణదృష్టి

కూడవుండును. నూతిముఖము, లేక పైభాగము మరియు ఆకాశమునం దేవిధమగు అతుకూ వుండదు. అయినప్పటికిని అవి రెండును ఒకటిగా కలిపియుండును. ఇదేవిధమున, జ్ఞానియగునట్టి పురుషుడుకూడ ఏవిధమగు అతుకుయూ లేకుండానే ఆ పరమ పురుషునితో కలిసియుండును. ప్రతిబింబమునుండి మొదలుకొని బింబమువరకు సరళరూపమున ప్రతిభ వ్యాపించియుండు రీతిని యీ 'సోఽహం' వృత్తి ఒక్కమారు ఏర్పడినప్పుడు మానవు డావృత్తి సహితముగ తనంతతానే పరమాత్మతత్త్వమున విలీనుడైపోవును. ఉప్పుగల్లు ఒక్కమారు సముద్రమునపడి కరగిపోయినతరువాత దాని 'కరిగిపోవుట' అంతమొందురీతిని, లేదా ఓ అర్జునా. తృణమును కాల్చివైచిన పిమ్మట ఆ అగ్ని కూడ తన. తతానే చల్లారిపోవురీతిని, ఒకపర్యాయము జ్ఞానమువలన భేదబుద్ధి నశించినప్పు డిక ఆ జ్ఞానముకూడ మిగిలియుండదు. అంతట 'నేను' 'పరుడను, లేక, ఆవల నున్నాను' అనెడి కల్పనకూడ నశించును. మరియు భక్తు డీవల లేక యిచ్చట నున్నాడనెడి భావముకూడ నశించును. మరియు యీ రెంటికీ గల మూలశాశ్వత ఏకత్వము మాత్రమే అప్పుడు మిగిలి యుండును. ఓ అర్జునా! యీ రీతిని బ్రహ్మైక్యాలింగనము కలిగినప్పుడు యిక గుణములను జయించుట యను మాటయే మిగిలియుండదు. సర్వజ్ఞుడవగు అర్జునా, ఈ స్థితినే 'బ్రహ్మత్వ' మందురు. మరియు యీ బ్రహ్మత్వమే నా భక్తులకు లభించును. ఈ ప్రపంచమున, యీ విధమగు భక్తుని 'పతివ్రతాస్త్రీవలె' యీ బ్రాహ్మీస్థితి సేవించును. నదులలో వేగముగ ప్రవహించు నీటికి సముద్రముతప్ప మ రేఉపయోగకరమైన ప్రదేశమూ లేనటుల, జ్ఞానపూర్ణదృష్టితో నన్ను సేవించువాడు బ్రహ్మత్వస్థితిచే సుశోభిల్లకుండా వుండనేరడు. ఈ బ్రహ్మత్వము నే 'సాయుజ్య' మందురు. మరియు దీనినే చతుర్థపురుషార్థమగు మోక్షమందురు. నన్ను సేవించుటే బ్రహ్మత్వమును పొందదగు సాధనమన్ని యెరుంగుము; ఇంతమాత్రమున నేను సాధనా మాత్రుడనని తలంచబోకుము.

నీ మనస్సున బ్రహ్మ ఎన్నడును 'నాకు' భిన్నుడు కాడు-అనుభావము జనించ వలెనను తలంపుతో నీకు నేను చెప్పుచున్నాను.

బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ ॥ ౨౭॥

"ఓ అర్జునా 'బ్రహ్మ'కు అర్థము 'నేను', మరి యీ విధమగు శబ్దము లన్నింటి అభిప్రాయము నేనే యగును. మర్మజ్ఞుడవగు అర్జునా, చంద్రుడూ ఆతని మండలమూ యివి రెండునూ భిన్నభిన్న పదార్థములు కాని విధమున, 'నేను' మరియు బ్రహ్మమునందణుమాత్రమైన భేదములేదు. ఏ వస్తువు శాశ్వతము, అచలము, స్పష్టము, ధర్మస్వరూపము, ఆనందమయము, అపారము మరియు ఏక మేవాద్వితీయమో, కోరికల నన్నింటిని విడచి వివేకము ఏ పదమును పొందునో, మరియు ఏది జ్ఞానమునకు పరమసీమయో అదంతయు నేనే. భక్త పక్షపాతియూ, భక్తులకు సాయపడునట్టివాడును నగు శ్రీకృష్ణ భగవాను లీకీతిని అర్జునునకు చెప్పుచుండిరి. ఇది విని ధృతరాష్ట్ర మహారాజిటు లనెను— "ఓ సంజయా! యీ సంగతు లన్నిటిని నిన్నెవరును అడుగలేదు. అట్టి స్థితిలో యీ నిరర్థక విషయముల నన్నింటి నేల చెప్పుచుంటివి ? నా మనస్సునందీసమయమున గల చింతను ముందుగా నీవు తొలగించుము. ముందుగా నాకు నా దుర్యోధనుని విజయ వార్తలను వినుపించుము." ఈ మాటలను విని సంజయుడు తన మనమునందిటు లనుకొనెను - "జయమును గురించిన వార్తల నటుండ నిమ్ము" ధృతరాష్ట్రుడు చెప్పిన యీ మాటలు సంజయునకు మనస్సునందత్యాశ్చర్యమును కలిగించెను. ఆతడు తన మనస్సులో— 'అయ్యో' ఈతని మనస్సునందు భగవానునిపట్ల ఎంత ద్వేషము గలదు. అయినను, కృపాళుడగు ఆ భగవాను డీతనిని అనుగ్రహించుగాక, యీతడు వివేకమనెడి ఔషధపాన మొనర్చి మోహమనెడి మహారోగమును నివారణ

మొనర్చుకొనుగాక ” యని అనుకొనెను. ఆతని కీరయోచన స్ఫురించినప్పుడు శ్రీ కృష్ణార్జునుల సంభాషణమునందలి సంగతులను జ్ఞప్తికి తెచ్చుకొనుటలో ఆతని అంతఃకరణమున విలక్షణమగు ఆనందోద్రేకము కలిగెను. అందుచే, ఆతడింకనూ, పెంపొందుచున్న ఉత్సాహముతో శ్రీకృష్ణుని సంభాషణమును వివరించును. ఆ సంభాషణముయొక్క భావార్థమును మీకు నచ్చునటుల చెప్పుటకై ప్రయత్నింతును. ఓ శ్రోతలారా! శ్రీ నివృత్తి నాథదాసుడగు యీ జ్ఞానదేవుడు ‘మీరిటుల శ్రద్ధయుంచుడ’ని ప్రార్థించు చున్నాడు.

---

# తెలుగు జ్ఞానేశ్వరి

## పదునైదవ అధ్యాయము.

---

నా హృదయమును పీటగా నొనర్చి దానిపై నా గురుదేవుని చరణముల నుంచుదు. సమస్త యింద్రియముల, ఇంచుక వికసించిన పుష్పములను ఐక్యభావముతో నా అంజలిలో నింపి, యీ పుష్పాంజలిని అర్ఘ్యరూపమున నేను నా గురుదేవున కర్పింతును. అనన్యభక్తిరసముచే శుద్ధతను పొందిన ఆ ఏకనిష్ఠవాసనను చందనముగ భావించి, దానిని శ్రీ గురుదేవునకు అఖండ తిలకముగ ధరింపజేతును. నిర్మల ప్రేమయనెడి శుద్ధబంగారు కాలియందెలను నేను గురుదేవుని సుకుమార పాదములకు తొడగెదను. అవ్యభిచార భావముచే శుద్ధమునైన దృఢము మరియు ప్రబలమూ నగు ప్రేమను మట్టెలుగ నొనర్చి నా గురుదేవుని పాదాంగుళీయకముల ధరింపజేతును. ఆనంద సుగంధముచే సుగంధితమైన అష్టసాత్త్వికభావములనెడి వికసించిన అష్టదళ కమలమును ఆయనపై ధరింపజేతును. ఇంక నేనాయన ఎదుట, అహంకార మనెడి ధూపమును వెలిగించి, ఆ గురుచరణముల ముందు 'సోఽహం' అనెడి దీపముతో హారతి నిత్తును. మరియు సమరసభావముతో నిరంతర మాయనను ఆలింగన మొనర్తును. నేను నాశరీరము మరియు ప్రాణములను రెంటిని పావుకోళ్ళుగా చేసి నాగురుదేవుని పాదములక్రింద నుంతును. మరియు భోగ – మోక్షములనెడి దిష్టి తీసెదను. నాగురుదేవుని చరణసేవ చేయుటవలన, సమస్తపురుషార్థముల అధికారమూ నా కా గురుసేవయందే లభించుగాక. ఇందువలన బ్రహ్మైక్య మనెడి విశ్రాంతినిలయముపరకు

నాజ్ఞానతేజము సహజముగను, సూటిగను చేరుగాక; అందువలన నా వాక్కునకు అమృతసముద్రపు మాధుర్యము సిద్ధించుగాక. ఆసమయమున, నా వివేచనమందలి ప్రతి అక్షరమునకును 'ఆ వక్తృత్వము ముందు కోట్లకొలది పూర్ణచంద్రులు కూడ సాటిరానంత మాధుర్యము లభించుగాక. తూర్పు దిక్కున సూర్యు డుదయించిన పిమ్మట జగత్తున కంతకు ప్రకాశ సామ్రాజ్యము నర్పించు రీతిని, యీ వాక్కు కూడా శ్రోతల సమూహమునకు దీపావళిని బోలిన ప్రకాశమును చూపుగాక. ఏ సౌభాగ్యమువలన 'వేదములుకూడ అతి నిమ్నకోటికి చెందినవిగను, మరియు కైవల్య తత్త్వముకూడ వాటికి సరిరానట్టివన్న' శబ్దములు నోట వెలువడునో, ఏ సౌభాగ్యమువలన వాణీలత 'తన శ్రవణసుఖమండపము క్రింద విశ్వమున కంతకు అఖండ వసంత శోభానుభవమును కలిగించురీతిని కళకళ లాడసాగునో, ఏ సౌభాగ్యమువలన పరమాత్మ యొక్క జాడ తెలియ నందువలన మనస్సుతోపాటు వాక్కుకూడ నిరాశతో తిరిగి రావలసివచ్చు నట్టి స్థితిలో, 'ఆ పరమాత్మయే శబ్దములకుకూడ గోచరమగునట్టి' చమత్కారము కాన్పించునో, ఏ సౌభాగ్యమువలన సాధారణముగ జ్ఞానమునకుకూడ అగమ్యము, ధ్యానమునకుకూడ అసాధ్యమునగు ఇంద్రియాతీత బ్రహ్మ తత్త్వము శబ్దములద్వారా వర్ణింప నలవియగునో, అట్టి పరమ సౌభాగ్యమే శ్రీ గురుదేవుని పాదపద్మధూళియందలి ఒక రేణువు లభించినంత మాత్రముననే వాణికి సిద్ధించును. ఇక యింతకు మించి నేనేమి చెప్పను ? ఈ గురుప్రేమతో సాటివచ్చు ప్రేమ ఒక్క మాతృప్రేమలో తప్ప మరెచ్చటను ప్రాప్తించ నేరదని జ్ఞానదేవుడ నగు నేను స్పష్టముగ చెప్పుచున్నాను, ఏలనన నేను చాల చిన్నబాలుని బోలిన వాడను. మరియు గురుదేవులు ఒకే కుమారుడుగల తల్లివంటివాడు. అందుచే వారి కృపాప్రవాహము ఏకమార్గియై సదా సమానరూపమున నా వైపుకు ప్రవహించుచుండును. ఓ శ్రోతలారా! మేఘములు తమ జలసంపద నంతను

ఘాతకముల కొరకు విస్మరించిపోయితిని శ్రీగురుదేవులుకూడ నాపైతమ
కరుణనువర్షింపజేసిరి. దీని పరిణామముచే నేను వ్యర్థప్రలాపములుపలుకనారం
భించి నప్పుడు ఆ వ్యర్థప్రలాపములనుంచికూడ మధురమగు గీతారహస్యము
వెలువడెను. అస్పృష్టము బాగున్నచో, ఇనుకరేణువుకూడా రత్నమగును.
మరియు, ఆయువంకము పూర్తికాకున్నచో, చంపనున్న వ్యక్తికూడా దయా
ప్రేమ కలవాడగును. జగదీశ్వరుడు తన మనమునందెవడి పొట్టనైన నింప
దలచినప్పుడు, మొసరు నీళ్ళలో కంకరరాళ్ళు వేసినప్పటికిని అవి అమృత
సమానమగు మధురమైన బియ్యమే యగును. ఇదే రీతిని, శ్రీ గురుదేవులు
కూడా కృపాపూర్వకముగ అంగీకరించుచో, యీ జగత్తంతయు మోక్ష
మయమైపోవును. చూడుడు, ఆ జగద్వందనీయుడు, పురాణపురుషుడునగు
నారాయణుని అవతారమగు శ్రీకృష్ణదేవుడా పాండవుల కేకొరంతయైనయున్న
దైనరానిచ్చెనా? ఇదే విధమున శ్రీనివృత్తినాథ మహారాజులు నా అజ్ఞానమును
కూడ జ్ఞానముతో సమానముగ నొనర్చెను. మాటల సందర్భమున నా ప్రేమ
అత్యధికముగ పొంగులు వారినది. కాని వాస్తవముగచూచినచో, గురుదేవుని
మహాత్మ్యమును యథార్థముగ వర్ణించగల జ్ఞానమెవరికి గలదు? నేను నా గురు
దేవుని ప్రసాదమువలననే మహాత్ములగు మీ పాదములచెంత గీతార్థమును
సమర్పించ దలంచితిని. ఇంతకుముందే పదునాల్గవఅధ్యాయము పూర్తి
యైనది. కాని అంతమున కైవల్యధామమగు శ్రీకృష్ణులు స్వర్గసంప
దకు యింద్రుడు అధిపతియైనటుల ముక్తికి జ్ఞానియగు పురుషుడు అధికారి
యని సెలవిచ్చియున్నారు లేదా, వందలకొలది జన్మములవరకు ఎవడుబ్రహ్మ
కర్మ నొనర్చుచుండునో ఆతడే అంతమున బ్రహ్మయగును. అంతేగాని మరొ
కడు బ్రహ్మ కాజాలడు. సూర్యప్రకాశమును కనులు గలవాడే అనుభవించ
గలుగును. కనులు లేనివాడు అనుభవించలేడు. అదేవిధమున మోక్షముయొక్క
పరమానందముకూడ కేవలము జ్ఞానభాగములోనికే వచ్చును. ఈ జ్ఞానమును
పొందుటకు ఎవడు అర్హుడాయని భగవానులు యోచించగానే వారికి కేవల

యొక్కడే యోగ్యుడుగ కాన్పించెను. కనులయందు దివ్యాంజనము రాచుకొ
నినపిమ్మట భూగర్భమునగల గుప్తధనము స్పష్టముగ కాన్పించసాగును. కాని
దానితోపాటు ఆగుప్తధనమును చూచుటకై పాదబలమున తలక్రిందులుగా
జన్మించిన ఒక మనుష్యుడుకూడా కావలెను. ఇదే విధమున జ్ఞానము
వలన నిస్సందేహముగ మోక్షము సిద్ధించుటకూడ వాస్తవమే.
కాని జ్ఞానముగల మనస్సు అత్యంత శుద్ధమైనదియునై యుండవలెను. అందు
పైని భగవానులు మిక్కుటముగ యోచించి 'విరక్తిలేని జ్ఞాన మెన్నడును
స్థిరముగ నుండజాలదని సిద్ధాంతీకరించి చెప్పిరి. అటుపిమ్మట భగవానులు
'మనస్సుకు పూర్తియగు విరక్తి ఎటుల లభించునో' యోచించి చెప్పిరి.
భోజనము చేయువానికి, 'విషముకలిపి భోజనము తయారుచేయబడినదని
తెలియుచో, ఆతఁ డాభోజనపళ్ళెమును ప్రక్కకు నెట్టి అచ్చటినుంచి లేచి
పోవును. ఇదేమాదిరిగ, 'ఈ జగత్తు అ - శాశ్వతము మరియు నశ్వరము' అని
మనసున దృఢముగ నాటినప్పుడు, ఎవడైన విరక్తిని తన వద్దనుండి నెట్టివేయ
దలచినను తనంతతానే ఆతనిని వెంటాడును. ఈ పదునైదవ యధ్యాయమున
శ్రీకృష్ణభగవానులు, ఒక వృక్షరూపకముద్వారా, యీ జగత్తుయొక్క
అనిత్యతి ఎట్టిదో చెప్పుచున్నారు. ఏదైన చెట్టును వేర్లసహితముగ
పెకలించి ఆ చెట్టును తలక్రిందులుగా నుంచినచో, అది ఎండిపోవును.
కాని యీ సంసారవృక్ష మిట్టిది కాదు. ఈ రీతిని ఒక రూపక శైలను
వర్ణనే భగవానులు యీ సంసారముయొక్క అవాగమనమును అంతమొనర్చు
చున్నారు. ఈ పదునైదవ యధ్యాయము యీ సంసారముయొక్క నిరర్థక
త్వము సిద్ధించి స్వస్వరూప అహంబ్రహ్మస్మిస్థితి స్థాయీరూపమును పొంది
దృఢపడవలెనను తలంపుతో చెప్పబడినది. నేనిక ఈ గూఢరహస్యమును
జాగరూకతతో చెప్పెదను. మీరుకూడ సావధాన మనస్కులరై వినుడు.
పరమానంద సముద్రమున పోటునుకలిగించు పూర్ణచంద్రుడగుభగవానులగు
శ్రీ కృష్ణ ద్వారకాధీశు లీ విధమున చెప్పసాగిరి. "సోదరా అర్జునా !

నాస్వరూపప్రాప్తి మార్గమునగల అడ్డంకుయగు విశ్వభ్రమమ అనిశ్చమగనే తలంచరాదు. ఈసంసారమొక పరిచండ వృక్షము. కానిసామాన్యవృక్షములవలె యీ చెట్టుయొక్క మొదలుక్రిందనూ కొమ్మలుపైననూ లేవు. ఇందుచేయిది సాధారణముగ ఎవనికిని బోధపడదు. ఏదైన చెట్టుమొదలుకు నిప్పంటుకొనుటో, లేక గొడ్డలితో నరకుటో చేసినప్పుడు చెట్టుయొక్క పైనున్న భాగమెంత మిక్కుటముగ నున్నప్పటికిని మొదలుతో సహా పెకలివేయబడుటవలన ఆచెట్టు సహజముగ నేకూలిపోవును. కాని యీ సంసారవృక్షము యీ రీతిని సహజముగ కూల్చుటకు వీలుకానిది. ఓ అర్జునా! యీ సంసారవృక్షము క్రిందిపైపుకు విస్తరించుకొనుచు పోవును. యిది అతినింతయైనదీ, అద్భుతమైనదినీ అయియున్నది. సూర్యుడు చాలఎత్తున ఉండును, అతని కిరణజాలము క్రిందికి వ్యాపించియుండురీతిని యీ సంసారవృక్షముకూడ అతి చమత్కారరూపమున ఎడతెగక క్రిందిపైపునకే విస్తరించుకొని పోవుచుండును. ప్రళయకాలమందలి నీరు ఆకాశమునంతను వ్యాప్తమొనర్చు రీతిని యీ సంసారవృక్షము యీజగత్తునందలి మూలమూలల నింపివేయును. లేదా, సూర్యుడు అస్తమించిన పిమ్మటరాత్రి అంధకారముచే నిండియుండు రీతిని, ఆకాశమంతయూ సంసారవృక్షముచే దట్టముగ నిండియుండి, పూర్తిగా వ్యాపించియున్నది. ఈ సంసారవృక్షమునందు తినుటకు ఏఫలమూ వుండదు. వాసన చూచుటకు ఏ పుష్పా వుండదు.

ఓ అర్జునా ! ఇది కేవల వృక్షమే. దీని మొదలు పైపైపునందున్నది. ఇది పెకలించి తలక్రిందులుగా నుంచిన వృక్షమూత్రము కానందువలన, యీరీతిని తలక్రిందులుగా నున్నప్పటికిని ఎల్లప్పుడు బాగా కళకళలాడుచునేయుండును. ఇందువలననే దీనిని ఊర్ధ్వమూలమని యందురు. ఇది యిట్టిదైనప్పటికిని క్రింది పైపుకూడ దీనికి అసంఖ్యాకములుగ మొదళ్ళు గలవు. నలుపైపుల వెలువడెడి పల్లవముల బలముచే, మర్రిచెట్టు, రావిచెట్టు వలె దీనికికూడ బీజములు, పల్లవములనుండి క్రొత్త క్రొత్త కొమ్మలు బయలు

దేరును. మరియు ఓ అర్జునా ! యీ సంసార వృక్షమునంకు కేవలము క్రింది వైపునందే కొమ్మలు వుండునటుట లేదు. పై వైపున కూడ అపారముగ కొమ్మలుండును. దీనిని చూచుటచే, ఆకారమే పల్లవించినదా, లేక వాయువు వృక్షాకారమును దాల్చినదా, లేక ఉత్పత్తి స్థితి లయములు అనెడి త్రివిధావస్థలూ యీ ఆకారమును దాల్చినవా- యన్నటుల వుండును. ఈరీతిని యీ విశ్వమనెడి ప్రచండమగు ఊర్ధ్వ మూలము గల వృక్ష మేర్పడినది. ఇక యీ 'ఊర్ధ్వము' యొక్క అర్థమేమి? దీని మొదళ్ళకు గల లక్షణములెట్టివి, యిది ఏల అధోముఖము గలిగియున్నది? దీని శాఖ లేటుల వుండును, క్రిందివైపున గల యీ వృక్షశాఖలెట్టివి, దీని యందు పైవైపు గల శాఖలస్వరూప మెట్టిది, దీనికి అశ్వత్థమని ఏల పేరు పెట్టబడినది—మొదలగు ప్రశ్నల నిర్ణయము ఆత్మశ్రేష్ఠు లొనర్చిరి. ఇక నీకీవిషయములు చక్కగా బోధపడునటుల తెలిపెదను. భాగ్యశాలివగు అర్జునా ఈ యధ్యాయము నీవంటివారు వినదగినది; హృదయమును సర్వ మొనర్చి ప్రతి అవయవమునకు శ్రవణశక్తి వచ్చినదా - యన్నరీతిని ఏకాగ్రచిత్తముతో సావధానుడవై వినుము. " యాదవ శ్రేష్ఠుడగు శ్రీకృష్ణభగవానుడీరీతిని ప్రేమరసపూర్ణుడై యీ మాటలను చెప్పినప్పుడర్జునుడు మూర్తీభవించిన జాగరూకతయే యున్నటుల వుండెను. అప్పుడర్జునుని శ్రవణవాంఛ ఆకాశ మండలి దశదిశలను గాఢాలింగన మొనర్చుకొన గోరుచున్నదా యన్నంత అత్యధికముగ నయ్యెను. ఇందువలననే భగవానుని నిరూపణము అతని కత్యల్పముగ తోచసాగెను. శ్రీకృష్ణునిమాట సముద్రమువలె అనంతమూ అపారమూ అయినప్పటికిని, యీ అర్జునుడొక నూతన అగస్త్య ఋషి రూపమున జనించెను. ఇందుచేనాతడు భగవానుని వచన సాగరమునంతను ఒకే గుక్కలో పాన మొనర్చదలంచెను. ఆసమయమున అర్జునుని హృద యోత్కంఠత చెప్పరానంత అధికముగ వృద్ధిపొందెను.

శ్రీ భగవానువాచ :—

ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ ౧

అంత భగవానుడిట్లనియె — "ఓ అర్జునా! ఆ బ్రహ్మమే యీ వృక్షమునకు ఊర్ధ్వము; యీ వృక్షసంబంధము వలననే ఆతనికి ఊర్ధ్వత్వము అనగా ఉచ్చత్వము ప్రాప్తించినది. వాస్తవిక దృష్టితో చూచినచో ఏకరూపుడు, అద్వైతుడు, కైవల్య తత్త్వమునై యున్నందున ఎవనియందు ఊర్ధ్వ, మధ్య, అధమ (పైభాగము మధ్యభాగము క్రిందిభాగము) ములనెడి భేదమే కలుగుటకు వీలులేదో, ఎవడు ఎన్నడును చెవులకు వినుటకు వీలుకాని నాదమో, ఎవడు ఘ్రాణేంద్రియ మెన్నడును అనుభవించనలవి కాని మకరంద సుగంధమో, ఎవడు విషయసేవన మొనర్చకనే ప్రాప్తించెడి ఆనందమో, ఎవడు తనకు యీవలిఒడ్డు మరియు ఆవలిఒడ్డునూ తనకు ముందునూ వెనుకయూ కూడ తానే అయియున్నాడో, ఎవడు అదృశ్యుడైయుండి చూడనివారికి మాత్రమే కానిపించునో, ఎవడు ఉపాధి సంబంధమువలన మాత్రమే నానా రూపాత్మక విశ్వమువలె కనబడునో, ఎవడు జ్ఞాత, మరియు జ్ఞాన వస్తువు లేకుండానే జ్ఞానమో, ఎవడు పరిపూర్ణ సుఖముచే నిండియున్న వాడైనప్పటికిని శూన్యగుణ ఆకాశమే అయియున్నాడో, ఎవడు కార్యము మరియు కారణము కూడా కాడో, ఎవడు అద్వైతము మరియు ద్వైతమూ కూడ కానివాడో, ఎవడు కేవలము స్వయముగనే మరియు ఆత్మస్వరూపముగనే వుండునో, అట్టి అద్వితీయ తత్త్వమే యీ సంసారరూప వృక్షమునకు ఊర్ధ్వము. ఊర్ధ్వభాగమునగల మొదలు వం దేరీతిని అంకురము వెలువడెనో చెప్పెదను వినుము. వంధ్యాపుత్రుని వర్ణించిన రీతిని దేనిని వ్యర్థముగనే మాయయని చెప్పుదురో, ఏది 'సత్' 'అసత్' కూడా కాదో, ఏది యోచింపనలవి కానిదో, అన్నియునై యుండికూడా దేనిని అనాది యందురో, ఏది భేదభావమునకు నిలయమో, ఆకాశమునందు మేఘములు వుండురీతిని దేనియందీ నానాలోకములు వసించునో, ఏది సమస్త సాకార

వస్తురూపియగు వస్త్రముయొక్క నిజమగు కుదురో, ఏది సంసారవృక్షము యొక్క మూత్మ్మ బీజమో, ప్రపంచమునకు జన్మభూమియూ మరియు మిథ్యాజ్ఞానమూ నయి యున్నదో, అట్టిమాయ ఆ నిర్గుణ బ్రహ్మమునందు "లేనే లేదన్నటుల" వసించును: అయినప్పటికిని అది చేసెడి వ్యవహార మంతయూ ఆ బ్రహ్మ తేజోప్రభావమువలననే చేయును. మనకు నిద్రవచ్చి నప్పుడు మనను మనమే స్వయముగ జ్ఞానశూన్యులనుగ నొనర్చుకొను రీతిని, లేదా దీపము దీపపుకొడిని సృష్టించి తన కాంతిని తానే తగ్గించుకొను రీతిని లేదా స్వప్నమునం దొకపురుషుడు నిద్రించియున్న యువతిమేల్కొనినటుల చూచి, వాస్తవమునకు ఆలింగనము చేసికొన కున్నప్పటికిని ఆయువతి తన్ను ఆలింగన మొనర్చుకొనినదని కల్పన మొనర్చుకొని కామవికారముచే క్షోభితుడగు రీతిని, ఓ అర్జునా! ఆ నిర్గుణ బ్రహ్మమందు జనించిన ఏమాయ గలదో, మరియు ఏది తన మూలస్వరూపమును గురించిన ఏవిస్మృతి కలిగినదో అదియే యీ సంసారవృక్షమునకు ప్రథమమూలము. తన వాస్తవిక స్వరూపమును గురించి మూలవస్తువునకు కలిగిన విస్మృతియే యీ వృక్షమునకు నిడివియందుండు ప్రధానస్కంధము; మరియు దీనినే వేదాంతమున 'బీజభావము' అందురు. పూర్ణఅజ్ఞానమయము మరియు సుషుప్త్యవస్థనే బీజాంకుర భావమందురు. ఇవిగాక గల స్వప్నము మరియు జాగ్రదవస్థలను ఆ సుషుప్తియొక్క భావములందురు. ఇందునుగురించి గల వేదాంత నిరూపణమందలి పరిభాష యిదియే. అస్తు, ఈసందర్భమున, యీసంసార వృక్షమునకు మూలము అజ్ఞానమని చెప్పిన చాలును. దీని ఊర్ధ్వభాగము నిర్మలాత్మయై యున్నది. మరియు దానికి క్రిందుగా గలవని చెప్పబడిన మూలములు మాయా సంయోగమువలన నేర్పడిన పాదులలో బాగా పెరిగి వ్యాపించినవి. అటుపైని, యింకనూ క్రిందిభాగమున అనేకవిధములగు అసంఖ్యాక శరీరములు జనించును. మరియు వాటికి నాల్గువైపులను అంకురములు బయల్వెడలును. ఇవి (యీ అంకురములు) క్రిందిదిపై పున ఎడతెగక

సాగిపోవుచుండును. ఈ రీతిని, యీ సంసారమనెడి వృక్షమూలము తన ఊర్ధ్వభాగమునందు అద్వైత బ్రహ్మమునుండి బలమును పొంది, క్రిందివైపు కేవలము అంకురములనే అపారముగ వెలువరించుచుండును. ఈ అంకురములందలి మొదటిఅంకురము అంతఃకరణవృత్తియనెడిది. ఇదియే మహత్తత్త్వముయొక్క విస్తారిత కోమలపత్రము. ఆపైని దీనినుండి క్రిందవైపున మూడు ఆకులు గల ఒక అంకురము వెలువడును. ఈ అంకురమే అహంకారము. మరియు సత్త్వము, రజస్సు, తమస్సులు మూడునూ దీనిఆకులు. ఈ అహంకారమనెడి అంకురమే అటుపిమ్మట బుద్ధియనెడి కొమ్మను వెలువరించును. మరియు అనేకవిధములగు భిన్నభిన్న భావములను వృద్ధినొందించి మనస్సనెడి రెమ్మలను సజీవముగ నొనర్చును. ఈ విధముగా యీ సంసారవృక్షమున పైభాగమున గల మూలముయొక్క సామర్థ్యమువలన వికల్ప రసముతో నిండియున్న చిత్త-చతుష్టయమనెడి అంకురము జనించును. ఆపైని ఆకాశము, వాయువు, తేజస్సు, జలము మరియు పృథివి-యనెడి పంచమహాభూతముల రూపమున సుందరము మరియు భిన్నవివియగు చిగురుటాకులు దీనియందు వెలువడును. అంతట యీ చిగురుటాకులందే చెవి మొదలుగా గల పంచేంద్రియములూ మరియు వాటి విషయములూకూడ అనేక విధములగు యింకనూ విచిత్రమగు కోమలపత్రరూపమున జనించును. దానియందు శబ్ద-కర్ణ మనెడి అంకురము వెలువడినప్పుడు కర్ణేంద్రియ వృద్ధి ద్విగుణీకృతమగును. మరియు భిన్నభిన్న వాసనాసమూహములు దాని ఎదుటకు రాసాగును. అనేక విధములగు సంగతులను వినవలెననెడి వాసనలు జనించును. అంగములనెడిలత మరియు త్వచయనెడి పల్లవములందు స్పర్శ-జ్ఞానమనెడి అంకురములు వెలువడును. అందువలన మిక్కుటముగ సరిక్రొత్త వికారము ఉద్భవించును. ఇటుపిమ్మట, రూపములనెడి పల్లవములు బయలుదేరును, మరియు చక్షురింద్రియము చాల దూరమువరకు పరుగులు పెట్టసాగును. యిందుచే మోహభ్రాంతులు జన్మించును. ‘రస’ మనెడిశాఖ వేగముగను

మిక్కుటముగను వృద్ధి పొందినప్పుడు జిహ్వాపైన లాలస యనెడి అసంఖ్యాక పల్లవములు బయల్వెడలును. ఇదే తీరున, 'గంధ' మనెడి అంకురము వృద్ధి పొందినపుడు 'ఘ్రాణ' మనెడి శాఖ పెరిగి స్తంభమువలె నగును. మరియు దానిక్రిందకు లోభమువచ్చి ఆనందముతో నివాసమేర్పరచు కొనును. ఈరీతిని మహత్తత్వము, అహంకారము, మనస్సు మరియు మహాభూతములు - అను నట్టివి యీ సంసార వృక్షమును బాగా వృద్ధి పొందునటుల జేయు చుండును. మహత్తత్వము మొదలుగా గల అష్టాంగములందే దీనికి అత్యధిక ముగ అంకురములు బయలుదేరును. ముత్తెపుచిప్పనుచూచి వెన్నెలయని భ్రాంతిపొందినప్పుడావెన్నెల ముత్తెపు చిప్పయంత పరిమాణము గలదిగానే కాన్పించును. లేదా సముద్రమెంత విశాలముగా నుండునో ఆఅంతదూరమువరకే తరంగములు లేచుచుండును. ఇదేవిధముగా, అద్వైత బ్రహ్మము యీ అజ్ఞాన - జన్య సంసారవృక్ష రూపధారణము నొనర్చును. స్వప్నమున మనము ఒంటరిగా నున్నప్పటికిని మనమే మనకుటుంబమంత యగా మారిపోవు రీతిని, యీ సంసార వృక్షముయొక్క విస్తార - ప్రసారములు ఆ బ్రహ్మతత్త్వమే అయియున్నది. ఈ విధముగా, యిట్టి యింద్రజాలమును బోలియున్న యీ విలక్షణవృక్షము జన్మించును. మరియు యిందుమహాతత్త్వము ఆదిగాగల అంకురములు బయలుదేరుటవలన క్రింది పైపుకు దీని శాఖలు ఎడతెగకుండా వృద్ధిపొందుచూ పోవుచుండును. ఇక జ్ఞాతలు దీనిని అశ్వత్థ మని ఎందు కనిరో చెప్పెదను. సావధానుడవై వినుము. 'శ్వః' అనగా ఉషస్సు లేక ప్రభాత కాలము—— అని అర్థము; మరియు యీ సంసారవృక్షము మరు సటి ప్రభాతకాలము వరకైన ఒక్కమాదిరిగ నుండదు. క్షణమునేపు గడచినంతనే మేఘమునందు ఒక్కటే అనేకరంగులుగా నగురీతిని, లేదా విద్యుత్తు రెప్పపాటునేపుకూడ అఖండముగను శాంతముగను వుండనిరీతిని లేదా ఎల్లప్పుడుకంపించుచూ వుండెడి కమలపత్రము నీటిపైన క్షణమునేపైన

శాంతముగ నుండని విధమున, లేదా పీడితుడు లేక వ్యాకులుడుగనున్న వ్యక్తి యొక్క చిత్తము ఎన్నడుస్థిరముగ నుండజాలనివిధమున యీసంసారవృక్షము కూడాఎన్నడునుస్థిరముగగాని ఒక్కతీరునగానివుండదు. ఇది క్షణక్షణము నాశమొందుచూనుండును; అందువలననే దీనినిఅశ్వత్థమనిరి. కొందరుఅశ్వత్థమునకు రావిచెట్టని అర్థముచెప్పుదురు. కాని శ్రీకృష్ణభగవానుల అభిప్రాయమిది ఎన్నడును కాదు. ఒకవేళ, దీనిని రావిచెట్టుయని అన్వయించి చెప్పినను యిచ్చట అర్థము చెడదు. ఓ శ్రోతలారా! యికమీరీఅలౌకికగ్రంథమునువినుడు. దీనికిగల క్షణభంగురత్వమువలననే యీసంసారవృక్షమును అశ్వత్థమని యందురు. ఈసంసార వృక్షమునకు అక్షయ మనెడి మరొక ప్రసిద్ధమగు నామముకూడ గలదు. దాని అర్థమునుకూడా వివరించెదను వినుము. సముద్రమొకవైపున మేఘములచేశోషింపజేయబడును. మరియొకవైపునుంచి నదులచే నింపివేయబడును, యీ కారణముచే సముద్రము తగ్గిపోదు. వృద్ధిపొందదు; మేఘములుమరియు నదులచే ఎట్టి భ్రమయూకలుగరాదు. (అనగా వర్షము కురియుట మరియునదులు సముద్రములో కలియుటలు ఆగిపోయినప్పుడు సముద్రమెంతకతిని ఎండిపోనో బోధపడగలదు.) ఇదేమాదిరిగ యీ సంసారవృక్షముయొక్క స్థితిమరియు లయములు అతి త్వరత్వరగా జరుగుచుండుటవల్ల లోకులకు బోధపడదు. అందువలననే లోకులు దీనిని 'అవ్యయము' 'అక్షయము' అనిఅందురు దాత తన ధనమును వ్యయపరచుట వల్ల మాత్రమే పుణ్యమును సంపాదించురీతిని యీ వృక్షముకూడా తనను వ్యయమొనర్చుకొనుచూ వున్నందువల్లనే అవ్యయముగా బోధపడును. రథచక్రము అతిత్వరగా తిరుగుచుండును. అట్టి సమయమున అది తిరుగుచుండనటులగాని, భూమిని అంటిపెట్టుకొనియే వున్నటులగాని కాన్పించును. ఇదేవిధమున కాలప్రభావముచే యీ సంసార వృక్షముయొక్క ఏ భూత శాఖయైన ఎండిపడిపోయినప్పుడు, ఆ ప్రదేశమున క్రొత్తకొలది అన్యశాఖలు బయలుదేరును. కాని, ఆషాఢములో మేఘములు వచ్చినప్పుడు, ఎప్పుడు

ఒక మేఘము తొలగిపోయినదో, ఎప్పుడు దానిస్థానమున పెక్కు మేఘములు వచ్చినవో తెలియరాని విధమున, యీ సంసారవృక్షమును గురించికూడా, దీని శాఖ ఒకటి ఎప్పుడు విరుగునో, ఆ ప్రదేశమున పెక్కు నూతన శాఖ లెప్పుడు బయలుదేరునో బోధపడదు. మహాకల్పాంతమున అస్తిత్వమును ధరించిన సృష్టియంతయూ లయమును పొందును. కాని, దానితోపాటే, పెక్కు నూతన సృష్టులతో కూడియున్న అరణ్యముకూడ ఏర్పడును. ప్రళయ సమయమున సంహారకారియగు వాయువువలన, ఒక విశ్వావరణ భస్మమగుటతో పాటుగనే నూతనకల్పములనుప్రారంభించెడి సరిక్రొత్త ఆకులసమూహములు కూడ బయలు దేరును. ఒక చెరుకు కాండము నుండియే పెక్కు నూతన కాండములు జనించు రీతిని, ఒక మనువు తరువాత మరియొక మనువు, మరియు ఒక వంశము తరువాత మరియొక వంశమూ ఉత్పన్నమగును; యీ తీరున మన్వంతరములు, మరియు వంశాంతరముల పరంపర ఎడతెగక వృద్ధి పొందుచూ పోవుచుండును. కలియుగాంతమున యుగ చతుష్కముయొక్క జీరసమగు ఆవరణ పడిపోవుటతోపాటుగనే కృతయుగపు నూతన ఆవరణ ఉత్పన్న మగును. జరుగుచున్న సంవత్సరము అంతమొందగనే నూతన సంవత్సరము ఆహ్వానింప బడినదా యున్నటుల వచ్చును. నేటిదినము సమాప్తి పొందుచున్నది, రేపటి దినము వచ్చుచున్నది – అను సంగతి స్పష్టమాగ బోధపడనివిధమున, లేదా, గాలివీతలో ఎచ్చటనూ ఏ విధమైన సంధియూ కాన్పించని విధమున, ఎప్పుడెచ్చటనుండి యీ వృక్షముయొక్క ఎన్ని శాఖలు రాలినవో, ఎప్పుడెచ్చట ఎన్ని నూతనశాఖలు బయలుదేరినవో చెప్పుటకు అలవికాదు. అందువలననే, యీ సంసారవృక్షము అక్షయము లేక అవ్యయముగా తెలియబడును. ప్రవహించుచున్న నీరు ఎడతెగక ముందుకే సాగిపోవుచుండును. కాని దానితోపాటు దాని వెనుక వచ్చుచున్న నీరు వెంటనేవచ్చి దానిస్థానము నాక్రమించుకొనును; ఈ వృక్షముయొక్క విధానముకూడ ఎల్లప్పుడు యీతీరుగనే వుండును;

ఇందువల్లనే లోకులు యీ నశ్వరమైన దానినికూడ శాశ్వతముగ మన్నించు చున్నారు. ఏప్పపాటు సమయములో సముద్రమున కోట్లకొలది తరంగములు లేచును; ఇందువలననే అజ్ఞానులకు యీతరంగములు నిత్యమైనవిగను అక్షయమైనవిగను తోచును. కాకికి రెండు కనులుండును, కాని కనుపాప మాత్రము ఒక్కటేవుండును. కాని ఆకనుపాపనుఒకేక్షణమున ఆ కాకి రెండు కనులయందును సమానముగ త్రిప్పుచూవుండును. ఇందువలననే లోకులకు 'కాకికి రెండు కనుపాపలు గలవనెడి' భ్రమ కలుగును. బొంగరము అతితీవ్రముగా తిరుగుచూ ఏదో ఒకేస్థానమున నిలచి తిరుగ నారంభించినప్పుడు చూచు వారలకుఅదిభూమిపైతిన్నగా నిలచియున్నదనిన్నీ పూర్తిగా స్తబ్ధముగనున్నదనన్నీ భ్రమ కలుగును.ఇట్టిభ్రమ కలుగుటకు కారణము, ఆబొంగర మాసమయమున అతివేగముగతిరుగుచుండుటయే. ఇదేవిధముగా యీవిషయము సహజముగా తెలియనట్టిది కాదు. అందుచేమూఢులీసంసారవృక్షమునుఅవ్యయమనితలం చెదరు. కాని, దీని వేగము బోధపడినవారికి మాత్రము దీని క్షణభంగురత్వము చక్కగా బోధపడును. ఒకే నిమేషములో దీనియందు కోట్లకొలది మారులు స్థితి – లయములనెడి వికారములు జరుగుచుండునన్న సంగతిని జ్ఞానులు చక్కగా నెరుంగుదురు. ఈ సంసారవృక్షమునకు మూలము అజ్ఞానము తప్ప మరేదియూ కాదనిన్నీ, దీని అస్తిత్వము మిథ్యయనిన్నీ యీ వృక్షమే క్షణభంగురమనిన్నీబోధ పడినవానినే ఓఅర్జునా, నేను సర్వజ్ఞుడగు జ్ఞానియని యందును. వేద సిద్ధాంతములందుకూడా అజ్ఞాన విషయమే వున్నది. యోగసాధనయంతయూ యీ విధమగు జ్ఞానికే ఉపయోగించును. ఇట్టి పురుషుడే జ్ఞానమును జీవింపజేయునని చెప్పినను చెప్పనగును. ఈ సంసారవృక్షము క్షణభంగురమని తెలిసిన పిమ్మట ఎవడు దీనిని వర్ణించ గలడు ?

అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయ
ప్రవాళాః
అధశ్చ మూలా న్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్య
లోకే ॥ 2॥

"ఇదిగాక క్రిందివైపుకు శాఖలను వెలువరించు యీ సంసారవృక్షము నకు తిన్నగా పైకిపోవు శాఖలుకూడా పెక్కులుగలవు. క్రిందివైపుకు వచ్చిన శాఖలందుకూడా మూలములు బయలుదేరినవి, మరియు ఆ మూలములకు క్రిందకూడా లతలూ ఆకులూ బయల్వెడలి వ్యాపించినవి. ఈ సంగతి యింతకు ముందే చెప్పబడి యున్నది. అయినప్పటికిని ఆ సంగ తిని యింకనూ స్పష్టీకరించి చెప్పెదను. ఈ వృక్షముయొక్క దృఢమగు మూలము అజ్ఞానము; దానినుండి మహత్తత్వ మాదిగాగల అష్టవిధమాయ జనించును, మరియు అజ్ఞానమనెడి ఘోరారణ్యము ఏర్పడును. కాని, మొద టగా, యీ వృక్షముయొక్క మూలమునుండి స్వేదజ, జారజ, ఉద్భిజ, అండజములనెడి నాల్గు బలమైన కొమ్మలు బయలుదేరును. అటుపైన్ని వీటిలో ఒక్కొక్క శాఖనుంచి యీ ఎనుబది నాల్గులక్షల యోనులు జన్మిం చును; అటుపిమ్మట, యీ వృక్షముయొక్క జీవశాఖపై అంకురరూపమున అపార జీవసమూహములు ఉత్పన్నమగును. కొన్ని శాఖలు తిన్నగానుండును. వాటియందు వంకరటింకరగాను మరియు అనేకవిధములుగాగల సృష్టులనెడి రెమ్మలు బయలు దేరును, అదియే జీవులయొక్క భిన్న భిన్న జాతి పరంపర లుగా నగును. అజీవులు నానావిధ వికారముల వలన తమలో తామే స్త్రీ పురుషుడు, నపుంసకుడు అనెడి భేదముల నేర్పరుప నారంభింతురు. వర్షపు రోజులలో ఆకాశమును భీకరమగు కారుమబ్బులు ఆవరించి యుండురీతిని అజ్ఞానదశలో జీవులన్నియు సాకారములుగా కాసాగును. అటుపిమ్మట సంసారవృక్షముయొక్క శాఖలు మిక్కుటమగు భారమువలన క్రిందికి

పెరుగసాగును. మరియు ఒక శాఖను మరొకశాఖ చక్కగా పెనవేసికొనును. యిందుచే గుణములు క్షుబ్ధమగును. మరియు ఆ క్షుబ్ధగుణ వాయువులు నలుదిశల ప్రవహించసాగును. అటుపైని ఆ గుణములనెడి తీవ్రమగు గాలిదెబ్బలలో పడి యీ ఊర్ధ్వమూలవృక్షము మూడు ప్రదేశములందు చీల్చికొనిపోవును. వీటిలో రజోగుణపు గాలివీత అతితీవ్రముగా వచ్చును. దీనివలన మానవజాతి యనెడిశాఖ అతి మిక్కుటమగు బలముగలదియై పెరుగ సాగును. అది పైకిపోదు, క్రిందికిపోదు, ఇటుల ఏవైపునకూ పోక మధ్యనే ఆగిపోవును. అంత దానినుండి చాతుర్వర్ణ్యము లనెడి పంకరటింకరగాగల శాఖలు బయలుదేరును. దానియందు విధి-నిషేధాది విధానములచే విస్తృతమగు వేదవచనములనెడి మధురము మరియు కళకళలాడెడి శాఖలు వెడలసాగును. అర్థము మరియు కామములుకూడ యిచ్ఛానుసారము విస్తరించును. మరియు వాటియందు నూతనముగ అంకురములు వెలువడును; ఆ నూతనాంకురములచే ఇహిక సుఖోపభోగము లనెడి క్షణభంగురములగు నూతన స్థలములు నిర్మితమగును. వాటిలో ప్రవృత్తి అత్యాధికముగ వృద్ధి పొంది యుండుటవలన, వాటినుండి వెలువడెడి మంచి - చెడ్డ క్రియాకర్మలనెడి అనేక శాఖలను లెక్కింప నలవికాకుండును. తన భోగము ననుభవించి దుర్బలమూ, పురాతనముగానూ అయిన శరీరములు ఎండిపోయిన కొమ్మలవలె రాలిపడును; వాటి ప్రదేశమున అనేక నూతన శరీరములుత్పన్నమై సుశోభిల్లుచుండును. ఈ విధముగనే శబ్దాదివిషయముల యొక్క స్వాభావికమగు రంగులచే తళతళలాడుచుండెడి సుందరమగు నూతనపల్లవములు నిత్యమూ ఉత్పన్నమగుచు నుండును. ఈవిధమున రజోగుణవాయువు భయంకరమగు గాలిదెబ్బలవలన మానవశాఖలు అత్యధికమగును; యిందువలన మానవలోక మలంకరించబడును. అటుపైని, యీ రజోగుణ మేఘములు శాంతించినప్పుడు, తమోగుణపు ఘోర ప్రభంజనము వీచసాగును. ఆసమయమున, యీ మానవశాఖపైననే

క్రిందివైపు అధమవాసన లనెడి ఆకులు బయలుదేరును. మరియు దుష్కర్మలనెడి శాఖలు వ్యాపించసాగును. అటు పిమ్మట, కుమార్గములనెడి చిగురుటాకులు వెడలును. అవి తిన్నగా నున్నప్పటికిని దృఢముగానుండును. మరియు వాటియందు ఆకులతో నిండియున్న దోషములనెడి రెమ్మలు కళకళలాడుచూ కాన్పించును. విధి - నిషేధముల విధానము నొనర్చెడి ఋక్, యజుస్సామవేదములు మూడునూ యీ శాఖచివర ఊగులాడుచుండెడి ఆకులుగా భావించవలెను. జారణ, మారణములనెడి బీజమంత్రములను ఉపదేశించినప్పటికిని పీడాకరముగా నుండెడి అథర్వణ వేద పల్లవము దీనితరువాతి వెడలును.; దానివలన వాసనయనెడిలతబలిష్ఠురాలగును. ఇక యీ రీతిని జరుగుచుండుటతోపాటుగా కుమార్గములనెడి లతలు విస్తరించుచుండును. మరియు జన్మయనెడి శాఖ ఎడతెగక ముందుకు సాగుచూ పోవుచుండును. ఆ పైని చాండాలాది హీన, దుష్కర్మ జాతులనెడి ఒక చక్కని పెద్దదగుశాఖ బయల్వెడలును, మరియు భ్రమపడిన కర్మభ్రష్టులగు లోకులీ శాఖాజాలమున చిక్కుబడుదురు. ఇక, పశు- పక్షులు పందులు, పులులు, తేళ్ళు, సర్పములు మొదలుగా గల అసంఖ్యాక జీవుల వంకర - టింకర కొమ్మలు వ్యాపించును. ఓఅర్జునా! యీరీతిని యీశాఖలు అంతటను కళ కళ లాడుచూ జీవకళతో కాన్పించును, మరియు వీటిపైన నరక - భోగమనెడి ఫలములు నిండుగా కాయును. నిరంతర హింసాది కర్మలను సంచాలన మొనర్చెడి యీ అంకురములు అనేక జన్మములవరకు ఒకేతీరున కళకళలాడుచూ వుండును. ఇదేరీతిని, వృక్షములు, తృణములు, ఇనుము, మృత్తిక, పాషాణము మొదలగు శాఖలుకూడా ఉత్పన్నమగును, మరియు వాటిపైనకూడా యీవిధములగు ఫలములేఫలించసాగును. ఓఅర్జునా! యీతీరున మానవశాఖనుంచి మొదలుకొని క్రిందగల శాఖలయొక్క స్థావర వర్గమువరకు వృద్ధిపొందును. కావున, అచ్చటినుండియే యీ సంసారవృక్షము క్రిందివైపుకు వృద్ధిపొందసాగును. అటుల కానిచో ఓ అర్జునా! ఊర్ధ్వ

భాగమునందుండెడి దీని ఆరంభిక మూలమును ధ్యానమం దుంచుకొన్నచో, యీ క్రిందివైపున గల శాఖలు, మధ్యయం దుండెడిశాఖలు మాత్రమే లక్షింపబడవలెను. కాని, సదసద్ క్రియారూపులగు సత్త్వ తమో గుణ శాఖలీవృక్షమునందు పైనను క్రిందివైపునను వ్యాపించియున్నవి. వికసించి యున్న వేదత్రయీ శాఖకు ఓ అర్జునా! మనుష్యుడులేనిచో అస్తిత్వమే లేకుండును. కాని, మానవ తనువు పైన వున్న మూలమునుండి వెడలిన శాఖ అయినప్పటికిని, కర్మవృద్ధికి మూలకారణ మీ శాఖయే యగును. ఇతర వృక్షములస్థితికూడా యిదేవిధముగా నుండును. వాటి వాటి శాఖలు వృద్ధియగుచున్న కొలదిని వాటివాటి మూలములుకూడా క్రమక్రమముగ క్రిందికి పోవుచూ బలిష్ఠములగుచూ వుండును. మూలములు బలిష్ఠము లగుచున్నకొలది వృక్షములుకూడ బాగా విస్తరించుచుండును. ఈ శరీరముపట్లకూడ యీ అన్వయము సరిపోవును; కర్మలున్నంతవరకు దేహ పరంపర వుండితీరును. మరియుదేహము వున్నంతవరకు కర్మలుకూడా జరుగుచునేవుండును. అందువలననే శ్రీకృష్ణభగవానులు ఈమానవశరీరమే సంసార వ్యాప్తికి మూలమని సెలవిచ్చిరి. తమోగుణపు ప్రచండమగు గాలివీత కొంచెము శాంతించినపుడు సత్త్వగుణపు అతి తీవ్రమగు తుపాను ప్రారంభమగును. ఆసమయమున ఆ మానవశాఖయందే సువాసన లనెడి అంకురములుత్పన్నమగును. మరియు దానియందు సత్కర్మలనెడి పెక్కు చిగురుటాకులు వేయసాగును. జ్ఞానముయథేచ్ఛగాప్రకాశించుటవలనబుద్ధికిగల తీవ్రమగుసామర్థ్యముచే ఒకేక్షణములో పెక్కు సరిక్రొత్త శాఖలు బయలుదేరును. బుద్ధికి చెందిన సరళము దృఢమూనగు శాఖలు బయలు దేరును, మరియు వాటియందు స్ఫూర్త్యంకురము లుత్పన్న మగును. మరియు బుద్ధియొక్క ప్రకాశము వివేక – వివేచనమును ఆధారముగా గొని ముందుకు సాగును. ఆటుపిమ్మట, బుద్ధిరసముచే నిండియున్న భక్తి పల్లవములనుండి సద్వృత్తి యనెడి సుందరము కోమలము నగు అంకురములు బయలు దేరును. ఈ సదా

చారమనెడి విపులమగు అంకురాగ్ర భాగములపై వేద - వచన ఘోష జరుగుచూ వుండును. ఆపైని, శిష్టాచార వేదోక్త - విధి మరియు యజ్ఞాది కర్మలనెడి అసంఖ్యాకములగు ఆకులనుండి, యింకనూ అనేక నూతన పత్రములు బయల్వెడల సాగును. అంతట, యమ - దమాదులు పెరిగొను చుండెడి తపస్సనెడి శాఖలు బయలు వెడలును, మరియు, అవి పోను పోను కోమలము లైనప్పటికిని విశాలమగు వైరాగ్యశాఖలను ఉత్పన్న మొనర్చును. ఆపైని, ధైర్యమనెడి అంకురముయొక్క తీవ్రమగు మొనపై భిన్న భిన్న వ్రతములనెడి రెమ్మలు ఉదయించును, మరియు అవి తిన్నగా పైపైకు చాల ఎత్తువరకు సాగిపోవును. వీటియందే, వేదములనెడి అతిపెద్ద శాఖ వుండును; సత్త్వగుణపుగాలి అతితీవ్రముగ వీచసాగినప్పుడీశాఖ్మ సువిద్యయనెడి చరచర శబ్దము నొనర్చుచుండును. అటుపిమ్మట, ధర్మశాఖ వృద్ధి పొందసాగును, మరియు దానినుండియే జన్మయనెడి తిన్ననగుశాఖ బయలు దేరును. దానితోపాటుగనే స్వర్గసుఖాదులనెడి వంకర-టింకర శాఖలు కూడా బయలుదేరి బాగా వృద్ధిపొంది వ్యాపించును. ఇదేవిధమున సూర్య చంద్రాది గ్రహములు, పితరులు, ఋషులు, విద్యాధరులు మొదలగు ఉప శాఖలుకూడా ప్రసరించసాగును. వీటికింకనూ పైన చాలఎత్తున ఫలములతో నిండియున్న ఇంద్రలోకాదిశాఖ లుండును. వీటికంటెను పైన మరీచి, కశ్యపాదులు తపోజ్ఞాన బలముచే తమ విశాలమగు శాఖలను ఎత్తైనవిగ నొనర్చుకొని యుండిరి. ఈరీతిని ఒకటిపై నొకటిగా యీవిధమగు పెక్కు శాఖలు రానురాను అధికాధికముగ వ్యాపించుకొనుచూ పోవును. ఇవి మూలము వైపు చాల చిన్నవిగ నుండును. కాని పోనుపోను. అతిపెద్దవిగా నుండును. మరియు వాటియందు ఫలములు బాగా ఫలించియుండును. అవి అతి మహత్త్వముగలవీ విశాలమైనవిగనూ వుండును. ఇంతేగాక, యీపైకి పోయెడి శాఖలలో, వేనియందు ఫలము లెక్కువగా కాయునో, వాని అగ్రభాగములనుండి, ఓ అర్జునా! బ్రహ్మ మరియు శంకరాదుల వరకు

గల సమస్త అంకురములు బయలుదేరును. అటుపిమ్మట అధిక ఫలభారము వలన యీ శాఖలు వంగి వంపులుతిరిగి మూలముపైకివచ్చి ఆగిపోవును. సాధారణ వృక్షముల విషయములోకూడా యీ రీతిగనే సంభవించును. వాటి శాఖలపై ఫలభార మధికమైనప్పుడు, ఆశాఖలు తమంత తామే వంగిపోయి మూలముపైకివచ్చి ఆగిపోవును. ఇదే విధముగ, ఓఅర్జునా! ఏమూలము నుండి యీ సంసారవృక్షము జనించినదో, ఆ మూలముపైననే పెంపొందుచున్న జ్ఞానభారమువలన అది వ్యాపితమైవచ్చి, మూలముపైన ఆగియుండును. ఇందువలననే. బ్రహ్మలోకము, మరియు శివలోకములకు పైని జీవుడు వృద్ధి (ఉన్నతి) పొందుటకు మరియొకగతి ఏదియూ వుండదు. మరియు యీలోకములు ప్రాప్తించినపిదప జీవుడు బ్రహ్మస్వరూపుడే యగును. ఆ బ్రహ్మాది దేవతలుకూడా తమ సామర్థ్యముచే ఆ ఊర్ధ్వమూలమువరకు చేరలేరు. వీటికంటెకూడ పైన సనకాది నామములు గల మరిపెక్కు ప్రసిద్ధశాఖలు గలవు. కాని, ఆ శాఖలపైన ఫలభారము వుండదు. అందుచే అవి మూలము వైపుకు మరలక తిన్నగా పైపైపునకే పోయి బ్రహ్మమున ప్రవేశించును. ఈరీతిని మనుష్యునినుండి మొదలుకొని పైనగల బ్రహ్మాదులవరకుగల యీశాఖ అన్నియు అత్యధిక ఔన్నత్యము వరకు వృద్ధిపొందినవి. ఓఅర్జునా! పైపైపున గల యీ బ్రహ్మాదిశాఖలు, మానవశాఖనుండియే జనించినవి. ఇందువలననే మానవశాఖను క్రిందిభాగమున గల మూలమని చెప్పిరి; ఈరీతిని నీకు యీ అలౌకికమగు సంసారవృక్షముయొక్క గాథను చెప్పితిని; దీనిశాఖలు పైకిపోయి యున్నవి, క్రిందివైపునకూ పోయియున్నవి. దీని పైభాగమున ప్రధాన మూలము వున్నది. దీనిలో క్రిందిభాగమున గల మూలమును గురించికూడా నీకు విపులముగ వివరించి చెప్పితిని. ఇక యీ సంసారవృక్షము యేరీతిని పెరికి వేయనగునో చెప్పెదను వినుము.

న రూప మస్యేహ తథోపలభ్యతే నాంతో న చాది ర్నచ
సంప్రతిష్ఠా।
అశ్వత్థ మేనం సువిరూఢమూల మసంగశస్త్రేణ దృఢేన
ఛిత్వా॥ 3

"కాని, ఓ అర్జునా! సాధారణముగ నీ మనస్సునం దింత పెద్దదీ, విశాలమైనదియూ నగు వృక్షమును పెకిలివేయుటకు తగిన సాధన మేదైన నుండవచ్చునా? యనెడి సంశయము పొడచూపవచ్చును. పైపైకు పోయెడి దీని శాఖలను చూచినచో, అవి బ్రహ్మలోకమువరకు పోయి యున్నవి. మరియు వీటియొక్క మూలమో నిర్గుణమునందు మాత్రమే యున్నది. ఈ క్రిందిభాగమున గల శాఖలవలన యీ వృక్షము స్థావరమున కంతిమభాగమునకు పోయియున్నది. మరియు యివిగాక విడిగా మానవ మూలము మధ్యభాగమునం దున్నది. ఇంత దృఢముగను విశాలముగను వున్న యీ వృక్షము నెవడు నాశ మొనర్చగలడు? అనెడి దుర్బలమగు యోచనను నీమనస్సున నామమాత్రమునకైన జొరనివ్వకుము. ఈవృక్ష మెంత దృఢమూ విశాలమూ గలది యైనప్పటికిని, దీనిని పెరికివేయుట కత్యధికమగు పరిశ్రమ చేయవలసిన అవశ్యకత ఏమిగలదు? గంధర్వ నగరమును పడగొట్టుటకు, కుందేటి కొమ్మును విరచుటకు, లేదా ఆకాశకుసుమమును కోయవలసిన అవసర మెన్నడైన వచ్చునా? ఇదేరీతిని, ఓఅర్జునా! యీ సంసార వృక్షము కూడా పూర్తిగా వాస్తవిక మైనదికాదు. ఇట్టి స్థితిలో దీనిని పెరికివేయుట యనెడి సమస్య ఎచ్చట గలుగును? నేను దీని మూలములను గురించియూ శాఖలను గురించియూ చేసిన వర్ణనము వంధ్యాపుత్రులతో యిల్లు నిండి యున్నదని చెప్పెడి వర్ణన వంటిది మాత్రమనియే తలంచవలయును. స్వప్నమున జరిగెడి ఘటనలు, మనము మేల్కొనిన పిమ్మట మన కెటుల కీడు చేయగలదు? ఇదే విధమున యీ వృక్షమును గురించి యీ గాథయంతయూ

పూర్తిగా నిర్మూలితమైనదిగ తలంచుము. ఏలనన, అటులగాక, వేద చెప్పిన వర్ణన మంతయూ నిజమే యగుచో ఏతల్లిపుత్రుడు మూలమును పెరుక గలం గునా? పూ అని వూది ఆకాశమును పైకి ఎగురగొట్టనగునా? కావున ఓ అర్జునా! అదతా బేలంక పాలే వుండని రీతిని నేను వర్ణించిన సంసారవృక్షము కూడ మాయాపూరిత మైనట్టిదే. పాలే లేనప్పుడు ఆ పాలనుండు వెన్నతీసి ఆవెన్నను కరగించి నెయ్యి తయారుచేసి, ఆ నేతిని వడ్డించుట ఎటుల సంభ వించును? దూరమునుంచి మృగజలముతో నిండియుండిన జలాశయము తప్పక కాన్పించును. కాని ఆ జలసమాయముతో ధాన్యపు మొక్కలు నాటనగునా? అంటి మొక్కలు నాటుటకు వీలగునా? మూలమువంటు అజ్ఞానమే మిథ్య అయినప్పుడు ఆ అజ్ఞానమువలన జరిగెడిపని మిథ్య గాకుండా ఎంతవర కుండ గలదు? కావుననే యీ సంసారవృక్షమును గురించి చక్కగా యోచించు నప్పు డిది మిథ్యయనియే తేలును. ఇక యీ వృక్ష మెన్నడును అంతమొంద దనిన్నీ, యిదిఎన్నడును నాశనముకాదనిన్నీ కొందరు చెప్పుదురు. ఇదికూడ ఒక దృష్టితో చూచినచో సమంజసముగనే కాన్పించును. ఎటులన, మనుష్యుడు మెల్కొననంతవరకు నిద్ర ఎన్నడైన అంత మొందునా? రాత్రి అంతే మొందనంతవరకు ఎన్నడైన ప్రాతఃకాలము కాగలదా? ఇదేరీతిని వివేకముచే మాయను ఎగురగొట్టనంతవరకు యీ సంసారమనెడి అశ్వత్థ మెన్నడును అంతమొందదు. తీవ్రముగా వీచుచున్న గాలి శాంతించనంతవరకు సాగర తరంగములు అనంతముగనే తోచును. ఇందువలననే, సూర్యుడు అస్తమించుటతోపాటు మృగజలము కూడా అదృశ్య మగుచున్నది, లేదా దీపము ఆర్పివేయ బడినపుడు దాని ప్రకాశముకూడ నశించుచున్నది. ఇదే మాదిరిగా, మూలమాయను నాశనమొనర్చెడి జ్ఞానోదయ మైనప్పుడు యీ సంసార వృక్షముకూడ అంతమొందుచున్నది. అటుల కానంతవరకు యిది అంతమొంద నేరదు. ఈ సంసారమును అనాదియని చెప్పుటకూడ ఒకవిధ ముగ చూచిన మిథ్యకాదు. పైనచెప్పిన రీతిని చూచినచో యిదికూడ సమం

జనమే యగును. ఎటు లనిన, యీసంసారవృక్షమే వాస్తవము కానప్పుడు దీనికిఆరంభ మెచ్చటవుండును? వాస్తవముగ ఒక ప్రదేశమున జన్మించినదానిని గురించి దీనికి ఆది గలదని చెప్పుటలో అర్థముండును; కాని అసలే లేనిదానికి అది ఎచట నుండును? జన్మించనే జన్మించని దానిని గురించి దీనితల్లి ఫలానా అని ఎటుల చెప్పనగును? తాత్పర్యమేమన, యీసంసార వృక్షము వాస్తవమునకు లేనేలేదు, కావున దీనిని అనాది యననగును. వంధ్యాపుత్రునికి జాతకచక్ర మెటులవుండును? ఆకాశమున నీలిరంగు భూమి గలదని ఎటుల ఊహించనగును? ఓ అర్జునా, ఆకాశ - పుష్పముయొక్క తొడిమను ఎవడు తుంచగలడు? వాస్తవమునకు లేనేలేనట్టి యీసంసారమునకు ఆది,ఆరంభము జననము లనున వెటుల యుండగలవు? ఘటముయొక్క మిథ్యాత్వము స్వయంసిద్ధమైన రీతిని యీ మూలసహిత సంసారవృక్షము మిథ్యయగుటచే అనాదియైయున్నది. ఓ అర్జునా! నీవు, దీనికి ఆద్యంతము లనునవే లేవని జ్ఞాపక ముంచుకొనుము. మధ్యమధ్య అది వున్నటుల కాన్పించునుకాని అది కూడ మిథ్యయే. మృగజల ప్రవాహము ఏ పర్వతమునుంచీ బయలుదేరుట లేదు. ఏ సముద్రమునందును కలియుటయూ లేదు. కాని మధ్యలో మాత్రము వున్నటుల కాన్పించును. ఆ మృగజలమువలెనే యీ సంసారమునకుకూడ ఆదియూ లేదు. అంతమూ లేదు. వాస్తవమునకు యిది ఎన్నడును లేనేలేదు. కాని మధ్యమాత్రమువున్నటుల కాన్పించును. ఇంద్రధనస్సు అనేక విధములగు రంగులు పూయబడినటుల నుండురీతిని అజ్ఞానముచే యీ సంసారము రంగులువేసి యలంకరింపబడినటుల కాన్పించును. చతురుడగు నటుడు తన వేషముచే లోకులను భ్రమపడునటుల చేయురీతిని యీ సంసారముకూడా మధ్యనుండెడి ఆభాసవలన లోకులను భ్రమింప జేయును. ఆకాశమున వాస్తవమునకు ఏమియూ లేకున్నప్పటికిని అప్పుడప్పుడు గంధర్వనగరములు కాన్పించును. కాని అవి క్షణమునేపటిలోనే నశించును. స్వప్నమున కాన్పించెడి మిథ్యాదృశ్యములనుకూడ వాస్తవములని

అంగీకరించినప్పటికిని మేల్కొనిన పిమ్మట వాటిచే ఏవిధమైన ఉపయోగమైన వుండునా? ఇదేమాదిరిగ' క్షణముసేపటివరకు మాత్రమే వుండెడి యీ ఆభాస పూర్తిగా మిథ్యయే. కోతికి నీటిలో తన ప్రతిబింబ మనేకచేష్టలు చేయుచూ కాన్పించును. కాని అది దానిని పట్టుకొనబోయినప్పుడు దాని చేతికేదియు చిక్కదు. ఇదేవిధముగ, యీ సంసారముకూడ కాన్పించు చుండును. కాని వాస్తవముగ కది లేనేలేదు. ఈ ఆభాస కలుగుటయు పోవుటయు - యీ రెండింటియందునూ తరంగముల చంచలత్వము అత్యల్పమని తోచుకీతిని గలిగి యుండును. వర్షాకాలపు ప్రారంభ సమయమందలి వాయువు నలువైపుల నుండీ వీచునప్పుడు, ఆ వాయువు ఎటువైపునుంచి వీచుచున్నదీ బోధపడ నేరని విధమున యీ సంసార వృక్షముకూడా వాస్తవికమైన నిజమగు స్థితిని కలిగియున్నదికాదు. దీనికి ఆది లేదు, అంతములేదు, స్థితిలేదు, రూపములేదు. ఇట్టి దానిని పెరికివేయుటకు శ్రమపడవలసినపని యేమి గలదు? ఇది కేవలము మన అజ్ఞానము వల్లనే యింత బలిష్ఠముగ నున్నది. కావున దీనిపైన ఆత్మజ్ఞాన మనెడి గొడ్డలిపెట్టు పెట్టి దీనిని పడగొట్టవలయును. ఒక్క జ్ఞానమునకు మినహా, దీనిని పడగొట్టుటకు నీ వెన్నిఉపాయములు చేసినను అవి యన్నియు నుపయోగపడకపోగా, పైగా యీ వృక్షమునం దింకను చిక్కు బడిపోవును. ఈ ప్రతిశాఖపైనను - పైనను, క్రిందను నీ వెంతవరకు తిరుగుచూ వుండగలవు? నీవు సత్యజ్ఞాన సాధనముచే దీని మూలమునందుండెడి అజ్ఞాన మును నాశమొనర్చుచో నీ పనియంతయు తనంతతానే సమకూడును. త్రాటిని పాముగా తలచి దానిని చంపుటకై కర్రను పుచ్చుకొని యిటు నటు తిరుగుచుంటిని, యీ పరిశ్రమ యంతయు వ్యర్థముగాదా? మృగజల మును నదిగా తలంచి దానిని దాటుటకై నావను తయారుచేయు తలంపుతో అడవియందు తిరుగునటువంటివాడు వాస్తవమునకు ఏ కాలువలోనో పడి మునిగియే పోవును. ఇదేవిధమున ఓ అర్జునా! యీ మిథ్యాసంసారమును నాశమొనర్చుటకై అనేకవిధములగు యోచనలు చేయువాడు ఆత్మ

జ్ఞానరహితుడై యుండును, మరియు ఆతనికి సంసార సంబంధమగు భ్రమ రాను రాను యింకనూ వృద్ధియగుచునే వుండును. కావున ఓ అర్జునా! స్వప్నమున తగిలిన గాయమును నివారించుకొనుటకు కేవలము మేల్కొనుట ఒక్కటే ఉపాయమైన రీతిని, యీ అజ్ఞాన మూలమును నాశమొనర్చుటకు కేవల మొక్క జ్ఞానమే కుఠారమగును. ఈకుఠారము సహజముగ ఉపయోగించిన కొలది బుద్ధికి వైరాగ్యమనెడి నూతనశక్తి కలుగును. వైరాగ్యము ఆవిర్భవించుట తోడనే, ధర్మము, అర్థము, కాములనెడి త్రివర్గములచే మానవునకు 'కుక్క అతివేడిగానున్న అన్నమును తిని వెంటనే వమనము చేసికొని ఆతాపమునుండి నివారణ పొందినరీతిని' ముక్తికలుగును. ఓఅర్జునా! యీ వైరాగ్యము ప్రతి పదార్థము పట్లనూ అత్యంతమగు ఘృణ జనించునంతటి ప్రబలమైనదిగా నుండవలెను. అటుపైని, దేహాభిమానమనెడి వేష్టనము నొక్కపెట్టున త్రోసివైచి యీశస్త్రమును ప్రత్యగ్బుద్ధి (ఆత్మభావన) యనెడి చేతిలో చాలగట్టిగా పట్టుకొనవలెను. వివేకమనెడి సాన పట్టబడి, అహం బ్రహ్మాఽస్మి యనెడి ఆత్మబోధపై పదును పెట్టబడిన యీ శస్త్రమును పూర్ణబోధయనెడి చూర్ణముతో చక్కగా అరగదీయవలెను. అటుపిమ్మట, మన 'నిశ్చయ' మనెడి పిడికిలియం దెంతశక్తి యున్నదో చూచుటకై ఒకటి రెండుమారులు దీనిని ప్రయోగించికూడా చూడవలెను. ఆపైని మననబలముచే యీశస్త్రమునుతూచి ధరించవలెను. ఆపిమ్మట నిదిధ్యాసమనెడి సాధనముచే యీ శస్త్రము మరియు మనము – యిద్దరమూ పూర్తిగా ఏకరూపుల మైనప్పుడు దీనిదెబ్బముం దేదియూ ఆగజాలదు. అద్వైత తేజోనిర్ణయముచే ఆత్మజ్ఞానమనెడి యీ అస్త్రము సంసారవృక్షమును నామమాత్రమునకైన వుండనివ్వదు. శరదృతు ప్రారంభమందలి గాలి ఆకాశమానందు మేఘములనెడి మాలిన్యమును వుండనివ్వని రీతిని, లేదా ఉదయించుచున్న సూర్యుడు కాలిమను "అంధకారము" నంతనూ భక్షించురీతిని లేదా మేల్కొనుట తోడనే

స్వప్నమందలి ఆటలన్నియూ అంతమొందురీతిని ఆత్మజ్ఞాన మనెడి తీవ్రమైన పదునుకూడ అతిత్వరితముగ తనపనిని నెరవేర్చును. అటుపైని చంద్రప్రకాశమునందు మృగజలము కాన్పించని రీతిని యీ సంసారవృక్షము యొక్క పైనగల మూలముగాని క్రిందగల మూలముగాని లేక వ్యాపించి యున్న శాఖాజాలముగాని కనిపించనేరదు. ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా యీ రీతిని ఆత్మజ్ఞానమనెడి శస్త్రముచే యీఊర్ధ్వమూలమగు సంసారవృక్షమును పడగొట్టవలెను.

తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతా న నివర్తంతి భూయః।
తమేవచాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥౪॥

"ఇదంతయూ జరిగిన పిమ్మట మానవునకు 'ఇదివున్నది' 'అదివున్నది. అని దేనిని గురించి నిర్దేశించుటకు వీలులేదో, మరియు ఏది తాను లేకుండానే స్వయంసిద్ధమై యున్నదో, ఆ ఆత్మస్వరూప ప్రత్యయము కలుగును' కాని, అద్దమును ఆధారముగ జేసికొని మూర్ఖులైనవారు ఒక ముఖము వున్నచోటున రెండు ముఖములు వున్నవని తలంతురు. ఈ ఉదాహరణమే ద్వైతమునకుకూడ అన్వయించును. కావున ద్వైతము నెన్నడును అంగీకరించకుము. ఈ ఆత్మస్వరూపమును సరిగా చూచు విధాన మిదియే. సుయ్యి త్రవ్వక పూర్వమునుంచియే భూమికి లోపల జలస్రోతస్సు తన చోటునందుండును. లేదా, నీరు తొలగిపోయినప్పుడు లేక నీరు లేనప్పుడు నీటియందు పడెడి ప్రతిబింబముకూడ మరలి తన మూలబింబమున చేరి లీనమగును. లేదా మండుట అయిపోయిన తరువాత అగ్ని తన మూలస్వరూపములోనికిపోయి లీనమగురీతిని, ఓ అర్జునా! యీ ఆత్మస్వరూపమునుకూడా చూడవలయును. ఈ విషయ మెటులున్నదనిన, నాలుక స్వయముగ తన స్వాదమునే తాను

రుచిచూచు కొన్నటుల, లేదా నేత్రములు తమ కనుపాపలను తామే చూచు కొనినటుల వున్నది, లేదా, తేజస్సులో తేజస్సు కలసిపోవును. ఆకాశమునం దాకాశము చేరిపోవును. లేదా జలాశయమున జలము పోయి కలియురీతిని, అద్వైతదృష్టితో తన ఆత్మ స్వరూపము కూడా చూడబడును. ఎవనిని చూడకుండాను, మరియు ద్రష్టకాకుండానూ చూడవలెనో, మరియు ఎవనిని తెలియకనే తెలియవలెనో, మరియు ఏ వస్తువును ఆద్యపురుషుడందురో, దానిని గురించి ఉపాధిని ఆశ్రయించి శ్రుతిగ్రంథములు వ్యర్థముగ రకరకములుగ వర్ణనలుచేయును. అంతేగాదు, వ్యర్థముగనే దాని నామములను, రూపములను వర్ణించసాగును, లౌకిక సుఖములు మరియు స్వర్గసుఖములచే పూర్తిగా విసిగిపోయిన ముముక్షువులు 'మే మీస్వరూపమున ప్రవేశించి మరి యెన్నడును యిటకు తిరిగి రామని ప్రతిజ్ఞచేసి యోగజ్ఞానమున ప్రవృత్తులగుదురు. ఇట్టివారు వైరాగ్యమనెడి పందెమును గెలిచి, సాంసారిక జంజాటములకు చాలదూరముగ పోదురు, మరియు బ్రహ్మలోక పర్వతమును దాటి, దానికంటెను యింకా ముందుకు పోదురు. అటుపిమ్మట వారు, అహంకారాది భావనలు బొత్తుగా లేనివారై ఏ ప్రదేశమునకు వెళ్ళుటకు ఆజ్ఞాపత్రమును పొందుదురో, ఏమూలవస్తువుకంటె ముందు మానవుని ఆరిపోయిన ఆశతో సమానమగు యింత పెద్దదగు విశ్వమాలికావ్యాప్తి బయటకు వెలువడునో, ఏవస్తుజ్ఞానము కలుగకపోవుట వలననే వాస్తవముకాని యీ సంసారము అపారముగ వ్యాపించి యున్నటుల కాన్పించునో, మరియు 'నేను' 'మీరు' అనెడి ద్వైతము తన ప్రభావమును చూపించునో, ఓ అర్జునా! ఆ ఆద్యవస్తువును, ఆ తన ఆత్మస్వరూపమును తనంతతాను 'మంచు వల్లనే మంచును గడ్డకట్టుకొనునటుల చేయు రీతిని' చూడవలెను, ఓ అర్జునా! యీ స్వరూపమును గుర్తించుటకు మరియొక లక్షణము గలదు; అదేదన, ఒక్కమారు యీ స్వరూపమును దర్శించిన పిమ్మట మానవుడెన్నడును ఆ స్వరూపమునుండి మరలి

రానేరదు. కాని, యిచ్చటగల ప్రశ్న, ఆ స్వరూప దర్శన మెటుల కలుగు ననియే. ప్రళయకాలమందలి జలము అంతటను నిండియుండురీతిని, ప్రతి అవయవమునందును జ్ఞానము పరిపూర్ణముగ నిండియున్న మానవునకు మాత్రమే యీ ఆత్మస్వరూపము ప్రాప్తించును.

నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ॥5॥

“వర్షఋతు అంతమున ఆకాశమునందు మేఘములే వుండవటుల ఏ పురుషుని మనస్సున మానము మోహము మొదలుగాగల వికారములు లేవో, దరిద్రుడు మరియు నిష్ఠురుడు నగు మనుష్యుని వలలో ఆతని బంధువులు కూడ చిక్కబడని రీతిని ఎవరు వికారముల వలలో చిక్కబడరో, ఆత్మ-ప్రాప్తి వలన కాయలు కాయుట తోడనే అరటిచెట్టుయొక్క ఆయువు తీరిపోవు రీతిని ఎవని సమస్త కర్మలు క్రమక్రమముగ నాశమొందునో, నరికివేయబడిన వృక్షమును పక్షులు త్యజించురీతిని ఎవనిని సమస్త విధములగు సంకల్ప-వికల్పములు త్యజించినవో, దోషములనెడి వనస్పతిని అతిత్వరగా మొలిపించెడి భూమియగు భేదబుద్ధి ఎవరియందు నామ మాత్రమునకైన లేవో, సూర్యోదయమగుటతోడనే రాత్రి నశించురీతిని ఎవరి దేహాభిమానబుద్ధి అవిద్యాసహితముగ నాశమొందినదో, ఆయువుతీరిన వ్యక్తియొక్క శరీరమును ఆకస్మికముగ జీవుడు విడచిపోవు రీతిని ఎవరు అజ్ఞానమయమగు ద్వైతమును విడచివైతురో, స్పర్శమణికి యినుము, లేదా సూర్యునకు అంధకారము అనునది లేకుండా పోవురీతిని ఎవరికి ద్వైతభావము శాశ్వతముగ లేకుండా పోయినదో, ఎవరి ఎదుట దేహమునకు తోచు సుఖదుఃఖములనెడి ద్వంద్వములు క్షణమునైన నుండవో, మేల్కొనిన మనుష్యునిపై ‘కాను రాజ్యలాభము లేదా మరణ

సంబంధమగు విషయమునుగురించి గాంచిన స్వప్నానుభవము లేశమాత్రము పని చేయని రీతిని ఎవరిపైన హర్ష - శోకము లేశమాత్రమును తమ ప్రభావమును చూపలేవో, గరుత్మంతుని సర్పము బాధించని విధమున ఎవరిని సుఖ - దుఃఖములనెడి ద్వంద్వములు బాధించనేరవో, ఎవరు అనాత్మ పదార్థమనెడి జలమును విడదీసి ఆత్మానందమనెడి దుగ్ధమును గ్రోలి సువిచారమనెడి రాజహంసగా యగుదురో, సూర్యుడు భూతలముపై జలమును వర్షింపజేసి మరల దానిని తన కిరణములద్వారా తనబింబములోనికే తీసికొనివచ్చురీతిని ఎవరు అజ్ఞానమువలన నలుదైపులందును వ్యాపించియున్న ఆత్మవస్తువును జ్ఞానదృష్టిచే అఖండస్వరూపమునం దేకత్రితమొనర్తురో, సముద్రమున గలసి గంగాజలము సమరసత్వమును పొందురీతిని ఆత్మనిర్ణయ మొనర్చుటయం దెవరివివేకము సమరసత్వమును పొందునో, ఎవరికి అంతటను కేవలము ఆత్మ స్వరూపమే కాన్పించునో, మరియు ఆకాశమునకు ఒక చోటునుంచి మరియొక చోటుకు పోవుటకు వీలే లేనిరీతిని ఎవరికి ఆత్మస్వరూపమునుంచి బయటకు పోవుట సంభవము కాదో, మరియు యిందువలననే విషయవాసనా సంపర్కమెన్నడును ఎవరితో పొసగనేరదో, జ్వాలాముఖీ పర్వతముపైన బీజములం మొలకరించని విధమున ఎవరిహృదయమున వికారము లెన్నడును ఉదయించవో, క్షీరసాగరమునుంచి గిరగిరతిరిగెడి మందరాచలమునుతొలగించి నప్పుడు క్షీరసముద్రము నిశ్చలముగ నున్నరీతిని ఎవరిచిత్తము కామాది వికారములు లేనిదై నిశ్చలముగనున్నదో, షోడశ కళాపూర్ణుడగు చంద్రునం దే అవయవలోపమూ కాన్పించనిరీతిని ఎవరియందు కామాది దోషములు కాన్పించవో, వాయువునందు సూక్ష్మకణములు నిలువజాలని రీతిని ఎవరి యందు విషయములు నిలువనేరవో, యీరీతిని ఎవరు జ్ఞానాగ్నిచే తమ దోషములు మలములనన్నింటిని భస్మమొనర్చి పరిపూర్ణముగ నిర్మలులగుదురో, అట్టివారు స్వచ్ఛమగు బంగారమున స్వచ్ఛమగు బంగారు కలియురీతిని అచ్యుటికిపోయి కలియుదురు. ఇచ్చట నే నుదహరించిన ' అచ్చట ' యను

మాటలో గల యర్థము ఆ ' అవ్యయ వస్తువు ' ఎందని. ఈ వస్తువు దృష్టికి అందనిదియూ, జ్ఞానాతీతమైనట్టిదీ అయి యున్నది. దీనినిగురించి ఎన్నడును ' ఫలానా ' అని చెప్పుటకు వలనుపడదు.

న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।
యద్ జ్ఞాత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥౬॥

" దీపముయొక్క ఉజ్జ్వల ప్రకాశమునందేమి కాన్పించునో, లేదా చంద్రుడు దేనిని ప్రకాశింపజేయునో, లేదా ఏవస్తువు సూర్యుని తీవ్ర ప్రకాశముచే మెరయునో,ఆవన్నియు అనగా ఆ వస్తువులన్నింటి దృశ్యత్వము ఆవస్తువు కనుపించనందువల్లనే భాసిల్లుచున్నది (అనగా ఈ సాంసారిక వస్తువు లన్నియు ఆ అవ్యయ వస్తువు కనుపించనంతవరకు మాత్రమే కాన్పించును) ఆ వస్తువు తాను స్వయముగ అదృశ్యమాగనుండి యీ విశ్వమునంతను ప్రకాశిత మొనర్చుచున్నది. ఆ కనిపించునట్టిది ముత్తెపుచిప్పయని తోచనంతవరకు దానిని వెండిగా తలంచుచునే వుండురీతిని, లేదా అది త్రాడనెడి జ్ఞానము లోపించినంతవరకు అది సర్పమనెడి భ్రాంతి దృఢముగనే వుండును. ఇదేరీతిని ఏవస్తుప్రకాశము పడుటవల్లనే చంద్ర సూర్యాదులు తమ ప్రచండ తేజముతో ప్రకాశించుచున్నారో, ఆవస్తు కేవలము తేజోరాశియే. అది భూతకోటియందంతటను వ్యాపించియున్నది. చంద్ర సూర్యులకు కూడ అదే ప్రకాశ మిచ్చును. చంద్ర సూర్యులు లోకమును ప్రసరింపజేయు ప్రకాశ మీ బ్రహ్మవస్తువునుండియే ప్రాప్తించు చున్నది. కావున చంద్ర సూర్యాదుల తేజోపిండము లందలి తేజ మా బ్రహ్మవస్తువు యొక్క ఒక అంశమైయున్నది. సూర్యోదయమగుట తోడనే చంద్రుడూ అతనితోపాటు నక్షత్రములన్నియు లోపించి పోవు రీతిని యీ బ్రహ్మవస్తు ప్రకాశము ఉదయించుటతోడనే ఆ ప్రకాశమునందు సూర్య చంద్రులతోపాటు జగత్తంతయూ కూడా లోపించును. లేదా మేల్కొనిన

వెంటనే స్వప్న విషయము లన్నియు అంతరించురీతిని, లేదా సంధ్యాకాల
మగుట తోడనే మృగజల మెచ్చటను వుండనిరీతిని ఏ వస్తు ప్రకాశము
కలుగుట తోడనే మ రేవస్తు భ్రాంతియు వుండుటకు వీలులేదో, ఆ
వస్తువే నా ముఖ్యస్థానము. ఆప్రదేశమును చేరినవారు సాగరమున లీనమయ్యెడి
జలప్రవాహమువలె మరల ఎన్నడును వెనుకకు మరలరు. లేదా, ఉప్పుతో
తయారుచేసిన ఏనుగు బొమ్మను ఉప్పు సముద్రములో పడవేసిన పిమ్మట
అది ఏ విధముగను మరలి రాని రీతిని, లేదా అగ్నిజ్వాల ఆకాశములోనికి
పోయిన పిమ్మట మరలి రాని విధమున, లేదా తప్తమైన యినుముమీద
పడవైచిన నీరు తిరిగి చేతికిరాని విధమున, ఏవ్యక్తి శుద్ధజ్ఞానముతో వచ్చి
నాలో కలిసి ఏకరూపుడగునో, అతడు తిరిగి మరలుట శాశ్వతముగ అంత
మొందదు. "శ్రీకృష్ణుని యీ మాటలను విని బుద్ధిమంతుడగు అర్జును
డిటుల యనెను. "ఓ దేవా, మీరు నాపై ఎంతో అనుగ్రహము చూపిరి.
అయినప్పటికిని, నా ప్రార్థన యొకటి గలదు. తాము వినగోరెదను. మీలో
కలసి ఏకరూపులైన వారు మరల తిరిగి రారని చెప్పిరి; అట్టివారు మీకు
భిన్నముగా నుందురా ? అభిన్నులై యుందురా ? వారు అనాది పరం
పరగా భిన్నులై యున్నచో 'వారు మరలి రారనుట సరి కానేరదు;
ఏలనన, పుష్పములవద్దకు పోయిన భ్రమరములు పుష్పము లగునా ?
బాణము నెవరు విడతురో అతనినుండి అది వేరగును, మరియు ఎవరిపై
విడతురో ఆతనికిపోయి తగులును. అటుపిమ్మట, అది మరలి
పడిపోవును. ఇదేవిధమున, ఆ జీవులుకూడా మిమ్ము స్పర్శించి ఆ పిమ్మట
తప్పక మరలివత్తురు. లేదా, మీరూ ఆ జీవులూ స్వాభావికముగనే
ఒక్కరగుచో, యిక ఎవరు ఎవరియందు కలియుదురు ? శస్త్రము తనను
తానే ఎటుల ఖండించుకొనగలదు ? కావున నే, శరీరముతోపాటు అవ
యవములకు కలిగెడి సంయోగ వియోగములను గురించిన సంగతి చెప్ప
వలనుపడనిరీతిని మీకు భిన్నుడుకాని జీవుడు మీతో సంయోగ - వియోగ -

ములు పొందుచున్నచో అది అర్థముకాకున్నది. శాశ్వతముగ మీకు భిన్నముగ నున్నట్టిది ఎన్నడును మీతోకలసి ఏకరూపము పొందనేరదు. ఇక యిట్టి స్థితిలో, 'మీ నుండి మరలివత్తురా 'గారా' యని యోచించుటే వ్యర్థమగును. కావునసే, ఓదేవా! 'మీతోకలసి ఏకరూపమునుపొంది మరలిరానివారెవరో' నాకు వివరించి చెప్పుడు" అర్జునుని యీ ప్రశ్నను విని సర్వజ్ఞశ్రేష్ఠుడగు శ్రీకృష్ణభగవానులు అత్యధికముగు సంతసమును పొందిరి; ఏలనన తన శిష్యుని యీ ప్రశ్నవలన ఆతని తెలివితేటలు చక్కగా తెలియనయ్యెను. అంత శ్రీకృష్ణభగవాను లిట్లనిరి— సోదరా అర్జునా! నావరకుచేరి మరల వెనుకకు మరలినవారు నాకు భిన్నులూ మరియు అభిన్నులుకూడాను అయియున్నారు. వివేకపూర్వకముగ గంభీరముగ యోచించినచో నేనూ - వారూ స్వాభావికముగ ఒక్కటే-మేమిర్వురము అభిన్నులమే. కాని కేవలము బాహ్యదృష్టితో యోచించినచో 'వారు నాకు భిన్నులని' బోధపడగలదు. నీటిపైన లేచుటచే తరంగములు ఆ నీటికి భిన్నమైనవిగా కాన్పించును. కాని వాస్తవముగ యోచించినచో ఆ తరంగములుకూడా నీరేయని అంగీకరించవలసియుండును; లేదా నగలు బంగారమునకు భిన్నముగా కాన్పించును. కాని ఆలోచించి చూచినచో ఆ నగలుకూడా బంగారమే యగును. సరిగా యిదే విధమున ఓ అర్జునా! జ్ఞానదృష్టితో చూచినచో వారునాకు అభిన్నులే. ఇక యీ కాన్పించెడి భిన్నత్వము కేవలము అజ్ఞానజన్యమే. బ్రహ్మవస్తువును గురించి యోచించినచో, 'నా ఏకమే వాద్వితీయము'కు భిన్నముగా నంగీకరిందగినట్టి, మరియు భిన్నత్వయోచనచే నానుండి విడదీయదగినవస్తువు ఏది కలదు? సూర్యబింబ మాకాశము నంతనువ్యాప్తమొనర్చి ఒకేగోళముగానగుచో యిక ఆతనిప్రతిబింబ మెచట పడును? ఆతనికిరణము లెటకుపోవును? ప్రళయకాలమందలి సర్వవ్యాపకమగు జలమునందు కూడా చిన్నచిన్న ప్రవాహములు వచ్చికలియునా? సరిగా యిదేవిధమున, వికారహీనుడు మరియు ఏకమేవా ద్వితీయుడను నగు నాఅంశలు ఎటులుండగలవు? కాని, తిన్నగా ప్రవ

హించెడి నీరుకూడా రెండుప్రవాహము లొకచోటకలియుటవలన కొంత వంకరగలది యగును. లేదా జలముయొక్క ఉపాధివలన సూర్యుడు కూడ ప్రతిబింబరూపమున ఒకటికిబదులు రెండుగా కాన్పించసాగును. ఆకాశము చతుష్కోణముగ నున్నదో లేక గుండ్రముగా నున్నదో ఎటుల చెప్పనగును ? అయినప్పటికిని ఆ ఆకాశము ఏదైన ఘటమునందుగాని మఠమునందుగాని వ్యాపించియున్నప్పుడు అది చతుష్కోణముగ గల దనిగాని గుండ్రముగాగలదనిగాని చెప్పనగును. శుద్ధబంగారమునందు కూడ కల్తీబంగారముగాని లేదా మరియొక మాలిన్యముగాని కలిపినందువలన అది మరియొక వన్నెను చూపసాగును; సరిగ అదేవిధమున నా శుద్ధ స్వరూపము కూడా మాయావేష్టిత మైనప్పుడు అజ్ఞానోదయ మగును. ఆ అజ్ఞానము "కోఽహం" ( నే నెవరిని ? ) ఈ అజ్ఞానమువలననే మనస్సునందు 'నే నెవరిని' అనెడి వికల్పము జనించును, మరియు, అంతట యీవిషయమును గురించి యోచించి జీవుడు 'నేను దేహమును' అని నిశ్చయించుకొనును.

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ।
మనష్షష్ఠా ణీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥ ॥౭॥

"ఈ విధముగా ఆత్మజ్ఞానము శరీరముచే హద్దు ఏర్పరుపబడి నప్పుడు అల్పత్వము వలన ఆ శరీరమున నా అంశ భాసమానమగును. గాలి వీచుటచే సముద్రము తరంగమయముగా కాన్పించును. ఇందుచే సంకుచితముగ యోచించు జీవులకు ఆ తరంగములుకూడ సముద్రము నందలి భాగమే యని తోచును. ఈ విధముగా జడమునకు చైతన్యమును ప్రసాదించెడి, మరియు, దేహాభిమానమును కలిగించెడి వాడనూ నగు నేనుకూడా యీ జీవలోకమున జీవరూపమున నే భాసమానుడ నగుదును. పరిమితి గల జీవుని బుద్ధికి తన పరిసరములందు జరుగుచూ కనిపించుచున్న వ్యాపారముల యెడ యీ-

"జీవలోకము" నెడి శబ్దము వ్యవహరింప బడును. జన్మించుట మరియు మర ణించుట అను వాస్తవికము మరియు సత్యముగా నంగీకరించుటనే నేను జీవ లోకము లేదా సంసారమని అందును. ఇక యీ జీవలోకమున నీకు నేనెటుల కాన్పింతునో చెప్పెదను వినుము. నీటిలో ప్రతిబింబించెడి చంద్రుడు వాస్తవమునకు నీటికి బయటనే వుండును. లేదా స్ఫటికమణిని కుంకుమపైన పెట్టినప్పు డది ఎరుపురంగుగలదిగనే తోచును. కాని వాస్తవమున కది ఎర్రని రంగుగలదికాదు. ఇదేరీతిని నా అనాదిత్వము మరియు క్రియాహీనత్వము నకు ఏవిధముగ కొరతయూ కలుగనివ్వకుండానే, కర్తగను భోక్తగను, నేను భాసమానుడ నగుట కేవలము భ్రమయేయని యెరుంగుము. అనగా దీనితాత్ప ర్యము, శుద్ధుడగు ఆత్మబ్రహ్మయే ప్రకృతితో కలపి తనంతతానే యీ మాయా సంసారప్రవాహమును ప్రారంభించును. అటుపైని, ఆ ఆత్మ యీ మనస్సు మొదలుగాగల ఆరయింద్రియములు మరియు చెవిమొదలగు మాయాజనితమగు అవయవములన్నియూ నావే నని తలంచి వ్యవహరించ సాగును. ఒకానొకసన్యాసి స్వప్నమున తనంతతానే తనకుటుంబముగానయి అంతట ఆ కుటుంబచింతనముచే లోభపడినవాడై యిటునటు పరుగులిడ సాగుచేతిని, లేదా అనేకములగు సాంసారిక వ్యవహారముల నొనర్ప సాగు చేతిని, యీ జీవాత్మకూడా తన్నుతానే మరచిపోయి, తనను ప్రకృతి లేదా మాయాసమానముగనే తలంచి దానియందే అనురక్తుడై దాని హితపుకొరకే సమస్తకార్యముల నొనర్ప సాగును. అటుపిమ్మట ఆతడు మనస్సనెడిరథముపై నెక్కును. కర్ణరంధ్రములందు ప్రవేశించును. శబ్దములనెడి అరణ్యమున ప్రవే శించి దారితప్పి తిరుగుచుండును. ప్రకృతియనెడి కళ్ళెముపట్టుకొని ఆ జీవాత్మ త్వచామార్గమున నడచును. మరియు స్పర్శ-విషయములనెడి ఘోరారణ్య మున ప్రవేశించును. ఒక్కొక్కప్పు డాతడు నేత్రములందు ప్రవేశించి రూప-విషయములనెడి పర్వతములందు యథేచ్ఛగా తిరుగులాడును. లేదా ఓ అర్జునా! ఆతడు జిహ్వయందు సంచరించి తనను తానే రస-విషయమనెడి

గుహలో ప్రవేశింప జేసికొనును, లేదా ఈ దేహాభిమానియగు జీవాత్మ ఘ్రాణేంద్రియమునందు ప్రవేశించినప్పుడు అది గంధ-విషయమనెడి ప్రచండ వనములోనికి పోవును. ఈ రీతిని ఈ దేహాభిమానియగు జీవుడు మనస్సును కౌగిలించుకొని శబ్దాదివిషయ-సముదాయములను అనుభవించును.

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్ ॥ ౮

“కాని, జీవాత్మ ఒకటికంటెఎక్కువ శరీరములలో సంచరించునప్పుడు దానికి ‘నేనే కర్తను, నేనే భోక్తను’ అని తోచును. ఓ అర్జునా! ఒకానొక పురుషుడు రాజకీయ విలాసములతో కూడియున్నవాడై ఏదేని ప్రదేశమున నివసించునప్పుడు, అతనిని చూచినవారికి ‘అతడు గొప్పధనికుడు మరియు విలాసపురుషుడు’ నని తోచును. సరిగా యిదేరీతిని, జీవాత్మ శరీరమును ఆశ్రయించినప్పుడు అతనికి గల అహం - కర్త యనెడి భావము అతి బలవత్తరముగా నగును, మరియు, విషయములు మరియు యింద్రియముల ఉపద్రవము ప్రారంభమగును. లేదా, జీవాత్మ శరీరమును త్యజించినప్పుడు అతడు యింద్రియముల నిర్మాణమునంతనూ తనవెంట గైకొని పోవును. అతిథికి అవమానము కలిగినప్పుడా అతిథి గృహస్థుయొక్క పుణ్యసంపదను హరించుకొని పోవురీతిని, లేదా కొయ్యబొమ్మలను ఆడించు త్రాడు తనవెంట వాటి చలనశక్తిని తీసికొనిపోవురీతిని; లేదా అస్తమించు సూర్యుడు లోకుల నేత్ర, ప్రకాశమునుకూడా తనవెంట తీసికొనియే పోవురీతిని, లేదా వాయువు పుష్పములు మరియు ఫలములయొక్క పరిమళమును దోచుకొనిపోవు రీతిని; ఓ అర్జునా, శరీరమును విడచి వెళ్ళునప్పుడు దాని ప్రభువగు జీవాత్మకూడా మనస్సు మరియు శ్రోత్రాది షడింద్రియములను తనవెంట గొనిపోవును.

శ్రోత్రం చక్షుస్స్పర్శనంచ రసనం ఘ్రాణమేవ చ ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥ ౯

"ఇటు పిమ్మట యీ మృత్యులోకమునగాని లేదా స్వర్గలోకమందుగాని ఆతడే శరీరము నెచ్చట ధరించునో, అచ్చటనే ఆ శరీరమునందే జీవాత్మ ఆ మనస్సు మొదలుగాగల యింద్రియములను విస్తరింపజేయును. ఓ అర్జునా, ఆర్పినపిమ్మట దీపము తన ప్రకాశమును తన వెంటనే తీసికొని పోయినప్పటికిని తిరిగిదానిని వెలిగించినప్పుడు అది ఆ ప్రకాశముతోడనే ప్రకటమగుచున్నది, యీ జీవాత్మ మరియు శరీరములకుగల సంబంధము కూడా అట్టిదే. అట్లా, సంపూర్ణముగా యోచించనివారి దృష్టిలో ఓ అర్జునా, యీ విస్మయవ్యాపారము మనుష్యాకారలోక విధముగనే కనిపించును. వారు ఆత్మ నిజముగానే యీశరీరము ప్రవేశించి, నిజముగనే అది విషయముల ననుభవించి అటుపిమ్మట శరీరమును విడచిపోవునని విశ్వసింతురు. కాని వాస్తవిక దృష్టితో చూచినచో యీ వచ్చుటపోవుట చేయుట మరియు అనుభవించుట అన్నియూ కేవలము మాయయే యని ఆత్మయే స్వయముగ నంగీకరించుచున్నది.

ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥౧౦॥
యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥౧౧॥

"కాని, లోకులు శరీరము యేర్పడి దానిలోనికి చైతన్యశక్తి వచ్చి ఆ చైతన్యశక్తి వలన ఆ శరీరము కదల మెదలసాగుటను చూచినప్పుడు శరీరములోనికి ఆత్మ వచ్చినద'ని వారు చెప్పుచున్నారు. ఇదేవిధముగా ఓ అర్జునా! యీ శరీరసాంగత్యము వలన భిన్న భిన్న యింద్రియములు తమ తమ విషయములందు సంచరించుటను లోకులు 'భోగించుట' యనుచున్నారు. అటుపిమ్మట, భోగము వలన క్షీణించి శరీరము తనంత తాను నిశ్చేష్టత పొందినప్పుడు లోకులు 'జీవుడు వెళ్ళిపోయినాడ'ని కేకలు పెట్టుదురు. కాని ఓ అర్జునా! చెట్టు కదలినప్పుడు గాలివీచుచున్నదనీ, చెట్టు

కదలనప్పుడు గాలి వీచుటలేదనీ తలచుట ఎన్నడైన యుక్తియుక్తముగ నుండునా? లేదా, అద్దము ఎదుట పెట్టినప్పుడు మాత్రమే మనకు మన రూపము లభించినదనిన్నీ, అంతకుపూర్వము మనకు రూపమే లేదనిన్నీ అంగీకరించనగునా? లేదా, అద్దమును మన ముందునుంచి తొలగించినప్పుడు దానియందంతవరకుపడిన మన ప్రతిబింబాభాస నశించును, అంతమాత్రముననే మనరూపము నిజముగనే లోపించినదని తలంచనగునా? శబ్దము వాస్తవమునకు ఆకాశముయొక్క గుణము; కాని ఉరుములు ఉరిమినప్పుడు శబ్దమును మేఘములకే ఆరోపింతుము. లేదా, వాస్తవముగా చూచినచో, మేఘములే చంద్రుని ఎదుట వేగముగ పరుగిడును; కాని సాధారణముగ 'చంద్రుడే పరుగిడుచున్నాడని' తలంచబడును. సరిగా యిదే విధమున, గుడ్డివారు కేవలము భ్రమమూలమున ఆ వికారహీనుడగు ఆత్మసత్తాపైన శరీరముయొక్క జనన - మరణములను వ్యర్థముగనే ఆరోపించుచున్నారు. ఈ అవస్థలన్నింటను ఆత్మ నిరంతరము తన స్థానమునందే యుండును. మరియు శరీరధర్మములు శరీరమునందే యుండును. కాని, యీ సంగతులనన్నింటిని చక్కగా, వాస్తవిక రూపమున చూచు వివేకవంతులగు పురుషులు తదితరులై యుందురు. జ్ఞానప్రాప్తివలన ఎవరినేత్రములు యీ శరీరమనెడి బాహ్యావరణమునందే చిక్కుకొనవో, గ్రీష్మకాలమందలి సూర్య కిరణములవలె వివేకము వ్యాపించుటవలన ఎవనికిలోపలగల స్వరూపస్ఫురణ కలిగినదో, అట్టి విజ్ఞానియగు పురుషుడుమాత్రమే ఆ శుద్ధాత్మను ఎరుంగును. నక్షత్రములతో నిండియున్న ఆకాశము సముద్రమున ప్రతిబింబించినప్పుడు, ఆకాశము సముద్రమున విరిగి పడలేదనిన్నీ దాని ప్రతిబింబము మాత్రమే సముద్రమున కనిపించు చున్నదనిన్నీ స్పష్టముగ బోధపడును. ఆకాశ మెచ్చట నుండవలెనో అచ్చటనే ఎల్లప్పుడు వుండును. అచ్చటనే వున్నది; మరియు క్రింద కాన్పించెడి దాని యీ ఆభాస కేవలము మిథ్య యనియే బోధపడును. సరిగా యిదేరీతిని, ఆత్మ యీ శరీరముతో సంబద్ధమై

నటుల కాన్పించి నప్పటికిని, అది అవిఛ్ఛిన్నముగా కన్పించుట కేవలము ఆభా
సమే. ప్రవాహము నందుండెడి కదలిక ప్రవాహ మందంతటను వుండును;
అట్టి ప్రవాహములో చంద్రుని వెన్నెల కదలుచున్నటుల కనిపించి నప్పటికిని,
వాస్తవమునకు ఆవెన్నెల చంద్రుని యందే వుండును. లేదా. నీటి
కుంట ఒక్కొక్కప్పుడు నిండి యుండును, ఒక్కొక్కప్పుడు ఎండిపోయి
యుండును. అది నీటితో నిండియున్నప్పుడు దానిలో సూర్యప్రతి
బింబము కనిపించును; అది ఎండిపోయినప్పుడు దానిలో ప్రతిబింబము
కనిపించదు. కాని సూర్యుడు మాత్రము యథాప్రకారముగనే వుండును.
ఇదేమాదిరిగా జ్ఞానులు శరీరము జన్మించుగాక, లేదా మరణించుగాక,
కాని, నేనుమాత్రము యథాప్రకారముగను, అవికృతముగను వుందును."
అని తలంతురు. మరియు ఆరీతిగనే చూతురు. ఘటముగాని లేదా మఠము
గాని వుండుగాక లేదా నాశనమగుగాక, కాని ఆకాశముమాత్రము ఎల్ల
ప్పుడు యథాప్రకారముగను స్వయంసిద్ధముగను వుండియే యుండును.
ఈ తీరుగనే, ఆత్మశక్తికూడా ఎల్లప్పుడు అఖండముగను అవ్యయముగను
వుండును, మరియు కేవలము అజ్ఞానమువలన యీ కల్పితశరీరము జన్మించును,
మరణించును; జ్ఞానులుమాత్రమే వాస్తవమున కీసంగతిని ఎరుగుదురు. జ్ఞానులు
తమ నిర్మలమగు ఆత్మజ్ఞానమువలన 'చైతన్యము ఎవనియందునూ నిండియుం
డదు, మరియు దేనినుండియూ వెడలనూ వెడలదు, మరియు అది ఏకర్మనూ
చేయించనూ చేయించదు, చేయనూచేయదని' తెలిసికొందురు. ఎంతఅధికమైన
జ్ఞానమైనలభించుగాక, పరమాణువును తెలిసికొనెడి సూక్ష్మబుద్ధి లభించినను
లభించుగాక, సమస్తశాస్త్ర పారంగతుడు అయిన నగుగాక. కాని యీ
పాండిత్యమునకు తోడుగా వైరాగ్యముకూడ మనస్సునం దుదయించనంత
వరకు నా సర్వాత్మక స్వరూప మెన్నడును ప్రాప్తించనేరదు. ఓ అర్జునా!
మానవుడు నోటితో వివేకమును గురించి అత్యధికముగ మాట్లాడునట్టి వాడై
నప్పటికిని అతని అంతఃకరణమునందు విషయములు దృఢము మరియు స్థిరము

గను నివసించుచున్నయెడల అతనికి నా ఆత్మస్వరూప ప్రాప్తి ఎన్నడును లభించదనుట నిశ్చయము. స్వప్నమున కలవరించెడి మానవుడు రచించిన గ్రంథమువలన ఎన్నడైన వ్యావహారిక సమస్యలు నిరాకరించుటకు వలను పడునా ? లేదా, ఏదైన పుస్తకమును చేతబుచ్చుకొని నంతమాత్రమున దానిని చదివినందువలన కలిగెడి ఫలితము లభించునా ? లేదా కనులుమూసి ముక్కుకు ముత్యమును తగిలించినంత మాత్రమున దానివెల గట్టనగునా ? ఇదేవిధముగా చిత్తమున అహంకారము నిండియుండగా మానవుడెన్ని శాస్త్రములనుగురించి చర్చించినప్పటికిని, అట్టివాడు కోట్ల కొలది జన్మము లెత్తినను ఎన్నడును నేను పొందలేము. ఏకమాత్రుడ నగు నేనే సమస్తభూతము లందును వ్యాపించి యుందును; నా ఆ వ్యాప్తిని గురించి నీకు వివరించి చెప్పెదను వినుము.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ ౧౨॥

" సూర్యసమేతముగా గల యీ విశ్వమంతయు ఎవని తేజస్సుచే ప్రకాశించునో, ఆ తేజస్సంతయు నాదే. ఓ అర్జునా ! సూర్యుడు జలాంశము నెండించి అస్తమించునప్పుడు, ఆ అరుకుపోయిన జగత్తునకు ఆర్ద్రత్వము నిచ్చెడి చంద్రునియొక్క చంద్రికలుకూడ నా తేజస్సే. మరియు కాల్చుట మరియు కరగించుట మొదలుగా గల అనేక కార్యముల నొనర్చు వృద్ధిపొందుచున్న అగ్నికి గల తేజస్సుకూడా నాదే.

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥౧౩॥

" నేనే యీ భూతలమున ప్రవేశించి దానిని సంభాళించి యుంతును. యిందుచే అది మట్టిబెడ్డ రూపమున నున్నప్పటికిని మహాసాగరజలమున కరగి పోదు. అసంఖ్యాకములగు భూతకోటియొక్క భారమును యీ పృథివి

ఏ శక్తివలన మోయుచున్నదో, ఆ శక్తిని కూడా నేనే దానిలో ప్రవేశ
పెట్టి దానిని ప్రదాన మొనర్తును. ఓ అర్జునా! ఆకాశమున చంద్రరూపమున
నేనే సంచరించుచున్న అమృతసరోవరమువలె నుండియున్నాను. అచ్చటి
నుంచి క్రిందికి పోయెడి కిరణములందు నేనే అమృతము నింపి వనస్పతుల
నన్నింటిని (ఓషధులు) పోషించుచున్నాను. ఈ విధముగ, ధాన్యాదులనెడి
సుకాలమును కలిగించి అన్నము ద్వారా భూతకోటిని జీవింపజేయుచున్నాను.
ఈ విధముగా అన్నము యథేచ్ఛగా లభించినప్పటికిని, ఆ అన్నమును జీర్ణము
చేసి జీవులను సుఖవంతులుగ నొనర్చెడి జఠరాగ్ని యనెడి శక్తి ఎచటనుంచి
వచ్చును ?

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥ ౧౪॥

ఇందుకొరకే ప్రాణికోట్లయొక్క శరీరమున నాభికందమువద్ద కుంపటిని
అంటించి వారిజఠరమునందు నేనే అగ్నిరూపమును ధరించి యుందును.
ప్రాణాపాన వాయువులనెడి తిత్తులను రాత్రిం - బవళ్ళు నడపి ప్రాణుల
జఠరములందు నేను పచనమొనర్చు పదార్థములకు లెక్కయేలేదు. గట్టివి,
మెత్తనివి, చక్కగా పక్వమైనవి మరియు వేయించినవి - అనెడి నాల్గువిధము
లగు అన్నములను నేను పచనమొనర్తును. అనగా, యీ వున్న జీవులన్నియూ
నేనే, మరియూ జీవులకుగల జీవముకూడా నేనే. ఆజీవమును నడపెడి జఠ
రాగ్నికూడా నేనే. ఇట్టిస్థితిలో నా వ్యాపకత్వమును గురించిన చమత్కా
రము నెంతదూరమువరకు చెప్పను! ఈవిశ్వమునందు నేనుతప్ప మరేదియూ
లేదు. కేవలము నేనే అంతటను వున్నాను. ఇటులనేయగుచో, కొందరు
జీవులు సుఖముగను, మరి కొందరు దుఃఖముతోనూ వుండుటకు గల కారణ
మేమని నీమనస్సునందు సంశయము తోచవచ్చును. నగరము నందంతటను
ఒకే దీప ప్రకాశమున్నప్పుడు, కొన్ని ప్రదేశములలో వెలుతురు,

మరికొన్ని ప్రదేశములలో చీకటి ఏల కనిపించును ? కాన నీకు గలిగిన యీ సంశయమును నివారించెదను. వాస్తవముగ చూచినచో, అంతటను నేనొక్కడనే వున్నాను, మరియు యీ జగత్తున నాకు భిన్నముగా గల ఏ వస్తువూ లేనేలేదు. కాని, ప్రాణులకు నేను వారివారి బుద్ధుల ననుసరించి భాసిల్లుచుందును. ఆకాశధ్వని యనెడి పేరుగల గుణము ఏకరూపమే, కాని వాద్యభేదముల ననుసరించి తమంతతాము భిన్నభిన్న నాదములను కలుగ జేయును, లోక వ్యవహారముతో పూర్తిగా అలిప్తుడూ భిన్నుడు గానూ వుండెడి సూర్యుడు ఉదయించు చున్నాడు, మరియు ఆతడు అన్నింటికి దూరముగను విడిగాను వుండును. అయినప్పటికిని ఆతడు లోక వ్యవహారమును నడపుటలో నుపయోగపడు చున్నాడు. బీజధర్మము ననుసరించి జలము ఆయావృక్ష రూపమున రూపాంతరము పొందును. ఇదేవిధముగ జీవరూపమున నాస్వరూపము పరిణతిపొందును. ఒకపురుషుడు మూర్ఖుడుగ నుండును, మరొకడు తెలివి గలవాడుగా నుండును. ఈ యిద్దరిముందు రెండు నీలమణిహారములు పెట్టబడెను. మూర్ఖున కది సర్పముగ తోచి ఆతనిని భయభీతు నొనర్చును. కాని తెలివిగలవాడు దాని నిజస్వరూపమును తెలిసికొనును. అందువలన అది ఆతనికి ఆనందము నిచ్చును. స్వాతీనక్షత్ర జలము ముత్తెపు చిప్పలోపడి ముత్యముగ నగును. కాని సర్పశరీరమును ప్రవేశించి ఆ జలమే విషమగురీతిని నేను జ్ఞానులకు సుఖముగను, అజ్ఞానులకు దుఃఖముగను నగుదును.

సర్వస్యచాహం హృదిసన్నివిష్టో మత్తస్స్మృతిర్జ్ఞాన మపోహనంచ|
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాంతకృ ద్వేదవిదేవ చాహమ్ ||౧౫||

"వాస్తవముగ చూచినచో యీ ప్రాణులయొక్క మనస్సునందు రాత్రింబవళ్ళు 'నేను ఫలానా, ఫలానా వస్తువు నేనే' అనెడి భావమువుండును.

కాని మహాత్ముల సాంగత్యము చేయుటవలన, యోగజ్ఞానమును అభ్యసించుట వలన మరియు వైరాగ్యసంపన్నుడై గురు-చరణములను సేవించుట వలనను, మరియు యీ విధమగు యితర సత్కర్మములను ఆచరించుటవలనను ఎవరి యొక్క అశేషమగు అజ్ఞానము నాశనమైనదో మరియు ఎవరి అహంభావము నాలో ప్రవేశించి రమించసాగునో, అట్టివారు తమంతటామే నన్ను గుర్తింతురు. మరియు నన్ను అనగా ఆత్మతత్త్వమును గుర్తించి సుఖింతురు. వారు యీ విధమగు సుఖసంపన్న స్థితిని పొందుటకు నేను గాక మరెవరు కారకు లగుదురు? సూర్యోదయమైన పిమ్మట మన మా సూర్య ప్రకాశము వలననే ఆతనిని చూచు రీతిని నా సాధనము వలననే నా జ్ఞానము కలుగును. దీనికి విరుద్ధముగ, దేహాభిమానమున బంధింపబడి యుండుటవలనను మరియు ఎల్లప్పుడు సంసారముయొక్క గొప్పదనమును వినుచుండుట వలనను ఎవరి అహంభావము శరీరమునందే మునిగియుండునో అట్టివారు ఐహికము మరియు పారలౌకిక సుఖములను పొందుటకొరకై కర్మకాండకు సంబంధించిన అనేకకార్యములను చేయసాగుదురు. ఇందు వలననే వారి భాగమునకు దుఃఖ మనెడి విశిష్టాంశము లభించును; కాని, జాగ్రదవస్థలో చూచిన విషయములే స్వప్నమునకు కారణమగు రీతిని, ఓ అర్జునా! వారి యీ అజ్ఞాన జనితమగు భ్రమకు కూడా నేనే కారకుడనూ, ఆధారుడనూ అయి యున్నాను. మేఘముల మూలమున పగటియం దంధకారము వ్యాపించును, కాని ఆ మేఘములు కూడా అది పగలు అగుటవలననే కాన్పించుచున్నవి. ఇదే విధమున నా స్వరూపము ఏ తెరచే కప్పివేయబడి ప్రాణులకు కేవలము సాంసారిక విషయముగానే కాన్పించునో, అదికూడా నాశక్తియొక్క ఆధారమువలననే కాన్పించును. ఓ అర్జునా! నిద్రకూ మరియు మెలకువకూ కూడ జాగ్రదవస్థయే హేతువైన విధముగ యీ జీవులకుగల జ్ఞానము మరియు అజ్ఞానమునకుకూడ నేనే మూలకారణము. సర్పాభాసమునకు తాడనెడి

జ్ఞానమునకూ - రెంటికీ మూలకారణము తానే అయిన విధమున, అజ్ఞానము నకు మరియు జ్ఞానమునకూ, మరియు అజ్ఞానమువలన కానిపించెడి సాంసారిక ప్రసారమునకంతకునుకూడ నేనే మూలకారణమని తెలసికొనుము. కావున నే ఓ అర్జునా! నా స్వరూప కల్పనముగాక పూర్వము, వేదములు నన్ను తెలిసి కొనుటకై ముందుకుసాగినప్పుడు వాటియందు భిన్నభిన్నశాఖలు వెలువడ సాగెను. అయినప్పటికిని ఆ భిన్నభిన్నశాఖలుకూడా నన్ను గురించిన జ్ఞానమునే కలుగజేయుననిఎరుంగవలెను. ఏలనన, తూర్పుదిక్కునకు ప్రవహించుగాక, లేదా దక్షిణదిక్కునకు ప్రవహించుగాక - యీ రెండువైపులకు ప్రవహించు నదులూ అంతమున సముద్రము లోనికే పోయి కలియును. సుగంధసహిత ముగ గాలివీచలు ఆకాశమునందు లీనమగురీతిని, శబ్దసహితముగ శ్రుతులు కూడా 'అహం బ్రహ్మాఽస్మి' యనెడి మహా సిద్ధాంతమునందే లీనమగును. ఈ విధముగ శ్రుతులన్నియు పిగ్గిలి స్తబ్ధముగ నుండుటకూడా నా ప్రకాశము వలననే జరుగును. అటుపిమ్మట, ఏ నిర్మలజ్ఞానము కలుగుటతోడనే శ్రుతి సహితముగ జగత్తంతయూ లీనమగునో, ఆ జ్ఞానము నెరింగిన వాడను కూడా నేనే. నిద్రనుంచి లేచినపిమ్మట స్వప్నవిషయ మేదియూ మను ష్యునియందు మిగిలియుండక 'నేనే ఉన్నాన' ని ఆతడు తలంచురీతిని, ఏవిధమగు ద్వైతాభాసయూ లేకుండానే నేను నా అద్వైతత్వమును స్వయముగా నెరుంగుదును. మరియు ఆత్మబోధకు కారకుడనుకూడా నేనే. ఇంత అయినప్పటికిని కర్పూరమునకు నిప్పంటుకొనిన పిమ్మట, ఓ అర్జునా! దాని మసిగాని లేదా అగ్నిగాని మిగిలియే యుండని రీతిని, ఏ జ్ఞానము అవిద్యనంతను భస్మమొనర్చివేయునో, స్వయముగ అజ్ఞా నమే ఎప్పుడు లుప్తమైపోవునో, అప్పుడు అగుట - కాకుండుట, లేదా జన్మించుట - మరణించుటలుకూడా ఏ మాత్రము మిగిలియుండవు. తనతో పాటు యీ విశ్వము నంతనూ దొంగిలించుకొనిపోయిన దొంగయొక్క జాడతీయుట ఎటుల సంభవమగును? ఈ విధముగనే గల ఏకమగు అవర్ణ

నీయమగు శుద్ధావస్థ ఏదిగలదో, ఆ అవస్థకూడ నేనే. ఈ విధమున కేవల స్వరూపియగు బ్రహ్మము జడము - అజడములను అన్నింటిని వ్యాప్తమొనర్చినప్పుడు ఆ అనుపాధిక నిరంజన ఆత్మస్వరూపమువరకు చేరిపోవును.” శ్రీకృష్ణు లీవిషయముల నన్నింటిని చెప్పిరి; వీటి ప్రభావము పాలసముద్రమున ఆకాశమండలి చంద్రుని ప్రతిబింబముపడిన రీతిని, లేదా తళతళ మెరయుచున్న గోడపై దానిఎదుటగల చిత్రముయొక్క ప్రతిబింబము పడెడి విధముగా అర్జునుని అంతఃకరణముపైన పడెను. కాని, బ్రహ్మజ్ఞానమునం దొక విలక్షణ గుణము గలదు - అదేమన జ్ఞానము కలుగుచున్న కొలది దానియం దభిరుచి కూడ క్రమ క్రమముగ వృద్ధిపొందు చుండును. అందువలన అనుభవ - సిద్ధశ్రోత్రుడగు అర్జునుడు శ్రీకృష్ణ భగవానునితో నిటులనిరి - “ఓ మహారాజా ! మీరు మీ వ్యాపకత్వమును గురించి వివరించు సందర్భమున ఆవేశముతో మీరు వర్ణించి చెప్పిన మీ ఉపాధిరహిత స్వరూపమును గురించి నాకొకమారు స్పష్టీకరించి చెప్పగోరెదను” అంత ద్వారకాధీశులగు శ్రీకృష్ణు లిట్లనిరి - ఓ అర్జునా ! నీవు చాల చక్కనివిషయము నడిగితివి. నిజముగా అడిగినచో ఓ అర్జునా ! నాయందు కూడా ప్రేమ పూర్వకముగ నిరంతరము మాట్లాడు చుండవలె ననెడి వాంఛయుండును. కాని, నేనేమి చేయను, నీవలె ప్రశ్నించువాడు నాకెవడును దొరకడు. నేడు నీరూపమున నా మనోరథము ఫలించినది; ఏలనన, నీవు నిస్సంకోచముగ నన్ను హృదయపూర్వకముగ ప్రశ్నించితివి. అద్వైతమువరకు చేరిన పిమ్మట ఏ అనుపాధిక స్వరూపానుభవము కాగలదో, ఆ స్వరూపమును గురించియే నేడు నీవు ప్రశ్నించి నన్ను పరమ సుఖవంతునొనర్చితివి. ఏ అద్దమునకు ముందుగా వచ్చిన పిమ్మట మన నేత్రములే మనకు కనిపించునో, ఆ అద్దమువంటిదేయగు నీవంటి ప్రశ్న కుశలుడూ, నిర్మల శ్రోత్రుడూ నగు సహచరుడు నేడు నాకు సంభాషించుటచే లభించెను. ఓ సఖుడవగు అర్జునా ! నీవు అజ్ఞానుడవై అన్నివిషయముల నడుగుము.

నేను శిక్షకుడనై నీకు వాటి నన్నింటిని బోధించెదను". ఇటుల చెప్పి భగవానుడు అర్జునుని ఆలింగన మొనర్చుకొనెను, అంత నాతడు కృపా దృష్టిని బరపి చెప్పిన విషయముల నిక వినుడు. శ్రీకృష్ణు లిటు లనిరి. "ఓ అర్జునా! మాట్లాడుటకు పెదవులు రెండు వున్నప్పటికిని వాటి రెంటినుండీ ఒకే మాట వెలువడును; నడచుటకు కాళ్ళు రెండున్నప్పటికిని ఆ రెంటితోనూ ఒకేనడక జరుగును. ఇదేవిధమున నీవు ప్రశ్నించుట నేను జవాబిచ్చుటలు రెండునూ ఒకటియే. నీవూ, నేనూ-యిద్దరమూ ఒకే అర్థము లేదా అభిప్రాయముపై దృష్టినుంతుము. అందుచే యీ సమయమున ప్రశ్నించువాడూ జవాబిచ్చువాడూ-యిద్దరూ ఒక్కటే" ఇటుల చెప్పుచు భగవానులు ప్రేమపూర్ణులైరి. మరియు వారు అర్జునుని ఆలింగన మొనర్చుకొనిరి. అటుపిమ్మట వారు కొంచెము భయపడి తమలో తామిట్లనుకొనిరి - "ప్రేమయనెడి యీ మోహమును తొలగించవలెను, బెల్లమున తీపియే వుండును. అయినప్పటికిని ఆ మాధుర్యము తగ్గిపోకుండా కాపాడుట కొరకై దానియందు కొద్దిగా క్షారము కలపవలసియున్నది. ఇదే విధముగా ప్రేమయనెడి యీ మోహమును దూరమొనర్చకున్నచో చేజిక్కిన యీ సంవాద సుఖమును కోల్పోవలసి వచ్చును. పూర్వమునుండియే యీతడు నరుడు నేను నారాయణుడను. మా యిరువురియందును భేదమునకు తావేలేదు. అయినప్పటికిని నా యీ ప్రేమావేశమును లోలోపలనే అణుకొనవలెను." అని యోచించి వెంటనే భగవానులు అర్జునుని యిటుల యడిగిరి—"అర్జునా, నీవేమి యడుగుచుంటివి?" ఇది వినుటతోడనే అద్వైతప్రేమచే శ్రీకృష్ణభగవానుని స్వరూపమున లీనముకానున్న అర్జునుడు స్పృహతెచ్చుకొని, గద్గదస్వరముతో నిటులనెను— "మహారాజా, నేను మీ ఉపాధి హీనస్వరూపమును గురించి చెప్పవలసినదిగా కోరితిని" ఇదివిని, భగవానుడగు శార్ఙ్గధరుడు ప్రథమమున ద్వివిధ ఉపాధులను గురించి వర్ణించసాగెను. ఇందుపై కొందరు, అర్జునుడు ఉపాధిరహిత వస్తువును

గురించి అడుగగా, భగవానులీ ప్రకరణమున ఉపాధులనుగురించి ఏలచెప్పె
నని ప్రశ్నించవచ్చును. మజ్జిగనుంచి దానిసారాంశమును తీయుటనే వెన్నను
తీయుటయందురు, మరియు నికృష్టభాగమును భస్మమొనర్చుటనే బంగారును
పుటముపెట్టి స్వచ్ఛమైనట్టిదిగ చేయుటయనికూడ అందురు. నాచును చేతితో
ఒకప్రక్కకు తొలగించినప్పుడే నీరు లభించును. మేఘములు వుండనప్పుడే
కేవలము ఆకాశము అవశిష్టముగనుండును. పైనగలపొల్లును తీసివేసినప్పుడు
బియ్యపుగింజ లభించుటకు విలంబమేలయగును? సరిగా యిదేవిధమున, విచా
రణద్వారా ఉపాధియుక్త వస్తువుయొక్క ఉపాధులు అంతమొందినప్పుడు
నిరుపాధికమన నేమోఎవరికిని చెప్పనక్కరయుండదు. ఒకానొకయౌవనవతిని
వివిధనామములను ఉచ్చరించవలసినదిగా చెప్పినప్పుడామె, ఆపేరులలో
ఎచ్చటనైన తన భర్తపేరు వచ్చుచో ఆమె ఆపేరును ఉచ్చరించకపోగా
వెంటనే తనను లజ్జిలజేయు తలంపుతో తనభర్తపేరుకూడ అందుచేర్చబడిన
దని తలంచును. సరిగా యిదేవిధమున, అ నిర్గుణ, నిరుపాధిక నిరాకార
ఆత్మస్వరూపమును కేవలము శ్రుతిరాజైన వాక్కు ప్రకటించును. కావుననే
చెప్ప నలవికానివిషయమును చెప్పవలసినదిగా కోరుటచే, భగవానులు
ముందుగా ఉపాధులను గురించి వివరించసాగిరి. పాడ్యమినాటి చంద్రుని
సూక్ష్మరేఖను చూపించుటకై ఎత్తుగానున్నఏదేనొక వృక్షశాఖ ఉపయోగింప
బడు రీతిని, యీ సమయమున ఉపాధులను గురించిన చర్చకూడా అదేరీతిని
ఉపయోగ పడును:

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥ ౧౬

భగవాను లిటులనిరి— "సోదరా అర్జునా, యీ సంసార రూపమున
మున్న నగరమతి చిన్నది. అనగా కేవల మిద్దరు పురుషులకు మాత్రమే చెంది
నది. ఆకాశమునం దంతటను కేవలము రాత్రింబవళ్ళు రెండే వుండు రీతిని
యీ సంసారమనెడి నగరమునందు కూడా కేవలము యిద్దరు పురుషులే

వుందురు. మరియొక మూడవ పురుషుడుకూడా గలడు. కాని అతనికి యీ యిద్దరిపేరుకూడా యిష్టముకాదు. ప్రస్తుతము మాత్రి మీ యిద్దరి పురుషులను గురించియే తెలిసికొనుము. ఈ పురుషులిద్దరూ యీ సంసారమనెడి నగరమున నివసించుటకై వచ్చిరి. వీరిలో ఒకడు అంధుడు, మూఢుడు మరియు కుంటివాడు, మరి రెండవవాడో సర్వావయవములు గలిగిన బలశాలి. వీరిద్దరూ ఒకేనగరమున నివసించుచుండుటవల్ల వీరికి స్నేహము కలిగెను. వీరిలో మొదటి వానిని క్షరుడు రెండవవానిని అక్షరుడు అందురు. ఈ జగత్తునంతను వీరిద్దరే దట్టముగ నింపియుంచిరి. ఈ యిర్వురగు క్షరుడు, అక్షరుడు అనెవరో నీకు వివరించి చెప్పెదను వినుము. ఓ అర్జునా, మహత్తత్త్వమునుండి మొదలుకొని తృణాగ్రభాగమువరకుఎన్నిచిన్నవీ-పెద్దవీయగుచరాచరవస్తువులీసంసారమందు గలవో, లేదా మనస్సు లేక బుద్ధిలోనికి ఎన్నివిషయములు రాగలవో, ఏయే వస్తువులు పంచమహాభూతములచే నిర్మితమైనవో, వేటివేటికి నామరూపములు గలవో, ఏవేవి త్రిగుణవ్యాప్తిలోనికి వచ్చునో, ఏ బంగారుతో యీ భూతకోటి యనెడి నాణెములు తయారగునో, ఏ గవ్వల నాధారముగా గొని కాలుడనెడి జూదపు ఆట ఆడబడునో, విపరీతజ్ఞానము అనగా భ్రమ, లేదా మోహముచే ఏ యే విషయజ్ఞానము కలుగునో, ఏది ప్రతిక్షణము నందును పుట్టి - నశించుచుండునో,- తాత్పర్యమేమన, లోకులు దేనిని జగత్తందురో ఏది ప్రకృతి లేదా మాయా కారణముచే అష్టవిధ భేదములచే కూడియున్నదో, ఏ దేహక్షేత్రము యిదివరలో వర్ణింపబడియున్న ముప్పదియారు భిన్నతత్త్వములచే నిర్మితమైనదో—దానిని యింకెంత దూరము వర్ణింపను - ఇంతకు ముందు నేను సంసారవృక్షమని వర్ణించిన వర్ణనమంతయూ, మనము నివసించు నగర మనియు, చైతన్యమే యీ ఆకారముల నన్నింటిని ధరించుననియు తెలిసికొనవలెను. సింహముయొక్క ప్రతిబింబము ఏదైన నూతిలోపడినప్పుడా సింహము ఆ ప్రతిబింబమును చూచి 'ఆ కనిపించు నట్టిది మరొక సింహమ'ని తలంచి, క్రోధముచే గర్జించుచూ ఆ నూతిలో

దూకు రీతినీ, లేదా నీటియం దుండెడి ఆకాశతత్త్వముపైవనే ఆకాశము యొక్క ప్రతిబింబము పడు రీతిని అద్వైతముకూడా ద్వైతమును అంగీకరించును. ఓ అర్జునా ! యీ రీతిని సాకార నగరమును కల్పన మొనర్చుకొని ఆత్మ తన మూలస్వరూపమును మరచిపోవును. మరియు ఆవిస్మృతి యందే నిద్రించును. ఒకానొకడు స్వప్నమున పడకగదినిచూచి దానియందే నిద్రించునటీతిని, ఆత్మకూడా యీ కల్పిత నగరమున నిద్రించును. అటు విస్మృతి ఆ నిద్రావేశములో అది 'నేను సుఖముగ నున్నాను. నేను దుఃఖముగ నున్నాను' అని తలంచసాగును. అంతట స్వప్నమునందే అహంకారోద్రేకములలో కలవరించసాగును. ఇతడు తండ్రి, యీమె తల్లి అని అది తలంచసాగును. నేను ఎఱ్ఱగానున్నాను, లేదా చాలదీనుడను, దుర్బలుడను, ఇతడు కొడుకు, యీమె భార్య. వీరంతా నావారు కాదా ? అని తలంచసాగును. ఈ స్వప్నమునందేపడి అది ఇహ – పరలోకపుకలలలో నుండును. ఓ అర్జునా, ఈ చైతన్యమునే 'క్షర పురుష ' డందురు. ఇక, ఎవనిని ' క్షేత్రజ్ఞ ' డందురో, ఎవని స్థితిని జగత్తునగల లోకులెల్లరు జీవమందురో, ఎవడు తనను తాను మరచిపోయి భూతకోటియొక్క గుణధర్మములకు అధీనుడయి వ్యవహరించునో, ఆ ఆత్మనే ' క్షర పురుష ' డందురు. ఏదృష్టిచే ఆతడు పూర్ణరూపముగ బ్రహ్మయో, అదేదృష్టితో ఆతనికి ' పురుష ' నామముకూడ శోభిల్లును. ఇదిగాక, అతడు శరీరమున్నందంతటను నిద్రావస్థయం దుండును, అందువలనకూడ ఆతడు పురుషుడని పిలుచుటకు అర్హుడగును. కాని ఆతడు ఉపాధిచే అంకితుడగుటవలన ఆతనిపై వ్యర్థముగనే క్షరత్వము, నశ్వరత్వములనెడి కళంకములు ఆపాదింప బడినవి. అలలుగా లేచుచున్న నీటితో పాటు చంద్ర ప్రకాశముకూడా ముందు – వెనుకలకు పోవుచున్నటుల కనిపించు రీతిని, యిదికూడా ఉపాధికిగల వికారముల వలన చంచలముగా కాన్పించును. కాని, ఆ అలలు లేచు నీరు ఎండిపోయినప్పుడు దానిలో ప్రతిబింబించెడి చంద్రప్రకా

శము కూడా లోపించును, సరిగా యిదేవిధమున, ఉపాధి నాశమైనప్పుడు దానికి ఉపాధివలన కలిగిన వికారములు కూడా లేకుండా పోవును. ఈ విధముగా ఉపాధియొక్క సామర్థ్యము వలననే దీనికి క్షణభంగురత్వము ప్రాప్తించినది. మరియు యీ దుర్బలత్వము వలననే లోకులు దీనిని క్షరమందురు. కావుననే, జీవుడు లేక చైతన్య జీవాత్మను క్షరపురుషుడని ఎరుంగవలెను. ఇక అక్షరపురుషుడని ఎవనినందురో చెప్పెదను వినుము. ఓ వీరుడవగు అర్జునా ! అక్షరుడను పేరుగల యీ రెండవ పురుషుడు కేవలము పర్వతములలో మేరు పర్వతమువలె మధ్యస్థుడు మరియు సాక్షీరూపమున చూచువాడునై యున్నాడు. పృథ్వి, పాతాళము మరియు స్వర్గములనెడి స్థలభేదముల ననుసరించి మేరువెన్నడును త్రివిధము లంగ కానిరీతిని, యీ అక్షరపురుషుడుకూడా జ్ఞానాజ్ఞానాంగము లందు లిప్తుడుకాడు. అతడు శుద్ధజ్ఞానముచే ఏకత్వమునూ పొందడు. మరియు అజ్ఞానమువలన అతనిలో ద్వైతభావమూరాదు. ఈ రీతిని కేవలము జ్ఞాతృత్వముతో కూడియున్న తటస్థతయే యీతని స్వరూపము. మట్టియొక్క మట్టితనము నశించినప్పుడు దానిచే కుండలు మొదలగు పాత్రలు తయారు చేయుటకు వీలుకలుగదు. సరిగా అదేవిధమున, ఆ మృత్తికాత్వము లోపించిన పిండమువలె యీ మధ్యస్థపురుషుడున్నాడు. సాగరముగాని జలాశయముగాని యింకిపోయినప్పుడు వానియందు అలలూవుండవు. నీరూ వుండదు. ఆ ఎండిపోయిన సరోవరమువలె యీ మధ్యస్థుని నిరాకార స్థితి యుండును. ఓ అర్జునా, దీనిని నిద్రలో వచ్చెడి కునికిపాట్లు వంటి స్థితిగా ఎరుంగుము. ఏలనన అప్పుడు మెలకువ ఏవిధమూ గనూ వుండదు. కాని స్వప్నావస్థ మాత్రము పూర్తిగా రాదు. ఎవడు కేవలము ఆ అజ్ఞానావస్థ యందుండునో, ఎవనియందు విశ్వాభాస నశించినప్పటికిని అప్పటివరకు ఆత్మజ్ఞానోదయము కాలేదో అతనినే అక్షరుడని చెప్పవలెను. షోడశ కళావిరహితుడగు అమావాస్యనాటి చంద్రుని

రూపముతో సమానముగ యీ అక్షరుని లక్షణమునుకూడ ఎరుంగవలెను. ఉపాధులన్నియూ నశించినపిమ్మట జీవదశ దేనియందు లీనమగునో, ఉపాధులు నశించినపిమ్మట కాయకాసిన పిమ్మట వృక్షము బీజరూపమున ఆ కాయలో సమావిష్టమై యుండురీతిని దేనియందు లీనమైయుండునో దానినే అవ్యక్తమందురు. గాఢమగు అజ్ఞానమును సుషుప్తి యందురు. మరియూ స్వప్నము-జాగ్రదవస్థలను దాని ఫలరూపములుగా నెరుంగవలెను. వేదాంతమున బీజస్థితి యనబడు వస్తువది యీ అక్షరపురుషస్థానమే. ఎచ్చటినుంచి విపరీత జ్ఞానము జనించి జాగ్రత్స్వప్నములద్వారా అనేక తర్క వితర్కము ఆనెడి వనమున సంచరించునో, మరియు ఓ అర్జునా! ఎచ్చటినుంచి విశ్వాసము బయలుదేరునో, ఎచ్చట వ్యక్తము మరియు అవ్యక్తములు ఐక్య మొందునో, ఆ అవస్థయే అక్షరపురుషుడు. రెండవవాడగు క్షర పురుషుడు ఈ విశ్వమున జాగ్రత్స్వప్నము లనెడి ఆటను ఆడును; జాగ్రత్స్వప్నావస్థలు రెండునూ ఎచ్చటినుంచి జనించునో మరియు బ్రహ్మప్రాప్తికంటె కొంచెము నిమ్నకోటికి చెందిన ఏ అవస్థ గలదో, మరియూ ఏది అజ్ఞానపు గాఢనిద్ర యనెడి పేరట ప్రసిద్ధి పొందెనదో, మరియు ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా, దీని తరువాత స్వప్న, జాగ్రిత లనెడి అవస్థలు ఉత్పన్నము కానిచో యథార్థముగ ఏ అవస్థకు బ్రాహ్మీస్థితియని పేరు బెట్టబడునో, కాని దేని ఆకారమున ప్రకృతి పురుష లనెడి యీ రెండు మేఘములున్నూ ఉత్పన్నమగునో, మరియు దేనియందు క్షేత్రము మరియు క్షేత్రజ్ఞులయొక్క స్వప్నాభాస యుండునో, తాత్పర్యమేమన, తనశాఖలపైన ప్రసార మొనర్చెడి యీసంసార వృక్షముయొక్క మూలమునే యీ అక్షరపురుష స్వరూపముగా నెరుంగ వలెను. కాని, ఈతడు పూర్ణరూపమున ఆత్మస్వరూపమునం దున్నప్పుడీతనిని పురుషుడని ఏల పిలుచుచున్నారు అని ప్రశ్నించుచో, దానికి జవాబు, ఈతడు మాయా నగరమున నిద్రించి యుండుటవలన యీతనిని పురుషుడని పిలుచుచున్నారు.

(13)

ఇదే రీతిని, వికారములుచేయు గందరగోళముకూడా అజ్ఞానముయొక్క ఒక విధానమే. ఆ అజ్ఞానానుభూతి కలుగని స్థితియే దీని సుషుప్త్యావస్థ. ఇందు వలననే యీతడు స్వయముగా ఎన్నడును నశించడు, మరియు జ్ఞానమునకు మినహా మరేవిధముగానూ, యితనిని నాశమొనర్చుటకు వీలుకాదు. ఇందు చేతనే వేదాంతము మహాసిద్ధాంత ప్రాంతమున దీనికి 'అక్షర' నామమును ప్రసిద్ధమొనర్చినది. సారాంశమేమన, జీవరూపియగు కార్యమునకు ఏది కారణమో మరియు మాయా సాంగత్య మెవరిలక్షణమో, దానినే అక్షర పురుషుడు అనగా స్వయంచైతన్యముగనే ఎరుంగవలెను.

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥౧౭॥

యస్మా త్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః ।
అతోఽస్మిలోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥ ॥౧౮॥

" ఇక యీ విపరీత జ్ఞానమువలన లోకులయందు జనించు జాగ్రత్స్వప్నము లనెడి ద్వివిధావస్థలున్నూ మూలగాఢ జ్ఞానమునందు లీనమగును. మరియు, ఆ మూలఅజ్ఞానము జ్ఞానమునందు లోపించి, జ్ఞానముఎదుటకు వచ్చినప్పుడు జ్ఞానముకూడ ఆ అజ్ఞానమును 'అగ్ని కట్టెను కాల్చివేయు రీతిని' నాశమొనర్చును; మరియు అప్పుడు ఆ జ్ఞానమును ఆత్మవస్తువును ప్రాప్తింపజేసి 'కట్టెను కాల్చివేసి అంతమున అగ్నికూడ తనంతతానే నశించిపోవు రీతిని' జ్ఞానముకూడ తన్నుతానే నాశమొనర్చుకొనును. మరియు అట్టి స్థితిలో, జ్ఞానముకాకుండా మిగిలియుండు తదితరమును, ఓ అర్జునా, ఉత్తమపురుషునిగా నెరుంగుము. మొదట క్షరుడు మరియు అక్షరుడునని యిద్దరు పురుషులు చెప్పబడిరి. అంతమందు వీరిద్దరికిభిన్నుడగు మరియొక మూడవ పురుషుడుగలడనెడి సిద్ధాంతము ఏర్పడును. ఓ అర్జునా !

సుషుప్తి మరియు స్వప్నావస్థలు రెంటికిని భిన్నమైనదగు జాగ్రదవస్థ మరి యొకటి కలదు. ఇవి మూడింటికిని భిన్నమైన మూడవ అవస్థగా చెప్పుదురు. కిరణములు మరియు మృగజలములు రెంటికిని భిన్నమైనదై సూర్యమండలము విస్తరించును. ఈ ఉదాహరణము ఉత్తమపురుషుని పట్లకూడా చెల్లును. అతడు కూడ క్షరాక్షరు లిద్దరికిని భిన్నమైనవాడు. కేవల మంతియేకాదు. కాష్ఠము నందుండు అగ్ని కాష్ఠమునకు భిన్నముగానుండు రీతిని యీ ఉత్తమ పురుషుడుకూడ క్షరాక్షరు లిద్దరికిని భిన్నుడు. ప్రళయ కాలమందలి ప్రళయ జలముకు అనంతరూపమును ధరించి, సమస్త నీరులను దాటి సమస్తనదీ నదము లను ఏకరూపముగా నొనర్చు రీతిని దేనియందు స్వప్నము, సుషుప్తిమరియు జాగ్రదవస్థలు మూడునూ ఏమాత్రమూ మిగిలి యుండవో, ప్రళయ కాలము తన సంహారక తేజస్సుచే రాత్రిం బవళ్ళను కబళించు రీతిని ఏది అవస్థల నన్నింటిని లయమొనర్చునో, మరియు యిందు మూలమున దేనియందు ద్వైతాద్వైతములు ఏమాత్రము తోచనే తోచవో, అట్టివానినే ఉత్తమ పురుషునిగ నెరుంగవలెను. కాని పరమాత్మను కూడా కేవలము జ్ఞానియందు కలియకుండా జీవదశను ఆశ్రయించి యున్న స్థితియందే ఉత్తమ పురుషుడని పలుకుదురు. ఓ అర్జునా, నీటియందు మునుగుట యన్నమాట తాను స్వయముగా నీటిలో మునుగక ఒడ్డున నిలచియుండి, మరొకడు నీట మునుగుటను చూచినప్పుడే చెప్పవగును. సరిగా యిదే రీతిని వేదములుకూడా వివేకమనెడి ఒడ్డున నిలబడి యీ ఒడ్డు మరియు ఆ ఒడ్డు లేదా ఉత్తముడు మరియు కనిష్ఠుని గురించి చెప్పగలుగును. కావుననే, అవి క్షరాక్షరులగు పురుషు లిద్దరిని నిమ్నకోటికి చెందినవారుగా మన్నించి యీ యిద్దరికి పైనవుండెడి యీ పురుషుని పరమాత్మరూపముగా చెప్పుచున్నది. ఓఅర్జునా, యీవిధముగ "పరమాత్మ" శబ్దము పురుషోత్తముడని అర్థమిచ్చునని నీవు జ్ఞప్తియం దుంచుకొనుము. వాస్తవము చెప్పవలెననిన, ఏ వస్తువు నందు మాట్లాడకుండుటయే మాట్లాడుట యగునో, ఏమియూ ఎరుగ

కుండుటయే దేనియందు జ్ఞానమగునో, మరియు ఏమియూ జరుగకుండుటయే దేనియందు ఏదేని క్రియ జరుగుచుండుట యగునో, దేనియందు సోఽహం భావనకూడా వుండదో, దేనియందు చెప్పెడివాడు చెప్పెడి విషయము తోను మరియు జ్ఞాత జ్ఞేయముతోనూ కలసి ఏకరూపమును పొందునో, దేని యందు ద్రష్ట మరియు దృశ్యములు రెండునూ లయమును పొందునో, అదియే ఆ ఉత్తమ పురుషుడు. బింబము మరియు ప్రతిబింబమునకు మధ్యగల ప్రకాశము మనము చూచుచుండగనే నశించినప్పటికినీ, ఆప్రకాశము లేనే లేదని గాని, అది నశించిన దనిగాని మనము చెప్పరాదు. లేదా ఘ్రాణేంద్రియము మరియు పుష్పమునం దుండెడి సుగంధము మనకు కనిపించనంత మాత్రమున సుగంధము లేనేలేదని చెప్పదగదు. సరిగా యిదే రీతిని, ద్రష్ట మరియు దృశ్యములు లోపించిన పిమ్మట ఏమియూ మిగిలి యుండదు అని చెప్పుటకూడ ప్రమాణ - సిద్ధము కాదు. మరి యిందువలననే, యిట్టి స్థితిలో అనుభవములోనికి వచ్చుదానినే ఉత్తమ పురుష స్వరూపమని యెరుంగవలయును. ఏది ప్రకాశితము కాదగని దైనప్పటిని ప్రకాశమో, ఏది నియమిత మొనర్పబడజాలనిదై యుండిన నియంతయో, ఏది స్వయముగనే అవకాశముగనై తదుపరి ఆ అవకాశమునే వ్యాప్త మొనర్చునో, ఏది నాదమునకుకూడ నాదమో, రుచికికూడ రుచియో మరియు ఆనందమునకుకూడ ఆనందమగునో, ఏది పురుషోత్తముని పూర్ణత్వమునకుకూడ పూర్ణత్వమో మరియు విశ్రాంతికికూడ విశ్రాంతియో, ఏది సుఖమునకుకూడ సుఖమో, తేజస్సునకుకూడ తేజస్సో - మరియు శూన్యమునకుకూడ శూన్యమో, ఏది వికాసమునుకూడ నింపివైచి యింకనూ మిగిలియుండునో, ఏది గ్రాసమును కూడ గ్రసించి వేయునో, ఏది అధికముకంటె కూడా అత్యధికమో, మరియుఏది తనస్వరూపమును విడువకుండానే మరియు విశ్వమునందు కలియకుండానే ముత్తెపుచిప్ప వెండి కాకపోయి నప్పటికికూడ అజ్ఞానులకు వెండివలె భ్రాంతిని కలుగ

శేయు రీతిని విశ్వాభాసమునకు ఆధారమగునో, లేదా బంగారము తన స్వర్ణత్వమును దాచుకొనకుండానే నగల రూపమును ధరించు రీతిని, లేదా 'నీరు మరియు దానియందుదయించు అలలూ ఒక్కటే అయినటులనూ, వాటియందే భేదమూ లేని విధమున ఎవడీ భాసమానమగు జగత్తున కంతకు తానే ఆధారుడై యున్నాడో, అట్టివాడగు నాతడే ఉత్తమ పురుషుడు. నీటియందు పడెడి తన ప్రతిబింబముయొక్క సంకోచ - వికాసములకు ముఖ్యకారణము చంద్రబింబమే యగురీతిని, యీతడు కూడా జగద్రూపమున కొద్ది కొద్దిగా ప్రకటమగును. కాని. యీ జగత్తంతయూ లోపించినప్పుడు కూడ యీతడు లోపించడు. రాత్రి మరియు పగటి సమయముల వలన సూర్యునియందెన్నడును ఎచ్చటను రెండు విధములగు భావములు జనించని రీతిని, ఎవడు ఏ ప్రదేశమునందును ఎవనితోనూ వ్యయమును పొందడో, ఎవనితో పోల్చి చెప్పుటకు స్వయముగ ఆతడే తప్ప మరెవ్వరూ లేరో ఓ అర్జునా! ఎవడు స్వయముగ తనను తానే ప్రకాశిత మొనర్చుకొనునో, మరియు యింకెం తని చెప్పను! ఎవనియందు మరింకేవిషయముగాని మరింకేదిగాని లేనేలేదో, అదియే ఉపాధిహీనము క్షరాక్షరులకంటె శ్రేష్ఠమైనది మరియు ఏకమేవాద్వితీయము నగు నేనైయున్నాను. ఇందువలననే వేదములు మరియు లోకులూ నన్ను పురుషోత్తము డందురు.

యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత ! ॥౧౯॥

దీనిని గురించి యిప్పటికే కావలసినంత చెప్పబడినది. ఓ అర్జునా, ఎవరియందు జ్ఞానసూర్యు డుదయించెనో మరియు యిందుచే ఎవరు నన్ను పురుషోత్తమునిగా నెరింగిరో జ్ఞానమనెడి మెలకువ కలిగిన పిమ్మట ఎవరికి యీ దృశ్యజగత్తు స్వప్నమువలె మిథ్యగా బోధపడసాగెనో, లేదా ఎవరు నానిజమైన జ్ఞానము కలిగినందువలన మిథ్యాప్రపంచపు చిక్కులనుండి 'మా

లను చేతగాని నప్పుడు దానినిగురించిగల సర్వాభాస వెంటనేతొలగిపోవురీతిని తప్పించుకొనిరో, ఎవరు నా సత్యస్వరూపమును తెలిసికొని ' యీ అలంకారములు స్వర్ణముచే చేయబడినవని ఎరింగిన మానవుడు అలంకారత్త్వమును మిథ్యయని చెప్పువిధమున ' భేదభావము పరిత్యజింతురో, నేనే సర్వవ్యాపకుడను అద్వితీయుడును మరియు స్వయంసిద్ధ సచ్చిదానందుడనని ఎవడు చెప్పునో, ఎవడు తన్నుతానే స్వయముగా నాకు భిన్నుడు కానటుల తెలపికొనునో మరియు ఎవడు నా ఆత్మస్వరూపమును గుర్తించునో, అట్టివాడుమాత్రమే సమస్తమును తెలిసికొనెనని ఎరుంగవలెను. కావున ఓ అర్జునా! యిట్టి మనుష్యుడే నన్ను భజించుటకు అర్హుడగును. చూడుము, ఆకాశమున చక్కగా కలసిపోవుటకు కేవలము ఆకాశమే పనికివచ్చును. క్షీరసముద్రమునకు క్షీర సముద్రము మాత్రమే ఆతిథ్య మివ్వగలుగురీతిని లేదాఅమృతముమాత్రమే అమృతమున కలపి ఏకరసముకాగలుగువిధమునలేదా మంచిబంగారములో మంచిబంగారమును కలిపినప్పుడు ఆరెండింటిమిశ్రణము కూడా మంచిబంగారమే యగురీతిని, ఎవడు మద్రూపుడగునో అతడే నా భక్తి యొనర్చగలడు. చూడుము,నది సముద్రమునకలసి ఏకరూపమును పొందజాలనిచో అది యెటుల దానిలో కలియగలదు ? ఇదే రీతిని, నా స్వరూపమునందు కలసి ఐక్యత్వమును పొందజాలని వాడు నాతో భక్తియనెడి సంబంధము నెటుల ఏర్పరచుకొన గలుగును? తరంగములు సాగరమునం దన్నివిధముల తన్మయమై పోవురీతిని, ఓ అర్జునా ! ఎవడు అనన్యుడై నన్ను భజించునో, అతని భక్తికి నాతోఎట్టి సంబంధముగలదో, ఆ సంబంధము యొక్క ఉపమానము ప్రకాశము మరియు సూర్యులవలన మాత్రమే చక్కగా నివ్వనగును.

ఇతి గుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయానఘ ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత ॥ ౨౦ ॥

"ఈ రీతిని యీ అధ్యాయ ప్రారంభమునుంచి యిచ్చటి వరకు సమస్తశాస్త్ర సమ్మతముగా ప్రతిపాదింపబడిన మహాతత్త్వము, కమలములం

పతి సుగంధమువలె ఉపనిషత్తులను సుగంధితమొనర్చును. మరియు యిది శబ్ద - బ్రహ్మమును మథించుటచే లభించు అర్థసర్వస్వమై యున్నది. శ్రీమాన్ వ్యాసమహాఋషియొక్క బుద్ధిసహాయముచే తీయబడిన యీ సారమును నేను యీశ్వరునకై నివేదించితిని. ఇది జ్ఞానరూపమునందున్న అమృతగంగ లేదా ఆనందరూపమునందున్న చంద్రుని షోడశకళ, వేద విచారణరూపమునందున్న క్షీరసాగరమునుండి బయల్వెడలిన నూతనలక్ష్మియే. ఇందువలననే అది తన పద (శబ్ద - సమూహ) వర్ణ (అక్షరము) అర్థరూపమునందున్న జీవితముతో నన్ను తప్ప మరి దేనినీ ఎరుంగదు. ఈ లక్ష్మియెదుట క్షరము మరియు అక్షరము అనెడి రెండునూ నిలబడియుండును. కాని యీమె పౌరబాటును నైన ఆ రెంటివైపును చూడక, తన సర్వస్వమును పురుషోత్తముడనైన నాకే యీమె అర్పించినది. ఇందువలననే, యీ సంసారమునందే గీత నా (అనగా ఆత్మయొక్క) ఏకనిష్ఠగల పతివ్రతయై యున్నది. నేడు నీవు దానిని వింటివి. ఈ గీతాశాస్త్రము నోట వచింప దగినది కాదు, కాని సంసారమును జయింపగల శాస్త్ర మిది యొక్కటియే. ఆత్మ స్ఫురణమును కలిగించు ఏ మంత్రాక్షరములు గలవో, అది యీ గీత యందలివే. కాని ఓ అర్జునా, నేడు నీకీ శాస్త్రమును చెప్పి నా గుప్తధన సంగ్రహమును నీ ఎదుట తెరచిపెట్టితి ననుకొనుము! చైతన్యరూపియగు శంకరుని మస్తకముపైన నేను దాచియుంచిన గీతయనెడి గంగను, ఓ అర్జునా, ఆసక్తితో బయటకు లాగిన నీవు నేడు రెండవ గౌతముడ వైతివి. సరియైన రీతిని నా శుద్ధస్వరూపమును చూపుటకు, ఓ అర్జునా! నేడు నీవు నా ఎదుట పెట్టబడిన అద్దమువలె నగుచున్నావు లేదా, చంద్రుడు మరియు నక్షత్రములతో నిండియున్న ఆకాశమును సాగరము తన జలమునందు ప్రతిబింబ రూపమున గైకొను రీతిని నేడు నీవు గీతా సహితముగ నన్ను కూడా నీ యంతఃకరణమున ప్రతిబింబింప జేసికొంటివి. ఓ అర్జునా, నీలోగల త్రిగుణములనెడి మలము తొలగిపోయినది.

నీవు గీతాసహితముగ నా నివాసస్థాన మైతివి. కాని యీ గీతను నేనేమని వర్ణించను! నాయీ జ్ఞానరూపియగు లత నెరింగినవాడు సమస్త మోహములనుండి ముక్తుడగును. ఓ అర్జునా, అమృత రూపమునున్న నదిని సేవించుటచే రోగముల నన్నింటిని పరిహరించి అమరత్వమును ప్రసాదించి మానవుని సమస్త విధముల సుఖవంతు నొనర్చురీతిని యీ గీతాజ్ఞానము కలిగిన పిమ్మట మోహము నశించునని చెప్పుటలో ఆశ్చర్య పడవలసిన విషయ మేమిగలదు? ఈ గీత కలుగజేయు ఆత్మజ్ఞానమువలన మనుష్యునకు ఆత్మస్థితి కూడ ప్రాప్తించుననుటలో ఏమాత్రము సంశయము లేదు. మానవునకు ఆ ఆత్మజ్ఞానము కలిగినప్పుడు ఆతని కర్మలుకూడా యీ జ్ఞానమువలన మన ఆయువు నిండిపోయినదని తలంచి మిక్కుటమగు ఆనందముతో లయమును చెందును. కోల్పోయినవస్తువు లభించిన పిమ్మట దానిని వెదకుట యనెడి పనికూడా సమాప్తిపొందురీతిని, కర్మరూపియగు మందిరముపై జ్ఞాన మనెడి శిఖర మెక్కినప్పుడు కర్మలుకూడ తమంత తామే ఆగిపోవును. ఇందు వలననే, జ్ఞానియగు పురుషుడు చేయవలసిన కర్మ ఏదియూ మిగిలి యుండదు. " ఈ విషయములను అనాథులకు పుష్టిపోషకుడగు శ్రీకృష్ణ భగవానులు చెప్పిరి. శ్రీకృష్ణుని యీ వచనామృతముచే అర్జునుని అంతఃకర ణము చక్కగా నిండిపోయెను, మరియు ఆ అమృతము అంతఃకరణము నుంచిబయటకుపొంగి ప్రవహించసాగెను. ఆఅమృతమే వ్యాసదేవుని ప్రసా దము వలన సంజయునకు లభించుచుండెను. సంజయు డా అమృతముచే ధృతరాష్ట్ర రాజా నెదుట ప్రాశన మొనర్చుటకై పెట్టెను, మరియు యీ అమృతపు కృపవలననే మరణ సమయమునందు ధృతరాష్ట్రుడు చక్కని పరి ణామమును పొందెను. సాధారణ సమయమున ఒక్కొక్కప్పు డొక్కొక్క శ్రోత అనధికారిగా తోచినప్పటికిని, అంతమున ఆతనికికూడాయీ గీత ఉపయోగ కరముగనే యగును. ద్రాక్షతీగె మూలమునందు పాలు పోసినప్పుడు సాధారణముగా ఆ పాలు వ్యర్థముగ పోయెననియే తోచును.

కాని అత్తిగెయందు కాయలు కాయసాగినప్పుడు దాని మొదలునందు పోసిన పాలవలన అవి ద్విగుణీకృత మగును. ఈ న్యాయము ననుసరించయే భగవానుని నోటినుండి వెడలిన వాక్కులను సంజయు డత్యుత్సాహముతో అంధుడగు ధృతరాష్ట్రునకు వినిపించియుండెను; మరియు యికముందు ఆ వచనామృతపు కృపవలననే ఆ అంధుడు మరణసమయమున సుఖించి యుండెను. శ్రీకృష్ణుని ఆ వచనామృతమును నేను దేశభాషలో నాబుద్ధి సామర్థ్యముల ననుసరించి మీ అందరిముందు నుంచితిని. తెల్లగులాబిపువ్వుయొక్క రూపమును చూచినచో దానియందు రసికులు కానివారిని విశేషించి మోహింపజేయగల ఏ విషయమూ కాన్పించదు; కాని భ్రమరములవలె రసజ్ఞులైనవారు మాత్రము ఆపువ్వములందలి రసమును ఆస్వాదించుట నెరుంగుదురు. మరియు యిష్టానుసారముగవాటిని దోచుకొనగలరు. ఇందువలననే ప్రమాణమనెడి మచ్చురాతిపైసరిగానున్నసిద్ధాంతమునుమీరుస్వీకరించుడుమరియుయీవిధముగ చేసినప్పుడు ఏమాత్రమైన కొరవడిన దేదైననున్నచో దానిని నావద్దనేవుంచనివ్వుడు. ఏలనన సరియైన బుద్ధిలేకుండుట నావంటి బాలురకు స్వాభావికమే. బాలకుడు అజ్ఞానియే అయిననగుగాక, కాని అతనిని చూడగానే మాతా-పితలకు 'తమ అంతఃకరణమున పట్టరానంత' అత్యధికమగు ఆనందముకలుగును. మరియు వారాబాలకుని ముద్దులాడి అత్యధికసుఖమును పొందుదురు. సరిగా యాదేవిధమున- మహాత్ములగు మీరు నాకు మాతృస్థానము వంటివారు. మిమ్ము నేను కలిసికొనినప్పుడు నే నతిగారాబముగ మాట్లాడుదును. మరియు యీ గీతాగ్రంథమును వ్యాఖ్యానించుట కూడా ఆ ప్రేమకు ఒక ఉదాహరణము. ఇక యీజ్ఞానదేవుడు'శ్రీవిశ్వస్వరూపుడవైన నా గురురాజవగు శ్రీనివృత్తి నాథప్రభూ, తాము నాయీ వాగ్రూపమునను సేవను స్వీకరించ వలసినదిగా ప్రార్థించు చున్నాడు.

---

# తెలుగు జ్ఞానేశ్వరి

## పదునారవ యధ్యాయము

జగత్తనెడి భాసత్యమును నష్టమొనర్చి అద్వైతమనెడి కమలమును వికసింపజేయునట్టి యీ శ్రీ సద్గురు రూపియగు అద్భుత సూర్యు డుదయించెను. నేనితనికి నమస్కరింతును. ఏ సూర్యుడు అజ్ఞాన మనెడి రాత్రిని అంతమొందించి, జ్ఞానము మరియు అజ్ఞానమనెడి ప్రకాశమును నాశముచేసి జ్ఞానులగు పురుషులకు ఆత్మబోధ యనెడి శుభదినమును చూపించునో, ఏ సూర్యోదయమగుట వలన వాసనాత్మక శరీరమనెడి కమలకోశమున బంధింపబడి పడియున్న చైతన్యరూపియగు భ్రమరము ఒక్కమారుగా బంధవిముక్తిని పొందునో, భేదభావన యనెడి నది కిరుప్రక్కలను శబ్దములనెడి వలలో చిక్కుకొని మరియు పరస్పర వియోగమువలన ఉన్మాదియై ఆక్రోశించెడి బుద్ధియనెడి చక్రవాక పక్షుల జంటకు పూర్ణఏకత్వమనెడి లాభము కలుగజేయునో, ఏ సూర్యుడు చైతన్యరూపియగు ఆకాశమును 'దీపము యింటిని ప్రకాశింప జేయురీతిని' ప్రకాశింపజేయునో, ఏ సూర్యు డుదయించుటతోడనే భేదబుద్ధియొక్క అంధకార పూర్ణమగు దొంగతనము చేయు సమయము సమాప్తమై పోవునో మరియు యోగమార్గమున పోవు యాత్రికులు ఆత్మ ప్రత్యయ మార్గమున పోసాగుదురో, ఏ సూర్యునియొక్క వివేకమనెడి కిరణములు స్పర్శించుటతోడనే జ్ఞానరూపియగు సూర్యకాంతమణినుండి తేజస్సనెడి అగ్నికణములు బయటకు వచ్చి సంసారమనెడి వనమును భస్మమొనర్చునో, ఏ సూర్యుని కిరణజాలము కఠోరమై ఆత్మస్వరూపమనెడి భూమిపై స్థిర

పడుటతోడనే మహాసిద్ధులనెడి మృగజలపు వరద వచ్చునో, కాని, అటు పిమ్మట, ఏ సూర్యుడు ఆత్మబోధయనెడి మస్తకమున ప్రవేశించి బ్రహ్మభావమనెడి మధ్యాహ్నమున తపించసాగునో, మరియు యీ రీతిని జనితపనము వలన ఆత్మకు గల భ్రాంతియనెడి ఛాయ దానిక్రింద అణగి మణగిపోవునో, మరియు ఆ సమయమున అచ్చట మాయ యనెడి రాత్రియే వుండనందు వలన విశ్వముయొక్క భాసత్వము మరియు విపరీతజ్ఞానమనెడి నిద్రకు ఏ విధమగు ఆశ్రయము లభించదో, మరియు యిందువలన అద్వైత జ్ఞానమనెడి నగరములో నలువైపుల శుద్ధ ఆనందమే నిండిపోవునో, మరియు సుఖానుభవము లనెడి వ్యాపారము మందగించి పోవునో, అనగా ఏ సూర్య ప్రకాశము వలన యీ విధమగు కైవల్యముక్తి యనెడిశుభదినము నిరంతరము లభించునో, ఏ సూర్యుడు ఆత్మభావ మనెడి ఆకాశమునకు ప్రభువో, మరియు ఏ సూర్యుడు ఉదయించుటతోడనే తూర్పు మొదలుగా గల దశ దిశా సహితముగ ఉదయము మరియు అస్తమించుటలను కూడ నామ - రూపములు లేకుండ నాశమొనర్చునో, ఏది జ్ఞానాజ్ఞానములు రెంటిని నాశమొనర్చి వాటిలో దాగియున్న ఆత్మతత్త్వమును అతి స్పష్టముగ ప్రకటమొనర్చునో, మరియు యింకనూ అధికముగ ఏమని చెప్పనగును, యీ రీతిని ఏ సూర్యుడు ఒక విలక్షణము మరియు నూతనము నగు ప్రాతఃకాలమును కలిగించునో, రాత్రింబవళ్ళనెడి ప్రాంతములకు ఆవల నివసించెడి అట్టి ఆజ్ఞానసూర్యునివైపు చూచుట కెవడు సమర్థుడగును ? ప్రకాశించదగిన వస్తువులు లేకుండానే ప్రకాశగోళముగనున్న ఆ జ్ఞానమార్తాండుడగు శ్రీ నివృత్తి నాథులకు నేను మాటిమాటికి వందన మొనర్తును; ఏలనన నేను శబ్దములచే వారిని స్తుతించ మొదలిడుచో నా వాణికి గల దౌర్బల్యము తెలపిపోవును. దేవునిమహిమ చక్కగా తెలసి స్తుతించెడి వస్తువూ మరియు బుద్ధియూ కలసి ఏకజీవముగా నైనప్పుడు మాత్రమే ఆ దేవుని చక్కగా స్తుతించుటకు సరిగా వీలగును. నామరూపాత్మక వస్తుజ్ఞానము నశించినప్పు

జ్ఞానము కలుగునో, దేనివర్ణనము మౌనాలింగనమునందే జరుగగలదో, మరియు స్వయముగ లయప్రాప్తిని పొందు జీవునకుమాత్రమే అనుభవమువలన ఏది తెలియనగునో, ఏ గురురాజుయొక్క లక్షణములను చెప్పుటలో పరావాణి సహితముగవై ఖరీవాణికూడాపశ్యన్తి మరియుమధ్యమవాణీగర్భమున ప్రవేశించి అచ్చటనే లయమునుపొందునో అట్టిగురురాజులగుతమ్ము నేను నామనస్సునందు నాకొరకై సేవకభావమును కల్పనమొనర్చుకొని శాబ్దికస్తోత్రాలంకరణములతో అలంకరించుచున్నాను. తామీ అలంకరణమును సదయులై గ్రహించువెడల యీవిధముగ నేనుచెప్పుటకూడ అద్వైతానందమునన్యూనతను తెచ్చుటవంటిదే యగునని - నేనుచెప్పుదును. కాని, అమృత సముద్రదర్శన మగుటవలన దరిద్రుడగు బిచ్చగాడు స్తంభితుడై తన యోగ్యతాయోగ్యతలనుకూడ మరచిపోయి ఆ అమృతసాగరమును ఆహ్వానించుటకొరకై కూర- నారలతో ఆతిథ్య మిచ్చుటకు ఉపక్రమించ నారంభించురీతిని, మరియు అట్టి సమయమందున ఆ కూర - నారలనే ఆహ్వానించి ఆ అమృత సాగర మా దరిద్రుని ఆనందోల్లాసమును మాత్రమే ధ్యానమునం దుంచుకొనదగురీతిని, మీరుకూడా మీదివ్యతేజమును మరుగుపరచి నాభక్తియనెడి యీ సామాన్యహారతిపై ప్ర మాత్రమే ధ్యానముంచువెడల నాకార్యమంతయు నెరవేరిపోవును. ఉచితానుచితముల నొక అల్పవయస్కుడగు బాలుడే అర్థము చేసికొను నెడల, నిక అతనికి బాల్య మెట నుండును? అయినప్పటికిని అతని తల్లి అతని వచ్చీ - రాని మాటలతో తృప్తిపొందుట లేదా? ఒకానొక వాగువందలి నీరు వచ్చి గంగానదిని అనుసరించుచో, ఆ గంగానది 'నీవు దూరముగ వెళ్ళి పొమ్మని చెప్పి దానిని వెనుకకు మరల్చివేయునా? ఓ మహారాజా, భృగు మహర్షి భగవానుని కాలితో తన్ని ఎంతటి అపచారమును చెయ్యలేదు! కాని, ఆ పద - చిహ్నమునే అలంకారముగ అంగీకరించి దాని మహత్త్వమువలన శార్ఙ్గధరుడగు నారాయణుడు సంతోషిగానే వుండలేదా? లేదా, అంధకారముతో నిండియున్న ఆకాశము సూర్యుని ఎదుటకు వచ్చి

నప్పుడు సూర్యు డెన్నడైన దానిని తిరస్కరించి దూరముగ పొమ్మనునా? సరిగా అదేవిధమున, ఏదైన ఒకసమయమున భేదబుద్ధిలో చిక్కుపడి, సూర్యు డనెడి రూపకాలంకారముచే కూడియున్న ఒకస్తోత్రమును కట్టి నేను సూర్యునిలో మిమ్ము పోల్చి చెప్పినప్పటికిని, ఓగురురాజా! తాము అనుగ్రహించి ఆపోలికనుకూడ సహింతురుగాక! ఎవరు ధ్యానసమాధులవలన మీదర్శనము పొనర్పరో మరియు ఏవేద-వాణి మిమ్ము వర్ణించెనో, వాటి ఈవర్ణనముల నన్నిం టినిమీరుసహించి అంగీకరించినవిధముగనే యీనావర్ణమునుకూడ సహింపుడు. మరియు ఆ న్యాయమునే నాయెడకూడ చూపుచో నాకదియే చాలును, ఓ మహారాజా, నేను నేడు మీగుణానువర్ణన మొనర్పబూనితిని. దీనిని మీరు దయతో అపరాధముగ తలంపకుందురుగాక! మీఇచ్ఛవచ్చినటుల చేయుడు. యీ వర్ణనమును నాకు తనివితీరనంతవరకు మానను. నేనీగీత యనెడి మీయీ ప్రసాదామృతమును అత్యుత్సాహముతో వర్ణింప నారంభించుట తోడనే నాపరమ సౌభాగ్యమువలన నాకురెట్టింపు బలము లభించినది. నా వాక్కు అనేక కల్పములవరకు సత్యము పలుకుటయనెడి తపము పొనర్చినది; మరియు ఓ గురుమహారాజా, ఆ తపస్సుయొక్క అనంతఫలమును నేడది పొందుచున్నది. నేటివరకు నేనేదో గొప్ప అలౌకిక పుణ్యమును సంపాదించి యుంటిని, మరియు ఆ పుణ్యమే నేడు మీ గుణగాన మొనర్చెడి బుద్ధి నిచ్చి నన్నీకార్యమునందు తీర్ణు పొనర్చినది. నేనీ జీవావస్థయనెడి వనమున ప్రవేశించి మృత్యువనెడి గ్రామమున చిక్కుకొంటిని. కాని, ఆ దుస్థితి నేడు పూర్తిగా తొలగిపోయినది. కారణ మేమన, గీతయనెడిపేర ప్రసిద్ధి పొందిన మీ కీర్తిని వర్ణించు భాగ్యము నేడు నాకు కలిగినది. మహాలక్ష్మి స్వయముగావచ్చి ఎవని యింటియందైన కూర్చొనుచో, అట్టి గృహస్థుని దరిద్రుడని ఎన్నడైన అనవగునా ? లేదా అంధకారముగనున్న యింటిలోనికి సౌభాగ్యవశమున సూర్యుడు అతిథిగా వచ్చుచో, ఆ అంధకారమే యీ సంసారమునకు ప్రకాశముగ అయిపోదా? ఏదేవునివద్ద యీఅనంతవిశ్వము

పరమాణువుగకూడ నుండజాలదో, అట్టిఆదేవుడే భక్తియనెడి తరంగములకు వేఱపడుచో యిక అట్టివాడు భక్తునకొఱ కేరూపమును ధరించకుండును? ఇదేవిధమునగీతనుగురించి నేను ఉపన్యసించుటకూడా గగన-కుసుమముయొక్క సుగంధమునుగోరులరీతిని అసంభవమే. కాని, మీరుసమర్థులు. అందువలనమీరు మీ సామర్థ్యమువలన నా ఆవాంఛనుకూడ నెరవేర్చితిరి. అందువలననే మీ శిష్యుడగు యీ జ్ఞానదేవుడు 'ఓ మహారాజా మీ కృపవలన నేను గీతయందలి గంభీర శ్లోకార్థములనుకూడ అతి స్పష్టముగ సుగమముగ నొనర్చి నివేదింతునని చెప్పుచున్నాడు. గడచిన పదునైదవ అధ్యాయమున శ్రీకృష్ణులు అర్జునునకు సమస్తశాస్త్రీయ సిద్ధాంతములను స్పష్టీకరించి చెప్పియుండిరి. నిపుణుడగు వైద్యుడు ఒకానొక రోగియొక్క అవయవముల లోపలగల రోగనిదాన మొనర్చురీతిని వృక్షమనెడిరూపకాలంకారముద్వారా శ్రీకృష్ణుడు ఆలంకారిక భావలో ఉపాధిరూపియగు సంపూర్ణమగు విశ్వముగు గురించి వివరించెను. మరియు యీ విశ్వమునందలి జీవాత్మయగు అక్షరపురుషుని లక్షణములనుకూడా వివరించిరి. ఆయుపాధివలననే చైతన్యము సాకారమైనది. అంతమున, ఉత్తమపురుషునిగురించి వివరించునప్పుడు నిర్మల ఆత్మతత్త్వముకూడ చూపించబడెను. ఆటుపిమ్మట శ్రీ కృష్ణులు 'ఆత్మప్రాప్తి పొందనగు ప్రబలసాధనము జ్ఞానమేననికూడా చెప్పియుండిరి. అందుచే యీ పదునారవ అధ్యాయములో ప్రతిపాదించదగిన నూతన విశేషమేదియూ మిగిలియుండలేదు. ఇక కేవలము గురుశిష్య సంబంధము మాత్రమే మిగిలియున్నది. ఈప్రకరణమున, జ్ఞానులకు పూర్తిగసంతసముకలిగినది. మరియు వారు అన్ని విషయములను చక్కగా తెలిసికొనిరి. కాని, ఆత్మప్రాప్తిని వాంఛించెడి ముముక్షువులుమాత్రము సంశయమునపడిరి. విశ్వాధిపతియగు శ్రీ కృష్ణులు భాగ్యవంతుడగు పురుషుడు జ్ఞానమువలన పురుషోత్తముడనగు నన్నుపొందును; ఆతడే సర్వజ్ఞుడు. మరియు ఆతడే భక్తియొక్క శిఖరమువరకుచేరెను" అని చెప్పిరి. మరియు పై అధ్యాయము నందలి చివరి శ్లోకమున యీ జ్ఞానమ

యొక్క మహిమ అనేక విధముల వర్ణింపబడెను. సద్జ్ఞానమునకు అధిపతి యగు శ్రీకృష్ణ భగవానులే స్వయముగ నిట్లు చెప్పిరి- "ప్రపంచముల నన్నింటిని కబళించి చూచు వానిని దృష్టవస్తువుతో ఐక్యమొనర్చి ఏకరూప మొనర్చునట్టిదెన్ని, ఆ దృష్ట వస్తువునందే అతనిని లీన మొనర్చునట్టిదెన్ని, జీవుని ఆనంద సామ్రాజ్యాధిపతిగ నొనర్చునట్టిదెన్ని, మరియు యిట్టి అనేక విచిత్రముల నొనర్చునట్టి శక్తిగలదెన్ని - అజ్ఞాన మొక్కటే. కావుననే ఆత్మ జ్ఞానమును పొంద గోరువారి చిత్తమునకు సంతసము గలిగెను. మరియు యిందువలననే అట్టివారు తమ జీవితమును ఆ జ్ఞానమునకు బలిగా నిచ్చిరి. ఏ విషయముపట్ల మనస్సునందనురాగము కలుగునో ఆ విషయము అంతఃకరణమున విడువకుండా అత్యధికముగ సంచరించుచుండును; మరియు దీనినే ప్రేమయందురు. కావున జిజ్ఞాసువులగు వారిలో ఎవరికీజ్ఞానవిషయమై ప్రేమానుభవము కాలేదో అట్టివారి మనస్సున యీజ్ఞానము మనకెటుల లభించును. లభించిన పిదప యిది మనయందెటుల స్థిరముగ నుండును-అనెడి ఆలోచన కలుగుట అతి స్వాభావికము. అందుచే ప్రప్రథమమున శుద్ధజ్ఞాన మేరీతిని లభించునో యోచించవలసి యున్నది. లభించిన పిమ్మట అజ్ఞాన మెటుల వృద్ధిపొందును? లేదా అజ్ఞానము మనకేల లభించుటలేదు? లేదా జ్ఞానము కలుగకుండాను లేదా ప్రాప్తించిన జ్ఞానమును తప్పుదారిని పెట్టునట్టి జ్ఞానమార్గమునగల అడ్డంకులెవ్వి?-వీటినిగురించి పూర్తిగ తెలిసికొనిన పిమ్మట జ్ఞానమునకు విఘాతమును కలిగించు విషయములను తొలగించి, జ్ఞానమును వృద్ధిచేయు విషయముల పట్ల మనస్సును లగ్నమొనర్చి యోచించవలెను. జ్ఞానమును వాంఛించు జిజ్ఞాసువులగు శ్రోతల నుద్దేశించి శ్రీకృష్ణభగవానులిప్పుడుమాట్లాడెదరు.జ్ఞానమునుకలుగజేసి,దానితోపాటుశాంతినికూడా వృద్ధిపరచెడి దైవీ సంపద్వైభవమునిప్పుడు గానమొనర్తురు.దానితో పాటు విషయవాసనలు మరియు రాగద్వేషాది దుర్వికారములకు ఆశ్రయ మొసంగు ఆసురీసంపదయొక్క భయంకర స్వరూపముకూడ వర్ణింపబడును.

ఈ రెండు సంపదలే యిష్టానిష్ట కార్యముల నొనర్చును, మరియు దీనిని గురించి యిదివరలో తొమ్మిదవ అధ్యాయమున ప్రస్తావింపబడియే యున్నది. ఆ సమయముననే యీవిషయమునుగురించి చక్కగావివరింపవలసి యుండెను. కాని మధ్యలో మరొకవిషయము వచ్చినది., అంతతో యీ విషయ మచ్చట ఆగిపోయినది. కావున యీ పదునారవ యధ్యాయమును వెనుకటిభాగమును పూర్తిచేయునట్టిదిగా ఎరుంగవలెను. ఈ రెండుసంపదల సామర్థ్యము వలననే జ్ఞానమునకు యిష్టానిష్ట రూపములు లభించును. ప్ర ప్రథమముగా-ముముక్షువులకు మార్గదర్శక మైనట్టిదీ, దీపజ్యోతివలె మోహమనెడి రాత్రియందలి అంధకారమును దూరమొనర్చి దానిని ప్రకాశిత మొనర్చునట్టిదియూనగు దైవీసంపదయొక్క లక్షణములు వినుడు. ఒకదానిని మరొకటి పోషించుచూవుండు అనేక పదార్థముల నన్నింటిని ఒకటిగా ప్రోగుచేయుట నీలోకమున 'సంపద' యందురు. దైవీసంపద సుఖమును కలిగించును. అది దైవయోగమువలన మాత్రమే ఒక్కొక్కనికి లభించును. అందువలననే దానిని 'దైవీ' యందురు.

శ్రీ భగవానువాచ.—

> అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితః ।
> దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥ ౧

"ఇక యీ దైవీసంపదయొక్క గుణములలో అన్నింటికంటె ప్రథమ స్థానము 'అభయము'నకివ్వబడును. అతి పెద్దదగు జల ప్రవాహమున దుముకని వానిని 'మునుగుట' యనెడి భయము స్పృశించనేలేదు. లేదా పథ్యమొనర్చువానివద్దకు వ్యాధి తీవ్రరూపమును దాల్చిరాదు. ఇదే విధమున, కర్మాకర్మల మార్గములందు అహంకారమును ప్రవేశింప నివ్వరాదు; మరియు సంసారభయమును విడనాడవలెను. లేదా ద్వైతభావము వృద్ధిపొందుచో, దానిని విడచి అన్ని విషయములందును ఆత్మభావమును

కలిగియుండవలెను. మరియు భయవిషయమును మనస్సునుండి పారద్రోల వలెను, దీని పరిణామముగ, అద్వైత బుద్ధివచ్చుట వలన 'నీరు స్వయముగ ఉప్పును ముంచివేయుటకు వచ్చుచో ఉప్పు తనంత తానే జలముగ నైపోవు రీతిని' సమస్తము ఆత్మమయముగ తోచును; ఇట్టి స్థితివలన భయ నాశన మగును. ఓ అర్జునా! 'అభయ' మన నిదియే. అనగా, ఇది నిజమైన జ్ఞానమార్గ విషయము. ఇక 'సత్త్వశుద్ధి' యని దేనినందురో వివరించి చెప్పెదను వినుము. బూడిదరాశి యందు కాలుటగాని, చల్లారుటగాని లేనియటుల, లేదా మధ్యమావస్థయందున్న చంద్రుడు సూక్ష్మరూపమున అవికృతుడైయుండి దానియందు పాడ్యమినాటి వృద్ధిపొందు కళగాని అమావాస్యనాటి క్షయముగాని లేకుండా వుండురీతిని లేదా వర్షఋతువునందలి వరదలుగాని గ్రీష్మఋతువునందలి జలాభావము గానిలేని నది మధ్యమావస్థలో శాంతముగ ప్రవహించురీతిని, రజోగుణము మరియు తమోగుణములతో నిండియున్న అనేక విధములగు మనోరథములను తలంచుటను విడచి, బుద్ధి కేవలము స్వధర్మవిషయములందే అనురాగమును కలిగివుండును. మరియు ఇంద్రియములకు మంచివేగానీ చెడ్డవేగానీ ఏ విధ మగు విషయములు చూపించబడినప్పటికిని మనస్సు ఏమాత్రము విచలితము కాదు. ప్రియపతి విదేశమునకు వెళ్ళినప్పుడు పతివ్రతయగు భార్యయొక్క విరహముచే వ్యాకులతను పొందిన మనస్సు ఏవిధమగు లాభనష్టములవై [illegible] భగ్నముగాక కేవలము ఉదాసీనముగానే వుండురీతిని, కేవలము ఆత్మస్వరూ పము గురించిన చింతనమే కలిగియుండుటవలన బుద్ధి యీ రీతిని తన్మయ తను పొందియుండుటనే కేశిమర్దనుడగు శ్రీకృష్ణుడు 'సత్త్వశుద్ధి' యని వక్కాణించిరి. ఇక, ఆత్మప్రాప్తికొరకై జ్ఞానయోగమునందు తన సామర్థ్యముచే స్థిరపడియుండుట మరియు ఆ స్థితిలో చిత్తవృత్తిని పూర్తిగా త్యజించుటనే జ్ఞానయోగ వ్యవస్థితియని చెప్పెదరు. యజ్ఞాగ్నిలో ఏవిధమగు వాంఛనూ మనస్సునందుంచుకొనకుండానే పూర్ణాహుతి చేయవల

పిన రీతిని, లేదా కులీనుడు తన కుమార్తెను కులీనున కిచ్చుటయే అర్హమైన రీతిని, లేదా లక్ష్మీదేవి కేవల మా ముకుందునందే నిశ్చలభావముతో రమణ మొనర్చు రీతిని, సంకల్ప - వికల్పముల నన్నిటిని విడచి నిశ్చితరూపమున యోగము మరియు జ్ఞానమునందే జీవన - వృత్తిని లగ్న మొనర్చుటనే శ్రీకృష్ణులు మూడవ గుణమగు జ్ఞానయోగ వ్యవస్థితి యని నుడివిరి. తన పరమ శత్రువైనను సరే దుఃఖమునందున్నప్పుడు ఆతనిని చూచి శరీరము, వాక్కు, మనస్సు మరియు ధనసహితముగ సహాయము చేయకుండా వుండకుండుట, మరియు ఓ అర్జునా, ఎవరైన దుఃఖమునందున్న వాడు గాని, బాధయందున్న వాడు గాని మనవద్దకు వచ్చునెడల ఆతని సహాయార్థమై తన ధనధాన్యాదుల నన్నిటిని 'మార్గమున నాటబడిన చెట్లు యాత్రికులకు తమ ఆకులు, పుష్పములు నీడ, ఫలములు మరియు మూలము మొదలగువాని నిచ్చుటకు ఏమాత్రమైనను సంకోచించనిరీతిని' అంతఃకరణపూర్వకముగ వినియోగించుటనే 'దాన' మందురు. ఈ విధమగు దానమును మోక్షమనెడి గుప్తధనమును చూపించెడి దివ్యాంజనముగా నెరుంగవలెను. ఇక 'దమము' యొక్క లక్షణములను వినుము. కత్తిసాము తెలిసిన వీరుడు తన శత్రువుయొక్క శిరస్సును వెంటనే తుంచివేయురీతిని విషయములు మరియు ఇంద్రియములయొక్క సంయోగ మును సమూలముగ తుంచివేయుటయే 'దమ' మనబడును. ఇంద్రియములను విషయములనెడి మేఘములయొక్క అంధకారమునుంచి అడ్డగించుటకొరకై వాటిని చక్కగా బంధించి ప్రత్యాహారమునకు ఆధీన మొనర్చబడును. ఆ సమయమున చిత్తశక్తిచే వ్యాకులపడి 'ప్రవృత్తి' లోపలినుంచి బయటకు బయలుదేరును. మరియు అంతట ఆ దశేంద్రియద్వారములగుండానే వైరాగ్యము శరీరములోపల ప్రవేశించును. ఏ పురుషుడు యీ రీతిని యీ కఠోరనియమములను శ్వాసోచ్ఛ్వాసలకంటె కూడ అఖండముగ నడచునట్టి ఆచరణము నొనర్చునో, మరియు ఏ మాత్రము విశ్రమించకుండా రాత్రింబవళ్ళు ఆ వ్రతపాలన మొనర్చునో, ఆతని యీ

విశేషమగు ఆచరణమునే 'దమ' మందురు. దీని లక్షణములను చక్కగా తెలిసి
కొనుము. ఇకనీకు యజ్ఞము (యాగము) యొక్క అర్థమును సంక్షేపముగ
తెల్పెదను వినుము. ఒకవైపు అన్నింటికంటె ముందు లెక్కింపబడెడి బ్రా
హ్మణులుందురు. మరొకవైపు అన్నింటికిచివర లెక్కింపబడెడి స్త్రీలుమొద
లగువారుందురు. మరియు యీ రెండింటికిని మధ్యనా అధికారులు మొదలుగా
గలవారుందురు. వారిలో ప్రతిఒక్కడూ నా కొరకై అత్యుచితము
మరియు దేవదత్తమునగు మార్గమును అనుసరించును. వీరిలో వేదములు
మరియు శాస్త్రములందు చెప్పబడిన ప్రణాళిక ననుసరించి షట్కర్మల
నొనర్చు బ్రాహ్మణులు, మరియు ఆ బ్రాహ్మణులకు నమస్కార మొనర్చు
శూద్రులూ - వీ రిరువురును సమానముగనే తమ తమ ఆచారములను
పాటించుచుందురు, మరియు యీ రీతిని వారు యాగసంపాదన మొనర్తురు;
వారికి ఆ యాగఫలము సమానముగనే లభించును. ఈ రీతిని తమ తమ అధి
కారములకు అనురూపముగా యజ్ఞము నొనర్చుట అందరియొక్క కర్తవ్య
మునై యున్నది. కాని, యజ్ఞముల నొనర్చునప్పుడు ఆ యజ్ఞములను ఫలాశ
యనెడి విషముచే విషవంతముగ నొనర్పరాదు; మరియు దేహాభిమాన
ముచే తన మనస్సున 'నేను కర్తను' అనెడి అహంభావము జనించ నివ్వ
రాదు. వానితోపాటు, అందరును వేదాజ్ఞలను పాటించవలెను. ఓ అర్జునా!
యీ రీతిని 'యజ్ఞ' శబ్దమున కంతటను యీ ఆశయమే వుండును. ఈ విధ
మగు యజ్ఞము మోక్షమార్గమున ఎరిగియున్న సహచరునివలె తోడ్పడును.
బంతిని నేలపై విసరి కొట్టుటలో గల ఉద్దేశ్యము ఆబంతితో నేలను కొట్టుట
కాదు, అది తిరిగి మన చేతిలోనికి వచ్చుటకొరకే మనము బంతిని నేలకువేసి
కొట్టెదము. పొలములో విత్తులు చల్లుటలో గల తలంపు, వాటినుండి పంట
లభించవలెననియే! గుప్తము మరియు అంధకారపూర్ణమగు ప్రదేశమున
పాతిపెట్ట బడియున్న ధనమును చూచుటకై దీపమును ఆదరపూర్వకముగ
స్వీకరించు రీతిని, లేదా చెట్లకొమ్మలందు కాయలు కాయుటకై చెట్టు-

మొదట నీళ్లుపోయు రీతిని, లేదా సంక్షేపముగా చెప్పవలెననిన, స్వయముగా మన ముఖమును చూచుకొనుటకే అద్దమును చక్కగా తుడిచి స్వచ్ఛమొనర్చు రీతిని, వేదములందు ప్రతిపాదింప బడిన విషయములు, ఈశ్వరస్వరూప జ్ఞానము సరిగా లభించుట కొరకుగాను శ్రుతిగ్రంథములను నిరంతరము అధ్యయన మొనర్చుట ఆవశ్యకము. బ్రాహ్మణులకు వేదములందలి బ్రహ్మసూత్రములు, మరియు అన్యవర్ణస్థులకు తమ తమ అధికారము ననుసరించి స్తోత్రాదులు చదువుట లేక నామ - మంత్రములను ఉచ్చరించుటయే శుద్ధ చైతన్యప్రాప్తి నొందుటకు సరిపోవును. ఓ అర్జునా! 'స్వాధ్యాయ' మనగా నిదియే. ఇక నీకు 'తపస్స'ననేమో చెప్పెదను వినుము. దాన - ధర్మములకై తన సర్వస్వమును యిచ్చివేయుటయే తన సర్వస్వమును సార్థకమొనర్చుకొనుట యగును. బీజము వచ్చిన పిదప వనస్పతి తనంతతానే ఎండిపోవురీతిని, లేదా ధూపము అగ్నిలో లయమైపోవు రీతిని, లేదా కల్తీపదార్థము నశించి పోయిన తరువాత బంగారము తూకములో తగ్గిపోవు రీతిని, లేదా చంద్రుడు పితరులకు అమృతమును ఆహారముగ నొసంగుచూ నొసంగుచూ స్వయముగ క్షీణించిపోవు రీతిని, ఆత్మరూపానుభవము పొందుటకై తన ప్రాణములు, ఇంద్రియములు మరియు శరీరమును శుష్కింప జేయుటన్నే, ఓ అర్జునా, 'తపస్సు' అందురు. ఇక తపస్సునందలి యింకను అనేక విధములు చెప్పబడును. కాని, హంస నీటిని విడదీసి పాలను గైకొనుటయందే తన చంచువును వినియోగించు రీతిని శరీరము మరియు జీవులయొక్క సంయోగమైనప్పుడు వాటినుండి దేహభావమును దూరమొనర్చి, మరియు జీవభావమును గైకొని వేరుచేయుటకు ఆవశ్యకమగు వివేకమును నీ వెల్లప్పుడును నీ యంతఃకరణమునందు జాగరిత మొనర్చుకొని యుండవలెను. ఆత్మవిచార మొనర్చునప్పుడు బుద్ధి భ్రమను పొందును. ఆ సమయమున, మేల్కొని నప్పుడు నిద్రయూ దానితోపాటు స్వప్నము కూడా లోపించి పోవురీతిని, ఆత్మ దర్శనమునకుగాను వివేకపూర్వకమగు ఆ చరణ మొనరు

పురుషునివల్లనే, ఓ అర్జునా! యీ 'తపస్సు' నెడి సాధన జరుగును. శిశువు యొక్క హితవును కోరియే తల్లియొక్క స్తనమునందు పాలు వుండురీతిని, శేషా భూతకోటి నానావిధములుగ నున్నప్పటికిని అన్నింటియందును చైతన్యము సమాన రూపముగనే నివసించురీతిని, ప్రాణికోటిపట్ల మధురము మరియు సౌజన్యపూర్ణముగ వ్యవహరించుటనే 'ఆర్జవ' మందురు.

అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్
దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్॥ ౨

" ఇదే రీతిని జగత్తును సుఖవంతమొనర్చు తలంపుతో శారీరక, వాచిక, మానసికముగ వ్యవహరించుటనే 'అహింస' యందురు. చంద్రుని ప్రకాశము తేజోవంతముగ నున్నప్పటికిని శీతలముగా నుండురీతిని సూక్ష్మమూ మరియు తేజోవంతముగ గల మాట యైనప్పటికిని కోమలము మరియు శీతలముగా నుండు మాటనే 'సత్య' మందురు. చూచినంత మాత్రముననే రోగమును నివారించునట్టిన్నీ, మరియు భక్షించుటకు చేదుగా నుండనట్టిన్నీ, ఔషధమే ఎచ్చటను లభించనప్పుడు సత్యముతో సమానముగ పోల్చి చెప్పదగిన వస్తువు మరెచ్చట లభించగలదు ? కాని, నీటి తుంపరను కంటిపై వైచినచో అది తన కోమలత్వము వలన కంటికి యించుకేని కష్టమును గాని నష్టమును గాని కలిగించదు; కాని, అట్టి నీరే కఠినాతి కఠినమైన రాళ్ళనుకూడ ఖండించి తనకు మార్గము నేర్పరచుకొను చున్నది సరిగా యిదే విధమున, భ్రమ మరియు మోహములను త్రెంచివేయుటకు యినుము వలె కఠినమైనదై యుండికూడా చెవులకు మధురాతి మధురముగ నుండునదియూ, వినునప్పుడు కర్ణములు దానిని ప్రాశన మొనర్చుచూ పోవు చున్నవా యనునటుల శోభనట్టిదియూ, తన సత్యత్వ సామర్థ్యముచే బ్రహ్మత త్త్వమును కూడ స్పష్టీకరించు నట్టిదియూ, అనగా, ప్రియము మధురము అయినప్పటికిని ఎవనిని మోసగించనిదియు మరియు సత్యమైనప్పటి

కిని ఎవనికిని చెడుగా నుండనిదియు, - మరియు వేటగాని గానము చెవులకు యింపుగా నున్నప్పటికిని హరిణమునకు ప్రాణఘాతముగ నుండురీతిని, లేదా అగ్ని శుద్ధి యొనర్చు కార్యమును అతి చక్కగా చేసినప్పటికిని యిట్టుల చేయుటలో ఆ అగ్ని దగ్ధమొనర్చి బూడిదగా కూడా నొనర్చురీతిని - కర్ణములకు మధురముగ నున్నప్పటికిని తన అర్థమువలన హృదయమును వ్రక్కలుగా నొనర్చు వాక్కు ఎన్నడును సుందరమైనదిగా చెప్పబడజాలదు. అట్టి దానిని దుష్టరాక్షసీ వాక్కునియే చెప్పవలెను. కాని, బాలుడేదైన అనిష్టము మరియు లజ్జాజనకమునగు పనిని చేసినప్పుడు - బయటకు మిక్కుటమగు క్రోధమును వెల్లడించినప్పటికిని అతని పోషణములో పుష్పములకంటె కూడ కోమలముగా నుండు తల్లియొక్క స్వరూపమువలె చెవులకు వినుటకు అతి సుఖవంతముగ నుండక పోయినప్పటికిని అంతమున మేలు కలిగించునట్టిదిగా వుండి, దుర్వికారములచే లిప్తము కాకుండా వుండునట్టి మాటనే యీ ప్రకరణమున 'సత్యము'గా నెరుంగవలెను. రాతియం దెంత నీరు చల్లినప్పటికిని దానినుండి మొలక బయలు దేరని రీతిని, లేదా వెన్నను ఎంతగా తరచినప్పటికిని దానినుండి గంజి రానిరీతిని, లేదా పాము కుబుసమును కాలితో తన్నినప్పటికిని ఆ కుబుసము ఎన్నడును కాటువేయుటకై పడగను ఎత్తనివిధమున, లేదా వసంతఋతువు పూర్తిగా ప్రజ్వరిల్లినప్పటికిని ఆకాశమున ఫలము లేవియూ ఫలించని రీతిని, లేదా రంభయొక్క స్వరూప లావణ్యముల వలన శుకదేవుని అంతఃకరణమున ఎన్నడును కామ - వికారము సంచరించనిరీతిని, లేదా పూర్తిగా చల్లారిపోయిన అగ్నిలో నెయ్యి పోసినప్పటికిని అది మరల మండని రీతిని, వినుట తోడనే అబోధ బాలకునకు కూడ కోపము జనించునట్టి ఎన్నిమాటలను చెప్పి నప్పటికిని, ఓ అర్జునా! స్వయముగ బ్రహ్మదేవుని పాదములపై పడినప్పటికిని మరణించిన జీవుడు లేచి నిలుచొన జాలని రీతిని, రాగము లెన్నడును ఉత్పన్నముకాని మానసిక స్థితినే 'అక్రోధ' మందురు. ఈ విషయముల నన్నిటిని ఆ సమయమున

లక్ష్మీపతి చెప్పెను. ఆ పిమ్మట యజ్ఞ భోక్తయగు శ్రీకృష్ణ భగవాను లిట్లు నిరి– "మట్టిని త్యజించినందువలన కుండ, నూలుపోగులను త్యజించినందు వలన వస్త్రము, బీజమును త్యజించి నందువలన వటవృక్షము, భిత్తికను త్యజించినందు వలన చిత్రము, నిద్రను త్యజించి నందువలన దానియందు కాన్పించు సర్వవిషయములు, జలమును త్యజించి నందువలన తరంగములు, వర్షఋతువును త్యజించి నందువలన మేఘములు, మరియు ధనమును త్యజించి నందువలన విషయోపభోగములూ తమంత తామే విడచిపోవును. సరిగా యిదే విధమున, బుద్ధిమంతులగు లోకులు దేహాభిమానమును విడచి, సమస్త ప్రాపంచిక విషయములను దూరముగ తొలగించుటనే 'త్యాగ' మందురు." ఈ మాటను అర్థము చేసికొని భాగ్యశాలియగు అర్జును డిటుల అడిగెను. "ఓ మహారాజా, తమరు నా కిక శాంతియొక్క లక్షణములను వివరించి చెప్పుడు ! అంతట భగవాను లిటులనిరి– "బాగు బాగు, నీవు చాల శ్రద్ధతో యిక వినుము. జ్ఞేయమును నాశమొనర్చి జ్ఞాత మరియు జ్ఞానముకూడా లయ మును పొందినప్పుడు కలిగెడి స్థితినే 'శాంతి' యనవలెను. ప్రళయకాల మందలి జలప్రవాహము విశ్వము నంతను నామ – రూపములు లేకుండా నాశమొనర్చి, నలువైపులను కేవలము ఆ జలమే నిండియుండి, ఇది నది – యిది ప్రవాహము యిది సముద్రము అనెడి భేదదర్శకమగు భాషా వ్యవ హారము లేనే లేకుండా, ఎటు చూచిన అటు ఒకే విధముగ నీరు వ్యాపించి యుండి కాన్పించును, కాని ఆ సమయమునకూడ దానిని గురించిన జ్ఞానమును పొందుటకై దానికి భిన్నమగు వస్తువేదైన నుండునా ? ఏదియూ వుండదు సరిగా యిదే రీతిని, జ్ఞేయముతో ఆలింగన మొనర్చుకొని తన్మయత్వమును పొందినప్పుడు జ్ఞాతృత్వము కూడా నశించిపోవును. అంతట, ఆ సమయ మున, ఓ అర్జునా, మిగిలియుండు నట్టిదియే శాంతియొక్క లక్షణ మగును ఇక 'అపైశున' మని దేని నందురో చెప్పెదను వినుము. ఎవడైన ఒకరోగి ఏదేని రోగముచే అత్యధిక కష్టమును పొందినప్పుడు ఆ రోగిని బాగుచేయు

తలంపులో సువిజ్ఞుడగు వైద్యుడు 'ఈ రోగి నా శత్రువు' అనెడి భావము
నెన్నడును కలిగియుండడు. లేదా బురదలో దిగబడిపోయిన ఆవును చూచి
నప్పుడు ఎవడునూ 'యీ ఆవు పాలిచ్చు చున్నదా ? లేదా' యని యోచిం
చనే యోచించక, దాని కష్టమును చూచి విశాల హృదయము గలవా డగును,
లేదా ఒకానొకడు నీట మునిగిపోవు చున్నప్పుడు అతనిని చూచిన విజ్ఞుడైన
మానవుడు 'ఈతడు బ్రాహ్మణుడా లేక అంత్యజుడా ?' యని యోచించక
అతనిని రక్షించుటయే తన కర్తవ్యముగ తలంచును. లేదా ఎవడైన
చండాలుడు దైవయోగముచే అడవిలో లభించిన స్త్రీని వస్త్రహీననొనర్చి
ఆమె వస్త్రములను తీసికొని ఆమెను విడచి వెళ్ళినప్పుడు నాగరిక మనుష్యు
డెవడును ఆమె తిరిగి వస్త్రమును ధరించునంతవరకు ఆమె వైపు చూడనే
చూడడు. సరిగా యిదే విధమున, అజ్ఞానము మరియు భ్రమాదులవలన గాని
లేదా పూర్వజన్మలందు చేసిన కఠోరమగు సంచిత కర్మములవలన గాని
సమస్త విధములగు నింద్య మార్గములందును నిమగ్నులై యున్న లోకులకు
వీరు తమ శారీరకబలము నొసంగి వారిని బాధించుచున్న దుఃఖములను మరచి
పోవునటుల చేతురు. ఓ అర్జునా! ఇతరుల దోషములను మున్ముందుగా తమ
దృష్టి లేదా కటాక్షముచే దూరమొనర్చి ఆ పిమ్మట వారిని యిట్టివారు
సరిగా వీక్షించ సాగుదురు. ముందుగా దేవుని పూజించి ఆ పిమ్మట అతనిని
ధ్యానించురీతిని, లేదా ముందుగా పొలమును దున్ని దానిలో విత్తులు చల్లి
ఆ పిమ్మట దానిని కాపలా కాయుటకు పోవు రీతిని, లేదా అతిథిని
ముందుగా ఆదరసత్కారములచే సంతుష్టపరచి ఆ తరువాత అతని ఆశీర్వా
దమును గైకొను రీతిని, మున్ముందుగా మన గుణముల వలన యితరుల
కొరంతను నెరవేర్చి, ఆ పిమ్మట వారిని సూక్ష్మదృష్టితో చూడవలెను,
కేవల మింతియేకాదు; వారు ఎన్నడును ఎవరి మర్మము పైనను ఆఘాతము
కలిగించరు. ఎవరిని ఎన్నడును దుష్కర్మ ప్రవృత్తులనుగా చేయరు, మరియు
ఎవరిపైనను ఎన్నడును దోషముల నారోపించరు. వారి ఆచరణ మీ రీతిని

ప్రుండును, ఇదిగాక, వారు వ్యవహరించు విధానముకూడ ఎవరైన పతనమొంది యున్నచో వారిని మరల ఏదేని ఉపాయముచే ఉద్ధరించు విధముగావుండును. అంతేకాని మర్మభేద మొనర్చెడి ఆలోచన వారిమనస్సునం దెన్నడును ఎవరిపట్లను తలచూపదు. అనగా ఓ అర్జునా, పెద్దలకొరకై వారెన్నడును యితరులను తుచ్ఛులుగా తలంచుటగాని, తుచ్ఛులుగా నొనర్చు ప్రయత్నము గాని చెయ్యరు. మరియు వారిదృష్టి ఎన్నడును యితరుల దోషములను వెదకు టలో ప్రవేశించదు. ఓ అర్జునా, ఈ విధముగ వ్యవహరించుటనే అపైశున్య మందురు. మోక్షమార్గమునందలి యిదొక ముఖ్యమగు విశ్రాంతిస్థాన మను టలో ఏ విధమగు సంశయములేదు. ఇక దయ యని దేనినందురో చెప్పెదను వినుము. పౌర్ణమినాటి చంద్రునికాంతి ప్రపంచమున కంతకు సమానముగు చల్లదనమునే యిచ్చి, యితడు గొప్పవాడు యితడు అల్పుడు అనెడి పంక్తిభేద మెన్నడును చెయ్యనిరీతిని, దయగలవాడు దుఃఖమునం దున్నవారి కష్టములను దయాళుత్వముతో తొలగించు సమయమున ఎన్నడును తనమనమునందు యీతడు ఉత్తముడు యీతడు అధము డనెడి భావమును రానే రానివ్వడు. చూడు, ప్రపంచమున నీటివంటి పదా ర్థముకూడ స్వయముగ నశించుచున్నది. కాని అదియే మరణించుచున్న వన స్పతులకు ప్రాణదాన మొనర్చుచున్నది. ఇదేరీతిని దయాళువగు పురుషుని మనస్సునందు యితరుల దుఃఖమును చూచినప్పుడు వారి దుఃఖములను తొల గించుటకై అతనియం దావిర్భవించెడి జాలి తనసర్వస్వమును త్యాగమొనర్చి నప్పటికిని అల్పముగనే తోచునంత ప్రబలముగ నుండును. నీరు ప్రవహించు నప్పుడు దానిమార్గమునం దేదైన గొయ్యి మొదలగునవి వున్నచో, ఆ జలప్రవాహ మాగోతిని నింపకుండా ఒక్కఅడుగైన ముందుకుపోదు. ఇదే రీతిని, దయాళుపురుషుడు కూడ తన ఎదుటికి వచ్చిన దీనుని సంతోష పరచియే ముం దడుగు వేయును. 'కాలులో ముల్లు గుచ్చు కొని నప్పుడు దాని బాధాచిహ్నము ముఖమునందు వెల్లడియగు రీతిని·

యితరుల దుఃఖములను చూచి ఆతడు కూడ తన శరీరము కష్టపడు చున్నటుల అనుభవించును. పాదములం శీతలముగా నున్నప్పుడు కన్ను లందుకూడ ఆ చల్లదనము కనిపించురీతిని ఆతడుకూడా యితరులం సుఖముగా నుండుటను చూచి తాను సుఖించును. దప్పికతో నున్నవారి సౌఖ్యము కొరకై ప్రపంచమున జలము సృష్టింపబడి నటుల దుఃఖముతో నున్నవారి కళ్యాణార్థమై ఎవని జీవితము అంకితమగునో, ఓ అర్జునా! ఆపురుషుడు దయామూర్తియని తెలిసికొన వలెను. అట్టి వానికి నేను జననమాది ఋణపడి యుందును. ఇక 'భూతేష్వలోలుప్త్వము'ను గురించి వివరించి చెప్పెదను వినుము. కమలమెంత మిక్కుటముగ హృదయ పూర్వకముగ సూర్యుని పైపు అనురక్తి కలిగి యున్నప్పటికిని సూర్యుడెన్నడును దాని సుగంధమును స్పర్శింపడు, లేదా వసంతుని మార్గమునందెంత అత్యధికముగ వనలక్ష్మి యున్నప్పటికిని ఆత డావనశ్రీని స్వీకరించక తిన్నగా ముందుకు సాగిపోవు చునే యుండును. మహాసిద్ధు లన్నింటి తోడను స్వయముగ లక్ష్మీదేవియే దగ్గరకు వచ్చుగాక కాని మహావిష్ణువున కామె లెక్కలోనికి రాదు. ఇదేవిధమున్న, లౌకికము మరియు స్వర్గీయమునగు విషయ సుఖములు ఆతని యిష్టాను సారము దాసులవలె నున్నప్పటికిని అలోలుపుడై వుండు నాతడు ఎన్నడును ఆ సఖములను అనుభవించవలె ననెడి తలంపునే మనస్సునందు కలుగ నివ్వడు. ఇంకెంతని చెప్పనగును, ఏ అవస్థలో జీవున కేవిధమగు విషయాభిలాషయూ వుండదో, అట్టి అవస్థనే 'అలోలుపత్వ' మనెడి గుణముగా నెరుంగవలెను. ఇక 'మార్దవము' యొక్క గుణమును వివరించి చెప్పెదను వినుము. తేనెటీగలకు తేనెపట్టు, జలచరములకు నీరు, పక్షులకు బహిరంగముగా గల ఆకాశము, పిల్లవానికి మాతృప్రేమ, వసంత స్పర్శచే కోమలత్వమును పొందు మలయమారుతము, కనులకు ప్రియజనుల దర్శనము, తన బిడ్డలపట్ల తాబేలునకు వుండెడి దృష్టివలె మార్దవగుణముగల పురుషుడు కూడ భూతకోటి యెడల మృదుత్వము మరియు ప్రేమపూర్వకముగ

వ్యవహరించును. కర్పూరము స్పర్శించుటకు అతికోమలము, రుచికి అతిస్వాదిష్టము, నాసికకు అతిసుగంధితముగను, మరియు చూచుటకు అతినిర్మలముగనూ వుండి ఎంతకావలసిన అంతదొరకును. అది విషవంతముగ నుండక దాని విషత్వము మధ్యలో బాధాకరముగా నుండకున్నచో అది తన మాధుర్యము మరియు నిర్మలత్వమువలన మార్దవత్వముతో కూడియున్న పురుషుని కోమలత్వమును పోటీ చేయగలుగును. ఆకాశము మహాభూతములను కూడ తన ఉదరమునం దుంచుకొనును. మరియు అణువు-పరమాణువులందు కూడ నిమిడియుండును. మరియు జగత్తు కనురూపముగా తన ఆకారమును కూడ నిర్మించుకొనును. ఓ అర్జునా! నేనింక అధికముగ నేమనిచెప్పను. పైన చెప్పిన ఆకాశమువలె సమస్త విశ్వ జీవనముతోను సృష్టియందలి ప్రాణులన్నింటితోడను జీవించి యుండుటనే నేను 'మార్దవ' మందును. ఇకనీకు లజ్జయననేమో వివరించి చెప్పెదను వినుము. పరాజయము పొందినప్పుడు ఎవడైన రాజు సిగ్గువలన తనముఖమును చూపించజాలని రీతిని, లేదా అవమానమువలన మానవంతుడగు పురుషుడు నిస్తేజుడగు రీతిని, లేదా పొరబాటున ఒకానొక చండాలుని యింటికివెళ్ళినప్పుడు శ్రేష్ఠుడగు సన్యాసికి లజ్జ పొడము రీతిని, లేదా రణభూమినుండి క్షత్రియుడు పారిపోవుట లజ్జాజనకముగనుండి సహింపనలవికాకుండా నుండురీతిని, లేదా మహాపతివ్రతకు వైధవ్యము పరమ దుఃఖకరము, మరియు అసహనీయమునగు రీతిని, సుందరుడగు పురుషుని శరీరమునందు కుష్ఠువ్యాధి పొడచూపుటలేదా ప్రతిష్ఠావంతుడగు పురుషునిపై వ్యర్థముగ కళంకము నారోపించినప్పుడు లజ్జచే అతనికి ప్రాణసంకటముగ నుండురీతిని, యీ మూడున్నరమూరల శరీరమునందు బందీయై మాటిమాటికి జనన-మరణముల నొందుట మరియు గర్భాశయ వివరమునందు రక్తము మూత్రము మరియు రసములతో కూడియున్న బొమ్మయై యుండుటయూ అతనికి అతిలజ్జా జనకముగా నుండును. సారాంశ మేమన, దేహబంధనమున పడి నామరూపాత్మకు

తగుటకంటె మించిన లజ్జాజనకమగు విషయమేదియూ ఆతనికి వుండజాలదు. ఈరీతిని యీ ఘృణిత శరీరము పట్ల నేర్పడు ఘృణనే 'లజ్జ'గా నెరుంగుము. కాని యీలజ్జ కేవలము నిర్మలులగు పురుషులకే తోచును. తదితర సిగ్గులేని వారికి యీ శరీరము అతిచక్కగా నుండును. ఇక 'అచాపల్యము' యొక్క లక్షణములను వినుము. కొయ్యబొమ్మలను ఆడించెడి త్రాడు తెగిపోవుటవలన ఆ కొయ్యబొమ్మల కదలికయే ఆగిపోవు రీతిని, యోగసాధనమొనర్చుటవలన కర్మేంద్రియముల గమనము కుంఠితమై పోవును. లేదా సూర్యుడు అస్తమించిన పిమ్మట ఆతని కిరణజాలము కూడ అదృశ్యమై పోవు రీతిని మనస్సును నిగ్రహించుటవలన ఇంద్రియములుకూడా పూర్తిగా అణగి పోవును. ఈ రీతిని మనస్సును నియమించుట మరియు యోగ సాధన మొనర్చుట వలనను దశేంద్రియములూ దుర్బలమైపోవును. ఇట్టిస్థితినే 'అచాపల్య' మందురు.

తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా।
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత॥ 3

"ఈశ్వర ప్రాప్తికొరకై జ్ఞానమార్గమున అడుగిడునప్పుడు మనస్సున దృఢనిశ్చయము కలిగినచో యిక బల మేమాత్రము కొరవడదు. మరణించుటే భయంకరముగా నుండును. అందుపై అగ్నిలోకాలి మరణించు టింకనూ భయంకరమగును. కాని, యింత యైనప్పటికిని, పతివ్రతాస్త్రీ ఆ చితిలో కాలి మరణించుటను కూడ లక్ష్యపెట్టదు. ఇదేరీతిని, ఆత్మప్రాప్తి యనెడి అగ్నిచే విషయము లనెడి విషమును జీవుడు కాల్చి వేసి తొలగించివేయును. ఆ పిమ్మట శూన్యము వైపుకు పోయెడి యోగసాధన యనెడి వికటమార్గమున త్వరత్వరగ ముందుకు పోసాగును. అటుపిమ్మట ఏవిధమగు నిషేధమున్నా ఆతని మార్గమున బాధాకరముకాదు. అతడు 'విధి'ని మన్నించడు. మహాసిద్ధులనెడి సాహాము

నను పడదు. ఈ రీతిని స్వయముగానే తన అంతరిక ప్రేరణచే యీశ్వరుని వైపు పురోగమించుటనే 'ఆధ్యాత్మిక తేజ' మందురు. సహనశీలు రందరి లోను చేసే శ్రేష్ఠుడ ననెడి గర్వము లేకుండుటనే 'క్షమ'గా నెరుంగుము. శరీరముపై వేలకొలది రోమములుండును. వాటిఅన్నింటి భారమును శరీరము సహించుచున్నప్పటికిని ఆశరీరమున కీ భారమును మోయుచున్నటులే అనిపిం చదు. ఇంద్రియములు వశమునందుండక పెడమార్గమును పట్టుచో, లేదా శరీరమున దాగియున్న ఏదేని పాతరోగము ఒక్కపెట్టున బయల్పడుచో, లేదా ప్రియజనుల వియోగము ఆకస్మికముగ సంభవించి అప్రియజనులతో పనికలుగుచో, లేదా యిదేవిధమగు ఏదైనఅనిష్ట పరిసంగముయొక్క అత్యధి కమగు అల తనపై వచ్చిపడినప్పటికిని అగస్త్యఋషివలె రొమ్ముచరిచి దాని యెదుట నిశ్చల భావముతో నిలచియుండుట, మరియు, ఓ అర్జునా, అధి దైవము, అధిభూతము మరియు అధ్యాత్మములనెడి త్రివిధతాపములంవచ్చి ఎదుట నున్నప్పటికిని వాటినన్నింటిని 'ఆకాశమున లేచెడి అతిపెద్దవగు ధూమ్రరేఖలను వాయువు ఒక్క దెబ్బతో ఎగురగొట్టివేయురీతిని' తుచ్ఛ ముగ తలంచి తనయెదుటనుంచి తొలగించివేయుట,మరియు చిత్తమును విచలిత మొనర్చెడి యీవిధమగు వికటపరిసంగము వచ్చినప్పటికిని ధైర్యమును విడ నాడక చక్కగా దానినెదుర్కొనుటకై దృఢముగ నిలచియుండుటనే 'ధృతి' యందురు. ఓ అర్జునా, నీ వీసంగతిని చక్కగా జ్ఞాపకముంచుకొనుము. ఇక 'శౌచము'బంగారుమలాము పూసి స్వచ్ఛమొనర్పబడి గంగామృతముచే నిండి యున్న కలశమువంటిదనిఎరుంగుము;ఏలనన శరీరము ద్వారా నిష్కామకర్మలు చేయబడుట, మరియు జీవుడు వివేకానుసారము ఆచరించుట-యివన్నియు శుచిత్వముయొక్క బాహ్యలక్షణములు. లేదా గంగాజలము ప్రాణికోటి యొక్క పాప-తాపములను శమనమొనర్చి, తటమునందుగల వృక్షములను పోషణమొనర్చుచూ సముద్రముపై పరుగు పోవురీతిని, లేదా సూర్యుడు ప్రపం చముయొక్క అంధకారమును దూరమొనర్చుచూ మరియు సంపద గల మందిర

ముల తలుపులు తెరచుచూ మరియు వాటిని ప్రకటమొనర్చుచూ ఆకాశ ప్రదక్షిణముకొరకై బయలుదేరు కీతిని, ఆతడుకూడా బంధనమున పడియున్న లోకులను ముక్తుల నొనర్చును. మునుగుచున్నవారిని బయటకు తీయును. మరియు దుఃఖమునందున్నవారి సంకటములను నివారణ మొనర్చును. అయినప్పటికిని ఆతడు రాత్రిం-బవళ్ళు యితరుల సౌఖ్యములను అత్యధికముగ వృద్ధిపొందించుచూ ప్రకారాంతరము ననుసరించి తనస్వార్థమునే నెరవేర్చుకొనును. కేవల మింతియేకాదు, తనకార్యసిద్ధికొరకై ఏప్రాణికైన చెడుగుచేయవలెననెడి భావముకూడ ఆతనిమనస్సునం దెన్నడును జనించదు. ఓ అర్జునా! నీవిప్పుడు వినిన వన్నియూ 'అద్రోహము' యొక్క లక్షణములు. నేనీపైన వివరించిన లక్షణములు 'అద్రోహము' గల మనుష్యునందు కాన్పించును. ఓ అర్జునా! శంకరుడు తనజటాజూటమున గంగను ధరించినప్పుడామె సిగ్గును పొందినరీతిని, గౌరవము లభించినప్పుడు లజ్జను పొందుటను 'అమానిత్వమని' యెరుంగుము. ఓ అర్జునా, యీ సంగతుల నన్నింటిని నీవు చక్కగా జ్ఞాపక ముంచుకొనుము. ఇప్పుడు చెప్పిన యిరువదియారున్ను దైవీ సంపద యొక్క గుణములు. ఇది మోక్షసామ్రాజ్యచక్రవర్తియగు రాజు యొక్క తామ్రశాసనము ననుసరించి యివ్వబడిన జాగీరులు, లేదా యీ దైవీసంపద గుణములనెడి జలముతో ఎల్లప్పుడు నిండియుండెడి గంగయే వైరాగ్యమనెడి సగర - పుత్రుల శరీరములపై పడినదా యన్నటుల తలంచవలెను. లేదా యీ దైవీసంపద సద్గుణము లనెడి పూలమాలగను, మరియు ముక్తియనెడి పెండ్లి కుమార్తె యీ మాలను విరక్తుల కంఠమునం దలంకరించుననిన్నీ తోచును. లేదా యీ యిరువదియారు గుణములతో కూడియున్న వత్తిని వెలిగించి యీ గీత యనెడి భార్య తన ఆత్మారాము డనెడి భర్తకు హారతి యిచ్చుచున్నదా యనునటుల తోచును. ఈ గుణములు గీతా సముద్రమునుండి తీయబడిన దైవీ సంపద యనెడి ముత్తెపుచిప్ప లందలి నిర్మలమూ స్వచ్ఛమునగు ముత్తెముల వంటివి, ఇట్టి స్థితిలో వీటిని గురించి ప్రశ్న

దున్నటుల వర్ణించుట కెవరి తరమగును! ఇది తమంతతామే అనుభవము లోనికి వచ్చును. ఈ రీతిని గుణభాండారమగు యీ దైవీసంపద వర్ణింపబడినది. ఇక ఆసురీసంపద దుఃఖములతో కూడియున్న దోషములనెడి కంటకములతో నిండియున్న లతవంటిదైనప్పటికిని యీ సందర్భమున దానిని గురించికూడా వర్ణింపబడును. ఏదైన ఒకానొక నింద్యవస్తువును త్యజింపవలసి వచ్చుచో, ఆ నింద్యవస్తువేదియో తెలిసికొనుటకూడ ఆవశ్యకమే. కావుననే, ఆసురీసంపద అనిష్టమైన దైనప్పటికిని దానిస్వరూపమును జాగ్రత్తగా వినుట ఆవశ్యకమే. ఓ అర్జునా, భయంకరమగు అధోగతికరమగు దుఃఖములను తమబాహ్యతలోనికి తీసికొనుటకై ఘోరపాతములు కలసి సమకూర్చుకొనిన మొత్తమే యీ ఆసురీసంపద. లేదా విషయముల నన్నింటిని కలిపినప్పుడు ఏర్పడు మిశ్రణము కాలకూటవిషమగు రీతిని, పాపముల నన్నింటిని ఏకత్రిత మొనర్చిన సమూహమునే 'ఆసురీసంపద' యందురు.

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్ ॥ ౪

ఇక ఓ అర్జునా, యీ ఆసురీదోషములలో దేని శక్తినిగురించి అత్యధికముగ చాటింపవేయబడునో, ఆ 'దంభ' స్వరూపమును నీకు చెప్పెదను. ఓ అర్జునా! మన మాత కేవలము తీర్థస్వరూపిణియే యన్నసంగతి వాస్తవమైనప్పటికిని, ఆమెను నగ్నస్థితిలో లోకులందరి ముందును తీసికొనివచ్చుచో, అది మన అధఃపతనమునకే కారణమగును. లేదా, గురువు ఉపదేశించిన విద్యలన్నియు యిష్టఫలము నిచ్చునవే యైనప్పటికిని, నాల్గువీధుల కూడలిలో నుంచుని ఆ విద్యలను బిగ్గరగా ఉచ్చరించుచో, అవికూడ అనిష్టమును కలిగించు నవిగనే యగును. లేదా, మనము మునగబోవునప్పుడు మనలను రక్షించి ఒడ్డునకుజేర్చుటకు సాధనముగా నుపయోగపడు నావయే దానిని మన తలకు కట్టివేసి కొన్నచో అది మనలను ముంచివేయుటకే కారణమగును.

జీవించుటకు ఆధారము అన్నమని అందరెరింగినదే. కాని దానిని ఉత్తమమైన దని తలంచి కావలసిన దానికంటె అధికముగా తిన్నచో ఆ అన్నమే మనకు విషముగా నగును. ఈ విధముగనే ఈ లోకమునందును పరలోకమునందును మనకు స్నేహపూర్ణుడగు సహచరునిగానుండు ధర్మమును ఆచరించి మనము అభిమానముతో 'మేము ధర్మాచరణ మొనర్చుచున్నా'మని చెప్పుకొనుచున్నచో మనను తరింపజేయు ధర్మముకూడ మనకు దోషమును కలుగజేయునట్టిదిగానే యగును. కావున ఓ అర్జునా! మనముచేసిన ధర్మకార్యములను ఆడంబరముగ నలుగిక్కులను ప్రచారముచేసికొన నారంభించుచో, ఆ ధర్మముకూడా అధర్మమే యగును. ఈవిధముగా చేయుటనే 'దంభ' మందురు. ఇక 'దర్పము' యొక్క లక్షణములను వినుము. మూర్ఖుడు ఏకొద్దిగానో చదువుకొని బ్రాహ్మణసభనుకూడా నిందించసాగురీతిని, లేదా గుఱ్ఱపువాడెక్కిన గుఱ్ఱము ఐరావతమునుకూడ తుచ్ఛముగ తలంచుసాగురీతిని, లేదా ముళ్ళపొదయొక్క శిఖరముపైనెక్కిన తొండ స్వర్గమునుకూడ తుచ్ఛముగ తలంచసాగురీతిని, లేదా కట్టెలతోపాటు గడ్డి - గాదము కూడా వుండుచో అగ్ని శిఖలు ఆకాశముపైకెగయు రీతిని, లేదా చిన్న చెరువుగాని గుంటనుగాని ఆశ్రయముగా కలపాదించినమత్స్యము సముద్రమునుకూడ తుచ్ఛముగ తలంచసాగు రీతిని, స్త్రీ, ధనము, విద్య, స్తుతి మరియు గౌరవములను పొందిన మనుష్యుడు కూడా మదాంధుడగును. పరులయింట ఒక్కనాడు అన్నము లభించినంత మాత్రమునసే దరిద్రుడగు బిచ్చగాడు తన్నుతాను ధన్యునిగా తలంచసాగును. లేదా మేఘములనీడ లభించినందువలన దురదృష్టుడగు మానవుడు తనయింటిని పడగొట్టుకొను రీతిని, లేదా మృగ-జల ప్రవాహమును చూచిమూర్ఖుడుతననీటికుండనుబ్రద్దలుకొట్టుకొనురీతిని, తనకుప్రాప్తించుసంపదవలన మత్తులుటయే 'దర్ప'మనబడును. ఓ అర్జునా, యీ సిద్ధాంతమున సామమాత్రమునకైన అపవాదములేదు. ఇకఅభిమాన మన నేమోవినుము. వేదములపట్ల జగత్తంతకూ శ్రద్ధయున్నది. మరియు యీ శ్రద్ధలో యీశ్వ

యగు సూర్యుడు ప్రాతఃకాలమున ఉదయించుటతోడనే పాపియగు గుడ్ల గూబకు కనులు కనిపించని రీతిని, లేదా జగత్తుకు ఆనందమునిచ్చెడి ప్రాతః కాలము దొంగలకు మృత్యువుకంటె అధికముగ దుఃఖదాయకమగు రీతిని, లేదా పాముపుట్టలోనికిపోయి పాలుకూడా కాలకూటవిషముగా నగురీతిని, లేదా సముద్రముయొక్క అపరంపార జలముచే బడబాగ్ని యింకనూ అత్యధికముగ ప్రజ్వలించి ఎంతటి ఉపాయము లొనర్చినను ఏవిధముగను శాంతించని రీతిని, యితరునివిద్య మరియు సుఖాది ఐశ్వర్యములనుచూచి ఎవనిక్రోధము మండిపడునో, ఆ మనోవృత్తినే 'క్రోధ' మందురు. ఇక 'పారుష్య'మని దేనినందురో చెప్పెదను వినుము. ఎవని మనస్సు పాముకలుగు వంటిదో, నేత్రములు బాణముల ఝుంకారమువలెనుండునో, మరియు మాటలు తేళ్ళవర్షమువలె నుండునో, మరియు తదితర క్రియలు ఉక్కురంపమువలె నుండునో, అనగా యీ రీతిని లోపలను బయటను పరుషస్వరూపముగల మనుష్యుని మానవజాతియందు అధమునిగా ఎరుంగవలెను. పారుష్యము అనగా నిదియే. ఇక 'అజ్ఞాన' లక్షణములనువినుము. రాతికి చల్లదనము లేదా ఉష్ణస్పర్శయందలి భేదము తెలియనటుల, లేదా అగ్ని ఒకమారు భగ భగ మండి భక్షించ నారంభించినప్పుడు యిది తినదగినది యిది తినరానిదనీ మరియు విధి - నిషేధములను ఏమాత్రము యోచించనిరీతిని లేదా స్పర్శ మణి యినుము మరియు బంగారములం దేవిధమగు భేదభావమును కలిగి యుండని రీతిని, లేదా వివిధ విధములగు ఖాద్యపదార్థములందు తిరిగినప్పటి కిని గరిట దేనినీ రుచి చూడజాల నటుల, లేదా వాయువు తిన్నని - వంకర మార్గముల భేదము నెరుగనిరీతిని, ఏ స్థితిలో పురుషుడు కర్తవ్యా కర్తవ్య విషయములలో అంధుడై వుండునో, స్వచ్ఛము మరియు ఘృణితముల భేదము నెరుంగడో, పాపపుణ్యముల నన్నింటిని కలిపి 'బాలుడు తన చేతికి వచ్చిన మంచి - చెడ్డ వస్తువుల నన్నింటిని నోట నిడికొను రీతిని' భక్షించునో, మరియు బుద్ధికి మధుర మననేమో కటువననేమో తెలియనట్టి

స్ఫురణారహితస్థితి యేర్పడునో, అట్టి స్థితినే 'అజ్ఞాన' మందురు. ఈ విషయమున శంకించుటకు ఏ మాత్రము తావు లేదు. ఈ రీతిని యీ ఆరు దోషములున్నూ వివరింపబడినవి. పాముయొక్క శరీరము చిన్నదే యైనప్పటికిని దానియందు భయంకరమగు విషము వుండు రీతిని, లేదా అగ్నుల శ్రేణిని చూచినచో ప్రళయాగ్ని విద్యుదగ్ని మరియు బడబాగ్ని యనబడు యీ మూడున్న సంఖ్యలను బట్టి చూచినచో చాలకొద్దిగానే యున్నప్పటికిని యీ అగ్నులు భగ్గున మండుచో వీటి తీవ్రతకి యీ విశ్వమంతయూ కూడ సరిపోనిరీతిని యీ దోషములుకూడ లెక్కకు కేవలము ఆరుమాత్రమే గలవు. కాని వీటి కలయిక వలన ఆసురీ సంపదకు అత్యధికమగు బలము లభించును. మానవ శరీరమునందు త్రిదోషములూ ఏకత్రితమైనప్పుడు స్వయముగా బ్రహ్మదేవుని పాదములు పట్టుకొన్నప్పటికిని మృత్యువునుంచి ఏవిధముగను రక్షణ లభించనేరదు. కాని యీ దోషములు ఆరు వున్నవి. అనగా ఆ మూడింటికి రెట్టింపుగా గలవు; ఈ షడ్దోషముల పునాదిపైననే ఆసురీ సంపదయొక్క భవనము నిలచియున్నది. కావుననే అది ఎన్నడును దుర్బలమగుట లేదు. ఇందుకు విరుద్ధముగ అప్పుడప్పుడు పాపగ్రహములన్నియూ ఒకే రాశియందు వచ్చియుండురీతిని లేదా నిందించువానివద్దకు పాపములన్నియూ వచ్చియుండురీతిని, లేదా మరణకాలము సమీపించిన వానిని రోగములన్నియు ఒక్కమారుగా వచ్చి ముట్టడించురీతిని, లేదా అశుభదినమున దుర్యోగము లన్నియూ వచ్చి ఏకత్రితమగు రీతిని, లేదా విశ్వాసముతోను నిశ్చింతగానున్న మనుష్యుని దొంగలు తప్పగించి విషమును, లేదా బాగా అలసియున్న మనుష్యుడు అతి పెద్దదగు వరదలో నెట్టివేయబడురీతిని యీ ఆరు దోషములున్నూ పైన వివరించిన మాదిరి భయంకర కృత్యముల నొనర్చును. లేదా మేకయొక్క ఆయువు సమాప్తమైనప్పుడు దానిని ఏడుకొండెలుగల తేలు కరుచురీతిని యీ ఆరు దోషములూ మనుష్యుని కాటువేయును. మోక్షమార్గమువైపు ఏకొద్దిపాటి

ప్రవృత్తి కలిగినప్పటికిని ఎవడు 'నే నీ మార్గమునపోను' అనిచెప్పి సాంసారిక జంజాటమున మునిగిపోవునో, ఎవడు హీనయోనులనెడి మెట్లు దిగుచూ దిగుచూ అంతమున స్థావరములకంటెకూడ నీచమగుస్థానమున పోయికూర్చొనునో అట్టివానియందే యీ షడ్దోషములున్నూ ఏకత్రితమై ఆసురీసంపదను బలిష్ఠురాలినిగ చేయును. ఈ రీతిని నీ కీరెండు సంపదలయొక్క లక్షణములను విడి విడిగా స్పష్టీకరించి చెప్పితిని.

దైవీ సంపద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా।
మా శుచస్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ॥ 5॥

"ఈ రెంటియందును మొదటిదగు దైవీసంపదను మోక్షమనెడి సూర్యునిచే ఉదయింప జేయబడిన ప్రభాతకాలముగానే ఎరుంగవలెను. ఇక రెండవదియగు ఆసురీసంపద జీవులనుబంధించు మోహమనెడి లోహశృంఖలమే. నీ వీసంగతిని విని భయపడి యుందువు. కాని ఓ అర్జునా, పగటి సమయము రాత్రికి భయపడవలసిన ఆవశ్యకమేమిగలదు ? పైనచెప్పబడిన అసురదోషములకు తమయందాశ్రయమిచ్చిన వారిని మాత్రమే యీ ఆసురీ సంపద బంధించగలదు. నీవుమాత్రము, ఓ అర్జునా, ఆ దైవీ సంపద్గుణములచే చేయబడిన సాక్షాత్ విగ్రహమవు. కావున ఓపార్థా, నీ వీదైవీసంపదచే కూడియున్న ధనవంతుడవై కైవల్యసుఖమును పొందుము.

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు॥ ౬

"దైవీసంపద మరియు ఆసురీసంపదలతో కూడియున్న మానవుల వ్యవహారప్రవాహము అనాదికాలమునుంచి వచ్చుచున్నది. రాత్రియందు నిశాచరులున్నూ పగలు మానవులున్నూ సంచరించుచుండురీతిని యీదైవీ ఆసురీ సృష్టులుకూడా తమతమరీతుల ననుసరించి వ్యవహరించుచూ వుందురు. కావుననే యీ గ్రంథము నందు మొదట జ్ఞానకథను గురించి, మరియు

తదితర ప్రకరణములలో దైవీ సంపదను గురించిన్ని విపులముగ వర్ణింపబడి నది. ఇక నీకు ఆసురీసంపదను గురించిన సంగతులన్నింటిని చెప్పెదను. నీవు వాటిని సావధానముగా వినుము. వాద్యములేనిదే ఎవనికిని ఎన్నడును నాదము వినిపించనిరీతిని, లేదా పుష్పములేనిదే తేనె లభించనిరీతిని, ఆసురీ ప్రకృతికి దేహముకానంతవరకు ఏమనుష్యులను యీ సృష్టిని ఏకాకిగా ఎన్నడును చూడజాలడు. కాని, దీనికి వశపడిన మానవునిపై అగ్ని కాష్ఠమునందంతటను వ్యాపించిపోవురీతిని, యీ ఆసురీసంపదకూడ తన యిష్టానుసారము రాజ్య మొనర్చుచూ కాపురించుచుండును. ఇట్టి స్థితిలో, చెరుకుమొక్క పెరిగిన కొలది దానిలోపల గల రసముకూడా వృద్ధిపొందుచుండురీతిని అట్టి ప్రాణి యొక్క శరీరము వృద్ధిపొందుటతోపాటు ఆసురీసృష్టికూడా వృద్ధిపొందు చుండును. ఇక నో అర్జునా ! యీ ఆసురీదోషమందలి ముట్టడించిన ప్రాణి యొక్క లక్షణములనుకూడా చెప్పెదను వినుము.

ప్రవృత్తించ నివృత్తించ జనా న విదు రాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥ ౭

"పుణ్యకార్యములపై ప్రవృత్తికలుగవలెను. పాపకృత్యములపై నివృత్తికలుగవలెను" అనెడి యోచనపట్ల అతని మనస్సున ఘోరాంధకారము నిండియుండును. కోశమున పడియున్న పట్టుపురుగు దానినుండి బయటకు రావలెననిగాని లేదా లోపలకు పోవలెననిగాని ఏవిధమగు యోచనయు లేకుండా వున్నచోటుననే వుండవలెనని కోరెడి విధమున లేదా మూర్ఖుడు తన సంపద నంతను దొంగలకు వప్పగించి వారి చేతికి నా సంపదను వప్పగించుచో యిది మరల నాకు తిరిగి లభించును లేదా లభించదు — అనెడి ఆలోచనమే చేయనిరీతిని ఆసురీజనులు ప్రవృత్తి - నివృత్తులనుగురించి ఏమాత్రము యోచించరు; మరియు శౌచము అనగా పారిశుధ్యము వారియందు నామమాత్రమున

కైన స్వప్నమునందైన వుండదు. రాక్షసిబొగ్గు తననలుపును విడనాడుట, కాకి ఎన్నడైన తెల్లబడుట, మరియు రాక్షసుడు మాంసభక్షణము నెడ విముఖుడగుట యనునవి యెన్నడైన సంభవించిన సంభవించు నేమోగాని, యీ ఆసురీప్రాణిమాత్రము ఎన్నడును శౌచమును స్వీకరించదు. మద్యమును వుంచెడి పాత్ర ఎన్నడును పవిత్రము కాజాలని రీతిని ఓ అర్జునా, యిట్టి లోకులు కూడా ఎన్నడును పవిత్రులు కాజాలరు. శాస్త్రోక్త విధి-విధానముల పట్ల అనురాగము, లేదా పెద్దలను అనుకరించవలెననెడి వాంఛ, లేదా శుద్ధాచరణములనునవి వారియందు సంభవించనే సంభవించవు. మేకలు పైరుల యథేచ్ఛగా మేయుచుండురీతిని, లేదా వాయువు స్వేచ్ఛగా యిటు - నటు వీచుచుండు విధమున, లేదా అగ్ని లభించిన దానినంతను కాల్చివేయు రీతిని యీ ఆసురీప్రకృతి గల లోకులుకూడా కుమార్గమున నిరంతరము ముందుకు పోవుచూ నుందురు. మరియు నగ్న శరీరముతో నాట్య మొనర్తురు. మరియు సత్యముతో ఎల్లప్పుడు విరోధమును బూనియుందురు. తేలు ఎన్నడైన తనకొండిచే చక్కిలిగింత పెట్టగల్గుచో, అప్పుడీఆసురీ ప్రజలు కూడ సత్యవాక్కును పలుక గల్గుదురు. లేదా అపానవాయువునుండి ఎన్నడైన సుగంధము రాగలుగుచో, అప్పుడే యీ ఆసురీ ప్రజలయందు సత్యము కాన్పించును. ఈ ఆసురీ ప్రజలు యీ విషమగు పను లేవియూ చేయక పోయినప్పటికిని వారు స్వాభావికముగనే అత్యంత నాశనమును పొందుదురు. వారి మాటలలో వుండెడి విచిత్రమును నీకు చెప్పెదను వినుము. నిజము చెప్పవలెననిన, ఒంటెలో చక్కగా నున్నదని చెప్పదగిన అవయవమేది గలదు? ఈ మాటయే ఆసురీప్రజల పట్ల కూడ చెల్లును. అయినను ప్రసంగ సందర్భముగ వీరిని గురించిన కొన్ని విషయములను చెప్పెదను. సావధానముగా వినుము. పొగవచ్చెడి చిమ్నీ ముఖమునుండి నిరంతరము పొగ యొక్క సమూహమే వచ్చుచుండు రీతిని యీ ప్రకృతి గల లోకుల నోటినుండి ఎట్టిమాటలు వెడలునో చెప్పెదను వినుము.

అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్ ।
అపరస్పర సంభూతం కి మన్య త్కామ హైతుక మ్॥ ౮

"ఈ విశ్వము అనాది యైనది. ఈశ్వరుడు దీనిని నియమించెడి శక్తి కాదు - అనెడి యీ సిద్ధాంతమును వేదములు బహిరంగముగ నిర్ణయించినవి. వేదముల ననుసరించి దోషిగా ఏర్పడువానికి నరక-భోగ శిక్ష లభించును; మరియు వేదములు న్యాయస్థుడని నిర్ణయించినవారు స్వర్గమున కేగి సుఖముగ నివసింతురు. ఓ అర్జునా! అనాది సిద్ధముగా గల యీ జగద్వ్యవస్థను ఆసురీ ప్రజలు ఏమాత్రము అంగీకరించరు. ఇదంతయూ శుద్ధ అబద్ధమని వారందురు. దానితో పాటు వారు మరి యింకనూ యీప్రకారము అనుచుందురు. "మూర్ఖులగు యాజ్ఞికులు యజ్ఞములనెడి వలలో పడియుందురు. దేవతలనెడి వ్యామోహములో పడియున్న యీ లోకులు విగ్రహపూజ మొదలగునవి చేయుచుందురు. మరియు కాషాయవస్త్రధారులగు కపటయోగులు సమాధి నిష్ఠయనెడి కల్పనలో మునకలు వేయుచుందురు. కాని యీ సంసారమున మానవుని చేజిక్కిన ప్రతిదానిని తాను స్వయముగ తన సాహసమును ఆధారముగ నొనర్చుకొని భోగించవలెను; యింతకుమించిన పుణ్యకృత్య మేదిగలదు? లేదా మన అశక్తత వలన వివిధ విషయములను మన సుఖ - భోగమునకై సంగ్రహ మొనర్చుకొనజాలక, అందువలన మన మా విషయ సుఖములకై వికలులమై వుండుటే వాస్తవముగ పాపమగును. ధనవంతులను హత్యచేయుట పాపమన్నమాట వాస్తవమే; కాని వారిని హత్యచేయుటవలన వారిసంపద యంతయు మన చేజిక్కుట పుణ్యఫలముకాదా? బలవంతుడు బలహీనుని భక్షించుట నిషిద్ధమని చెప్పుచో, పెద్దపెద్దచేపలు చిన్నచేపలను భక్షించుచుండుటను మనము చూచుటలేదా? ఇట్టిస్థితిలో, యీ పెద్దచేపలు సంతానము లేనివిగ ఎందుకని అవుటలేదు? ఇదేవిధమున లోకులు కుల-గోత్రములను చక్కగా పరీక్షించి శుభముహూర్తమున చిన్న చిన్న బాల-బాలికలకు వివాహ మొనర్చుచున్నారు. వివాహముయొక్క ఉద్దేశ్యము కేవలము ప్రజ

లను జనింపజేయుటే యగుచో, గణించుటకు అలవికాని పశు-పక్ష్యాది
ప్రాణి-వర్గములు ఏశాస్త్రోక్తవిధి ననుసరించి వివాహములు చేసికొనుచున్నవి?
పోనీ, పూర్తిగాదొంగతనము వలన ఆర్జించిన ద్రవ్యమే అనుకొందము, అయి
నప్పటికిని అది ఎవరికిని విషముగా పరిణమించుటలేదుగదా ? పరస్త్రీతో ప్రీతి
పూర్వకముగ సంభోగించునట్టి పురుషునకు కుష్ఠురోగము కలుగుట ఎచ్చటను
లేదుగదా ? లోకులు యీ విధముగా తరచుగా చెప్పుచుందురు- " ఈశ్వ
రుడు అందరికిని నియంత, అతడే జీవులు ధర్మాధర్మ కార్యఫలమును అనుభ
వించునటుల చేయును మరియు యీ లోకమున ఏవిధమగు ఆచరణ మొన
ర్చునో అదేవిధమగు భోగము పరలోకమున ప్రాప్తించును. " పోనీ యీ
సిద్ధాంతములన్నియూ సత్యమని అంగీకరించినప్పటికిని, పరలోక మెచ్చ
టను కాన్పించుటలేదు. అంతేగాక, దేవుళ్ళుకూడా కాన్పించుట లేదు.
కావున యినియంతయూ మిథ్యయే. శుభాశుభ కర్మల నొనర్చెడి కర్త
యొక్క అస్తిత్వమే ఎచ్చటను లేనప్పుడు, యిక కర్మ ఫలభోగ మెచ్చట
నుండును? స్వర్గలోకమున యింద్రుడు ఊర్వశి సాంగత్యమునుపొంది తనను
తాను ధన్యునిగా తలంచు రీతిని మురుగుకాల్వలో పడిన పురుగుకూడ తనను
తాను ధన్యురాలిగా తలంచును. కావున, స్వర్గనరకములు పుణ్యపాపముల
వలన లభించు ననుట యుక్తివంతముకాదు. ఏలనన, రెండు ప్రదేశము
లందును కామవాసన సమానముగనే సంతుష్టిపొందును. కామ వాసనచే
స్త్రీ-పురుషులు, లేదా పెంటి - పోతులు సంభోగించినప్పుడు జీవులన్నియు
జన్మించును. "మరియు, పరస్పరలోభమువలన స్వార్థబుద్ధిచే కామ -
వాసన వేటి - వేటిని పోషించునో, వాటిని అంతమున, పరస్పర ద్వేషము
వలన స్వార్థవంతమగు కామ - వాసనయే నాశనముకూడ నొనర్చును.
ఈ రీతిని, కామ-వాసన తప్ప యీ జగత్తునకు మరొక మూలాధారమేదియును
లేదు". ఆసురీలోకులు యీ రీతిని వ్యర్థప్రలాపముల నాడుచుందురు.
ఈ విధమగు నింద్యము మరియు ఘృణితము నగు మాటలను హద్దూపద్దూ
లేకుండా ఉచ్చరించినందువలన వాణికికూడ అకారణముగ కష్టమే కలుగును

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో ఽల్పబుద్ధయః ।
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతో ఽహితాః ॥ ౯

"ఈరీతిని ఈశ్వరుని ద్వేషించుటవలన యీ ఆసురీజనులు వ్యర్థముగనే నోటితో వచింపరాని మాటల ననుచుందురు. అయినప్పటికిని వారికి ఏదేని ఒక విషయము మనస్సున నిశ్చితముగ ఏర్పడినదనిగాని, లేదా వారికొక సిద్ధాంతము వున్నటులగానికాన్పించదు. లౌకులు బహిరంగముగనే పాషండవాదమును నెలకొల్పి జీవుల శరీరమున నాస్తికత్వమనెడి ఎముకను గుచ్చి ఒకనిందనీయ మగు పట్టణమును నెలకొల్పుదురు. ఇట్టిస్థితిలో స్వర్గముపట్ల ఆదరభావము నరకమునుగురించిన భీతిగొల్పు మనోవృత్తి యనెడి అంకురమే కాలి భస్మమై పోయినది. ఇక నో సఖుడవగు అర్జునా! ఆ అసురీప్రజలు మురికినీటిగుంటను పోలియున్న యీ శరీరమున చిక్కుకొని విషయములనెడి బురదలో బంధింప బడియున్నవారై కాన్పింతురు. ఏదేని వొకానొక జలాశయము నందలి నీరు ఎండిపోయినప్పుడు, దానియందు నివశించెడి మత్స్యములకు ఆయువుచెల్లిపోవు టనుచూచి పక్షీయులు మొదలగువారా జలాశయమువద్దకువచ్చి ఏకత్రితులగు రీతిని, లేదా మరణసమయము వచ్చినప్పు డనేకవిధములగు వ్యాధులు తలలెత్తి నిలచియుండు రీతిని, లేదా విశ్వవినాశ మొనర్చుటకై ధూమకేతువు ఉద యించురీతిని, లోకులను సంహరించుటకొరకే ఆసురీప్రజలు జన్మింతురు. అమంగళ మనెడి బీజమును నాటినప్పుడు దానినుండి యీ అసురీ మనుష్యు లనెడి మొక్క బయలుదేరును. అగ్ని మండ నారంభించినప్పు డిక వెనుక ముందుల నాలోచించని రీతిని వీరుకూడా తమ యిష్టము వచ్చినట్టి మరియు నీతివిరుద్ధమైనట్టి ఆచరణ మొనర్చునప్పుడు ఏ విషయమును గురించిన్నీ యించుకైన యోచించరు. ఇక, వీరు తమ యీ నింద్యాచరణమునుగురించి ఎంత అభిమానముతో అభినందనము మరియు ప్రశంసల నొనర్తురో, అది కూడా చెప్పెదను వినుము." ఈ రీతిని భగవానుడగు లక్ష్మీ - పతి అర్జును నితో చెప్పెను.

కామ మాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః ।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః ॥

అపిమ్మట శ్రీ కృష్ణ భగవాను లిట్లుల చెప్పిరి – ఓ అర్జునా, ఎంత నీరు వున్నప్పటికినీ అనీటిచే వల నెన్నడును నింపజాలము; అగ్నియం దెన్ని యింధనములను వేసినప్పటికిని వాటిని దగ్ధమొనర్చుటలో ఏమాత్రము న్యూనత లేదు. ఇదేవిధమున, ఎన్నడును పొట్టనిండని వస్తువు లన్నింటియందును 'కామము' అన్నింటికంటె శ్రేష్ఠముగ పరిగణించబడును. ఓ అర్జునా, ఇట్టి లోకులా 'కామము'ను తమ హృదయమునకు హత్తుకొనియుందురు. మరియు తమకునలుపైపులందును, ఆడంబరము మరియు అహమ్మన్యత్వపురాశిని పోగు చేసికొనుచు పోదురు. అటుపైని, గ దించిన ఏనుగుచే మద్యమును త్రాగించినప్పు డెట్టిస్థితి యేర్పడునో, సరిగా అదేస్థితి యిట్టివారికికూడ సంభవించును; మరియు నానాటికి వారివయస్సు పెరిగి వృద్ధులగుచున్నకొలది వారికి గల అభి మానముకూడా వృద్ధిపొందుచూ వుండును. ఇట్టివారిలో ప్రప్రథమమునుంచి 'దురాగ్రహ'ము వుండి యుండును. అందుపైన, యీ దురాగ్రహ మునకు సహాయపడుటకై మూర్ఖత్వముకూడా వచ్చి చేరును. ఇక యిట్టివాని వితండవాదము నేమని ఎంతవరకు వర్ణించనగును. ఏ పనులచే యితరులకు బాధ కలుగునో, మరియు వేటివలన అన్యజీవులకు దుస్థితి సంభవించునో, ఆ యా పనులయం దిట్టివారు జననమాదిగా అత్యధికమగు పట్టుదల గలిగియుందురు. అంతేగాక, తమ యీ పరాక్రమమును గురించి తమంతతామే స్వయముగ తమ నోటనే నలుదిశల చాటుకొనుచు తిరిగెదరు. మరియు వారు జగత్తునంతను తుచ్ఛముగ తలంతురు. వారు దశదిశలందును తమ వాసనలనెడి విశాలమైన వలను పరచెదరు. కట్టువిప్పినగోవు నలువైపు లను తిరిగి – తిరిగి తనముం దేదియున్న దానినే తినుచూ తిరుగు రీతిని యీ అసురీ ప్రజలుకూడా తమ స్వేచ్ఛాచారము, మరియు అభిమానమువలన నలువైపులందును పాపమును సమానముగా వృద్ధినొందించుచూ వుందురు.

చింతా మపరిమేయాంచ ప్రళయాంతా ముపాశ్రితాః ।
కామోపభోగ పరమా ఏతావ దితి నిశ్చితాః ॥ ౧౧

" ఇట్టి వారొనర్చు సమస్త వ్యవహారములు ఒకే నీతి ననుసరించి యుండును. కాని దానితోపాటు వీరికి 'మరణానంతరం మేమగుదు?' యనెడి చింతకూడా విడువకుండా వుండును, ఆసురీప్రకృతి గల వీరు యీ భయంకరమగు చింతను నిరంతరము అధిక మొనర్చుకొనుచునే వుందురు. ఇది 'రాను రాను పాతాళముకంటె అతిలోతైనట్టిదియూ, మరియు ఆకాశము కంటె అత్యున్నత మైనట్టిదిగానూ అగును; దీనితో పోల్చి చెప్పుటకు యీ జగత్తు కూడ దానిముందు పరమాణువువలె కాన్పించును; ఈ చింత భోగములు కావలెనని జీవుని మిక్కుటముగ కష్ట పెట్టును. మరియు జీవు డనెడి తన ప్రియుని మరణకాలమువరకు కూడ విడువవలెనను తలంపును తనమనస్సులోనికి రానివ్వదు. మరియు యీ ఆసురీ ప్రజలు నిస్సారమగు విషయభోగములు పొందవలెననెడి ఆసక్తిని తమమనస్సున కలిగియుందురు. వారు స్త్రీల గానమును వినగోరుదురు. వారి సౌందర్యమును తమ నేత్రములతో చూడ గోరుదురు, వారిని గాఢాలింగన మొనర్చుకొనగోరుదురు మరియు అమృతమును కూడ వారికొరకై త్యజించగోరుదురు. అనగా వారు తమ మనస్సునందు 'స్త్రీ అను మించి మరేవస్తువునందును యథార్థమైన సుఖములేదనెడి' సిద్ధాంతమును స్థిరపరుచుకొని యుందురు; అందుచే వారి స్త్రీసంభోగమునకై ప్రపంచమున దేనినైన తారు - మారు చేయుదురు, మరియు దిగంతము, పాతాళము మరియు స్వర్గము - వీటన్నిటి సరిహద్దులనుకూడ దాటి పరుగు లిడుదురు.

ఆశా పాశ శతైర్బద్ధాః కామ క్రోధ పరాయణాః ।
ఈ హంతే కామభోగార్థ మన్యాయేనార్థ సంచయాన్ ॥ ౧౨

"చేప కేవలము ఆశవలన వెనుక-ముందు లాలోచింపకుండా గాలమునకు గుచ్చిన మాంసమును తినురీతిని యీ అసురీ ప్రజలుకూడాఆలోచింపకుండా ఎల్లప్పుడూ విషయవాసన లనెడి వలలో పడియుందురు. వాంఛించిన

విషయము లభింపనప్పుడు వీరు కోశములోపల బంధింపబడియుండెడి పట్టు పురుగువలెకూర్చుని యుండి వ్యర్థమైన ఆశలతో-మనస్సునందు రకరకములగు గాలిమేడలను కట్టుచుందురు, మరియు వాసనా తృప్తికానప్పుడు ఆవాసనయే ద్వేషరూపమును దాల్చును. సారాంశమేమన, ఇట్టి వారికి కామము మరియు క్రోధాదులను మించి జీవితమునందు మరేకర్తవ్యమూ వుండనేవుండదు. ఓ అర్జునా! పోలీసుఠాణాయందలి పారాయిచ్చువాడు రాత్రింబవళ్ళు గస్తీ తిరుగుచూవుండి రాత్రిలంతు మేల్కొని యుండి కాపలాకాయుచూ రాత్రిం-బవళ్ళయందెన్నడును విశ్రాంతిగా నిశ్చింతతో కూర్చొనుటయనునెట్టిదో ఎప్పుడును ఎరుగకుంగా వుండురీతిని యీ ఆసురీప్రజలుకూడా కామవాసనవలన ఒకమారు పైనుంచి క్రిందికి పడగొట్టబడినప్పుడు వారు క్రోధమనెడిగుట్టపై వచ్చిపడెదరు. అంతట రాగ-ద్వేషాది విషయములపట్ల వారికి గలుగు ప్రేమ జగత్తునందంతటను పట్టజాలనంత మిక్కుటముగ వృద్ధి పొందును. ఆపైన వారు మానసిక ఆరాటమువలన అనేకవిధములగు విషయవాసనలనుగురించి యోచింతురు, కాని, ఆవిషయములను ప్రత్యక్షముగ భోగించుటకై ద్రవ్యము కావలెనుగదా? ఇందువల్ల విషయోపభోగములకై కావలసినటువంటి ధనమును సంపాదించుటకుగాను ఆసురీప్రజలు సంసారమున అనేకవిధములగు ఉపద్రవములు మరియు ఉత్పాతములు చేయసాగుదురు. వారు ఒకానొకనిని మోసగించి అతని ప్రాణములు గైకొందురు. ఒకానొకని సర్వస్వమును దోచుకొందురు. మరియు ఒకానొకనికి అపకారము చేయుటకై అనేకములగు యంత్ర - తంత్రము లను పన్నుదురు. అడవిలో వేటాడుటకై వెళ్ళునప్పుడు వేటగాండ్రు తమతో వలలు, ఉచ్చులు, కుక్కలు, వాద్యములు, వెదురుకంచీలు మరియు పక్షులను పట్టుకొనెడి పొడుగాటి వెదురుగడలు మొదలగు సామానుల నన్నింటిని తీసికొనుపోవు రీతిని యీ ఆసురీ ప్రజలుకూడా యితరులను బంధించుటకై తమవెంట యీ విధమగు ఉపకరణములను వెంటనిడుకొని బయలుదేరు

దురు. కిరాతుడు తనపొట్ట నింపుకొనుటకై అనేక విధములగు భయంకర పాపకర్మల నొనర్చురీతిని వీరుకూడా అన్యప్రాణులకు కీడుకలుగజేసి ధన మును సంపాదింతురు; యీ రీతిని లభించిన ధనముచే వారికి ఎంతో ఎక్కువ ఆనందము కలుగును.

ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్।
ఇద మస్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్॥ ౧౩

ఆసురీ పురుషుడు యిటుల యనును— "నేను అనేకమంది యొక్క సంపదను నాచేత జిక్కించు కొంటిని. కావున నేను ధన్యుడనగుదునా, కాదా ?" ఈ రీతిని అతడు ఆత్మ-శ్లాఘాక్షేత్రమున ప్రవేశించిన కొలదిని అతని మన స్సు ఆత్మ-శ్లాఘామార్గమున యింకనూ ఎక్కువగ వృద్ధి పొందసాగును. అంతట అత డిటుల చెప్పసాగును — "ఇక, 'నా వలలో చిక్కుకొనువా రెవరో, ఎవరిసంపద నాకు లభించునో' చూడవలసి యున్నది. ఇప్పటివరకు నాకు లభించిన దంతయూ నాదే అయిపోయినది. ఇక యీ మూలధనమును ఆధార మొనర్చుకొని యీ చరాచర మంతయూ నాకు లభించునట్టి ఉపాయమేదైన ఆలోచింపవలెను. ఈ నీతి ననుసరించి నేను విశ్వమున గల సంపదకంతకూ ప్రభువునై పోదును. ఇక నా దృష్టిలో పడిన దానిని దేనినీ నా చేజిక్కించుకొనకుండా వుండను."

అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ॥ ౧౪

"నే నిప్పటివరకు చంపివేసిన వైరులసంఖ్య అత్యల్పము. ఇక నే నింతకంటె ఎక్కువమంది వైరులను చంపెదను. అప్పుడీ ప్రపంచమునం దంతటను నా కీర్తి రాజ్యమే వుండును. అంతటు, నా ఆజ్ఞయందుండి నా పనిచేయు మనుష్యులను విడచి మిగిలినవారి నందరినీ నేను చంపివైతును. ఈ చరాచరములకు ప్రభువని లోకులచే చెప్పబడువాడను నేనే. ఈ సుఖ

భోగరూపియగు పృథివికి చక్రవర్తియగు రాజును నేనే, సుఖము అన్నింటికి ఆగారముకూడ నేనే. నా ముందు యింద్రుడుకూడా అల్పుడే. నేను మనస్సు, వాక్కు మరియు శరీరముతో ఏపనిచేయుటకు ఉద్యమింతునో ఆ పని నెరవేరకుండుట ఎన్నడైన సంభవించగలదా? నా యందుతప్ప మరెవరియందు ఆజ్ఞాపించెడి శక్తియున్నది? నాతో పనిగలుగ నంతవరకు కాలుడుకూడా తన బలమును గురించి అభిమానించ వచ్చును. సుఖ - రాశి ఏదైన వున్నచో అది నేనే.

ఆఢ్యో ఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః ౧౫॥

« కుబేరు డత్యధిక సంపన్నుడన్న మాట వాస్తవమే. అయినపటికిని అతడు ఎన్నడును నాతో సాటి కాజాలడు. నావద్దనున్నంత సంపద స్వయముగ లక్ష్మీపతివద్దకూడ లేదు. నా కులమహత్త్వము మరియు నా బంధు-కోటియొక్క విస్తారమును గురించి యోచించుచో ప్రజాపతియగు బ్రహ్మ కూడ నాముందు తుచ్ఛుడుగనే తేలును; ఇందువలననే ఈశ్వరాదినామముల మహత్త్వమును వర్ణించువారందరూ వ్యర్థులు. వారిలో ఎవరి యందును నాతో సమానమగు యోగ్యతలేదు. ప్రస్తుతము జారణ, మారణాది ఘాతుక మంత్ర-తంత్రములు లోపించి పోయినవి గాన వాటిని నేను ఉద్ధరించి జీవులకు పీడను కలిగించెడి యజ్ఞ-యాగాదుల నొనర్తును. నన్ను ప్రశంసించుచూ పాటలు పాడి, నృత్యముచేసి నాకు మనోరంజకము కలిగించినవారు ఏదిఅడిగిన, దానినే నేనిత్తును. నేను అనేకవిధములగు మాదక, ఖాద్య, పేయపదార్థములను గైకొందును, మరియు స్త్రీలతో గాఢాలింగమునందు మగ్నుడనై త్రిలోక అందును ఆనందపూర్వకముగ విలాస మొనర్తును » ఓ అర్జునా, యిట్టివారు నుడివెడి యీవిధమగు మాటల నెంతవరకని చెప్పను. ఆసురీ వృత్తులనెడి వలలో తగుల్కొనియున్న యీపిశాచములు తమ మనస్సునందు గొప్ప గొప్ప ఆశలను కలిగియుండి కల్పితమైన గగన - కుసుమములయొక్క సుగంధము నాఘ్రాణించ గోరుదురు.

అనేక చిత్త విభ్రాన్తా మోహజాల సమావృతాః ।
ప్రసక్తాః కామ భోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥ ౧౬

"జ్వరవేగమువలన రోగి వ్యర్థముగా అతిగా వాగుతూవుండు రీతిని వీరుకూడా సంకల్ప - వికల్పములనెడి తరంగములలోపడి ఏదో ఒకటి వాగుతూ వుందురు. ఇట్టి వారిపై అజ్ఞానమనెడి అత్యధికమగు రూపము పడియుండును. మరియు వీరు ఆశయనెడి సుడిగాలిలో వాసనలనెడి ఆకాశమున ముక్కలుముగ ప్రదక్షిణము లొనర్చుచూ వుందురు. ఆషాఢమాసమున నంజలి మేఘములకు లెక్కలేకుండురీతిని, సముద్రతరంగము లెన్నడును ఖండింపబడనిరీతిని యీ ఆసురీ పురుషులుకూడా తమ మనస్సునందు అసంఖ్యాకములగు కామవాసనలనెడి కోటలను నిర్మించుకొనుచూ వుందురు. అంతట వీరిలో కామవాసనలనెడి అనేక లతాసమూహములు నిర్మితమగును. మరియు ముళ్ళపైన పడి కమలదళములు క్షత - విక్షతలను పొందురీతి లేదా ఓ అర్జునా, రాతిపైన కొట్టబడి కుండబద్దలుకొట్టబడురీతిని యీ జీవులుకూడా కామవాసనలనెడి సుడిలోబడి ఛిన్నా-భిన్నులై పోదురు ఇట్టి స్థితిలో రాత్రి అధికమగుచున్న కొలదిని అంధకారముకూడా వృద్ధిపొందుచునే వుండురీతిని యీ అసురుల అంతఃకరణమునందు మోహముకూడా వృద్ధిపొందుచునే వుండును. వారిలో మోహము వృద్ధిపొందుచున్న కొలదిని విషయములపట్ల వారికిగల అనురాగముకూడా వృద్ధిపొందుచునే వుండును. మరియు యీరీతిని విషయముల పట్ల అనురాగముగల చోటునందు పాతకములుకూడా తమంతతామే వచ్చి ఏకత్రితమగును. మరియు పాతకములు బలముగలవియై, అవి అత్యధికమైనప్పుడు మనుష్యునకు యీ జీవమునందే నరక - వాసము అనుభవము కాసాగును. కావున ఓ అర్జునా, దుష్టవాసనలను లాలన పాలనమునర్చి వాటిని వృద్ధిపొందించు అసురీపురుషులు అంతమందు పోయి నివసించెడి ప్రదేశమునందు, ఖడ్గముల

వలె పదునుగల ఆకులుగల చెట్లున్నూ, చండ్రి (చెట్టు) నిప్పుల పర్వతములు వుండును. సలసల కాగుచున్న నూనె సముద్రములు వుండును. ఇట్టి ఆసురీ ప్రజలా భయంకర నరకలోకమునకు పోయి నివసింతురు. అచ్చట ఎల్లప్పుడు యాతనాపరంపరలు వుండును. యముడు వీరికి ప్రతిరోజూ నూతనములగు శిక్షలను విధించుచుండును. కాని, ఇట్టి నరకమునం దతిముఖ్యభాగమున జన్మించు లోకులుకూడా, ఓ అర్జునా, తమ భ్రాంతి పూర్ణావస్థలో యజ్ఞ - యాగాదుల నొనర్చుచున్నవారై కనపింతురు. వాస్తవముగ చూచినచో ఓ అర్జునా, యజ్ఞయాగాది విధి - విధానములన్నియూ జరుగవలసినరీతిని జరుగుచునేవుండును, కాని యీ ఆసురీప్రజలు నాటకములవలె కవిత్వములు చేసి, ఆ విధి - విధాన ములను కూడా నాశన మొనర్తురు

ఆత్మ సంభావితా స్తబ్ధా ధన మాన మదాన్వితాః
యజన్తే నామ యజ్ఞైస్తే దంభేనాఽవిధిపూర్వకమ్॥ ౧౭

"ఒకానొక వేశ్య ఒక మిండగాని ఆశ్రయమునందుండి వ్యర్థముగనే తనుతాను సౌభాగ్యవతిగా తలంచి సంతోషించురీతిని, యీ ఆసురీ ప్రజలు కూడా స్వయముగనే తమకు గొప్పతనమును ఆరోపించుకొని అభిమానముచే విచిత్రవిధముగా ఆనందింతురు. పోతపోసిన యినుప స్తంభమువలె, లేదా ఆకాశములో నిలచిన పర్వతమువలె వారెన్నడును క్రిందికి వంగుట యన నెట్టిదో యెరుగనే యెరుగరు. వారి సౌజన్యము వారికెంత శ్రేష్ఠమైనదిగా కాన్పించుననిన, వారు జగత్తునంతనూ తృణముకంటెకూడ అధికతుచ్ఛముగ తలంతురు. ఇంతేగాక, ఓ అర్జునా, వారెన్నడును పొరబాటుగానైన ఉచితానుచితములను విచారించనంత అధికముగ వారిని ధనలోభము ఆవరించి యుండును. మరియు, యీ విధమగు ప్రవృత్తి బలవత్తరముగా నున్నవారు యజ్ఞముల నేల చేయసాగిరి! కాని, యీ అసురీపిశాచులు ఫలానా పని చేసిరి, ఫలానా పని చేయుదురు - అని చెప్పుటకు ఒక

నియమమే వుండదు. అందువలన వారప్పుడప్పుడు మూర్ఖత్వముచే యజ్ఞములు చేయవలెనని కూడా ఆలోచింతురు. కాని వీరియజ్ఞము లందు యజ్ఞకుండమూ వుండదు. మంటపమూ వుండదు. వేదికకూడ వుండదు వారికి యజ్ఞోపయుక్త సాధనములుకూడ అక్కరలేదు. మరియు శాస్త్రోక్త విధి విధానము అనిన వారెల్లప్పుడు విరోధించుచుందురు. వీరి చెవులయందు దెబ్బటనైన దేవతలు లేదా బ్రాహ్మణులనెడి పేరు వినిపించు టనుకూడా సహింపలేరు. ఇట్టి స్థితిలో, వీరు చేసెడి యజ్ఞములకు దేవతలూ బ్రాహ్మణులూ ఎచ్చటినుంచి రాగలరు ? అయినప్పటికి మరణించిన మూడ మొక్క శరీరములో చిట్టునింపి దానిని ఆవు ముందునిలబెట్టి తెలివిగలవారు పాలుపితుకు చందమున, యీ ఆసురీపురుషులుకూడా లోకులను ఆహ్వానించి బలవంతముగ తమ యజ్ఞములకు పిలుచుకొని వత్తురు. మరియు వారినుండి కానుకలను గైకొని వారికి వ్యర్థమైన ఖర్చును కలుగజేయుదురు. ఈ రీతిని యీ ఆసురీప్రజలు అప్పుడప్పుడు తమ లోభిత్వమువలన హోమముల నొనర్చి అందనేక జీవులను సర్వనాశన మొనర్చుదురు.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥

“ఈఆసురీ ప్రజలు తమయందు మేళతాళములనుంచుకొని నడచుదురు. మరియు వ్యర్థముగనే నలువైపులను మేము దీక్షగైకొంటిమి అని చాటుకొనుచూ తిరుగుదురు. ఆసమయమున యీదుష్టులకు తమ గొప్పదనమును గురించిన అభిమానము శిఖరము నారోహించును. అహంకారమునకు కాటుక పెట్టుట వలన దాని నలుపు యింకనూ అధికమగురీతిని వారిమూర్ఖత్వ మింకనూ ఘనీభవించును. వారి ఔద్ధత్యము శిఖరముపై కెక్కును. అహంకారము ద్విగుణీకృతమగును. అవివేకముకూడా యిదేరీతిని వృద్ధిపొందును. ఆపిమ్మట ఎవరిపేరుమా మిగిలియుండ నివ్వకుండుటకాయన్నటుల వారి

జలిష్ఠతకు నూతన బలము ప్రాప్తించును. ఈరీతిని అహంకారము మరియు బలముల సంయోగమైనప్పుడు వారి అభిమాన సముద్రము హద్దుమీరి బయటకు పోవును. ఈ విధముగా గర్వము వృద్ధిపొంద సాగినప్పుడు 'కామము' కూడ మిక్కిలి ప్రబలమగును. అందుచే క్రోధాగ్ని పెక్కుమారుగ భగ్గున మండును. ఆ పిదప, మండు వెండాకాలములో నెయ్యి లేదా నూనె భాండాగారమునకు దారుణమైన అగ్నిప్రమాదము సంభవించి, అందుపై తీవ్రముగ గాలి వీచుచున్నచో ఏ రీతిని వుండునో, అదేవిధముగ యీ ఆసురీప్రజల బలము అత్యధికముగ వృద్ధిపొంది, వారి అహంకారము, కామము మరియు క్రోధములతో కూడి యున్నప్పుడు వారిక తమ యిష్టము వచ్చిన రీతిని హింసాకార్యము లొనర్చుటలో ఏల వెనుక - ముందు లాలోచింతురు? ఓ అర్జునా, ఇట్టి యజ్ఞకర్తలగు ఆసురీ ప్రజలు ప్రప్రథమమున జారణ, మారణాది ప్రయోగములు సిద్ధించుటకై స్వయముగ తమ రక్తమాంసములను కూడ వ్యయమొనర్ప నారంభింతురు. అంతేగాదు, వారు ప్రాణములతోనున్న శరీరమును దగ్ధ మొనర్తురు, మరియు యిట్టి కృత్యమువలన యీ శరీరమున వసించెడి 'నా' ఆత్మ తత్త్వమునకు వారు మిక్కుటమగు తాపమును కలిగింతురు. మరియు, యీ జారణ మారణముల నొనర్చెడి అభిచారకులు ఎవరెవరిని పీడింతురో, వారి అందరియందును నేనే చైతన్యరూపమున వుండును. అందువలన వారు చేసెడి దురంతములవలన కలుగు కష్టము నాకే కలుగును. ఇక దైవ యోగముచే వారి అభిచారములనుండి తప్పించుకొనినవారు వారిదుష్టమగు నిందయనెడి రాళ్ళవర్షముచే వికలులగుదురు. (అనగా యీరీతిని తప్పించుకొనిన వారిని వారు నిందించి కష్టములను కలుగజేతురు.) సతి, పతివ్రత, సాధువు, మహాత్ముడు, దాత, యాజ్ఞికుడు, లోకోత్తరతాపసి, సన్యాసి భక్తుడు మొదలగు వారు నాకు పరమప్రియులు; వీరి ఆచరణము వలననే శ్రౌత, స్మార్తాది క్రియానుష్ఠానము అన్నియూ పవిత్రములగును. కాని, యీ ఆసురీ

ప్రజలు ఆ సజ్జనులపైన కూడ ద్వేషమనెడి భయంకర విషయములతో నిండి యున్న తీక్ష్ణమగు దుర్బుద్ధి అనెడి తీవ్రమైన బాణపుదెబ్బలను కొట్టెదరు.

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు ॥19॥

"ఈ రీతిని నన్ను సర్వవిధముల విరోధించువారికి నేనెట్టి వ్యవస్థను కలిగింతునో చెప్పెదను వినుము. వారు మానవశరీరమనెడి హారమును ఆశ్రయించి ప్రపంచమంతటితోను నిర్లక్ష్యముగ వ్యవహరింతురు; ఇందువలన వారికి నేను కలిగించెడి గతి యెట్టిదనిన 'క్లేశములనెడి గ్రామమందలి చెత్తయంతయూ పోగుగా పోయబడునట్టిన్నీ, 'సంసారమనెడి నగరమందలి మురికి అంతయూ ప్రవహించి పోవునట్టిన్నీ ప్రదేశమగు తామసయోనులందు ఈమూర్ఖులను నేను వుంచుదును. అటుపిమ్మట ఆహారమునకుగాను గడ్డికూడా మొలవనట్టి పాడుపడిన అడవిలో వారిని నేను పులి లేదా వృశ్చికయోనియందు జన్మింపజేతును. ఆ సమయమున వారు ఆకలిచే వ్యాకులముచెంది స్వయముగ తమ పిల్ల మాంసమును తామే పిలుచుకొని తినుచుందురు. మరియు మాటిమాటికి చచ్చి మరల అదే జన్మ మెత్తుచుందురు. లేదా నేను వారికి సర్పజన్మనిత్తును యిందువలన విషతీవ్రతచే తమ శరీరమునే దగ్ధమొనర్చుకొనుచూ ఒక బిలమునందు బంధింపబడి యుందురు. లోపలికి తీసుకొనిన శ్వాసను బయటకు విడుచుటకు ఎంతసమయము పట్టునో అంతసమయముకూడ నేనీదుష్టులకు విశ్రమించుటకు అవకాశమివ్వను. మరియు కోట్లకొలది కల్పముల సంఖ్యకూడా అత్యల్పముగనే తోచునంత అత్యధికకాలము వరకు వారికి నేనీక్లేశములనుండి విముక్తిని కలగనివ్వను. ఈ ఆసురీ ప్రజలు అంతమునకు పోవలసిన స్థితిలో వారికిది మొదటి మజిలీయే. ఈ మజిలీదాటిన తరువాత యింకెంతటి భయంకరమగు దుఃఖముల నెటుల వారనుభవించ గలరు?

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాం గతిమ్ ॥౨౦॥

"ఈ అసురీసంపద వలన వీరింతటి భీషణ దుఃఖములతో నిండియున్న స్థితికి పోదురు. కాని యిటుపిమ్మట వ్యాఘ్రాది తామసయోనులలోకూడా వీరికి విశ్రమించుటకు లభించెడి అల్పమగు శరీరాధారము గూడ నేను త్రెంచి వేయుదును. అంతటవారు శుద్ధతమోరూపులగుదురు మరియు అప్పుడు వారు పొందెడి ఘోరతమోరూపము కాటుకను వారు తాకినప్పటికిని ఆకాటుక యింకనూ నల్లనగునంత ఘోరముగ నుండును. ఇక రాగా రాగా పాపమునకు కూడ వారనిన అసహ్యము కలుగునంత అసహ్యకరులగుదురు. నరకమునకు కూడ వారనిన భయము కలుగును. స్వయముగ కష్టములుకూడా వారి కష్టములను చూచి మూర్ఛచెందును. మహాభయముకూడా వారనిన గజగజ వణక సాగును. తాపముకూడా వారిచే తపింపబడును. మలముకూడా వారి సంబంధమువలన మాలిన్యమగును. పాపముకూడా వారిని ఏవగించుకొనును. అమంగళముకూడా వారిని అమంగళరూపులుగా తలంచును మరియు స్పృశ్యాస్పృశ్యతలుకూడా వారి సంసర్గ దోషమునకై భయపడును. ఈరీతిని యీసంసారమందలి అధములైన వారందరినికూడా మించిపోయి యీ అధములగు అసురీప్రజలు భిన్న భిన్న తామస యోనులలోకి పోయి అంతమందు, ఓ అర్జునా, ప్రత్యక్ష తమస్సుగా నైపోదురు. ఈ మూర్ఖులు కూడా ఎట్టి నరకములను సాధించిరి! దీనిని గురించి వర్ణించుటలో వాణి కూడా వికలయగును, మనస్సు భయపడి వెనుకకు మరలును. ఇట్టి భయంకర మగు అధోగతిని కలిగించెడి ఆ దుష్ట అసురీసంపదను తమవద్ద ఏ కారణముచే నేకత్రిత మొనర్చుకొని యుందురో బోధపడదు! కావున, ఓ అర్జునా, నీవెన్నడును యీ అసురీసంపద యుండెడి దారిని పట్టకుము. ఎచ్చట అసురీ సంపదకు ప్రభువులు వుందురో, ఎచ్చట పైన చెప్పబడిన దంభాది షడ్దోషములు కాన్పించునో, అచ్చట తన పాదమునైన పెట్టకుండుట ఉచితము.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేతత్త్రయంత్యజేత్ ॥ ౨౧

“ఎప్పుడు కామము, క్రోధము, మరియు లోభము యనెడి త్రికూటము ప్రబలముగా నుండునో, అప్పుడు అమంగళ మనెడి చేష్టయే పండునని యెఱుంగవలెను. ఓ అర్జునా! దుఃఖములన్నియు కలిసి యీ మార్గములను నూఱింటిని నిర్మించినవి; వీటిలో ఏ మార్గమునపోయిన ఏ దుఃఖమును పొందవలెనో ఆ దుఃఖదర్శక మగునట్లు యీ మార్గములు నిర్మింపబడినవి. లేదా పాపులను నరక భోగమున పడవైచుట కొరకే పాతకములను చేర్చి ఒక పెద్ద సభ స్థాపింపబడినదనికూడా చెప్పవచ్చును. అంతఃకరణమునం దీమూడున్నూ సంచరించునంతవరకు రౌరవనరక ఖ్యాతి పురాణములలోనే ఎచ్చటనున్న దచ్చటనే పడియుండును. కాని, యీ త్రిదోషములూ సంచరించుటతోడనే ఆపాయములన్నియూ వచ్చి మానవునందు ప్రవేశించును; మరియు కష్టములు లెక్కపెట్టునవారికైన అతి సహజముగ లభించును. ప్రపంచమున ‘హాని’ యని లోకులచే చెప్పబడు నట్టిది వాస్తవమునకు హాని కాదు. వాస్తవముగ హానియొక్క రూపము ఈమూడే. ఓ వీరుడవగు అర్జునా! నీతో యింకా అధికముగా ఏమి చెప్పుదు. నరకము లన్నింటను అధిక భయంకరమగు నరకమునకు ప్రవేశద్వారము యీ త్రిదోషములనెడి త్రిశూలమే. ఈ త్రిశూలము అనగా మూడు ముఖములు గల ప్రవేశద్వారమున ఏ దేహివుడు నిలబడునో, వాడే నరక నగరముయొక్క ప్రధానసభాగృహమున ప్రవేశించును. కావున ఓ అర్జునా, నేను నీకు మాటిమాటికి కామక్రోధలోభము లను నట్టి దుష్టత్రికూటములను సర్వావస్థలయందును పూర్తిగా పరిత్యజించవలెనని, మరియు వాటిని దూరముగ పారద్రోలవలెనని చెప్పుచున్నాను.

ఏతై ర్విముక్తః కౌంతేయ! తమోద్వారై స్త్రిభి ర్నరః।
ఆచర త్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్ ॥౨౨॥

జీవునకు కేవలము ఆతడీ దోషమందలి నంతను తననుండి పూర్తిగా దూరమొనర్చినప్పుడే ధర్మాది చతుర్విధ పురుషార్థములను గురించిన మాట అను కోట పలుకనగును. ఈ త్రిదోషములు జీవునియందు జాగరితమై యున్నంతవరకు నిజమగు కళ్యాణమును కలుగజేయు మాటలను వేటినీ కర్ణములు వినలేవు. ఈ మాటలను శ్రీకృష్ణభగవాను లాసమయమున చెప్పిరి. ఆ పిమ్మట వా రిటులచెప్ప నారంభించిరి "ఆత్మపట్ల ప్రేమయూ, ఆత్మ-నాశమగునవే భయమున్నూ మనస్సున గలవా డీమార్గమునం దెన్నడును పోరాదు. ఆతడు నిరంతరము జాగరూకుడై వుండవలెను. ఎవడైన తనపొట్టకు రాతినికట్టుకొని కేవలమూ తనభుజబలమువలననే సముద్రమునుయీదిదాటగోరినటుల, లేదా జీవించియుండవలెనను తలంపుతో కాలకూటవిషమును త్రాగురీతిని 'కామ, క్రోధ లోభములనుతనవెంటనుంచుకొని తన కార్యసిద్ధి నొనర్చుకొనగోరువారుకూడా తిరివలె నేయగుదురు. కావున వీటిని నామరూపములుకూడా లేకుండానాశమొనర్చవలెను. ఈమూడుకడియములుగల శృంఖలము తెగిపోయినప్పుడే జీవుడు ఆత్మహిత మార్గమున సుఖపూర్వకముగ పోగలుగును. కఫపిత్త వాతములనెడి త్రిదోషములచేవిడువబడిన శరీరము, లేదా చాడీలుదొంగతనముమరియువ్యభిచారములనెడి త్రికూటములనూ అలిప్తముగానుండెడి నగరము లేదా ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములనెడి త్రితాపములచే విడుదలపొందిన అంతఃకరణమూ సుఖముగా వుండురీతిని, యీ త్రి - కామాదికములనుండి ముక్తుడైన జీవుడు కూడా యీ సంసారమున సుఖించును. మరియు ఆతడు మోక్షమార్గమునబట్టి సాధు-మహాత్ముల సాంగత్యప్రాప్తిని పొందును. అటుపిమ్మట సత్సంగప్రభావము వలననూ మరియు శుద్ధశాస్త్రసహాయమువల్లనూ ఆతడు జనన-మరణములనెడి రాత్ర్యా మరియు నిర్జనమగు అరణ్యమునుండి బయటకు వచ్చును.

అంత నా సమయమున సద్గురుకృపచే నాతనికి నిరంతరము ఆత్మానందమేయనెడి రాజ్యముగల నగరము లభించును. అప్పుడు నాతడు ప్రియజను లందరికీ 'పరాకాష్ఠ'యను ఆత్మస్థితియనెడి తల్లిని కలిసికొనును. మరియు ఆమెను కలిసికొనుట తోడనే సంసారముయొక్క మ్రోగుచున్న నగారా ఆగిపోవును. ఈ రీతిని ఏ పురుషుడు కామ క్రోధలోభములను తననుండి పూర్తిగా దూర మొనర్చి స్వతంత్రుడై నిలచియుండునో, అతడే పైచెప్పిన లాభమునకు ప్రభువగును.

యశ్శాస్త్ర విధిముత్సృజ్య వర్తతే కామకారతః ।
న ప సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్ ॥ ౨౩

కాని, ఏ ఆత్మఘాతకుడగు పురుషుడీ విషయములపట్ల శ్రద్ధలేనివాడై కామాది దోషములలో స్వయముగనే తన శిరస్సును వుంచునో, ఎవడు ఆ మహాభాగులగు వేదములను తిరస్కరించునో, ఎవడు విధి నిషేధములను గురించిన ధ్యాసయే లేకుండా వుండునో, ఎవనికి ఆత్మ-ప్రాప్తిపట్ల అనురాగము వుండదో, ఎవడు కేవలము యింద్రియముల లాలన-పాలనమునే చేయుచు వుండునో, ఎవడెల్లప్పుడును కామాదుల వలలో పడియుండునో, మరియు అందరిపట్లను సమానదృష్టి గలిగియుండి అందరియొక్క హితాహితములను స్పష్టముగ చూపెడి దీపమువంటి వారి మాటలను తిరస్కరించునో, ఎవడు స్వేచ్ఛాచారిత్వమనే అడివియందు అంధుడై ప్రవేశించునో, ఆట్టివానికి ముక్తియనెడి నదియందలి జలము ఎన్నడును రుచి చూచుటకు కూడా లభించదు. శ్రమనంతయూ దూరమొనర్చెడి యీ ముక్తియనెడి నది అతనికి స్వప్నమున కూడ గోచరించదు. ఇట్టి మనుష్యుని నోటినుండి పారలౌకిక కల్యాణ మనెడి మాటయే వెలువడరాదు. అంతేగాదు అతనికి లౌకిక భోగములు కూడ భోగించుటకై లభింపవు. ఒకానొక బ్రాహ్మణుడు మత్స్యలోభమున పడి దానిని పట్టుకొన

తలెనను ఆశతో నీటియందు మునిగినప్పటికిని అతని చేతికి ఏమియూ చిక్కక పోగా, పైగా అతని ప్రాణములు పోవు పరిస్థితి సంభవించిన రీతిని, ఎవడు కేవలము విషయోపభోగములు పొందవలె ననెడి లోభముచే పర - లోక సాధన ప్రయత్న మొనర్చునో, అట్టివానికి ప్రయత్నములు చేయుచుండగనే ఆకస్మికముగ మృత్యువు వచ్చి ఎత్తుకొని పోయి, ఆతనిని మరొక్కవైపుకు తీసికొని పోవును. ఆతనికి పరలోకమున స్వర్గభోగములూ లభించుటలేదు,మరియు యీ లోకమున విషయ భోగములూ లభించవు. ఇట్టిస్థితిలో ఆతనికి మోక్షమెటుల లభించును ! కావుననే, విషయ-భోగ ప్రాప్తికై ప్రయత్నించు పురుషుడు ఐహిక - విషయముల వలననూ మరియు స్వర్గ - సుఖముల వలనను కూడ వంచింపబడును; అతడెన్నడును ఉద్ధరింపబడడు.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥ ౨౪ ॥

“ కావున ఓ అర్జునా ! ఎవరి మనస్సున స్వయముగ తమపైననే దయ గలుగునో, మరియు ఎవరి అంతఃకరణమునందు మనము ఆత్మ - హితసాధన మొనర్చుకొనవలెనను భావము కలుగునో, అట్టివారు వేదవచనములను కూడ అనాదరించరాదు. తనభర్త యిచ్ఛానుసారము ఆచరించు పతివ్రతా స్త్రీ తనంత తానే తనకు కల్యాణము కలుగునటుల చేసికొను రీతిని, లేదా శిష్యుడు తన గురు - వచనములను చక్కగా ధ్యానమందుంచుకొని ఆత్మ - స్వరూపమున స్థానమును పొందురీతిని, లేదా చీకటిగా వున్నచోట దాచియుంచిన తన ధనమును తిరిగి తీసికొనవలెనని తలంచువాడు వెలుగును కలుగజేయుటకై తత్పరత్వముతోడ దీపమును తీసికొని వచ్చి ఎదుట నుంచుకొను రీతిని, చతుర్విధ పురుషార్థములను పొందగోరువారు

ప్రతిష్ఠకు లోను శిరసొగ్గి వందనమొనర్చి తీరవలెను. శాస్త్రములలో నిషిద్ధమని చెప్పబడిన దానిని, అది అతిపెద్దదగు రాజ్యముతో సమానమైనదైనప్పటికిని తృణమువలె తుచ్ఛముగ తలంచి దూరముగ పారవేయవలెను. మరియు శాస్త్రములు గ్రాహ్యమని చెప్పినట్టిది విషసమానమైనప్పటికిని దానిని ఘాతుకముగ తలంచరాదు. ఓ వీరుడవగు అర్జునా, వేదములు మరియు శాస్త్రములయందిట్టిదగు అచలనిష్ఠ యున్నప్పు డెన్నడైన అనిష్ట ప్రాప్తికలుగగలదా? ఈ శ్రుతులను విడచి నేటివరకు యీ సంసారమునకు తల్లిని పోలిన 'అకల్యాణమునుండి విముక్తియు, కల్యాణసాధన మొనర్చి దానిని వృద్ధిలోనికి తెచ్చునట్టిదియూ నగు' మాత లభించనేరదు. కావున, బ్రహ్మ - స్వరూపము వద్దకు చేర్చెడి యీ శ్రుతిమాతను ఎన్నడును ఎవడును విడనాడరాదు; మరియు ఓ అర్జునా! నీవు విశేషముగ వీటిని సేవించుము. ఏలనన, ఓ అర్జునా ! నీవీ సంసారమున ధర్మనిష్ఠాబలముచేతను, మరియు సచ్ఛాస్త్ర సహాయము వలనను నీ జీవితమును సార్థకముగను, ధన్యముగను చేసికొనుటకొరకే జన్మించియున్నావు. మరియు నీకు 'ధర్మానుజుడు' అను పేరుకాదా, 'ధర్మమునకు తమ్ముడ' నెడి అర్థము నిచ్చునట్టిది తనంత తానే లభించియున్నది. కావున నీవు దీనికి విరుద్ధముగ ఆచరించరాదు. కార్యాకార్య విచారణ మొనర్చునప్పుడు శాస్త్రాధారము వలననే నిర్ణయమొనర్చవలెను. శాస్త్రములలో చేయరానివిగా చెప్పబడిన వాటిని పూర్తిగా విడచివేయవలెను. ఆపైన నిశ్చితమైన వాస్తవిక కర్తవ్యమును నీ సంపూర్ణమైన శక్తి మరియు శుద్ధహృదయముతో చక్కగా పాటించి దానిని సిద్ధింపజేసికొనవలెను. జగత్తున కంతకును ఆధారమొసంగెడి ప్రామాణికతయనెడి మొహారు నేడు నీ చేతియందే వున్నది. మరియు చతురుడవగు అర్జునా! లోకసంగ్రహ మొనర్చెడి శక్తి కూడ నీయందు నిస్సందేహముగ నున్నది.”

ఈ రీతిని ఆసురీసంపదయొక్క లక్షణములు చెప్పి, వాటిచే సూచింపబడెడి నిర్ణయమును కూడా భగవానులు అర్జునునకు నిరూపణమొనర్చి చెప్పిరి.

ఇటుపిమ్మట పాండుకుమారుడగు అర్జునుడు అంతఃకరణముయొక్క సద్భావ
మును గురించి భగవానుని ప్రశ్నించెదరు; అదికూడా మీరు చైతన్యకర్ణములచే
వినుడు. సంజయుడు వ్యాసమహర్షి కృపచే ధృతరాష్ట్రునకు వినిపించియుండెను.
అదే విధముగ నేనుకూడా శ్రీ నివృత్తినాథుల కృపచే ఆ ప్రసంగమును మీకు
విన్నవింతును. మహాత్ములగు మీరు నాపై మీ కృపాకటాక్షమును వర్షింప
జేయుచో, మహారాజా! నేనుకూడా మీవలె గొప్పవాడ నగుదును. కావున
మీరు నాయెడ శ్రద్ధయుంచుడని మాత్రము మిమ్ము నేను ప్రార్థింతును.
కేవలము మీ యొక్క కృపాప్రసాదము నాకు కావలయును. అంతట జ్ఞానదేవుడ
నగు నేను నిజముగా ధన్యుడను, మరియు సమర్థుడను అయ్యెదను.

---

# తెలుగు జ్ఞానేశ్వరి

## పదునేడవ అధ్యాయము

---

తమ యోగ-సమాధి ద్వారా యీ నామ-రూపాత్మక జగత్తుయొక్క బంధన తెగిపోయి దీని నుండి విముక్తిని లభింపజేయునట్టి గురురాజరూపియగు శ్రీ గణేశునకు నేను నమస్కరింతును. త్రిపురాసురులు శంభుని ముట్టడించి కోటలో బంధించి యుంచినప్పుడు రామ-నామస్మరణము వల్లనే శంభువా బంధనమునుండి ముక్తుడయ్యెను. ఇదేవిధమున త్రిగుణ జాలమునందు చిక్కుకొనియున్న ఆత్మకూడా యీ జీవదశయనెడి బంధనమున పడియున్నది. మరియు అది మీస్మరణమువలన మాత్రమే ముక్తినిపొందగలదు. కావున శంకరునితో మిమ్ముపోల్చి చెప్పుచో మీ మహత్త్వమే గొప్పదని నిర్ణయమగును, కాని దానితోపాటు ముముక్షువుల నీమాయాసాగరమునుండిదాటించుటకై నావ వలె కావలసిన సౌలభ్యముకూడా మీయందేవున్నది. మిమ్మును గురించిన జ్ఞాన మేమాత్రములేనివారికి మాత్రము మీరు వక్రతుండులవలె తోచెదరు. కాని జ్ఞానసంపన్నులైనవారికి మీరెల్లప్పుడు సరళముగనే కాన్పింతురు. మీ దివ్యదృష్టి చూచుట కతికోమలము మరియు సూక్ష్మముగ కాన్పించును. కాని ఆ దృష్టినే తెరచి మరియు మూయుట మూలమున మీరు సహజముగనే ఉత్పత్తి-ప్రళయములను కలిగించుచున్నారు. మీ ప్రవృత్తిరూపియగు కర్ణములను కదలించినప్పుడు వెలువడెడి మదము మరియు రసముచేనిండియున్న సుగంధవాయువు వలన తూనీగలువచ్చి మీ గండస్థలముపై కూర్చునును. ఆ సమయమున నీలకమలములచే మీరు పూజింపబడిరా యన్నటుల వుండును. కాని అటుపిమ్మట మీరు నివృత్తిరూపియగు రెండవ కర్ణ

మును కదల్చినప్పుడు, ఆ పూజ అంతమొందినటులున్నా, మీరు ప్రకటిత
మగు సుందరమైన ఆత్మ స్వరూపమునం దున్నటులను కాన్పింతురు. లావణ్యా
వతియైన మాయయొక్క లలిత నృత్యమువలన కలిగెడి నామరూపాత్మక జగ
ద్భ్రాంతియగు మోహాభాస కూడా మీ తాండవ-కౌశలముయొక్క ప్రదర్శ
నమే. కేవల మింతియేకాదు, అత్యధిక ఆశ్చర్యకరమగు విషయమేమన, ఓగురు
రాజవగు గణేశా! మీతో సహోదరత్వము సంబంధము కలిగిన ప్రతి ఒక్కడూ
వెంటనే సహోదరత్వమునకై పరకీయుడగును-ఆ సహోదర భావముతో
వ్యవహరించుటనుండి వంచితుడై పోవును. మీరు బంధనముల నన్నింటిని నాశ
మొనర్చుట తోడనే, మనుష్యుని మనస్సునందు 'మీరు జగద్బం
ధుల' నెడి భావము జనించును మరియు భక్తుని ఆనందవృత్తి మీలో లీనము
కాసాగును. అంతట ఓ మహారాజా! పరభావము పూర్తిగా నశించుటగాక
అతనికి తన శరీరాభాసము కూడా లేకుండా పోవును. కాని, మిమ్ము
తమకు భిన్నులుగ తలంచి, మిమ్ము తమ దృష్టికి ముందు వుంచుకొని,
మిమ్ము పొందుటకై నానావిధములగు యోగాదిమార్గములందు పరుగు లిడు
వారికి మీరు చాలా వెనుక నుందురు. ఒక ప్రదేశమున కూర్చొని మిమ్ము
తమ మనస్సున ధ్యానించువారి గ్రామమునందు కూడా మీరు వుండరు.
కాని, ఆత్మైక్య భావముతో ధ్యానమునుకూడ మరచిపోవునట్టి వారిపట్ల
మీరు అవశ్యము పరమప్రేమ గలవారై యుందురు.మీరు స్వయం సిద్ధులని
తెలియక, కేవలము తమ సర్వజ్ఞత్వమును గురించిన అభిమానము కలిగి
యుండెడి వారి మాటలను మీ రెటునుంచి వినగలరు ? ఏలనన, మిక్కుటమగు
వక్తృత్వముగల వేదముల వైపే మీరు చెవి నిడరు. ఆరంభమునుంచియున్నూ
మరియు మీ జన్మరాశివలననూ మీ పేరు 'మౌనము'గా ఏర్పడినది.అట్టిస్థితిలో
మిమ్ము స్తుతించవలెనని ఏల సాహసించవలెను ? దృష్టికి కాన్పించునట్టి
అంతయూ మాయాజనితమేయైనప్పు డిక మీభక్తి యొనర్చుటకు సాధనమేమిటి
మిగిలియుండును ? సేవ్యునిగా మిమ్ము భావించి మీ సేవ చేయుటయనెడి

భావము మనస్సున జనించును, కాని మీకూ - నాకూ భేదము కలదని అంగీకరించుట 'ఆత్మద్రోహము' వంటిదేగదా! కావున మిమ్ము గురించి ఏమియూ చెప్పకుండుటే ఉచితమగును. భేదభావ మంతయూ పూర్తిగా త్యజించివేసినప్పుడు మాత్రమే మీ అద్వితీయ స్వరూప ప్రాప్తి లభించును. ఓ ఆరాధ్యమూర్తి వగు గురురాజ మహారాజా! మీ యీ రహస్యము నా కిప్పుడు చక్కగా బోధపడినది. కావుననే, ఏవిధమగు భేదభావము వుంచకుండా అన్నరసముతో పాటు లవణము కూడా స్వీకరించబడు రీతిని మీరు కూడా నా నమస్కారమును స్వీకరింపుడు - ఇంతకు మించి నే నేమి చెప్పను! శాలిగ్రామును సముద్రమున బడవేసి, తిరిగి దానిని పైకి తీసినప్పుడు అది నీటితో నిండియున్నదై యుండురీతిని, లేదా దీపము యొక్క సంసర్గమువలన ప్రత్తివత్తికూడా దీపరూపమును పొందు విధమున ఓ శ్రీనివృత్తిమహారాజా నేనుకూడా మీకు నమస్కరించి పరిపూర్ణుడనైతిని. కావున యికమించి గీతార్థమును స్పష్టీకరించుటలో ప్రవృత్తుడ నగుదును. పదునారవ అధ్యాయాంతమున కడపటి శ్లోకమునందు భగవానుడు నిస్సందేహముగ యీ నిర్ణయ మొనర్చెను. "ఓ అర్జునా! నీవు ఏది చేయదగిన పని, ఏది చేయరానిపని - యను నిర్ణయమొనర్చవలసిన ఆవశ్యకత కలిగినప్పుడు ఒక్క శాస్త్రములను మాత్రమే ప్రమాణముగ నంగీకరింపుము," ఈ మాట వినగానే అర్జునుని మనస్సునందీ ఆలోచన పొడజూపెను-"శాస్త్ర సహాయము లేకుండా కర్మనుగురించిన ప్రశ్నను నిర్ణయించనేరాదా? తక్షకుని పడగపైన పాదమునిడి దాని మస్తకము నందలిమణి నెటుల పొందగును? సింహపు ముక్కునందలి వెంట్రుకల నెటుల పెరుక వగును! ఇవి రెండూ సంపాదించిన పిమ్మటగదా, ఆతక్షకుని మణిని సింహపువెండ్రుకలందుగ్రుచ్చి దానిని మాలగా మెడయందు ధరించుట! కాని, యీ అసంభవకార్యము నెవ్వడును చేయజాలక పోవుచో అతడు తన కంఠమును నగ్నముగనే వుంచుకో-వలెనా? ఇదేవిధమున, మతామతములనెడి గందరగోళమును వ్యాపింపజేసెడి

భిన్న భిన్న శాస్త్రముల నెవడు మాటగట్టగలడు? అట్టిస్థితిలో వాటి ఏకవాక్యత యనెడి ఫలమెటుల పొందనగును? ఒకవేళ భిన్న భిన్న శాస్త్రముల నొకచోటున జేర్చి ఏదైన నిర్ణయము చేయుటకు వలను పడునని అంగీకరించినప్పటికిని దాని నాచరించుటకు యథేష్టమగు సమయ మెవరికి వుండును? శాస్త్రము, అర్థము, దేశము మరియు కాలము – వీటన్నింటికి ఒకే కార్యమున ఉచిత యోగము కలుగగలుగునట్టి ఉపాయమెటుల చేయనగును? ఇందువలననే యీ శాస్త్రోక్త ప్రకరణ సాధనము ప్రాయః కఠినమే. ఇక అజ్ఞానస్థితియందే దానితోపాటు మోక్షమును సంపాదించవలెననెడి కోరిక గలవారికి తెరచియుంచబడిన మార్గమేదిగలదు? ఈ సంశయమే అర్జునునకు కలిగినది. దీనిని గురించియే యీ పదునేడవ అధ్యాయమున వివరింపబడినది. ఎవడు సమస్త విషయముల యెడను విరక్తుడో, ఎవడు సమస్త కళాపారంగతుడో ఎవడు స్వయముగ కృష్ణునకుగాను కూడ అర్జున రూపమున నున్న రెండవ కృష్ణుడో (ఆకర్షించువాడు), శౌర్యమునకు ఆశ్రయమో, చంద్ర వంశమునకు అలంకారమో, సుఖోపభోగము లెవనికి కేవలము ఆటవంటివో, ఎవడు బుద్ధికి వల్లభుడున్నూ మరియు ఆత్మవిద్యకు పుట్టినిల్లో, ఎవడు శ్రీ కృష్ణునివల్ల ఎల్లప్పుడు వుండెడి సాంగత్యము వంటివాడో, అట్టి అర్జును డీ రీతిని చెప్పసాగెను.

అర్జున ఉవాచ –

> యే శాస్త్ర విధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః
> తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వ మాహో రజస్తమః ॥1॥

"ఓ తమాలపత్రశ్యాముడవగు భగవానుడా! మీరు యింద్రియ గోచరులగు ప్రత్యక్ష బ్రహ్మలే యైనప్పటికిని మీరు చెప్పినట్టిది నాకు సంశయాత్మకముగనే తోచుచున్నది. జీవునకు మోక్షసాధనము శాస్త్రములు తప్ప మరేదియు లేదని ఏల చెప్పిరి? శాస్త్రాభ్యాస మొనర్చుటకు ఉపయుక్తమగు స్థలమ్ము, కాలమ్ము, మరియు అధ్యాపకులు కావలసియున్నారు, కాని,

కూడా మహత్త్వము నిచ్చెడి సమర్థశాలియూ, ఇట్టి సామర్థ్యము తనయం
దంతటను నిండియున్న వాడునూ నగు ఆ భగవాను లీరీతిని చెప్పసాగిరి.

శ్రీ భగవానువాచ:—

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥ 2

భగవాను లిటుల చెప్పిరి—"ఓ పార్థా! నీమనో ప్రవృత్తిని నే నెరుగు
దును. నీకు శాస్త్రాధ్యయనము నెడి బంధమతికష్టదాయకముగ కాన్పించుచున్నది.
అంతేగాదా ? కేవలము శ్రద్ధవలననే పరమపదమును హస్తగత మొనర్చు
కొనవలెనని నీవు మనమున తలంచుచున్నావు. కాని ఓ వెర్రివాడా, యిది
అంత సులభమైనది కాదు. ఓ అర్జునా ! కేవలము 'నాకు శ్రద్ధ యున్నది'
అని చెప్పి దానిపైననే ఆధారపడి యుండదగదు. బ్రాహ్మణు డెవరైన
అంత్యజాని సంబంధ బాంధవ్యములు మరియు మైత్రిని ఏర్పరచుకొనుచో
అతడుకూడా అంత్యజుడగుటలేదా ? కల్లుముంతలో గంగాజలమును నింపుక
వచ్చినప్పటికిని, దానినెన్నడును స్వీకరించరాదు. నేను చెప్పినసంగతి
సరియైనదో, కాదో - నీవే స్వయముగా యోచించుకొనుము. వాస్తవమునకు
చందనము చల్లగావుండు ననుమాట సత్యమే, కాని, యిట్టిస్థితిలో
ఆ చందనమునకు అగ్ని సంయోగము కలిగినప్పుడు దానిని చేతి
బుచ్చుకొన్నచో చెయ్యి కాలకుండావుండునా? ఓ అర్జునా ! వన్నెతక్కువ
బంగారములో బహుకొద్దిగా మంచిబంగారమును కలిపి దానిని మంచి
బంగారు మనుటవలన నష్టము రాదా ? సరిగా యిదేవిధమున, శ్రద్ధకూడా
వాస్తవమునకు మంచిదే; కాని అట్టి శ్రద్ధగల ప్రాణులు స్వాభావికముగనే
అనాది మాయచే జనించు త్రిగుణములచే నిర్మితమైనవారుగానే యగుదురు.
ఈ త్రిగుణములలో రెండు గుణములు అణగియుండును. ఒకగుణము బలవత్తర
ముగా నుండును. అప్పుడు ప్రాణులయొక్క వృత్తులు ఆ గుణానురోధముచే
మలుపబడును. ఆవిధమగు వృత్తిని అనుసరించి మనస్సు వుండును. మనస్సు

అనుసరించియే కర్మాచరణము నుండును. మరియు అంతట మరణానంతరము ప్రాణులు తాము చేసిన ఆ కర్మలననుసరించియే నూతన శరీరమును ధరింతురు. బీజము నాటబడినప్పుడు దానినుండి వృక్షమేర్పడును. అపిమ్మట ఆ వృక్షము నశించినప్పుడు ఆవృక్షము బీజములం దిమిడి యుండును. ఈ క్రమము కోట్లకొలది కల్పములవరకు నడచుచుండును. అయినను జాతి ఎన్నడును నశించదు. కనుక యుగయుగముల అసంఖ్యాజన్మములు జరుగుచూ వుండును. అయినప్పటికిని ప్రాణుల నంటిపట్టియుండెడి త్రిగుణాత్మకము మాత్ర మెన్నడును వదలిపోదు. కావుననే ప్రాణులకు గలిగియుండెడి శ్రద్ధకూడా యీ త్రిగుణముల ననుసరించియే యుండు నన్న విషయమును నీవు జ్ఞప్తి యందుంచుకొనుము. ఎన్నడైన ఏ విధముగనైన శుద్ధసత్త్వగుణము వృద్ధియగుచో ఆ శ్రద్ధవలన కొంత జ్ఞానము లభించును. కాని ఆ ఒక్క సత్త్వగుణము వెంటపట్టి మిగిలిన రెండు గుణములుకూడా అచ్చట వుండియే యుండును. సత్త్వగుణముయొక్క సహాయమువలన శ్రద్ధ మోక్షఫలమువైపు ప్రవృత్తి గలదగును; కాని యిట్టిసమయమున రజోగుణము మరియు తమోగుణము లేల మెదలకుండా కూర్చొని యుండును? అంతట సత్త్వము యొక్క బలమును త్రెంచివైచినప్పుడు రజోగుణము స్వతంత్రరూపమున వృద్ధిపొందజాలును. అప్పుడా శ్రద్ధయే కర్మలకు వెట్టిచాకిరిచేయు ఖరీదు పెట్టికొనినదాసిగ నగును. ఆ పిమ్మట, తమోగుణము ప్రబలమైనప్పుడు ఆ శ్రద్ధయే తనంత తాను విషయోపభోగములలో చిక్కుపడిపోవును.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః ౩

ఓ సువిజ్ఞుడవగు అర్జునా! సారాంశమేమన, యీ జీవసంఘమునకు సత్త్వరజస్తమస్సులకు అలిప్తముగా నుండెడి నిర్దోషమగు శ్రద్ధ ఎన్నడును లభించనేరదు. శ్రద్ధ స్వాభావికముగ తత్త్వమే, కాని అది త్రిగుణ

ములచే ఆవరింపబడి యుండును. అందుచే దానికి రాజస, తామస, సాత్త్వికము లనెడి మూడు భేదములు వుండును. ఇదే మాదిరిగా, జీవిత తత్త్వము జలమే. కాని ఆ జలమే విషమునందు మారకము, మిర్చిలో తీక్ష్ణము, మరియు చెఱుకునందు మధురముగ నుండును. ఇదేవిధముగ ఎవడు సదా దట్టమగు తమస్సుతో కూడియున్నవాడై మాటిమాటికి జన్మించుచూ మరణించుచూ నుండునో, అట్టివాని శ్రద్ధకూడా తమోరూపమే యగును. అంతట, కాటుకయందును పిరాయందును ఏ విధమగు భేదమును తేలేనిరీతిని యీ శ్రద్ధకూడా తామసియే యగును. మరియు దాని యందు తమస్సుకుమినహా మరేదియూ నుండదు సరిగా యిదేవిధమున రజోగుణముతో కూడియున్న జీవుని శ్రద్ధ రాజసము, మరియు సాత్త్విక జీవునిశ్రద్ధ ఎల్లప్పుడు పూర్తియైన సాత్త్వికముగనే వుండునని ఎరుంగవలెను. ఈ రీతిని యీ జగత్తంతయూ కేవలము శ్రద్ధతోనే నిండియున్నది. కాని యీ త్రిగుణములయొక్క సామర్థ్యముచే శ్రద్ధపైన త్రివిధముద్రలు పడునసెడి సంగతిని నీవు జాగ్రతగా గమనించుము. పుష్పమునుచూచి దానిసహాయముచే వృక్షము గుర్తింపబడురీతిని, లేదా, మాటలవలన మనస్సునందలి ఆలోచన బోధపడురీతిని, లేదా యీజన్మయందలి భోగమునుచూచి పూర్వ జన్మలందలి కర్మలు తెలపికొనబడురీతిని ఏచిహ్నములవల్ల శ్రద్ధయొక్క త్రివిధ రూపములను గుర్తించనగునో, ఆచిహ్నములను నీకిప్పుడు చెప్పెదను వినుము.

యజంతే సాత్త్వికా దేవాన్, యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః॥ ౪

సాత్త్వికశ్రద్ధతో కూడియున్న శరీరనిర్మాణము గలవారు సాధారణముగ స్వర్గసుఖముల-యెడ అనురాగము గలిగియుందురు. అతడు అన్నివిద్యలను నేర్చుకొనును. యజ్ఞాదివిధానముల నొనర్చును. మరియు కేవల మింతియే కాదు. దేవలోకమునందు దానికి ప్రవేశముకూడ జరుగును. మరియు ఓఅర్జునా!

రాజసశ్రద్ధతో కూడిన శరీరము గలవారు రాక్షసులను పిశాచములను భజింతురు. ఇక తామసికశ్రద్ధతో కూడియున్నవారు ఏ లక్షణములను కలిగియుందురో కూడా చెప్పెదను వినుము. ఏ జీవులు కేవలము పాపకార్యరతులై యుందురో, ఎవరు అతి కఠోరులుగను నిష్ఠురులుగను వుందురో, ఎవరు హత్యల నొనర్చి సంధ్యాసమయమున ఏవగింపు కలిగించెడి శ్మశానమునందు భూత - ప్రేత మండలులను పూజింతురో, అట్టి జీవులు తమోగుణముయొక్క అవయవములందలి రసముతో కలిసి తయారు చేయబడినవారని తెలిసికొనుము. ఇట్టివారు తామసిక శ్రద్ధను ప్రధానముగ కలవారు. ఈ రీతిని యీ త్రివిధ చిహ్నములతో కూడియుండెడి యీ త్రివిధములగు శ్రద్ధలూ ప్రపంచమున కాన్పించును. ఇదంతయూ చెప్పుటలో నాకుగల అభిప్రాయము - ఓ సువిజ్ఞుడవగు అర్జునా! నీవుకూడా నీమనస్సున సాత్త్వికశ్రద్ధనే కాపాడుకొని యుంచుకొని మిగిలిన రెండు ఘాతుక శ్రద్ధలను నీలోనుండి పారద్రోలుమని చెప్పుటయేయైయున్నది. ఓ అర్జునా! యీ సాత్త్వికశ్రద్ధచే సంరక్షింపబడెడి వానికి కైవల్య భయముకూడా ఏమాత్రముకాన్పించదు. అట్టిస్థితిలో ఆతడు శాస్త్రసూత్రములు చదువలేదనిగాని, శాస్త్రపారంగతుడు కాలేదనిగాని, మనోనిగ్రహాంతప్రాప్తి కలుగలేదనిగాని, భయపడవలసిన పని యేమి గలదు? శ్రుతి - స్మృతుల అర్థములయొక్క మూర్తిత్వమును దాల్చిన అవతారములై ప్రపంచమునకు సదాచరణమనెడి ఉదాహరణమును చూపెడి గొప్పవారల ఆచరణ విధానమును చూచి, ఆ ప్రకారము అనుకరించువారు కూడా సాత్త్వికశ్రద్ధ గలవారుగనే యుందురు, అందుచే శాస్త్రాదుల అధ్యయనము వలన ప్రాప్తించు ఫలము వారికి అనాయాసముగనే లభించును. ఒకడు అత్యధిక ప్రయత్నమువలన దీపమును వెలిగించును, అప్పుడు మరొకడు సులభముగనే ఆ దీపసహాయమువలన తన దీపమునుకూడా వెలిగించుకొనును. అంతమాత్రమున ఆ రెండవ దీపమును వెలిగించుకొను వానికి ప్రకాశము లభించుటలేదా! లేక తక్కువలభించునా? ఒక మనుష్యుడత్యధిక

ధనమును వెచ్చించి అతిపెద్దదీ దృఢమైనదీ యగు భవనము తయారు చేయును. అయినప్పటికిని, ఆ యింటియందు నివసించు తదితరులు ఆయింటి యందలి సౌఖ్యమును అనుభవించుట లేదా? చెరువు తనను త్రవ్విన వానిదప్పికను మాత్రమే తీర్చి తదితరుల దప్పికను తీర్చకుండా వుండునా? పోనీ, వంట చేసిన వారికే లభించి ఆ యింటియందుగల తదితరులకు భోజనము లభించక యుండునా? ఓ అర్జునా! యీ విషయము నింకను వివరించ దలచలేను. కేవలము గౌతమఋషి ఒక్కడే అత్యధిక ప్రయత్నము నొనర్చి గంగా (గోదావరి) నదిని యీ భూమికి తెచ్చెను. అయినప్పటికి, అవని కేవలమొక్క గౌతమ ఋషికి మాత్రము పవిత్ర గంగవలె సిద్ధించి తదితరు లందరకూ సాధారణమైన వాగువలె సిద్ధించిన ఉదాహరణ మెచ్చటనైన గలదా? కావున ఈ బుద్ధ్యనుసారము శాస్త్రమార్గము నెరింగిన మానవుని శ్రద్ధా పూర్వకముగ అనుకరించువాడు మూర్ఖుడైనప్పటికిని కూడా తరించును.

అశాస్త్ర విహితం ఘోరం తప్యంతే యే తపోజనాః ।
దంభాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః ॥౫॥

"ఎవరు శాస్త్రముల నామము నుచ్చరించుటకై తమ గొంతును శుభ్రమొనర్చుకొనవలె ననెడి ఆలోచనను కూడా చేయరో, కేవల మింతియే కాదు, ఎవరికి శాస్త్ర సంపర్కముకూడా సహింపరానిదో, ఎవరు గొప్పవారి ఆచార - వ్యవహారములను చూచి కోతులవలె వారి అనుకరణము నొనర్చి చప్పట్లు కొట్టుచూ పరిహాసము నొనర్చుచూ, తమ గొప్పతనమును గురించిన అభిమానము మరియు సంపద యనెడి మదముతో కూడియున్నవారై ధర్మ - భ్రష్టకార్యముల నాచరించుచుందురో, ఎవరు తమయొక్క యితరులయొక్క అంగములందు రంపముచే గాయ మొనర్చి రక్తమాంసములతో యజ్ఞపాత్రను పూర్తిగా నింపియుందురో, మరియు వాటిని యజ్ఞకుండమున పోసి, కొందరు విశిష్టమగు దేవతలనోట నుంతురో.

ఎవరు తమ కోర్కెలను తీర్చుకొనుటకై బాలకులను బలి యిత్తురో, ఎవరు క్షుద్రదేవతల వరములు సంపాదించుటకై పట్టుదలతో వారము-వారము దినముల ఉపవాసము చేయుదురో, ఓ సువిజ్ఞుడవగు అర్జునా! అట్టివారు తమోగుణ క్షేత్రమునందు ఆత్మద్వేషము మరియు పరపీడయనెడి విత్తులు నాటుదురు. అటుపైని ఆబీజములే మొలకెత్తించి తమజాతికి చెందిన పంటను తయారుచేయును. అంతట నట్టి మనుష్యునకు బుద్ధిశక్తి చేతులారా నావనా శ్రయించక సహజముగ పరుల మనుష్యులపై క్రియ చేయుచుండును. లేదా వైద్యులను కూడా విరోధించి వైద్యములనుకూడా కాలదన్నెడి రోగి తనకుతానే ఎక్కువ బాధకలిగించుకొనురీతిని వుండును. లేదా ఆశ్రయమిచ్చెడి మానవునితో కలహించి స్వయముగా తనకన్నులను తానే పొడుచుకొను అంధునివలె తన యింటియందు సంభవించెడి మూర్ఖుడే, శాస్త్రములను తిరస్కరించి మోహముచే భయంకరారణ్యములందు తిరుగుచుండు తిరుగువారికికూడా సంభవించును. ఇట్టి వారు విషయవాసనలు తమ్ము ఏపనిచేయుమని చెప్పిన ఆపనినే చేయుదురు. క్రోధము ఎవరిని కొట్టుమని చెప్పిన వారినే కొట్టెదరు. ఇంతేగాదు, అందరి హృదయములందున్న, నశించెడి 'నన్ను' కూడావారు దుఃఖములనెడి రాళ్ళక్రింద అణచియుంతురు.

కర్శయంతః శరీరస్థం భూతగ్రామమచేతసః ।
మాంచైవాంతః శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥ ౬

ఇట్టివారు తమయొక్క మరియు యితరులయొక్క శరీరములకునూ కలిగించు దుఃఖములన్నింటి బాధయూ ఆత్మనగు నాకే కలుగును. వాస్తవమునకు చూచినచో, వాక్కుతోకూడా యిట్టి పాపులసంపర్కము కానివ్వరాదు. ఇటుల చెప్పుటలోగల అభిప్రాయము "ఇట్టి పాపులకు అందరును దూరముగా వుండవలె" నని నొక్కిచెప్పుటయే. అందువలన వారిని ఉల్లేఖించకుండుటకు వీలులేదు. చూడు, మృతశరీరమును చేతులతో ఎత్తి యింటి

బయటకు తీసికొని వెళ్ళవలసి వచ్చుచున్నది. అంత్యజునకు మార్గమును చెప్పుటకై ఆతనితో ఒకటి - రెండు మాటలు పలుకవలసి వచ్చుచున్నది మరియు కేవల మంతియే కాదు. మలమును చేతులతో శుభ్రమొనర్చుకొనవలసి యున్నది. కాని యీ పనుల నన్నింటిని చేసి మనము పరిశుద్ధ మగుదుమని ఆశింతుము; ఇందువలననే, యీపైన చెప్పుకొనినపనులలో అమంగళమును తలంచని విధమున అనురీవృత్తిని దూరమొనర్చు తలంపుతోనే యిచ్చట దానినిగురించి వర్ణింపవలసివచ్చినది. కావున ఓ అర్జునా, నీకెప్పుడైన యిట్టి అసురుల దర్శనమగుచో నీవు నన్నుస్మరించుము. ఏలనన, యీ పాపము మరెప్రాయశ్చిత్తము వల్లనూ తొలగిపోదు. ఇదేవిధమున, నేనిక వర్ణింపనున్న సాత్త్వికశ్రద్ధనుసర్వవిధములా సంగ్రహించి సంరక్షించవలెను. ఇందుకొరకై ఎవరివలన సత్త్వగుణమునకు బలము చేకూరునో అట్టివారి సాంగత్యమే చేయవలెను. మరియు సత్త్వగుణమును వృద్ధి చేయునట్టి ఆహారమునే స్వీకరించవలెను. సాధారణముగ స్వభావము వృద్ధిపొందుటకు కావలసిన బలమును యిచ్చునట్టి సాధనము అన్నముతప్ప మరేదియూ లేదు. ఓ వీరుడవగు అర్జునా! స్పృహలో నున్నవాడు మద్యమును త్రాగినప్పుడు వెంటనే స్పృహ తప్పిపోవుచున్నాడు. దీనిని మనము ప్రత్యక్షముగ చూచుచున్నాము. ఎల్లప్పుడు అన్నరసమును గైకొనువానికి సహజముగనే వాతము మరియు కఫాది వికారములు కలుగును. జ్వరమువచ్చిన మనుష్యుడు పాలు 'మొదలగునవి త్రాగుచో ఎన్నడైన జ్వరము తగ్గునా? అమృతమును త్రాగిన మానవుడు మృత్యుముఖము నుండి తప్పించుకొను రీతిని లేదా విషము అవయవము లన్నింటియందును ప్రవేశించి వాటిని విషవంత మొనర్చురీతిని, మన మేవిధమగు ఆహారముము గైకొందుమో, ఆదేవిధమగు దేహగతధాతురస మేర్పడును. మరియు ఆధాతు రసమును అనుసరించియే మానవుని మనోభావములపోషణ జరుగును. పాత్రను వెచ్చజేసినప్పుడు ఆ పాత్రలోగల నీరు కూడా వేడిగానగు రీతిగానే చిత్తవృత్తులపైన ధాతురససంస్కారము కలుగును. కావుననే సాత్త్విక ఆహారము

[illegible]కొన్నప్పుడు సత్త్వగుణము వృద్ధిపొందును. తదితర విధములగు ఆహారము భుజించినప్పుడు చిత్తవృత్తి రాజసము గలదిగా గాని, లేక తామసికమైనట్టిదిగా గాని యగును. కావున నీకిక సాత్త్విక ఆహార మెట్టిదో, రాజసిక తామసిక ఆహార లక్షణము లేవో చెప్పెదను, జాగ్రత్తగా వినుము.

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥ 7 ॥

[illegible] పెక్కులైనమైనప్పటికిని ఓ పీనడవగు అర్జునా! అవి మూడు విధములైనవిగా ఎట్లు యగునో చెప్పెదను వినుము. భుజించెడి వాని రుచి ననుసరించి అన్నము తయారగును. మరియు భుజించువాడు గుణములకు దాసుడై యుండును. కర్తయూ భోక్తయూ నగు జీవుడు ఈ త్రిగుణములవల్లను స్వాభావికముగానే త్రివిధములుగా నుండును. అందువల్లనే ఆతడు త్రివిధముగ ఆచరణము నొనర్చును. అందుచే ఆహారముకూడా త్రివిధములు గలదిగా నగును. సరిగా నిదే విధమున యజ్ఞము, తపస్సు, మరియు దానములు కూడా మూడు విధములుగా నుండును. ఇక నీకు అన్నిటికంటె ముందు ఆహారలక్షణములను చెప్పెదను వినుము. ఈ లక్షణములు అతి సుగమమైనట్లు చెప్పబడును.

ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః ।
రస్యా స్స్నిగ్ధాస్స్థిరాహృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః ॥ 8 ॥

"దైవయోగముచే భుజించువాని ప్రవృత్తి సత్త్వగుణముపై వున్నదైనచో, ఆతనికి మధుర పదార్థములకు సంబంధించిన రుచి వృద్ధియగును. ఏఖాద్య పదార్థములు మూలతః సురసవంతమును, మధురమును, రసపూర్ణమును, మరియు పక్వమైనదిగానుండునో, ఏది ఆకారమున వంకర టింకరగానూ,

వికారరూపముతోనూ వుండవో, చేతితో తాకినప్పుడు అతి కోమలముగ నుండునట్టిదియూ, మరియు నాలుకకు ఉత్తమము, మరియు రుచివంతముగ నుండునట్టిదియు, రసముతోనిండి యున్నట్టియూ మరియు తాకుటకు మృదువుగ నున్నదియూ, వేనియందలిద్రవభాగముతనస్థానమునందే అగ్నితాపముచే ఎండిపోయినదో, ఏపదార్థము ఆకారము మరియూ పరిమాణములో చూచుటకు అల్పమైనదిగా నున్నప్పటికిని అంతమున హితకరమైనదో, ఏది గురుముఖమునుండి వెలువడిన శబ్దములవలె అల్పమైనప్పటికిని అపారమగు తృప్తిని కలిగించునో, మరియు, తినునప్పుడు నోటికి వున్నంత మధురముగ లోపలకు పోయినపిమ్మట పొట్టకుకూడ అంతటి సుఖకరముగనే వుండునో, అట్టి ఖాద్యపదార్థములపట్ల సాత్వికమనుష్యులకు ఎక్కువప్రీతి వుండును. ఈ లక్షణములతో కూడియున్న అన్నమును సాత్వికముగా నెరుంగవలెను. ఇట్టి అన్నము నిరంతరము ఆయుస్సంరక్షణము నొనర్చును. ఈ విధమగు సాత్వికరసముతో కూడియున్న మేఘములు శరీరమున వర్షించినప్పుడు ఆయుష్యమనెడి దినదినాభి వృద్ధిగాంచును. ఓ సువిజ్ఞుడవగు అర్జునా, యీ విధమగు ఆహారము సత్వమును పోషించును. శరీర మానసిక బలములకీ ఆహారమే ఆధారమగును. ఈవిధమగు ఆహారమును గైకొన్నప్పుడు శరీరమున వ్యాధికి నెలవెక్కడవుండును? ఈవిధమగు సాత్వికాహారము మానవునకు లభించినప్పుడు శరీరారోగ్య భాగ్యోదయ మైనటుల తలంచవలెను. ఈవిధమగు ఆహారమువలన మనుష్యుడు తానూ సుఖమనుభవించును. ఇతరులనుకూడా సుఖవంతులనొనర్చును. ఈ విధమగు సాత్వికాహారము మానవశరీరమున ప్రవేశించినప్పుడు ఆఆహారము శరీరమునకున్నూ లోపలగల యింద్రియములకున్నూ కూడా ఎక్కువ ఉపకారము నొనర్చును; ఇక రజోగుణముగల మానవుల కెటువంటి ఆహారము ప్రీతికరముగా నుండునో చెప్పెదను వినుమా.

కట్వమ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః ।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోక భయప్రదాః ॥ ౯ ॥

"ఏది కాలకూట విషముకంటె ఎక్కువ చేదైన పదార్థమో, ఏది సున్నముకంటెకూడ ఎక్కువ విదాహకమో మరియు ఏది మిక్కుటమైన పులుపుగా గలదియో, పేడా (తీపితిను బండారము) ను తయారుచేయుటకు గాను పిండిలో నీరుపోయు రీతిని, అన్నరసముచు కలుపుటవలన ఏ పదార్థము ఉప్పుగల్లువలె తయారైనదై దానితోపాటు ఇంకనూ అనేక క్షారరసములు అంత అత్యధిక పరిమాణములో కలుపబడియున్నవో, అట్టి మిక్కుటమగు ఉప్పుగా గల పదార్థములు రజోగుణముగల పురుషులకు ప్రీతికరముగా వుండును. ఇట్టి వారు అతివేడిగా నుండు భోజనము రుచివంతముగా నుండునని చెప్పుచూ వుందురు. మరియు నిప్పువలె కాలిపోవుచూవున్న అతివేడిగా నుండెడి అన్నమును వారు తిందురు. రజోగుణముగల పురుషులు అతిప్రీతితో తినెడి అత్యుష్ణముగా మండు అన్నముపై నుండి బయల్వెడలు ఆవిరికొరకు దీపపు వత్తి నుంచుచో, ఆ వత్తికూడా మండిపోవునంత ఉష్ణముగా వుండును. శుష్కమైన ఆహారము పైకి చూచుటకు ఏవిధమైన గాయమును బయట కలిగించవు. కాని లోపలకు పోయి ఆ ఆహారము ఎంతగానో గుచ్చుకొనును. ఈ విధమైన అన్నము బూడిదవలె లోపలను బయటను ఆరిపోయి వుండును. ఇట్టివానికి నోట పెట్టుకొనగానే దంతములు కటకట లాడు నటుల వున్నట్టి అన్నమును తినుట పరమసంతోషముగా వుండును. అసలే ఘాటుగావున్న పదార్థము, అందుపై దానిలో ఆవాలు కూడా కలపినవి. ఇట్టి పదార్థమును తినుటచే నోటినుండి మరియు ముక్కునుండి నీరు కారసాగును. ఇంతేగాదు, దాని ఘాటువలన నిప్పునుకూడా ప్రక్కకు నెట్టివేయ గలిగిన తీక్ష్ణమైన పదార్థములు మరియు ఊరగాయ మొదలగునవి యిట్టి పురుషులకు ప్రాణములకంటె అధికప్రియమైనవిగా తోచును. ఈ రీతిని జిహ్వాచాపల్యము గలవాడు అన్నరూపమున తన పొట్టను మండు

చున్న నిప్పులతోనే నింపుచూ పురడును. ఈవిధమగు పదార్థములను తినుటవలన, శరీరమున కలిగెడి మంటలవలన, ఆతనికి నేలపైనగాని, శయ్య పైనగాని ఎచ్చటనూ శాంతిలభించదు. అంతేగాక మంచినీళ్ళచెంబు ఎన్నడును ఆతనినోటిని విడిచియుండదు. ఈపదార్థములన్నియు యీరీతిగా మన్నవగుట వలన ఆహారముగకావు, అటుల కాకపోగా, శరీరమునందుండెడి రోగమనెడి కాలసర్పమును మేల్కొలిపి దానిని ఉత్తేజిత మొనర్చుటకు సాధనములు గానే యగును. ఇట్టి అన్నములభించుటతోటనే వ్యాధులు ఒక దానితో మరొకటి పోటీలుపడి ఒక్కసారిగా పైకి వచ్చును. ఈ విధముగా యీ రాజసాహారము కేవలము దుఃఖమనెడి ఫలమునే జనింపజేయును. ఓ అర్జునా! యీ విధముగా నీకు రాజసికాహార లక్షణములు. మరియు వాటి పరిణామములనూ స్పష్టీకరించి చెప్పితిని. ఇక తామసపురుషుల కేవిధమగు ఆహారము ప్రీతికరము గా నుండునో చెప్పెదను వినుము. బహుశః నీ వది విని అసహ్యించుకొనవచ్చును.

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ ౧౦

"చల్దిది, పాచి కుళ్ళిపోయినది మరియు ఎంగిలిదియగు అన్నమును తిను నప్పుడు తమోగుణస్థుడగు ఆత్మఘాతుక మొనర్చుకొను పురుషుని మనస్సు నం దే మాత్రము రోత కలుగదు. గేదెలు ఎంగిలిది మరియు చల్దియన్నము మొదలగువానిని అతిప్రేమతో తినురీతిని తామస పురుషుడుకూడామధ్యాహ్న మప్పుడు వండినఅన్నము లేదా ఒకరోజుక్రితము వండిన అన్నమూ మరియు మిగిలిపోయిన చల్దిఅన్నమునూ ఆత్యానందముతో తినును. లేదా ఉడికిఉడకని అన్నము, లేదా కాలి బూడిదగాయైనది, లేదా రసము సరిగా పరిపాకము నొందనట్టిదియూ నగు అన్నము నాతడు తినును. చక్కగా పక్వమునుపొంది రసస్వాదము చక్కగామున్న అన్నము మాత్రమే భుజించు

టకు అర్హమైనది; కాని తామస పురుషులకు ఇట్టి అన్నము ఎన్నడును నచ్చదు. ఒకవేళ దైవయోగమువలన వారికట్టి రుచివంతమూ మరియు తాజాగా మున్నట్టి అన్నము లభించినప్పటికిని వారు దానిని తినక పెద్దపులివలె దాని నుండి దుర్గంధము వచ్చునంత వరకును అది చక్కగా కుళ్ళిపోవునంత వరకు ఒకప్రక్కన వొత్తిగించి వుంచుచుందురు. ఏలనన చాలా రోజులవరకు నిలువయుంచుట వలన కుళ్ళిపోయి రుచిలేకుండాపోయి ఎండి రసములేకుం డాపోయిన అన్నమునూ, లేదా క్రిముపురుగులు బిలబిల వచ్చుచూవున్నట్టి పదార్థముల నతడు చిన్నపిల్లలవలె ఒకదానిలో నొకటికలిపి బురదవలె చేసుకొని అప్పుడా యన్నము నాతడు తినును. మరియు అట్టిభోజనమును ఎంతో ఆనందముతోను తృప్తితోనూ ప్రీతితోడుతను ఆరగించును. కాని, యీ విధమగు అన్నమువలనకూడా ఆహారులకు తృప్తికలుగదు. ఇటు పిమ్మట ఆత డొనర్చు విచిత్రమును కూడా వినుము, శాస్త్రములలో నిషేధింపబడి, దుష్టమైన వస్తువులను తినవలెననెడి, పానమొనర్చవలెననెడి భయంకరమగు వాసనను ఆ తామసపురుషుడు పెంపొందించుకొనును. తామ సాహారము వొనర్చువానికి ఈ విధమగు ప్రవృత్తియే యుండును మరియు ఓ అర్జునా, యీవిధమగు ఆహారముయొక్క ఫలమును పొందుటకు అతనికి మరుక్షణమువరకు వేచియుండవలసిన అవశ్యకతయుండదు – దాని ఫలమాత నికి అప్పుడే లభించును, ఏలనన, ఆతనినోరు ఎప్పుడిట్టి అపవిత్రపేయమును, లేదా ఖాద్యపదార్థమును స్పర్శించునో అప్పుడే అతడు పాపవంతుడగును. అటుపిమ్మట, అతడు తినుటలో ఒక విధానమువుండదు. ఏదోరీతి పొట్టనింపు కొనుటయే అతనికి కావలసినది. ఇట్టిసమయము అతడుపొందెడి యాతనా నుభవము శిరశ్ఛేద మొనర్చునప్పుడు గాని, అగ్నిప్రవేశన మొనర్చునప్పుడుగాని ఏవిధమగు బాధగా వుండునో అతడుకూడ అట్టిబాధను పొందును. కాని అతడీ వేదనలనన్నింటిని ఓర్చుకొనుచుండును. కావున తామసాన్నముయొక్క పరిణామము తామసప్రవృత్తికి భిన్నముగానుండునని చెప్పవలను పడదు.” అటు

పిమ్మట శ్రీకృష్ణభగవానులు మరల నిట్లు చెప్పిరి– “ఆహారములవలెనే యజ్ఞములుకూడా త్రివిధములు. ఇక వాటినిగురించి కూడా చెప్పెదను. ఓ లోక విఖ్యాతిగల అర్జునా! యీత్రివిధ యజ్ఞములందును మొదటిదియగు సాత్త్విక యజ్ఞముయొక్క లక్షణములను చెప్పెదను వినుము.

> అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
> యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః ॥౧౧

పతివ్రతా స్త్రీయొక్క మనోధర్మము తన ప్రియభర్తను తప్ప మరే యితర పురుషుని గురించియైన్ను ఆమె అంతఃకరణమున ఏ విధమగు వాసనయూ జనించని విధమున వుండురీతిని, లేదా సముద్రమున కలసిపోయిన తరువాత మరల నది ముందుకై పునకు ప్రవహించని రీతిని, లేదా ఆత్మదర్శనమైనపిమ్మట వేదము లికముందు ఏమియూ చెప్పని రీతిని, ఏ పురుషుడు తన మనోవృత్తిని ఆత్మహితమునందు లగ్నమొనర్చియుండునో మరియు కర్మఫలములను గురించి తన మనస్సున కొంచెమైన అహంభావము లేకుండా వుండునో, మరియు ఎవడు శారీరకముగను మానసికముగను యజ్ఞకర్మల నొనర్చుటలో ‘చెట్టుమొదటకు వచ్చిన నీరు తిరిగి వెనుకకు మరలక కేవల మా వృక్షభాగములందే నిండియుండు రీతిని’ దృఢభావము గల్గినవాడై యుండునో, మరియు ఏ పురుషుడు ఏవిధమగు వాసనను తన మనస్సునం దుండనివ్వక ఫలేచ్ఛను విడచి, ఒక్క స్వధర్మ – సాధనము తప్ప తదితర వస్తువులు మరియూ విషయము లన్నింటిపట్లను విరక్తుడై యుండి ఎవడు యజ్ఞము నొనర్చునో, అట్టి యజ్ఞమే వాస్తవమునకు సర్వవిధముల ఉత్తమము. మరియు యథాసాంగముగలదీ యగును. కాని, అద్దముద్వారా కనులు స్వయముగా తమ రూపమునే చూచురీతిని, లేదా దీపపువెలుగునందు మనము మన అరచేతియం దుంచుకొనిన రత్నమును చూచురీతిని, లేదా సూర్యోదయమైన పిమ్మట మనకు మనము ఉద్దేశించిన మార్గము కనిపించ

శాస్త్రరీతిని, ఏకనిష్ఠతో కూడియున్న భావముతో వేదములు మరియు శాస్త్రములను చూచి యజ్ఞ మొనర్చుటకై కుండము, మండపము మరియు వేదికలు మొదలగునవన్నియూ ఏర్పరచి, యజ్ఞకర్మకు కావలసిన — సాధన సామగ్రిల నన్నింటిని స్వయముగా వేద - వక్తయగు బ్రహ్మదేవుడే వచ్చి ఏర్పరచెనా — యన్నట్టుల సమకూర్చి, మరియు శరీరమునందలి భిన్న భిన్న యవయవములందు యా అవయవములకు అనురూపముగు అలంకారాదులు ధరించునట్టిని పదార్థములన్నియు ఉపయుక్తములుగా సమయానుసారముగ అమర్చబడినప్పుడు చేయబడు యజ్ఞవిధానము యొక్క మహిమను నే నెంతయని వర్ణింపను! ఆ సమయమున ఆ యజ్ఞమును చూచినప్పుడు యజమాని 'రూపమున స్వయముగ యజ్ఞవిద్యయే సర్వవిధముల అలంకరించుకొని అవతరించినదా' యన్నట్టుల నుండును. ఈ రీతిని ఏ యజ్ఞము సమస్త అంగములతోను పరిపూర్ణమై యున్నదో, మరియు ఏది ఫలేచ్ఛ యను మాత్సర్యము నందున్న నామమాత్రమునకైన అంకురించ నట్టిదో, మరియు ఏ యజ్ఞము 'తులసి మొక్కకు నీళ్ళుపోసి దానినుండి కాయలు, పుష్పములు లేదా నీడ మొదలను వాటిని వేటినీ అపేక్షించనట్లు పెంచునట్టి నిష్కామభావముచే చేయబడునో, ఓ అర్జునా! వాస్తవమునకు ఆ యజ్ఞమునే సాత్త్వికముగా నెరుంగవలెను.

అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసం ॥ ౧౨

ఇక ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా, ఏ యజ్ఞ మీరీతిని యథాసాంగముగ చేయబడినప్పటికిని రాజుగారు మనయింటికివచ్చినచో మనకు అనేకవిధములగు ఉపయోగములుండును. లోకమున మనకు కీర్తి కూడా లభించును — మరియు శ్రౌత - క్రియలలో ఏవిధమగు న్యూనతయూ రాదు — అనెడి తలంపుతో శాస్త్రమునకు రాజును ఆహ్వానించునట్టిని, మరియు యీ విధమగు తలంపునే గలిగియున్నవాడై యజ్ఞము నొనర్చువాడు తనమనస్సున 'యీ యజ్ఞ

మువలన నాకు స్వర్గము లభించును. యజ్ఞదీక్షితుడ నగుటవలన ప్రజలలో నాకు కీర్తి వచ్చును. మరియు నాచే యజ్ఞము కూడ పోషింపబడును' అనెడి భావము గలిగి, అనగా, ఓ అర్జునా, ఏ యజ్ఞము కేవల మా యభిప్రాయముతో, ఫలవాసనతో మరియు ప్రపంచమున తనకు గొప్పతనమును కలుగ జేసికొను తలంపుతో చేయబడునో, ఆయజ్ఞమును రాజసముగా నెరుంగవలెను.

విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥13॥

"మరియు ఓ అర్జునా, పశు-పక్షుల వివాహములకు కామవాసన తప్ప మరేవిధమగు పౌరోహిత్యమూ అక్కరలేనిరీతిని తామస యజ్ఞమునకు గల ఒకే ఒకమూలకారణము పట్టుదలయే. ఓ అర్జునా! వాయువునకు వెడలినప్పటికిని మార్గము లభించకుండుట, లేదా మృత్యువునకు ముహూర్తము చూడవలసిన ఆవశ్యకత, లేదా నిషిద్ధ పదార్థమును చూచి మంటగా లేచిన అగ్ని భయముచే వెనుకకు తగ్గుటా-యివి ఎన్నడైన సంభవించుచో అప్పుడు మాత్రమే తామసపురుషుని వ్యవహారమునందు కూడా ఏ విఘ్నమైన అడ్డంకుఐన రావచ్చును. (అనగా తామస పురుషుడు తన వ్యవహారమున ఏవిఘ్నమైన అడ్డంకునూ చూచుటకు యిష్టపడడు.) ఓ అర్జునా, తామసపురుషుడు సంపూర్ణముగా స్వేచ్ఛాచారియై యుండును. అతనికి విధి - నిషేధముల లక్ష్యము వుండదు. మరియు మంత్రము మొదలగువానిని గురించిన బాధకూడా అతనికి వుండదు. అన్నమును చూడగానే యీగ ఎంతో త్వరగా వచ్చి దానిపైన వ్రాలి దానిని తినసాగునుగదా! తామసపురుషులకు కూడ యిట్లే యీగకు వలెనే విధి-నిషేధములను గురించిన యోచన వుండును (అనగా ఏమాత్రమును యోచన యుండదు.) బ్రాహ్మణులు దిక్కులుగా నుందురు. ఇట్టి స్థితిలో లోలుపత్వముతో దక్షిణకు ఆశించి అతని యజ్ఞమున ఏ బ్రాహ్మణుడ

వచ్చి ప్రవేశించును? అగ్ని తీవ్రముగ గాలిలోపడి బాగా భగభగమండు రీతిని అతడు కూడా తన అభిమానమువలన తన సర్వస్వమును వ్యర్థముగనే ఎగరగొట్ట నారంభించును. సంతానములేని, వాసనుంబ లేని గాలి యిటికిని వచ్చే - పోయే వారందరూ దోచుకొనసాగురీతిని ఏమాత్రము శ్రద్ధలేని యిట్టి లోభుల యింటికి కూడా అందరూ వచ్చి ఆతని ఆస్తిని దోచుకొన మొదలిడుదురు. ఈ లక్షణములుగల యజ్ఞము మిథ్యయూ మరియూ భ్రమతోకూడి యున్నట్టిదీ యగు యజ్ఞమగును ఇట్టి యజ్ఞమును తామస యజ్ఞమని యెఱుంగవలెను. "ఇటుల చెప్పి కొంతసేపాగి, తిరిగి లక్ష్మీపతి "యీరీతిని చెప్పసాగెను - ఓ అర్జునా! నదీ జల మెల్లప్పుడు ఒకేరూప మున నుండును. కాని అది భిన్నభిన్న ప్రదేశములందు ప్రవహించుటవలన ఒక్కొక్క చోట అది తన వెంట మురికిని ప్రవహించుకొనిపోవును, అందు వలన అచ్చట అది పూర్తిగా మురికిగా వుండును. మరియు ఒక్కొక్క చోట పూర్తిగా స్వచ్ఛముగ నుండును. సరిగా యిదేరీతిని, తపస్సు కూడా త్రిగుణముల యోగమువలన త్రివిధములుగా నుండును. ఒక విధమగు తపస్సు పాపకారణమగును. మరొకరకపు తపస్సు ఉద్ధరించును. ఓ సువిజ్ఞుడవగు అర్జునా! యీ తపస్సునందు త్రివిధభేదము లెటుల ఏర్పడునో తెలిసికొనుటకుముందు, నీవు తపస్సుయొక్క స్వరూపమును తెలిసికొనుము. ముందుగా దేనిని 'తపస్సు' అందురో వివరింతును; అటుపిమ్మట గుణసంయోగమువలన దానికి భిన్న భిన్న స్వరూపము లెటుల వచ్చునో చెప్పెదను. 'తపస్సు' వస్తుతః 'శారీరకము, మానసికము మరియూ శాబ్దికము' అని మూడు విధములు.

దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్ ।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ ౧౪

ఈ మూడు తపస్సులలోను మొదటిది శరీర తపస్సు. దాని స్వరూప మును వినుము. శ్రీ శంకరుడుగాని శ్రీహరిగాని యీ యిద్దరిలోను ఏ దేవుని

శట్ల భక్ష్యభోగములు వుండునో, ఆ దేవుని మందిరమునకు పోవుట, అచ్చటకు వచ్చుచూ - పోవుచుండెడి వారికి విసనకర్రతో విసరుచుండుట మొదలగు పనులనొనర్చుటకై పాదములు ఎనిమిది ఝాములూ సంచరించుచునే వుండును. ఆ దేవుని ప్రాంగణము నందు శృంగారించుట, దేవునికి పూజకై గంధ పుష్పాది ఉపచారములు సమకూర్చుట, మరియు ఆదేవుని పనులను వేటినైన చెయ్యవలసినదిగా ఎవరైన చెప్పుచో ఆ పనులు చేయుట కొరకును చేతులెల్లప్పుడూ సిద్ధముగనుండును. దేవతాలింగము పైనగాని, దేవతామూర్తి పైనగాని దృష్టిపడుటతోడనే శరీరము భూమికివంగి నమస్కరించును. మరియు, తను సదాచారాది గుణములవలన లోకమున యథేష్టముగ మహిమను సంపాదించిన బ్రాహ్మణులను మనస్ఫూర్తిగాసేవించును. లేదా, ప్రవాసమువలన గాని రోగాది బాధలవలనగాని, సంకటములు మొదలగు వానివలన దుఃఖముగానూ మరియు బాధలతోనూ నున్నవారికి సౌఖ్యము కలుగునటుల చేయును. తీర్థములన్నింటను శ్రేష్ఠమైన తల్లి - దండ్రులను సేవించుటకై స్వశరీరముకూడా త్యాగమొనర్చబడును. సంసారస్థితియందు కూడా కలసికొనుటతోడనే మాలిన్యముల నన్నిటిని దూరమొనర్చునట్టి జ్ఞానదానము చేయుటలో అతి సదయుడుగా గురుదేవుని భజించవలెను. మరియు ఓ వీరుడవగు అర్జునా, స్వధర్మమనెడి కుంపటిలో అభ్యాసయోగమును పుటము బెట్టి దేహాభిమానపు దోషములన్నింటినికాల్చి భస్మమొనర్చబడును. భూతకోటియందంతటను ఆత్మ-వస్తువుగలదని అంగీకరించుట యనెడి తపమునర్చు వారికి నమస్కరించవలెను. ఎల్లప్పుడు పరోపకార మొనర్చుచు నుండవలెను. మరియు విషయభోగములను దృఢనిశ్చయముతో సంయమించవలెను. జన్మధారణ మొనర్చుటకై స్త్రీ శరీరమును స్పర్శించి తీరవలెను. కాని ఆ ప్రసంగానంతరము మరల జీవితమునం దంతటను ఆ స్పర్శనుండి తనను తాను దూరమొనర్చుకొనియూ విముక్తుడు అయియూ వుండవలెను. భూతకోటి యంతటను ప్రాణముగలదని తలంచి తృణమునైనను త్రుంచకుండా వుండవలెను.

మరియు అంతేగాదు. దానిని భేదించరాదు, భేదించరాదు కూడాను. ఈ విధ మైన ప్రవర్తనవలన శరీరము శుద్ధము మరియు సరళము గానూ అయినప్పుడే శరీరతపస్సు పూర్ణత్వమును చెందినదని చెప్పనగును. ఓ అర్జునా! యీ పను లన్నింటియందును శరీరమే ముఖ్యసాధన మగుటవలన నేనుదీనిని శరీరతపస్సం టిని ఇక నిష్పాపమైన వాఙ్మయతపస్సును వివరించెదను వినుము.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥౧౫॥

"స్పర్శమణి యినుమును విరుగగొట్టకుండానూ, మరియు దాని స్వరూపమును చెడగొట్టకుండానూ దానిని బంగారముగ నొనర్చు రీతిని, ఎవని వాక్కునందు స్వాభావికముగనే ఎవరికిని కష్టమును కలిగించక చుట్టు-పట్ల వున్నవా రందరికి మధురము మరియు సుఖకరముగ నుండునంత సౌజన్యము వుండునో, ఎవని మాటలు ఏదో ఒక వ్యక్తిని ఉద్దేశించి మాట్లా డినవై నప్పటికిని 'వృక్షమును పోషించుటకై ప్రవహించుచున్నదైనప్పటికి ప్రవహించిపోవుచున్నప్పుడు సహజముగనే తృణములకు కూడ ప్రాణదాన మొనర్చు' ట్టి జలమువలె' అందరికీ హితవు నొనర్చునవిగా నుండునో, ఎవని సంభాషణము అమృతము గల దివ్యగంగవలె లభించినవెంటనే ప్రాణులను చావులేనివారిగ నొనర్చుటేగాక, దానితోపాటు దానియందు స్నాన మొనర్చువారి పాప - తాపములను తొలగించుచూ, నాలుకకుకూడ మాధు ర్యము నిచ్చునట్టివి యగుటచే అనాలోచనమును దూర మొనర్చి తన అనాదియైన శాశ్వతమైన ఆత్మస్వరూపమును ప్రకట మొనర్చునో, ఏది విను టకు అమృతరసమువలె ప్రియముగా నుండునో మరియు దేనిని వినుటవలన విసుగు జనించదో, మరియు దేనికి ఎవరైన ఏదైన అడిగినప్పుడు మాత్రమే మాట్లాడి యితర సమయములందు నిశ్శబ్దముగా వేదములు మరియు సంహితలు మొదలగు వానిని మాత్రమే ఆవర్తన మొనర్చునట్టి నియమముగలదో, ఎవరు

ఋగ్వేదాది వేదత్రయమును తన వాగ్భవనమున ప్రతిష్ఠించుకొని తన వాక్కునే వేదశాలగా నొనర్చుకొనునో, మరియు దేనియందు శివుడు, విష్ణువు లేదా యీ విధమగు తదితర దేవుళ్ళ నామోచ్చారణ రాత్రిం-బవళ్ళు సమానముగ జరుగుచుండునో, అట్టిదానినే వాచికతపస్సనవలెను. ఇక మానసిక తపస్సును వివరింతును వినుము." ఈ రీతిని లోకపాలకులకు ప్రభువగు శ్రీకృష్ణభగవాను లాసమయమున చెప్పిరి.

మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః।
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే ॥౧౬॥

అంతట శ్రీకృష్ణు లిటుల చెప్పిరి- "అలలు లేనప్పుడు సరోవరము, మేఘములు లేనప్పుడు ఆకాశము, సర్పములు లేనప్పుడు మంచిగంధపు అడవి, కళలు చలించనప్పుడు చంద్రుడు, చింతలు లేనప్పుడు రాజు, లేదా మథించుటకై మందరపర్వతము లేనప్పుడు క్షీరసాగరముయొక్క స్థితియీ వుండురీతిని రకరకములైన సంకల్ప - వికల్పము లనెడి జంజాటములు లేనప్పుడు ఏ మనస్సు కేవలము ఆత్మ-స్వరూపమునందే స్థిరపడియుండి సంతాపరహిత ప్రకాశమువలెను, జడత్వములేని రసము లేదా ఖాళీలేని అవకాశమువలె నుండి, తన కల్యాణ సాధన మొనర్చుకొని ఆనందమయ స్వరూపమునుచూచి 'చలిచే కుష్ఠించి పోయిన అవయవము స్పర్శజ్ఞానవిహీనమై చలిచే బాధను అనుభవించక పోవురీతిని' తన స్వభావమును పరిత్యజించునో, అట్టి సమయమున మనస్సు నిశ్చలము, కళంకహీనము, మరియు పరిపూర్ణచంద్రమండలమును పోలిన ఉత్తమసౌందర్యమును పొందును; అట్టి మానసికస్థితి కలిగినప్పుడు వైరాగ్య కష్టములు లేనటులే యుండును. మనశ్చాంచల్య మంత మొందును. మరియు కేవలము ఆత్మబోధ యనెడి పూర్ణత్వమే మిగిలియుండును. కావుననే, శాస్త్రములను ఉపదేశించునప్పుడు నోరు కదల్ప వలసిన అవశ్యకత వుండకపోగా, ఆ ప్రయత్నమే వాణీసూత్రమును

చేసినచో కేవలము మౌనమునే స్వీకరించును. ఆత్మస్వరూపప్రాప్తి కలిగిన పిమ్మట మనస్సుయొక్క మనత్వముకూడా నాశ మొందును; మరియు ఉప్పు నీటిలోకరిగి లీనమైపోవు రీతిని మనస్సు కూడా ఆత్మతత్త్వమునందు లీనమై పోవును. ఇట్టి స్థితిలో ఇంద్రియమార్గమున పరుగిడి విషయము లనెడి గ్రామమున ప్రవేశించు మనోభావము యెటనుండి జనించును? అటుపిమ్మట అరచేతిలో వెంట్రుకలు మొలవనిరీతిని మనస్సున విషయభావములు కూడా నామమాత్రమునకైన లేకుండా పోవును. ఓ అర్జునా! ఇంక నే నేమని విస్తరించి చెప్పను. మనస్సు యీ మాదిరి స్థితిగలదిగా అయినప్పుడు ఆ మనస్సు మానసిక తపస్సుకు యోగ్యమైన దగునని యెరుంగుము. మానసిక తపస్సు యొక్క స్వరూప మీవిధముగా నుండును" శ్రీకృష్ణ భగవాను లీరీతిని చెప్పెను. అటుపిమ్మట తిరిగి యిట్లుల చెప్పెను "ఈరీతిని శారీరక, వాచిక, మానసికిములగు త్రివిధ తపస్సులను గురించి నీకు వివరముగా చెప్పితిని. ఇక త్రిగుణముల ననుసరించి యీ త్రివిధ తపస్సులందును గలుగు త్రివిధ భేదములను చెప్పెదను, సావధానుడవై వినుము.

శ్రద్ధయా పరయా తప్తం తప స్త త్త్రివిధం నరైః।
అఫలాకాంక్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే॥ ౧౭

ఓ సువిజ్ఞుడవగు అర్జునా, నేను చెప్పిన త్రివిధములగు తపస్సులున్నూ నాటి ఫలప్రాప్తినిగురించిన సమస్తఆశలను పరిత్యజించి చేయబడినప్పుడున్నూ, మరియు యీ తపస్సులు శుద్ధసాత్త్విక వృత్తితోనూ ఆస్తిక్యబుద్ధితోనూ చేయబడినప్పుడు, అట్టితపస్సును బుద్ధిమంతులైనవారు సాత్త్వికతపస్సందురు.

సత్కార మాన పూజార్థం తపో దంభేన చైవ యత్ ।
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్॥ ౧౮

అటులగాక, తపోనిమిత్తమై భేదభావమును కలిగించి, గొప్పతన మనెడి శిఖరముపై కూర్చొనుతలంపుతో త్రిభువనములందు నాకుతప్ప మరెవ

రికిని యింతప్రతిష్ఠ రాగూడదనీ, సభలు మరియు భోజనాదులప్పుడు తానే అందరికంటె ఎక్కువగానూ ముందుగానూ సన్మానింపబడవలెననీ, తానే విశ్వమంతటను ప్రీతిపాత్రుడు కావలెననీ. మరియు లోకులందరూ నాయింటికే పరుగులిడి రావలెననీ, లోకులవలన లభించెడి ప్రతిష్ఠయంతయూ తనకే లభించవలెనని, గొప్పతనమునకు సంబంధించిన అన్నివిషయములగు అనుభవములను తానే పొందవలెననెడి తలంపుతో 'అందవికారముగాను, కురూపముగాను వున్నవ్యక్తి తనకు గొప్పదనమును కలుగజేసుకొనవలెనను తలంపుతో అతి విలువగల వస్త్రములను ధరించి తన్నుతానే శృంగారించుకొనురీతిని, శరీరముపైనను వాక్కుపైనను తపస్సనెడి పూతను పూయుటకునూ, మరియు యీ రీతిని తనగొప్పతనమును యినుమడింప జేసికొను తలంపుతోను, సారాంశమేమన, ధనమానములనెడి వాసనలను పరాకాష్ఠవరకుజేర్చి చేయబడు 'తపస్సు' రాజసతపస్సుగా పరిగణింపబడును. ఎండిపోయిన లేక యీనినప్పటికికూడా పాలుయివ్వనటువంటి వ్యాధిచే పీడింప బడుచున్న గోవువలె, లేదా తయారై నప్పటికిని పశువులు మేసివేసినందువల్ల ధాన్యము లభించనట్టి పొలమువలె,ఆత్మాడంబరముగాను డంబముతోనూ చేయబడు తపస్సు నిష్ఫలమూ మరియు వ్యర్థమూ యగును. ఇంతేగాక, ఓ అర్జునా ! ఇట్టి తప స్సొనర్చువారు తమతపస్సు నిష్ఫలమై పోవుచున్నటుల కాన్పించిన వెంటనే దానిని మధ్యలోనే అసంపూర్ణముగ విడచివేయుదురు; యిందువలన యీ విధమగు తపస్సులో స్థిరత్వముగాని స్థాయిత్వముగాని వుండ నేరదు. సాధారణముగ ఆ సమయమున ఆకాశమున వచ్చెడి మేఘములు బ్రహ్మాండమంతయూ ప్రతిధ్వనించునటుల గర్జించుచూ క్షణముసేపైన ఆగియుండవు. ఇదేరీతిని రాజస తపస్సు కేవలము నిష్ఫలమై వంధ్యవలె సిద్ధించును. మరియు దానితోపాటు ఆచరణలోకూడా అది పూర్తికా కాదు. ఇక యీ తపస్సే తామసాచరణముతోకూడియున్న [illegible] దానివలన స్వర్గముగాని యిహలోక కీర్తిగాని రెండునూ లభించవు.

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ॥19॥

"ఓ అర్జునా, ఏ తపస్సులో శుద్ధమూర్ఖత్వమును ఆశ్రయించి తన శరీరము శత్రువుగా తలంచబడునో, శరీరమునకు పంచాగ్ని తాపము కలిగించబడునో, లేదా లోపలినుంచి శరీరము సర్పమువలె కాలిపోవురీతిని అగ్ని వెలిగించబడునో, తలపైన గుగ్గిలము వెలిగించబడునో, వీపుకు ముళ్ళు గుచ్చబడునో, లేదా పరిసరములందు మండుచున్న అగ్నిలో శరీరము నిప్పుకణముల వలె కాల్చివేయబడునో, లేదా శ్వాసోచ్ఛ్వాసలను బంధించి వ్యర్థముగనే ఉపవసించబడునో, లేదా శరీరమును తలక్రిందులుగా వ్రేలగట్టి సుగంధపు పొగపై నోరు వ్రేలవైచి ధూమపాన మొనర్పబడునో, మంచునుబోలిన చల్లగానున్న నదీజలములో కంఠము లోతున నిలబడి సాధన మొనర్పబడునో, లేదా ప్రాణముతోనున్న తన శరీరమునుండి మాంసపుముక్కలు కోసివేయబడునో, మరియు ఓ అర్జునా, తనశరీరమున కీవిధమగు అనేక యాతన లెప్పుడు కలిగించబడునో, యిట్టి తపస్సు నొనర్చుటలో గల హేతువు కేవలము యితరులను నాశ మొనర్చుటయే యగునో, యీ విధముగు తపస్సు చేయువాడు శరీరమునకు కలిగించు కష్టమువలన ఆతనిస్థితి తనభారమునల్లనే క్రిందికి క్రుమ్ముగా దొర్లిపడి తాను విరిగిపోవుటేగాక మఱ్యమున్నవాటి నన్నిటిని తునాతునకలు చేసెడి రాయివలె నగును. ఇట్టి మనుష్యుడు సుఖముగా నుండెడి తనప్రాణమునకు కష్టములను కలిగించి విజయమును పొందవలెనసెడి చెడువాసనతో తపస్సొనర్చును. సారాంశమేమన, శరీరమును కష్టపెట్టెడి భయంకర కృత్యములతో కూడియున్న తపస్సును తామసముగా నెరుంగవలెను. ఈరీతిని సత్త్వాది గుణసంయోగములవలన జరిగెడి తపస్సునందలి త్రివిధములను నీకు వివరించి చెప్పితిని; వీటివలెనే గుణసంయోగము ననుసరించి దానముకూడా త్రివిధములు. అందు మొదటిదగు సాత్త్వికదానముయొక్క లక్షణములను వినుము.

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ ౨౦ ॥

“తన ధర్మానుసారము ఆచరించినందువల్ల ప్రాప్తించిన ద్రవ్యాదులను ఆత్మాదర పూర్వకముగా యితరులకు యివ్వవలెను. ఒక్కొక్కప్పుడు, ఉత్తమబీజములు లభించి వాటిని విత్తుటకు యోగ్యమైన పొలము లభించక పోవుటే జరుగుచుండును. దానముపట్ల కూడా యీ విధమగు పరిస్థితియే సంభవించుచుండును. ఒక్కొక్కప్పుడు అమూల్యమగు వజ్రము చేజిక్కును, కాని ఆ వజ్రమును కూర్చుటకు తగిన బంగారము లభించక పోవచ్చును. లేదా ఒక్కొక్కప్పుడు ఆవజ్రమూ దానికి తగిన బంగారమూ లభించినప్పటికినీ వాటితో తయారుచేయబడిన నగను ధరించ దగిన అవయవమే లేకపోవచ్చును. దానము విషయమున కూడా యీ పరిస్థితియే గోచరించుచున్నది. కాని మానవునికి వాస్తవముగ భాగ్యోదయమైనప్పుడు ‘శుభసమయము, ప్రాణసఖుడు, మరియు ధనసంపద యీ మూడూ యోగించురీతిని దానమునకు సహాయపడుటకై సత్త్వగుణము వచ్చినప్పుడు’ దానమునకు యోగ్యమైన స్థలము, పాత్ర, కాలము మరియు ద్రవ్యము - అనెడి సాధనములు నాల్గున్నూ వచ్చి ఏకత్రిత మగును. ఉచితమగు దాన మొనర్చుటకై ముందుగా కురుక్షేత్రము, కాశీక్షేత్రము లేదా వీటితో సమానమైన మరియొక పవిత్రమగు భూప్రదేశమువరకు ప్రయత్నపూర్వకముగ వెళ్ళవలెను. ఆ పైన ఆ ప్రదేశమునకు చేరిన పిమ్మట పౌర్ణమి లేదా అమావాస్యలవంటి పుణ్యపర్వకాలము లేదా వాటితో సమమగు మరియొక పర్వకాలమును చూచుకొనవలెను. ఈ విధముగా స్థలమూ, కాలమూ లభించిన పిమ్మట దాన మిచ్చుటకు యోగ్యుడగు ఉపయోగకరమైన పురుషుని వెదుకవలెను ఆ పురుషుడు మూర్తీభవించినశుద్ధత్వమే అయియుండవలెను. సదాచారమునకు జన్మస్థానము మరియు వేద-జ్ఞానమునకు సంగ్రహాలయ

షుగా గల అతిపవిత్రుడగు బ్రాహ్మణశ్రేష్ఠుడుగా ఆతడు వుండవలెను. ఇట్టి ఉత్తమపాత్ర లభించినప్పుడు తన విత్తముపై తనకుగల స్వత్వమును వదలుకొని ఆ విత్తమును ఆతనికి అర్పించవలెను. కాని దీనిని ఎటుల చేయ వలెను ? భార్య తనభర్త వద్దకు మర్యాదాపూర్వకముగా వెళ్ళురీతిని ఒకా నొక సజ్జనుడు తనవద్ద ఎవరో దాచియుంచిన సొమ్మును దాని యజమానికి తిరిగియిచ్చి ఆ భారమునుండి విముక్తుడగురీతిని లేదా సేవకుడు అతివినమ్రతతో రాజుకు తాంబూలము నిచ్చురీతిని – యీ దానమును కూడా యివ్వవలెను. ఇదేవిధమున నిష్కామ మనస్సుతో ఆ బ్రాహ్మణశ్రేష్ఠునకు భూమ్యాది దానముల నివ్వవలెను. తాత్పర్యమేమనగా, దానము నిచ్చునప్పుడు ఏ విధమగు ఫలాకాంక్షయూ తన మనస్సున జనింపనివ్వరాదు. ఇంతేగాక దానము నిచ్చుటకై అన్వేషింపబడిన మనుష్యుడు తానిచ్చిన దానమునకు ప్రతిఫలము ఏ విధముగను ఎన్నడును తీర్చ నేరనివాడుగా అయియుండవలెను. ఆకాశమును పిలచినందువలన దానినుండి ఏవిధమగు ప్రత్యుత్తరము రానిరీతిని, లేదా అద్దమును విడచి మరెవ్వైపైనా చూచినప్పుడా అద్దములో మన ప్రతిబింబము కాన్పించనిరీతిని, లేదా నీటితో నిండియున్న ప్రదేశమున విసరివేయబడిన బంతి తిరిగి మన చేతికి మరలిరాని విధమున, లేదా ఆబోతుకు పెట్టినమేత, లేదా కృతఘ్నునకు చేసిన ఉపకారమూ ఎన్నడును ఏవిధము గను ఫలప్రదము కానిరీతిని, దాతకూడా 'తానిచ్చిన దానమునకు ప్రతిఫల ముగా ఏ మాత్రమైనను ఏ ఉపకారాదులున్నూ లభించుటకు వీలులేని వానికే' దానమివ్వ నగును. మరియు దానము నిచ్చునప్పుడెన్నడును 'నేను దాతను, ఆతడు గ్రహీత' యనెడి భేదభావమును తన మనస్సున రానివ్వ రాదు. ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా ! యీ విధమగు అన్నిలక్షణములతోను కూడియున్నదై యివ్వబడిన దానమునే సర్వోత్తమము మరియు సాత్త్విక ముగా నెరుంగవలెను. మరియు దేశము, కాలము మరియు సత్పాత్రుడగు బ్రాహ్మణుని లక్ష్యమందుంచుకొని చేయబడు దానమే నిర్దోషము మరియు శాస్త్రోక్తమూ కాగలదు.

యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥౨౧॥

పాలను దృష్టియందుంచుకొని ఆవుకు మేతవేయబడు రీతిని, లేదా ధాన్యముతో తనగాదెను నింపుకొను తలంపుతో పొలమున విత్తులు చల్లబడు రీతిని, లేదా వ్యవహారమునందు గాని లేదా విందునందు లభించెడి డబ్బును గాని లక్ష్యమునందుంచుకొని తన బంధువులు మొదలగు వారిని శుభకార్యమునకు రావలసినదిగా ఆహ్వానించురీతిని, లేదా ఏదోరీతిని ఏదోరూపమున ప్రతిఫలము లభించుననెడి నమ్మకమున్న వ్రతస్థునకు ఆహార - పానీయ సామానులుగాని విస్తళ్ళు మొదలగునవిగాని పంపబడురీతిని, లేదా బహుమతిగా లభించెడిడబ్బును ముందుగానే తానుతీసికొని ఆపిమ్మటనే ఆబహుమతి యిచ్చువాని పనిని చేసినటుల, లేదా వేతనముగాని, ధనముగాని తీసికొని రోగికి చికిత్స చేయువిధమున ఏదానము 'యీదానమువలన భవిష్యత్తునందు మనకుపకరించుననెడి' ఉద్దేశ్యముతో చేయబడునో, లేదా మార్గమునపోవునప్పుడు శ్రేష్ఠుడగు బ్రాహ్మణుడు లభించుటవలన, ఆతనికి యిచ్చిన దానమెన్నడును ఏరూపముననూ తిరిగి రాదని తెలిసి, దానమునందొక రాగిడబ్బుమాత్రమేయిచ్చి మరియు తన గోత్రజు లందరి ప్రాయశ్చిత్త సంకల్పజలమున్నూ ఆతనిచేతిపై నుంచబడునో, సరిగా యిదేవిధమున ఐహికములగు పరలోకమునకు సంబంధించిన సుఖ - ఫలములను లక్ష్యమునం దుంచుకొని ఒక్కమారు ఆకలిని నివృత్తి చేసికొనుటకు కూడ చాలనంత తక్కువదాన మివ్వబడునో, మరియు ఆ అల్పదానమును కూడా ఆ బ్రాహ్మణుడు గైకొని వెళ్ళిపోవుచున్నప్పుడు ఆ యజమానునకు తన యింట బందిపోటు జరిగినటులునూ, తన సర్వస్వము దోచుకొని పోబడినటులను తోచినందువలన తన మనస్సున పరిపరివిధముల వ్యాకులమును పొందునో,— ఓ సువిజ్ఞుడవగు అర్జునా! యింక దీనిని అధికముగా విస్తరించక యీమాత్రమే చెప్పెదను - యీ విధమగు భావములు కలిగి చేయబడెడి దానము పూర్తిగా రాజసదాన మని యెరుంగుము."

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే ।
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్ ॥ ౨౨॥

"మరియు ఓ యర్జునా! యవనుల పట్టణమునందు, అరణ్యమున, అపవిత్రమగు దేశభాగమున, దేరాయందు, లేదా పట్టణమునందు, నాల్గు వీధుల కూడలివద్ద సరిగా సంధ్యాసమయమున, లేదా రాత్రులందు, దొంగతనముచే ఆర్జించిన ధనమును దానము చేయుట, ఇక ఆ దానమును కూడా ఎటులొసగ్బట? భట్టులు, గారడీవారు, వేశ్య, జూదగాండ్రను పోలిన అపారమగు భ్రమయందు పడియుండి యితరులను మోసగించువారికి చేయుట; అందుపైన ఎదుట రూపవతులూ లావణ్యవతులూ నగు స్త్రీల నాట్యము జరుగుచున్నప్పుడు, కనులు కొర్రవ్యెక్కి ముఖస్తుతి చేయువారి స్తుతులు ఎడతెగక చెవులకు వినిపించుచూ వున్నప్పుడునూ, అందుమీదట యీ దానము చేసెడి సమయమునందో, పుష్పములు మరియు యితర సుగంధ ద్రవ్యములయొక్క కోమల సుగంధములవలన అవయవములందు విషయలోభములనెడి వైతాళికుడు సంచరించుచున్నప్పుడు, జగత్తునంతనూ దోచుకొనివచ్చి సమకూర్చిన సంపదను 'నీచులకు మరియు దుష్టులకుగాను అన్నసత్రమును తెచ్చినాడో' యన్నరీతిని దానమొనర్చుట, యీ విధముగు అన్నిదానములను నేను తామసమందును. ఇంతేగాక, ఒక్కొక్కప్పుడు దైవయోగముచే మరియొక విధముగా కూడా జరుగుచుండును. దానినికూడా వినుము. కీటకములు భక్షించిన కొయ్యపైన రేఖాసంయోగముచే అప్పుడప్పుడు కొన్ని అక్షరములు ఏర్పడురీతిని, లేదా రెండు చేతులతోను చప్పట్లు కొట్టు నప్పుడు ఏదైనకాకి తనంతతానే రెండు అరచేతులమధ్యకు వచ్చురీతిని ఒక్కొక్కప్పుడు తామస పురుషునకుకూడా శుభకాలము మరియు పవిత్ర స్థలములు రెండు కలసివచ్చినప్పుడు వీటితోపాటు దానము పుచ్చుకొనుటకు అర్హుడైన పురుషుడుకూడా ఆతని వద్దకువచ్చి, ద్రవ్యముకావలసియుండుటవలన తనంత

తానే యీతనిని యాచించుటకూడా సంభవించినప్పటికిని, తామసపురుషుని మనస్సున నామమాత్రముకైన శ్రద్ధయుండదనందువలన అతడా అతిథికి నమస్కారముకూడా చేయక, అర్ఘ్యపాద్యాదులనుకూడా ఆతని కర్పింపక ఆదరసత్కారముల నొనర్పక, తాను స్వయముగా యీ రీతిని చేయకపోగా మరెవ్వరిచేతనూ ఈరీతిని ఆదరసత్కారములను చేయించకపోవుటేగాక, అభ్యాగతునకుకూర్చుండుటకుఆసనమునైనయివ్వడు.ఇకయిట్టిస్థితిలోగంధాక్షతలతో ఆతనిని పూజించుటెక్కడ సంభవించును ? ఓ అర్జునా, తామసపురుషులు యీ విధమగు అశాస్త్రీయము మరియు అవమానకరమూనగు రీతిని వ్యవహరింతురు. ఒకవేళ అతడాయాచకుని సత్కరించి ఏకొద్దిగానో ధనమిచ్చినప్పటికిని, ఆ యిచ్చెడివిధానము ఋణస్థుడు తగాదాచేయువాని చేత ఏకొద్దిగానోపెట్టి ఆతనిబాధ తప్పించుకొనినరీతిగా వుండును. మరియు, యీవిధముగా దానమిచ్చునప్పుడుకూడా ఆతని నోటినుండి 'ఆరే - ఒరే' మొదలుగాగల అవమానకరమైన మాటలు అంతులేకుండా వెడలుచునే వుండును. మరియు ఓ అర్జునా, యీరీతిని ఆతడు ఎవరికైన యిచ్చినదానమును, ఆతామసీకుడగు దానకర్త ఆ దానము పుచ్చుకొనినవానిచే మాటి మాటికి చెప్పించుకొనుచూ మరియు నిందించి ఆతనిని అవమానముకూడా చేయుచుండును. ఓ అర్జునా; యీ విధముగా ద్రవ్యదాన మివ్వబడుచో, అది సర్వత్రా తామసదానమనియే చెప్పబడును. ఈరీతిని నీకు సాత్త్విక, రాజస, తామసము లనెడి త్రివిధములగు దానములను గురించిన్ని వివరముగావాటిని సులభముగ గుర్తించుటకు వీలగురీతిని చెప్పితిని. కాని, ఓ సువిజ్ఞుడవగు అర్జునా! బహుశః నీ మనస్సున యీసందేహము కలిగి యుండవచ్చును. ప్రపంచమున మోక్షమునిచ్చునట్టి దొక్కసాత్త్వికకర్మయేయైనప్పుడు, తదితరబంధకమైన కర్మలనన్నిటిని ఏల వివరించుచున్నావు?, యని. దానికి జవాబు-భూతమును పారద్రోలనంతవరకు భూమిలో పాతిపెట్టబడియున్న ధనము లభించదు, మరియు పొగవలన కలుగు కష్టమును సహించనిదే దీపప్రవర్తియే వెలుగదుగదా. కావునన్నే,

శుద్ధసత్త్వమును మరుగుపరచెడి రజస్తమము లనెడి ఆవరణలను తొలగించి దూరమొనర్చుట ఎటుల చెప్పవని కాగలదు ? నేనిప్పటివరకు (రెండవ శ్లోకమునుండి (యిరువదిరెండవ శ్లోకమువరకు) శ్రద్ధనుండి మొదలుకొని దానము వరకు గల కర్మసమూహము లన్నియూ త్రిగుణములచే వ్యాప్తమై యుండునని చెప్పితిని; వాటిలో కేవలము మూడు విధములైనవాటిని గురించియే వర్ణించదలచితిని; కాని సత్త్వము యొక్క స్వరూపము స్పష్టముగా తెలియ జేయు తలంపుతోనే యితరవిధములైనటువంటి వాటిని గురించికూడా వర్ణించి చెప్పితిని. రెండువస్తువులకు మధ్య దాగియుండెడి ఒక వస్తువును గురించి సరిగా తెలియజెప్ప వలెననిన దానితోపాటు దానిని అణచియుంచెడి మిగతా రెండు వస్తువులను గురించికూడా స్పష్టీకరించి చెప్పినప్పుడే చక్కగా బోధపడును. రాత్రింబవళ్ళను రెంటినీ త్యజించినప్పుడు సంధ్యాకాలమును గురించి తెలియును. ఈ విధముగనే రజస్తమములు నశించినప్పుడు సత్త్వము మాత్రమే మిగిలియుండి తనంతతానే మూర్తిత్వమును దాల్చి ఎదటికివచ్చును. నీవు రజస్తమములను త్యజించి సత్త్వగుణ సహాయముచే కర్తవ్యపాలన మొనర్చుము. నీవు నిర్మలమగు సత్త్వగుణముతో కూడి యున్నవాడవై యజ్ఞాది కర్మల నొనర్చుము; ఇటుల చేసినచో నీకు ఆత్మస్వరూప ప్రాప్తి కలుగును. స్వయముగ సూర్యుడే మనకు చూపించువాడైనప్పుడు మనకు కాన్పించని వస్తువేదియుండును ? ఇదేవిధమున సత్త్వసహాయముచే కార్యము లొనర్చ బడుచో ప్రాప్తించనేరని ఫలము లేదియుండును? మనకు కావలసిన శక్తు లన్నియూ సత్త్వగుణమునందు గలవు. కాని, మోక్షమును పొంది ఆత్మ స్వరూపమున సమరసత్వమును పొందుట మరియొక విధమైనది. సత్త్వసహా యము లభించినప్పుడు మోక్షప్రాంతమునకూడ దానంతట అదే ప్రవేశము లభించును. బంగారము పదిహేను రూపాయీల తూకము గలదియూ (యిది జ్ఞానేశ్వర మహారాజా కాలమందలి భాగము) పూర్తిగా శుద్ధమైనదీ కాకున్న ప్పటికిన్నీ దానిపైన రాజముహరు వున్నంతవరకు ఆ విలువతోనే వ్యవహరింప

బడును. నిర్మలము, చల్లనైన మరియు సుగంధితమూ నగు జల మతిసుఖ
కరముగా నుండుననుట వాస్తవమే; కాని అది ఏదైన తీర్థముతో సంబంధించి
యున్నప్పుడే దానికి పవిత్రత సిద్ధించును. సాధారణమైన నది ఎంత పెద్దదై
నప్పటికిని, దానికి ఏదైన మహానదీ సంగమము లభించినప్పుడే సముద్రమున
కూడ దానికి ప్రవేశము లభించగలుగును. సరిగా యిదేరీతిని, ఓ అర్జునా!
సాత్త్విక కర్మల నొనర్చు వారికి మోక్షమార్గమున ఏ విఘ్నములు అడ్డంకులూ
వుండవు. కాని యీ ప్రశ్న దీనికి భిన్నమైనది." ఈ మాటలను వినుట
తోడనే అర్జునుని అంతరంగమున ఉత్సుకత్వము మిక్కుటముగ వృద్ధిపొందు
టచే, అచట పట్టజాలక పోయెను. అంతట అతడు శ్రీకృష్ణుని యిటుల
యడిగెను. "ఓ దేవా, తాము కృపతో ఆ ప్రశ్నకు సంబంధించిన విషయ
ములు నాకు చెప్పగోరెదను." అంత దయాళు శ్రేష్ఠుడగు శ్రీకృష్ణు లిటుల
చెప్పిరి. మంచిది, సాత్త్విక పురుషుడే రీతిని మోక్షరత్నమును దర్శించునో
వివరించి చెప్పెదను వినుము.

ఓమ్ తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధస్స్మృతః ।
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ ౨౩

"విశ్వమున కంతకును మూలకారణమున్నూ విశ్రాంతి స్థలమున్నూ
అయిన అనాది పరబ్రహ్మయొక్క పేరు ఒక్కటే. అయినప్పటికిని యిది
త్రివిధములుగా గలదు. వాస్తవముగ చూచినచో, పరబ్రహ్మకు ఏ నామము
గాని, జాతిగాని లేదు. కాని యీ మాయాజనిత మోహాంధకారమున పరబ్ర
హ్మను గురించిన కాల్పనిక భావమును కలుగజేయుటకు మాత్రమే యీ పేరు
పెట్టబడినది. బాలుడు జన్మించినపుడు తనతో పేరు పెట్టుకొని రాడు. కా
నిటుతరువాత ఆతనికి మనము పెట్టిన పేరుతో ఆతనిని పిలువ నారంభించుట
తోడనే అతడు పలుకసాగును. సాంసారిక దుఃఖములచే పీడింపబడిన జీవుడు
[illegible]ములనుగురించి చెప్పనారంభించునపుడు ఏ నామముతో పిలిచిన బ్రహ్మ

తత్త్వము మారుబలికి అతనికి జవాబిచ్చునో అదియే యీసాంకేతికము. అనగా గుర్తించుటకుగాను ఏర్పడినపేరు. వేదములు జగత్తుపై ననుగ్రహము గలవై తమ దివ్యదృష్టివలన — బ్రహ్మతత్త్వమును వాక్ప్రాంతములోనికి తెచ్చుటకు సహాయపడెడి ఒకమంత్రమును అన్వేషించినవి. మరియు అందువలన ఆ బ్రహ్మతత్త్వముయొక్క అద్వైత స్వరూపమును దీనిసహాయముచే వ్యక్తరూపమున అనుభవములోనికి తెచ్చుకొనవచ్చును. ఆమంత్రమును ఉచ్చరించి బ్రహ్మను పిలచినప్పుడు ఆతడు వెనుకనున్నప్పటికిని ముందుకువచ్చి వేయును. కాని, యీ మంత్రజ్ఞానము వేదమనెడి పర్వతముపైన ఉపనిషత్తులనెడి నగరములో బ్రహ్మయొక్క పంక్తిలో కూర్చుని యుండువారికి మాత్రమే కలుగును. కేవలమింతియేకాదు. విశ్వమును సృష్టించుటకు బ్రహ్మకుగలశక్తిని, యీ మంత్రమును కేవలము ఒక్కమారు జపించినంత మాత్రముననే లభింపజేయు మహిమకలిగినదికూడ యీనామమే. ఓవీరశ్రేష్ఠుడవగు అర్జునా! సృష్టించుటకు పూర్వము బ్రహ్మ నన్నే (యీశ్వరునే మరచిపోయెను. అందుచే ఆతడు సృష్టికార్యము నొనర్పజాలకుండెను కాని, ఆతనికి ఏ నామసహాయముచే ఆతనియందు సృష్టించగల సామర్థ్యము వచ్చినదో, ఏ నామముయొక్క అర్థమును మనన మొనర్చుటవలనను మరియు ఏ మూడక్షరములను జపించుటవల్లను ఆ బ్రహ్మకు సృష్టించగలశక్తి లభించినదో, ఆ మంత్ర మిదియే. అంతట ఆతడు బ్రాహ్మణులను సృష్టించెను. వారికి వేదములను అనుసరించవలసినదని ఆదేశించెను. మరియు యజ్ఞకర్మను వారి నిర్వాహణ సాధనముగా నొనర్చెను. అటుపిమ్మట ఆతడు లెక్కించ నలవికానంతవుంది మనుష్యులను జనింపజేసెను. వారి నిర్వహణమునకై బ్రహ్మ త్రిభువనములను దానపత్రముగ వ్రాసియిచ్చెను. ప్రజాపతియగు బ్రహ్మ యిట్టి అద్భుతకార్యము నొనర్పగల సామర్థ్యము సంపాదించుటకు కారకమైన ఆ మంత్ర స్వరూపమును చెప్పెదను వినుము." అని విధముగా చెప్పి, ఆ పిమ్మట శ్రీకృష్ణభగవానులు

అర్జునునితో మరల నిటుల చెప్పెను— "మంత్రము లన్నింటికిని అధిపతి యగు ప్రణవము (ఓంకారము)ను యీ నామమందలి ప్రథమ వర్ణముగా నెరుంగుము. దాని రెండవ వర్ణము 'తత్' మూడవ వర్ణము 'సత్' అయి యున్నది. ఈ రీతిని యీ 'ఓమ్‌తత్సత్'యే ఆ బ్రహ్మయొక్క త్రివిధ నామము. ఉపనిషత్తుల అగ్రమనబడెడి ఉపనిషత్సారరూపియగు యీ సుందర పుష్పముయొక్క సుగంధమును అనుభవించుము. ఈ నామముతో ఏకరూపమును పొంది సాత్త్విక కర్మాచరణ మొనర్చునప్పుడు మాత్రమే మానవుడు కైవల్యమును తనయింటి సేవకుడుగా చేసికొన గలుగును. ఓ అర్జునా, దైవము అనుకూలముగా నుండుట సంభవించినచో మనకు కిర్యాగముతో చేయబడిన అలంకారములు కూడా లభించవచ్చును. కాని, ఆ అలంకారములను శరీరముపైన ఎటుల ధరించవలెనో తెలిసికొనుట మాత్రము చాలా కష్టము. ఇదే విధముగా, సత్కర్మల నాచరింపవచ్చును. మరియు బ్రహ్మయొక్క నామమునుకూడా ఉచ్చరించవచ్చును. అయినప్పటికిని వినియోగమును గురించిన జ్ఞానము (అనగా శాస్త్రోక్త విధులు) లేకపోయినచో అసంఖ్యాకులుగా సాధు-సజ్జనులు మనయింటికి వచ్చినప్పటికిన్ని వారిని తగురీతిని ఆదరించి - గౌరవించక పోయినందువలన మనకు వున్న పుణ్యముకూడా నాశమైపోవు రీతిని, లేదా నగలను ధరించవలెననెడి కాంక్షతో కొన్ని నగలు మొదలగునవి ఎచ్చటనుంచియో సమకూర్చి తెచ్చి వున్నవాటిని వున్నట్లుగానే మెడలో వ్రేలగట్టుకొనిన రీతిని, నోటితో బ్రహ్మయొక్క నామమును ఉచ్చరించుచున్నప్పటికిని మరియు చేతులతో సాత్త్విక కృత్యముల నొనర్చుచున్నప్పటికిన్నీ దాని వినియోగమును గురించిన జ్ఞానము లేకున్నచో ఆకృత్యములన్నియూ వ్యర్థమైపోవును. అన్నము మరియు ఆకలి - యీ రెండూ దగ్గరగానే వుండును. కాని, పిల్లవానికి భోజనము చేయుట చేతకానియెడల అతడు ఉపవసించ వలసియే వచ్చును. లేదా ఓ వీరుడవగు అర్జునా, నూనె వత్తి మరియు నిప్పు - యీ మూడునూ దగ్గర యున్నది. ఆ మూడింటినీ ఎలా వుపయోగించుకొన-

తలెని తెలియకున్నచో మన కేవిధముగను ప్రకాశము లభించదు. సరిగా యీ దేవిధమున ఉపయుక్త సమయమున కర్మ జరుగుచూ, దాని మంత్రము కూడా స్మరించుచున్నప్పటికినీ, దాని వినియోగవిధానము తెలియకున్నచో యిదంతయూ నిష్ఫలమే యగును. కావున, యీ మూడు వర్ణముల కూడిక వలనను ఏర్పడిన పరబ్రహ్మనామము యొక్క వినియోగవిధానమును నీకు చెప్పెదను వినుము.

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదాన తపః క్రియాః ।
ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్॥ ౨౪

"ఈ నామమునందలి మూడు అక్షరములను కర్మ యొక్క ఆరంభము, మధ్య, మరియు అంతము లనెడి మూడు స్థానములందును ఉపయోగించవలెను. ఓ అర్జునా! యీ వ్యవస్థవలననే బ్రహ్మవేత్తలు బ్రహ్మ-స్వరూపమును పొందిరి. శాస్త్రజ్ఞానముచే కర్మనిష్ఠులైనవారు బ్రహ్మముతో ఐక్యతను సంపాదించుటకు యజ్ఞాదికర్మల నొనర్పకుండా వుండరు. కాని ఆరంభమునందు వారు ఓంకారమును తమ ధ్యానమందుంచుకొందురు, మరియు అప్పుడు, దానిని వాక్కుతో కూడా ఉచ్చరింతురు. ఓంకార ధ్యానము మరియు దానిని స్పష్టముగ ఉచ్చరించుటలతో వారు కర్మమార్గమున ప్రవృత్తులగుదురు. చీకటిలో వెళ్ళునప్పుడు వెలుగుచున్న దీపము, లేదా అరణ్యమున పోవుచున్నప్పుడు బలశాలిని ఎవరినైనా వెంటనుంచుకొనవలసిన విధముగా కర్మలను ఆరంభించునప్పుడు ప్రణవమును ఆధారముగా గైకొనవలెను. బ్రహ్మవేత్తలైనవారు తమ యిష్టదేవతల నుద్దేశించి ధర్మము ద్వారా ఆర్జించిన అనేక విధములగు ద్రవ్యములను బ్రాహ్మణులచేత అగ్నిలో ఆహుతిగా వేయింతురు. వారు శాస్త్రోక్తవిధుల ననుసరించి దక్షతతో ఆహవనీయాది అగ్నిత్రయమున త్రిసమయము లందును ఆహుతి నొసగుచు యజ్ఞకర్మల నాచరింతురు. వారు అనేకవిధములగు యజ్ఞ యాగాదు

లను అంగీకరించి యీ మాయాజనిత సంసార మోహమును త్యజింతురు లేదా న్యాయపూర్వకముగ లభించిన భూమి మొదలుగాగల ద్రవ్యదానమును ఉపయుక్తప్రదేశమున మరియు కాలమున సత్పాత్రులగు పురుషులకయిత్తురు, లేదా ఏకాంతరాట్ భోజనవ్రతమును బూనుదురు. (అనగా ఎల్లప్పుడూ ఒకదినమున భుజించుట మరియొక దినమున భుజించకుండుట), చాంద్రాయణాది వ్రతములనొనర్తురు. మరియు మాసము – మాసము పూర్తిగా ఉపసించి తన శరీరధాతువులను శుష్కింపజేయుచూ తపమొనర్తురు. ఈరీతిని యజ్ఞము, దానము మరియు తపస్సు మొదలగు సంసారమున బంధనకరములుగా చెప్పబడు కర్మలను ఆచరించి, మరియు వాటి ద్వారానే బ్రహ్మవేత్తలైనటువంటివారు సహజముగనే మోక్షపదమును ప్రాప్తింపజేసికొందురు. స్థలమున జడములుగా తోచెడి కర్రలు మొదలగువాని సహాయమువల్లనే మనము నీటిని దాటురీతిని యీ నామసహాయమువలన లోకులు బంధకరములైన కర్మలనుండి విముక్తిని పొందుదురు. ఈ విధముగా యజ్ఞదానాది కర్మలు ఓంకార సహాయము చేహితకరములగుచున్నవి. ఓ అర్జునా, యిక, యీ కర్మలు ఫలమునకు కొద్దిగ సమీపమునకు చేరినప్పుడు 'తత్' శబ్ద ప్రయోగము జరుగును.

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపః క్రియాః।
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః ॥౨౫॥

"ఏ పరబ్రహ్మమనెడి పేరుగల వస్తువు సమస్త మాయాజనిత సంసారమునకు అతీతమైనదో, ఏది సమస్తమును చూచునట్టిదో మరియు ఏది 'తత్' శబ్దముచే దర్శింపబడునో అది అన్నింటికిని కారణమైనట్టిది; మరియు యీ రూపముననే మనస్సున దానిని ధ్యానించి, ఓ అర్జునా, విజ్ఞపురుషులు వాక్కుచే కూడా దానిని ఉచ్చరింతురు. 'తత్' రూపియగు బ్రహ్మకు మన యీ కర్మలన్నియు ఫలసహితముగా అర్పితమగుగాక. మరియు మనము భోగించుటకు

వీటిలో ఏమాత్రమూ మిగిలియుండ కుండుగాక-యని వారందురు. ఈ రీతిని 'తత్' రూపియగు బ్రహ్మకు తమ సమస్తకర్మలను సమర్పించి వారు 'న మమ' అని చెప్పి తమ్ముతామే సమస్త కర్మఫలములనుండి వేరుచేసి కొందురు. అటుపిమ్మట, ఓంకారముచే ఆరంభింపబడి, తత్కారణముచే బ్రహ్మార్పణ మొనర్పబడిన కర్మ లీరీతిని బ్రహ్మరూపమును పొందును. కేవల మది బయటకు చూచుటకు మాత్రము, కర్మలుగా కాన్పించును. కాని, కర్తకు కలిగియుండెడి కర్తృత్వాభిమానమువలన ఏర్పడియుండెడి ద్వైత భావము వలా బాహ్యకర్మను బ్రహ్మార్పణ మొనర్చినప్పటికికూడా అది బ్రహ్మరూపమును పొందదు. ఎటులనిన, ఉప్పు నీటిలో కరిగిపోయినప్పటి కిని, దానికి గల ఉప్పదనము మాత్రము మిగిలియే యుండును. సరిగా యిదే విధమున, 'మనము మన కర్మలను బ్రహ్మార్పణ మొనర్చితి' మనెడి ద్వైత భావము కర్తలో నిలచియే యుండును. ఈ ద్వైతభావము వున్నంతవరకు సంసారభయము పోదు. పరమేశ్వరుని ముఖముగా చెప్పబడిన వేదము లీసంగతిని బిగ్గరగా అరచి అరచి చెప్పచున్నవి. కావున, కర్తృత్వాభిమానము వలన బ్రహ్మము తనకు భిన్నమైనవాడు అనగా తాను వేరు, బ్రహ్మము వేరు, అని కలిగెడి భావముపై ఆత్మత్వము (అనగా తన స్వరూపమే) యనెడి ప్రత్యయము కలుగుటకొరకే 'సత్' శబ్దము ఏర్పడినది. ఓంకారము మరియు తత్కారముద్వారా బ్రహ్మస్వరూపముగా నొనర్పబడిన కర్మలు 'ప్రశస్తాది' శబ్దములచే వర్ణింపబడి - ప్రశస్తములుగా చెప్పబడినవి. ఆ ప్రశస్తకర్మలకే 'సత్' శబ్దము చేర్చబడును. ఇక అట్టి 'సత్' శబ్దము యొక్క ఆశయమును విపులీకరించి చెప్పెదను వినుము.

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥ ౨౬

"ఈ సత్ శబ్దమువల్ల అసత్ అనగా అజ్ఞానజన్య నామరూపాత్మక విశ్వముయొక్క ముద్ర నశించును. మరియు సత్ తత్త్వరూపియగు సువర్ణము

యొక్క వాస్తవికము మరియు నిర్దోషము నగు రూపము వ్యక్తమగును. ఈ 'సత్' ఎన్నడును కాలము మరియు స్థలపరిభావమువలన మార్పుచెందదు. మరియు ఎల్లప్పుడు తన ఆత్మస్వరూపమునందే విలాసమొనర్చుచూ వుండును. ఈ నామరూపాత్మకమగు దృశ్యజగత్తంతయూ అనిత్యము. మరియు, ఇందు వల్ల అది 'సత్'లోనికి రాజాలదు; మరియు, కేవలము ఆత్మస్వరూప ప్రాప్తివల్లమాత్రమే ఆ సత్ తత్త్వజ్ఞానము కలుగును. ఆ సత్ తత్త్వమువల్లనే యింతకు పూర్వము ప్రశస్తములుగానైన కర్మలన్నియూ ఐక్యజ్ఞానమువలన సమరూపమును పొందును, మరియు అంతట, ఆత్మస్వరూపుడగు బ్రహ్మ కాన్పించసాగును. ఇందుచే, ఓంకారము మరియు తత్కారము వలన బ్రహ్మకారమును పొందిన కర్మలన్నియూ పరిపక్వమై ఒక్కమారుగా సంపూర్ణముగ సద్రూపమును పొందును. యీ విధముగా యీ సత్ శబ్దము యొక్క అంతఃస్థమగు ఉపయోగమును నీవు జ్ఞప్తియుంచుకొనుము." ఈ రీతిని శ్రీకృష్ణభగవానులు చెప్పిరి. ఈ రీతిని భగవానునిచే చెప్పబడిన మాటలు, నాలోనుండి ఆ భగవానుడే పలికించుచున్నాడుగాని నేను మాత్రము చెప్పుటలేదు. భగవాను లిటుల చెప్పిరి— "మరియు యీ సత్ శబ్దము సాత్త్వికకర్మల నొనర్చునప్పుడు మరియొకరీతినికూడా ఉపయోగకరముగ ప్రయోగించవచ్చును. అదికూడ వినుము. లోకులెల్లరు తమతమ అధికారానుసారముగా చక్కగా సత్కర్మల నొనర్చు చుందురు. కాని, ఆకర్మలు కొన్నికారణములచేత ఏదైనఅంగము లోపించిన వైనప్పుడు 'ఏదైన అవయవము తెగుటవలనగాని బాధతో నున్నప్పుడుగానీ శరీరము సరిగా పనిచేయజాలనిరీతిని, లేదా చక్రములేనిబండి నడువజాలనిరీతిని' ఏదైన వైగుణ్యముగాని న్యూనతవలనగాని సత్ కర్మలుకూడా అసత్ కర్మలగును. అంతట, ఓంకారము మరియు తత్కారమునకు సహాయమొనర్చుటకై యీ సత్కారము వచ్చును. మరియు, యిందువలన ఆ హీనకర్మలందలి హీనత్వము తొలగిపోవును – ఆకర్మలుకూడా ఉన్నతమైనవై సర్వాంగ పూర్ణములుగా

నగును. ఈ సత్ ఆ కర్మలయొక్క అసత్త్వమును దూరమొనర్చి వాటిని
చక్కగా రూఢమొనర్చి తన సత్త్వ సామర్థ్యమువలన 'ఏదైన దివ్యౌషధి
రోగగ్రస్తమైన పురుషుని రోగమునుండి విముక్త నొనర్చు రీతిని'
లేదా బాధతో నున్న వారిని బాధారహితు నొనర్చురీతిని, హీనకర్మలను
కూడా సర్వాంగ పూర్ణముగ నొనర్చును. ఒక్కొక్కప్పుడు
ఏదైన పొరబాటువలన కొన్నికర్మలు విధి - నియమముల నుల్లంఘించి
నిషిద్ధమార్గమును పట్టును. ఏలనన నడచెడివాడే మార్గమును మర
చును. మరియు పరీక్షకునకే భ్రమ కలుగును. వ్యవహారమున ఏమేమి
జరుగుటలేదో ఎవరు చెప్పగలరు? కావుననే, యీ విధమగు అవిచారముచే
కర్మలయొక్క మర్యాద పోవును. మరియు ఆ కర్మలు దుష్కర్మల మార్గ
మును పట్టినప్పుడు, ఓ అర్జునా, యీ 'సత్' శబ్దప్రయోగమును ఓంకారము
మరియు తత్కార ప్రయోగముకంటె కూడ ఎక్కువ జాగరూకతతో
చేయుచో, యిది ఆ కర్మను నిర్మల మొనర్చును. ఇనుమునకు స్పర్శమణి
యొక్క సంపర్కము, వాగునకు గంగాసంగమము, మృతునకు అమృత వర్షము
వలె, ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా, సదోషకర్మలకు సత్ 'శబ్దప్రయోగము
కూడా కల్యాణ కారకమగును. ఈశబ్దమునం దింత మహిమ గలదు. ఈ వివ
రణమును నీవు ధ్యానమం దుంచుకొని యీ నామమును గురించి యోచించి
నప్పు డిది కేవలము పరబ్రహ్మమే నని నీకు అనుభవమగును. ఈ నామరూపా
త్మక వస్తు కోటి జనించెడి స్థానమును జీవు డీ 'ఓమ్‌తత్‌సత్' ను ఉచ్చరిం
చుట వలన చేరును. ఆ స్థానము కేవలము అఖండ శుద్ధ పరబ్రహ్మమే.
మరియు యీ నామము దానియం దుండెడి సామర్థ్యమును చూపునదియే.
కాని, ఆకాశమునకు ఆకాశమే ఆధారముగా నుండు రీతిని యీ నామము
నకు కూడా యీ నామమే అఖండాధారమై యున్నది. ఆకాశమునం దుద
యించెడి సూర్యుడు స్వయముగ తనను తానే ప్రకట మొనర్చుకొనురీతిని యీ
నామముకూడా తనబ్రహ్మస్వరూపమును తానే ప్రకట మొనర్చుకొనును.

యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే ।
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే॥ ౨౭

“కావున యీ నామము కేవలము మూడు వర్ణముల సమూహము మాత్రమే నని తలంచకుము; దీనిని ప్రత్యక్ష బ్రహ్మముగానే ఎరుంగుము. కాన ఏ ఏ కర్మల నొనర్చినప్పటికిని, అవి యజ్ఞములే యగుగాక. దానమగుగాక మరియు తపస్సు మొదలైనవి యగుగాక, అవి యథా - విధిగా జరుపబడినవే యగుగాక లేక న్యూనతను పొంది అపూర్ణమైనవే యగుగాక, స్పర్శమణిపై మచ్చు చూచినప్పుడు మంచి బంగారము మరియు కల్తీబంగారమనెడి భేదమెన్నడును వుండని రీతిని (ఏలనన, స్పర్శమణి స్పర్శయే అన్నింటిని శుద్ధబంగారముగా నొనర్చివేయును), సమస్త కర్మలూ బ్రహ్మార్పణమగుటచే బ్రహ్మరూపముగనే అయిపోవును. సముద్రమున కలసిన తరువాత నదులను వేరుపరచజాలని రీతిని, బ్రహ్మార్పణ మొనర్పబడిన కర్మలలో న్యూనత్వ-పూర్ణత్వ భేదము లెవ్వియూ నుండవు. ఈ విధముగా, ఓ నువిజ్ఞుడవగు అర్జునా, నీకు బ్రహ్మయొక్క నామమందలి సామర్థ్యమును తెలియజెప్పితిని. మరియు ఓ వీరుడవగు పార్థా, యీ నామమునందలి భిన్న భిన్న వర్ణముల ప్రయోగ విధానముకూడా నీకు సుందరమైనభావములో చెప్పితిని. ఈ విధముగా యీ నామమునం దత్యధికమగు మహిమ గలదు, మరియు యిందువలననే యిది బ్రహ్మనామమైనది. నీకు దీనియందలి రహస్యము తెలిపినదిగదా ? ఇక నేటినుంచి నీలో యీనామమునెడ శ్రద్ధ క్రమక్రమముగా వృద్ధిపొందించుకొను చుండవలసినదిగా కోరుచున్నాను. ఏలనన ఈ నామము ఉదయించినప్పుడు జన్మ - బంధనముల నామరూపములనుకూడా యిది లేకుండ చేయును. ఈ ‘ సత్ ’ శబ్దవ్యవస్థా ప్రయోగముగల కర్మ సాంగవేదానుష్ఠానముతో సమానమే యగును.

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్యనో ఇహ ॥౨౮॥

" కాని యీవ్యవస్థను విడచి, శ్రద్ధనువదలి మరియు దురాగ్రహముతో కోట్లకొలది అశ్వమేధ యజ్ఞముల నొనర్చినప్పటికిని, రత్నములతో నింపి పృథివి నంతను దానముగ నిచ్చినప్పటికిని, ఒక్క బొటనవ్రేలుపై నిలబడి సహస్రతపస్సుల నొనర్చినప్పటికిని, సముద్రములా యనిపించునంత పెద్ద చెరువులు, మరియు నూతులు మొదలగునవి త్రవ్వించినప్పటికిని-యివన్నియూ పూర్తిగా నిష్ఫలములే. రాతిపైన వర్షించినటువంటి నీరు, బూడిదలో ఇచ్చిన ఆహుతి, నీడను ఆలింగన మొనర్చుకొనుట, లేదా ఆకాశమును కొట్టినదెబ్బ - యివి వ్యర్థముగురీతిని, ఓ అర్జునా ! యీ కర్మ సమారంభము లన్నియూకూడా పూర్తిగా వ్యర్థములే యగును. గానుగలో రాళ్ళు వేసినచో దానినుండి నూనెయూ రాదు, పిండియూ రాదు. సరిగా యిదే విధమున యీ కర్మసమారంభమువలన కూడా ఏవిధమగు లాభమూ కలుగదు; పైగా దరిద్రమువచ్చి వెంటపడును. తనవద్ద కేవలము బిచ్చ మెత్తుకొనుటకై ఒక బొచ్చెను వుంచుకొని తన దేశమునసే తిరుగుగాక లేక పరదేశమున తిరుగుగాక, అట్టివానికి ఏమాత్రమూ విలువ యుండదు. మరియు ఆరీతిని ముష్టికై తిరుగువానికి ఆకలిచే చావవలసిన పరిస్థితియే సంభవించును. సరిగా యిదేవిధమున, యీ విధమగు కర్మల నాచరించుటవలన పారలౌకిక లాభము లేకపోగా, ఐహిక లాభముకూడా వుండదు. అనగా, బ్రహ్మ యొక్క నామముపట్ల శ్రద్ధలేకున్నచో, ఆ చేసెడి కర్మలు యీ లోక మందును పరలోకమందును కూడా నిరర్థకములే యగును. "పాపరూపి యగు ఏనుగును సంహరించుటలో సింహము, మరియు త్రితాపముల నెడి అంధకారమును దూరమొనర్చెడి సూర్యుడూ నైన లక్ష్మీకాంతుడగు వీర నరశ్రేష్ఠుడైన శ్రీ కృష్ణభగవాను లీ విషయములను చెప్పిరి. వెన్నెలలో స్వయముగ చంద్రుడుకూడా మరుగుబడి పోవురీతిని ఆ సమయమున అర్జునుడు

కూడా అపారమగు ఆత్మానందములో పూర్తిగా నిమగ్నుడైపోయెను. సంగ్రామముకూడా ఒక విధమగు వ్యాపారమే. దానియందు, బాణాగ్రభాగములను కొలతబద్దగా నొనర్చుకొని, దానిద్వారా మాంసము కోసివేయబడి జీవించి యున్నమనుష్యుడే కొలవబడును. ఇట్టి భయంకర ప్రసంగమునందు అర్జునునకు స్వానంద సామ్రాజ్యసుఖమును అనుభవించుట ఎటుల శోభిల్లును? కాని, వాస్తవమునకు అర్జునునితో సమమగు భాగ్య మీసంసారమున నెవరికిని లేదు. సంజయుడు ధృతరాష్ట్రునితో నిటుల చెప్పెను – "ఓ కౌరవ రాజా! తన శత్రువు (అర్జునుడు) నందలి యీ గుణమునుచూచి సత్యముగ ఆతనిపై ప్రేమపూర్ణమగు ఆదరభావమే జనించును. మరియు మనకు సుఖమం తోప్రదేశ మొనర్చుటకుగాను యీతడు మనకు గురువాయెను. ఈ అర్జునుడే గనుక ప్రశ్నించకున్నచో, భగవానులు తన హృదయమందలి రహస్యము నేల తెరచి చెప్పును? అట్టి స్థితిలో మనకుకూడా పరమార్థదర్శన మెటుల కలుగును? మనము అజ్ఞానాంధకారమున యథాప్రకారముగ జన్మము గడపుచుంటిమి; కాని, ఆయన మనను ఆత్మజ్ఞానమనెడి ప్రకాశ – మందిరములోనికి తెచ్చి చేర్చిరి. మనపై ఆత డెంత ఉపకారము నొనర్చెను? వాస్తవముగ గురుత్వసంబంధమువలన ఆతనిని శ్రీ వాసుదేవునకు సహోదరుడనియే యెరుంగవలెను. పైకి యీ రీతిని చెప్పి, ఆ తరువాత సంజయుడు తా నిటు లనుకొనెను. "నేను అర్జునునిగురించి అత్యధికముగా స్తుతించినచో ధృతరాష్ట్రుని అంతఃకరణమున కష్టముగ తోచును. కావున యింతకుమించి యింకేమియూ చెప్పకుండుటే మంచిది. ఈ విధముగా ఆలోచించి ఆతడాసమయమున మౌనము వహించెను. ఆ తరువాత అర్జునుడు శ్రీకృష్ణుని స్పష్టీకరించవలసినదిగా కోరిన ప్రసంగమును తెచ్చెను. సంజయు డారీతిని చేసిన పని నే, నే నిప్పు డొనర్తును. శ్రీ నివృత్తినాథుల శిష్యుడ నగు జ్ఞానదేవుడనైన నేను 'శ్రోతలగు మీరు శ్రద్ధాళువులై వినుడ'ని ప్రార్థించుచున్నాను.

# తెలుగు జ్ఞానేశ్వరి

## పదునెనిమిదవ అధ్యాయము

---

“ఓ నిర్దోషుడవగు పరమేశ్వరా! నేను మీకు జేజేలొనర్తును. మీరు మీభక్తులకు సర్వవిధముల కల్యాణమును కలుగజేతురు, మరియు జన్మ మరియు జరాజర రూపియగు మేఘమండలమును నాశమొనర్చెడి ప్రభంజన ప్రచండవాయువు మీరే యై యున్నారు. ఓ బలాఢ్యుడవగు దేవా, మీరు అమంగళముల నన్నింటిని నాశమొనర్తురు, మరియు వేద - శాస్త్రరూపియగు వృక్షమునందలి ఫలములనుకూడా మీరే యిత్తురు. ఓ స్వయంపూర్ణుడవగు దేవా, విరక్తుజను మీరు ప్రేమింతురు, మీరు కాలుని సామర్థ్యమునుకూడా అడ్డగింతురు, మరియు యివన్నియూ వున్నప్పటికికూడా మీరు సమస్తకళలకు అతీతులు. ఓ అటలదేవా, మీరు చంచల చిత్తములను ప్రాశనమొనర్చి బాన పొట్ట గలవారైరి.—చంచల చిత్తములను భక్షించుటచే మీపొట్ట లావెక్కినది. జగత్తును వికసింపజేసి దానియందు క్రీడించుట మీ కతిప్రియము. ఓ అక్షయదేవా, మీరు ఉత్కటానందమునకు స్ఫూర్తినిచ్చువారు. మీరు సర్వవిధములగు దోషములను నిరంతరము నాశమొనర్చుచుందురు. మీరు విశ్వమునకు మూలాధారము. ఓ స్వయంప్రకాశుడవగు దేవా! యీజగత్తనెడి మేఘమునకు ఆశ్రియమొసంగు ఆకాశము మీరే. ఏ మూలస్తంభముపై యీ విశ్వమంతయూ రచియింపబడినదో, ఆ స్తంభము కూడా మీరే. మీరు జనన - మరణ రూపియగు సంసారమును విధ్వంస మొనర్తురు. ఓ అత్యంత శుద్ధుడవగు దేవా, కేవలము అజ్ఞానమునే కాదు, జ్ఞానమనెడి ఉద్యానవనమును కూడా నాశమొనర్చెడి ఏనుగు, శమ దమములద్వారా మదనుని అభి

మానమును తెగ్రించివేయునట్టిన్నీ, మరియు దయాసాగరులు కూడా మీరే. ఓ ఏకస్వరూపదేవా, మీరు కామమనెడి సర్పముయొక్క గర్వమును దూర మొనర్చువారు. భక్తుల భక్తియనెడి మందిరమును ప్రకాశ మొనర్చు దీపము మరియు తాపమును శాంత మొనర్చువారునూ అయియున్నారు. ఓ అద్వితీయ పరమేశ్వరా, శాంతి మరియు విరక్తులు పూర్ణత్వమును చెందినవారికి మీ రత్యంత ప్రియులగుదురు. మీ భక్తులకు మీరు అంకితులగుదురు. మీరు కేవలము భక్తివల్లమాత్రమే పొందదగినవారై నప్పటికిని, మాయకు స్వరూప మగమ్యము. ఓ శ్రీ సద్గురురూప పరమేశ్వరా, మీరుఊహించుటకు కూడా వలనుపడని అద్భుతఫలము నిచ్చు కల్పవృక్షము. ఆత్మజ్ఞాన వృక్షముయొక్క బీజము మొలచెడి సారవంతమైన స్థలము మీరు. ఓ మహారాజా, మీకు నేను జేజేలు పలికెదను. కాని, మీరు, మీ విశిష్ట లక్షణములు మనస్సుచే తెలిసి కొనుటకును, మరియు వాక్కుచే ఉచ్చరించుటకును వలను పడనటువంటివారు. కావున, మిమ్ము నుద్దేశించి అనేకవిధములగు శబ్దములను యోచించి మీస్తోత్ర ముల నెంతవరకు రచించను! మీ విశేషలక్షణములను చెప్పుటకై ప్రయో గింపబడిన విశేషణములనుగురించి చెప్పవలెనన్న, అవియన్నియూ మీ వాస్త విక స్వరూపమును బోధించజాలవు. అందుచే నేను కేవలము లజ్జితుడ నగు చున్నాను. సాగరమెల్లప్పుడును తనమర్యాదకు లోబడియుండును. కాని, యీ నియమము చంద్రోదయ మగునంతవరకే చెల్లును. సోమకాంతమణి స్వయముగా తన అవయవమునందలి ఆర్ద్రత్వముచే చంద్రునికి ఒక్కొక్క ప్పుడు అర్ఘ్యప్రదాన మొనర్పదు. కాని స్వయముగ చంద్రుడే దానిచే అకృత్యము చేయించును. వసంతాగమనమైనపిమ్మట వృక్షము లన్నింటను నూతనపత్రములు, మరియు క్రొత్త చిగురుటాకులు వెడలును. కాని, స్వయ ముగా ఆచెట్లకు తమయం దీక్రొత్తఆకులు, చిగుళ్ళు ఎటుల వచ్చినవో తెలియదు. సూర్యకిరణములు తగులుటతోడనే కమలినియొక్క సంకో

చము నామ మాత్రమునకైనా మిగిలియుండదు. మరియు జల సంయోగము కలుగుటతోడనే ఉప్పు తన శరీరస్మృతినే మరచిపోవును. సరిగా యిదేరీతిని, ఓ గురుమహారాజా! మిమ్ము స్మరించుటతోడనే నన్ను నేనే మరచిపోదును. పొట్టనిండా భుజించి తృప్తిపొందిన పురుషుడు బాగా త్రేన్పసాగును. సరిగ ఆ పురుషుని అవస్థవలెనే, ఓ గురుమహారాజా! మీరు నా విషయములోకూడ చేసితిరి. నా అహంభావమునకు మీరు దేశాంతరశిక్ష విధించితిరా యనిపించును. మరియు, నా వాక్కుపైన 'మిమ్ము స్తుతించ మొదలిడునట్టి' వెర్రితనమును ఆరోపింపజేసితిరి. కాని, నా శరీరస్పృహ వుంచుకొని మిమ్ము స్తుతించినప్పటికి కూడా గుణము మరియు గుణి – యీ రెంటియందును భేదభావము నొనర్చవలసిరాక వచ్చుచున్నది. కాని, మీరో ఏకజాతులు, మరియు ఒకే బ్రహ్మానంద స్వరూప మూర్తులున్నూ అయి యున్నారు. గుణము మరియు గుణి – యీ రెంటియందును వుండెడి భేదమును పోలిన భేదము మీయందెటుల కలుగ గలదు? పోనీ, యీ విధమగు భేదభావము నొనర్చుట యిష్టమగునా? ముత్యమును బద్దలుకొట్టి దానిని మరల అతికించుట శ్రేష్ఠమా? లేక దానిని అఖండముగా నుంచుట శ్రేష్ఠమా? సరిగా యిదేరీతిని, తల్లి – దండ్రుల రూపమున మిమ్ము ఊహించి స్తుతించుటకూడా యుక్తమైనదికాదు, ఏలనన, ఆ స్తుతిలో బాలకుడు లేక సంతతియనెడి ఉపాధిదోషము సంభవించును. ఓ మహారాజా! నేను మీ సేవకుడనెడి కల్పన మొనర్తమన్ననూ, మీలో ప్రభువు లేక గురుభావముకూడా తనంత తానే ఆరోపితమగును. ఇట్టి స్థితిలో యీ విధమగు ఉపాధులతోకూడియున్న దూషితమగు వర్ణన మొనర్చుటలో అర్థమేమి యుండగలదు? మరియు యిట్టి స్తుతివలన లాభమేమి గలుగును? పోనీ, మిమ్ము ఆత్మయని యందుమనిన, మీవంటి జ్ఞానదాతను నేను నా హృదయమునుంచి తీసి బయట నుంచినటుల వుండును. కావున, ఓ గురు

దేవా, మిమ్ము స్తుతించదగిన విధానమేదియు నాకీ ప్రపంచమునకాన్పించుట లేదు. మీరు మౌనము తప్ప మరేవిధమగు అలంకారముతోనూ మిమ్ములంకరింప నివ్వరు. మిమ్ము స్తుతించుటయొక్క అర్థము మౌనముగా నుండుట, మిమ్ము పూజించుట మరియు అర్చించుట యొక్క అర్థము కర్మలులేకుండా నుండుట మరియు మీ సాన్నిధ్యమును పొందుటయొక్క అర్థము మీలో లీనమై శూన్యత్వమును పొందుటయు నై యున్నది. కావున ప్రేమ - మోహమనెడి ఉన్మాదము వ్యర్థ ప్రలాపము లొనర్చుటయనెడి నెపముతో నాచే మిమ్ము స్తుతింపజేయించుచున్నది. మరియు యిందువలన బడబడమని మీ గుణములను యిటుల వర్ణింతును. కాని ఓదేవా, మీరు కరుణామయియగు మాతృసమానులు. కావున మీరు ఏదో విధముగా నా యీ మాటలను సహించినచో, నాపని నెరవేరును. ఇక నావాణియొక్క వ్యాప్తిపైన గీతా రహస్యమనెడి దృఢముద్రను 'యీ సజ్జన శ్రోతలచిత్తము ప్రసన్నత నొందురీతిని' అంకిత మొనర్చుడు. ఇది విని శ్రీనివృత్తినాథు లిటులయనిరి.

"నీవు మాటిమాటికీ యీవిధముగా ఎందుకు పలుకుచుందువు ? స్పర్శమణిపై యినుమును మాటిమాటికి అరుగదీయవలెనా ? (అనగా స్పర్శమణి ఒక్కమారు స్పర్శించుటతోడనే యినుము వెంటనే బంగారమై పోవును. అంత జ్ఞానదేవుడనగు నే నిటుల జవాబిచ్చితిని—"మహారాజా, యిదే మీ ప్రసాదము లభించినది. ఇక యీ గ్రంథమునెడ దృష్టినుంచుడు. ఏది గీత యనెడి రత్నజటితమందిరమందలి అర్థము లనెడి చింతామణిచే తయారు చేయబడిన కలశమో, ఏది సమస్త గీతారహస్యమును బోధించునట్టిదో, అది యీ పదునెనిమిదవ అధ్యాయమే. వ్యవహారమున, ఏదైన దేవాలయమందలి కలశమును దూరమునుంచి చూచినచో దైవదర్శనమైనటులే భావించబడును. ఆవిషయమే దీనియెడకూడా చెల్లును; ఏలనన, యీఒక్క అధ్యాయమువల్లనే గీతారహస్యమంతయూ ధ్యానములోనికి వచ్చును. కావుననే నేను బాదరాయణుడగు వ్యాసుడుయీ గీతయనెడిమందిరముపైయీ పదునెనిమిదవ

అధ్యాయమనెడి కలశము నుంచెనని యంటిమి. అంతేగాక, యీ అధ్యాయము నందు చేసిన ముగింపును చూచినందువలన, కలశము నెక్కించిన పిమ్మట దేవాలయ నిర్మాణమునందింకేపనియూ మిగిలియుండదని నిర్ధారణ యగు చున్నది. వ్యాసదేవుడు స్వాభావికముగనే అతినిపుణుడగు సూత్రకారుడు. ఆయనయే, వేదములనెడి రత్నగిరి యందలి మధ్యభాగమున ఉపనిషత్తము లనెడి భూమిని త్రవ్వించి శుభ్రముచేసి యుంచెను. ఆ త్రవ్వుటలో ధర్మ, అర్థ కామములనెడి ఎంతో మన్ను మరియు ఎన్నో రాళ్ళు మొదలగునవి వెలువడెను; వాటితోనే ఆయన ఆ భూమికి నాల్గువైపులందును మహాభారత మనెడి ఒకపెద్దకోటను తయారు చేసెను. ఆ కోటలోనే కృష్ణార్జున సంవాద కౌశలముచే ఆత్మజ్ఞానమనెడి మైదానము చాలచక్కగా శుభ్రపరచి సుందరము మరియు స్వచ్ఛముగనొనర్చెను. సమాధానమనెడి ద్వారములను పేని, సర్వశాస్త్రా ర్థములనెడి పాకమును తయారుచేసి మోక్షరేఖయనెడి హద్దునునిర్ణయించెను. ఈరీతిని కట్టడపుపని నడచుచూ నడచుచూ పదునైదవ అధ్యాయమువరకు పదునైదు అంతస్థులు పూర్తి అయినవి మరియు ఆధ్యాత్మ మందిరమును రచియించుట సంపూర్తియైనది. అటుపిమ్మట పదునారవ అధ్యాయములో ఆమందిరముయొక్క శిఖరభాగము నిర్మింపబడెను. మరియు పదునేడవ అధ్యాయమున కలశమునకు ఆధారము అమర్చబడెను. ఆ అరుగుపైన యీ పదునెనిమిదవ అధ్యాయము కలశరూపముగా అమర్చబడినది. ఈ కలశము పైననే వ్యాసదేవుని గీతయనెడి ధ్వజమెగురుచుండును. ఇందుచే మొదటగల అధ్యాయములన్నియూ ఒకటిపైన ఒకటిగా ఎక్కుడి అంతస్థుల ఆకారము నందున్నవి. మరియు వాటి అన్నింటి పూర్తియూ ప్రస్తుత అధ్యాయమున కాన్పించుచున్నది. అయిపోయిన భవనకార్యమును గుప్తముగానుంచక కలశ మెల్లప్పుడును దానిని ప్రకటమొనర్చుచూ వుండును. సరిగా యిదేరీతిని యీ పదునెనిమిదవ అధ్యాయముకూడా గీతను ఆరంభమునుండి అంతము వరకు ప్రజ్వలితము, మరియుప్రకటమొనర్చును. ఈరీతిని శ్రీవ్యాసదేవులీగీతామందిర

మును పూర్ణత్వము వరకు చేర్చి జీవులను అనేకవిధముల సంరక్షించిరి. కొందరు జపమనెడి పేర బయటినుంచియే యీ మందిరమునకు ప్రదక్షిణ మొనర్తురు. కొందరు దీనిని వినుట పట్ల శ్రద్ధగలవారై దీని నీడలో విశ్రమింతురు. మరికొందరు ఏకాగ్రవృత్తితో దక్షిణ - తాంబూలములను పుచ్చుకొని అర్థ - జ్ఞానమనెడి గర్భ-గృహమున సహజముగనే ప్రవేశింతురు. ఈ మూడవ రకపు జీవుడు వెంటనే ఆత్మస్వరూపుడగు శ్రీ హరితో కలిసి పోవును. అయినప్పటికిని, యీ మోక్షమందిరమునం దందరూ ప్రవేశించ వచ్చును. గొప్పవారియిండ్లయందు భోజన మొనర్చుటకై పైన కూర్చొను వారికీ, మరియు క్రింద కూర్చొను వారికీ అందరికిని సమానముగనే ఆహార పదార్థములన్నియు వడ్డింపబడు రీతిని, యీగీతాపఠన మొనర్చువారికీ, శ్రవణ మొనర్చువారికీ మరియు అర్థగ్రహణ మొనర్చువారికీ-అందరికినీ సమానముగనే మోక్షము లభించును. ఈవిధముగా యీ గీత వైష్ణవభక్తులకు దేవాలయ రూపమున నున్నది; అన్ని విషయములను ధ్యానము నందుంచుకొనియే, యీ పదునెనిమిదవ అధ్యాయము దేవాలయము యొక్క ఈ జ్వల కలశము అని నేను చెప్పితిని. ఇక నాబుద్ధి ననుసరించి పదునేడవ అధ్యాయము తరువాత యీ పదునెనిమిదవ అధ్యాయ ప్రసంగ మెటుల వచ్చినదో వివరించి చెప్పెదను. గంగా యమునలు రెండింటి యందలి జలమూ జలత్వ యోచన ననుసరించి ఏకరూపమే అయినప్ప టికిని, ప్రవాహముల ననుసరించి యోచించగా అవి రెండున్నూ భిన్న భిన్నముగా కాన్పించును. లేదా స్త్రీరూపము మరియు పురుషరూపములు రెండూ వుంటూవుండి కూడా అర్థ - నారీ - నటేశ్వరమూర్తిలో ఆ రెండు రూపములూగల ఒకే శరీర మేర్పడుచున్నది. లేదా నానాడు చంద్రబింబ మును వృద్ధిపొందించెడి కళాప్రసారము జరుగుచున్నప్పటికిని చంద్రుని బింబముపైన యీ వృద్ధిపొందుచున్న కళలయొక్క లేపము భిన్న భిన్న ముగా కాన్పించనిరీతిని, భిన్నభిన్నములుగా గల నాల్గుపాదముల మూలమున-

శ్లోకములు విడివిడిగానే వుండును. మరియు అధ్యాయానుక్రమ అంకముల వలన అధ్యాయములు కూడా విడివిడిగానే కనిపించును—అయినప్పటికిని గ్రంథవిషయమును ప్రతిపాదించుటలో వేరే భిన్నస్వరూపము వుండదు—విషయప్రతిపాదనము కూడా అన్ని అధ్యాయములందును సమానముగానే వుండును. రత్నములు భిన్నభిన్నములుగా నున్నప్పటికిని వాటినన్నింటిని కలిపెడి దారము ఒకటేయైనటుల, లేదా పెక్కు ముత్యములను ఒకటిగా గ్రుచ్చినప్పుడు ఒకేమాలగా అయి అది ఒకే ఆకారముగా కాన్పించు రీతిని లేదా పుష్పములూ మరియు పుష్పములతో తయారైనమాల విడివిడిగా లెక్కింప బడజాలని రీతిని మరియు వాటి అన్నింటిసుగంధముకూడా విడదీయుటకు వీలులేకుండా ఒకటిగానే అయిపోవురీతిని,యీ శ్లోకములు మరియు అధ్యాయములకు వుండెడి సంబంధముకూడా ఆవిధముగనే విడదీయరానిది. గీతలో ఏడువందల శ్లోకములు మరియు పదునెనిమిది అధ్యాయములూ వున్నవి. కాని, శ్రీ కృష్ణభగవానులు చెప్పిన విషయముమాత్రిమొక్కటే. దానిలో ఏవిధమైన భేదములేదు. నేనుకూడా అదేమార్గమున గీతార్థమును వివరించితిని; అదేవిధముగా ప్రస్తుతము గల ప్రశ్నను కూడా నేను స్పష్టీకరింతును. మీ రందరూ వినుడు. పదునేడవ అధ్యాయమందలి చివరిశ్లోకములో భగవాను లిటుల చెప్పిరి— "ఓ అర్జునా, ఓమ్ తత్సత్' యనెడి బ్రహ్మయొక్క నామము నెడల శ్రద్ధలేకుండా చేయబడెడి కర్మలన్నియు అసత్ అనగా దుష్టము, మరియు అసత్యములుగనూ యగును. శ్రీకృష్ణుని యీమాటలను విని అర్జునుడు తన మనస్సులో శ్రీకృష్ణుని యీమాట కర్మనిష్ఠులపై దోషము నారోపించు చున్నటుల వున్నదిగా తలంచెను. కాని, కర్మల నొనర్చెడి దురదృష్టుడగు జీవుడు అజ్ఞానమువలన అంధు డగును. ఆతనికి యీశ్వరస్వరూపమును గురించియే తెలియదు. అట్టిస్థితిలో ఆతనికి 'ఓమ్ తత్సత్' యనెడి బ్రహ్మనామమును గురించిన జ్ఞానమెటుల కలుగగలదు? ఇంతేగాక, రజస్తమములు క్షయము

పొందనంత వరకు మానవుని శ్రద్ధకూడ అతి నిమ్న కోటికి చెందినదిగానే వుండును. అట్టిస్థితిలో ఆశ్రద్ధ బ్రహ్మనాళముపై నెటుల వుండగలదు? ఇట్టి స్థితిలో, ఆయుధములను ఆలింగన మొనర్చుకొనుట, దారముపై పరుగిడుట, త్రాచుపామును ఆడించుటలు ప్రాణఘాతకములు అయిన రీతిగానే యీ కర్మలన్నియూ కూడా అతివికటమైనవి, మరియు అనంతజనన-మరణములతో సమముగ భయంకర సంకటములీకర్మలం దున్నవి. దైవయోగముచే మానవునిచే సత్కార్మలు జరుపబడుచో, వాటివలన అతనియందు జ్ఞానమును సంపాదించుటకు తగిన పాత్రత వచ్చును. అటుల కానిచో, ఆకర్మలవలన అతనికి అధోగతి కలుగును. కర్మలు యథా-సాంగముగ నెరవేరుటలో అనేక పెద్ద పెద్ద చిక్కు లున్నవి. ఇట్టి స్థితిలో, కర్మనిష్ఠులకు మోక్ష మెప్పుడు లభించగలదు? కావున యీ కర్మాచరణ మనెడి బంధమును త్రెంచి వేయవలెను. కర్మల నన్నింటిని త్యజించవలెను. మరియు సర్వదోష రహితమైన ఆ సన్న్యాసమునే స్వీకరించవలెను. వేటిలో కర్మ - బాధాభయ మనెడి వార్తయే వినిపించదో, కేవలము యోగమువలన మాత్రమే వేటి యందు ఆత్మజ్ఞానము లభించునో, ఏది జ్ఞానమును ఆవాహన మొనర్చెడి మంత్రము వంటివో, ఏవి జ్ఞానమనెడి పంటను పండించెడి ఉత్తమమైన పొలముల వంటివో, లేదా ఏ విజ్ఞానమును యీడ్చుకొని వచ్చెడి త్రాడు నందలి తంతువులో, అట్టి ఆ రెండున్నూ సన్న్యాసము మరియు త్యాగములై యున్నవి. ఈ రెండింటి ఆశ్రయమును గైకొన్న పిమ్మట సంసార సంబంధము తెగిపోవును. కావున, యిప్పుడు సన్న్యాసము మరియు త్యాగములయొక్క స్వరూపమును వివరించవలసినదని భగవానుని ప్రార్థించుట యుక్తమగును" అని మనస్సున యోచించి, అర్జునుడు సన్న్యాసము మరియు త్యాగములను గురించి వాటి స్వరూపమును వివరించవలసినదిగా శ్రీకృష్ణ భగవానుని అడిగెను; దానికి జవాబుగా శ్రీకృష్ణుడు చెప్పిన వివరణమే యీ పదునెనిమిదవ అధ్యాయము. ఈవిధమగు జన్య-జనకభావమువలన ఒక అధ్యా

యము మరియొక అధ్యాయమును జన్మింపజేయును. ఇక అర్జున దేవుని అడిగినదో వినుడు. ఆ పాండుకుమారుడగు అర్జునుడు భగవానుని అంతిమవాక్కులను జ్ఞాతృత్వభావముతో వినెను. వాస్తవముగ చూచినచో, యీ పాటికి ఆతనికి తత్త్వసిద్ధాంతమును గురించిన నిశ్చిత జ్ఞానమేర్పడియున్నది. కాని భగవానుడు చెప్పదలచినదంతయూ పూర్తియై పోవుటచే, ఆతని ప్రేమ పూర్ణమగు మనస్సు దీనిని సహించలేకపోయెను. దూడయొక్క పొట్ట తల్లిపాలచే నిండిపోయినప్పటికిని ఆదూడకు తన తల్లి తనకు దూరముగా నుండకుండా వుండవలె ననెడి కోరికయే వుండును. ఏకనిష్ఠప్రేమ యీరీతిగానే వుండును. ఆ ప్రేమ ఏవిధమగు కారణము మరియు అవసరము లేకున్నప్పటికిని తెంపులేకుండా మాట్లాడుచునే వుండును. మరియు యీరీతిని ప్రేమించువానికి 'నేనొకమారు చూచిన దానినే మాటిమాటికిని చూచుచూ వుండవలెను' అనెడి కోరిక యుండును. మరియు తనకు ప్రియమగు వస్తువును ఉపభోగించునప్పుడు యీ విధముగా ఏకనిష్ఠతో ప్రేమించువానికి ఆప్రియ వస్తువుపట్ల యింకనూ అనురాగము ఏర్పడుచునే వుండును. ఇదియే యీప్రేమయొక్క లక్షణము. మరియు అర్జునుడు అట్టి ప్రేమమూర్తివంటివాడు. ఇందువల్లనే భగవానులు మౌనము వహించినప్పుడు ఆతనికి అతి కష్టము కలుగసాగెను. అద్దములో మనముఖమునే మనము చూచురీతిని అర్జునుడు సంభాషణయనెడి నెపముతో వ్యావహారికముగ ఆతనికి ప్రాప్తించుచుండని ఆవస్తు దర్శనమును అనుభవించుచుండెను. ఈ సంభాషణము ఆగిపోవుచో యీ అద్భుత సుఖానుభవముకూడా ఆగిపోవునని ఆతడు తలంచుచుండెను. అర్జునుడు యీ పరమసుఖమును యింతవరకు రుచిమరిగి అనుభవించుచుండుటచే విడువజాలక యుండెను. ఇందుచేఆతడు త్యాగము మరియు సన్యాసము లనెడి విషయమును నిమిత్తముగ చేసికొని గీతయనెడి వస్త్రపు ముడతను తిరిగి తెరపించెను. ఇది గీతయందలి పదునెనిమిదవ అధ్యాయము

గాదు, ఏకాధ్యాయము మాత్రమే గలిగిన.స్వయముగా దూడయే ఆవుపాలను పిదుకసాగి నప్పుడు దానినుండి పాలధార వచ్చుటకింత ఆలశ్య మెటులకా గలదు ? సరిగా యిదేరీతిని గీత ముగింపుకు వచ్చుటతోడనే అర్జునుడు మరల వెనుదిరిగెను. మరియు అతని యీ కృత్యము గీతను మరల పునరావృత్తి చేయించెనా యన్నటుల వున్నది. మంచితనమూ మరియునిజాయితీయూగల యజమానులు సేవకునిమాటను మన్నించి దానిననుసరించి నడచుకొందురు గదా ? ఇక అర్జునుడీరీతిని ప్రశ్నించెను— " ఓ విశ్వేశప్రభో, నాయీ ఒకప్రార్థనను దయతో వినుము.

అర్జున ఉవాచ :—

సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్యచ హృషీకేశ పృథ క్కేశి నిషూదన ॥౧॥

" ఓ దేవా, సన్న్యాసము మరియు త్యాగము అనెడి రెండు శబ్దముల నుండీ ఒకేఅర్థము వచ్చును. సంఘాతము మరియు సంఘము అనెడి రెండు శబ్దముల వలనను కేవలము సంఘాతమే సూచితమగు రీతిని నాబుద్ధిననుసరించి త్యాగము మరియు సన్న్యాసము అనెడి రెండుశబ్దముల వల్లనూ కేవలము త్యాగమే సూచిత మగుచున్నదని తోచుచున్నది. ఓదేవా, ఒకవేళ యీరెండు శబ్దములందును ఏదైన భేదమువున్నచో అనుగ్రహించి తెలియజేయవలసినదిగా నా ప్రార్థన. అంతట శ్రీకృష్ణుడీరీతిని జవాబిచ్చెను.— "అవును, యీరెండు శబ్దముల అర్థములందునూ భేదమువున్నది. అయినప్పటికిని ఓ అర్జునా, నీకీ రెండు శబ్దములున్నూ ఏకార్థమునిచ్చునటిగ తోచుననుటలో నా కేమాత్రము సంశయములేదు. ఈ రెండుశబ్దములందునూ త్యాగమే సూచింపబడిన దన్నమాట కూడా వాస్తవమే. ఇట్టి స్థితిలో యీ రెండింటి అర్థములందునూ భేదము గలుగుటకుగల కారణము,— కర్మ లను విడచుటను సన్న్యాసమందురు, కర్మఫలవాంఛ లేకుండుటను త్యాగ

మందురు. ఇక ఏయే కర్మఫలములను త్యాగమొనర్పవలెనో, ఏయే కర్మలను పూర్తిగా విడచివేయవలెనో చెప్పెదను, నీవు సావధానుడవై వినుము. అడవులందునూ పర్వతములపైననూ అసంఖ్యాకములుగా వృక్షములు తమంతతామే మొలచి పెద్దవగుచున్నవి, కాని ధాన్యపు మొక్కలు, తోటల యందుండెడి వృక్షములూ యీ విధముగా తమంత తాము ఫలించవు. దున్నకుండా, విత్తులు చల్లకుండా అనేకవిధములగు తృణములూ మరియు అడవిమొక్కలూ మొలచును, కాని విత్తులు చల్లకుండా, మొక్కలు నాటకుండానూ పొలములలో యీ రీతిని ధాన్యము పండదు. లేదా శరీరము తనంతతానే జన్మించినప్పటికిని నగలు మొదలగు అలంకారముల కొరకై పరిశ్రమ చేయవలసియే యున్నది, లేదా నది తనంతతానే లభించును, కాని నుయ్యి త్రవ్వుటకు పరిశ్రమ చేసియేతీరవలెను. సరిగా యిదే విధమున, నిత్య, నైమిత్తిక కర్మలు స్వాభావికముగానే జరుగుచుండును, కాని, మనస్సులో వాటి ఫలాశ లేకున్నచో కర్మలు కామికములు కావు (అనగా; అవి వాంఛారహితములుగా నగును, మరియు యిందువలననే అవి బంధకరములు కావు.)

శ్రీ భగవానువాచ:—

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥ 2

" కేవలము కామ్య విస్తరణ వలన మాత్రమే ఏ కర్మలు అనుష్ఠింపబడుచున్నవో, వేటియందు అశ్వమేధాది పెద్ద పెద్ద యజ్ఞ - యాగాదులు చేయబడునో, చెరువులు - నూతులు మొదలగునవి త్రవ్వించబడునో, తోటలు వేయబడునో, భూదానము మరియు గ్రామదానము లొనర్చబడునో, మరియు అనేక విధములగు వ్రతాదు లొనర్పబడునో— అనగా యీవిధముగా గల ష - కామము మరియు ఇష్ట పూర్తినొనర్పు కర్మ లొనర్చబడునో, అవి

యున్నియూ కర్తకు బంధకములేయగును. మరియు ఆ కర్తలను వాటి ఫల-
ములను అనేకముగ అనుభవింప జేయును. ఓ అర్జునా, శరీరమనెడి గ్రామము
నకు వచ్చి నివసించిన పిమ్మట జనన మరణము లనెడి జగడము అంత
మొందించుకొన వీలు లేని రీతిని, లేదా లలాటమున వ్రాయబడిన రేఖ-
తుడిచివేయుటకు వీలుగాని రీతిని, లేదా శరీరచర్మమునకు జన్మతః
సిద్ధించిన నలుపుగాని ఎరుపుగాని ఊతికి పోగొట్టుటకు వీలులేని
రీతిని, కామ్యకర్మల ఫలమును అనుభవించకుండా మనుష్యుడే విధముగను
తప్పించుకొనజాలడు. ఋణము తీర్చునంతవరకు ఋణవిముక్తి పొందుటకు
వీలులేనిరీతిని యీ విధమగు కర్మలఫలములుకూడా భోగమునకై పట్టుబట్టి
కూర్చొని, వాటిని అనుభవించునంతవరకు విడచిపెట్టవు. లేదా, ఓ అర్జునా!
ప్రత్యక్షముగా వాంఛించకుండా సహజముగనే యిట్టి కామ్యకర్మలు ఎవరి-
వల్ల ఆచరింపబడి నప్పటికినీ తెలియకుండా నోట వేసికొన్నప్పటికిని బెల్లము-
తియ్యగానే వుండురీతిని, లేదా బూడిదయనుకొని నోట వేసుకొనిన నిప్పు-
రవ్వకూడా నోరు కాలునటుల చేయురీతిని బంధకత్వముకూడా కామ్యకర్మ
అందుగల ఒక స్వాభావికమగు సామర్థ్యమైయున్నది; కావున, మోక్షమును
పొందగోరువారు ఎన్నడును వినోదమునకైన ఆకర్మలను ఆచరించరాదు.
కేవలమింతియేకాదు; ఓ అర్జునా! కామ్యకర్మలను విషసమానముగా తలంచి
దూరముగ విసరి పారవేయవలెను. ఈవిధమగు త్యాగమునే 'సన్యాస' మం
దురు." అనిచెప్పి, మరలసర్వాంతర్యామి యగు భగవానులిటుల చెప్పిరి—
"యాత్రికుడు తనవెంటధనమును గొనిపోవున్నచో, దారిలో కలిగెడిదొంగల
భయమును నాశమొనర్చుకొన గలుగును. సరిగాయిదేవిధమున, కామ్యకర్మలను
విడచిపెట్టుట—కామ్యములనుసమూలముగనాశనమొనర్చుటయేయగును. చంద్ర
సూర్యగ్రహణములు పట్టినప్పుడు ఏ కర్మలు చేయవలసియుండునో,
లేదా పితరుల శ్రాద్ధ-తిథి నాడే కర్మలు చేయబడునో, లేదా గృహమునకు
అతిథి వచ్చినప్పు డాతని ఆదర - సత్కారములకై ఏ కర్మలొనర్చబడునో

ఆ కర్మల నన్నింటిని నైమిత్తిక కర్మలుగ నెరుంగవలెను. వర్షఋతువునందు ఆకాశము మేఘములచే ఆవరింపబడి మలినముగా నుండురీతిని, లేదా వసంత ఋతువు వచ్చినపిమ్మట చెట్లు నూతనముగ చిగుర్చుటచే వనశోభ ద్విగుణీకృతమగు రీతిని, లేదా యౌవనావస్థయందు శరీరమున ఒక విశేష విధమగు మోహకత్వము ప్రవేశించురీతిని, లేదాచంద్రకిరణములవలనచంద్రముకాంతమణి ద్రవించ నారంభించురీతిని, లేదా సూర్యోదయమైన పిమ్మట కమలములు వికసించురీతిని, మరియు యీ ఉదాహరణములలో గల కారణ విశేషముచే మూలమందు గల విషయమే వృద్ధిపొంది మూలవిషయమునకు భిన్నమైన మరొక నూతన విషయము ఏదియూ జనించని రీతిని నిత్యకర్మలో ఏదైన నిమిత్తము వచ్చి చేరినప్పుడది 'నైమిత్తిక కర్మ' యనబడును. మరియు ఏకర్మలు ప్రతిదినము ప్రాతఃకాలము, మధ్యాహ్నము మరియు సాయంకాలములందు చేయవలసి యున్నవైనప్పటికిని, కన్నులందలి దృష్టి బయట నుంచి ఎచ్చటనుంచి తీసికొనివచ్చి తగిలించబడినదీ కానటుల, లేదా సంపాదించకుండానే పాదములందు నడచుటకు స్వాభావికముగనే సామర్థ్యముండు రీతిని, లేదా దీపస్వరూపమునందు తేజస్సు స్వాభావికముగనే వుండు విధమున, లేదా బయటనుంచి సుగంధము పూయకుండానే మంచిగంధమునందు దాని ఆంతరిక సుగంధమువుండు విధముగా ఏకర్మలందు స్వాభావికముగానే అధికారరూపము వుండియుండుటవలన, వేటిని చేయనిదే మనుష్యుడేవిధముగనూ విముక్తుడు కాజాలడో, ఓ అర్జునా, ఆకర్మలనే నిత్యకర్మ లందురు. ఈ విధముగా నీకు 'నిత్య', 'నైమిత్తిక' కర్మల లక్షణములను వివరించి చెప్పితిని. ఈనిత్య నైమిత్తిక కర్మ లన్నియూ ఆవశ్యకముగ చేయవలసి యుండును. యిందువలననే కొందరు వీనిని వంధ్య అనగా నిష్ఫలములని చెప్పెదరు. కాని, భోజనము చేసినందువలన ఆకలితీరి సంతృప్తి కలుగు రీతిగానే నిత్యనైమిత్తిక కర్మలవలన కూడా అన్నివైపులనుండి ఫలప్రాప్తి కలుగును. కల్తీగల బంగారము కంసాలి వాని కుంపటిలో పడి

నప్పుడు దానియందలి కల్తీ దగ్ధమైపోయి, శుద్ధబంగార మగును. సరిగా యిదే విధమున, కర్మలందు ఫలములుకూడా వుండును. కర్మాచరణము వలన దోషములన్నియూ తొలగిపోవును, మనుష్యుని అధికారము వృద్ధియగును, మరియు ఆతనికి మాటిమాటికి సద్గతి ప్రాప్తించును. నిత్యనైమిత్తిక కర్మాచరణవలన యింత గొప్పఫలములు లభించినప్పటికిని, మూలా నక్షత్రమున జన్మించిన బాలుని పరిత్యజించవలసిన విధముగా యీ ఫలములను కూడా పరిత్యజించవలెను. వసంతఋతువు వచ్చినప్పుడు ప్రతికొమ్మ కాయలతో నిండి యుండునంతవరకూ మామిడి చెట్టుకు క్రొత్త క్రొత్త చిగుళ్ళు బయలు దేరును. కాని ఆ కొమ్మలందు కాయలు కాయ నారంభించుటతోడనే అది ఆఫలములను స్పర్శించకుండానే తన వైభవమునంతను క్రిందికి పడవేయ సాగును. సరిగా యిదేవిధమున, కర్మలమర్యాదను విడచి పెట్టకుండగానే, నిత్యనైమిత్తిక కర్మలయెడ లక్ష్యము గలిగియుండవలెను. మరియు ఆ కర్మలన్నింటివల్లనూ ప్రాప్తించెడి ఫలములను వమనమువలె త్యాజ్యముగ తలంచవలెను. ఈవిధమగు కర్మఫలత్యాగమునే జ్ఞానులు 'త్యాగ' మందురు. త్యాగము మరియు సన్యాసముయొక్క రూపములిట్టివి. ఈవిధమగు సన్యాసము వలన కామ్యకర్మలు బంధములుకావు. ఇక, నిషిద్ధకర్మలు స్వాభావిక ముగనే త్యాజ్యములు. తల తెగిపోయిన తరువాత మిగతా శరీరము దానంతట అదే నేలపైన పడురీతిని యీఫల త్యాగమువలన నిత్యకర్మలుకూడా తమంతతామే నాశమొందును. పంట తయారైన పిమ్మట మొక్కలందలి ఆకులు మొదలగునవి ఎండిపోయి, ఆకులు రాలిపోవుటతోడనే పంట చేతికి వచ్చురీతిని కర్మలన్నియూ నశించుటతోటనే ఆత్మజ్ఞానము తనంతతానే వెదకుకొనుచూ జీవునివద్దకువచ్చును. ఈయుక్తి ననుసరించి త్యాగము మరియు సన్యాసములను రెంటినీ ఆచరించెడివారు, ఆత్మజ్ఞానమును సంపాదించుటకు కావలసిన సాధనమును సంపాదించినవారగుదురు. కాని, ఎవరీయుక్తిని సాధించరో మరియు ఎవరు కేవలము ఊహయందు మాత్రమే త్యాగమును ఆచరింతురో,

అట్టివారిచే నామమాత్రమునకైన త్యాగము జరుగదు. మరియు వారు నానాటికి యింకనూవలలో చిక్కుబడిపోవుచునే యుందురు. రోగచికిత్సకై గాక, పూరికే ఏదైనామందును తిన్నచో అదివిషసమానముగానే యగును. మరియు, యిందుకు విరుద్ధముగా, అన్నము తినకున్నచో ఆకలిచే మరణించుట సంభవించదా? కావుననే, త్యజించరాని వస్తువును త్యజించరాదు. త్యజించ వలసిన వస్తువును త్యజించకుండా వుండరాదు. త్యాగమునందుగల యీ గుణము లేక విశేష తపై ధ్యానముంచక చేయబడెడి త్యాగము వ్యర్థమేయగును. మరియు నిజమైన విరక్తులు నిషిద్ధకర్మలతో అన్నిప్రదేశములందును పోరాడుచునే వుండవలెను

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యమితిచాపరే ॥3॥

"అనేకమంది ఫలాశను విడువలేరు; మరియు యిందువలన వారు కర్మల నన్నింటిని బంధకరములని యందురు. ఒకానొకడు తాను స్వయముగా దిగంబరుడై నాట్యమొనర్చి లోకమునందున్న వారి నందరినీ తగువు లాడు వారిగా చెప్పెడి విధమున, లేదా ఓ అర్జునా! జిహ్వాచాపల్యము తీరని రోగి అన్ని విధములగు అన్నములనూ నిందించురీతిని, లేదా కుష్ఠురోగి తనకు స్వయముగా గల దోషయుక్తముగా నున్న శరీరముపై కోపము చెందక వానిపై వ్రాలెడి యీగలపై కోపగించుకొను రీతిని, దుర్బలులైనవారు లోభమున చిక్కుబడి ఫలత్యాగ మొనర్చు సామర్థ్యము లేని వారగుట వలన కర్మల నన్నింటిని చెడ్డవిగా చెప్పి, అందువలన పూర్తిగా కర్మల నన్నింటినీ త్యజించవలెనని నిర్ణయించుకొందురు. ఇదే విధముగా యజ్ఞయాగాది కర్మ అను తప్పక చేయవలెను. ఏలనన యివి తప్ప మరే సాధనమూ మనస్సును శుద్ధిచేయునవి లేవు- అని కొంద రందురు. మానసిక శుద్ధియనెడి మార్గమును తొందరగా ఆక్రమించుకొనవలెనన్నచో కర్మ యనెడి శస్త్రమును ప్రయో గించుటలో ఆలస్యము చేయరాదు. బంగారును శుద్ధ మొనర్పవలెనన్నచో

అగ్నిలో తప్త మొనర్చుట యనెడి కష్టమును ఓర్చుకొనుటకు సిద్ధమైయుండ వలసినరీతిని, మరియు అద్దమును స్వచ్ఛ మొనర్చుటకుగాను దానిపై ఎక్కువగా బూడిదను పూయవలసియున్న రీతిని, లేదా బట్టలను శుభ్రపరచుకొన వలెనన్నచో చాకలి బానను మురికైనదిగా అసహ్యించుకొనరానిరీతిని, కర్మ లనుకూడా అవి క్లేశకారణములనెడి కారణముచే వదలివేయరాదు. వంట చేయకుండా ఎవనికైనా ఎన్నడైనా శ్రేష్ఠమైన మరియు రుచికరమగు భోజనము లభించునా ? ఓ అర్జునా, కొందరు ఈవిధమగు మాటలనుచెప్పి కర్మాచరణమునెడ శ్రద్ధ యుంచుదురు; ఈ విధమగు అభిప్రాయభేదము వల్లనే త్యాగ విషయము సంశయమున పడిపోయినది. కావుననే, నే నీ విషయమును గురించి స్పష్టముగా వివరించిచెప్పెదను. అందువల్ల, యీ సంశయము తొలగిపోయి, యీ త్యాగమును గురించిన నిశ్చితమగు భావ మేర్పడ గలదు. ఇక దీనిని శ్రద్ధగా వినుము.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుష వ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః ॥౪॥

" ఓ అర్జునా, త్యాగము మూడువిధములు. ఈ మూడు విధములగు త్యాగముల యొక్క లక్షణములు విడివిడిగా చెప్పెదను వినుము. ఇది మూడువిధములని నేను చెప్పినప్పటికినీ, దాని సారాంశము నేనింతకుముందు చెప్పినదే. నేను సర్వజ్ఞుడను, మరియు నాబుద్ధికి నిశ్చితము మరియు అటుల ముగా తోచినతత్త్వమును ముందుగా వినుము. ఏపురుషుడు తనమోక్షమును గురించి జాగరూకుడుగను, సచేతుడుగాను వుండగోరునో, అతనిని త్యాగ రహస్యముగా తెలిపికొని, అతని ననుసరించి ఆచరించుచుండవలెను. ఇంత మాత్రము వల్లనే మోక్షము ప్రాప్తించును.

యజ్ఞదానం తపః కర్మ నత్యాజ్యం కార్యమేవతత్ ।
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం ॥ ౫

" ప్రవాసమందు ముందడుగు వేయుటను ఆపరానిరీతిని మనుష్యుడు యజ్ఞ దాన తపస్సులు మొదలగు ఆవశ్యక కర్మలను కూడా ఎన్నడును

విడువరాదు. కోల్పోయిన వస్తువు లభించువంతవరకు వెదకుచునే వుండ వలసిన రీతిని, ఆకలి పూర్తిగా తీరనంతవరకు అన్నపు పళ్ళెమును మనముందు నుంచి తీసివేయ గూడని విధమున, లేదా ఒడ్డుకు చేరనంతవరకు ఎన్నడును నావను విడువగూడని విధమున, లేదా కాయలు కాయక మునుపు అరటి చెట్టును నరికి వేయుటకు వీలులేని విధమున, లేదా పెట్టిన వస్తువు దొరకనంతవరకు దీపమును ఆర్పివేయగూడని విధముగా ఆత్మజ్ఞానమును గురించి బుద్ధికి పూర్తియగు నిశ్చయము కలుగనంతవరకు యజ్ఞదానాది ఆవశ్యకకర్మలపట్లకూడా ఉదాసీనముగా నుండుట తగదు. లోకులెల్లరు తమతమ అధికారము ననుసరించి యజ్ఞదాన తపాదుల అతి తత్పరతతో చేయవలెను. బాటను పోవునప్పుడు బాటసారి తొందరతొందరగా అడుగు లిడుచో తనగమ్యస్థానమునకు తొందరగాచేరి విశ్రమించగలడు. సరిగా యిదేవిధమున, కర్మలను చక్కగా ఆచరించుటవల్ల మనుష్యుడు సహజముగనే నిష్కాముడగును. ఔషధము పుచ్చుకొనుటలో ఎక్కువశ్రద్ధ చూపినకొలదీ రోగముకూడ తగ్గిపోవుచునే వుండును. సరిగా యిదేవిధమున యీ కర్మలన్నియూ శీఘ్రముగను మరియు తత్పరత్వము తోనూ చేయుచున్న కొలదిని రజస్తమములుకూడా సమూలముగా నాశనమై పోవును. బంగారుకు ఒకటి తరువాత ఒకటిగా క్షారపుటములు పెట్టి నప్పుడు దానిలో గల మాలిన్యము తొలగిపోయి ఆబంగారము శుద్ధమగును. ఇదేవిధముగా నిష్ఠాపూర్వకముగా ఆచరింపబడిన కర్మలు రజస్తమములను పూర్తిగాతొలగించి, శుద్ధసత్త్వమనెడి మందిరమును వ్యక్తి క్షేత్రములోనికి తీసి కొని వచ్చును. కావుననే, ఓ అర్జునా, కర్మలుకూడా సత్త్వ - శుద్ధినొసర్చు పావన తీర్థములు చేరిన పదవిని, మరియు యోగ్యతను పొందియున్నవి. తీర్థ ములవలన బాహ్యమందలి మాలిన్యముతొలగిపోవును. మరియుకర్మలు లోపల గల మాలిన్యమును కడిగివేయును. కావునకే సత్కర్మలవలననే తీర్థము లకు పావనత్వము లభించునని చెప్పబడుచున్నది. దప్పికతో నున్నవారికి

నిర్జల ప్రదేశమునందు గ్రీష్మఋతువుతో వీచెడి వడగాలియే అమృతమును వర్షింపజేసి అతనిని అమృతపానమొనర్పించు రీతిని, లేదా గ్రుడ్డివాని కనులకు సూర్యతేజము లభించినరీతిని, లేదా నదిలో మునుగుచున్న మనుష్యుని ఉద్ధరించుటకై స్వయముగా నదియే లేచి పారిపోవురీతిని, లేదా మరణించుచున్న వ్యక్తికి స్వయముగా మృత్యువే అధిక ఆయుఃప్రదానమొసంగిన రీతిని; ఓ అర్జునా, యీ కర్మలు కూడా ముముక్షువులను కర్మబంధమునుండి విడిపించును. రసాయనమును సేవించుటచే మరణించ నున్నవానిని విషమునుండి కాపాడురీతిని, ఓ అర్జునా, యీ కర్మలుకూడా తమ బంధకత్వమును నాశమొనర్చుటకై స్వయముగా తామే ముఖ్యసాధనము లగునట్టి విచిత్రలక్షణముగలవై యున్నవి. ఓ అర్జునా, ఇక నీకీ కర్మల ద్వారావే కర్మనాశన మెటుల సంభవించునో చెప్పెదను వినుము.

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్॥ ౬

"మహాయజ్ఞము మొదలగు కర్మలు పూర్తిగా సక్రమముగ చేయబడి నప్పటికి కూడా మనుష్యుడు తన మనస్సున కర్తృత్వాహంకారము జనింపనివ్వకుండా వుండవలెను. ఒకానొకనివద్ద ధనము తీసికొని అతనికి సహచరుడై యుండి తీర్థయాత్రల నొనర్చుటకై బయలుదేరు మనుష్యునకు 'నేను తీర్థయాత్రలు చేయుచున్నా' ననెడి తన గొప్పదనమును గురించిన భావము గలుగదు. ఇటులనే, సమర్థుడగు రాజుయొక్క ఆజ్ఞచే ఒంటరిగానే వెళ్లి ఎవరినైనా మరియొకరాజును పట్టుకొనిన ఆజ్ఞాకారి యగు సేవకుడైన పురుషునకు 'నేను విజేతను, నేనే యీ రాజును జయించి పట్టుకొన్నాను' అనెడి అభిమాన మెన్నడును కలుగనేరదు. ఇతరుల ఆధారముచే యీదువానికి నేనే యీదుచున్నా ననెడి అభిమానము వుండదు. సరిగా యిదే విధమున, కర్మ లొనర్చువానికి కూడా తనమనస్సులో కర్తృత్వాహం

కారమును జనింపనివ్వరాదు. మరియు సమస్త కర్మల ముద్రలనూ ముందుకు జరుపుకొనుచూ పోవలెను. మరియు ఓ అర్జునా! తాను చేసిన కర్మ ఫలముల పైపు ఎన్నడును తన మనోరథమును ప్రవృత్తము కానివ్వరాదు. ఆరంభమునవే అన్నింటి ఫలాశనూ విడచి కర్మలను ప్రారంభించవలెను. దాది పరుల బిడ్డను నిర్వికారమగు మనస్సుతో పెంచురీతిని, లేదా రావిచెట్టుకు నీళ్ళు పోయువాడు దాని ఫలాశ లేకుండా వుండురీతిని, ఫలాశ లేకుండా సర్వ కర్మల నొనర్చుచూ వుండవలెను. గొల్లకాపరి గ్రామమందలి గోవుల నన్నింటిని గుంపుగా చేర్చి మేతకై తీసికొని వెళ్ళినప్పటికిని, వాటి పాలను గురించిన ఆశ లేకుండా వుండురీతిని, యీ గొల్ల కాపరి భావమునే మానవుడు కర్మల నొనర్చునప్పుడు తన మనస్సునందుంచుకొని, ఫలాశను ఏమాత్రము కలుగనివ్వరాదు. ఈ యుక్తి ననుసరించి పురుషునిచే కర్మ లొనర్చబడినప్పుడు ఆతనికి అవశ్యముగ ఆత్మ స్వరూపము ప్రాప్తించును. కావుననే, ఫలాశ గలవాడీదేహాభిమానము విడిచి యథాస్థితముగా సమస్తకర్మలను ఆచరించవలెను; ఇదియే నే నందరకూ యిచ్చెడి సర్వోత్తమమగు సందేశము. ఎవనికి జీవబంధనముపట్ల ఏవగింపు కలుగునో, మరియు ఎవడు మోక్షమును పొందుటకై వికలుడై యుండునో, అట్టివానికి మాటి మాటికి నేను 'నా యీ మాట నెన్నడును ఉల్లంఘించరాద'ని చెప్పుచున్నాను.

నియతస్య తు సన్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః ॥౭॥

" లేదా ఒకానొకడు అంధకారముపై కోపగించుకొని స్వయముగా తన గోళ్ళతో తన కన్నులనే పొడుచుకొను రీతిని, కర్మలు బంధకరములు గాన వాటిపై కోపగించుకొని వాటిని ఆచరించుటను మానుట తామసకర్మ త్యాగమందురు. ఈపని ఎట్టిదనిన, తలనొప్పి వలన కోపముతెచ్చుకొని తనతలనే

కాను బిడ్డలకొట్టుకొనుట వంటిది. మార్గము కఠినముగా నున్నప్పుడు ఏదో విధముగా అడుగు ముందుకు సాగు ప్రయత్నము నొనర్పవలెనేగాని, దారి యందలి దోషము వలన మనపాదములనే విరుగగొట్టుకొనదగునా? ఒకానొ కడు ఆకలితో నున్నాడనుకొనుము, అతనిముందు ఏదైన సాధారణమైన అన్నమును పెట్టినప్పుడు, అది సాధారణ భోజనము, రుచికరముగా లేదని కాలదన్నినచో, చివర కాతడు ఉపవాసమే వుండవలసివచ్చును. ఇదే విధమున, భ్రమకు లోనైన తామసపురుషుడు 'కర్మలవలన కలిగెడి బంధ కత్వము కర్మలవల్లనే పోగొట్టుకొనవలెనని' తెలిసికొనడు. అందుచేత, స్వాభావికముగ ఆతని వంతుకు వచ్చిన కర్మలను విడచివేయును. కావున ఓ అర్జునా, నీ వీ విధమగు పూర్ణత్యాగము నెన్నడును స్మరించకుము.

దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశ భయాత్త్యజేత్ ।
సకృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ ౮

"ఒక్కొక్కప్పుడు 'ఫలానా కార్యము నొనర్చుటకు నేను అధికారిని, మరియు దాని నాచరించుట నాకర్తవ్యము' అని మానవుడు తెలిసికొని యున్నవాడై యుండికూడా, ఆకార్యముల నొనర్చుటలో గల కష్టమును చూచి ఆతఁడు భయపడును. ఇందుకుగల కారణము, కర్మలోగల ప్రారంభ భాగము కొంతకాలమువరకు చాలకష్టముగా తోచును. బాటను పోవునప్పుడు తనవెంట అన్నము మూటగట్టుకొని వెళ్ళుట చాల భారముగా తోచురీతిని, లేదా వేపకాయ చేదుగాను, మరియు కరక్కాయ వగరుగాను వుండురీతిని కర్మారంభము కూడా చాలకఠినముగా కనిపించును; లేదా ఆవు తలయందు ఘాతుకమొనర్చు కొమ్ము లుండును, లేదా భోజన సౌఖ్యము ననుభవించుటకు ముందు వంటచేయుట యనెడి శ్రమ పడవలసి వచ్చును. సరిగా యిదే విధమున మాటి మాటికిని కర్తవ్య కర్మలను ఆచరించుట ప్రారంభమున్న చాలా కష్టముగ కాన్పించును; అందువల్ల వీటిని ఆచరించుట కర్తకు చాల కష్టకరమగును. అయినప్పటికిని, ఆతడిది తనకు విహితకర్మలని తలంచి ఆకర్మ

లను చేయసాగును. కాని, వాటి నొనర్చుటలో ఏ స్వల్పమాత్రపు కష్టమైన కలుగగానే అతడు వెంటనే కంగారుపడి, ఆరంభించిన కార్యమును మధ్య లోనే అసంపూర్ణముగ విడిచిపెట్టును. నాకు గొప్ప అదృష్టమువల్ల యీ శరీ రమువంటి అమూల్యవస్తువు లభించినది, నేను ఎవడో కర్మదరిద్రుడగు పాపి వలె నా యీశరీరమును కర్మలు మొదలగువాని కష్టములచే ఏల కృశింపజేయను?—అని అనును. ముందు కర్మ చేసి ఆ తరువాత దాని భోగమునకై ఎదురుచూడ మని - ఎవడు చెప్పును? నేడు నాకు లభించిన సుఖములను అనుభవించి సౌఖ్యముగా వుండవలెను. ఈ రీతిని శారీరక కష్టములకు భయపడి కర్మలను విడిచివేయు పురుషుడు, ఓ అర్జునా! రాజసత్యాగి యని యెరుంగుము. వాస్తవముగ చూచినచో, యిందులో కూడా త్యాగము వున్నది. కాని దీనిలో త్యాగఫలప్రాప్తి లేదు. పొర్లి నేలపై పడిన నెయ్యి హవనకర్మగా జమ కట్టబడదు; నీటిలో మునిగి చచ్చిపోయినవానిని జలసమాధి చేసినాడని అనజాలము. అతని తప్పువలన అతనికి మరణము సంభవించినది. సరిగా యిదేరీతిని, శరీరలోభమువలన తన విహితకర్మలకు తిలాంజలి నిచ్చు పురుషునకు నిజమైన కర్మత్యాగఫలము ఎన్నడునూ లభించజాలదు. అనగా, ఓ అర్జునా! ప్రభాతసమయము నక్షత్రముల నన్నింటిని కబళించి వాటిని లోపింపజేయురీతిని, ఆత్మజ్ఞానోదయమై అజ్ఞాన సహితముగ అన్నిక్రియలను లోపింపజేసినప్పుడు మాత్రమే నిజమగు కర్మ త్యాగము సంభవించును. ఈవిధమగు కర్మత్యాగమునందు మోక్షఫలము వుండును. ఓ అర్జునా, అజ్ఞానమువలన కర్మలను త్యాగమొనర్చు పురుషునకు మోక్షఫలము లభించదు. కావుననే, రాజసత్యాగమొనర్చుట నెన్నడును నిజమైన కర్మత్యాగముగా తలంచరాదు. ఇక ఏవిధమగు త్యాగము వలన మోక్షఫలము లభించునో చెప్పెదను వినుము.

కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున !
సంగం త్యక్త్వా ఫలంచైవ స త్యాగ స్సాత్త్వికో మతః ! ౯

“తన అధికార స్వరూపానుసారము స్వాభావికముగా తన వంతుకు వచ్చుకర్మలను సాత్త్వికపురుషుడు సాంగముగను, మరియు శాస్త్రీయము

గను ఆచరించును. కానీ, యిట్టిపురుషుని మనస్సును 'నే నీ కర్మలకు కర్తను' అనెడి అహంకారభావము ఎన్నడును స్పర్శించనైన స్పర్శించదు. మరియు, దానితోపాటు అతడు ఫలాశకు కూడా తిలాంజలి నిచ్చి కూర్చుకొనును. ఓ అర్జునా, తనతల్లి తిరస్కరించుట, మరియు ఆమెనుగురించి తన మనస్సునందు కామవాసనను తెచ్చుకొనుట – యీ రెండునూ అధోపతనమునకు కారణమగును. కావున యీ రెండు భావములునూలేనివాడై, ఆ పిమ్మట తల్లిని శుద్ధమనస్సుతో సేవించవలెను. గోవుముఖము అపవిత్రముగనుండును. అంతమాత్రమున గోవునంతనూ పరిత్యజించవలెనని తలంచనగునా? మనకు అత్యధిక ప్రియమైన ఫలములకు గల బెరళ్ళు మరియు వాటియందలి గింజలూ తినదగినవికావు. కాని అంతమాత్రమున ఆ బెరళ్ళూ గింజలూ పనికిరాని వగుటమాత్రమున, ఎవడైన ఆ కాయలను పారవేయ నగునా? సరిగా యిదేవిధమున 'నేను కర్తను' అనెడి అభిమానము, మరియు కర్మ–ఫలలోభము అను నీరెండునూ కర్మలందలి బంధత్వములు: తండ్రి తన కుమార్తెపట్ల తన మనస్సున నెన్నడును విషయవాసనను జనింపనివ్వని విధమున యీపైరెండు సంగతులను మనమనస్సున జనింపనివ్వకున్నచో, యిక దౌర్భాగ్యము, మరియు స్వాభావికములగు కర్మలుకూడా మానవున కెన్నడును దుఃఖకారణములు కాజాలవు. ఈవిధమగు త్యాగమును మోక్షఫలములు కాచెడి సర్వశ్రేష్ఠవృక్షరాజముగా నేతలంచవలయును. ఇట్టిత్యాగమే ప్రపంచమున 'సాత్త్విక' నామముచే ప్రసిద్ధమై యున్నది. బీజమును కాల్చివేయుటచే వృక్షము నిర్వంశముగనై పోవురీతిని ఫలాశను విడచివేయుట వలన ఎవని కర్మబంధకత్వము నాశమైపోవునో, ఎవనియందలి రజస్తమములు రెండును 'స్పర్శమణిని స్పర్శించుటవలన యినుమునందలి అమంగళ జనకమగు కాలిమ నశించినరీతిని' నశించునో, మరియు అంతట నిర్మల సత్త్వగుణమువలన ఎవని ఆత్మజ్ఞాన నేత్రములు తెరచుకొనునో, అట్టిపురుషుని దృష్టాదుల ముందు గల యీ ప్రపంచమగు విశ్వ – భ్రమ సంధ్యాసమయ

మందలి మృగజలమువలె తనంత తానే నాశమొందును. ఇట్టి పురుషునికి ఆ భ్రమ ఆకాశము ( ఖాళీప్రదేశము ) వలె పూర్తిగా అదృశ్యమగును.

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।
త్యాగీ సత్త్వ సమావిష్టో మేధావీ ఛిన్న సంశయః ॥౧౦॥

“ కావుననే ప్రారబ్ధమువలన మనుష్యునకు ప్రాప్తించు మంచి – చెడ్డ కర్మలు, జ్ఞానులవిషయమున ఆకాశమున మేఘములు లుప్తమైపోవు రీతిని నాశమొందును. ఇంతేగాక, ఓ అర్జునా, యిట్టి పురుషునిదృష్టి ఎదుట వర్తమానకర్మలు కూడా నిర్మూలము లగును, మరియు అందువలన నాతను సుఖ–దుఃఖముల నెడి తగవులో చిక్కుకొనడు. ఇంతేగాక, అతడు కర్మలను శుభములని తలచి ఆనందముతో చేయుటగాని, పరిణామము దుఃఖకరమని తలచి వాటిని ద్వేషించుటగాని ఎన్నడును చేయడు. ఎవ్వడును స్వప్నమునందలి సుఖ–దుఃఖములనుగాని, హర్ష–శోకములనుగాని మేల్కొనిన పిమ్మట అనుభవించని రీతిని జ్ఞానియగు పురుషుడు కూడా యీ మాయా జనిత విశ్వమోహమున జరిగెడి కర్మలయొక్క యిష్టానిష్ట పరిణామముల విషయములో ఉదాసీనుడై యుండును – కావుననే, ఓ అర్జునా, ఏ త్యాగమునందు కర్మ మరియు కర్త యనెడి ద్వైతభావము లేకుండునో ఆత్యాగమునే సాత్త్వికముగా నెరుంగుము. ఓ పార్థా, ఈ విధముగా కర్మ త్యాగము చేయబడినప్పుడే వాస్తవ త్యాగమగును. అటుల కానిచో, యితర విధములగు కర్మత్యాగ మొనర్చినచో అవి యింకనూ బంధకములగునేగాని విడచిపెట్టవు.

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మ ఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే॥ ౧౧.

“ మరియు ఓ అర్జునా, శరీరధారులై యుండి కూడా కర్మలను తిరస్కరించువారిని అజ్ఞానులు మరియు మూర్ఖులుగా నెరుంగవలెను. కుండకు,

మట్టియెడల ద్వేషము కలుగుచో ఎన్నడైన దానిపని జరుగునా? నూలు పోగులను తిరస్కరించెడి వస్త్రము తన ఉనికిని తానే లేకుండా చేసికొనును గదా? ఇదేవిధమున, ఏ వస్తువుయొక్క అంగమున అగ్ని గలదో, ఆవస్తువు ఉష్ణత్వముచే దుఃఖించగలదా? దీపమెన్నడైన తన ప్రకాశమును ద్వేషించునా? ఇంగువ ఎన్నడైన తన ఉద్ధామదర్పముపట్ల దుఃఖమును పొందుచో దానికెన్నడైన సుగంధము లభించగలదా? నీరు తన పలుచదనమును విడనాడుచో అది ఎచ్చట వుండగలదు? సరిగా యిదే విధమున, శరీరభ్రాంతి వున్నంత వరకు పూర్తిగా కర్మలను త్యాగమొనర్చుట యనెడి వెర్రితనమునందేమైన అర్థముగలదా? మనము మన మస్తకముపై గంధపుబొట్టు పెట్టుకొందుము. యిందువలన మనమెప్పుడు తలచిన అప్పుడే ఆ బొట్టును తుడిచివేయగలము. కాని, మనమెప్పుడు తలచిన అప్పుడే మన మస్తకమునే చీరి ఆవల పారవేయుట గాని, మరల మనము తలచినప్పుడు దానిని తిరిగి అంటించుటగాని ఎన్నడైన సంభవమగునా? సరిగా యిదేవిధమున, మనము మన యిష్టానుసారము చేసెడి శాస్త్రోక్తకర్మలను కదాచిత్తుగ మనము వదలిన వదలవచ్చును. కాని స్వాభావికమగు శారీరకకర్మలు మనల నెటుల విడచిపోగలవు? ఇందుకు గల కారణ మేమన, శ్వాసోచ్ఛ్వాసాది క్రియలు నిద్రావస్థలో కూడా జరుగుచునేవుండును. ఈ శరీరనిమిత్తముచే కర్మ లన్నీ మనుష్యుని వెంటనంటియేయుండును. అవి బ్రతికియున్నప్పుడూ విడిచిపెట్టవు. మరణించిన పిమ్మటనూ విడచిపెట్టవు. ఈ కర్మ అనెడి వలనుండి తప్పించుకొనగలవారు కేవల మొక్క విధమైన పురుషులు మాత్రమే. వా రెవరు? వారు కర్మలొనర్చినప్పటికిని వాటి ఫలాశ యనెడి వలలో చిక్కుకొననివారే. కర్మఫలమును యీశ్వరార్పిత మొనర్చినచో యీశ్వరప్రసాదముచే అవియే జ్ఞానబోధను ఉజ్జ్వల మొనర్చును. మరియు యీ రీతిని జ్ఞానబోధ ఉజ్జ్వలమైనప్పుడు ఆత్మజ్ఞానము వలన అజ్ఞానముతోపాటుగా కర్మలు కూడా రజ్జు

సర్పభ్రాంతి వశించినరీతిని వశించుచు. ఓ అర్జునా, యీ విధముగా జరిగెడి త్యాగము మాత్రమే నిజమగు కర్మత్యాగ మగును. కావున, యిట్టి త్యాగమొనర్చినవారినే నిజమగు త్యాగులుగా నేను తలంతును. అటుల కానిచో, మూర్ఛవచ్చిన రోగికి జాగా విదిరివచ్చినదని చెప్పినరీతిని 'ఒకకర్మచే విసుగెత్తి మరొక కర్మలో చిక్కుకొనుటను విశ్రాంతి యని చెప్పినటుల - యీవిధముగా చేయుటకూడా వాస్తవమునకు కర్రదెబ్బలు తప్పించుకొనుటకుగాను, పిడిగుద్దులను సహించుటకు తయారగుట వంటిదే యగును. కాని, యీ త్రిభువనములందును కర్మఫలములను త్యాగమొనర్చి, వాటిని (ఆ కర్మలను) నాశస్థితికి తెచ్చినవానిని మాత్రమే నిజమగు త్యాగిగా నెరుంగవలెనని మరొకమారు చెప్పుచున్నాను.

అనిష్ట మిష్టం మిశ్రించ త్రివిధం కర్మణః ఫలమ్ ।
భవ త్యత్యాగినాంప్రేత్య నతు సన్యాసినాం క్వచిత్ ॥ ౧౨

"ఓ అర్జునా, వాస్తవికస్థితిననుసరించి చూచినచో కర్మ - ఫలము మూడువిధములు; కర్మ ఫలాశను విడువనివాడు కర్త ఫలమును అనుభవించి తీరవలెను. తండ్రి కుమార్తెను కనును, 'యీమె నాదికాదు' అని ఆకన్యను యితరులకు అర్పించును; యీ రీతిని తండ్రి తన జవాబుదారినుండి విముక్తుడై పోవును. కాని ఆకన్యను గ్రహించిన జామాత యీ మెవలలో చిక్కుకొనును. విషపుమొక్కలను నాటెడివారు మరియు వాటిని ఉత్పత్తిచేయువారూ నగు లోకులు ఆ మొక్కలను యితరులచే అమ్మించి, తాము స్వయముగా ధనోపార్జన మొనర్చి సుఖపూర్వకముగ జీవితము గడుపుదురు. కాని, డబ్బిచ్చి ఆ మూలికలను కొని, వాటిని సేవించు లోకులు మాత్రము తమ ప్రాణములకు ముప్పు తెచ్చుకొందురు. సరిగా యిదేవిధమున కర్త సర్వవిధములగు కర్మలూ చేసిన చేయుగాక, కాని అత డా కర్మ ఫలాశ తన మనస్సునం దుంచుకొనకున్నచో అతడు అ కర్తగానే వుండును;

ఈ రెండు విషయములను కర్మలు మార్పుచేయలేవు. బాటప్రక్కన నాటబడియున్న చెట్లయొక్క కాయలు కావలెననినవారికి మాత్రమే లభించును సరిగా యిదే విధమున, కర్మఫలములుకూడా వాటిని కావలెనన్నవారికి మాత్రమే లభించును. కాని, కర్మాచరణ మొనర్చికూడా వాటి ఫలమును గైకొననివాడు మాత్రమే యీ సంసారచక్రమున చిక్కుకొనడు; ఏలనన యీ త్రివిధముగా గల ప్రపంచమంతయూ కర్మఫలమే. దేవ, మనుష్య, స్థావరములయొక్క వేరే సంసారము. మరియు యివి మూడే కర్మఫలములందలి త్రివిధములు. ఈ కర్మఫలములు మూడు విధములుగా నుండును— అవి, ఇష్టము, అనిష్టము మరియు ఇష్టానిష్టములు. విషయములచే బుద్ధి అంకితమై జీవులు అధర్మప్రవృత్తి గలిగి దుష్ట కర్మలను చేయసాగినప్పుడు ఆ జీవులు క్రిమి-కీటకములు మరియు మృత్తిక-పాషాణము మొదలగు నీచశరీరములను పొందుదురు. దీనినే అనిష్టకర్మ ఫలమని యెరుంగవలెను. కాని స్వధర్మమును ఆచరించుచూ, తన అధికారముపై దృష్టినుంచి వేదశాస్త్రానుసారముగా పుణ్యకర్మలను ఆచరించెడి జీవులు, ఓ అర్జునా, ఇంద్రాదిదేవతల యొక్క ఉత్తమశరీరములను పొందుదురు. దీనినే కర్మలయొక్క యిష్టఫలమందురు. తీపి మరియు పుల్లని రసముల సమ్మేళనముచే ఆ రెండింటిని మించిన మరొకమూడవ విచిత్రము మరియు స్వాదిష్టము నగు రసము జనించును. మరియు యోగసాధనలో రేచక సహాయము వలననే కుంభకముకూడా జరుగును (అనగా, మానవుడు శ్వాసను బయటకు విడచివేసి నప్పుడే (రేచకము) ఆతడా శ్వాసను లోపల బంధించుటలోకూడ సామర్థ్యముగలవా డగును. (కుంభకము) ఇదేవిధముగా సత్యాసత్యములు రెండున్నూకలసి పూర్తిగా ఒక్కటి గా నైపోయినప్పుడు సత్యాసత్యములు రెంటికీ భిన్నమగు మరియొక విచిత్ర పదార్థము జనించును. ఇందువల్లనే, శుభా శుభ ఫలమిశ్రణముచే కలిగెడి కర్మఫలము వలన మనుష్య దేహము ప్రాప్తించును. దీనినే కర్మలయొక్క ఇష్టానిష్టము అనగా మిశ్రఫలముగా

నెఱుంగవలెను. ఈ త్రివిధములగు కర్మఫలములే యీ ప్రపంచమునం
దంతటను వ్యాపించియున్నవి. ఇక, ఆశకు లోనైన జీవునకీ ఫలములను
అనుభవించియే తీరవలెను. దీనినుండి తప్పించుకొనుట కాతని కే ఉపాయమూ
వుండదు. నాలుక ఊరినప్పుడు దానికి దుష్పదార్థములను తినుటచాల
యిష్టముగా వుండును; కాని, అంతమున ఆ పదార్థములను తినుటవల్లనే
మానవునకు మృత్యుముఖము లోనికి పోవలసి వచ్చుచున్నది. అడవిలో
ప్రవేశించనంతవరకు మానవునకు మోసగాండ్ర మైత్రి మంచిదిగా
కాన్పించును; వేశ్యయొక్క అవయములను స్పర్శించనంతవరకు ఆమె
చూచుటకు లావణ్యవతిగానే కాన్పించును. సరిగా యిదేవిధమున, కర్మా
చరణము వలన అంగములలో ప్రాభుత్వము సంచరించుచుండును. కాని,
అంతమున, ఆకర్మఫలములు ఒక్కమారుగా ఆక్రమించుకొని కూర్చొనును,
శక్తిశాలియగు షాహుకారు ఋణస్థుడు చెప్పిన వాయిదా ప్రకారము
అప్పును వసూలు చేసికొనుటకు ఋణగ్రస్తునివద్దకు వెళ్ళినప్పుడు, ఆ ఋణ
గ్రస్తునికి ఆ వాయిదా ప్రకారము డబ్బుయివ్వకుండా తప్పించుకొనుటకు
ఏవిధమగు ఉపాయమూ లేకుండురీతిని, మానవుడుకూడా యీ కర్మఫలముల
ననుభవింపకుండా ఏ విధముగానూ తప్పించుకొనలేడు. జొన్నకంకెనుండి
రాలి నేలపై పడిన జొన్నగింజలూ మరల ఆ జొన్నలనే పండించును,
జొన్నలనుండి జారి నేలపై పడిన గింజలూ మరల ఆజొన్నలనే పండించు
రీతిని, జీవుడు ఒకమారు ఒకఫలమును భోగించగానే దానితోపాటు అనేక
యితర కర్మ - ఫలములను కూడా జనింపజేయుచునే యుండును. నడచు
నప్పుడు ప్రతి అడుగూ వెనుక అడుగుకు ముందుగానే పడురీతిని, లేదా
నదిని దాటుటకై మనము ఏఒడ్డుకు చేరెదమో ఆ ఒడ్డును యీ ఒడ్డుఅనిన్నీ,
దానికి అవతలవైపువున్న ఒడ్డును ఆఒడ్డు అనిన్నీ అందుము, మరియు ఆఒడ్డుకు
వెళ్ళుటకై యీ ఒడ్డును దాటవలసియే యుండురీతిని, కర్మఫల భోగమునకు
కూడా అంతము వుండనే వుండదు. సాధ్యము మరియు సాధన నిమిత్తముచే

ఫలభోగము నిరంతరము విస్తరించుచునే యుండును. మరియు యీ రీతిని ఫలాశను విడువని జీవుడు సంసార చక్రమున యింకనూ చిక్కుబడి పోవును. చామంతి మొగ్గలు వికసించును, కాని ఆ వికసించుటతో పాటుగా అది ఎండిపోవుటకూడా ప్రారంభమగును. సరిగా యిదేవిధమున, కర్మకు నిమిత్తముగానగు లోకులు తమలో తాము కర్తృత్వమును ఆరోపించుకొనరు. మరియు కర్మఫలమును త్యాగమొనర్చి 'విత్తనమునకై వుంచిన ధాన్యమును యింటివాడకమునకై ఖర్చుపెట్టుటచే వ్యవసాయము పని ఆగిపోవు రీతిని' కర్మలనుకూడ అంతమొందింతురు; ఇట్టివారు సత్వశుద్ధి బలముచే గురు-కృపామృత తుషారముతో నిండియున్న ఆత్మశోధచే పరిపూర్ణులగుదురు, మరియు వారికిగల ద్వైతభావమనెడి దారిద్ర్యము నాశమొందును. అంతట జగద్భ్రమను నిమిత్తముగా నొనర్చుకొని భాసిల్లెడి త్రివిధ ఫలములూ నాశమొందును, మరియు అట్టిస్థితిలో భోక్తయూ మరియు భోగమూ కూడా లోపించును. ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా, యీ విధముగా జ్ఞాన ప్రధానమగు సన్యాసమును గైకొన్నవారు మాత్రమే వాస్తవమునకు ఫలభోగ వాసనలను అంతమొందింతురు. మరియు, యీ విధమగు సన్యాసమువలన ఆత్మస్వరూపమునందు దృష్టివిస్తృతమైనప్పుడు, యిక కర్మలు స్వతంత్రమైనవా, లేక భిన్నమైనవియా యనెడి ప్రశ్నయే ఉదయించుటకు అవకాశము వుండదు. గోడయే పడిపోయినప్పుడు దానిపైన గీయబడిన చిత్రము కూడా మట్టిగానేఅయిపోవును. రాత్రిసమాప్తమొందినప్పుడు అంధకారము నామమాత్రమునకైన వుండునా? మూలవస్తు స్వరూపమే నాశమొందినప్పుడు యిక దాని ఛాయ ఎచ్చట పడగలుగును? అదమే లేనప్పుడు మన ముఖముయొక్క ప్రతిబింబ మెట్లు, ఎచట పడగలదు? నిద్రయే లేనప్పుడు స్వప్నమెటుల జనించగలదు? ఇక స్వప్నమే లేనప్పుడిక సత్యాసత్య ప్రశ్నయే కలుగు టెటులు? సరిగా యిదేవిధమున, యీ విధమగు జ్ఞానప్రధాన సన్యాసము వలన

మూల - అవిద్యయే నాశనమైనప్పుడిక, దాని కార్యమగు కర్మ - ఫల వ్యాపార మెటుల జరగగలదు ? కావుననే, సన్యాసిపై కర్మయొక్క పరిమితి ఎన్నడును ప్రయుక్తము కానే కాజాలదు. కాని, మానవుని శరీరమున అవిద్య వున్నంతవరకు ఆత్మ కర్తృత్వాభిమానముచే శుభాశుభములగు అన్ని కర్మలను వెంటాడియే యుండును. మరియు, దృష్టిలో భేదభావమే నిలచి యున్నంతవరకు, ఓ కుంతీనందన అర్జునా, ఆత్మమరియు కర్మలందు భేదభావము నిలచియే యుండును. తూర్పుదిక్కు మరియు పడమర దిక్కులందు ఎట్లనుసు భేదభావము వుండునో, లేదా ఆకాశము మరియు మేఘము, సూర్యుడు మరియు మృగజలము, లేదా భూతలము మరియు వాయువునం దేవిధమగు భిన్నత్వము కాన్పించునో, లేదా నదిజలమునందు రాళ్ళు మరియు రాతిబండలూ మునిగి యున్నప్పటికిని ఆ రెంటియందును ఆకాశ పాతాళ ములను పోలిన భేదము వుండునట్టిని, లేదా నీటిని మసగు పరచెడి మరియు అణచి యుంచెడి నాచు నీటికి భిన్నముగా నుండు రీతిని, లేదా దీపము నుండి ఎల్లప్పుడూ ఉత్పన్నమయ్యెడి కాటుకను ఎన్నడును దీపమని యనుటకు వీలులేని రీతిని, లేదా చంద్రునిపై కాన్పించెడి మచ్చ చంద్రునితో కలసి ఎన్నడును ఏకరూపమును పొందజాలని రీతిని, లేదా దృష్టి మరియు నేత్రములయందు అపారమగు భేదము వున్నరీతిని, లేదా మార్గము మరియు మార్గస్థుడు, లేక ప్రవాహము మరియు దానియందు కొట్టుకొనిపోవు పురుషుడు లేక అద్దము మరియు దానిలో తన ముఖప్రతిబింబమును చూచెడి మనుష్యునందునూ ఎంత అధికమగు భేదము గలదో, ఓ అర్జునా ? అదేవిధమగు భేదము ఆత్మ మరియు కర్మయందుకూడా గలదు. కాని యీ భేదమెప్పుడు కాన్పించును ? యీ భిన్నత్వమును తెలసికొనుటకు అజ్ఞానము అవకాశమిచ్చినప్పుడు మాత్రమే. సరోవరము నందలి కమలములు వికసించి సూర్యుడు ఉదయించెనని సూచించును, మరియు ఆకమలములు భ్రమరములచే తమ యందలి మధువును గ్రోలనిచ్చుచున్నవి. సరిగా యిదేవిధమున, ఆత్మచే

జరిగెడి క్రియలు మరి యితరకారణముల వల్లనే మాటిమాటికి ఉత్పన్న మగుచున్నవి. దీనికిగల కారణములు ఐదు. ఈఐదింటిని వివరించెదను వినుము.

పంచైతాని మహాబాహో! కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥౧౩॥

"బహుశః నీకా అయిదు కారణములు తెలసియే యుండును. ఏలనన శాస్త్రములు ఎలుగెత్తి వాటిని వర్ణించినవి. వేదరాజుయొక్క రాజధానిలో సాంఖ్యవేదముయొక్క ప్రాసాదమున తత్త్వవివేచన యనెడి ఢంకా దెబ్బలచే యీ సూచన మొనర్పబడుచున్నది. సంసారమందలి సమస్త కర్మలు జరుగుటకు మూల హేతువులు యీ కారణములే అగును. అయినను ఆత్మతో వాటికి సంబంధము ఏర్పరచరాదు. ఓ అర్జునా, యీ రీతిని యీ అయిదు కారణములను గురించిన్ని చాటింపు చేయుటవలన, యీ ఐదున్నూ అతి ప్రసిద్ధిని పొందినవి. అందుచే యీ ఐదుకోణములను నీవుకూడా తెలసికొన్నచో నీకు కూడా మేలు కలుగునని నాతలంపు. జ్ఞాన - చింతమణి నైన నేనే నీచేతిలోనుండగా, నీవీకారణములను మరియొకరి వలన తెలిసికొనవలసిన అవశ్యక మేమిగలదు? మన ముందు అద్దమును పెట్టుకొన్నప్పుడు, నేనెటుల కనిపించుచున్నానని యితరులను అడుగనేల? నా భక్తులు ఏ హేతువుతో ఏ వైపుచూతురో, నేనుకూడా ఆవైపే ఆ హేతు రూపమును ధరించి చేరుదును. ఇట్టి భక్తవత్సలతగల ప్రభువునగు నేను నీచేతి బొమ్మగా నగుచున్నాను". ప్రేమావేశమునకు లోనై శ్రీకృష్ణభగవాను లిటుల మాట్లాడుచూ తన్నుతానే మరచిపోయెను. ఇక అర్జునుడో ఆనందసాగరమున మునిగియే పోయెను. వెన్నెల వర్షించు చున్నందువల్ల దాని మూలమున సోమకాంతమణి పర్వతము కరిగి సరోవరముగా నైపోయిన దన్నటుల సుఖము మరియు ఆత్మప్రత్యయపు మనోభావములకును మధ్యగల తెర తొలగిపోవుటవలన అర్జునుడు కేవలము సౌఖ్యమాత్రిగా నయిపోయెను. శ్రీకృష్ణుడు అన్నింటను సమర్థుడేగాన యిటిపిఠిలో తాను

పూర్వమువలె ప్రకృతిస్థుడై, సుఖసాగరమున మునుగుచున్న అర్జునుని బయటకు లాగుటకై వెంటనే ముందుకు సాగెను. ఆ సమయమున వచ్చిన పెద్దదగు సౌఖ్యతరంగము అర్జునుని పోలిన గొప్ప-గొప్ప ధీరులగు వీరులుకూడా తమబుద్ధి సహితముగ మునిగిపోవునంత గొప్పదిగా వుండెను. కాని, భగవానులు ఆ సౌఖ్యప్రవరదను కూడా అడ్డగించి యిటులచెప్ప నారంభించెను – "ఓ అర్జునా, నీవు నీ ఆత్మస్వరూపమును మరచిపోవుము" ఇది విని అర్జునుడు నిట్టూర్చి, తలవంచుకొనెను, అటుపిమ్మట ఆతడిటుల యనెను– "ఓ దేవా, మీకు ఉపకారులగు మాటలు. నేను మీ దగ్గరగానే వున్నప్పటికిని, మీకు భిన్న మనోప్రవృత్తివల్ల నేను అసంతృప్తుడుగానున్నానన్న సంగతిమీకెరిగినదే;ఇందువలన, మీతో నేను పూర్తిగా సమరసత్వమును పొందవలెనని ఉత్సహించుచున్నాను. నాకిట్టిస్థితి లభించినప్పుడు నాతో మీరు ప్రేమపూర్వకముగ వినోదము లాడకున్నచో, ఏల మాటిమాటికి నా జీవదశను నాకు జ్ఞప్తికి తెత్తురు?" అంతట శ్రీకృష్ణుడిటుల జవాబిచ్చెను– "ఓ వెర్రిఅర్జునా, నీకిప్పటికిని యీ విషయము చక్కగా బోధపడలేదా? చంద్రుడు మరియు ఆతని వెన్నెలలో ఎన్నడైన ఏ విధమగు భిన్నత్వమైన వుండునా? ఇంతేగాదు, నా మనస్సునందలి మరియొకవిషయమునుకూడా నీకుచెప్పెదను వినుము. ఈ సమరసత్వమును నీకు చూపుటలోను మరియు దానిని నీ అనుభవములోనికి తెచ్చుటలోనూ నాకు నిజముగా అతి భయము కలుగుచున్నది. మరియు నీవు కలహించినప్పుడు నీ కలహమును నేను ఓర్చుకొనుటకు గల కారణము కూడా నీ పట్ల నా మనమున గల అత్యధిక మగు ప్రేమయే. మనలో మనకు ఒకరి పట్ల మరొకరికి ప్రేమలక్షణములు నిలచియున్నంతవరకు మన యిరువురియొక్క వ్యక్తిభేదముకూడా తప్పక నిలచియే యుండును. కావున నే, యిక యీ విషయమును గురించి అధికముగ చర్చించ నక్కరలేదు. ఓ అర్జునా! ఆత్మకు కర్మ లెటుల భిన్నముగా నుండునో చెప్పెదను వినుము. ఇంతలో అర్జునుడు మరల యిటుల యనెను. "ఓ మహారాజా!

నా మనస్సున యీ సమయమున జనించుచున్న ప్రశ్నను గురించిన ప్రస్తావనను మీరే తీసికొనివచ్చి నాకు చాలా మేలుచేసిరి. సమస్త కర్మలకును మూలబీజమైన కారణ - పంచకమును గురించి వివరించి చెప్పెదనని మీరే నాకు వాగ్దాన మొనర్చితిరి గదా? అంతేగాక, ఆత్మకు యీ కర్మలతో ఏవిధమగు సంబంధమూ కూడా లేదని మీరే సెలవిచ్చి యున్నారు. ఇక యీ విషయమును గురించి వివరించి చెప్పుటమాత్రమే మిగిలియున్నది." ఇది విని, విశ్వాధిపతి యగు శ్రీకృష్ణు డత్యధిక సంతసముతో నిట్టు లనెను. "నీవలె యిట్టిప్రశ్నలకు జవాబులు వినునంతటి శ్రద్ధ, పట్టుదలలుగల శ్రోత లెచట లభింతురు? కావుననే, ఓ అర్జునా! నేను నీకు చెప్పెదననిన సంగతుల నన్నింటిని యిక చెప్పెదను వినుము. వీటన్నిటివలనను నీపై అంతకుపూర్వముకల ప్రేమ భారము మరియింకను వృద్ధియైనది". అంతట అర్జునుడిటుల యనెను "ఓ దేవా, మీరు మొదటచెప్పిన విషయమును మరచినటుల తోచుచున్నది. ఈప్రేమ కొరకే మీరు 'నేను' 'నీవు' యనెడి వ్యక్తిభావము నుంచు చున్నారు." అంత శ్రీకృష్ణు లిటులనిరి "అటులనా? అయినచో సావధానుడవై వినుము. ఈ కర్మలన్నియూ ఆ ఐదు కారణముల వల్లనే జరుగుచున్నవి, మరియు ఆత్మకు యీ కర్మలలో దేనితోనూ సంబంధము లేదు. యీ అయిదు కారణముల కలయికవల్లనూ కర్మకు యేర్పడెడి ఆకారణముకు గల హేతువులు కూడా అయినవే. వీటి అన్నింటికిని భిన్నముగా వుండెడి ఆత్మ కేవలము తటస్థుడుగా వుండును, ఆతడు హేతువూ కాదు. నిమిత్త కారణమూకాదు, అంతేగాక ఆతడు కర్మలు సిద్ధించుటకై స్వయముగా ఏప్రయత్నమునూ చెయ్యడు. ఆకాశమున రాత్రింబవళ్ళు సంభవించు రీతిగానే ఆత్మలో కూడా శుభాశుభకర్మలు సంభవించుచుండును.జలము, తేజము మరియు పొగ - యివి వాయువుతో కలిసినప్పుడు ఆకాశమున మేఘములుజనించును, కానిఆకాశమునకువీటినిగురించిన ఎరుకయే యుండదు. కొయ్యచే నావ తయారగును. దానినినావికులు నీటిలో నడుపు

దురు, మరియు గాలి ఆనావను నడపించును; కాని, జలము కేవలము తట స్థము గా సాక్షిరూపమునం దుండును. మట్టిని ఎచ్చటినుంచియో మోసికొని వత్తును, మరియు ఆ మట్టిపుండలతో పాత్రలు తయారగును. దండము యొక్క సహాయముచే కుమ్మరిసారిపై ఆ పాత్రలు త్రిప్పబడును, మరియు వాటితోపాటు సారె కూడా తిరుగుచునే యుండును. కాని దీనికంతకును కర్తృత్వము కుమ్మరివానియం దుండును. వీటి అన్నిటికిని పృథివియొక్క ఆధారము తప్పక లభించును. కాని యీ అధారమును మించి పృథివికి మరింకేమైనా వ్యాయమగునా? వీటి అన్నింటిని నీవే యోచించుము. ఇప్పుడు మరియొక ఉదాహరణము నిత్తును. లోకులు సూర్యప్రకాశమునందు అనేక ములగు పని – పాటులు చేసికొనుచుందురు. కాని, ఆపని – పాటులతో సూర్యున కేవిధమైన సంబంధమైన పుండునా? సరిగా యిదే రీతిని, అయిదు హేతువులు కలిపినప్పుడు ఆ ఐదు కారణముల వల్లను కర్మయనెడి తీగె ఏర్పడును–కాని ఆత్మ వీటి అన్నింటికిని ఎల్లప్పుడు భిన్నముగానే వుండును.

అధిష్ఠానం తథాకర్తా కరణంచ పృథగ్విధమ్
వివిధాశ్చ పృథక్చేష్టా దైవంచైవాఽత్ర పంచమమ్ ॥౧౪

"ఇక నీ కా అయిదు కారణములయొక్క లక్షణములను విడివిడిగా వివరించి చెప్పెదను వినుము. భిన్నభిన్న ముత్యములను విడివిడిగా పరీక్షించి గైకొను రీతిని, కర్మలకు గల అయిదు కారణములను కూడా వాటికిగల భిన్న భిన్న లక్షణ సహితముగా వినుము. ఈ ఐదింటియందును 'దేహము' మొదటి కారణము. దీనిని 'అధిష్ఠాన కారణ' మందురు; ఏలనన, యీ దేహమున భోక్త తనభోగ్యవిషయములతో కూడి నివసించును. ఇంద్రియములు రాత్రిం– బవళ్ళు కష్టించుచుండును. మరియు వాటిద్వారా ప్రకృతి బలముచే లక్ష్య చెడి సుఖ–దుఃఖములను అనుభవించుటకై పురుషునివద్ద యీ దేహము తప్ప మరెస్థానమున్నూ వుండదు; మరియు, యిందువలన, యీ దేహమును 'అధి ష్ఠాన' మందురు. ఈ శరీరము యిరువదినాల్గు తత్త్వములు ఒక్కటిగా కలపి

యుండెడి నివాసగృహము. బంధము మరియు మోక్షము లనెడి జంజాట మునకు పరిష్కారము కూడా యిచ్చటనే జరుగును. జాగ్రత్, స్వప్న, సుషుప్తు లనెడి త్రివిధావస్థలకు కూడా యిదియే ఆధార స్థలము; కావుననే ఓ అర్జునా! యీ దేహమును 'అధిష్ఠాన' మందురు. కర్మకు గల రెండవ కారణము 'కర్త' ఈ కర్తనే చైతన్యమునకు ప్రతిబింబ మందురు. ఆకాశమే జలమును వర్షింప జేయును. మరియు ఆ జలమువల్ల భూమిపైన చెరువులు మొదలగునవి ఏర్పడును: మరల అదే చెరువులో ఆకాశము ప్రతిబింబించుచున్నది. లేదా, ఒక్కొక్కప్పుడు నిద్రలో రాజు తనను తానే మరచిపోవును. అప్పు డాతడు స్వప్నములో 'తాను దరిద్రుడనైపోతి' నని అనుభవించసాగును. సరిగా యిదే విధమున, చైతన్యమునకు కూడా ఆశ స్వరూపము మరపుకు వచ్చును. అందువల్ల అతని కప్పుడు దేహాభాస జనించును. అటుపిమ్మట, చైతన్యము దేహాభిమానమువలన అనేక విధములుగా అభినయించును. మరియు దేనికి ఆత్మ-స్వరూపమున గురించిన మరుపుకలుగుట వలన జీవు డనెడి పేరువచ్చినదో, మరియు అన్ని విషయములందును దేహముతోపాటుగా వుండవలెనని ఎవడు ప్రతిజ్ఞ చేసినవాడై యుండునో, మరియు ఎవడు భ్రమపడి ప్రకృతివల్ల జరుగుచున్న కర్మల నన్నింటిని నేనే చేయుచున్నానని' అను చుండునో, అట్టి జీవాత్మనే నే నీ ప్రకరణమునందు 'కర్త'యని చెప్పితిని. ఏకస్వరూపముగా వుండెడి దృష్టి కనుబొమలపైనుండెడి వెండ్రుకల వలన అరుగువలె అంతటను పగిలియుండి కాన్పించు రీతిని, లేదా మూలమున యింటిలో వెలిగెడి ఒకే దీపప్రకాశము బయటనుంచి భిన్నభిన్నమగు కిటికీల గుండా చూచినప్పుడు భిన్నభిన్నముగా కాన్పించు రీతిని; లేదా ఒకే మనుష్యుడు శృంగారాది నవరసములతోను క్రమ క్రమముగ ఉల్లాసము పొందినవాడైనప్పుడు వృత్తి భేదముచే నవవిధములుగా భావిల్లురీతిని. బుద్ధికి గల జ్ఞానశక్తి ఏకస్వరూపముగ అదే యైనప్పటికిని అది చెవులు మరియు కనులు

మొదలగు బాహ్యేంద్రియములద్వారా భిన్నభిన్న రూపములుగా ప్రకట
మగును. దీనినే 'పృథగ్విధకరణ' మందురు. ఓ అర్జునా ? ఇది కర్మలకుగల
మూడవ కారణము. తూర్పుదిక్కు మరియు పడమటి దిక్కులనుంచి
ప్రవహించు ప్రవాహములు సమ్మేళనమును పొందినప్పుడు ఒకే నీరు భిన్న
భిన్న నదీ - నదరూపములచే భాసిల్లురీతిని, వాయువునందుగల అఖండ ఏక
స్వరూప క్రియాశక్తికూడా భిన్న భిన్నస్థానములందు ప్రాప్తించుటవలన భిన్న
భిన్న స్వరూపములు గలదిగాతోచును. ఆశక్తి వాక్కులోనికివచ్చినప్పుడు మను
ష్యుడుమాట్లాడ సాగును. చేతిలోనికివచ్చినప్పుడు యిచ్చుట-పుచ్చుకొనుటల
నొనర్చును. పాదములలోనికివచ్చినప్పుడునడువసాగును. గుదద్వారములోనికి
వచ్చినప్పుడు మల విమోచన మొనర్ప సాగును. మరల ఆవాయువే నాభి
నుండి హృదయమువరకు ఓంకారమును ప్రకట మొనర్పసాగినప్పుడు దానిని
'ప్రాణవాయువు' అందురు. ఆ శక్తియే పైనున్న భాగమున ప్రవేశింపసాగి
నప్పుడు దానిని 'ఉదానవాయువు' అందురు. ఆ శక్తియే అధోద్వారమునుండి
ప్రవహింపసాగినప్పుడు దానిని 'అపానవాయువు' అందురు. మరియు అది
శరీరమందంతటను వ్యాపించి యున్నప్పుడు దానిని 'వ్యానవాయువు' అందురు.
మనము భుజించిన అన్నరసమును యీ శక్తియే శరీరమందలి భిన్నభిన్న భాగ
ములకు చేర్చును. మరియు శరీరమందలి మూల - మూలలలో నిరంతరమిది
వ్యాపించియుండును. ఈ రీతిని నలువైపులను తిరిగి ఆ క్రియాశక్తి అంతమున
నాభికమలమున స్థిరపడియుండును. మరియు ఆ సమయమున దానిని
'సమానవాయువు' అందురు. ఆవలింత, తుమ్ము, తేన్పు మొదలగు
రూపములలో జరుగుచుండు వాయుక్రియల నామములు నాగము, కూర్మము
మరియు కృకరము మొదలగునవై యున్నవి. ఈ రీతిని ఓ వీరశ్రేష్ఠుడవగు
అర్జునా ! వాయువు చేసెడి క్రియ లన్నియూ ఏకరూపమైనవే అయినప్పటి
కిని వాటి రీతి - భేదముల ననుసరించి వాటికి వివిధనామము లేర్పడినవి.
మరియు యీ భిన్నభిన్న రీతులచే భిన్నరూపములుగా జరుగుచుండెడి

వాయుశక్తి కర్మలు జరుగుటకు నాల్గవ కారణము. ఆరు ఋతువు లందును శరదృతువు అన్నింటికంటె ఉత్తమమైనది. మరియు ఆ శరదృతువు నందలి చంద్రుడింకనూ అత్యధిక మనోహరముగా నుండును. మరియు అందునను పున్నమనాటి చంద్రుని స్థితిని గురించి అడుగవలయునా! ఇదే విధమున వసంతఋతువులో తోటలు అత్యధికశోభగలవై యుండును. ఇట్టి తోటలో ప్రియజనుల సాంగత్యము లభించుచో దాని మాధుర్య మింకనూ అధికమగును. ఇట్టి సాంగత్యమునందు ఉత్తమము మరియు ప్రేమ పూర్ణమూ నగు ఉపచారకులుకూడా లభించుచో, యిక ఆ సుఖము అంతేవుండదు. లేదా ఓ అర్జునా, అసలే కమలము, అందుపై అది పూర్తిగా వికసించినది. మరియు అందుమీద సుగంధిత పరాగరేణువులు విపులముగా నున్నవి. మరియు, యీ రీతిని అచ్చట త్రివేణీసంగమము ఏర్పడినదా యన్న టుల వున్నప్పుడు, దాని శోభకు ఏ కొరంత కలుగగలదు? అసలే మధుర మగు వాక్కు, దానికితోడు కవిత్వ సంయోగము, మరియు ఆ కవిత్వమునకు రసికత్వము ప్రాప్తించినది. మరియు ఆ రసికత్వమునందు కూడా పరమార్థ తత్వాలాలసత్వముకూడా వుండి, యీవిధమగు సాటిలేని సంయోగము తటస్థించుచో ఎంతఉత్తమముగా వుండును! సరిగా యిదేవిధమున, అంతఃకరణ మందలి సమస్తవృత్తులందునూ ఒక్క బుద్ధియే సర్వశ్రేష్ఠమైనది. మరియు యింద్రియముల ఆవేశముచే అది యింకనూ అధిక తేజస్వియగును. మరియు ఆ యింద్రియావేశమునందు వాటి అధిదేవత మండల మింకనూ అత్యధిక శోభాదాయకముగ నగును. నేత్రాదిదశేంద్రియములకును వెనుక, వాటికి తమకృపచే బలమును ప్రసాదించెడి సూర్యుడు మొదలుగాగల దేవతామండలము వుండును. ఓ అర్జునా ? యీ దేవతా మండలముచే కర్మలు జరుగుటకు అయిదవ కారణముగా నెరుంగుము "అర్జునునితో శ్రీకృష్ణు డీవిషయములను చెప్పి, మరల యిటులఅనిరి." నీకు సులభముగా తెలియు రీతిని యీకర్మలన్నింటికిని గల మూలకారణములను గురించి వివరముగా చెప్పితిని, ఇక యీమూల

కారణములే విస్తరింపబడి, కర్మలు అపారముగ విస్తరించుటకు అవకాశ మిచ్చును. ఇటుల జరుగుటకుగల ఐదు హేతువులను గురించియూ, యికనీకు విస్తరించి చెప్పెదను వినుము.

శరీర వాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః ।
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ౧౫

వసంతాగమనము పూర్తిగా సంభవించినప్పుడు అది నూతన పల్లవముల ఉత్పత్తికి హేతువగును. అటుపిమ్మట ఆ పల్లవములే పుష్ప గుచ్ఛములను జనింపజేయును, మరియు ఆ పుష్పములనుండియే అటుపిమ్మట కాయలు బయలు వెడలును. ఇదే వర్షఋతువు వచ్చినప్పుడు అది తన వెంట పెక్కు మేఘములను గొనివచ్చును. ఆ మేఘములవలన వర్షము కురియును. ఆ వర్షమువలన యథేచ్ఛగ పంటలు పండును. తూర్పుదిక్కు అరుణుని జనింపజేయును. ఆ అరుణుడు సూర్యుని ఉదయింపజేయును, ఆ సూర్యుని మూలమున పగలు వచ్చును. సరిగా యిదేవిధమున, ఓ అర్జునా! మనస్సుకూడా కర్మలను సంకల్పించుటకు హేతువై యున్నది. ఈ సంకల్పములవల్లనే వాణి యనెడి దీపము ప్రజ్వలిత మగును. మరియు అంతట ఆ దీపము సమస్త కర్మసముదాయములయొక్క మార్గమును ఉజ్జ్వల మొనర్చినప్పుడు కర్త కర్మ లొనర్చుట కుద్యమించసాగును. ఈప్రయత్నము లందే శరీరాది సముదాయము శరీరాదులకు హేతువులుగా నగును. ఇనుప వస్తువులను తయారుచేసెడి పను లన్నియు లోహద్రవ్యమువల్లనే అగు రీతిని, మరియు (వస్త్రములు) నేత నేయునప్పుడు దారములతో అల్లబడిన పడుగు పేకల మూలముననే ఆ తంతుసముదాయముచే వస్త్రములు తయారగు రీతిని, మనస్సు, వాక్కు మరియు శరీరము (త్రికరణములు) లద్వారా ఏయే కర్మలు ఆచరింపబడునో, ఆకర్మలే మన, వాక్కు మరియు శరీరములకు హేతువులుగా నగును. రత్నములవల్లనే రత్నములు కూర్పబడిన నగలు తయారగును. ఈఉపమానమే యిచ్చటకూడా చెల్లును. ఎవరైన నిన్ను

శరీరాదులే కారణము లైనప్పుడు, ఆ శరీరాదులే హేతువులుగా ఎటులగునని ప్రశ్నించుచో, వారి కీరీతిని సమాధాన మివ్వవచ్చును. సూర్యప్రకాశమునకు హేతువూ సూర్యుడే, కారణమూ సూర్యుడే, లేదా చెరుకుయొక్క కాండము చెరుకు వృద్ధియగుటకు హేతువుగానూ యగును. మరియుకారణము కూడా యగును, లేదా వాగ్దేవతను స్తుతించవలె నన్నచో వాణినే ఆ పని కొనర్చునటుల చేయవలెను, లేదా వేదముల మహత్త్వమును స్వయముగా వేదములే గాన మొనర్చగలుగు రీతిని, మనము 'శరీరాదులే కర్మలకు కారణ మని' నిస్సందేహముగా తెలసి యున్నప్పటికిని, 'అవియే (శరీరాదులే) ఆకర్మలకు హేతువులుంకూడా అగుననుటలో' ఏ మాత్రము అసత్యము లేదు. మరియు శరీరాది కారణములకు శరీరాది హేతువులతో కలయిక సంభవించినప్పుడు సృష్టి యయ్యెడి కర్మసముదాయము శాస్త్రోక్త మార్గమున జరుగుచున్నచో ఆ కర్మలన్నియూ న్యాయసంగతము లగును; మరియు ఆకర్మలే న్యాయ హేతువులుగా కూడా నగును. వర్షఋతువునందు వర్షము కురిసి స్వాభావికముగా ధాన్యపు పొలములపైపై ప్రవహించును, మరియు ఆ పొలములను పూర్తిగా నింపును. కాని, అందువల్ల ఎంత ఎక్కువ ఉపయోగముండును! లేదా వదరబోతు కోపముచే అనాలోచితముగా యింటినుండి బయటకు వెళ్ళిపోయి, తెలియకుండానే ద్వారకానగర మార్గమును పట్టుచో, అతనికి అపని కష్టకరమైనప్పటికిని అతని ఆ నడచెడిపాదములు ముందుకు సాగుట ఎన్నడును నిష్ఫలముకాని రీతిని, హేతువు మరియుకారణములయొక్క సంయోగముచే జనించెడి కర్మలు పూర్తిగా గ్రుడ్డివిగా నుండును. అయినప్పటికిని, ఆ కర్మలకు శాస్త్రమనెడి నేత్రములు లభించినచో వాటిని న్యాయసంగతమైన కర్మలనియే చెప్పవలయును. అటుల కానిచో, పాలను వడ్డించు నప్పుడది పాత్రలో పడకున్నచో, అవలనే పడిపోవును. పాలు ఆ విధముగా బయటపడుట హాని వ్యయమే యగును. కాని దానిని యోగ్యమైన ఖర్చు అని తో

ఫలము. ఇదే విధమున శాస్త్రసమ్మతి లేకుండా చేయబడెడి కర్మలు నిష్ఫలములే కాకున్నచో, దొంగ మనయింటినుంచి దోచుకొనిపోయిన డబ్బును మనము ధర్మపు లేక దానఖాతాలో ఏల ఖర్చు వ్రాయము ? ఏ మంత్రమైన గైకొమ్ము, అది వర్ణమాల యందలి యేబదిరెండు అక్షరములకు బయటిది కాదుగదా ! ఈ యేబదిరెండు అక్షరములను ఒకప్పుడూ కాకున్న మరింకొకప్పుడైన ఉచ్చరించని మానవు డెవడైన వుండునా ? కాని ఓ అర్జునా ! మంత్రార్థము బోధపడనంతవరకు 'కేవలము యేబదిరెండక్షరములనూ ఉచ్చరించినంతమాత్రమున వాక్కునకు మంత్రోచ్చారణ ఫలము లభించని విధమున' కారణము మరియు హేతువుల సంయోగమువలన యీరీతిని జనించెడి కర్మలు, శాస్త్రానుకూలము మరియు వాటి ఆమోదమునూ పొందనంతవరకు, ఆ కర్మలు జరుగుచూ వున్నప్పటికిని వాటిని వాస్తవిక కర్మల నొనర్చుట యని చెప్పదగదు. ఇట్టికర్మలు అన్యాయముతో కూడియున్న కర్మలగును. మరియు అవి అన్యాయమునకే హేతువులగును.

తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలంతుయః
పశ్యత్యకృత బుద్ధిత్వాన్న సపశ్యతి దుర్మతిః ॥౧౬॥

“ఈరీతిని, ఓ కీర్తివంతుడవగు అర్జునా, యీ ఐదుకారణములనుండి చెడి ఐదు హేతువులుకూడా వుండును. మరియు యీ కర్మలనెడి జంజాటములో ఆత్మ చిక్కుబడినది. సూర్యుడే విధమగు రూపమును ధరించకుండానే రాత్రులనున్నూ మరియు వస్తురూపములనున్నూ కూడా ప్రకాశిత మొనర్చు ఆత్మకూడా తాను స్వయముగా కర్తకాదు. అయినప్పటికిని కర్మలను ప్రకటమొనర్చుచూ వుండును. ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా, అద్దమున తన రూపమును చూచువాడు స్వయముగా తన ప్రతిబింబమూకాక, మరియు అద్దమూ కాకపోగా అతడా రెండింటిని ప్రకాశిత మొనర్చువాడగు రీతిని, సూర్యుడు తనకుతానై రాత్రింబవళ్ళను అనుభవించుత పోయినప్పటి వాటిని (రాత్రింబవళ్ళను) కలుగజేయువాడైన రీతిని, ఓ అర్జునా, ఆత్మ

కర్మలకు కర్తకాకున్నప్పటికినీ, వాటిని ప్రకటించునట్టిదై యున్నది. కాని, దేహాభిమానమనెడి భ్రమలో పడియున్నందువల్ల ఎల్లప్పుడు ఏ మానవుని బుద్ధి దేహమునందే చిక్కుబడి యుండునో, అతనికి ఆత్మ జ్ఞానమును గురించిన విషయములో కేవలము అర్ధరాత్రి యందలి ఘోరాంధకారమే ఏర్పడి యుండును. ఎవరు చైతన్యమగు యీశ్వరుని లేక బ్రహ్మను శరీర సీమయందే బంధించి యుంతురో, అట్టివారికి ఆత్మయే కర్తయనెడి సిద్ధాంతము పూర్తిగా స్థిరమైనట్టిదిగా కాన్పించును. అంతేగాదు, వారికి ఆత్మయే యీ కర్మల కన్నింటికిని కర్తయనెడి దృఢనిశ్చయము కూడా పూర్తిగా వుండదు. 'కర్మల నొనర్చువాడు యీ శరీరమునగు నేనే' యని వారు వాస్తవముగా నంగీకరింతురు. ఇటుల వారు తలంచుటకుగల కారణము, 'నేను ఆత్మను,' మరియు 'నేను కేవలము సమస్త కర్మలకూ సాక్షీభూతుడ నగు తటస్థుడను' అను విషయమును వారెన్నడును తమ చెవిని పడనివ్వరు. ఇందువల్ల, అతడీ అపారమగు ఆత్మతత్త్వము నీస్వల్పమగు దేహముతో కొలచును, ఇందు చెప్పుకొనదగిన దేమున్నది ? గుడ్లగూబ పగటిని కూడా చీకటో రాత్రిగా నొనర్చుటలేదా ? ఆకాశమందలి వాస్తవికమగు సూర్యుని ఎన్నడునూ చూడనివాడు గుంటలో పడెడి సూర్య ప్రతిబింబమునే వాస్తవిక సూర్యునిగా ఏల తలంచకుండును ? అట్టివానికి ఆ నీటిగుంట వున్నంతవరకు సూర్యుడుకూడా వుండును. ఆగుంట లేకుండా పోయినప్పు డాతనికి సూర్యుడు కూడా లేకుండా పోవును. ఆ గుంటయందలి నీరు కదలుచున్నచో సూర్యుడుకూడా కదలుచున్నాడని అతడు తలంచును. నిద్రించిన మనుష్యునకు మేల్కొననంతవరకు స్వప్నమే సత్యముగా తోచును. అది తాడేనని తెలియనంతవరకు దానిని పాముగా భ్రమించు మానవుడు భయపడుటలో ఆశ్చర్య మేమి గలదు ? కళ్ళకు కామెర్లవ్యాధి వున్నంతవరకు చంద్రు డవశ్యము పీతవర్ణముగానే కాన్పించును. మృగము మృగ – జలభ్రాంతిలో పడిన దనుటలో ఆశ్చర్య మేమి

గలదు ? ఇదే రీతిని శాస్త్రములు మరియు గురునామము¹ యొక్క గాలిని
కూడా తన శరీరమునకు సోకనివ్వని, మరియు కేవలము మూర్ఖత్వమువల్లనే
తన జీవితమును గడుపు మనుష్యుడు తనఆత్మపై శరీరమనెడి వలను 'మేఘ
ములయొక్క గమనమును చంద్రునిపై ఆరోపించు నక్కవలె' వేయును,
అంతట, తన యీ దృఢవిశ్వాసముచే, ఓఅర్జునా, 'యీ కర్మలనెడి గట్టిగా
గల ముడిచే యీశరీరమనెడి చెరసాలలో చక్కగాబంధింపబడి యుండును.
చూడుము పాపము, చిలుక నలికాయంత్రముపై కూర్చొని యున్నప్పుడు
దాని పాదములు విముక్తముగా నున్నప్పటికినీ, 'తాను యీ నాళముతో
పాటు బంధింపబడియే యున్నానని' తన మనస్సున దృఢముగా నమ్మి
యుండును; యిందుచే ఆ చిలుక, ఆ నాళముపై పాతుకొని కూర్చొని
యుండుటలేదా? ఇదేవిధమున, తన నిర్మలమగు ఆత్మస్వరూపముపై మాయచే
నొనర్పబడిన కర్మలను ఆరోపించిన మానవుడు అసంఖ్య కోట్లకాలతలచే
ఎల్లప్పుడు కర్మలను కొలచుచునే వుండును. బడబాగ్ని సముద్రమునందే
వుండును. కాని సముద్రజలము దానిని తాకదు. అవిధమునే, కర్మలచే
వ్యాప్తుడైయున్నప్పటికిని, కర్మలతో సంపర్కములేకుండా యీ విధముగా
అలిప్తుడైయుండి కర్మలనొనర్చు వానిని గుర్తించుటకుతగిన లక్షణములను నీకిక
చెప్పెదనువినుము. ఇదెట్లిదనిన, ముక్తుల లక్షణములను గురించియోచనచేయుచు
వుండుటలోనే మానవుడు ముక్తుడైపోవును. దీపపు వెలుగులో వెదకి
నప్పుడు మనము కోల్పోయిన వస్తువు మనకు లభించును. లేదా అద్దమును
తోమితోమి శుభ్రమొనర్చిన కొలదిని దాని యందంత స్పష్టముగా మన
రూపము కనిపించును, లేదా జలముతో కలియుట తోడనే ఉప్పుకూడా
జలరూపమునే దాల్చును. లేదా ప్రతిబింబము వెనుకకు మరలి మరల తన
బింబమును చూచుటకు వచ్చుచో అది తనంతతానే బింబముగానైపోవు విధ
ముగనే, మహాత్ముల విషయమును గురించి యోచన చేయుచుండగా — చేయు
చుండగా మనకుకూడా మనము కోల్పోయిన ఆత్మస్వరూపము మరల

అభించును. కావుననే, ఎల్లప్పుడూ మహాత్ముల సంగతులను వర్ణించుట
మరియు వినుట నొనర్చుచుండ వలెను. చర్మచక్షువు లందుండెడి దృష్టి
చక్షువులందలి చర్మముచే బంధింప బడని రీతిని, కర్మల నాచరించి నప్పటికి
కూడా కర్మలందలి సమత్వము మరియు విమత్వము, లేక సుఖ – దుఃఖము
లచే చిక్కుబడకుండా మరియు యీ విధముగా బంధముక్తుడై యుండు
వాని లక్షణములను నీ కిప్పుడు వివరించి చెప్పెదను వినుము.

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే ।
హత్వాపి స ఇమాం లోకాన్నహంతి ననిబధ్యతే ॥౧౭॥

"ఓ సువిజ్ఞుడవగు అర్జునా ! ఏ జీవుడు అజ్ఞాన మనెడి నిద్రలో
పడియుండి పడియుండి అనంతకాలము వరకు నానావిధములగు స్వప్నజాల
ములలో చిక్కుకొని యుండునో, ఆతడు 'తత్త్వమసి' మహాసిద్ధాంతశ్రవణ
మొనర్చుటతోడనే మరియు మస్తకముపై గురుకృప యనెడి హస్తము
పడుటతోడనే విశ్వమును గురించి గల స్వప్నాభాస సమేతముగా మాయా
నిద్రను విడచి ఒక్కమారుగా అభేదభావానందముతో మేల్కొనును.
చంద్రకిరణములు వెలువడగానే మృగజలమునందు భిన్నముగానూ స్పష్టము
గానూ కనిపించెడి అలలు లోపించురీతిని లేదా బాల్యావస్థ అంతమొంద
గానే మనస్సున దోబూచికి తావే లేకుండా పోవురీతిని, లేదా కట్టెలు
కాలిపోయిన తరువాత మరల అది కట్టెలుగా ఏవిధముగను కానిరీతిని
లేదా మేల్కొనిన తరువాత స్వప్నము కంటి ఎదుట వుండని విధమున ఆ
జీవునియందు అహంభావము నామమాత్రమునకైన వుండదు. సూర్యుడు
చీకటిలో వుండుటకొరకై వెదకికొని ఏదైన సొరంగములోగాని గుహలో
గాని ప్రవేశించినప్పటికిని ఆతనికి అంధకార మెచ్చటను దొరకని రీతిని
(అనగా ఆతడెచ్చటకు పోయిన అచ్చటనే పూర్ణప్రకాశము ఏర్పడురీతి
ఏ జీవుడు ఆత్మభావముతో ఆవృతు డగునో, అతడే దృశ్యపదార్థముపైప్ర
చూచునో, ఆ పదార్థమే స్వయముగా ఆ చూచువాని రూపమునే ధరించ

సాగును. మరియు యీ రీతిని అతనితో కలసి ఏకరూప మగును. అగ్ని
ఏ వస్తువును తాకిన ఆ వస్తువే అగ్నిరూపము దాల్చును. మరియు రెండింటి
యందును దహ్య-దాహక భావము తనంత తానే నశించిపోవును. సరిగా
యిదేవిధముగ, కర్మయొక్క ఆకారము ఆత్మకు భిన్నమైనదని అంగీకరించి,
కర్మకు ఆకార ప్రధాన మొనర్చెడి కర్తృత్వమును గురించి ఆత్మపై నొన
ర్చెడి మిథ్యారోపణ లేకుండాపోయినప్పుడు ఏది మిగిలియుండునో అదియే
ఆత్మస్థితి యగును. ఈ ఆత్మస్థితిపై ఆధిపత్యమును సంపాదించినవా డెన్న
డైన శరీరమున బద్ధుడై వుండగలడా? ప్రళయకాలమందలి అపార జల
మెన్నడైన మహోక ప్రవాహముతో కలిసిపోగలదా? లేక ఆ రెండవ
ప్రవాహముయొక్క స్వతంత్ర మగు అస్తిత్వమును అంగీకరించగలదా?
ఓ అర్జునా! సరిగా యిదేవిధముగ అభిన్న భావమువలన స్ఫురణను పొందెడి
అహంత (అనగా స్వాత్మభావన) పూర్ణత్వమును పొందినప్పుడు యీ తుచ్ఛ
మగు దేహాభావమునందు దది యిముడగలదా? సూర్యబింబ మెన్నడైన
సూర్యుని అంటిచివేయగలదా? పెరుగును చిలికి తీసిన వెన్నను మరల మజ్జిగలో
వేసినచో ఆ వెన్న తన అలిప్తత్వ మనెడి గుణమువలన మరల మజ్జిగలో
కలిసిపోవునగదా? లేదా ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా! కొయ్యలో గుప్త
ముగా వుండెడి అగ్నిని ఒకమారు ఆ కొయ్యనుండి తీసివేసిన తరువాత
మరల ఆ అగ్ని ఆ కొయ్యలో దాగియుండగలదా? లేదా రాత్రియొక్క
గర్భమునుంచి బయటకు వెడలెడి తేజోరాశి యగు సూర్యుని గురించి అతడు
రాత్రిరూపమునందే వుండునని ఎన్నడైన చెప్పవగునా? సరిగా యిదేరీతిని,
ఏ జీవుడు వేద్యము మరియు వేదకము అనగా జ్ఞానవిషయము మరియు జ్ఞాత
యనెడి భేదమునే దూర మొనర్చునో, అట్టివానియందు 'నేను దేహమును'
అనెడి హీన అహంకారస్ఫురణ మెటుల కాగలుగును? ఆకాశ మెచ్చటకు
పోయిన నచ్చట పూర్తిగా నిండియుండును. అందుచే అది నిరంతరము తనకు
తానే తన సర్వవ్యాపకత్వముచే నిండియుండును. సరిగా యిదే విధమున,

యిట్టి జీవు డేది చేసిన అదియంతయూ స్వయముగా ఆతని ఆత్మస్వరూపమే యగును. అట్టి స్థితిలో ఆత డేకర్మలో తన కర్తృత్వాభిమానముచే లిప్తుడు, కాగలుగును ? ఆకాశమున కేస్వతంత్రనివాసస్థానమూ వుండని విధమున, లేదా సముద్రమున కేస్వతంత్రప్రవాహమూ వుండని విధమున, లేదా ధ్రువతారయం దేవిధమగు గమనమూ వుండనిరీతిని, యిట్టి జీవునకు కూడా ఏకర్మయూ వుండదు. ఈ విధమగు ఆత్మబోధవలన ఎవని అహంభావము పూర్తిగా కాలి భస్మమై పోవునో, ఆతని కర్మలు ఆతని శరీరము వున్నంతవరకు నుండును. గాలి వేగముగా వీచిన తరువాత ఎప్పుడు ఆగిపోవునో, అప్పుడు కూడా దాని మూలమున ఊగుచుండెడి చెట్లు ఆ తరువాత కూడా కొంతసేపటివరకు ఊగుచునే వుండును. కర్పూరము అయిపోయినప్పటికీ కూడా ఆ కర్పూరము వుంచిన డబ్బి మరికొంతసేపటివరకు కర్పూరపు వాసనను కలిగియే యుండును. గానము ముగిసిపోయినప్పటికిని దానివలన లోకులకు కలిగిన తంద్ర మాత్రము వెంటనే తొలగిపోదు. లేదా ఎచ్చటనైన భూమిమీద నీరు ప్రవహించుచో, ఆ నీరు ప్రవహించుట అయిపోయిన తరువాత కొంతసేపటివరకు ఆ నీటి తాలూకు తేమ వుండును. సూర్యుడు అస్తమించిన తరువాతకూడా సంధ్యావేదికపై సూర్యునిజ్యోతిప్రభ కొంతసేపటివరకు ఆటలాడుచునే వుండును. ఏ వస్తువును లక్ష్యముగా నిడుకొని బాణమును వేతుమో, ఆ వస్తువును భేదించిన తరువాతకూడా ఆ బాణము తనలో వేగము వున్నంతవరకు ముందుకు సాగిపోవును. కుమ్మరిసారెపై మట్టిపాత్ర తయారై దానిపైనుంచి ఆ పాత్రను కుమ్మరివాడు తీసినపిమ్మట కూడా తనపై మట్టిపాత్ర లేకపోయినప్పటికిని, మొదట పాత్రను తనపై నుంచినప్పుడు ఎట్టి వేగముతో తిరిగెనో, అదే వేగముతో తిరుగుచునే వుండును. సరిగా యిదేవిధమున, దేహాభిమానము నశించినపిమ్మటకూడా, ఓ అర్జునా ! దేహము ఏ స్వభావముతో జనించి యుండెనో; ఆ స్వభావమే దేహముతో తనంతతాను కర్మల నొనరించుచునే యుండును. మనస్సునం

దేవిధమగు ఉద్దేశ్యమూ లేకున్నప్పటికి స్వప్నములు వచ్చుచునే యుండును. మరియు అరణ్యమున ఎవరునూ నాటకనే తమంతతామే చెట్లు పుట్టుచునే యున్నవి. మరియు ఎవరూ నిర్మించకుండానే ఆకాశమున మేఘపవనములు నిర్మితమగుచునే యున్నవి. సరిగా యిదేవిధమున ఆత్మ ఏ పనినీ చేయ నప్పటికినీ దేహమునందలి అయిదు కారణముల మూలముననూ కర్మలు తమంతతామే జరుగుచుండును. పూర్వ-కర్మల సంస్కారముల ననుసరించి ఐదు హేతువులు మరియు అయిదు కారణముల కూటమి అనేకవిధములగు కర్మల నొనర్చుచునే వుండును. అటుపిమ్మట ఆ కర్మలవలన జగత్సంహారమే యగుగాక, మరియు నూతన జగత్సృష్టియే జరుగుగాక, కాని, సూర్యుడు, కుముదము ఏల ఎండిపోవుచున్నదో, మరియు కమలము ఏల వికసించు చున్నదో యోచించనిరీతిని, లేదా ఆకాశమునుండి పిడుగులవాన కురియుట వలన భూమి ముక్కలు-ముక్కలుగానే యగుగాక మరియు శాంతముగ వర్షించుటవలన తృణాదులచే భూతలము కళకళలాడుగాక - కాని ఆకాశ మునకు యీ రెండిటియందును ఏ ఒక్కదానిని గురించిన ఎరుకకూడా వుండని విధమున, ఎవడు దేహమునందే విదేహుడైయుండునో అతడుకూడా మేల్కొనిన మనుష్యుడు స్వప్నములను కనని రీతిని దేహాదులచే జరుగు చుండు క్రియలచే సృష్టి నిలచుచున్నదా లేక నాశన మగుచున్నదా యను విషయమును చూడనే చూడడు. కాని కేవలము చర్మచక్షువులతో మాత్రమే చూచుచూ, మరియు దేహమును దాటి ఆవలకు దృష్టి పోనివారికి, యీ విధ ముగా నున్న ముక్తపురుషుడు కూడా కర్మలలో బంధితుడై యున్నటుల గానే తోచును. పశు - పక్షులను బెదరించుటకు మరియు పారద్రోలుట కొరకై పొలమున మంచెపై పాతెడి దిష్టిబొమ్మను చూచి, నక్క యిచ్చట ఎవరో కాపలా కాయుచున్నారని నిజముగా తలంచదా ? 'ఒకానొక పిచ్చివానిని గురించి మంచివాళ్ళు యీతడు నగ్నముగా నున్నాడు-యీతడు బట్టలు ధరించుచున్నాడు' అని యోచించుచున్నప్పటికిని వీరి యోచనతో

ఆ పిచ్చివాడేమైన పట్టించుకొనునా? యుద్ధమున మరణించినవాని గాయము లను మిగిలినవారు లెక్కించిన లెక్కింతురుగాక, కాని ఆ మరణించినవానికి వీరు చేయుచున్న యీ విషయ మంతయూ ఏమాత్రమును తెలియదుగదా! ఒకానొక మహాపతివ్రతయగు స్త్రీ సహగమన మొనర్చుకొనుటకై అంతిమ శృంగార మొనర్చుకొనినప్పుడు లోకులెల్లరు ఆమె శృంగారమును ఎంతగా రోచించినప్పటికిని, ఆ సహగమన మొనర్చు స్త్రీకిమాత్రము తనముందున్న అగ్ని జ్వాలలు, తన కోమలశరీరము, నలువైపుల గుమిగూడియున్న జనసమూహమూ కాన్పించనే కాన్పించదు. సరిగా యిదేవిధమున, ఎవనికి ఆత్మస్వరూప సాక్షాత్కార మగునో, ఎవని ద్రష్టత్వము దృశ్యవస్తువుతో కలిసి ఏకరూప మును పొంది దానిలో లీనమైపోవునో, అతనికి యింద్రియములు ఏయేకర్మల నాచరించుచున్నవో కూడా తెలియదు. ఒక అతి పెద్దదగు జలప్రవాహము కొన్ని చిన్నచిన్న ప్రవాహములువచ్చి కలసినప్పుడు, అచ్చట వడ్డునందున్న ఒకానొక వ్యక్తి ఫలానాప్రవాహమును ఫలానాప్రవాహము మ్రింగివేసిన దని అనుకొన్నప్పటికిని, యీ క్రియలో వాస్తవమునకు ఒక జలప్రవాహ మును మరొక జలప్రవాహము మ్రింగివేయని రీతిని, పూర్ణత్వమును పొందిన పురుషుని చంపుటకై స్వయముగా తనకు భిన్నమగు మరేవస్తువూ మిగిలియే యుండదు. బంగారుచండికి బంగారముతో చేయబడిన మహిషాసురుని బంగారు శూలముచే వధించును. మరియు యీదృశ్యమును చూచెడి పూజారికి యిదంతయూ పూర్తిగా నిజము గానే తోచును. కాని వాస్తవమునకు, చండిక, మహిషాసురుడు మరియు శూలము - యీ మూడున్నూ బంగారముతో చేయబడినవే. చిత్రములలో అగ్నిమరియు జలమును రెండున్నూ పూర్తిగా వున్నది వున్నట్లు చూపించ బడును, కాని యిదంతయు దృష్టియొక్క ఆటమాత్రమే. చిత్రపటమున అగ్నియూ వుండదు, జలభాగమూ వుండదు. సరిగా యిదేరీతిని, ముక్త (ఆదేహ) పురుషుల శరీరములు కూడా కేవలము ప్రాచీన సంస్కారముల

వలననే నడచుచూ వుండును. కాని, అజ్ఞానులకు మాత్రి మీరహస్యము బోధపడనే బోధపడదు. మరియు అందువలన వారు ముక్తపురుషులనే ఆకర్మలకు కర్తలుగా తలంతురు. కాని, స్వాభావిక క్రియలచే త్రిభువనము లకు కూడ క్షోభకలుగుగాక, అయినప్పటికిని యీక్షోభ ముక్తపురుషుడే చేసెనని ఎన్నడును తలంచరాదు. మనము ముందుగా ప్రకాశ సహాయముచే అంధ కారమును చూచి, ఆతరువాత ఆ అంధకారమును నాశమునర్తుని యను టలో తెలివితేట లేమైనా గలవా ? ఏలనన, ప్రకాశము వచ్చుటతోడనే అంధకారము తనంతతానే నాశమైపోవును. సరిగా యిదే విధమున, జ్ఞాన వంతునిలో జ్ఞానము తప్ప మరేభావమూ వుండదు. మరియు ఆతనిని చంపు టకు ఆతనికి భిన్నమగు మరేవస్తువూ మిగిలి యుండదు. కావుననే, ఆతని బుద్ధిలో పాప – పుణ్య గంధముకూడా నుండదు. ఏదైనా నది వచ్చి గంగలో కలిసినప్పటికిని గంగానది దానివలన మురికిదిగా ఎన్నడునూ కాదు. ఈ ఉదాహరణమే యిచ్చట కూడా అన్వయించును. ఓ అర్జునా, అగ్నితో అగ్ని పోట్లాడుకొనుచో యీ రెంటిలో ఏది దేనిని దగ్ధమునర్చును ? శస్త్రము తనను తానే కొట్టుకొనుచో, అందువలన ఏమి జరుగును ? ఇదే విధమున, కర్మలు నాకు భిన్నమైనవి – అన్న సంగతినే ఎరుగనివాడు తన బుద్ధిపై ఆకర్మల నెటుల ఆరోపించ గలడు ? కార్యము, కర్త, మరియు కర్మలనెడి త్రిపుటిని ఆత్మస్వరూపముగా నెంచువానికి శరీరాదులచే జరుగు కర్మలు ఎన్నడును బంధకములు కాజాలవు. దీనికిగల కారణము, తన్నుతానే కర్తగా అంగీకరించు జీవుడు యీదశేంద్రియము లనెడి పరికరములద్వారా అయిదువిధములగు హేతువులనూ అతికౌశలముతోడ ఉపస్థితమొనర్చును. అటుపిమ్మట, న్యాయము మరియు అన్యాయము లనెడి రెండు కుర్చీలనూ తయారుచేసి ఒకే క్షణములో కర్మయనెడి మందిరమును నిలుపును. ఈ గొప్పపనిలో ఆత్మ ఏమాత్రము తోడ్పడదు. “ఈ ఆత్మ కర్మలను గురించిన పూర్వయోజనమునందుకూడా ఏమైన సహాయము చేయునా,

చేయదా ?” యని నీ వడుగుచో, ‘దానియందుకూడా ఏవిధముగ సహాయమూ చేయదనియే’ నా జవాబు. కేవలము సాక్షీ - భూతుడు మరియు ఆత్మస్వరూపుడూ నగు ఆత్మ ఎన్నడైన స్వయముగా ‘కర్మప్రవృత్తికి సంబంధించిన సంకల్పములు జనించవలెనని’ చెప్పునా ? కాని, ఏకర్మప్రవృత్తి యనెడి సుడిగుండమున అందరూ పడియున్నారో, ఆ ప్రవృత్తికి చెందిన క్లేశములుకూడా ఆత్మ నెన్నడును స్పర్శించవు. కావున, పూర్తిగా ఆత్మస్వరూపుడుగానైన పురుషుడు ఎన్నడును కర్మలనెడి చెరసాలలో వుండనే వుండలేదు. కాని, అజ్ఞానమనెడిపటముపై జ్ఞానమనెడి చిత్రము జీర్ణగాపడినప్పుడే కార్యము, కర్త, మరియుకర్మలనెడి లోకప్రసిద్ధమైన త్రిపుటి చిత్రితమగును.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥ ౧౮

“జ్ఞానము, జ్ఞాత, మరియు జ్ఞేయములనెడి త్రిపుటి యీజగత్తుకు బీజమైయున్నది; మరియు, కర్మప్రవృత్తి దీనివలననే ఏర్పడుచున్నదనుటలో-ఏమాత్రము సందియములేదు. ఓఅర్జునా, ఇక యీ మూడింటిని గురించియూ నేను విడివిడిగా వివరించిచెప్పెదను వినుము. జీవుడనెడి సూర్యమండలము పంచేంద్రియములనెడి కిరణములు వేగముగావచ్చి విషయములనెడి కమలము మొగ్గను వికసింప జేయును. లేదా జీవుడనెడి రాజుయొక్క యింద్రియము లనెడి గుర్రములు పరుగెత్తి విషయములనెడి ప్రదేశమును చేరును. మరియు అచ్చటినుంచి సుఖ-దుఃఖములను దోచుకొని వచ్చును. ఈ యింద్రియముల వల్ల జరిగెడి పనులచే ఏజ్ఞానము సుఖ - దుఃఖములను తన వెంటనిడుకొని జీవునకు ప్రాప్తించునో, అనుషుప్త్యవస్థలో దేనియందు లీనమగునో, ఆజీవునే ‘జ్ఞాత’ యని చెప్పవలయును. మరియు యిప్పటి వరకు దేనిని గురించి వివరింప బడినదో, ఓ అర్జునా ! యీ సమయమున దానినే ‘జ్ఞానము’ని

ఎఱుంగవలెను. ఓపార్థా, అవిద్యాగర్భమున జన్మధారణ మొనర్చుట తోడనే ఏజ్ఞానము మూడు స్థానములందు తన విధానము నొనర్చునో, మరియు ఏ జ్ఞానము తన పరుగిడు మార్గమునందు ముందువైపు జ్ఞేయ (జ్ఞాన) విషయ మనెడి తుపాకీగుండును విసరి, తన వెనుకవైపునందు జ్ఞాతృత్వాభిమానమును సృజించునో, మరియు యీరీతిని జ్ఞాత మరియు జ్ఞేయములకు మధ్య సంబంధమును స్థాపించు మార్గము సంసిద్ధమైన పిమ్మట, ఏ జ్ఞానసహాయముచే యీ మార్గమున రాక - పోకలు నిరంతరము కొనసాగు చుండునో, ఏ జ్ఞానముయొక్క పరుగు జ్ఞేయముయొక్క సరిహద్దు వరకు మాత్రమే వుండునో, మరియు ఎవడు పదార్థముల కన్నిటికిని భిన్న భిన్న నామములను పెట్టునో, ఆజ్ఞానము 'సామాన్యజ్ఞానము' అని చెప్పుటలో ఏ మాత్రము సంశయములేదు. ఇక జ్ఞేయముయొక్క లక్షణములను వినుము. శబ్ద, స్పర్శ, రూప, రస,గంధము లనునవన్నియు యీ జ్ఞేయము బయల్వెడలు మార్గములు. ఒకే మామిడిపండు తన రసము, రంగు మరియు సువాసన మొదలగువాని వలన భిన్నభిన్నములగు యింద్రియములను స్పర్శించి తన ఉనికిని ప్రకటించుకొను రీతిని, జ్ఞేయముకూడా తానుఒక్కటే అయినప్పటికిని జ్ఞానము ఆ జ్ఞేయమును యింద్రియమార్గములగుండా గ్రహించును. మరియు అందువలన ఆ జ్ఞేయము అయిదువిధములుగా నైనది. జలప్రవాహము అంతమున సముద్రప్రవేశ మొనర్చుటతో సమాప్తమొందు రీతిని, లేదా ధాన్యపుమొక్కల పెరుగుదల కంకులు వేయుటతో అంతమొందు రీతిని, యింద్రియప్రవాహములతో పాటుగా పరుగులువెట్టెడి జ్ఞానము దేనియందు అంతమొందునో, ఓఅర్జునా, అదియే జ్ఞానవిషయమనబడు జ్ఞేయము. ఓపార్థా, జ్ఞాత, జ్ఞానము మరియు జ్ఞేయములనెడి త్రికూటము యొక్క స్వరూపమీ విధముగా నుండును. ఈ త్రికూటమువల్లనే సమస్త క్రియలూ జనించును. శబ్దాదివిషయములే దీనియందలి అయిదు విధములు. కాని జ్ఞేయము మాత్రము ప్రియమూ అగును. అప్రియమూ యగును. జ్ఞేయము

ఏ మాత్రపు స్వల్పజ్ఞానమును ఎదుటికి తీసికొనివచ్చి ఉపస్థిత మొనర్చి నప్పటికీ, వెంటనే జ్ఞాత ఆ విషయమును స్వీకరించుటో, త్యజించుటో ప్రారంభించును. చేపను చూచుటతోడనే కొంగ, లేదా ద్రవ్యభాండార మును చూచి దరిద్రుడు, లేదా ఏదైన స్త్రీని చూచుటతోడనే కాముక పురుషుడూ విచలితుడై దానిని పొందవలెనని వాంఛించు రీతిని, లేదా పల్లము వైపుకు నీరు, పుష్పసుగంధమువైపుకు తేనెటీగ, లేదా సంధ్యాసమయమున పాలు పితుకువేళకు దూడ ఆవువైపుకు పరుగెత్తు రీతిని, లేదా స్వర్గమందలి ఊర్వశి మొదలుగాగల అప్సరసలతో సుఖ-భోగ మొనర్చుట యనెడి మనోహర మగు మాటలను విని లోకులు స్వర్గసుఖములు పొందుటకై ఆకాశమున యజ్ఞయాగములనెడి నిచ్చెనలను వేయ నారంభించురీతిని, లేదా, ఓ అర్జునా! ఆకాశమున ఎగిరెడి మొగపావురము ఆడుపావుర మును చూచుటతోడనే స్పృహతప్పి క్రిందికి పడసాగురీతిని, లేక మేఘగర్జనలు చెవిసోకుటతోడనే నెమలి ఆకాశమువైపుచూడ నారంభించు రీతిని, సరిగా యిదేవిధమున, జ్ఞేయదర్శనమగుటతోడనే (జ్ఞేయమును చూచుటతోడనే) జ్ఞాతకూడా వెంటనే దానివైపు పరుగిడును. కావున, ఓ పాండుసుతుడవగు అర్జునా! సమస్తకర్మలకు ఆరంభము జ్ఞానము, జ్ఞేయము మరియు జ్ఞాతయనెడి త్రికూటమువల్లనే జరుగును. ఇక ఆ జ్ఞేయమే జ్ఞాతకు ప్రియమగుచో, యిక దానిని అనుభవించుటకు ఒక్కక్షణమేని ఆలస్యము సహింపరానిదిగా యగును. ఇందుకు విపరీతముగా, ఆ జ్ఞేయము ఆతనికి అప్రియముగా తోచుచో దానిని తిరస్కరించి దూరమునర్చుటలో ఒక్కక్షణమేని ఆలస్యమగుచో అదికూడ దానికి యుగమువలె దీర్ఘముగా తోచును. సర్పము మరియు రత్నహారములను వాని ఆవరణలో ఏ మానవుడైన ఒక్కమారుగా ప్రవేశించినచో ఆతనికి భయానందములు రెండునూ ఒకేమారుగా తోచురీతిని, జ్ఞాతకుకూడా కొంత యిష్టమూ మరికొంత అయిష్టమూనగు వస్తువు కాన్పించి నప్పుడుయిదేవిధముగ

స్థితి కలుగును. ఇక అతడు ప్రియవస్తువును స్వీకరించుటకు, అప్రియ వస్తువును త్యజించుటకూ ప్రయత్నము చేయసాగును. శత్రుపక్షమునగల మల్లులలో తనకు జోడగు మల్లునిచూచి సేనాపతికి అతనితో పోరాడ వలెనని వాంఛకలిగి, అతడు స్వయముగా తన రథమునుండి దిగి అతనితో మల్లయుద్ధమొనర్చుటకై కాలినడకనే అతని వైపునకుపోవురీతిని, యిప్ప టివరకు తనజ్ఞాతృత్వమువలన కేవలము జ్ఞాతగానే వున్నవాడిక కార్యారంభ మొనర్చి కర్తయొక్క పదవినిస్వీకరించును. భోజనముచేయువాడే వంటచేయు టకు కూర్చొన్నవిధమున, లేదా భ్రమరములే తోటను నాటినటుల, లేదా బంగారమును పరీక్షించు వరాబే స్వయముగ మచ్చురాయి అయి నటుల, లేదా స్వయముగా దేవుడే తన దేవాలయమును నిర్మించ నారంభించిన రీతిని, ఓ అర్జునా, జ్ఞేయ విషయమును త్యజించుట లేదా స్వీకరించుట కొరకై జ్ఞాత తన యింద్రియముల నుపయోగించును. మరియు అప్పుడాజ్ఞాతయే కర్తగా నగును. ఈరీతిని జ్ఞాత స్వయముగనే కర్తగానైనప్పుడు అతడు జ్ఞానమును సాధనముగా నొనర్చు కొనును. మరియు అందువలన 'జ్ఞేయము' తనంతతానే 'కార్యము' గా నగును. ఈరీతిని ఓసుజ్ఞుడవగు నర్జునా, జ్ఞానముయొక్క చేతవలన యీమార్పు జరుగును. నేత్రశోభను రాత్రి మార్చివేయు రీతిని, లేదా రోజులు మంచివి కానప్పుడు ధన - సంపన్నుడగు పురుషుని విభవముకూడా నాశనమగురీతిని లేదా పౌర్ణమి తరువాత చంద్రబింబమునందు కూడా మార్పు వచ్చి క్రమ క్రమముగా అతడు క్షీణించసాగు రీతిని, యింద్రియముల గమనముయొక్క సంయోగముచే జ్ఞాతకు నలువైపులా కర్తృత్వమనెడి మరమేకు బిగియ సాగును. అంతట, ఆస్థితిలో అతనియందే యేలక్షణములు కాన్పించునో, వివరించి చెప్పెదను వినుము. బుద్ధి, మనస్సు, చిత్తము మరియు అహంకారములను నవన్నియూ అంత రింద్రియములు. మరియు బాహ్యాంగములకు చెందిన పంచేంద్రియములు-త్వచ, కర్ణము, నేత్రము

నాలుక, నాసికలై యున్నవి. వీటిలో; అంతరింద్రియములద్వారా కర్త తన కర్తవ్యమును ఊహించును; అంతట ఆతనికి, ఆకర్తవ్యపాలనము సుఖకరమని నిశ్చయము కలుగుచో ఆతడు నేత్రాది బాహ్యమునగల దశేంద్రియములనూ ఆ పనియందు నిమగ్నమొనర్చును. అటుపిమ్మట, ఆ కర్తవ్యము సిద్ధించనంత వరకు ఆతడు ఆ యింద్రియముల నన్నింటిని ఆ కర్తవ్యమును నెరవేర్చుటలో లగ్నమొనర్చి యుంచును. ఇందుకు విరుద్ధముగా, ఆ కర్తవ్యము తనకు దుఃఖకరమని నిశ్చయముగా తోచుచో ఆతడు వెంటనే తన దశేంద్రియములనూ ఆ కర్తవ్యమును త్యజించుటలో నిమగ్నమొనర్చును. ఆతడీ రీతిని యీ దశేంద్రియములనూ ఆ దుఃఖము నామ-రూపము లేకుండా నాశమొంద నంతవరకు నిమగ్న మొనర్చియే యుంచును. రాజా పన్నును వసూలుచేయుటకై తన నౌకరులను రాత్రింబవళ్ళు పనిలోనుంచి యుంచురీతిని, యీయింద్రియములన్నిటినికూడా ఏదైన పనిలో ని మగ్నమొనర్చి యుంచినప్పుడు ఓ అర్జునా, ఆజ్ఞాతను కర్తయందురు. మరియు కర్త తనపనులన్నిటియందు నింద్రియములనుపనిముట్లువలెవినియోగించుచుండును, మరియు యిందువల్లనే నేనుయింద్రియములను కరణములు అనగా సాధనములు, లేక పరికరములని యంటిని. మరియు యీ కరణములను ఉపయోగించి కర్త ఏ క్రియల నొనర్చునో, ఆ క్రియలయొక్క వ్యాప్తినే యీ ప్రకరణమునందు 'కర్మ' యంటిమి. కంసాలివానిబుద్ధి నగలు తయారు చేయుటయందే వ్యాపించి యుండురీతిని, లేదా చంద్రకిరణములు వెన్నెలయందే వ్యాపించియుండు విధమున, లేదా సౌందర్యముచే లతలు వ్యాపించి యుండునట్లు, లేదా ప్రభ ప్రకాశమున వ్యాపించియుండు విధమున, లేదా మాధుర్యము చెరకురసమున వ్యాపించి యుండునట్లు, లేదా అవకాశము ఆకాశమున ఓతప్రోతము గా నిండియుండు రీతిని ఓ అర్జునా ! కర్తయొక్క క్రియలచే ఏది వ్యాపించి యుండునో, అదియే - కర్మ.. ఇదితప్ప కర్మ మరెట్టిదియూ కాదు. ఈరీతిని ఓ జ్ఞానశ్రేష్ఠుడవగు అర్జునా! కర్త, కర్మ మరియు కరణములయొక్క

త్రిపుటికి గల లక్షణములను నీకు వివరించి చెప్పితిని. ఇచ్చట జ్ఞాత, జ్ఞానము మరియు జ్ఞేయములు అనునవి కర్మప్రవృత్తి కొందిన త్రికూటములు. మరియు కర్త, కరణము మరియు కార్యములు-యీ కర్మయొక్క త్రికూటములు. అగ్నియందు పొగ, లేదా బీజమున వృక్షము లేదా మనస్సునందు వాసనలు నిండియుండు రీతిని, కర్త, క్రియ మరియు కరణములు కర్మయొక్క జీవితమున నిండియుండును. బంగారపు గనిలో బంగారము నిండియుండు విధమున కర్త, క్రియ మరియు కరణములలో కర్మ కూడా నిండియుండును. ఇందువలననే ఓ అర్జునా! 'ఇది కార్యము, నేను కర్తను' అనెడి భావము వున్నచోటున ఆ క్రియ లన్నిటితోను ఆత్మ సదా పూర్తిగా దూరముగాను అలిప్తముగాను వుండును. కావున ఓ బుద్ధిమంతుడవగు అర్జునా, ఆత్మ యీకర్మ ప్రవృత్తికి పూర్తిగా భిన్నముగా నుండునని నేను మాటిమాటికి నొక్కి చెప్పుచున్నాను.

జ్ఞానం కర్మచ కర్తాచ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణుతాన్యపి ॥ ౧౯

ఇప్పుడు నేను వివరించిన జ్ఞానము, కర్మ, మరియు కర్తలు-మూడున్నూ త్రిగుణముల వలన త్రివిధములుగా నుండును. కావున ఓ అర్జునా, జ్ఞానము, కర్మ, కర్తలపైకూడా విశ్వాసము కలిగి యుండరాదు. ఏలనన, యీ త్రిగుణములలో రెండు గుణములు బంధకారులు, కేవలము మూడవదియగు సత్త్వగుణము మాత్రమే మోక్షము నిచ్చుటకు సమర్థవంతమై యున్నది. ఇక, నీకిప్పు డీత్రిగుణముల యొక్క లక్షణములు, సత్త్వగుణమును చక్కగా తెలిసికొనుటకు వీలగురీతిని వివరించి చెప్పెదను వినుము. ఈగుణ - భేదము సాంఖ్యశాస్త్రమున చక్కగా వివరింపబడినది. ఏ సాంఖ్యశాస్త్రము యోచనా సముద్రమో, ఏది ఆత్మబోధ యనెడి కుముదినిని వికసింప జేసెడి చంద్రబింబమో, ఏది జ్ఞానదృష్టి నొసంగెడి శాస్త్రములకు చక్రవర్తియో,

ఏది పగలు మరియు రాత్రులవలె ఒకదానితో నొకటికలసియున్న ప్రకృతి-పురుషులను స్పష్టముగా విడదీసి ప్రకాశించుప్రచండ సూర్యుడో, ఏశాస్త్రసహాయమువలన అపారమగు అజ్ఞాన-రాశియైన యిరువదినాల్గు తత్త్వములయొక్క తూకముచూచి పరమతత్త్వమగు బ్రహ్మయొక్క అఖండానందమును భోగించవచ్చునో. ఓ అర్జునా! అట్టి సాంఖ్యశాస్త్రము యీ గుణభేదమును గురించి ఏమని చెప్పినదో, దాని నిచ్చట నీకు చెప్పెదను వినుము. ఏదృష్టిచే తన అవయవ సామర్థ్యమువలన యీ త్రిగుణములు త్రివిధత్వమనెడి రంగుతో యీ దృశ్యప్రపంచమునంతను రంగరించినవో, ఆ దృష్టితోనే సత్త్వ, రజస్తమముల మహత్త్వముకూడా బ్రహ్మనుండి మొదలుకొని క్రిమికీటకాదులవరకుగల అన్నియూ యీ గుణములవలన త్రివిధములుగా కలిగియున్నదని తెలిసికొనుము. కాని, నీకు అన్నింటికంటె ముందుగా ఏ జ్ఞానము యీ సమస్తవిశ్వమును భేదించినదై యుండికూడా, తనంతతానే యీ గుణభేదమనెడి చిక్కులో పడినదో, ఆ జ్ఞానమును గురించి చెప్పెదను వినుము. అసలువిషయ మేమన, మనదృష్టి స్వచ్ఛముగా నున్నప్పుడు ప్రతి వస్తువూ స్వచ్ఛముగా కాన్పించును. ఇదేవిధమున, శుద్ధజ్ఞానము లభించినప్పుడు సమస్తమూ శుద్ధమైపోవును. ఇందువలననే, నీకు సాత్త్విక జ్ఞానమని చెప్పబడెడి దానిని గురించి వివరించి చెప్పెదను శ్రద్ధతో వినుము." అని కైవల్యస్వరూపుడగు శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పెను.

సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥౨౦

శ్రీకృష్ణభగవాను డిటుల చెప్పిరి-"సోదరా అర్జునా, సాత్త్వికజ్ఞానమే వాస్తవమునకు నిర్మలమైనట్టిది. ఈ జ్ఞానోదయ మగుటతోడనే జ్ఞాత మరియు జ్ఞేయములు బ్రహ్మైక్యమున విలీనమైపోవును. అంధకారమునకు సూర్యదర్శనము కానటుల, లేదా సముద్రమునకు నదియొక్క స్వరూపా

జ్ఞానము వుండని విధమున, లేదా ప్రయత్నించినప్పటికిని తన నీడను తాను పట్టుకొనుటకు వీలుకాని విధమున ఏజ్ఞానమును శంకరుని మొదలుకొని గడ్డిపోచ వరకుగల ఏ నామ - రూపాత్మక వ్యక్తియూ ఎన్నడును స్పర్శించలేడో, లేదా చేతితో చిత్రమును నొక్కిపట్టి దానిని చూచినపిమ్మట, లేదా నీటితో ఉప్పును కడుగుటకు ప్రయత్నము చేసినపిమ్మట, లేదా మేల్కొనినపిమ్మట స్వప్నమును అనుభవించవలెనని ప్రయత్నముచేసినపిమ్మటను ఏమియూ మిగిలియుండని విధమున ఏజ్ఞానముతో జ్ఞేయమును చూచినపిమ్మట జ్ఞాత, జ్ఞానము మరియు జ్ఞేయము, మూడింటియందును ఏదియూ మిగిలియుండదో, లేదా బంగారమును కరిగించి దానినుండి మనయిష్టమువచ్చిన నగను తీయజాలనటుల, లేదా నీటిని వస్త్రగాలితముపట్టి దానినుంచిఎవడును తరంగములనువిడదీయజాలనటుల, ఏజ్ఞానముచే ఏదృశ్యవస్తువు భిన్నముగా కాన్పించదో (అనగా ఏదృశ్యవస్తువు భిన్నముగా కాన్పించదో) అట్టిజ్ఞానమే పూర్తిగా సాత్త్వికమగును. ఎవడైన మనుష్యుడుఅతికుతూహలముతో అద్దపు పెంకును చూడబోయినప్పుడాతనికి తనముందు తనయొక్క స్వరూపమే కాన్పించును. ఇదేవిధముగా జ్ఞేయముయొక్క నామ - రూపములుకూడా నాశముసర్చి ఏజ్ఞానము స్వయముగా జ్ఞాతగానే యగునో, మరియు ఏ జ్ఞానము మోక్ష - లక్ష్మికి దేవాలయమో, అదియే సాత్త్వికజ్ఞానము. ఇక రాజసజ్ఞానమును గురించి వివరించెదను వినుము.

పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్॥ ౨౧

"ఓ అర్జునా, వినుము. ఏ జ్ఞానము భేదమనెడి ఆధారముపై నుండుడుగు వేయునో, దానిని రాజసముగా నెరుంగవలెను. స్వయముగా భేదభావముతో భూతకోటియందు దసంఖ్యాకభేదముల నేర్పరచి, మరియు జ్ఞాతను కూడా మోసగించి ఏ జ్ఞానము విచిత్రితను జనింపజేయునో, ఏ జ్ఞానము

వాస్తవికమగు ఆత్మ జ్ఞానక్షేత్రమునకు బయట మిథ్యామోహమనెడి కందకములో జీవుని 'నిద్ర' ప్రత్యక్షముగా కనిపించెడి వస్తువులపై విస్మృతియనెడి తెరను వేసి మనుష్యునికి స్వప్నమునందలి వ్యర్థమగు చింతనలను గురించిన అనుభవము కలిగించువిధమున' జాగ్రత్, స్వప్న, సుషుప్తులనెడి ఆటను చూపించునో, ఏ జ్ఞానమువలన నామము మరియు రూపములనెడి వాటి చాటున దాగియున్న అద్వైతతత్త్వము 'నగలచాటున దాగియున్న బంగారము ఏచిన్నపిల్లవానికీ కాన్పించని విధమున' కాన్పించదో, ఏజ్ఞానమువల్ల 'కుండలు మరియు బానలరూపములో కాన్పించెడి మట్టి అజ్ఞానులకు కాన్పించని విధమున, లేదా దీప మనెడి భావమును కలిగియున్నందువల్ల దానియందుండెడి అగ్నిని గురించిన జ్ఞానము వుండనిరీతిని, లేదా వస్త్ర మనెడి పేరు ఏర్పడుట వలన మూఢులకు దానియందలి నూలుపోగులను గురించిన జ్ఞానము వుండని రీతిని' శుద్ధ అద్వైత తత్త్వమును గురించిన జ్ఞానమే కలుగనేరదో, ఏ జ్ఞానము వలన భూతకోటి భిన్నభిన్నముగా కాన్పించసాగునో, మరియు ఏకత్వబుద్ధి నశించునో, మరియు అంతట కట్టెలవలన అగ్నిపైన పుష్పములవలన సుగంధముపైన; లేదా తరంగములవలన పూర్ణచంద్రునిపైననూ' భేదభావము ఆరోపింపబడెడిరీతిని, ఏ జ్ఞానము రకరకములగు పదార్థభేదము నొనర్చి వాటి రూపములు మరియు ఆకారముల ననుసరించి వాటిని చిన్నది-పెద్దది యగు అనేకమైన వర్గములుగా విభజించునో, ఆ జ్ఞానము రాజస మగును. ఛండాలుని యింటికి పోకుండా కాపాడుకొను తలంపుతోమాత్రమే 'అతడెచట, ఎటుల వుండునని' తెలిసికొన వలసియుండును. సరిగా యిదే విధమున, తామస జ్ఞానముయొక్క లక్షణములను కూడా తెలిసికొనుట ఆవశ్యకమై యున్నది. కావున ఆలక్షణములను కూడా తెలిపెదను, నీవు చక్కగా తెలిసికొనుము.

> యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే సక్త మహైతుకమ్।
> అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్॥ ౨౨

ఓ అర్జునా, ఏజ్ఞానము శాస్త్రవిధులనెడి వస్త్రమును ధరించదో (అనగా శాస్త్రవిధులను లక్ష్యపెట్టదో,) మరియు, యిందుమూలముగా నగ్నముగా నున్నందువలన దేనివైపు సదాచారమనెడి తల్లియైన శ్రుతి ఎన్నడును పొరబాటుగానైన చూడదో, మరియు శాస్త్ర బహిష్కారము వలన ఏ జ్ఞానమునకు నిందనుసరించిన చింతయైన నుండదో, మరియు యిందువల్ల, దేనిని యితరులుకూడా (అనగా, స్మృత్యాదులుకూడా) మ్లేచ్ఛధర్మపు పర్వతముపై ప్రక్క అదలించి త్రోసివైచినో, మరియు ఓ అర్జునా ఏజ్ఞానము [illegible] తమోగుణ పిశాచముచే ఆవేశింపబడి యుండుటచే పిచ్చివాని వలె యిటు - నటు భ్రమించి తిరుగుచూ నుండునో, ఏ జ్ఞానము శరీర సంబంధమగు ఏవిధమైన బాధనూ అంగీకరింపదో, ఏది ఏపదార్థమునూ నిషిద్ధముగా తలంచదో, ఏజ్ఞానము పాడుపడ్డ గ్రామములో వదలబడిన కుక్కవలె 'నోటపట్టని పదార్థమును, లేదా తినగానే నోరుకాలెడి పదార్థమును మాత్రమే విడచిపెట్టి' మిగిలిన వాటినన్నింటిని భక్షించునో, ఏ జ్ఞానము 'బంగారుతో తయారైన వస్తువును యీడ్చుకొని తన బిలములోనికి తీసికొనిపోవునప్పుడు ఆబంగారము స్వచ్ఛమైనదా లేక కల్తీబంగారమా యని యోచించని ఎలుకవలె, నుండునో, లేదా ఏజ్ఞానము మాంసమును తినునప్పుడది నల్లగానున్నదా లేక యెర్రగానున్నదా — యని ఆలోచించని మాంసాహారియగు పురుషుని పోలియుండునో, లేదా ఏజ్ఞానము అడవియందంటుకొనెడి నిప్పువలె 'ఇదేమిటి, అదేమిటి యని' చూడదో, లేదా ఏజ్ఞానము 'ఏదైన శరీరముపై వ్రాలునప్పుడు యిది మృతశరీరమూ, లేక జీవించియున్న శరీరమా' యని ఆలోచించని యీగను పోలియుండునో, లేదా ఏజ్ఞానము 'ఈ అన్నము వమనమొనర్చినదో, లేక వడ్డించినదో, లేక తాజాయైనదా లేక కుళ్ళిపోయినదా—యనెడి ఆలోచనయే చేయనట్టి' కాకి యొక్క జ్ఞానమువలెయుండునో, తాత్పర్యమేమన, ఏ జ్ఞానము ఫలానా వస్తువు లేక విషయము నిషిద్ధమైనదిగాన నిషేధింపవలెను, లేదా ఫలానా

విషయము లేక వస్తువు యోగ్యమైనదిగాన స్వీకరించవలెనని - యోచించదో, ఏ జ్ఞానము తన ఎదుటకు వచ్చిన పదార్థముల నన్నింటిని తన భోగవిషయములుగా నొనర్చుకొనునో, మరియు ఏ జ్ఞానము తనకు లభించిన ప్రతి స్త్రీని తన శిశ్నమునకు సమర్పించునో, మరియు ప్రతి పదార్థమునూ ఉదరమునకు అర్పించునో, ఏ జ్ఞానము నీటిని చూచినప్పుడు 'యిది శుద్ధమైనదా లేక అశుద్ధమైనదా-యని యోచించక' నా దప్పిక తీరునని మాత్రము తలంచి వెంటనే త్రాగివేయునో, మరియు ఏ జ్ఞానము ఆహార-పానీయముల విషయమునందు కూడా యీ సిద్ధాంతమునే పాటించి, ఖాద్యా ఖాద్యములు మరియూ నింద్యానింద్యము లాదిగాగల విషయములను గురించి ఆలోచించక నోటికి ఏది మధురముగా నుండిన అదే పవిత్రమైనదని తలంచునో, స్త్రీ జాతి విషయమునకూడా కేవలము త స్పర్శేంద్రియమును మాత్రమే ప్రధాన నిర్ణయకర్తగా తలంచి, ఆమెతో శారీరక సంబంధమేర్పరచు కొనుటయే తన ముఖ్యసిద్ధాంతముగా నుంచుకొనును, మరియు తనకేదైన స్వార్థము సిద్ధించెడివారిని మాత్రమే తనచుట్టు - పక్కములుగా తలచి బంధుత్వ విషయములో శారీరకబంధము నేమాత్రము పాటించడో, - యీవిధమగు ఆలోచనలు ఏ జ్ఞానము వలన కలుగునో, అదియే తామసజ్ఞానము. మృత్యువు అందరినీ భక్షించును. అగ్ని అన్నింటినీ దగ్ధమునర్చును. ఇదేవిధమున తామసజ్ఞానము గలవానికికూడా ఎల్లప్పుడు (ఈ ప్రపంచమంతయూ తాను భోగించుటకొరకే ఏర్పడియున్నదని) తోచుచుండును. ఈ జగత్తంతయూ నేను భోగించుటకొరకే ఏర్పడియున్నదని విశ్వసించువాని వంతునకొకేఫలమువచ్చును. ఆఫలమేది? అది, తన శరీరమును పోషించుకొనుటే. ఆకాశమునుంచి వర్షరూపమున భూమిపైన పడెడి నీటికి అంతిమ ఆశ్రయస్థానము సముద్రమే అయినవిధమున తామసజ్ఞానముచేసెడి పనులన్నియూ కూడా కేవలము తనపొట్టకొరకే. తనను పోషించుకొనుటకొరకు మాత్రమే జరుగును. కేవల మింతియేకాదు. యీ జ్ఞానమునకు స్వర్గ - నరకములుకూడా

కాన్పించవు. మరియు స్వర్గమును సంపాదించుకొనవలెను. నరకమునుండి రక్షించుకొనవలెను– అనెడి తలంపే దీనికి వుండదు. మరియు యీ జ్ఞానమునకు శరీరమే ఆత్మ మరియు దేవుడనగా కేవలము రాతివిగ్రహమని మాత్రమే తెలియున్నది. మరియు యీ జ్ఞానము 'శరీరపాతమగుట తోడనే కర్మలన్నింటితోపాటు ఆత్మకూడా నశించుననిన్ని, అప్పుడు భోగించుటకు కర్మలూ మిగిలియుండవనిన్ని' బోధించును. లేదా, ఒకవేళ యీశ్వరుడున్నాడనిన్నీ, అతడే అందరినీ భోగముల ననుభవించుటకు ప్రవృత్తి మొనర్చుననిన్ని అంగీకరించినప్పటికినీ యీ జ్ఞానము అట్టి యీశ్వరునే తనగొట్టుమనిన్ని, అన్నిచిక్కులూ అందువల్ల తొలగిపోవుననిన్ని బోధించును. లేదా మన నివాసస్థలమందున్న దేవాలయమందలి రాతివిగ్రహమందున్న యీశ్వరుడే యీ ప్రపంచమునంతనూ శాసించుచున్నాడని అంగీకరించుచో, యీ జ్ఞానము – దేశమందున్న యీ పర్వతము అన్నియూ ఏల మెదలకుండా పూరుకొన్నవనిన్నీ, అవి యేల యీ ప్రపంచమును శాసించుటలేదనిన్ని – అడుగును! తాత్పర్య మేమన, యీ జ్ఞానము యీశ్వరు డున్నాడని ఒకవేళ అంగీకరించినా అతడు కేవలము రాతివిగ్రహమే యనును, మరియు ఆత్మ యనగా శరీరమే యనిన్ని, పాప – పుణ్యాది యితర విషయములు పూర్తిగా మిథ్యాగా తలంచి ఎల్లప్పుడూ విషయములందు లిప్తుడైయుండి అరణ్యమందలి అగ్నివలె సమస్తమునూ భక్షించుచూ పోవుటే సమంజస మని నిశ్చయ మొనర్చుకొనిన జ్ఞాన మేది గలదో, ఆ జ్ఞానమే తామస మగును. ఏ జ్ఞానమువలన మానవుని మనస్సున 'చర్మచక్షువులకు గోచరించునట్టివీ మరియు యింద్రియములను మరఫిరించునట్టి మాధుర్యము గలిగియున్నట్టి వస్తువులు మాత్రమే నిజమైనవీ మరియు సరియైనవీ యనెడి' నమ్మకము కలుగునో, ఆ జ్ఞానమే తామస మగును. మరియు సంక్షేపముగా చెప్పవలెనన్నిన, ఓ అర్జునా! యీ ఆలోచనా ప్రవాహమే వృద్ధి పొంది వృద్ధిపొంది–

పొగచే ఏర్పడిన మేఘములు ఆకాశమున వ్యర్థముగనే యిటు-నటు తిరుగుచుండురీతిని, లేదా కొన్ని అడవిమొక్కలు పచ్చగా నుండకపోయినప్పటికినీ పనికివచ్చి మరియు ఎండకపోయినప్పటికిని ఉపయోగపడి, తమంతతామే పెరిగి పెద్దవై అంతమున నాశమొందురీతిని, లేదా చెరకుయొక్క పైభాగము, నపుంసకుడూ లేదా వెణుకురుచెట్టూ - యివి ఎంతగా పెరిగినప్పటికిని నిరుపయోగమే యగురీతిని, లేదా చిన్నపిల్లవాని లక్ష్యము, దొంగవాని యింటియందలి ద్రవ్యము మరియు మేక కంఠమందలి స్తనములూ - యివి చూచుటకు ఎంత చక్కగా నున్నప్పటికిని పూర్తిగా నిష్ఫలమే యగురీతిని-వ్యర్థమగు రూపమును ధరించును గాన, యీ విధముగా వ్యర్థముగను నిస్తేజముగను కాన్పించు జ్ఞానము నే నేను తామస జ్ఞాన మందును. వాస్తవముగ చూచినచో, దానిని జ్ఞానమనియే చెప్పరాదు; అయినప్పటికిని, నేను దీనిని జ్ఞాన మని చెప్పుటకు గల కారణము, పుట్టుగ్రుడ్డియొక్క కనులు చూచుటకు చక్కగా కాన్పించురీతిని, లేదా చెవిటివాని చెవులు చూచుటకు సరియైనవిగా కాన్పించు విధమున, లేదా మద్యమును లోకులు 'పాన' మను రీతిని, యీ తామసజ్ఞానమును కూడా 'జ్ఞాన' మనుట కేవలము సంకేతమును సూచించుటకే యైయున్నది. తాత్పర్యమేమన, తామసవృత్తికి వుండెడి జ్ఞానము వాస్తవమునకు జ్ఞానమేకాదు. అది కేవలము, తెరచియున్న కనులకు గల చీకటియే. శ్రోతృశ్రేష్ఠుడవగు ఓ అర్జునా, యీ త్రిగుణముల వలన ఏర్పడెడి జ్ఞానమందలి త్రివిధములనూ నీ కీరీతిని వివరించి చెప్పితిని. ఇక ఓ అర్జునా, యీ త్రివిధముగా గల జ్ఞానప్రకాశము వల్లనే కర్తచేసెడి కర్మలన్నియూ జరుగుచున్నటుల కాన్పించును. ఇందువలననే, పారుచున్న ప్రవాహము ముందుకు వచ్చిన జలము దానిలో కలసిపోయి, దానితో ప్రవహించు సాగురీతిని, కర్మలు కూడా త్రివిధ జ్ఞానములనెడి త్రివిధమార్గములందు పోవుచుండును. మరియు, ఓ కే. కర్మ జ్ఞానమునందలి త్రివిధభేదము

వలన త్రివిధములుగా నగును. అందు మొదటగా సాత్త్విక కర్మయొక్క లక్షణములను చెప్పెదను వినుము.

నియతం సంగ రహిత మరాగద్వేషతః కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే ॥ 23

"పతివ్రతా స్త్రీ స్వయముగనే తన పతిని కౌగలించుకొను రీతిని, తన అధికారమును ఆధారముగా చేసికొని ఏ కర్తవ్యములు స్వాభావికముగా వచ్చి మన కంఠమున పడునో, ఏకర్తవ్యములు మన అధికారమువలన మనకు 'శ్యామల వర్ణముగా గల శరీరమునకు చందన లేపనము లేదా తారుణ్యవతియగు స్త్రీ నేత్రములకు కాటుకవలె' ఆభూషణములై శోభిల్లునో, అవియే నిత్యకర్మలు; మరియు అవి మంచివియే యగును. మరియు, వాటితోపాటు నైమిత్తిక కర్మలుకూడా వచ్చి కలియుచో, అంతట వాటి స్థితి బంగారుకు సుగంధమబ్బిన విధముగా నుండును. తన ఆత్మ మరియు శరీరమునకు అనేక కష్టములు కలుగజేసికూడా తల్లి తనబిడ్డను పెంచి పోషించును; అయినప్పటికిని ఆమె మనస్సెన్నడును తనకు కలిగిన యీ కష్టములకు దుఃఖించదు. సరిగా యిదేవిధమున, హృదయపూర్వకముగా సమస్త కర్మలను ఆచరించవలెను. వాటి ఫలములవైపు ఏమాత్రము దృష్టిని యుంచరాదు. మరియు కర్మల నన్నింటిని బ్రహ్మార్పణ మొనర్చవలెను. ఏ స్త్రీయైనా తనభర్త బిడ్డలు మరియు ప్రియజనులకు ముందు భోజనము వడ్డించసాగినప్పుడు ఆమెమనస్సులో 'యీ అన్నమంతయూ అయిపోవును. దీనిలో నాకేమియూ మిగిలియుండదనెడి' ఆలోచన ఏమాత్రము జనించదు. సత్కర్మల నొనర్చునప్పుడు కూడా మానవు డెల్లప్పుడు యీ విధమగు మనోవృత్తియే కలిగియుండవలెను. ఇట్టిస్థితిలో, పని పూర్తిగా నెరవేరనప్పుడు విషాదమెన్నడును మానవుని దుఃఖపెట్టదు, లేదా ఒకవేళ ఆపని పూర్తియైనందువలన అతడతిగా ఆనందించనూ ఆనందించడు.

ఓ అర్జునా, యీ విధమగు యుక్తుల ననుసరించి ఏ కర్మ లాచరింపబడునో, ఆకర్మలు తమ యీగుణమువలననే సాత్త్వికములుగా చెప్పబడును. ఇక రాజస కర్మయొక్క లక్షణములను చెప్పెదను. నీ వీ సంగతులపట్ల నీ అవధానమును తక్కువ కానివ్వకుము.

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్ ॥ ౨౪

"ఎవడైన మూర్ఖుడగు మానవుడు తనయింటిలో తల్లిదండ్రులతో ఎన్నడును ఒక్కమాటైనమధురముగా మాట్లాడక, బయటప్రపంచ మంతటితోను అత్యాదరముతో వ్యవహరించురీతిని, లేదా తులసిమొక్కకు ఎన్నడైనను ఒక్క నీటిబొట్టైనా చల్లక, ద్రాక్షతీగె మొదలును పాలతో తడుపు విధమున, ఎవడు నిత్యనైమిత్తిక కర్మల నొనర్చుటకై తాను కూర్చున్న ప్రదేశమునుండి లేచుటకు కూడా యిష్టపడక, తనకు లభించెడి పని వచ్చినప్పుడు శరీరమునకు కష్టము కలిగించుటకు కూడా వెనుకాడడో, మరియు మంచిపంటను పండించుటకై విత్తులు నాటునప్పుడు విత్తులు ఎక్కువగా నాటితిమని ఎన్నడును అనుకొనని విధమున, తనకు యథేష్టముగా లాభించునని ఆశయున్నచోటున ధనవ్యయ మొనర్చుటకు ఎవ డేమాత్రమును సంకోచించడో, లేదా స్పర్శమణి లభించిన పిమ్మట రసాయనశాస్త్రవేత్త యినుమును కొనుటకై తన ఆస్తి నంతనూ సంతోషముగా అమ్మివేయు రీతిని, రాజస కర్తకూడా భవిష్యత్తునందు లాభించనున్న ఫలముపై దృష్టి నుంచి గొప్ప గొప్ప కష్టసాధ్యములగు కామ్యకర్మల నొనర్చును. మరియు యీ విధముగా అత ఎంత అత్యధికముగనైన కర్మల నొనర్చినాక, అతని కవియన్నియూ అతి కొద్దిగానే కాన్పించును. అతడు ఫలాశలో చిక్కుకొని యున్నందువల్ల తాను చేసెడి కామ్యకర్మ లన్నింటిని అతి చక్కగానూ మరియు ఆడంబరముగానూ చేయును.

మరియు, దానితోపాటు అతడు తాను చేసెడి పనుల నన్నింటిని లోకమున చాటుకొనుచూ పోవుచుండును. మరియు ప్రపంచమం దంతటను 'కర్మల నన్నింటిని చేయువాడను నేనేనని చెప్పుకొని తన నామ - మహాత్మ్యమును ప్రకాశిత మొనర్చుకొనును. ఇక అతనిలో వుండెడి కర్తృత్వాహంకారము 'అతడు తన తండ్రి లేదా గురువుల గొప్పదనమునుకూడా లక్ష్య పెట్టనంత' అత్యధికముగా నుండును. ప్రాణములు తీసెడి జ్వరము ఏ ఔషధమునూ అంగీకరించని విధముగ, అతడుకూడా ఎవనినీ అంగీకరించడు. ఈ రీతిని అహంకారముచే పడగొట్టబడి ఫలాశలో చిక్కుకొనియున్న మనుష్యునిచే పెక్కుకర్మలు అత్యనురాగముచే చేయబడును. మరియు అతడుకూడా అనేక కష్టములను ఓర్చుకొని 'గారడీవాడు తనపొట్ట నింపుకొనుటకై రకరకములైన కఠినము మరియు కష్టసాధ్యములగు ఆటల నాడురీతిని' చేయును; ఇట్టి కర్మలన్నియూ రాజసములగును. ఒక్క ధాన్యపు కణమునకైనకూడా ఎలుక పర్వతమును త్రవ్వురీతిని, లేదా నాచు కొరకై కప్ప సముద్రమునంతను మలినమొనర్చు రీతిని లేదా కేవలము భిక్షమునకై పాములవాడు పామును పుచ్చుకొని యింటింటికీ తిరుగు విధముగ, అనేక కష్టముల ననుభవించి తన లాభమునకై చేయబడు కర్మ లన్నియూ రాజసము లగును. కాని, కొందరికి యీ విధమగు కష్టముకే అతి ప్రియముగా నుండును. ఒక అతిచిన్నదగు ధాన్యపుకణమును తెచ్చుకొనుటకై చెదపురుగు పాతాళలోకము వరకుకూడా రంధ్రము చేసుకొనుచునే పోవు రీతిని, స్వర్గసుఖములు లభించునవెడి ఆశతో అనేక కష్టములతో నిండియున్న పరిశ్రమతో చేసెడి క్లేశకరమగు కామికకర్మలనే రాజసకర్మలుగా నెరుంగ వలెను. ఇక, తామసకర్మల లక్షణములను చెప్పెదను వినుము.

అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్
మోహా దారభ్యతే కర్మ యత్త త్తామస ముచ్యతే॥ ౨౫॥

"ఏ కర్మలు నిందాగ్రహముల వంటివో, మరియు వేటివలన నిషేధముయొక్క జన్మ సార్థకమగునో, అవన్నియూ తామసకర్మ లగును నీటిపై గీసిన గీతవలె ఏ కర్మల నాచరించిన పిమ్మట వెనుక నేమియూ మిగిలియుండదో, లేదా మజ్జిగను చిలుకుట, బూడిదలో వూదుట, లేదా నూనెను తీయుటకై గానుగలో యిసుకవోసి త్రిప్పుట, లేదా పొల్లును చెరుగుట, ఆకాశమున ఏదైనా వస్తువును గ్రుచ్చుట, లేదా గాలిని పట్టుకొనుటకై వల పరచుట — మొదలగు పనులన్నియూ నిష్ఫలములూ మరియు వ్యర్థములూ నగు రీతిని, ఏ కర్మల నొనర్చిన పిమ్మట పూర్తిగా వ్యర్థములై పోవునో, మరియు ఏ మాత్రపు ఫలమూ వుండదో, లేదా ఒకవేళ ఆ కర్మలు వ్యర్థముగా పోకున్నప్పటికిని మానవ శరీరమువంటి బహుమూల్యవస్తువు వ్యయమొనర్చి ఏ కర్మల నొనర్చుట వలన ప్రాపించిక సుఖము నాశమొందునో, ఆకర్మలన్నియూ తామసములగును. లేదా కమలముపై ముళ్లవల వేయుటచే ఆ వలయొక్క ముళ్లు తెగిపోవుటేగాక కమలదళములుకూడా దెబ్బతిని పగిలి పోవు రీతిని, లేదా దీపమును ద్వేషించుటవల్ల మిడుతలు దానిపై పడి, తమకు తామే ఒడలు కాల్చుకొని, దీపమును ఆర్పివైచి లోకమునకు చీకటిని కలుగజేయురీతిని తన సర్వస్వమూ వ్యర్థముగా నాశనమైపోయిన పోవుగాక, తన శరీరమునకుకూడా కీడు తెచ్చుకొనిన తెచ్చుకొనుగాక, కాని ఏకర్మలవలన బుద్ధిపూర్వకముగా యితరులకు అహితము చేయబడునో, ఏకర్మాచరణవలన 'తనకు కావలసిన ఆహార-పానీయము లన్నింటిని మనుష్యుని నుండియే పొందియున్నప్పటికినీ, తన ఆచరణవలన మనుష్యునకు వమనమనెడి కష్టమును కలిగించెడి యీగయొక్క దుష్టత్వము జ్ఞప్తికివచ్చునో, అది యన్నియూ తామసకర్మ అగును. మరియు యీ కర్మలన్నియూ తనయందీకర్మలు చేయుటకు కావలసిన సామర్థ్యము వున్నదోలేదో ఆలోచించకుండానే చేయబడును. అంతేగాదు, మనశక్తియెంత, యీ పనిచేయుటలో ఎన్నికష్టములు పడవలెను. మరియు అంతమందు దీనిచే మన కేఫలము సిద్ధించును—అనికూడా ఆలోచించ

బడును. ఈవిధముగ విషయము లన్నింటి యోచనయూ అవివేకపూర్వకముగా కాళ్ళతో త్రొక్కివేసి, ఆపిమ్మట యిట్టికర్మలనొనర్చుటకు ఆయోజన మొనర్పబడును. మొట్టమొదట స్వయముగా తనయింటినే కాల్చివేసి అగ్నిబయటకు పోవును. మరియు, స్వయముగా తన మర్యాదనే ముంచివైచి సముద్రము పైకీ, మరియు బయటకూ పొర్లిపోవును. అటుపిమ్మట ఆ అగ్నిలేదా ఆ సముద్రము చిన్న - పెద్దా యని ఏమాత్రమూ యోచించక, వెనుక - ముందు లేమియూ చూడక మరియు వంకర - తిన్ననైన మార్గములను ఏకాకార మొనర్చుచూపోవును. మరియు దాని యాక్రమము తెంపులేకుండా పోవుచునే వుండును సరిగా యిదేవిధముగ, మంచి - చెడ్డ, దుష్ట - సుష్టాది యోచనను చేయకుండానే, మరియు తనవాడు - పరాయివాడు అనక అందరికినీ వ్యథ కలిగించుచూ ఏ కర్మ లొనర్చబడునో, అవి యన్నియూ తామసకర్మలే యని నిశ్చయముగా నెరుంగవలెను. ఓ అర్జునా, త్రిగుణముల ననుసరించి కర్మలు కూడా త్రివిధములుగా నుండునని, వాటి లక్షణములతో నీకు వివరించి చెప్పితిని. ఇక యీకర్మల నన్నింటిని చేసి మరియు వీటి కర్తృత్వాహంకారమును కలిగి యుండెడి జీవునియందు కూడా త్రివిధత్వము ఏర్పడును. ఒకే పురుషుడు బ్రహ్మచర్యాది నాల్గాశ్రమములందును వుండి విడివిడిగా నాల్గు విధములుగా కనిపించు విధమున కర్మలయొక్క త్రివిధత్వము వలన కర్తయందు కూడా త్రివిధత్వము వచ్చును. కావున యీ త్రివిధములగు కర్తలలోనూ. మొదటివాడగు సాత్త్విక కర్తను గురించి ముందుగా వివరించెదను శ్రద్ధగా వినుము.

ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ ౨౬

“ఫలాశ లేనందువలన మలయగిరి యందలి చందన వృక్షశాఖలు పూర్తిగా తిన్నగానూ, క్రమమైన పెరుగుదలతోనూ వ్యాపించియుండు రీతిని

లేదా కాయలు కాయక పోవుటయందే తమలపాకుతీగయొక్క జన్మము సార్థకమగు రీతిని, సాత్త్విక కర్తకూడా ఎల్లప్పుడూ తన నిత్యనైమిత్తిక కర్మల నొనర్చుచుండును. కాని, యీ ఫలశూన్యత్వము వలన అతని ఆకర్మలకు విఫలత ప్రాప్తించదు; ఏలనన, ఓ అర్జునా! ఎన్నడైన ఫలములలో కూడా ఫలములు కాయుటగలదా? ఏ మనుష్యుడు పనుల నన్నింటిని అత్యాదరముతో అనురాగపూర్వకముగా చేసినవాడై యుండికూడా 'నేను కర్తను' అనెడి అహంకార భావన నెన్నడును స్పృశింపనైన స్పృశింపడో, ఎవడు వర్షాకాలమందలి మేఘములవలె పరమాత్మపై నిరంతరము వర్షింపదగిన విపులముగ కర్మాచరణ మొనర్చుచుండునో, ఎవడు ఉచితసమయమును సాధించునో, శుద్ధస్థలమును చూచునో, కర్మవిధులను శాస్త్రవచనములపై ఆధారపడి నిర్ణయించునో, తన మనస్సును ఏకాగ్రమొనర్చునో, చిత్తము ఫలాశవైపు ప్రవృత్తము కానివ్వడో, నియమములను తగురీతిని పాలించునో, మరియు యీ నిర్బంధమును ఓర్చుకొనుటకై తనలో తాను పూర్తిగా ధైర్యము తెచ్చుకొనుటకై నిరంతరము చింతించుచూ ప్రయత్నము చేయునో; మరియు కేవలము ఆత్మస్వరూపముపై గల ప్రేమవలన కర్మలను చేయుచున్నప్పటికికూడా ఎవడు శారీరకసుఖములనెడి వలలో చిక్కుకొనడో, ఎవనియందు బద్ధకము మరియు నిద్రలు నామమాత్రమునకైన వుండవో, ఎవడెన్నడును ఆకలిచే పీడింపబడడో మరియు శారీరక సుఖము లెవనికి ప్రీతికరము కావో మరియు యివన్నియూ వున్నప్పటికిని కర్మలపట్ల ఎవని ఉత్సాహము "కల్తీభాగము కాలిపోవుటచే తూకములో తగ్గిపోయినప్పటికిన్ని బంగారము శుద్ధముగా నగురీతిని" క్రమక్రమముగా వృద్ధి పొందుచునే కాన్పించునో, అట్టివాడే సాత్త్విక కర్త యగును. వాస్తవముగ మనస్సున ఏదైన విషయము యెడల అనురాగ మేర్పడుచో ప్రాణము అతితుచ్ఛముగ తోచును. నిజముగ పతివ్రతా స్త్రీ తన పతిపై గల ప్రేమ వలన సహగమన మొనర్చుటకు సిద్ధమైనప్పుడు ఆమెకు అగ్నిప్రవేశ

మొనర్పు సమయమున భయముచే నెన్నడైన రోమాంచ మగునా ? ఇట్టి స్థితిలో ఓ అర్జునా ! ఆత్మస్వరూపమువంటి ప్రియపదార్థమును పొందుటకై సంసిద్ధుడైయున్న పురుషుడు తా నెన్నడైన తన శరీరము క్షీణించిపోయినదని ఖేదమొందునా ? కావుననే ఎవనికి గల విషయ సంబంధమగు వాంఛ నశించిపోయి, దేహాభిమానము తొలగిపోసాగినదో, రాను రాను కర్మాచరణ మొనర్చుటలో ఎవనికి ద్విగుణీకృతముగా ఆనందము లభించునో, మరియు, యీరీతిని ఎవడు నిరంతరము ద్విగుణీకృతానందమునతో కర్మాచరణ మొనర్చుచూ వుండునో, మరియు ఎన్నడైన తా నారంభించిన కార్య మేదైన కారణముచే అసంపూర్ణముగా ఆగిపోయినప్పటికినీ, ఆకార్యము చెడిపోవుట వలన ఎవనికి పర్వతముపైనుంచి క్రిందికి పడిపోయినబండి తనకొరకై ఎన్నడును దుఃఖించని విధమున ఏదుఃఖమూ కష్టమూ కలుగదో, లేదా ఆరంభించిన కార్యము సిద్ధించుటచే నాలుగు మూలలందును తనవిజయమును గురించి చాటించుకొనుచూ ఎవడుతిరుగడో, తాత్పర్య మేమన, ఎవ డీ లక్షణము లన్నింటితోనూ కూడియున్నవాడై పనులు చేయుచూ కాన్పించునో, ఓ అర్జునా, వాస్తవమునకు అతనినే సాత్త్వికకర్తయని చెప్పవలెను. మరియు ఓ పార్థా, రాజసకర్త ఎల్లప్పుడూ లౌకికవాసనలలో మునిగియుండును—అతనిని గుర్తించుటకు గల లక్షణములను చెప్పెదను వినుము.

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ ౨౭

"గ్రామమందలి పెంటకుప్పపై చెత్తపోగులన్నియూ వచ్చి పోగై యుండురీతిని, లేదా అమంగళకరమగు వస్తువులన్నియూ వచ్చి శ్మశానమున మాత్రమే ఏకత్రితమగు రీతిని, ఏ పురుషుడు ప్రపంచమందంతటనుగల వాసనాదోషముల కన్నింటికిని కాల్పు తుడుచుకొనెడి పీచువంటివాడగునో, మరియు యిందుమూలమున ఏపురుషుడు అఖండఫలప్రాప్తి

కాన్పించెడి కర్మల నొనర్చుటకు మాత్రమే ప్రయత్నించునో, మరియు ఆ కర్మలవలన కలిగెడి లాభమునం దొక్క గవ్వనైన విడువక ఎవడు వాటికొరకై తన ప్రాణములనైన త్యజించుట కెల్లప్పుడు సంసిద్ధుడై యుండునో, ఎపుడు స్వయముగా తన వస్తువులను పూర్తిగా కాపాడుకొనుచున్నవాడైయుండి దానితోపాటు యితరులవస్తువులను హరించుటకు కూడా ఎల్లప్పుడు 'చేపనుపట్టుకొనుటకై కొంగ కాచుకొని యుండురీతిని' జాగరూకుడైయుండునో, ఎవనిస్థితి 'దగ్గరకు వచ్చిన వారిని తనముళ్ళతో పట్టుకొనుటే గాక తనను తాకెడివారి శరీరమును చీరుకుపోవునటుల చేసి, అప్పటికిని తృప్తితీరక, పుల్లదనమువలన తనకాయలను తిన్నవారినాలుకను చాల దుఃఖపెట్టునట్టి' రేగిచెట్టువంటిదో, ఎవడు నిరంతరము పరులకు దుఃఖమును కలుగ జేయుచూ, తన స్వార్థమును నెరవేర్చుకొనుటకై యితరుల హితమునుగురించి కూడా ఏ మాత్రము లక్ష్యపెట్టక, స్వయముగా తన పని చేయుటకై యితరుల కెన్నడును ఏమాత్రమైన సౌకర్యమును కలుగజేయడో, ఏ భావము తనకు నచ్చదో - అది ఎంత ఉదాత్తమైన దైనప్పటికిని - ఆ భావమునకు నెన్నడెన్నడును తన మనస్సును చొప్పింపడో, ఎవనిస్థితి ఉమ్మెత్తకాయవలె - లోపల విషమూ, బయట ముళ్లతో కూడియున్న కవచమూ కలిగియుండి - లోపలను బయటను ఏ మాత్రమూ శుద్ధత్వము లేనిదై యుండునో, మరియు ఓ అర్జునా, తాను చేసిన కర్మఫలము లభించినప్పుడెవడు ఆనందముచే ప్రపంచము నంతను పరిహసించునో, లేదా ఆరంభించిన పని చెడిపోయి నిష్ఫలమైనప్పుడే పురుషుడు శోకమును పొందినవాడై ప్రపంచము నంతను తిట్టి శపించ నారంభించునో, మరియు, ఓ అర్జునా, యీ రీతిని ఎవడు కర్మలయందు చిక్కుకొని యుండునో, అతడు రాజస కర్తయని యెరుంగవలెను. ఇక తామస కర్తను గురించి వివరించి చెప్పెదను. అతనిని దుష్కర్మ లన్నింటియొక్క ఫలించి పుష్పించెడి ముఖ్యప్రదేశముగా నెరుంగవలెను.

అయుక్తః ప్రాకృత స్తబ్ధ శ్శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ ౨౮

"తాను స్పర్శించుట వలన యితర వస్తువు లేరీతిని దగ్ధమగుననెడి జ్ఞాన మేమాత్రము అగ్నికి వుండదని విధమున, లేదా శస్త్రమునకు తనకు గల తీవ్రమైన పదునువలన యితరుల కేవిధముగా తీవ్రమగు కష్టముకలుగు చున్నదో తెలియ రానటుల, లేదా కాలకూటవిషమునకు తా నొనర్చు ఘాతుక కృత్యమును గురించిన జ్ఞానము వుండనిరీతిని, ఓ అర్జునా, ఎవడు తన ఎదుటికి వచ్చిన జీవులకు కీడొనర్చి తన దుష్కార్యములను కొనసాగించు కొనుచుండునో, మరియు ఆ దుష్కర్మల, నాచరించునప్పుడు యిష్టానుసారము అతివేగముగా పరుగెత్తెడి మేఘములవలె - తనచే నేమి జరుగుచున్నదో - తలంచనైన తలంచడో, మరియు ఓ అర్జునా; ఎవడు కార్యా కారణములందు ఐక్యత లేనందువలన పిచ్చివాడు కూడా ఎవనిముందు తృణమునేపాటి వరకైన ఆగడో, మరియు ఎద్దుయొక్క పొట్టను పట్టుకొని యున్న బుడ్డబుడుచువలె ఎవడు యింద్రియములచే వృద్ధి పొందింపబడిన విషయభోగముల నాధారమొనర్చుకొని తన జీవితమును నిర్వహించుకొనునో, ఎవని ఉనికి అజ్ఞానియగు చిన్న పిల్లవానివలె ఒక్కొక్కప్పుడు తనలో తానే నవ్వుకొనుచూ-తనలో తానే ఏడ్చుచుండు నటుల వుండునో, ప్రకృతిలేక మాయచే అంకితుడగుటచే 'కృత్యమేది, అకృత్యమేది' యనెడి యోచనయే యెవనికి వుండదో, మరియు కేవలము పెంటలవల్లనే వృద్ధిపొందెడి పెంట కుప్పవలె ఎవడు మిథ్యాపూరితమగు సంతృప్తితో నిండియుండునో, మరియు ఇందుమూలముననే ఎవడు తన అహమ్మన్యత్వమువలన స్వయముగా యీశ్వ రుని యెదుటకూడా వంగడో, మరియు గర్వమునందు పర్వతమును కూడా తుచ్ఛముగా తలంచునో, మరియు ఎవని మనోవృత్తి కాళ్ళతో మర్దించిన గింజలయొక్క నల్లని జేరావలె నల్లగానూ మరియు ఎవనిచూపు బజారున

కూర్చొనియుండెడి వేశ్యలనుండి ఎరువుతెచ్చుకొనిన చూపువలెనూ వుండునో, కారాంశమేమన, ఎవనిశరీరము కపటముతోనే నిర్మింపబడినదో, మరియు ఎవని జీవనము బూరదగాండ్ల కేంద్రస్థానము వంటిదో, మరియు ఎవనిదర్శనమును దర్శనమనక, స్వార్థలోలురగు భిల్లుల గ్రామముగానే ఎరుంగవలెనో, మరియు యిందువలన, ఎవనిమార్గమున ఎన్నడును ఎవడును పోరాదో, యితరులసత్కృత్యము లెవనిమనస్సున ములుకుల్లవలె బాధించునో, మరియు యితరుల మంచి పనులు కూడా ఎవరికిచిక్కులలో పడి 'ఉప్పుతో కలిసినందువల్ల పాలు త్రాగరానివైనటుల లేదా అగ్నిలో పడి చల్లగానున్న పదార్థముకూడ మండి నిప్పువలె యగు విధమున, లేదా మంచి ఆహారము కూడా శరీరమున ప్రవేశించి మలముగానై పోవురీతిని' విద్రూపము లగునో, ఎవడు గుణములకు కూడా దోషస్వరూపమునే యిచ్చునో, మరియు పామువలె అమృతమునుకూడా విషముగా చేయునో, మరియు అతని దగ్గరనే వుంచబడియున్నదా యన్నటుల ఎవనికి అతిత్వరగా నిద్రవచ్చునో; మరియు దుష్కార్యము ప్రారంభించుటతోడనే ఎవనివద్దనుంచి నిద్ర 'అతనిని మిక్కుటముగా అసహ్యించుకొనుచున్నదా-యన్నటుల' పారిపోవునో, ఎవడు వాస్తవిక కళ్యాణసాధనమునకు అనుకూలించిన అవకాశము వచ్చినప్పుడు 'ద్రాక్ష లేక మామిడి రసమును ఆరగించెడి రోజులలో కాకులకు నోటియందు వ్యాధివచ్చువిధమున లేదా పగటి వెలుగులో గుడ్లగూబ కనులు గ్రుడ్డివై యుండురీతిని, బద్ధకముతో నిండియుండునో, మరియు ఏదైనా నింద్యకర్మను చేయగలవినదిగా చెప్పినయెడల యీ బద్ధకము అతని అదుపులో వున్నదా యన్నటుల దూరముగా పారిపోవునో, సముద్రోదరమున ఎల్లప్పుడు బడబాగ్ని మండుచుండు రీతిని ఎవని మనస్సునం దెల్లప్పుడు మత్సరము బంధింపబడి యుండునో, మరియు ఎవడు శరీరమునందంతటను 'పిడకల నిప్పులో పొగ నిండియుండు విధమున లేదా [illegible]ద్వారమున ఎల్లప్పుడు దుర్గంధమే నిండియుండు రీతిని' నాసికవరకు మత్స

రముతో నిండియుండునో, ఓ వీరుడవగు అర్జునా, ఎవడు ప్రత్యక్షకర్మాంత ముసు కూడా దాటి యింకనూ ముందుకు పోవునంతటి కామ్యకర్మల నారంభించునో, కాని ఏదైన కళ్యాణకరమగు కార్యముల నొనర్చవలసి వచ్చుచో అతనినుండి ఒక్క గడ్డిపోచయైన లభించదో, ఓ అర్జునా, యీ లోకమునం దీ విధమున కేవలము మూర్తీభవించిన పాపసమూహ రూపమున ఏ పురుషుడు కాన్పించునో, ఆతనిని పూర్తిగా తామసకర్తగా నెరుంగవలెను. ఓ సజ్జన శిరోమణివగు అర్జునా, నీకీ క్రమముగా కర్మ, కర్త, మరియు జ్ఞానములందలి త్రివిధములుగా గల లక్షణములను చెప్పితినున్నాను.

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ ॥ 29

"ఇక అవిద్య యనెడి గ్రామములో మోహమనెడి వస్త్రమును ధరించి, తన శరీరముపై సంశయవృత్తులనెడి అలంకారములను ధరించి, అంగములు మరియు ఉపాంగ సహితముగ ఆత్మ - నిశ్చయముయొక్క ప్రకాశమును చూపించెడి అద్దము బుద్ధియై యున్నది; మరియు యీ బుద్ధిప్రవాహము కూడా త్రివిధములుగా నుండును. ఈ ప్రపంచమున సత్త్వాది త్రిగుణముల సంయోగముచే త్రివిధములుగా కానట్టి పదార్థ మేదియూ లేదు. గర్భమునం దగ్ని లేని కాష్ఠమేదైనా యీ సృష్టిలో గలదా? లేదు. ఇదే విధమున, యీ దృశ్య సృష్టిలో యీ త్రిగుణముల మూలమున మూడు రంగులుగా లేని ఏ వస్తువూ కూడా లేదు. కావుననే, బుద్ధికూడా యీ త్రిగుణముల సంయోగముచే త్రివిధములుగా నైనది. మరియు ధృతికూడా యీ స్థితియే సంభవించినది. ఇక, యీ బుద్ధి మరియు ధృతియందలి త్రివిధత్వమును వాటికి గల భిన్నభిన్న లక్షణములతో వివరించి చెప్పెదను. కాని, ఓ అర్జునా, ఈ రెంటియందును ముందుగా నేను బుద్ధియందలి త్రివిధములను గురించి వివరింతును. ఓ వీరుడవగు అర్జునా, యీ సంసారక్షేత్రమునకు వచ్చు జీవుల న్నింటికిని ఉత్తమము, మధ్యమము

మరియు నికృష్టము - అనెడి మూడు మార్గములు తెరచబడి యుండును. ఈ మూడుమార్గములున్నూ - నిత్య - నైమిత్తిక విహితకర్మలు, కామ్యకర్మలు మరియు నిషిద్ధకర్మలు - అనునవైయున్నవి. ఈ మూడుమార్గములున్నూ సంసార భయమువలన జీవులకు కష్టప్రదములగును.

ప్రవృత్తించ నివృత్తించ కార్యాఽకార్యే భయాఽభయే।
బంధం మోక్షంచ యావేత్తి బుద్ధిస్సా! పార్థ,సాత్త్వికీ॥ 30

"ఈ కర్మలన్నింటియందును మనుష్యుని అధికారమును శోభిలజేయు నట్టియు మరియు కేవలము స్వాభావిక క్రమము ననుసరించి ప్రాప్తించెడి దియు నగు నిత్యకర్మతే అన్నింటికంటె శ్రేష్ఠమైనది. ఆ నిత్యకర్మలను కేవలము ఆత్మ - ప్రాప్తి యనెడి ఫలముపై దృష్టియుంచి దప్పికగొన్న మనుష్యుడు జలమును త్రాగురీతిని - చక్కగా ఆచరించవలెను. ఈ మాత్రముననే ఆ కర్మలు జన్మభయమనెడి సంకటమును తొల గించి మోక్షప్రాప్తిని సులభ మొనర్చును ఈ విధముగా తన నిత్యకర్మల నాచరించు వానికి సంసార సంబంధమగు భయము తొలగిపోవును. మరియు అతడు కర్మల నొనర్చి మోక్షమును సంపాదించును. మరియు ఈ కర్మల నాచరించుటయందే మోక్షము గలదనియూ, మరియు నివృత్తియనెడి ఆధారముపై ప్రవృత్తిని రచించి యీ నిత్యకర్మలలో మునుగకుండా ఏల యుండరాదనియూ తలంచెడి బుద్ధియే సాత్త్వికమైనది యగును. దప్పికతో నున్నవానికి నీటిచే ప్రాణములు వచ్చును; మరియు వరదలో పడినవానికి యీత అవశ్యకమగును. ఘోరమగు అంధకారముతో నిండియున్న గోతిలో సూర్యకిరణముల సహాయమువల్లనే మార్గము కాన్పించును. సరిగా యిదే విధమున, పథ్యము మరియు ఔషధములు లభించుటవలన రోగముచే బాధ నొందు రోగికూడ ఆరోగ్యవంతుడగును, లేదా చేపకు జలాధారము లభించి నప్పుడు దానికి ప్రాణభయమేమియూ నుండదు. సరిగా యిదేవిధముగ,

యీ నిత్యకర్మాచరణము వలన మోక్షమే ప్రాప్తించును ఈ విధముగ కర్తవ్య కర్మ లేవో - తాను చేయకూడనికర్మ లేవో చక్కగా నెరింగియున్న బుద్ధియే సాత్త్వికమైనదగును. సంసారభయమును జనింపజేసెడి కామ్యాదికర్మలున్నూ మరియు నిషిద్ధములుగా నిర్ణయింపబడినట్టివియున్నూనగు నిషిద్ధ, అకరణీయ మరియు జననమరణ భయముతో నిండియున్న కర్మలవైపు పోక, వాటికి దూరముగా ఏ బుద్ధి యుండునో, అదియే సాత్త్వికబుద్ధి యగును. అకరణీయకము చేయబడదు. అగాధమగు లోతులోనికి దూకుటకు వలను పడదు, మరియు కాల్చినందువలన ఎర్రగానైనయినుమును చేతితో పట్టుకొనుటకు వీలులేదు, లేదా బుసలుకొట్టుచున్న కాలసర్పమును చూచి దానిని చేతబట్టుకొనజాలము, మరియు పెద్దపులి గుహలో అడుగుపెట్టము సరిగా యిదే విధమున, అకరణీయ కర్మలను ఎదుటచూచి ఏబుద్ధి నిస్సందేహముగ అత్యధికముగ భయభీతమౌలగునో, విషముకలిపి వండినఅన్నమున మృత్యువు వుండునటుల నిషిద్ధ కర్మలవలన మనుష్యుడు బంధనమునందు తప్పక పడవలసి యుండునని ఏబుద్ధి ఎరింగియుండునో, మరియు బంధనభయముచే నిండియున్నందువల్ల నిషిద్ధకర్మల విషయమున ఏబుద్ధి కర్మ - నివృత్తిని అవలంబించునో మరియు స్వచ్ఛము మరియు కల్తీలను పరీక్షించుటకు వీలువున్న విధమున కార్యాకార్య వివేచనచే ఏబుద్ధి ప్రవృత్తి - నివృత్తులను చక్కగా పరీక్షించునో, మరియు దానితో పాటు ఏ బుద్ధివలన కృత్యాకృత్య నిర్ణయముకూడా ఉత్తమరీతిని జరుగునో, అట్టిదియే సాత్త్వికబుద్ధియని నీవు జ్ఞప్తియందుంచుకొనుము.

యయా ధర్మ మధర్మం చ కార్యం చా కార్యమేవ చ ।
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ ॥ ౩౧

“ కొంగలు వుండు గ్రామమున పాలు మరియు నీరూకలసియే యుండు రీతిని (అనగా యీ రెండింటినీ విడదీయబడని విధమున, లేదా గ్రుడ్డివానికి రాత్రిం - బవళ్ళ గుర్తింపు వుండనటుల, లేదా పుష్పముల

నుండి మకరందమును తీసెడి భ్రమరము కొయ్యను తోయుటలో ప్రవృత్తి
గలదిగా అయినప్పటికి కూడా దాని భ్రమరత్వము నశించనివిధమున, ఏబుద్ధి
ధర్మరూపమగు ఉచిత కర్మలు మరియు అధర్మరూపమగు నిషిద్ధకర్మలను
గురించి యోచించకుండా వ్యవహరించునో, ఆ బుద్ధి రాజసబుద్ధి యగును.
కంటితో చూడకుండా ముత్యమును తీసికొనువానికి మంచిముత్యము
కదాచిత్తుగా ఎప్పుడో లభించును, మరియు అతని భాగమునకు మంచి సరుకు
లేకపోవుటయే వచ్చును. సరిగా యిదేవిధమున, దైవయోగముచే
నిషిద్ధకర్మలు లభించక పోవుట మూలమున నిషిద్ధ కర్మలు
చేయకుండా కాపాడుకొన్నట్టిన్ని, మరియు అటుల కాదేని,
సామాన్యముగా చేయదగిన మరియు చేయగూడని – అన్నివిధములగు కర్మ
లను ఒకేవిధముగా భావించి, ఒకేరీతిని చేయుచునూ వుండెడి బుద్ధిని రాజస
బుద్ధి యనవలెను. పాత్రాపాత్రతలను యోచించకుండా ఒకవైపునుండి
ప్రజాసముదాయము వంతనూ ఆహ్వానించిన విధమున యిట్టి రాజసబుద్ధి కూడా
శుద్ధాశుద్ధ విచారణ వొనర్పక సమస్తములగు కర్మలనూ స్వీకరించును.

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ ॥32॥

"మరియు, రాజమార్గము దొంగలకు హితకరముగాక, వారు నడువ
తలచి వచ్చినప్పుడా మార్గమును తప్పుకొని నడచునటుల, లేదా లోకులకు
పగటి సమయముగా నున్నప్పుడు రాక్షసులకు రాత్రిసమయమగు రీతిని, లేదా
దురదృష్టవంతునకు పాతిపెట్టబడియున్న ధనరాశి బొగ్గుల కుప్పగా తోచు
విధమున, లేదా నిజమైన ఆత్మస్వరూపము జీవునకు లేనటులనే
తోచురీతిని, ఏబుద్ధికి ధర్మకృత్యములన్నియూ పాతకములుగా దోచునో,
ఏబుద్ధి స్వచ్ఛమైన వాటిని కల్తిగలవిగా తలంచునో, అర్థములన్నిం
టిని అనర్థరూపము నిచ్చునో మరియు మంచిగుణములన్నింటిని దోషములుగా

నంగీకరించునో, అంతేగాక, వేదములలో ఉచితమైనవీ మరియు సరియైనవి గానూ చెప్పబడిన సంగతులనన్నింటినీ ఏబుద్ధి చెడ్డవిగా (నిషిద్ధములు గానూ, చేయరానివిగానూ) తలంచునో, ఆబుద్ధిని, ఓ అర్జునా, ఎవరినీ అడుగకుండానే నిస్సందేహముగా తామసబుద్ధియని చెప్పవలెను. చీకటిరాత్రివలె యుట్టిబుద్ధిని ధర్మకార్యముల నొనర్చుటకు యోగ్యమైనదని ఎటుల చెప్పవనగును ? ఆత్మబోధరూపియగు కుముదమును వికసింపజేసెడి చంద్రుడవగు సోదరా అర్జునా, నీకు యీ విధముగా బుద్ధియందలి త్రివిధత్వమును వివరముగా చెప్పితిని. ఇక, యీ బుద్ధిని ఆధారముగా నొనర్చుకొని నిర్ణయమొనర్చి ఏధృతి సర్వకార్యములందును సహాయకమగునో ఆధృతికికూడా గల త్రివిధములగు స్వరూపములను గురించి నీకిప్పుడు వివరముగా చెప్పెదను. చాల జాగరూకుడవై వినుము.

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః
యోగేనాఽ వ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ ॥33॥

" సూర్యోదయ మైనప్పుడు దొంగలతోపాటు అంధకారముకూడా వెళ్ళిపోవును; లేదా రాజాజ్ఞ వలన అనుచిత వ్యవహారములన్నియూ ఆగిపోవును; లేదా గాలి తీవ్రముగా వీచసాగినప్పుడు ఆకాశమున మేఘములు వుండవు; మరియు ఉరుములుకూడా ఆగిపోవును; లేదా అగస్త్యఋషీశ్వరుని దర్శన మగుటతోడనే సముద్రము భయభీతమై నిశ్శబ్దముగా నుండును. లేదా చంద్రుడు ఉదయించుటతోడనే కమలములు ముకుళించుకొని పోవును లేదా మదించిన ఏనుగు ముందుకు సాగుటకై పాదము నెత్తినప్పుడు సింహము స్వయముగా గర్జించుచూ దాని ఎదుటికి వచ్చినప్పటికినికూడా ఆ ఏనుగు ఆ పాదమును అలాగే ఆ సింహముపైననే పెట్టునుగాని నేలమీన పెట్టని విధమున, మానవునిలో ధైర్యము (ధృతి) సంచరించినప్పుడు మనస్సు మొదలగు వాని వ్యవహారములన్నియూ ఏస్థితిలో వుండునో, ఆస్థితిలోనే పూర్తిగా

ఆగిపోయి వుండును. ఓ అర్జునా, ఆ సమయమున ఇంద్రియములూ మరియు వాటివిషయములకూ గల సంబంధము దానంతట అదే తెగిపోవును. మరియు దశేంద్రియములున్నూ మనస్సనెడి మాతృగర్భమున ప్రవేశించును. వాయువు యొక్క ఊర్ధ్వమార్గము, మరియు అధోమార్గములు రెండున్నూ అడ్డగింపబడి మరియు నవవాయువులనూ ఒకమూటగా కట్టి ప్రాణవాయువు మధ్యమ (అనగా సుషుమ్న) లోనికి వెళ్ళిపోవును. ఆ సమయమున బుద్ధి మనస్సుపై నుంచి సంకల్ప-వికల్పములు అనెడి వస్త్రమును తొలగించి, మరియు యీ రీతిన దానిని నగ్నముగా నొనర్చి పూర్తిగా నిశ్శబ్దముగా వెనుకవైపున కూర్చొనును. ఈ రీతిని ఆ శ్రేష్ఠమగు ధైర్యము మందు మనస్సు, ప్రాణము మరియు యింద్రియములకూ తమ సమస్తవ్యాపారములూ విడచిపెట్టవలసి వచ్చును; మరియు అప్పుడంతట అవియన్నియూ నిర్లేపస్థితిలో యోగయుక్తి ననుసరించి ధ్యానమఠమున (అనగా హృదయకోశమున) మూసివేయబడి యుండును. అటుపిమ్మట, వాటి చక్రవర్తియగు పరమాత్మ వాటిని బంధనమునుండి విడుదల చేయునంతవరకు ఏ ధైర్యము ఏ విధమగు లోభమనెడి చిక్కులోనూ పడకుండా, వాటి నన్నింటిని అడ్డగించియుంచునో, అట్టి ధైర్యమునే, నిశ్చితముగా సాత్త్వికమగు ధృతియని యెరుంగవలెను.” అని లక్ష్మీపతియగు శ్రీకృష్ణ దానవయమున అర్జునితో చెప్పెను.

యయా తు ధర్మ కామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ! రాజసీ ॥34॥

అటుపిమ్మట శ్రీకృష్ణ లిటుల చెప్పసాగిరి. “ఏజీవుడు శరీరమును ధరించి స్వర్గమునందునూ మరియు యీ సంసారమునందును కూడా ధర్మమూ, అర్థము మరియు కామములనెడి త్రివర్గములు యథాస్థితముగా పొందినవాడై వైభవముతో కూడియుండునో, ఆ జీవుడు ఏ ధైర్యబలముపై సంకల్ప - వికల్ప సాగరమునందు ధర్మమూ, అర్థము మరియు కామములనెడి

ఓడను నింపి కర్మవ్యాపారమొనర్చుచూ, మరియు కర్మనే మూలధనముగా సంగీకరించి ఆ జీవుడు ఏ ధైర్య సహాయముచే ఆ మూలధనమును హెచ్చు కట్లుగా వృద్ధిచేయుటకై కఠోరపరిశ్రమ మొనర్చునో, ఓ అర్జునా, ఆధైర్యము ఆధృతి రాజసమగును. ఇక మూడవదియగు తామసధృతియొక్క లక్షణము లను చెప్పెద కూడ వినుము.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ! తామసీ ॥35॥

“బొగ్గు కారునలుపుతో చేయబడినదై యుండు విధమున, నిమ్న కోటికి చెందిన సమస్త గుణములతోడనూ తయారు చేయబడిన స్వరూపము గల ఆ నికృష్టము మరియు నీచమూ నగు తమస్సుకూడా గుణమని చెప్ప నెడల, యిక రాక్షసునికూడా సాధుపురుషుడని ఏల చెప్పరాదు? గ్రహ ములలో కేవలము మండుతూ వుండెడి అగ్నికణమైన గ్రహమును కూడా లోకులు ‘మంగళు’ డని పిలుచురీతిని, తమస్సుకూడ ‘గుణ’ మనెడి ఆదరం బరమైన పేరు లభించినది. సమస్త దోషములతోనూ నిండియున్న తమ స్సనెడి సంపదచే సృష్టింపబడిన పురుషమూర్తి బద్ధకము నెల్లప్పుడు తన శంకయం దిడుకొనియే తిరుగుచుండును; మరియు పాపములను పోషించుట వలన దుఃఖము లెన్నడును మనుష్యుని విడిచిపోని రీతిని, యిట్టి బద్ధకుని నిద్రకూడా ఎన్నడును విడచిపెట్టదు. రాతిబండను కఠోరత్వ మెన్నడును విడచి పెట్టని విధమున శరీర మనెడి ధనముపై ప్రేమ ఏర్పడుటచే భయము కూడా అతనిని ఎన్నడును విడిచిపెట్టదు. మరియు కృతఘ్నతయనెడి తక్కెడ చిప్పలో పాపము లెల్లప్పుడు కట్టియుంచబడియుండు విధమున పదార్థ ములపైన అనురాగము వుండుటవలన శోకముగూడా వాటియందు నిరంత రము నివసించియుండును. అతడు అసంతోషమును రాత్రింబవళ్ళు తన హృదయమునకు హత్తుకొని యుంచుకొనును. మరియు, యిందువలన అతడు విషాదముతోకూడా మిత్రత్వమును సంపాదించుకొనును. కుళ్ళిపోయిన

దుర్గంధము, లేదా అపథ్యము చేయువానిని వ్యాధియూ ఎన్నడును విడచి పోని విధమున విషాదముకూడా ఆతనిని అంత్యకాలమువరకు విడచిపెట్టదు. ఆతడు తారుణ్యము, ద్రవ్యము మరియు వాసనలపట్ల ఉత్సాహము మరియు మోహముల నెల్లప్పుడు వృద్ధి చేసికొనుచునే వుండును. యిందువలన ఆతనిని మదము తనకు నివాసగృహముగా చేసికొనును. ఉష్ణత్వము అగ్ని నెన్నడును పరిత్యజించని విధమున, లేదా మంచి జాతికి చెందిన సర్పము పగతీర్చుకొనకుండా వూరుకొనని విధమున' లేదా సంసార శతృభయ మెన్నడును వశించని రీతిని, లేదా కాలం డెన్నడును శరీరమును విడువని విధమున, తామస జీవునందు మదముకూడ తనకొరకై స్థిరమగు పదవిని సంపాదించును. ఈరీతిని, యీనిద్రాదిగా గల అయిదుదోషములూ ఏ ధైర్యముతో తామసజీవునందు యిల్లు గట్టుకొని వుండునో, ఆ ధైర్యమునే, ఆధృతినే తామసమైన దానినిగా నెరుంగవలెను. యీ విధముగా జగదీశ్వరుడగు శ్రీకృష్ణుడర్జునునితో చెప్పి, కొంతసేపాగి మరల యీ రీతిని చెప్పసాగెను. "సూర్యుని సహాయము వలననే మార్గము కాన్పించును, మరియు పాదము లామార్గమున నడచును. అయినప్పటికిని నడచుటయనెడి పని నడచెడువానికి గల ధైర్యము వలననే జరుగును. ఈ విధముగనే, బుద్ధియొక్క సహాయముచే కర్మలు కాన్పించును, మరియు యింద్రియములాదిగా గల సాధన సమూహము లాకర్మల నొనర్చును; అయినను, ఆ కర్మలు జరుగుటకై ఏ ధైర్యము మరియు ఏ ధృతి కావలసియున్నదో, దానియందలి త్రివిధములను నీకు చెప్పియున్నాను. ఈ విధముగా త్రివిధములగు కర్మలు జనించినప్పు డాకర్మలలో ఏ సుఖమనెడి పేరుగల కాయ కాయునో, అదికూడా త్రివిధములుగనే వుండును; యిటుల ఏర్పడుటకు గల కారణము, ఆఫలములన్ని కేవలము కర్మల ననుసరించి జనించుటవల్లనే యైయున్నది. కావున, యిక నీకు, నిర్దోషములగు శబ్దములలో యీ సుఖ [illegible]మున గల ఫలము లేరీతిని త్రివిధములుగా నుండునో చెప్పె

దను. కాని శబ్దములందలి శుద్ధత్వమును గురించి ఏల యోచింప వలెను ? ఏలనన, యీ సంగతి శబ్దములద్వారా అర్థము చేసికొనుటకు మరియు బోధించుటకూ వీలైనట్టి దగుచో శబ్దములకు చెవు లనెడి చేతు లందలి మురికి అంటుకొనును. కావున, నీవు చాల శ్రద్ధతో ఏ అంతరంగ గమును నిరోధించుటచే వినువాని కర్ణములుకూడా చెవిటి వగునో, ఆ అంతరంగము యొక్క సహాయముచే యీ మాటలను వినుము" అని చెప్పి శ్రీకృష్ణ భగవానులు త్రివిధములగు సుఖములను గురించియూ వివరింప సాగిరి. వారి ఆ వివరణమును నే నిచ్చట నిరూపింతును.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ !
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥౩౬॥

శ్రీకృష్ణు లిటుల చెప్పిరి— " యీ త్రివిధములగు సుఖముల యొక్క లక్షణములను చెప్పెదనని నీకు మాటయిచ్చితిని. ఇప్పు డామాటను నెరవేర్చెదను. సోదరా, సువిజ్ఞుడవగు అర్జునా, వినుము. ఆత్మను కలసి కొన్నప్పుడు జీవునకు లభించెడి సుఖమునుగురించి, ఓ అర్జునా, నీ కిప్పుడు తెలియజెప్పెదను. దివ్యౌషధమునుకూడా కేవలము మోతాదు ననుసరించియే తీసికొనునటుల, లేదా రసాయనిక క్రియవలన వంగ ధాతువును వెండిగా చేయుటకు వీలగురీతిని, లేదా ఉప్పును నీటిగా మార్చుటకై దానిపైన మూడు నాల్గు పర్యాయములు నీటిని చిలకరించ వలసి వచ్చువిధమున, యీ ప్రకరణమున ఆత్మసుఖమనెడి మాటకు అర్థము, జీవుడు సుఖమువలన కలిగెడి అల్పమగు అనుభూతితోపాటు తన తత్సంబంధియగు అభ్యాసమునుకూడా పెంపొందించుకొనుచూ పోవుచూ వుండెడి స్థితిలో జీవులకు గల దుఃఖములు నాశనమగునో అదియే ఆత్మసుఖమని యెరుంగవలెను. కాని అదికూడా త్రిగుణములతోడనే ఏర్పడియున్నది. ఇక వీటికి గల భిన్న భిన్న లక్షణములను వివరించి చెప్పెదను వినుము.

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్ ॥37

"సర్పములు చుట్టియుండుట వలన చందన వృక్షముయొక్క మొదలు, లేదా పిశాచములు కాపలా కాయుచుండుటవలన గుప్తభాండారముఖము భయంకరముగా వుండురీతిని, స్వర్గసుఖము అతిమధురమైనది యైనప్పటికిని మధ్యలో యజ్ఞయాగాది విధానములను ఉపక్రమించవలసియున్న రీతిని, లేదా వివిధవిధములుగా కష్టపెట్టుటవలన చిన్నపిల్లలకు బాల్యావస్థ పీడాకరముగా నుండును, లేదా జ్వరములోవునప్పుడు ప్రప్రథమమున ఔషధము చేదుగాతోచు రీతిని, దీపము వెలిగించుటానికి ప్రథమమున పొగను సహించవలసియున్న రీతిని, ఓ అర్జునా, ఆ సుఖముయొక్క ప్రవేశద్వారమువద్దనే యమ-దమాది సంకటములను సహించవలసి యుండును. దృశ్యవస్తువులన్నింటి పట్లనూ మానవులకు వుండెడి ప్రేమను నాశమొనర్చునట్టియూ, స్వర్గము మరియు సాంసారిక బంధనములన్నింటినీ మూలముతోపాటు పెకలించివేయు నట్టి తీవ్రమగు విరక్తి జనించును. తీక్ష్ణమగు వివేకశ్రవణము మరియు కఠోరమగు వ్రతాచరణము వలననూ బుద్ధ్యాదులు తునాతునక లగును. ప్రాణము మరియు అపానవాయుతరంగములను సుషుమ్నానాడీముఖము కబళించి వేయును. కాని, యీ కష్టములన్నియూ కేవలము ప్రారంభము నందే యుండును. చక్రవాక పక్షులజంటను ఒకదానితో మరొకదానిని విడదీయుచో, లేదా దూడను ఆవు ఎదుటనుంచి తొలగించునెడల, లేదా బిడ్డ గానిని అన్నపు పళ్ళెము ముందునుంచి లేవదీయునెడల, లేదా తల్లికిగల ఒకే ఒక పుత్రుడు కాలునివలన ఆమెవద్దనుంచి తీసికొని పోబడునెడల, లేదా మత్స్యమును నీటినుంచి బయటకు తీసినయెడల ఆసమయమున వాటికి ఏలాంటి పీడన చెందిన దుఃఖము కలుగునో, ఓ అర్జునా, సరిగా అదేవిధమగు దుఃఖము ఇంద్రియములకు విషయములనెడి యింటిని విడిచిపెట్టునప్పుడు కలుగును.

కాని, ఆ దుఃఖముకూడా పూర్తియైన విరక్తితో సహించవలసి యుండును. ఈ విధముగా, ఏ సుఖమునకై ప్రారంభమునందు అతి గొప్ప గొప్ప సంకటములను సహించవలసి యున్నదో, అంతమున దానివలన “క్షీరసాగరమును మథించుసమయమున దానినుండి అమృతము లభించినరీతిని ’ మోక్షమనెడి అమృతము లభించును. మొట్టమొదటిసారిగాజనించెడివైరాగ్యమనెడిహాలాహలమును ధైర్యమనెడి శంకరుడు భక్షించివేసినచో, ఆ తరువాత ఏసుఖమునందు జ్ఞానమనెడి అమృత ప్రాప్త్యుత్సవము నెరవేరుటకై అవకాశము లభించునో, అదియే సాత్త్విక సుఖ మగును. ద్రాక్షకాయ పచ్చిగా నున్నప్పుడు దాని పుల్లదనము నాలుక కెంత కష్టముగా నుండదు! కాని, అ ద్రాక్షయే చక్కగా పండినప్పు డది ఎంత ఎక్కువ మధురముగా నుండును! ఇదే విధముగ యీ వైరాగ్యాదిభావములు ఆత్మజ్ఞాన ప్రకాశమువలన పూర్ణత్వమును పొంది యీ వైరాగ్యాదులతోపాటు సమస్త మాయాజనిత నామరూపాత్మక ద్వైతముకూడా నాశమైన సమయమున బుద్ధికూడా ‘సముద్రమున కలసిపోయిన గంగవలె’ ఆత్మతో కలసి ఏకరసమును పొందును; మరియు అప్పుడు అద్వైతానంద మనెడి గని తనంతతానే తెరచుకొనును. ఈ విధముగ ఏ సుఖమునకు మూలము వైరాగ్యమందున్నూ, దేని అంతము ఆత్మానుభవమనెడి ఆనందమునందున్నూ వుండునో, అట్టి సుఖమునే సాత్త్విక మందురు.

విషయేంద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్ !
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38॥

“ మరియు ఓ అర్జునా, విషయములు మరియు యింద్రియములు సంయోగ మగుటతోడనే ఏ సుఖప్రవాహము తన రెండుతీరములనూ ముంచివైచి నలువైపులందునూ ప్రవహించునో, అదియే రాజసమగును. ఎవరైన గొప్ప అధికారి తమ గ్రామమునకు వచ్చినప్పుడు లోకులు ఊరేగింపు చేయు రీతిని, లేదా ఋణముచేసి అత్యానందముగను ఆడంబరముగాను వివాహము

చేయబడు రీతిని, లేదా రోగికి పంచదార మరియు అరటికాయయూ పథ్యమై నప్పటికిని అతి యిష్టముగానుండు విధమున, లేదా వత్సనాభి విషమైనప్పటికిని మొట్టమొదట తినుటకు మధురముగా వుండురీతిని, లేదా ప్రారంభమునందు సొగసుగాండ్రి మైత్రి, లేక బజారునందు కూర్చొనియుండెడి వేశ్యయొక్క ప్రవర్తన, లేదా వగటివేషగాని వినోదమూ చక్కగావుండి అంతమున యివి యన్నియూ ఘాతకములుగానగు రీతిని, విషయములు మరియు ఇంద్రియముల యొక్క సంయోగమువలన ఏ సుఖము ప్రథమమున జీవుని పుష్టికరముగను ప్రసన్నవంతముగను నొనర్చి అటు పిమ్మట ఏది జీవునియొక్క సుఖసంపద నంతనూ పెంచుకొన్న హంస రాతిబండపైవేసి కొట్టినందువల్ల ప్రాణములు కోల్పోవు రీతిని హరించునో, మరియు, ఏ సుఖమువలన అంతమందు మనుష్యునికి ప్రాణ నాశనముగూడ సంభవించునో మరియు అతనివద్దగల పుణ్యమనెడి మూలధనముకూడా సమాప్తమగునో, మరియు అంతట ఆ సుఖములన్నియూ స్వప్నములవలె నశించునో, అతడు మొదటినుండియూ భోగించుచూవచ్చిన వాటిని తన సర్వస్వమును కోల్పోయి కేవలము కష్టములనే అనుభవింపవలసి యుండునో, అనగా ఈ విధమగు ఏ సుఖము అంతమున యీ లోకమునందు కూడా మనుష్యునికి ఆపదలు తెచ్చిపెట్టునో, మరియు పరలోకమునందు కూడా ఏది విషమువలె సిద్ధించునో, ఆ సుఖము రాజస సుఖమగును. మరియు, యిటుల జరుగుటకు గల కారణమూ, కేవలము యింద్రియములనే పెంచి - పోషించి మరియు ధర్మక్షేత్రమును విధ్వంసమొనర్చి, కేవలము విషయములనే భోగించు ప్రదేశమునందు పాతకములు అతి బలవత్తరముగా నుండును. మరియు అంతట ఆ పాతకములే జీవునకు దుర్గతి కలిగించును. ఈ విధమున, ఏ సుఖమువలన పరలోకమునం దింత హానికలుగునో, మరియు ఏది ప్రారంభమునందు మధురముగ నున్నదని చెప్పబడి నప్పటికిని అంతమున ప్రాణఘాతి మొనర్చి విషముగనే యగునట్టి విషమువంటిదగునో, మరియు ఏ రీతిని, ఏసుఖము ఆరంభమున మధురముగా కాన్పించినప్పటికిని, అంత

మున అతికటువుగా నగునో, ఓ అర్జునా, అట్టిసుఖము రజోగుణముచే కలుగునదైనదని నిశ్చయముగా తెలుసుకొనవలెను; యిందువలననే, అట్టి సుఖమును ఎన్నడును మనసు స్పర్శింపనైన స్పర్శింప నివ్వరాదు.

యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః ।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్॥ 39

" నిషిద్ధమగు పేయవస్తువులను పానమొనర్చుట వలనను, నిషిద్ధ ఖాద్య పదార్థములను తినుటవలనను మరియు స్వేచ్ఛాచారిణులగు స్త్రీల సాంగత్యమువల్లనూ ఏ సుఖము లభించునో, లేదా యితరులను హత్యచేసి పరుల ధనమును అపహరించి మరియు తుచ్ఛులంచేసిన స్తుతిని వినుటవల్లనూ ఏసుఖము లభించునో, ఏసుఖము బద్ధకముచే పోషింపబడునో, ఏసుఖము కునికిపాట్లు పడునప్పుడుగాని నిద్రించునప్పుడుగాని కాన్పించునో, మరియు ఏ సుఖముయొక్క ఆరంభమునందును అంతమందును జీవునకు తన నిజమార్గముపట్ల భ్రమయేకలుగునో, మరియు అది అనుచితమార్గమును పట్టునో పోదరుదవగు ఓ అర్జునా, ఆ సుఖమును సంపూర్ణముగా తామసమని యెరుగవలెను. కాని, నేనీవిషయమునుగురించి యింతను యెక్కువగా విస్తరించి చెప్పను. ఏలనన దీనిగాథ అతిఅసభ్యము మరియు నిందనీయమూనైయున్నది. ఈ విధముగా మూలమునందొకే స్వరూపము గలిగియున్న కర్మఫలమగు ఏసుఖము గలదో, అదికూడా కర్మభేదమనుసరించి త్రివిధములుగా నైనది. దానినిగురించి నీకు శాస్త్రీయముగా వివరించి చెప్పితిని. ఇక యీ జగత్తునందలి చిన్న పెద్దవియగు సమస్త వస్తువులందునూ కర్త, కర్మ మరియు కర్మఫలము - లనెడి త్రిపుటికి మించి మరేదియూలేదు. మరియు ఓ అర్జునా, వస్త్రమున దారపుపోగులు నేయబడురీతిని యీ త్రిపుటియందు కూడా త్రిగుణములు నిండియున్నవి.

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః ॥౪౦

"కావున యీ మాయాక్షేత్రమునందున్నప్పటికిని యీ మృత్యు లోకమునందున్నూ మరియు స్వర్గలోకమునందుకూడానూ యీ సత్త్వాది గుణములతో కూడియుండని వస్తువేదియూ లేదు. ఉన్నిలేకుండా కంబళీ, మట్టిలేకుండా బెడ్డయూ, నీరులేకుండా అలయూ ఎన్నడైన జనించగలదా? సరిగా యిదేవిధమున, గుణభాగ మేమాత్రమైన లేకుండా సృష్టించబడిన ఏ ప్రాణియూ లేదు. కావుననే, నీవీ జగత్తంతయూ యీ త్రిగుణముల తోనే నిర్మితమైన దని నిశ్చయముగ తెలిసికొనుము. ఈ గుణములే దేవత లందు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని త్రివర్గముల నేర్పరచెను. ఇవియే స్వర్గ, మర్త్య నరకములని మూడులోకములను నిర్మించెను. మరియు యివియే చాతుర్వర్ణ్యములకును భిన్నభిన్న కర్మ లనెడి జంజాటమును తగిలించెను.

బ్రాహ్మణక్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః ॥౪౧॥

"ఇక నీవు ఆ నాల్గు వర్ణము లేవియని యడిగినయెడల చెప్పెదను వినుము. వీరిలో బ్రాహ్మణులు సర్వశ్రేష్ఠులు. వారితరువాత క్షత్రియులు, మరియు వైశ్యులనుకూడా మహత్త్వము ననుసరించి రూపొందించినచో బ్రాహ్మణులతో సమానులుగానే తెలిసికొనవలెను; ఏలనన, వారికికూడా వైదిక ధర్మకార్యముల నొనర్చుటకు అధికారము గలదు. ఓ అర్జునా, నాల్గవవర్ణము శూద్రులు. శూద్రులకు వేదాధికారము లేదు, యిందువలన వీరిజీవితము పైనచెప్పిన మూడువర్గములవారి పైనను అవలంబితమై యున్నది. కాని, యీ శూద్రుల జీవన-వృత్తి బ్రాహ్మణాది త్రివర్ణములతో అతిదగ్గర సంబంధము [illegible]యుండును. మరియు యిందువలననే 'వీరినికూడా వర్ణవిభాగమున సమా[illegible], అందుచేనిది నాల్గవవర్ణమైనది. పువ్వములతోపాటు త్రిమంతు

లోకులు యీ ప్రశ్నములను గుర్తించినదారమును కూడా తమ కంఠమున్న ధరించు విధమున త్రైవర్ణికులగు ద్విజులతోపాటు శూద్రులకుకూడా వ్యావహారిక సంబంధము వుండుటవలన (శుతులకు వర్ణ-సంస్థలో శూద్రులనుకూడా స్థానా పేర్పరచవలసిన అవశ్యకత యేర్పడినది. ఓ అర్జునా! యీచాతుర్వర్ణ్య సంస్థయొక్క స్వరూపము యిట్టిదై యున్నది. ఇక నేను వీరందరికి గల విహిత కర్మలను వివరింతును. ఈ కర్మలందలి గుణములవలన యీ నాల్గువర్ణముల వారూ జనన-మరణము లనెడి జగడమునుండి తప్పించుకొని ఆత్మస్వరూపమును పొందుదురు. ప్రాకృతికములగు త్రిగుణములు యీ కర్మలను నాల్గు వర్ణములకును నాల్గు విధములుగా పంచియిచ్చినవి. తండ్రి సంపాదించిన ధనము ఆతని పుత్రులకు పంచిపెట్టబడు రీతిని, లేదా సూర్యుని వెలుగులో కాన్పించెడి మార్గములు భిన్నభిన్న దిశలకు పోయెడి యాత్రికులకు పంచి పెట్టబడు విధమున, లేదా ధనవంతుడగు పురుషుడు తన పనులన్నింటిని తన నౌకరులయందు పంచిపెట్టు రీతిని యీ ప్రాకృతిక గుణములు కూడా యీ కర్మలను విడివిడిగా విభజించి నాల్గు వర్ణములందును పంచి యిచ్చినవి. వీటిలో సత్వగుణము తన సగ-సగ భాగమునుండి బ్రాహ్మణులు మరియు క్షత్రియులకూ అంకిత మొనర్చినది. సత్వ మిశ్రితమగు రజోగుణము వైశ్యులం దుండును. మరియు తమస్సుతో నిండియున్న రజోగుణము శూద్రులభాగమునకు వచ్చినది. ఓ జ్ఞానివగు అర్జునా, యీ విధముగా ప్రారంభమునందు సంపూర్తిగా ఒకే స్వరూపము గలదిగా వుండియున్న మానవ సంఘమునందీగుణములు యీ చాతుర్వర్ణ్యాత్మక భేదమును కలిగించినవి. ఈ విషయమును నీవు జ్ఞప్తియందుంచుకొనుము. చీకటిలో పడియున్న వస్తువును మనకు దీపము చూపించురీతిని తన గుణములచే కప్పబడియున్న కర్మలను మనకు శాస్త్రము చూపించును. భాగ్యవంతుడవగు అర్జునా, యికనీకు, యీభిన్నభిన్న వర్ణములకు స్వాభావికము మరియు ఉపయుక్తములూ నగు కర్మలేవో చెప్పెదను వినుము.

శమో దమ స్తపశ్శౌచం క్షాంతి రార్జవ మేవచ ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్॥ 42

"సమస్త యింద్రియ వ్యవహారములనూ తన చేతియందుంచుకొని ఏకాంతభావముతోను మరియు ధర్మపత్నివలె ఆత్మతత్త్వముతో కలసి యుండునట్టి శాంతిస్థితి బుద్ధికి లభించుటయే 'శమ' మనవలెను. మంచివియూ శ్రేష్ఠమైనవియూనగు కర్మలన్నియూ యీశమమువల్లనే ఆరంభమగును. ఇట్టి కర్మలలో 'దమ' మనెడి పేరుగల రెండవగుణము శమమునకు సహాయకము; యిందువలన స్వధర్మాచరణ పూర్వకమగు సమస్తమగు వ్యవహారములు జరుగును. ఇట్టి కర్మలలో 'తప' స్సనెడి పేరుగల మూడవ గుణము కూడా కాన్పించును; దీనివలన చిత్తమునందు ఈశ్వర విషయమున ఏకనిష్ఠతో కూడియున్నశ్రద్ధ ' ప్రసవించిన స్త్రీగల గదిలో ఆరవరోజురాత్రి దీపము ఆరిపోకుండా పూర్తియైన జాగ్రత్త వహించురీతిని ' నిరంతరము జాగరితమై యుండును. ఈ విధముగా, యిట్టి కర్మలలో ద్వివిధములుగా ' శౌచము ' అనగా నిర్మలత్వముకూడా వుండును. మరియు ఓ అర్జునా, యీ శౌచగుణము వలన మనస్సు శుద్ధభక్తితో నిండియుండును. శరీరము నిర్మలమగు ఆచరణచే శృంగారింపబడి యుండును, మరియు యీ విధముగా జీవిత క్రమమంతయూ లోపలనూ - బయటనూ సుందరముగానై యుండును. ఈ నాల్గవగుణము కూడా ఆ కర్మలయం దుండును. పృథివివలె పూర్తిగా అన్నింటిని ఓర్పుకొనుట యనెడి గుణమునే, ఓ పార్థా, ' క్షమ ' యందురు. క్షమ యనబడెడి యీ అయిదవగుణము ఆకర్మలందు సంగీతమునా పంచమస్వరమువలె నుండును. ప్రవాహము వంకర-టింకరగా నున్నప్పటికిని నది ఎల్లప్పుడూ తిన్నగా సముద్రముపైపునకే ప్రవహించుచుండును" మరియు చెరుకు తన పెరుగుదలవలన ఎన్నివంకరలు తిరిగి యున్నప్పటికిని [illegible] దంతటను సమానముగనే మాధుర్యము నిండియుండును. వరిగా

ష్ట దేహమున, జీవునివృత్తి వంకరటింకరలుగా నున్నప్పటికిని దానియందు పరిపూర్ణమైన సరళత్వము వుండియుండుట యనెడి గుణమునే 'ఆర్జవము' అందురు. మరియు యీ ఆర్జవమనెడి ఆరవగుణముకూడా ఆకర్మలయందుండును. తోటమాలి అత్యధికముగా కష్టపడి చెట్లమొదళ్ళకు నీరుపోయును అయినప్పటికిని, యీ వృక్షములవలన నాకు ఫలము లభించదను. గాన నాయీ పరిశ్రమ యంతయూ సార్థకమే యగునని అతడు చక్కగా నెరిగియుండు రీతిని, యీ ప్రకారముగనే 'శాస్త్రోక్తమగు కర్మల నాచరించి యీశ్వర ప్రాప్తినొందుట అవశ్యకము, మరియు ఆ యీశ్వరప్రాప్తి యీ విధముగా మనకు తప్పక లభించును'-అని యీ తథ్యమును చక్కగా నెరుంగుటే 'జ్ఞాన' మనబడును. మరియు యీ జ్ఞానమే ఆకర్మలందలి ఆ ఏడవ గుణమగును. మనుష్యుడు శుద్ధసత్త్వము గలవాడై శాస్త్రజ్ఞాన సహాయము వల్లగాని లేదా తన ధ్యానబలము వల్లగాని యీశ్వర తత్త్వముతో నిస్సందేహబుద్ధితో తదురూపత్వము పొందుట-ఎనిమిదవ గుణము 'విజ్ఞానము' యొక్క స్వరూపమై యున్నది. మరియు యీ ఎనిమిదవదైన విజ్ఞానమనెడి గుణము లుండవలగు గుణముకూడా ఆ కర్మలయందుండును. —శాస్త్రము లెన్నిమార్గములను యోగ్యములు మరియు సరియైనవని చెప్పెనో, వాటిలో ప్రతిమార్గమును 'రాజయొక్క సేవకు ముద్రింపబడిన ప్రతిపదార్థమును నాణెములలో చంచవలసిన నాణెమువలెను సంతోషముగా ప్రజలు స్వీకరించురీతిని' సరియైనట్టిదిగా తలంచి ఆనందపూర్వకముగా నంగీకరించుట-యనెడి ప్రకారముగల తొమ్మిదవ గుణమును 'ఆస్తిక్య' మందురు. ఈ తొమ్మిదవ గుణమగు ఆస్తిక్యము కూడా ఆ కర్మలయందుండును. ఇట్లు చెప్పుటలో గల తాత్పర్యము, యీ తొమ్మిది గుణములున్నూ ఏ కర్మలందు గలవో, ఆ కర్మలే మంచివియున్నూ సరియైనవిన్నీ యగును. ఈ గట శమాది నవగుణములున్నూ వుండుటవలన ఏ కర్మలు స్వాభావికములగునో నిర్దోషములగునో, వాటినే బ్రాహ్మణులయొక్క స్వాభావిక కర్మలుగా

నెరుంగవలెను. ఈ నవరత్నహార మెవనికి లభించునో, అతడు నవగుణములకూ రత్నాకరుడే యగును. తన శరీరమునుంచి దేనినీ తీయకుండానూ మరియు విడదీయకుండానూ సూర్యుడు ప్రకాశధారణ మొనర్చు విధమున, లేదా చంపకవృక్షము స్వయముగ తన మొగ్గలతోడనే సుశోభితమగు విధమున, లేదా చంద్రుడు తన వెన్నెలతోనే ప్రకాశవంతుడు మరియు ఉజ్జ్వలుడూనై యుండురీతిని, లేదా చందనము స్వయముగా తన సుగంధము తోడనే సువాసితమై యుండురీతిని, నవరత్నములచే కూర్చబడిన యీ నగ బ్రాహ్మణులయొక్క నిర్మలభూషణము; మరియు యీ ఆభూషణమును తీసి నస్నుదగుట యనెడి కృత్యమును బ్రాహ్మణుల శరీర మెన్నడును చేయదు. ఓ అర్జునా, ఇక, క్షత్రియోచిత కర్మలేవో చెప్పెదను. నీబుద్ధి నంతనూ మరియు ధ్యానమునూ లగ్నమొనర్చి వినుము.

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచా ప్యపలాయనమ్।
దాన మీశ్వరభావశ్చ క్షాత్రంకర్మ స్వభావజమ్॥ ౪౩

తన తేజము ప్రకటించుసమయమున సూర్యుడెవరి సహాయమున్ను అపేక్షించనిరీతిని, లేదా సింహమునకు వేటాడుటలో ఏ సహాయకుడూ అక్కరలేని రీతిని స్వయముగా తన సాహసముతోడనే, మరియు ఎవరి సహాయము లేకుండానే పరాక్రమించి చూపుటయనెడి, శౌర్యమనెడి గుణము, ఏకర్మవృత్తిలో సర్వప్రథమము మరియు సర్వశ్రేష్ఠమగు గుణమూనై యున్నదో, అదియే స్వాభావికమగు క్షాత్రవృత్తి యగును. సూర్యుని ఉజ్జ్వల ప్రకాశము ముందు కోట్లకొలది నక్షత్రములు మరుగుపడి పోయినప్పటికిని చంద్ర సహితముగా నక్షత్రములన్నియూ ఏకత్రిత మైనప్పటికిని కూడా తాము సూర్యుని లోపింపజేయజాలని రీతిని ఏ అలౌకిక సామర్థ్యమువలన మానవుడు తన తేజోవంతమగు గుణములతో ప్రపంచమునంతనూ ఆశ్చర్య చకితముగ నొనర్చువాడైయుండి, తా నెన్నడూ

ఏవిషయమువల్లనూ భ్రాంతుడు కాకుండుట యనెడి సామర్థ్యమునే 'తేజ' మందురు. ఈ రెండవగుణముకూడా ఆ వృత్తియందు కాన్పించును. ఇదే విధమున దానిలో మూడవగుణమగు ధైర్యము వుండును. ఆకాశము విరిగి మీద పడిన పడుగాక అయినప్పటికిని ఏ ధైర్యగుణమువలన బుద్ధియొక్క కమలం భయముచే ఎన్నడును మూతపడవో మరియు మనస్సెప్పుడును చలించదో, ఆ ధైర్యగుణ మీవృత్తిలో కాన్పించును. మరియు, ఎంత ఎక్కువ ఆపారము మరియు విస్తృతమూ వగు జలమైన వుండిన వుండుగాక, కమల తత్రిసులు దానిని అణచివైచి వ్యాపించురీతిని, మరియు ఏవస్తువైనా ఎంత ఎత్తుగా పైకిపోయి వున్నప్పటికిని ఆకాశము ఎల్లప్పుడు దానికి పైగానేవుండు విధమున, ఏ విధమైన పరిసంగము వచ్చినను రానిమ్ము, అయినప్పటికిని, ఓ అర్జునా, యుద్ధఫలము నిచ్చెడి కార్యమునందత్యంతదక్షత తోను మరియు నిశ్చయముతోనూ ప్రవేశించుటనే 'దక్షత్వ' మందురు. ఈ నాల్గవ గుణమగు దక్షత్వముకూడా ఆ వృత్తియందు పూర్తిగా కాన్పించును. దృఢముగా నిలచియుండి యుద్ధమొనర్చుట ఆ వృత్తియొక్క అయిదవ గుణము. సూర్యముఖి (పొద్దుతిరుగుడు) చెట్టు ఎల్లప్పుడూ సూర్యునివైపే వుండురీతిని శత్రువు ఎదుట సాహసముతో రొమ్ము చరచి నిలబడుటయూ, మరియు గృహిణిస్త్రీ సర్వవిధములా ప్రయత్నించి తనభర్త శయ్యపై పవళించక మరియు ఆ శయ్యపై తనవీపు వాల్చకుండా తప్పించుకొను రీతిని సమరభూమియందు శత్రువు ఎదుర్కొన్నప్పుడాతనికి తన వీపును చూపకుండుటయూ-ఆ క్షాత్ర వృత్తియొక్క అయిదవ గుణము; ఓ గుణశ్రేష్ఠుడవగు అర్జునా, నీ వీ విషయమును చక్కగా జ్ఞప్తియం దుంచుకొనుము. నాలుగువిధములగు పురుషార్థములకంటెనూ భక్తి అత్యధిక శ్రేష్ఠమైనదైన విధమున, యీ గుణము (ఐదవది) కూడా మొదటచెప్పిన నాల్గుగుణములకంటెనూ అత్యధిక శ్రేష్ఠమైనది. ఫల-పుష్పాదులత్యధికముగ నున్నందువలన వృక్షము క్రిందికి వంగురీతిని, లేదా పద్మ- వనము తన సుగంధమును నలువైపు

లందును చక్కగ వ్యాపింపజేయురీతిని, లేదా చంద్రుని వెన్నెలను కోరిన ప్రతివాడూ కావలసినంత తీసికొనగలుగురీతిని, తీసికొనువానికి అతని యిచ్ఛానుసారము దానిమిచ్చుటను 'దాన' మందురు; యీ ఆరవగుణరత్నముచే కూడా ఆవృత్తి భూషితయై యుండును. ఇదేరీతిని, తనఆజ్ఞనే ప్రపంచమంతయూ అంగీకరించునటుల చేయుట, మరియు తన అవయవములను పోషించి వాటిని తనకు పనికివచ్చునటుల యోగ్యముగా చేయురీతిని ప్రజలను పాలించి, వారి సంతోషముద్వారా జగత్తును ఉపభోగించుటను ఈశ్వరభావ మందురు, ఇది సమస్త సామర్థ్యములకును సమూహామూ మరియు గుణములకు సామ్రాట్టున్నూ అగు ఆ వృత్తియొక్క ఏడవగుణమై యున్నది. ఈ శౌర్యాదిసప్తగుణములతో ఏవృత్తి సప్తర్షులచే ఆకాశము శృంగారింపబడిన రీతిని పవిత్రతనుపొందునో, అదియేస్వాభావికమగు క్షాత్రవృత్తి యగును. క్షత్రియులయొక్క వాస్తవికమగు సహజగుణములివియే. ఈగుణములన్నింటితోడనూకూడియున్నక్షత్రియుడు మనుష్యుడుకాడు, అతడు సత్వరూపియగు బంగారుమేరుపర్వతమేయగును. మరియు యిందువలననే అతడుసప్తగుణములు గలస్వర్గమును సంబాళించి యుంచును. లేదా యీ సప్తగుణములతోడనూ చుట్టియున్న యిది క్రియావృత్తి కాదు, సప్తసముద్రములతోనూ చుట్టియున్న పృథివియే యని యెరుంగవలెను. మరియు ఆ వీరుడు దానిని ఉపభోగించును. లేదా యీ సప్తగుణ ప్రవాహములచే యీ క్రియారూపియగు గంగ యీ క్షత్రియరూపియగు మహాసముద్రముయొక్క అంగములపై విలాస మొనర్చుచున్నదా యనవలెను. ఈ విధముగా విశేషముగా చెప్పుటలో గల భావము, ఏ కర్మలు యీ శౌర్యాది గుణములచే అంకితములై యుండునో, అవియే క్షత్రియజాతియొక్క స్వాభావిక కర్మ లగును. ఇక ఓ బుద్ధివంతుడవగు అర్జునా! వైశ్యజాతికి ఉచితమగు కర్మలేవో చెప్పెదను వినుము.

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ౪౪

“ భూమి, విత్తులు, నాగలి మరియు మూలధనములపై ఆధారపడి యుండి యథేష్టముగా లాభమును సంపాదించుట, అనగా వ్యవసాయముచే జీవించుట, ఆవులను, గేదెలను పెంచుట, లేదా చౌకగా కొనిన వస్తువులను ప్రియమగు ధరలకు అమ్ముట మొదలగు కార్యములు, ఓ అర్జునా, వైశ్యుల వృత్తులై యున్నవి. ఈ కర్మలన్నియూ వైశ్యజాతికి స్వాభావికములుగా వచ్చునని నీవు తెలిసికొనుము. మరియూ, వైశ్యులు, క్షత్రియులు, బ్రాహ్మణులనెడి యీ త్రివిధ ద్విజవర్ణములనూ సేవించుట శూద్రుల కర్మయై యున్నది. మరియు వాస్తవిక దృష్టితో చూచినచో, ద్విజులను యీ రీతిని సేవించుటను మించి ముందడుగిడుటకూడ శూద్రులకు తగదు. ఈరీతిని నీకు చాతుర్వర్ణ్యములకు గల విహితకర్మలను చెప్పితిని.

స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ౪౫

“ఇక ఓ అర్జునా, శ్రవణాది భిన్నభిన్నములగు యింద్రియములకు శబ్దాది భిన్నభిన్న గుణములు ఉపయుక్తమగు విధముగ, లేదా మేఘముల నుండి కురిసెడి వర్షజలమునకు నది ఉపయుక్తమగు పాత్రయయిన రీతిని, లేదా నదికి సముద్రము ఉపయుక్తమైన రీతిగానే యీ నాల్గు వర్ణములకునూ యీ భిన్నభిన్న కర్మలన్నియూకూడా ఉపయుక్తములై యున్నవి. ఇందువలననే వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి ఏయే కర్మలు ప్రాప్తించునో, అవియన్నియు ఎర్రని వానికి ఎర్రదనమువలె శోభాదాయకములగును, కావున ఓ అర్జునా ! ఆ స్వాభావిక విహితకర్మలను శాస్త్రముల ఆజ్ఞానుసార మొనర్చుటలో ప్రవృత్తుడ వగుటకై నీ బుద్ధిని అచలముగా నుంచవలెను. స్వయముగా తన రత్నము కూడా రత్నపరీక్షకునిచే పరీక్షింపవలసియుండు రీతిని తన కర్మలనుకూడా

శాస్త్రములచే నిశ్చిత మొనర్చుకొనవలసియుండును. దృష్టి తన స్థానమునందు ఎల్లప్పుడును చక్కగా వుండియే యుండును. అయినప్పటికిని దీపము లేనిదే దానివలన ఏ ఉపయోగమూ వుండదు. లేదా దారియే దొరకనప్పుడు పాదములు వున్నంతమాత్రమున ప్రయోజన మేమి ? ఇందువల్లనే జాతిధర్మము ననుసరించి ఏది మనకు ఉచితమగు అధికారమో, దానిని మనము శాస్త్రములను చూచి నిర్ణయించుకొనవలెను. ఇక నోపార్థా, మనయింటియందు చీకటిలో పెట్టియున్న ధనమును దీపము మనకు చూపించినప్పుడు, మనము దానిని తీసికొనుటలో ఏ బాధగలదు ? ఈ విధముగా స్వాభావికముగా మనవంతుకు వచ్చిన సంగతులను, మరియు శాస్త్రములుకూడా విధించినవియున్నా యగు విహితకర్మలను ఏ పురుషుడు ఆచరించునో, ఎవడు బద్ధకమును విడచి, ఫలేచ్ఛను దూరముగానెట్టి తనువు మరియు మనస్సులతో ఆ కర్మల నాచరించుటలో లీనమగునో, ఎవడు తన కర్మాచరణముతోపాటు 'ప్రవాహమున కలసిన నీరు మరి యేవైపుకును పోక ఆ ప్రవాహముతోపాటు గానే ప్రవహించుచూ పోవునట్టి' వ్యవస్థిత రూపమున నడచుకొనునో, ఓ అర్జునా, యీ విధముగా ఎవడు తన విహితకర్మల నాచరించునో, ఆతడు మోక్షమునకు యివతల గల ఒడ్డువరకు చేరును. చేయగూడని, మరియునిషిద్ధకర్మలతో నాతని కెట్టిసంబంధమును ఉండదు. మరియు యిందువల్లనే సంసారమునకు చెందిన అపాయము ఆతని కెన్నడును ఏ హానినీ కలుగజేయ జాలదు (అనగా, సాంసారిక జగడములు ఆతని మోక్షమార్గమున బాధాకరములు కావు.) ఆత డెన్నడును కుతూహలముతో నైన కామ్యకర్మలవైపు తిరిగి చూడడు. మరియు మంచిగంధపు శృంఖలలైన కానిమ్ము, ఆతడు దానియందు తన పాదములను చిక్కుకొన నివ్వడు; ఏలనన, చందనపు బేడీలైనంతమాత్రమున నేమైనది ! అవిమాత్రము శృంఖలలు కావా ? ఆతడు తాను చేసెడి నిత్యకర్మలను కూడా ఫలేచ్ఛ నన్నింటిని విడచియే చేయును, మరియు ఆ కర్మల నన్నింటిని ఆతడు

యీశ్వరార్పణ మొనర్చును. మరియు యిందువలన ఆతడు మోక్షసీమవరకు చేరగలుగును. ఈ విధముగా ఆతడు యీ సంసారమునకు సంబంధించిన శుభాశుభ జగడములనుండి తప్పించుకొనుటవలన వైరాగ్యమార్గముగుండా మోక్షద్వారమువద్దకు పోయి నిలచియుండును. ఏది సమస్తసౌభాగ్యముల యొక్క పరిపూర్ణత్వమో, దేనియందు మోక్షప్రాప్తి నిశ్చితమై యున్నదో, కర్మకాండలు దేనిలో పూర్తిగా అంతమొందునో, ఏది మోక్షఫల మిచ్చుటకు బాధ్యతవహించునో మరియు ఏది పుణ్య-కర్మ లనెడి వృక్షముయొక్క ఫలమో, అట్టి ఆ వైరాగ్యమునందు సాధకుడగు పురుషుడు భ్రమరమువలె అనాయాసముగనే మరియు సహజభావముతోనూ అడుగిడును. ఓ అర్జునా, యీ వైరాగ్యభావము 'అతిత్వరగా ఆత్మజ్ఞానమనెడి సూర్యోదయమును కలుగజేయుననెడి సూచన నిచ్చెడి' అరుణోదయము వంటిదని నీవు జ్ఞప్తియందుంచుకొనుము. లేదా, యీ వైరాగ్యాంజనమెట్టి అలౌకిక అంజనమనగా, దీనిని కనులకు రాచుకొనుటచే ఆత్మజ్ఞానమనెడి గుప్తభాండారము చక్కగా కనిపించసాగును, మరియు లభించును; మరియు సాధకుడు యీ అంజనమును స్వాయముగానే తన కనులకు రాచుకొనును. ఈ విధముగా ఓపార్థా, యీ విహితకర్మల నాచరించుటవలన సాధకునియందు మోక్షప్రాప్తికి కావలసిన పాత్రత వచ్చును. ఓ అర్జునా, యీ విహితకర్మలే జీవునకు ఆశ్రయ మిచ్చునట్టివి, మరియు యీ కర్మల నాచరించుటయే నా పరమాత్మ స్వరూపమును నిజముగా సేవించుటయగును. పతివ్రత తనభర్తతో సర్వవిధములగు సుఖములను అనుభవించును. అయినప్పటికిని, ఆమె తపశ్చర్య యంతయూ తనభర్త కొరకేనని చెప్పవలసియున్నది. లేదా బాలునకు తనతల్లితప్ప మరేజీవనాధారమూ లేనందువలన ఆతని కీతల్లిని సేవించుటే అన్నింటికంటె మించిన కర్తవ్యమైనటులు, లేదా మత్స్యము జలమును గురించి తలంపుతో మాత్రమే గంగయందున్నప్పటికిని అది గంగామార్గము గుండా సముద్రమున ప్రవేశించును, మరియు దానికి తనంతతానే తీర్థములందన్నింటను నివసించిన ఫలము లభించు

విధమున, యీ కర్మాచరణముతప్ప మనకు మరేగతియూ లేదనెడి తలం పుతో విహితకర్మల నాచరించునెడల, మనభారము అంతయూ తనంతతానే యీశ్వరునిపై పోయిపడును. ఓ అర్జునా, ఎవరికి ఏది యోగ్యమగు కర్తవ్యము లగునో, అవే యీశ్వరునకు యిష్టమైనవగును, మరియు యిందుమూలమున ఆకర్మల నాచరించుటవలన యీశ్వరుడు తనంతతానే లభించును. ఒకానొకని అంతఃకరణమనెడి మచ్చుగాత్రిపై సరియైనదిగా తేలినందువలన అతనికి ప్రియురాలైన స్త్రీ, అంతకుపూర్వము దాసియైన నగుగాక, కాని యిప్పు డామె అతని యజమానురాలిగా నగును. ఈ విధముగా ఏ పురుషుడు తన శిరస్సునైన లక్ష్యపెట్టక, మరియూ సర్వవిధములా తన యజమానిని సేవించునో, అతనిని ఆతని యజమాని తన నెత్తిపై పెట్టుకొనును (అనగా అతనిని అత్యధికముగా ఆదరించును.) ఏ సేవలో ప్రభువుయొక్క మనోరథము లన్నియూ నెరవేర్చబడునో దానినే నిజమైన మరియూ ఉత్కృష్టమైనట్టియూ సేవ యందురు. ఓ అర్జునా ! యిట్టిది కాని సేవ లన్నియూ కేవలము బజారు వెచ్చములే యగును.

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥౪౬॥

"ఇందువలన, కేవలము దీనిని విహితకర్మాచరణ యని మాత్రమే కాదు, పరమాత్మయొక్క మనోగతమగు వాంఛను పాటించుటయే యని యెరుంగవలెను. దేనివలన యీ భూతసృష్టి ఆకారప్రాప్తి నొందినదో, ఎవడీ మాయారూపియగు గుడ్డపీలికలను జోడించి యీ జీవరూపి యగు గుడ్డబొమ్మలను తయారుచేయునో మరియు త్రిగుణములతో నేయబడిన అహంకార రూపియగు దారముతో దానిని ఆడించునో, ఎవడు యీవిశ్వము నంతనూ తన ప్రకాశముతో దీపజ్యోతివలె లోపలను-బయటను వ్యాప్తమొనర్చియుంచెనో, అట్టి ఆసర్వాంతర్యామియగు ఈశ్వరుని విహితకర్మాచరణ

మనెడి పుష్పములతో పూజించినచో ఆతనికి అపరంపారమగు సంతో
షము కలుగును. ఈ విధమగు పూజవలన ఆ పరమాత్మ సంతుష్టుడైనప్పుడు
ఆతడు విహితకర్మాచరణ మొనర్చెడి భక్తునకు వైరాగ్యలాభము ప్రసాదిం
చును. అంతట, ఆ వైరాగ్యావస్థలో మనస్సునందు కేవల మా ఏకేశ్వర
ధ్యానమే కలిగినప్పుడు జీవునకు యీ విశ్వమంతయూ వమనముచేసిన పదా
ర్థమువలె ఘృణితముగా తోచును. పతివియుక్త యగు స్త్రీకి పతిచింతవలన
జీవితమే నిరర్థకమగు రీతిని ఆ భక్తునకుకూడా సుఖమునకు సంబంధించిన విష
యములన్నియూ సంపూర్ణమైన దుఃఖములుగానే తోచును. ఈ పరోక్ష
జ్ఞానమునం దెంతమహిమ యున్నదనిన, యీశ్వరుని ప్రత్యక్షజ్ఞానము కలుగక
పూర్వమే కేవలము ఆతని ధ్యానమువల్లనే జీవునియందు తన్మయత్వము
వచ్చును. ఇందువల్లనే ఏ మనుష్యుడు మోక్షమును పొందవలె ననెడి కోరిక
మరియూ ప్రయత్నమును చేయునో, ఆతడు ఆతనికి స్వధర్మాచరణమును
చక్కగా నిర్వర్తించుట ఉచిత మగును.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥౪౭॥

“ఓ అర్జునా! తన ధర్మమును ఆచరించుటలో కష్టము కలిగిన కలుగు
గాక, దాని పరిణామ స్వరూపముగా మన కెట్టి ఫలము లభించునను విష
యముపై ధ్యాన ముంచవలెను. ఓ పార్థా! మనశరీరమును వ్యాధిరహితముగా
నొనర్చుకొనుటకై కేవలము చేదుగా నుండెడి వేపయే ఔషధమగుచో
దాని చేదుకు మనము వ్యాకులపడు నెడల మనపని ఎటుల నెరవేరును?
అరటిచెట్టును కాయలు కాయకపూర్వము చూచి, కాయలు కాన్పించలేదని
నిరాశ జెంది ఆ చెట్టును నరికివేయుచో, మనముచేసిన ఆ పనివలన ఏ సత్ఫలి
తము కలుగ గలదు? సరిగా యిదేవిధమున, మనము స్వధర్మము నాచరిం
చుట చాల కష్టముగా నున్నదనెడి కారణమువల్ల మాత్రమే దానిని
త్యజించి తిరస్కరించుచో, మన మెన్నడైన మోక్షమును పొందగలమా? మన

తల్లి గూనిదియైనప్పటికిని, ఆమె చూపెడి ఏ ప్రేమచే మనము జీవించుచున్నామో, ఆ ప్రేమ ఎన్నడును వక్రముగానుండదు. పరస్త్రీలు రంభకంటె కూడా ఎక్కువ లావణ్యము కలిగియుండిన నుండుగాక- అయినప్పటికిని వారియందు మాతృప్రేమ లేనప్పుడు- బాలకునకు వారివల్ల కలుగు ప్రయోజనమేమి? నీటిలోకంటె నేతిలో అవశ్యము అత్యధికగుణములు గలవు, అంతమాత్రమున మత్స్యములెన్నడైన ఘృతమునందుండునా? ప్రపంచమునకంతకూ విషముగానుండు పదార్థము, ఆపదార్థములో నేపుట్టి పెరిగెడి కీటకములకు అమృతమగును. మరియు ప్రపంచమునకంతకును మధురముగానుండు బెల్లము విషముతో కూడియున్న ఆకీటకములకు ప్రాణఘాతకమగును. కావుననే, ఎవనికి ఏది విహితకర్మలో, మరియు వేటిని ఆచరించుటవలన సంసారబంధము తెగిపోవునో, ఆకర్మలు. ఆచరించుటకు కష్టముగానున్నప్పటికిని ఆకర్మలను తప్పక ఆచరించవలెను. ఇతరుల ఆచారములు చక్కగానున్నటుల తోచినందువలన మనముకూడా ఆ ఆచారములనే చేయమొదలిడుట కాళ్ళకు బదులు తలతో నడచుటకై ప్రయత్నము చేయమొదలిడుటవలె, అనిష్టకరములే యగును. కావున మన జన్మము మరియు స్వభావము ననుసరించి ఏకర్మలు మన వంతుకు వచ్చినవో, అట్టి కర్మలనే ఏ మనుష్యు డాచరించునో, ఆతడు కర్మబంధకత్వమును నాశన మొనర్చుకొనెనని తెలిసికొనవలయును. మరియు ఓ అర్జునా, యిందువల్ల, మనము మన ధర్మమును పాటించి, యితరుల ధర్మములను త్యజించుట అవశ్యకము గాదా? ఆత్మదర్శనము కానంత వరకు కర్మాచరణ మాగిపోవుటకు ఎన్నడైన అవకాశమున్నదా? నీవే యోచించుము. మరియు ఏకర్మ చేసినప్పటికిని దానిని చేయుటలోగల కష్టము అన్నిటికంటె ముందుగా వుండియేతీరును.

సహజం కర్మకౌంతేయ సదోషమపి న త్యజేత్ ।
సర్వారంభాహి దోషేణధూమే నాగ్ని రివావృతాః ॥౪౮॥

“ సర్వకర్మలను ఆచరించుటలోనూ పరిశ్రమ చేయవలసియుండగా యిక స్వధర్మాచరణములోకూడా శ్రమయూ మరియు కష్టమూ వున్నదనిన, యిందుకై స్వధర్మమునకేల దోషము నారోపించవలెను ? తిన్ననగు సరళ మార్గమున వెళ్ళినప్పటికిని పాదములకు కష్టము కలుగును; మరియు మిట్ట-పల్లములు గాగల అరణ్యములగుండా వెళ్ళినప్పటికిన్నీ కష్టము కలిగియే తీరును. కంకరరాళ్ళను మూటకట్టి మోసినప్పటికిన్నీ, మరియు ఆహారపానీయములకు సంబంధించిన సామగ్రిని మూటగట్టి మోసినప్పటికిన్నీ, రెండింటియందును బరువుండియే తీరును. కాని, ప్రవాససమయమున ఏ బరువును మోసినందువల్ల శ్రమయూ మరియు శైథిల్యతయూ తొలగిపోవుటలో సహాయపడునో, ఆ బరువును మనవెంట మోసికొనిపోవుట సమంజస మగును. అటులకానిచో, ధాన్యమునైనను మరియు ఊకనైనను - రెండింటిని దంచుటలోనూ సమానముగనే పరిశ్రమ చేయవలసి యున్నది. కుక్కమాంసమును వండినప్పటికిని, మరియు యజ్ఞమునకై హవిరన్నమును వండినప్పటికిని - రెండింటియందునూ వండుటయనెడి కార్యమొక్కటే యగును. సువిజ్ఞుడవగు అర్జునా, నీటిని చిలుకుటయు, పెరుగును చిలుకుటయు- రెండునూ ఒకేవిధమగు పనులు. సరిగా యిదేవిధమున, గానుగలో యిసుక పోసి త్రిప్పినప్పటికిని, నువ్వులుపోసి త్రిప్పినప్పటికిని - రెండుపనులూ సమానమే యగును. ఓపార్థా, వైశ్వదేవమునకై అగ్నిని ప్రజ్వలితమొనర్చినప్పటికిని, యింటియందు నిప్పంటించుటకునూ - యీ రెండు పనులయందునూ పొగవలన వచ్చు కష్టము సమానమే యగును. ధర్మపత్నిని పోషించుటయందును, దురాచారిణి యగు వేశ్యను పోషించుటయందునూ - యీ రెండు పనులయందునూ ధనవ్యయము సమానమే. కాని, అట్టి స్థితిలో, వేశ్యను తనవద్ద నుంచుకొని బలవంతముగా తనకు

కళంకము నేల తెచ్చుకొనవలెను ? శత్రువునకు వెన్నిచ్చి వీపుపై తినిన
గాయములవలన మృత్యువు తప్పక సంభవించుచో, యిక శత్రువు నెదుట
నిలచియుండి గాయములు తినుటలో కలిగెడి విశేషహాని ఏమి గలదు ?
మంచికులమునకు చెందిన స్త్రీ పరులయింటికి పోయి ఆశ్రయించినప్పటికిని
అచ్చటకూడా కర్రదెబ్బలు తినవలసియే వచ్చుచో, ఆమె తనయింటియందే
తన భర్తవల్లనే దెబ్బలు తినవలసివచ్చెనని భర్తను విడచిపెట్టి యిల్లు విడచి
బయటకు పోయినందువలన ఆమెకు కలిగెడి లాభమేమి గలదు ? సరిగా
యిదేవిధమున తనకు అతి ప్రియమగు పనికూడా కష్టపడనిదే నెరవేరనప్పుడు
యిక మనము విహితకర్మలనొనర్చుట అతికష్టమని ఏనోటితో చెప్పగలము ?
ఓ అర్జునా, మనజీవితమును ఆయుష్యమనెడి అమృతము యొక్క ఏకొద్ది
భాగమునకైనప్పటికిని మన సర్వస్వమును అమ్మినను అందువల్ల మనకేమి
నష్టముకలుగును ? దేనిని త్రాగుటవలన మనప్రాణములను వ్యర్థముగా
కోల్పోయి మనము మనమే చంపుకొందుమో అట్టి విషమును మనమే స్వయ
ముగ ఏల దబ్బిచ్చికొని, ఎందుకు త్రాగవలెను ? సరిగా యిదేవిధముగా
యింద్రియములను కష్టపెట్టి మరియు ఆయుఃకాలమును వ్యర్థముగ కోల్పోయి
మనముచేసెడి పాపసంగ్రహమునందు దుఃఖముతప్ప మరియేమి గలదు ?
కావుననే స్వధర్మాచరణము నొనర్చవలెను, అది మనప్రయాసనంతనూ దూర
మొనర్చును మరియు సర్వశ్రేష్ఠమైన పురుషార్థమగు మోక్షమునుకూడా మనకది
లభింపజేయును. కాన ఓఅర్జునా, కష్టసమయమున సిద్ధిపొందిన మంత్రమును
మరచిపోగూడదని విధమున స్వధర్మాచరణమొనర్చుటకైకూడా మనమెన్నడును
వ్యాకులపడరాదు. సముద్రమున నావను విడువగూడని విధమున లేదా మహా
రోగము వచ్చినప్పుడు దివ్యౌషధమును విడువరానటుల యీలోకమునందు
బుద్ధిపూర్వకముగా స్వధర్మము నెన్నడును పరిత్యజించరాదు. ఓ అర్జునా,
యీ స్వధర్మాచరణమనెడి ఆరాధనచే పరమేశ్వరుడు సంతుష్టుడై
నప్పుడు, ఆ పరమేశ్వరుడు భక్తునిలోనుంచి రజోగుణము, మరియు

తమోగుణములను తీసివైచి ఆతని మనస్సున ' ఆత్మసాధనపట్లగల దృఢేచ్ఛచే ఆతనికి ఐహికము మరియు పార లౌకికములగు, సుఖములన్నియు విష సమాన ముగ తోచునట్టి ' వైరాగ్యమును జనింపజేయును. ఈ వైరాగ్యముయొక్క లక్షణములు పైన 45 శ్లోకములలో వివరముగా చెప్పబడిన వన్నియూ ఆ పురుషునకు లభించును. ఇక యీ స్థానమునద్దకు ఆరూఢుడైన పిమ్మట ఆ పురుషుడు అన్నిసమయములందును ఏరీతిని ఆచరించును, మరియు ఆతనికి యీ విధమగు ఆచరణవలన ఏ లాభము కలుగును – అను విషయములను గురించి చెప్పెదను వినుము.

అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగత స్పృహః ।
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి ॥౪౯॥

" వలలో వాయువును బంధించుటకు వీలులేని రీతిని ఆ పురుషుడు కూడా యీ దేహాదులలో ఏ విధముగను బద్ధుడు కాజాలడు. కాయలు పక్వమయ్యేడి సమయము వచ్చినప్పుడు, ఫలము కొమ్మను అంటుకొనియూ వుండజాలదు. మరియు కొమ్మకూడా ఆ ఫలమును పట్టుకొని యుండనూలేదు. సరిగా యిదేవిధమున, యీ పరిపూర్ణావస్థలో ఆ పురుషునకు సంసార విష యికమగు ప్రేమ పూర్తిగా సడలిపోయి నిర్బలమగును. విషపాత్ర నాదేననిన్నీ, నేనే దానిని త్రాగెదననిన్నీ ఎవడున్నూ చెప్పని విధమున, పుత్రులు, ధన సంపద మరియు భార్యామొదలగునవి ఆతని మనస్సునుండి జారిపోవును. మరియు ఆతడెన్నడును యివియన్నియూ నావియని అగ్రహించడు. అనగా, ఆతని మనస్సునందు విషయములపట్ల ఏవగింపు కలుగును. మరియు ఆతనిబుద్ధి విషయములన్నింటికిని దూరముగా నుండసాగును, మరియు హృదయమందలి ఏకాంతస్థానమున ప్రవేశించును. ఇక, యిట్టిపురుషుని మనస్సు బయట సంచ రించినప్పటికిని, ఆతని వైరాగ్యముతో కూడియున్నబుద్ధి ఏకనిష్ఠగల దాసివలె ఆతడనిన పూర్తిగా భయముకలిగి పనుల నన్నింటిని చేయును. మరియు ఆతని

ఆజ్ఞ నెన్నడును ఉల్లంఘించదు. ఇంతేగాక, ఓ అర్జునా, ఆతడు మనస్సును ఐక్యభావన యనెడి గుప్పిటలో బంధించి దానిని ఆత్మానుసంధానమున ప్రవృత్తమొనర్చును. ఆసమయమున ఐహికము మరియు పారలౌకిక విషయములతో సంబంధముగల ఆతని వాసనలు 'దుమ్ము చేగాని మట్టిచే గాని అణచి వేయబడిన అగ్ని ఆరిపోవు రీతిని' అణగి, మరణించును. ఆసమయమున, మనస్సును నియమించుటవల్ల యీ విధముగా ఆతని వాసన లన్నియూ తమంతతామే నాశ మొందును. ఆ పురుషు డిట్టి లక్షణములు గల స్థితిని పొందును. ఓ అర్జునా! ఆ పురుషుడు మాయాజన్యమగు జ్ఞానాభాసను విడచి, మరియు దానిని అంత మొందించి వాస్తవిక జ్ఞాన మనెడి క్షేత్రములోనికి వచ్చియుండును. సమకూర్చి యుంచిన జలము వినియోగమువలన సమాప్తమగు రీతిని ఆతని ప్రాచీనకర్మలు కూడా దేహ-భోగమువలన నశించును, మరియు నవీనకర్మల నొనర్చుటలో ఆతని మన స్సేవిధముగను సహాయపడదు. ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా! యిట్టి స్థితినే కర్మ-సామ్య స్థితియని యందురు. అంతట, యీ స్థితిలో, ఆ పురుషునకు సద్గురుదర్శన మతి సహజముగ నగును. రాత్రి నాల్గుఝాములూ గడచినపిమ్మట అంధకారమునకు శత్రువగు సూర్యుని దర్శనము నేత్రములకు దానంతట ఆదేయగురీతిని, లేదా గెల (కాయలు) వెయ్యగానే అరటిచెట్టు పెరుగుదల దానంతట అదే ఆగిపోవువిధమున యీ స్థితిలో ముముక్షువుకు సద్గురు దర్శనము దానంతట దేయగును. అంతట ఓవీరశ్రేష్ఠా, పౌర్ణమివచ్చిన పిదప చంద్రుని కొరంతయంతయూ తొలగిపోయి ఆతడు పరిపూర్ణుడగు రీతిని సద్గురుకృపవలన ఆపురుషుడుకూడా పరిపూర్ణుడగును. ఆపిమ్మట, ఆతనియందు మిగిలియున్న అత్యల్పమగు అజ్ఞానభాగముకూడా సద్గురుకృపచే నాశమొందును. ఆపైని, సూర్యోదయమగుటతోడనే అంధకారము మరియు దానితోపాటు రాత్రియూ పూర్తిగా నిర్మూలమగురీతిని లేదా గర్భముదాల్చిన స్త్రీ-పశువులను వధించుటచే దానిగర్భమందు వున్నబిడ్డకూడా

అప్పటికప్పుడే మరణించురీతిని అజ్ఞానగర్భమునందుండెడి కర్మ, కర్తమరియు కార్యములనెడి త్రిపుటికూడా నాశమొందును. అటుపిమ్మట, అజ్ఞానము నాశమొందుటతోడనే దానితోపాటు కర్మసమూహములన్నియూ కూడా నాశమగును. ఈరీతిని, యీ సన్యాసము పూర్తిగా మూలమువరకుపోవును. ఈ మూలాజ్ఞానము నాశనమగుటవలన యీ నామ - రూపాత్మకమగు మాయ చేయు కృత్యములయొక్క ఆధారమే నాశనమొందును, మరియు ఆపురుషుడు స్వయముగా జ్ఞేయస్వరూపుడుగానేయగును. తాను నీటిగుండలో మునిగిపోవుచున్నటుల కలగాంచిన మానవుడు, తాను మేల్కొనిన పిమ్మట కూడా తాను నీటిగుండములో మునిగిపోవుచున్నటుల తలంచి, దానినుండి బయటకు వచ్చుటకై ఎన్నడైనను ప్రయత్నమును చేయునా? నా కేమియూ బోధపడుటలేదనినీ, యిక నేను జ్ఞానసంపాదన మొనర్చెదనననీ ఆతడు కనుచున్న దుస్స్వప్నమిప్పుడు అంతమొందును. మరియు, ఆతడు జ్ఞాత మరియు జ్ఞేయమనెడి భావనలనుండి తప్పించుకొని కేవలము జ్ఞానస్వరూపుడే యగును. ఓ వీరశ్రేష్ఠుడవగు పార్థా, అద్దమును ప్రక్కకు తొలగించినప్పుడు దానితోపాటు దానియందింతవరకు పడుచున్న ప్రతిబింబముకూడా కనులకు కాన్పించకుండా అదృశ్యమగును; అట్టి సమయమున కేవలము చూచువాడు (ద్రష్ట) మాత్రమే మిగిలియుండు రీతిని అజ్ఞానము నాశమొంది దానితోపాటుగా జ్ఞాతృత్వముకూడా లోపించిపోయి నప్పుడు, కేవలము క్రియా-హీన చైతన్యము మాత్రమే మిగిలియుండును. ఓ అర్జునా ! యీ చైతన్యమునందు స్వాభావికముగనే ఏ విధమగు క్రియయూ జరుగజాలదు. యిందువల్లనే దీనిని 'నైష్కర్మ్య' మందురు. నా మూలస్వరూపమే నా కా సమయమున ప్రాప్తించును, మరియు నా అజ్ఞానజన్యమగు భేదభావమనెడి భిన్నత్వము నాశనమగును. గాలి ఆగిపోయి నప్పుడు తరంగములు జలమునందు లీనమై సముద్రముగా నగు రీతిని 'లేకుండుట' లేక 'భిన్నత్వము నశించుట' లు జనించును, మరియు

దీనినే నైష్కర్మ్యసిద్ధియని యెరుంగవలెను. సిద్ధులన్నింటను యిదియే అన్నింటికంటె అధిక మహత్త్వముగల శ్రేష్ఠమైన సిద్ధి. దేవాలయము నిర్మాణమున క్లేశములు సంభవించు రీతిని, లేదా నది సముద్రమును ప్రవేశించు రీతిని, లేదా బంగారుయొక్క శుద్ధత్వము పదునారవవన్నె అయినరీతిని, అజ్ఞానము మరియు జ్ఞానములు రెండునూ నాశమగుటను పిమ్మట యీస్థితిని పొందవలసియున్నది. ఈస్థితిని చేరినపిమ్మట, యింకనేదియూ నిష్పాద్యమునదేదియు నట్టిది మిగిలియుండదు. ఇందువలననే దీనిపేరు 'పరమసిద్ధి' యని యేర్పడినది.

> సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే
> సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥౫౦॥

"గురుకృప లభించినపిమ్మట భాగ్యవంతుడైనవానికి యీ ఆత్మసిద్ధి ప్రాప్తించును. సూర్యుడు ఉదయించుటతోడనే అంధకారము వుండని విధమున, దీపస్పర్శవలన కర్పూరముకూడా దీపస్వరూపమును పొందురీతిని, లేదా జలమును స్పర్శించగానే ఉప్పుబెడ్డకూడా జలస్వరూపమునుపొందు విధమున లేదా నిద్రించిన మనుష్యుడు మేల్కొనినపిమ్మట నిద్ర మరియు స్వప్నములు రెండునూ నాశమొంది అతడు వెంటనే స్వస్వరూపమునకు వచ్చు రీతిని, గురువచనములు వినుటతోడనే సౌభాగ్యవశమున ఎవని ద్వైతబుద్ధి నాశమొందునో, మరియు ఎవనికి ఐక్యరూపమగు ఆత్మప్రతీతియందు విశ్రాంతి లభించునో, అట్టివానికి యింకనూ ఏవో కర్తవ్యములు మిగిలియుండెనని ఎవ్వడైన ఎవడైన చెప్పగలుగునా ? ఆకాశమెవ్వడైన జన్మించునా, లేదా నాశమొందునా ? కావున, యిట్టిపురుషునకుకూడా ఏ కర్తవ్యమూ మిగిలియుండదనుట నిస్సందేహమగు విషయము. కాని, యీ విషయము ప్రతిపురుషునకును వెంటనే సంభవించదు. తన చెవులు మరియు గురువచనములకు సంయోగము కలుగుటతోడనే ప్రతివస్తు - స్వరూపము (అనగా ఆత్మస్వరూపము) ఒక్కమారుగా సిద్ధిని పొందజాలదు. ఏలనన, సామాన్యముగ

విహితకర్మాచరణమనెడి అగ్నిచే, కామ్యము మరియు నిషిద్ధకర్మలనెడి కట్టెలను కాల్చివైచి దానిలో రజోగుణము మరియు తమోగుణములను రెంటిని దగ్ధమొనర్చి బూడిదగానొనర్చి, పుత్రులు, ద్రవ్యము మరియు స్వర్గ సుఖాదులపైగల లోభమును కూడా సేవకుని వశమునం దుంచుకొనురీతిని పూర్తిగా తన వశమొనర్చుకొని, నలువైపులను స్వేచ్ఛగా పరుగులిడెడి మరియు విషయములనెడి మలముచే మాలిన్యతపొందిన ఇంద్రియములను నిగ్రహమనెడి తీర్థములో కడిగి, చక్కగా నిర్మలముగా నొనర్చి మరియు స్వధర్మాచరణమువలన కలిగెడి ఫలమును యీశ్వరార్పితమొనర్చి అచలమైన వైరాగ్యమును పొందినవాడై, మరియు యీరీతిని ఆతడు ఆత్మసాక్షాత్కార సమయమున జ్ఞానోత్కర్షకు కావలసిన సామగ్రి నంతనూ ఏకత్రితమొనర్చి, మరియు యిట్టి సమయమున ఆతనికి సద్గురు దర్శనము లభించి మరియు సద్గురుడు ఏ విధమగు సంకోచమూ లేకుండా విపులముగా ఆత్మబోధోపదేశ మొసర్చినప్పటికిని — ఔషధమును పుచ్చుకొనుట తోడనే మన శరీరమునందలి రోగసంబంధమగు వికారములు వెంటనే తొలగిపోవుచున్నవా? మరియు మన శరీరము ఒక్కసారిగా స్వస్థత గలదై పోవునా?—యనెడి విషయమును గురించి మనము యోచించవలసి యున్నది. లేదా తెల్లవారగనే ఎన్నడైన మధ్యాహ్నము కాగలదా? సారవంతమైన మరియు చెమ్మగానున్న భూమిలో మంచివిత్తులు నాటినయెడల తప్పనిసరిగా మంచిపంట పండును; కాని, అదిఎప్పుడు? ఉపయుక్త సమయము వచ్చి, పైరుమొలకెత్తెడి రోజులు వచ్చినప్పుడు మాత్రమే గదా! మార్గము పూర్తిగా సుగమము, సరళము మరియు స్వచ్ఛమైనదియై యుండి, తోడుగావచ్చెడివాడు కూడా మంచివాడే లభించినప్పుడు సహజముగానే మనము మనయిష్టస్థానమును చేరగలము. కాని, మనమనుకొనిన యిష్టస్థానమును చేరుటకు పై రెండింటితో పాటు సమయముకూడా కావలసియున్నది సరిగాయిదేవిధమున, మనస్సున వైరాగ్యము పూర్తిగానిండియుండి, అందుపై

సద్గురు దర్శనముకూడా లభించి, అంతఃకరణమున ఆత్మానాత్మ వివే కాంకురములుకూడా తీవ్రముగ ఉద్భవించి, మరియు యిట్టి వివేకము వల్ల 'ఒక్క బ్రహ్మమాత్రమే సత్యవస్తువు, మిగిలిన వన్నియూ మాయా జనిత మోహజాలమే' నవెడి నిశ్చితానుభవము కలిగినప్పుడుమాత్రమే. ఆపురుషుడు కాలక్రమము ననుసరించి, ఏ బ్రహ్మతత్త్వ మనబడెడి పర బ్రహ్మ సర్వవ్యాపియూ మరియు సర్వశ్రేష్ఠుడునై యున్నాడో, దేని యందు మోక్షకార్యము సమాప్త మొందునో, ఎవడు జ్ఞాత, జ్ఞేయము మరియు జ్ఞాన మనెడి త్రిపుటిని కబళించునో, ఎవడు అంతమున జ్ఞానమునకు చెందిన క్రియల నన్నింటిని ఆపివేయునో, దేనియందు ఐక్యత యనెడి ఏకత్వము పరిపూర్ణమగునో, దేనియందు ఆనందమునకు సంబంధించిన అణు-రేణువులుకూడావిలీనమైపోవునో, మరియు అంతమున ఏమియూనుండని కేవల శూన్యస్వరూపమే మిగిలియుండునో, అట్టిబ్రహ్మతత్త్వమున సమరసత్వమును పొంది బ్రహ్మత్వస్థితినిపొందును. ఆకలితోనున్నవానిముందు షడ్రస భోజనమును వడ్డించినప్పుడు ప్రతిముద్ద తినునప్పుడును ఆతనికి సంతృప్తి కలుగురీతిని, వైరాగ్య సహాయముచే వివేకమనెడి దీపము ప్రజ్వలితము కాగానే ఆత్మస్వరూపమనెడి గుప్తభాండారము ఆతనికై తెరచుకొనును. అప్పుడుకూడా, ఏమానవుడు ఆత్మస్వరూప వైభవమును ప్రత్యక్షముగా అనుభవించగల అత్యధికమగు యోగ్యతను సంపాదించెనో, అట్టివాడు ఆ బ్రహ్మప్రాప్తియనెడి యోగ్యతవరకు ఏక్రమముననుసరించి చేరునో, ఆతని లక్షణములేవో నీకు వివరించి చెప్పెదను వినుము.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్యచ
శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌవ్యుదస్యచ ॥౫౧॥

"గురువు చూపిన మార్గమునపోయి ఆతడు వివేకమనెడి తీర్థమును చేరును, మరియు అచ్చట తన బుద్ధియందుగల మాలిన్యము నంతనూ అతి [illegible]గా కడిగివేయును. ఆటుపిమ్మట, రాహుముఖమునుండి తప్పించుకొనిన

కాంతివచ్చి చంద్రుని ఆలింగన మొనర్చుకొనురీతిని, ఆ పురుషునియొక్క నిర్మలమగు బుద్ధి ఆత్మస్వరూపముతో పోయి కలియును. పతివ్రతా స్త్రీ తన అత్తవారిల్లు మరియు పుట్టింటిని రెంటినీ విడచి కేవలము తన భర్తనే అనుసరించు రీతిని, ఆతని బుద్ధికూడా సుఖదుఃఖాది ద్వంద్వములను విడచి కేవలము ఆత్మస్వరూప చింతనమునందే లీనమగును. మరియు యింద్రియములచే వృద్ధి పొందింపబడియుండెడి మహిమగల శబ్దస్పర్శాది విషయము లైదున్నూ జ్ఞానముయొక్క మూలతత్త్వమును పొందవలెననెడి ఆశతో చేయబడెడి యింద్రియనిరోధమువలన 'సూర్యకిరణములు లేనందువలన మృగజలముకూడా లోపించిపోవు రీతిని' విలీనమైపోవును. తెలియనందువలన చేసిన నీచ భోజనమును వమన మొనర్చి తన పొట్టనుండి బయటకు నెట్టివేయ వలసియున్న రీతిని ఆపురుషుడు విషయములు మరియు విషయవాసనను కూడా యింద్రియములచే వమన మొనర్ప జేయును. అంతట ఆ యింద్రియములను అంతర్ముఖవృత్తిచే పవిత్ర తటమువద్దకు తెచ్చి, మరియు వాటితో ఉపయుక్తమగు ప్రాయశ్చిత్తము చేయించి ఆతడు వాటిని నిర్మలమొనర్చును. అటుపిమ్మట, సత్త్వసంపన్నమగు ధైర్యముతో ఆతడా యింద్రియములను శుద్ధమొనర్చును, మరియు యోగసాధనమువల్ల వాటిని మనస్సుతో కలిపి పూర్తిగా ఏకమొనర్చును. తన ప్రాచీన కర్మల ననుసరించి ఆతని కీ జన్మలో భోగించవలసియున్న యిష్టానిష్ట భోగములలోకొన్ని చెడ్డవిగను కష్టమైనవిగను కాన్పించినప్పటికిని, ఆత డందులకై తన మనస్సున రాగ - విషాదములను చెందడు. లేదా, ఒకవేళ ఆ భోగములలో ఏదైన మంచిగాని సుఖముగాని కాన్పించినప్పటికినీ ఆతడు వాటి వలన కలిగెడి ఆనంద లోభమున చిక్కుకొనడు. ఈ విధముగా, ఓ అర్జునా, ఆ పురుషుడు మంచి చెడ్డ విషయములయెడ లోభ - క్షోభములను రెంటినీవిడచి పర్వతాది శీతల గుహలలోనికిపోయి నివసించసాగును.

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయ మానసః ।
ధ్యానయోగ పరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥౫౨॥

“ఆమనుష్యుడు జన సమ్మర్దముగల ప్రదేశమును విడచి కేవలము తన శరీరావయవముల సాంగత్యమునందే అరణ్యమున నివసించును. ఆతని ఆటలన్నియూ శమదమాదులతోనే వుండును. మౌనమే అతని సంభాషణము, మరియు ఎల్లప్పుడు గురువచన చింతనమునందే నిమగ్నుడై యుండుటవలన అతనికి సమయమును గురించిన ధ్యాసయేవుండదు. భోజనము చేయునప్పు డాతని మనస్సున దీనివలన నా అవయవములు పుష్టివంతములై బలముగలవగు ననెడి ఆలోచనయూ వుండదు, మరియు, ‘దీనివలన నా ఆకలితీరును ! అని కూడా యోచించడు’, మరియు ‘నా నాలుకకు రుచికరముగా వుండవలెన’ని కూడా అతడు వాంఛించడు. మితముగాను మరియు నియమితముగను తీసికొను ఆహారముచే అతనికి కలిగెడి సంతోషమునకు పరిమితియే యుండదు. తాను తినిన అన్నముయొక్క ఉష్ణతవలన తనక్షీణప్రాణములు నిలచియుండవలెననెడి తలంపుతోమాత్రమే అత డే కొద్దిగనో భుజించును. భర్త మినహా మరియేయితర పురుషుడు వాంఛజూపినప్పటికిని కులీనస్త్రీ అతనివైపు కుటిల మనస్సుతోకూడ ప్రవృత్తురాలుకాని రీతిని ఆతడుకూడా నిద్రాలస్యములనెడి ఆసనములకు స్థానమివ్వడు(అనగానిద్రమరియుబద్ధకములకు వశపడడు.) సాష్టాంగనమస్కారము చేయునప్పు డాతని అవయవము లవశ్యము భూమికి తాకునుకాని, ఆ సందర్భమున తప్ప మరియెన్నడును ఆతడు భూమిపై, శయనించుట యనెడి ఆనాలోచన నొనర్పడు, శరీర వ్యవహారమునకు పరమావశ్యకమైనంత మాత్రమువరకే ఆతడు చేతులను - పాదములను కదల్చును. తాత్పర్య మేమన, ఆతడు తన శరీరమును లోపలను-బయటను అంతయూ తనవశమునందే వుంచుకొనును. మరియు, ఓ ధీరుడవగు అర్జునా ! అతడు తన అంతఃకరణవృత్తిని మనస్సుయొక్క గుమ్మమునైన చూడనివ్వడు అనగా, అంతఃకరణమును మనస్సుకు చాల దూరముగా నుంచును.) యిట్టి

స్థితిలో ఆ గుమ్మమును దాటి మనస్సువద్దకు పోవుటే సంభవించదుగదా; ఇట్టి స్థితిలో మనస్సునందలి తలంపులను శబ్దములలో ఉచ్చరించుటకు అవకాశ మెచ్చట నుండును ? ఈ విధముగా ఆతడు శరీరము, వాక్కు మరియు మనస్సు మొదలగు చుట్టు - ప్రక్కలగల యీ పదార్థము లన్నింటిపైనను విజయమును సంపాదించి ధ్యాన మనెడి ఆకాశముపై చేయి నిడును. సద్గురు వాక్యములవలన తనయందు జాగరితమైన ఆత్మబోధను గురించి తనకు గల నిశ్చయము నాతడు నిరంతరము అద్దము వలె తనముం దిడుకొని దాన్ని చూచుచుండును. ఆతడు స్వయముగ ధ్యాన మొనర్చును గాన ధ్యాత యగుట వాస్తవమే, కాని ఆతని అంతఃకరణవృత్తిలో ధ్యానముకూడా ధ్యేయము నందు కలిపి దానితో ఏకరూపమును పొందును. ఓ అర్జునా ! ఆతడు ధ్యాన మొనర్చెడి యీ పద్ధతిని నీవు జ్ఞప్తియం దుంచుకొనుము, అంతట, ధ్యేయము, ధ్యానము మరియు ధ్యాత అనెడి త్రిపుటి కలసి ఏకము కానంతవరకు అతని ధ్యానము తెంపులేకుండా జరుగుచునే వుండును, కావుననే యిట్టి ముముక్షుత్వము గల జీవుడు ఆత్మజ్ఞానమున నైపుణ్యము గల వాడగును; కాని ఆతనివలన జరుగుచుండెడి యీ పను లన్నియూ, ఆతడు యోగాభ్యాసమును తదితర విషయములన్నింటికిని ముందుంచి, దానికి గొప్పదనము నాపాదించుటకొరకే అయియున్నది. గుదద్వారము మరియు మూత్రద్వారములకు మధ్యగల కీలుకు పాదములతో గట్టిగానొక్కి ఆతడు మూలబంధమును చేయును. ఆతడు క్రిందిభాగమును కుంచించి మరియు గుదస్థానమున మూలబంధము, నాభిచక్రమున ఉడ్యాణబంధము మరియు కంఠస్థానమున జాలంధరబంధమును-యీ మూడింటినీ సాధనచేసి భిన్నభిన్న వాయువులను పూర్తిగా ఏకసమాన మొనర్చును. అంతట కుండలినిని మేల్కొల్పి, మధ్యమ మార్గమగు సుషుమ్నా మార్గమును తెరచి విశాలమొనర్చి, మరియు ఆధార చక్రమునుండి ఆజ్ఞాచక్రమువరకుగల చక్రములన్నింటిని భేదించి, చివరిదియగు ఏడవ చక్రమునుకూడా భేదించును. అందువలన బ్రహ్మరంధ్రమందలి

సహస్రదళకమలములలో నుండి అమృతము వర్షించసాగును. మరియు 'ఆ అమృతప్రవాహము గుదస్థానమందలి మూలబంధము వరకు వచ్చునట్లు చేయును. ఆపైని, బ్రహ్మరంధ్రమందలి కైలాసముపై తాండవ మాడుచుండెడి చైతన్యరూపియగు భైరవుని కపాలమునందు మనస్సు మరియు ప్రాణవాయువులనెడి పులగమును నింపును. మరియు యీ రీతిని సిద్ధ మొనర్పబడిన యోగమనెడి మంచి గొప్పదగు సైన్యమును తనముందువుంచుకొని, వెనుకవైపున తన ధ్యానమనెడి కోటను చక్కగా బలిష్ఠ మొనర్చును. ధ్యానముమరియుయీ యోగములనెడి రెంటినీ ఆత్మతత్త్వజ్ఞానమునందు నిర్విఘ్నముగా స్థిరపరచి యుంచుటకై అతడు మొదటినుంచియే వైరాగ్యమువంటి మిత్రునితో మైత్రి చేసికొని యుంచుకొనును. పైన చెప్పబడిన స్థానములనన్నింటిని దాటుటలో యీ వైరాగ్యమనెడిమిత్రుడుఅతనికిచాలసహాయముచేయును.మరియుయీతడు అతనివెంటనే ఎల్లప్పుడూ వుండును. చూపుపోగలిగినంతవరకు దృష్టి మరియు దీపములయొక్క ఎడబాటు కాకున్నచో (అనగా అంతవరకు దృష్టితోపాటు ప్రకాశముకూడా పోవును ) యిక అభీష్టవస్తువు కాన్పించుటలో ఆలస్యమేల యగును ? సరిగా యిదేవిధమున, జీవునకు ముముక్షుత్వము ప్రాప్తించినప్పుడు అతని అంతఃకరణవృత్తి బ్రహ్మతత్త్వమున లీనమై పోవును; మరియు ఆస్థితివరకు ఆతని వైరాగ్యము నిలచియేయుండు నెడల, యిక అతనికి బ్రహ్మతో కలిగెడి ఏకత్వమెచట భంగము కాగలదు ? తాత్పర్యమేమన, వైరాగ్యముతో కూడియున్న యోగాభ్యాసమును సాధనమొనర్చు భాగ్యవంతుడే ఆత్మప్రాప్తికి పాత్రుడగును. ఇట్టి అభేద్యమగు వైరాగ్యకవచమును ధరించి ఆతడు రాజయోగమనెడి గుర్రముపై నెక్కును, మరియు మార్గమందాతనికి కాన్పించెడి కొద్ది - గొప్పవగు విఘ్నములను తునాతునకలుగ చేసెడి ధ్యానమనెడి అతి పదునైన ఖడ్గము నాతడు తన వివేకమనెడి గుప్పిటలో గట్టిగాపట్టుకొని యుంచుకొనును. ఈ రీతిని ఆడంబరముగా నాతడు సంసార రణ క్షేత్రమున 'చీకటిలో సూర్యుడు వృద్ధిపొందుచూ పోవురీతిని'

ముందుకుసాగుచూ పోవుచుండును, మరియూ అంతమున మోక్షమనెడి విజయ లక్ష్మి ఆతనికంఠమున జయమాల నలంకరించును.

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ॥
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే॥53॥

"ఈ విజయయాత్రిలో ఏదుష్ట శత్రువులు బాధాకరములగునో, మరియు వేటిని ఆవీరుడగు యోధుడు ఓడించునో, వాటిలో ముఖ్యశత్రువు దేహమును గురించిన 'అహంకారము'. ఈ అహంకార మెట్టిదుష్ట శత్రువనిన, యిది మనుష్యుని మరణానంతరమున్నూ విడచిపెట్టదు, మరియూ జన్మించిన పిమ్మటనూ సుఖముగా బ్రతుకనివ్వదు, మరియూ యీ అస్థి పంజరమున జీవుని బంధించి ఆతనిని కష్టపెట్టుచూ వుండును. ఈ అహంకారమునకు ముఖ్యాధారమూ, మరియు ఆశ్రియస్థానమూ యీ దేహమనెడి కోటయే. మరియు, దాని యీకోటపై దాడి వెడలి ఆ వీరయోధుడు దానిని నేలగలుపును. ఆతని రెండవ శత్రువు 'బలము', మరియు ఆతడు దాని ప్రాణములను గూడ గొనును. విషయము లనెడి పేరు వచ్చుటతోడనే యీ శత్రువు నాల్గురెట్లకంటెకూడ ఎక్కువ ఆవేశముతో లేచి నుంచొనును. మరియు, దీనివలన జగత్తునంతనూ కబళించుటకై మృత్యువు పరుగిడి వచ్చుచున్నదా యన్నటుల వుండును. దీనిని విష యములనెడి విషప్రివాహముగానే తలంచవలెను. దోషము లన్నింటిపైన దీని పెత్తనమే యుండును. కాని, ధ్యానమనెడి ఖడ్గపుదెబ్బను అది ఎటుల సహించగలదు? మధురముగను సుఖకరముగను తోచు విషయములనెడి బుర ఖాను కప్పుకొని ఏది మనుష్యునిపై దాడి వెడలునో, ఏది మనుష్యుని భ్రిమింపజేసి సన్మార్గమునకు దూరముగా తీసికొనిపోవునో మరియు ప్రివాసులగు జీవులను అధర్మమనెడి అడవిలోనికి తీసికొనిపోయి నరకమనెడి వ్యాఘ్రిముల నోట పడవేయునో, అట్టిదగు నమ్మించి నాశనమొనర్చు 'దర్ప' మనెడి

శత్రువు, మరియు యీ యోధుడు ఆ దర్పమునుకూడా నాశ మొనర్చును. ఈ రీతిని గొప్పగొప్ప తాపసులుకూడా దేనికి భయపడుచుందురో, క్రోధము వంటి మహాదోషము దేనినుండి జన్మించునో, మరియు దేనిస్వభావము-పూర్తి చేసిన కొలదిని ఖాళీ అయిపోవుచుండుటయూ, మరియు పోషించిన కొలదీ ఉగ్రరూపమును ధరించుటయూనై యున్నదో, ఆ 'కామ' మనెడి శత్రువును కూడా ఆ వీరుడు సర్వనాశన మొనర్చును. ఏలనన, దానిని సర్వనాశన మొనర్చుటతోడనే 'క్రోధ' మనెడి శత్రువుకూడా తనంతతానే నాశన మొందును. చెట్టుమొదలును నరుకుట కొమ్మలను నరికుటతో సమానమేయగు రీతిని, కామమును నాశ మొనర్చుట తోడనే క్రోధముకూడా తనంతతానే నాశ మొందును. ఇందువల్లనే, కామమును చెరపట్టిన చోటునందు క్రోధముయొక్క ఆటలుకూడా తప్పక ఆగిపోవును. అధికారి యైనవాడు తన బరువును యితరుని నెత్తిపై బలాత్కారముగ పెట్టుటకు వెనుకాడని రీతిని, ఏ పరిగ్రహమును స్వీకరించుటవలన ఆతని దురంతములు రానురాను వృద్ధిపొందుచునే యుండునో, ఎవడు నెత్తిపై కెక్కి కూర్చొనునో, మనుష్యునియందనేక విధములగు దుర్గుణములనుజనింపజేయునో, మరియు జీవుని మమత్వమనెడి లాఠీపుచ్చుకొని నడచుటకై వివశునొనర్చునో, ఏపరిగ్రహము శిష్యులు మరియు శాస్త్రాదులనుగురించి ఆడంబరముగవ్రాసి, మఠము ద్రాది డాంబికములను నిలిపి సన్యాసులనుకూడా తనవలలోచిక్కించుకొనునో, ఏదియింటియందుకుటుంబరూపమున వెంటనంటునో, మరియు అరణ్యమున ఏది వన్యరూపమున నెల్లప్పుడు ఎదుట నిలచియుండునో, ఏది నగ్న శరీరములనుకూడా వెంటాడుట విడువదో, అట్టి పరిగ్రహ మనెడి పేరుగల అజేయుడగు శత్రునియొక్క ఆశ్రయస్థానమునుకూడా ఆవీరుడు నాశ మొనర్చును. మరియు సంసారమును జయించితి ననెడి ఆనందమననుభవించును. ఇందువలననే, జ్ఞాన-గుణములగు అమానిత్వాది సమూహములు [illegible] మల్యప్రదేశములందలి రాజులుగా వచ్చి ఆతని ఎదుట హాజరగుదురు.

మరియు అప్పుడు శుద్ధసత్వ్యజ్ఞానముయొక్క యజమానిత్వము నాతని కర్పించి అవి స్వయముగా ఆతని పరివారమునం దొక సామాన్యోద్యోగులుగానై యుండును. అంతట ప్రవృత్తి యనెడి రాజమార్గముగుండా ఆ వీరుని సవారీ బయలుదేరును, అప్పుడు జాగ్రత్స్వప్న సుషుప్తు లనెడి పేరు గల ముగ్గురు స్త్రీలూ అడుగడుగునకు ఆతనిపై సుఖ మనెడి దిగదుడుపును తీయుచూ నడతురు. ఆతనిముందు బ్రహ్మబోధ యనెడి చోపుదారగు వివేకము మాయాప్రసారమగు జనసమూహము నంతను దూరముగ నెట్టుచూ పోవుచుండును. మరియు యోగావస్థ తనచేత హారతి పళ్లెము పట్టుకొని ఆతనికి హారతి నిచ్చుటకై వచ్చును. ఆ సమయమున బుద్ధి - సిద్ధుల సమూహముకూడా వచ్చును. మరియు అవి ఆ వీరుని తమ పూలవానచే స్నానము చేయించును. ఈ విధముగా బ్రహ్మైక్య మనెడి స్వారాజ్యము చాల దగ్గరకు వచ్చుటవలన ఆతనికి త్రిలోకములున్నూ ఆనందముతో నిండియున్నటుల కాన్పించును. అంతట ఓ అర్జునా ! ఏకజాత సమావస్థవలన 'ఫలానావ్యక్తి నాశత్రు(దూ ఫలానావ్యక్తినామిత్రు)డూ' నెడి భావమే ఆతనికి వుండదు. కేవల మింతియే కాదు, ఒకవేళ ఏనిమిత్తమునానైన ఏదేని సమయమున ఆతనినోట 'నా' అనెడిమాట వెడలినప్పటికిని ఆతనికి 'పర' భావము వుండనే వుండదు; ఏలనన ఆతడు కేవలము ఏకస్వరూపు డయ్యెనుగదా ! ఓ అర్జునా, యీవిధముగా ఆతడు కేవలము ఏకభావముతో జగత్తునంతనూ నింపివేయును, మరియు యిందువలన, సంకుచిత వృత్తితో కూడియున్న మమత్వమాతని నెన్నడును స్పర్శించదు. మరియు ఆతడు దానిని పూర్తిగా పరిత్యజించును. ఈ విధముగా యీ వీరపురుషుడు తన శత్రువుల నందరిని నాశమొనర్చి, మరియు మాయా ప్రసారమునంతనూకూడ అంత మొనర్చినప్పుడు, ఆతని యోగరూపియగు గుర్రము తనంతతానే స్థిరమగును. మొదట నాతడు తన శరీరముపై గట్టిగా బిగించి ధరించిన వైరాగ్యమనెడి బరువైన దృఢమైన కవచమునుకూడా ఆతడిప్పుడు కొంచెము సడలించును.

ఆతడు తన ధ్యానరూపియగు శస్త్రమును కూడా ఉంచివేయును. ఆసమయ
మున ఆతని యెదుట ఆత్మతప్ప మరేదియూ వుండదు. మరియు యిందువల్ల
ఆతడు వృత్తులను కూడా విడల్చి వైచును. రసాయనికౌషధము తన
పని నంతను పూర్తిగానూ చక్కగానూ నెరవేర్చును. కాని, రోగి
దానిని పుచ్చుకొనినందువలన, అది తనంతతానే అంతమొందును,
ఇచ్చటకూడా యిదేవిధముగా జరుగును. బసచేసెడి మకామును
చూచి తొందరగా నడచుచున్న పాదములు కూడా ఒక్కమారుగా ఆగి
పోవు విధమున బ్రహ్మ సాన్నిధ్యము కలుగుటవలన ఆతని అభ్యాసవేగము
కూడా తగ్గిపోవును. మహాసాగరమున కలియునప్పుడు నదీవేగము తగ్గిపోవు
రీతిని, లేదా భర్తతో కలసినపిమ్మట కాముకస్త్రీ శాంతినిపొందు విధమున,
లేదా గెలవేయుటతోడనే అరటిచెట్టు పెరుగుదల ఆగిపోవురీతిని, లేదా
ఏదైన గ్రామమునుగాని నగరమునుగాని చేరినపిమ్మట మార్గము అంతమొందు
రీతిని ఆత్మసాక్షాత్కారమును గురించి ప్రత్యక్షానుభవమైనపిమ్మట ఆపురు
షుడు సాధనకు సంబంధించిన ఆయుధముల నన్నింటినికూడ నెమ్మది-నెమ్మ
దిగా తీసి క్రిందపెట్టును. ఓ అర్జునా, ఆతనికి బ్రహ్మతో ఐక్యత సిద్ధించును
మరియు యిందువలన, క్రమక్రమముగా ఆతని సాధనోపాయములు కూడా
అంతము నొందసాగును. ఓ భాగ్యశాలివగు అర్జునా, ఆ సమయమున ఆ
పురుషుని అవయవములందు వైరాగ్యసంస్కారమును పూర్తిచేసెడి గోధూళి
సమయము లేదా జ్ఞానాభ్యాసపు అంతము, లేదా యోగఫలము పరిపాకావస్థ
యనెడి శాంతి పూర్తిగా సంచరించును, మరియు అప్పుడాపురుషుడు బ్రహ్మ
యగుటకు పాత్రుడగును. పౌర్ణమినాటిచంద్రకళకంటె చతుర్దశినాటి చంద్ర
కళ ఎంతతక్కువగానుండునో, లేదాపదహారువన్నె బంగారుకంటె పదిహేను
వన్నెబంగారు ఎంత తేలికగానూ మరియు హీనముగానూ వుండునో, లేదా
సముద్రమునఎంతనదీజలము ప్రవేశించునో కేవలమంత నీరేనదియొక్క చంచల
రూపమునుచూపించి మిగిలిననీరు సముద్రముయొక్క శాంతస్వరూపమును

ప్రకటించురీతినితక్కువమరియు ఎక్కువలు 'బ్రహ్మ' మరియు "బ్రహ్మస్వరూపుడగు" సిద్ధునియందు ఉండును. మరియు శాంతి గుణముచే అతడు అతిశీఘ్ర సమయమునందే కేవలము బ్రహ్మగానేయగును. కాని, యీవిధముగా ప్రత్యక్ష బ్రహ్మగా కాకపోయినప్పటికిని బ్రహ్మత్వమును గురించిన ఏ అనుభవము పురుషునకు కలుగునో, ఆ అనుభవముచే 'బ్రహ్మస్వరూపుడు అగుటకు కావలసిన పాత్రత' యందురు.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥౫౪॥

"అంతట ఓ అర్జునా ! పురుషునందీ బ్రహ్మస్వరూపుడు కాదగిన యీ పాత్రత వచ్చినప్పుడు ఆ పురుషుడు బ్రహ్మబోధవలన కలిగెడి చిత్త ప్రసన్నత యనెడి ఆసనముపై ప్రతిష్ఠితు డగును. అన్నము ఉడుకుటకు కారణమైన ఉష్ణత్వము ఉడికిన అన్నములోనుండి వెడలిపోయినప్పుడు ఆ అన్నము తినుటకు తృప్తికరముగా నుండును. వర్షఋతువునందు వచ్చెడి వరదబాధ లన్నింటిని తొలగించుకొని శరదృతువునందు నది శాంతురాలగును. లేదా పాట ముగిసినప్పుడు సంగీతమునందలి మృదంగము మొదలుగాగల ఉపాంగములు కూడా తమంతతామే ఆగిపోవును. సరిగా యిదేవిధమున ఆత్మబోధను పొందుటకై చేయబడుచుండెడి ప్రయత్నము లన్నియూ, ఆత్మబోధ యగుటతోడనే అంతమొందును. ఇట్టి శాంతము మరియు ప్రసన్నమానగు స్థితిని 'ఆత్మ-బోధ-ప్రశస్తి' యందురు. ఇక ఆ పురుషునకు యీ ప్రసన్నస్థితియే ప్రాప్తించును. ఆ సమయమున, బ్రహ్మసామ్యము భర్తీయైపోయి యుండును; కావున, ఆ సమయమున ఆత డేవస్తువునైన కోల్పోయినప్పటికిని ఆతని కేమాత్రమున్నూ దుఃఖము కలుగదు; మరియు, ఆతని కేదైనా వస్తువు లభింపనున్నప్పటికిని ఆతడు దానికై ప్రయత్నము కూడా చేయడు. ఈ రెంటిలో ఏ ఒక్కటియు ఆతనిపట్ల కాజాలదు.

సూర్యుడు ఉదయించగానే నక్షత్రములన్నియు తమ ప్రతిభను కోల్పోవురీతిని ఆత్మస్వరూపానుభవ సంచార మగుటతోడనే, ఓ అర్జునా, ఆపురుషుడెటుచూచిన అటువైపు అతనికి యీభేద - భావాత్మక భూతసృష్టి అంతమొందినట్టులేయగును. ధూళిపైవ్రాయబడిన అక్షరములు కేవలము చేతితోతుడచివైచి నాశమొనర్చుటకు వీలైనరీతిని ఆతని దృష్టి పడగానే భేదభావమంతయూ నాశమైపోవును. ఆపిమ్మట, జాగ్రత్స్వప్నములనెడి ద్వివిధావస్థలందును జనించెడి విపరీతము మరియు అసత్యములగు జ్ఞానములు రెండున్నూ అవ్యక్తమున అనగా మూలాజ్ఞానమున లుప్తమైపోవును. మరియు అంతట ఆ మూలాజ్ఞానముకూడా బ్రహ్మబోధ వృద్ధియగుట వలన తగ్గుచూ తగ్గుచూ అంతమున పూర్ణబోధలో యిమిడిపోవును. భోజనము చేయునప్పుడు ప్రతిముద్దతోనూ ఆకలి కొద్దికొద్దిగా తగ్గిపోవుచూ, పూర్తిగా తృప్తికలిగినపిమ్మట ఆకలియంతయూ నశించిపోవురీతిని, లేదా మానవుడు బాటను పోవుచున్నకొలదినీ బాటయొక్కదూరము తగ్గిపోవుచూ వుండి, చివరకు ఉద్దేశించిన ప్రదేశమునకు చేరినపిమ్మట బాట పూర్తిగా అంతమొందు రీతిని, లేదా మెలకువ పెరుగుచున్నకొలదిని నిద్ర నశించిపోవుచూ పూర్తిగా మేల్కొనిన పిమ్మట నిద్రపూర్తిగా లేకుండా పోవురీతిని, లేదా పౌర్ణమినాడు చంద్రకళలు పూర్తియైపోవుటవలన అతని బింబముయొక్క వృద్ధి అంతమొంది, మరియు ఆనాటినుండి శుక్లపక్షము కూడా అంతమొందురీతిని, తెలపికొనవలసిన విషయము లన్నింటియొక్క అస్తిత్వమును అంతమొందించి, తెలసికొనువాడు తనతో జ్ఞానమును గైకొని నాస్వరూపమున కలపి సమరసత్వమును చెందినప్పుడే అజ్ఞానము పూర్తిగా అంతమొందును. ఆపైన, కల్పాంతసమయమున నదులు మరియు సముద్రాదు లన్నింటియొక్క ఆకారమూ నశించి, మరియు బ్రహ్మాండమంతయూ సమానరూపమున జలమయమై పోవురీతిని, లేదా ఘటము మరియు మఠము మొదలగుగాగల ఆకారములు నాశనమైపోయిన పిమ్మట అంతటను సమాన

రూపమున భేదహీనమగు ఆకాశము మిగిలియుండురీతిని, లేదా కట్టె కాలి పోయిన తరువాత కేవలము అగ్ని మిగిలియుండు రీతిని, లేదా కంసాలివాని మూసలోపడి నగలయొక్క ఆకారములన్నియూ నాశనమైన పిమ్మట, ఆ బంగారమునకు నామ-రూపాదులతో కూడియున్న భేదభావము ప్రయుక్తము కాజాలని విధమున, లేదా మేల్కొనిన పిదప. స్వప్నము లేనప్పుడు కేవలము మనమే మిగిలియుండువిధమున, అతడు నన్ను తప్ప మరి దేనినీ చూడడు-మరియు గుర్తించడు. అంతేగాదు. ఆతడు స్వయముగా తన్నుతాను కూడా చూడడు మరియు గుర్తించడు. ఈవిధముగా ఆతనివలన నాచతుర్థభక్తి యొనర్పబడును. ఆర్తులు (అనగా, దుఃఖములచే పీడింపబడువారు) జిజ్ఞాసువులు (అనగా, జ్ఞానమును పొందవలెననెడి కోరిక గలిగినవారు) మరియు అర్థార్థులు (అనగా, దర్వ్యేచ్ఛగలవారు) నగు భక్తులు ఏ మార్గములగుండా నాభక్తి యొనర్తురో, ఆ మూడుమార్గములూ దీనికి భిన్నమైనవి.మరియు యిందువలననే, నేనీ జ్ఞాన భక్తిని నాల్గవభక్తియని యనుచున్నాను. అటులగాక, వాస్తవిక దృష్టితో చూచినచో యీ భక్తి మూడవదీకాదు, నాల్గవదీకాదు, మొదటిదీకాదు, మరియు చివరిదీకాదు. ఈభక్తి వాస్తవమునకు నాస్వాభావికమగు అవస్థయే. ఓ అర్జునా! ఏది నా స్వాభావికమగు ప్రకాశమో, ఏది ఆ అజ్ఞానమనెడి అంధకారమును నాశమొనర్చునో, ఏది లోకుల మనస్సునందు నన్ను గురించి గలదో, దేని సహాయముచే లోకులకు సహజముగనే నా వాస్తవిక స్వరూపము కాన్పించసాగునో, ఏది లోకులనందరిని అన్నింటి భజనమునందును ప్రవృత్త- మొనర్చి వారికి పూర్తియైన మరియు వాస్తవికమైన జ్ఞానమును కలుగజేయునో, మరియు ఏ ప్రకాశమునందు ఎవడెచ్చట కూర్చొని చూచిన ఆతడచ్చటనే శ్రద్ధతో కూర్చొనియుండి సమస్తమును చూచునట్టి చమత్కారము గలదో, ఏ ప్రకాశ సహాయముచే విశ్వభావముగాని లేదా అభావముగాని 'స్వప్నము కాన్పించుటగాని కాన్పించకపోవుటగాని చూచువానియొక్క అస్తిత్వముపై అవలంబితమై

యుండు విధముగ, భాసమాన మగునో, అట్టి ప్రకాశమునే భక్తి యందురు. ఇందువల్లనే, ఆర్తులైన (పీడితులు) వారిలో యీ భక్తి ఆర్తి (పీడా) రూపమున నివసించును, మరియు ఆ పీడా నివారణమునకై ఏది కావలసి యుండునో, దానికి అనురూపముగనే ఆ భక్తుడు నా కల్పన మొనర్చును. (అనగా, ఆతని పీడానివారణమయ్యెడి అపేక్షితవస్తువుగా ఆతడునన్ను తలంచును). ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా, జిజ్ఞాసువు, అనగా జ్ఞానేచ్ఛ గల పురుషునియందు దీభక్తి జిజ్ఞాస, అనగా జ్ఞానేచ్ఛారూపమున నివసించును; మరియు యీభక్తియే ఆతనికి నా దర్శన రూపమున కలిగించును. ఏలనన అతడు నన్నే తన జిజ్ఞాసా విషయముగ తలంచును. నేనాతనికై జిజ్ఞాసావిషయముగ నగుదును. అర్థియగు భక్తునియందు దీ భక్తి అర్థేచ్ఛరూపమును ధరించియుండును; మరియు, ఓఅర్జునా, ఆతని ఆభక్తి నాకే అర్థరూపమునిచ్చును. అందుచే ఆతడు నాకు 'అర్థ' మని పేరుపెట్టును. ఈ విధముననే, అజ్ఞానము నాశ్రయించియుండిచేయబడు నాభక్తి ద్రష్టకు అనగా చూచువానికి 'నన్నేదృశ్యము (చూడవలసిన విషయము)గా తలచునట్టి' శక్తినిచ్చును. ఈవిధముగా ముఖమును ముఖమే చూచుచున్నదనుటలో ఏమాత్రము సంశయములేదు. కాని, దానియందు జనించెడి భేద భావమునకు కారణము అద్దమే యగును. చూచుటకు ఒక్క చంద్రుడే కాన్పించినచో, అది సమంజసమే. కాని, ఒకటికి బదులు యిద్దరు చంద్రులు కాన్పించుట, తిమిర మనెడి నేత్రవ్యాధివలన సంభవించుచున్నది, మరియు ఆరెండవ చంద్రుడు కృత్రిమమైనవాడు. సరిగాయిదేవిధమున, అంతటను భక్తులందరూ యీభక్తి వలన నన్నేగ్రహింతురు. కాని, నాయందు వారు వ్యర్థమగు దృశ్యత్వకల్పన మొనర్తురు. దీనికి కేవలము అజ్ఞానమే కారణము. ఆ అజ్ఞానము తొలగిపోయి నప్పుడు ద్రష్టయొక్క ద్రష్టత్వము 'బింబమునందే ప్రతిబింబము లీనమైపోవు రీతిని' మదూపమును పొందును. బంగారమున కల్తీ యున్నప్పుడు కూడా బంగారమున స్వర్ణత్వము వుండియే యుండును కాని, దానియందలి కల్తీని

తీసివేసినప్పుడు కేవలము శుద్ధబంగారమే మిగిలియుండు రీతిని దృష్టకు కేవలము నేనే వుండియుందును. పౌర్ణమికి పూర్వము చంద్రుడు సర్వాంగములు కలవాడై యుండడా? తప్పక వుండును. కాని వానియందు కేవలము పౌర్ణమి దినముననే పూర్ణత్వము వచ్చును. ఇదేవిధమున, జ్ఞాన-మార్గములచే కూడా కేవలము 'నేనే' కాన్పింతును. కాని కేవలము భిన్నభిన్న దిశల నుండి మాత్రము కాన్పింతును. మరియు, యీ విధముగా కాన్పించిన పిమ్మట 'నాకు' 'నేనే' ప్రాప్తింతును. మరియు యిందువల్లనే దృష్టయొక్క దృష్టత్వము పూర్తిగా నాశ మెుందును. ఓ అర్జునా! ఇందువల్లనే, నా యీ నాల్గవ భక్తి దృశ్యమార్గమందలి అవలి ఒడ్డునకు సంబంధించినదని నేను చెప్పితిని.

భక్త్యా మా మభిజానాతి యావా న్యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥౫౫॥

"ఈ జ్ఞానభక్తిద్వారా నాతో కలసి స్వాభావిక రూపమున సమరసత్వమును పొందెడి భక్తుడు, భక్తుడు కాదు, ఆతడు 'నేనే' నని తెలసికొనుము. ఏలనన, ఓ అర్జునా! (ఏడవ అధ్యాయములో) నీకు జ్ఞాని యగు పురుషుడు నా ఆత్మయే యగునని నేను చెయ్యెత్తి గంభీరవాక్కుతో చెప్పియున్నాను. ఓ అర్జునా! నే నీ భక్తినే కల్పారంభమున భాగవత మిషతో బ్రహ్మకు బోధించియుంటిని. జ్ఞానులు దీనిని 'స్వ-సంవిత్తి' యందురు; శైవులు దీనిని 'శక్తి' యనెడి పేర పిలతురు; మరియు నేను దీనిని 'నాపరమ భక్తి' యందును. కర్మయోగులు నాతో కలసి ఏకమైపోయినప్పుడు వారికి దీని ఫలప్రాప్తి యగును. మరియు అప్పుడంతట, విశ్వమంతయు నాయోగముతో ఓతప్రోతమగును. ఆయవస్థలో, వివేకముతోపాటు వైరాగ్యము, మోక్షముతోపాటు బంధము మరియు నివృత్తితోపాటు వృత్తులుకూడా పూర్తిగా నాశమెుందును. సమ

స్తమూ యీ తీరమునకే వచ్చివేయును. మరియూ యిందువలన అబద్ధమున ఏమి
యూ మిగిలియుండదు. పృథివి, జలము, తేజము మరియు వాయువులనెడి
నాల్గు భూతములనూ మ్రింగివైచి కేవల మాకాశమే మిగిలియుండురీతిని,
సాధ్యము మరియు సాధనములనెడి సరిహద్దుకు ఆవలియొద్దున నుండెడి నిర్మ
లము మరియు నిర్దోషతత్త్వమూ యగు నాయొక్క ఆతత్త్వముతోనే కలసి,
మరియు ఏకిరూపుడై ఆపురుషుడు ఆత్మానందము ననుభవించును. గంగ సము
ద్రమున ప్రవేశించి, దానితోకలసి ప్రకాశించు విధమున, ఆత్మానందోప
భోగస్వరూపముకూడా అదేవిధముగా నుండునని నీవు జ్ఞప్తియందుంచు
కొనుము. రెండుఅద్దములనుచక్కగాతుడచి ఒకదానియెదుట మరొకటివుంచిన
పుడు వాటి రూపములలో ఒక దానికిని మరియొక దానికిని సుందరమగు
ఏకత్వము వుండు రీతిని, ద్రష్టకూడా నాలో కలసి, నాతో సమ
రసుడై ఆత్మానందోపభోగము నొనర్చును. ఎదుటనున్న అద్ద
మును తొలగించినప్పుడు, దానిలో కాన్పించెడి ముఖాభాసము లేకపోయి
నప్పుడు, ద్రష్ట కేవలము తనలోతానే సుఖముగా నుండురీతిని, లేదా
మేల్కొనిన పిమ్మట స్వప్నము నశించినప్పుడు ఆ జాగ్రదవస్థలో స్వయ
ముగా తన ఒంటరితనమును చూచి ఏపురుషుడైనను యితరుల సాంగత్యము
లేకుండానే తన ఆ ఒంటరితనమునే ఉపభోగించురీతిని, ఆభక్తుడు కూడా
ఆత్మానందము నుపభోగించును. ఒకానొక వ్యక్తి ఏదైన వస్తువుతో ఏక
రూపమును పొందినప్పుడు అతడొనర్చిన ఆవస్తూపభోగము సంభవించనే
సంభవించదని కొందరందురు. ఇట్టి వారిని నేనడుగు ప్రశ్న ఒక్కటియే.
శబ్దముచే శబ్దోచ్చారణ మెటుల జరుగును? అని. ఈ విధముగా చెప్పెడివారి
దేశమున దీపము వెలుగుతో సూర్యుని చూడవలసి వచ్చుచున్నదా? లేదా
ఆకాశముక్రింద ముఖరమును పాతవలసియున్నదా? లేదా అంధకార మెన్న
డైన సూర్యుని కౌగలించుకొనగలదా? ఆకాశమే లేనప్పుడిక ఆకాశమును
[illegible]చిన జ్ఞానమెటుల కలుగును? గురివిందగింజలమాలను ధరించినంత మాత్ర

మున అదియొక నగయని ఎవ్వడైన అభిమానపడవచ్చునా? ఇదేరీతిని 'నేను' అనునట్టిదే లేనప్పుడు, ఆతని దృష్టిలో 'నేను' ఎక్కడనుంచి వచ్చును? ఇట్టి స్థితిలో ఆతడు దీనిని ఉపభోగించునా, ఉపభోగించడా-యను సంగతినిగురించి చెప్పనక్కరయే లేదు. ఇందువల్లనే, ఆ కర్మయోగి 'నేను' అయితే 'నేను' (నన్ను)ను ఉపభోగించును, మరియు ఆతడు తరుణ పురుషుడు తారుణ్యాతను ఉపభోగించు రీతిని ఆతడుకూడ దీనిని ఉపభోగించును. తరంగములు పూర్తిగా జలమును చుంబించురీతిని, లేదా ప్రభ సూర్యబింబమునందంతటను ప్రకాశించురీతిని, లేదా ఆకాశతత్త్వము గగనమునందంతటను ఓతప్రోతమై నిండి యుండురీతిని, ఆ కర్మయోగికూడా నా స్వరూపమును చూచి, ఏ విధమగు క్రియాచరణమునుచేయకుండానే నన్నుపభోగించును. అలంకారములు స్వాభావికరూపమున స్వర్ణము నుపభోగించురీతిని, లేదా వెన్నెల ఏ విధమగు పనిని చేయకుండానే చంద్రబింబమున విలాస మొనర్చు రీతిని, లేదా సుగంధము చందనమునం దేమియూ చేయకుండానే ఏర్పడి యుండురీతిని, అద్వైతమునం దే క్రియకూ ఏ స్థానమూ వుండదు. అయినప్పటికిని, భక్తికి మాత్రము దానియందు తా వుండును. కాని, యీ విషయము ప్రత్యక్షానుభవమువలననే బోధపడును. కేవలము శబ్దములచే దీనిని వర్ణించుటకు వలనుపడదు. అంత, యీ విధముగ కేవల - స్వరూపుడగు పురుషుడు తన ప్రాచీన సంస్కారమువలన ఏదైన మాట్లాడినప్పుడు ఆతడు ఏది మాట్లాడునో అదియే నా భక్తి యగుచు; నేనప్పుడు వెంటనే దానికి జవాబిత్తును. మరియు, ఆ మాట్లాడువాడు కూడా నేనే యగుదును, మాట్లాడువానికి కేవలము తనతో తనకే సంయోగము కలిగినప్పుడాతనిచే ఏమియూ మాట్లాడబడజాలదు. మరియు, యిందువల్లనే, ఆ యవస్థలో నా ఉత్తమ భోజనము కేవలము మౌనముగా నుండియే ఒనర్పబడును. ఇందుమూలముననే, ఆ భక్తుడు మాట్లాడ నారంభించినప్పుడు నేనే ఆతని ద్వారా మాట్లాడుచున్నానన్నటుల వుండును; మరియు యిందుచే, మౌనము

ఫలించును, మరియు ఆనూనముతోనే ఆతడు వాస్తవముగ నన్ను స్తుతించును. ఈవిధముగనే, ఓ అర్జునా, ఆతడు తనబుద్ధి లేదా దృష్టితో దేనినిచూచునో, ఆచూచుటలో దృశ్యవస్తువొకవైపుకు తొలగిపోవును. మరియు ఆచూచుట ఆతనికి స్వయముగ ఆతనిస్వరూపమునే చూపించును. అద్దమునందు చూచు వానికి తాను అద్దములోచూడక పూర్వమువున్న తన ఆస్వరూపమే కాన్పించు రీతిని, ఆభక్తుని చూచుటకూడా ఆతనికి స్వయముగ ఆతని దర్శనమునే కలిగించును. ఈ విధముగా దృశ్యము ఎగిరిపోయి, ద్రిష్టకు ద్రిష్టరూపమునవే దాని ననుభవించినప్పుడు ద్రిష్టతప్ప మరేదియూ మిగిలియుండదు. మరియు యిందువల్లనే ఆతని ద్రిష్టత్వముకూడా లోపించిపోవును. స్వప్నమున కాన్పించెడి వల్లభుని కౌగలించుకొనుటకై ఏస్త్రీయైన ముందుకువెళ్ళి అంతలోనే మేల్కొనినప్పుడామెకు ఆతడు తన వల్లభుడూకాడు. తానాతని భార్యనూ కానని తెలసికొని, ఆమె శాంతముగనుండును. లేదా, రెండుపుల్లలను ఒక దానితో మరొకదానిని రాపిడి పెట్టుచో, వాటిమధ్య అగ్నిజనించును. మరియు, అంతట నా రెండుపుల్లలూ వుండకపోగా, ఆరెండునూకలసి అగ్ని రూపమునే దాల్చును. లేదా నీటియందు పడెడి సూర్యుని ప్రతిబింబమును పట్టుకొనుటకై స్వయముగా సూర్యుడే ముందుకు వచ్చినప్పటికిని ఆతని ప్రతిబింబ మచ్చట నుండదు. మరియు పైనుంచి స్వయముగా ఆతని బింబత్వముకూడా లోపించును. ఇదే విధమున భక్తుడు మద్రూపుడై దృశ్యమునుకూడా తనలోనే లీన మొనర్చుకొన్నప్పుడు ఆతని వాస్తవిక ద్రిష్టత్వముతోపాటు దృశ్యముకూడా లోపించి పోవును. సూర్యుడు అంధకారమును ప్రకాశింపజేసినప్పుడు ప్రకాశింపజేయుటకై అంధకారము మిగిలియుండని రీతిని, ఒకమారు ద్రిష్టకు నా స్వరూపము లభించినప్పుడు దృశ్యమున దృశ్యత్వముకూడా మిగిలియుండదు. అంతట, ఇట్టి అవస్థలో 'దృశ్యము కనిపించుటయు మరియూ కనిపించకపోవుటయూ [illegible]డా స్థితినే వాస్తవికదర్శన మనవచ్చును. ఓ కిరీటీ! అంతట, ఏ వస్తు

వైనా ఆతనికి ఎదురుపడనిమ్ము, మరియు ఏ వస్తువైనా ఆతనికి కనపడనిమ్ము ప్రతిసమయమునను ఆతనికి ఆదర్శముతే యగుచుండును. మరియు ఆతడప్పుడు ద్రష్ట మరియు దృశ్యములు రెంటికినీ ఆవల నుండెడి దృష్టిని ఉపభోగించును. మరియు ఆకాశ మెల్లప్పుడు ఆకాశముతోనే క్రిక్కిరిసి నిండియుండుటవలన ఎన్నడును తొణకుటగాని ఒలుకుటగాని వుండని విధమున, ఆత్మ స్వరూపమున స్వయముగా ప్రవేశించుట వలన ఆతడు కూడా ఎన్నడును తన స్థానమునుంచి విచలితుడు కాడు. కల్పాంతమున అంతటను జలము మాత్రమే వుండును, మరియు జలమంతయు ఒక్కచోట ప్రోగైయున్నదా యన్నటుల యుండును. మరియు యిందువల్లనే, దానియందు ప్రవాహము వుండనే వుండజాలదు. ఇదేవిధముగా, ఆత్మలో ఆత్మయే నిండి యున్నప్పుడు దానిలో స్తబ్ధత్వము వచ్చును. పాదములు ఎంత దూరమువరకు పోవునో, అంత దూరమునకు యింకనూ ముందు ఆతడెటుల పోగలుగును ? అగ్ని స్వయముగా తనను తానెటుల దగ్ధముచేసి కొనగలదు ? జలము స్వయముగ తాను స్నానముచేయుట కెటుల ఉపయోగము కాగలదు ? కావుననే, ఆభక్తుడుకూడా పూర్తిగా మద్రూపుడైనప్పుడు ఆతని రాక - పోకలు మొదలగు వ్యవహారము లన్నియూ ఆగిపోవును, మరియు యీ వ్యాపారములన్నియూ ఆగిపోవుటయే నా అద్వైతత్వపు యాత్రయగును. నీటిపైన తరంగము లెంతదూరమువరకైన వృద్ధిపొంది పోనిమ్ము, అయినప్పటికిని, అది భూమిపైన మజిలీ పూర్తిచేసినదని అంగీకరించుటకు వీలు లేదుగదా ! దానిలో పాతచోటును వదలిపెట్టునట్టి దీజలమే, మరియు నూతనస్థానము నాక్రమించునట్టి దీజలమే యగును. గతి (గమనము)నిచ్చునట్టిది కూడా జలమేయగును, మరియు గతిని (గమనము) పొందెడిది కూడా జలమేయగును. ఓ అర్జునా, జలప్రవాహమెంత మిక్కుటముగా వచ్చినప్పటికిని, దాని జలత్వ మెల్లప్పుడు అబాధితముగనే వుండును. మరియు యిందువల్లనే తరంగముల ఏకత్వముకూడా ఎన్నడును నాశమొందదు. ఈ

విషయముగనే 'నేను' అనునదెంత మిక్కుటముగ విస్తరించినప్పటికిని, అదియంతయూ నాయందే యిమిడిపోవు చుండును. మరియు యీ రాక - పోకల ఎగుమతి-దిగుమతి) వలన ఆతడు నాయాత్రికుడే యగును. మరియు ఆతడు. శరీరముయొక్క స్వాభావిక ధర్మము ననుసరించి ఏ పనినైన చేయసాగుచో ఆకర్మ నిమిత్తము కూడా నేనే ఆతనికి లభింతును. ఇట్టిస్థితిలో, ఓఅర్జునా కర్మ మరియు కర్తలనెడి రెండువేళ్లున్నూ లోపించును. మరియు నన్ను ఆత్మ స్వరూపమున చూచి ఆతడు స్వయముగనే 'నేను' అయిపోవును. అద్దమే అద్దమును చూచుచో దానిని ఎవడునూ 'చూచుట' యనియనడు. బంగారముపై బంగారపుపూత ఎన్నడును కుదురదు. దీపముతో ఎన్నడును దీపమునకు వెలుతురు చూపుట సంభవించనేరదు. ఈ విధముగనే, కర్మనగు 'నేను', ఆ కర్మనే 'నేను' చేయుచో, ఆ స్థితిలో అది ఏరీతిగానూ కర్మగా కానే కాదు. కర్మలు చేయబడుచున్నవైనప్పటికిని, ఆతడు కర్మ చేయుచున్నాడని చెప్పబడనప్పుడు, ఆతడొనర్చు కర్మ చేయుని దానితో సమానమే యగును. సమస్తకర్మలం నదూర్పిపమే యగుటవలన దానిఫలము 'ఏమియూ చేయకుండుట' యేయగును. మరియు దీనినే, నా నిజమైన భక్తి యుందురు. కావున, ఓ అర్జునా, కర్మ చేయుటయనెడి మార్గమునుండి కూడా కర్మలు చేయకుండుటే ఘటిల్లుచున్నది. మరియు యీ మహాపూజతోనే ఆతడు నన్నర్చించును. తాత్పర్యమేమన, ఆతడేది మాట్లాడిన అదియే నాస్తోత్రమగును. ఆతడేది చూచిన అదియే నాదర్శన మగును. ఆతడేమి నడచిన అదియే నాఅద్వైతత్వప్రగమనమగును. ఆతడేమిచేసిన అదియంతయు నా పూజయే యగును; ఆతడుతన మనస్సున ఏవిషయమునుగురించి యోచించిన అదినాజపమే యగును; మరియు ఓఅర్జునా ఆతడుస్వస్థుడైయుండుటే నాసమాధి యగును. గాజుల కెల్లప్పుడూ బంగారముయొక్క సాంగత్యమునందే వుండవలసివచ్చురీతిని ఆతడు భక్తియోగముచే నిరంతర అద్వైతరూపమున నాతోనూ మరియు నాయందునూ వుండును. నీటియందు తరంగములు, కర్పూరమునందు సుగంధము మరియు

రత్నములందు కాంతియూ ద్వైతభావ మేమియూ లేకుండా వుండును. నూలుదారములతో వస్త్రము, మరియు మట్టితో కుండయు ఎల్లప్పుడును ఒక్కటిగా కలసియుండును. సరిగా యిదే విధమున, ఆ భక్తుడుకూడా నాతో సమరసుడై యుండును. నా యీ అనన్యభక్తివలన ఆతడు దృశ్య పదార్థములయందు ఆత్మభావముతో ద్రష్టగా నన్నే చూచును. జాగ్రిత్స్వప్న సుషుప్తులనెడి త్రివిధావస్థలవలన ఉపాధి (క్షేత్రము) మరియు ఉపాధియుక్తుడు (క్షేత్రజ్ఞుడు) వలన భావము లేదా అభావరూపమున కనిపించెడి యీ విశ్వమును గురించి, ఓ సువిజ్ఞుడవగు అర్జునా! ఆతనికి "యీ విశ్వమంతయూ ద్రష్టనగు నేనుగానే' కాన్పించును. మరియు యీ విధముగు బోధతో కూడియున్న క్షేత్రమున ఆ ఆత్మానుభవమనెడి బొమ్మ నాట్యమాడసాగును. ఇది త్రాడేనని తెలిసినప్పుడు, దానినిగురించి గల సర్పాభాసము త్రాడేనని నిశ్చయమగును. నగలను కరగబెట్టినప్పుడు, దానిలో నామమాత్రమునకైన బంగారమునకు భిన్నమగు అలంకారత్వమేదియూ లేదని నిశ్చయమగును. తరంగములు వాస్తవమునకు జలముతప్ప మరేదియూ కాదని మనుష్యుడు తెలిసికొనినప్పుడు ఆతడాతరంగాకారము నెన్నడును వాస్తవముగా తలంచడు. మేల్కొనిన పిమ్మట స్వప్నవికారములను గురించిగణించువాడు తనకు తప్పమరిదేనినీ చూడజాలడు. ఇదేవిధముగా, ఆ పురుషుడుకూడా భావరూపమునగాని అభావరూపమునగాని జ్ఞేయరూపమున తోచెడి సమస్త పదార్థములను గురించినీ, 'సమస్తమున్నూ జ్ఞాతనగు నేనే' నని తెలిసికొనును. మరియు యీ అనుభవమునే పొంది ఆతడు వాటినన్నింటిని ఉపభోగించును. 'నేను అజన్ముడను. అమరుడను, అక్షయుడను' అక్షరుడను, అపూర్వము మరియు అపారమగు ఆనందమును' అని ఆతడెరుంగును. నేను అచలుడను మరియు అచ్యుతుడను, అనంతుడను మరియు అద్వయుడను, ఆద్యుడను మరియు నిరాకారుడను మరియు సాకారుడను కూడాను. నేను సత్త్వము ముందు అణగియుండెడి లేక ఈశ్యుడను కూడాను,

మరియు సత్త్వమును సంచాలన మొనర్చెడివాడను అనగా ఈశ్వరుడను కూడాను. అనాది, అవినాశి, నిర్భయుడు, ఆధారుడు మరియు ఆధారముపై ఆగియుండెడి ఆధేయవస్తువును కూడా నేనే అయియున్నాను. నేను సత్త్వధారిని, నిత్యుడను, సిద్ధుడను, స్వయంభువును, నిరంతర సర్వ-రూపుడను, సర్వాంతర్యామిని, మరియు అన్నింటికిని పరుడను. నేను నూతనుడను మరియు పురాతనుడను కూడాను. శూన్యుడను మరియు సంపూర్ణుడను కూడాను. పెద్ద లేదా చిన్నదియు నగు నేది గలదో అదంతయూ నేనే అయియున్నాను. నేను కర్మహీనుడను, ద్వైతహీనుడను, సంగహీనుడను, మరియు శోకహీనుడనై యున్నాను. వ్యాప్తమయ్యెడి వాడను మరియు వ్యాప్త మొనర్చెడివాడను నగు పురుషోత్తముడను కూడా నేనే అయియున్నాను. నాయందు శబ్దము, కర్ణము, రూపము మరియు గోత్రాదులేవియూ లేవు. నేను సర్వత్రా సమానుడను, మరియు స్వయం సిద్ధుడను అయియున్నాను. నేను పరబ్రహ్మను. ఈ విధమగు ఆత్మీయతతో కూడియున్న ఏకత్వముద్వారా అతడు నన్ను అద్వయభక్తి సహాయముచే వాస్తవముగ నెరుంగును; మరియు దానితోపాటు అతడు 'యీ ఆత్మబోధానుభవమగు జ్ఞానముకూడా నేనేనని' కూడా ఎరుంగును. మేల్కొనినపిమ్మట స్వప్నాభాస వుండని రీతిని, మరియు కేవలము స్వప్నమును చూచిన పురుషుడు మాత్రమే వుండునన్న విషయ మాస్వప్నమును గాంచినవానికి దానంతట అదే తెలియురీతిని, లేదా సూర్యుడు ప్రకటమగునప్పుడు తనకుతానే ప్రకటమొనర్చుకొనువాడుకూడా అయినటుల, మరియు ప్రకట మయ్యెడివాడూ మరియు ప్రకటమొనర్చువాడూ యిద్దరునూ అభిన్నులన్న విషయమునుకూడా అతడే ప్రకటమొనర్చు రీతిని, జ్ఞానవిషయము లోపించిపోవుటవలన కేవలమూ జ్ఞాతయే మిగిలియుండును; మరియు యీ సంగతి ఎవనికి బోధపడునో, అతడు కూడా స్వయముగా అదియే యగును. ఓ అర్జునా, తన అద్వైతతత్త్వమును గురించి తెలిసికొనెడి జ్ఞాన-శక్తిని గురించికూడా 'ఆ శక్తికూడా సర్వసమర్థుడైన

'నేనే నని' ఆతనికిబోధపడును.ఇటుపిమ్మట 'ద్వైతము మరియు అద్వైతములు
రెంటికిని అతీతుడైయుండెడి ఏకమేవాద్వితీయఆత్మకూడా నేనేననీ యీవిషయ
మునం దేమాత్రము సందేహము లేదనిన్నికూడా' ఆతడు తెలసికొనును;
మరియు ఆతనికి యీజ్ఞానము ప్రత్యక్షానుభవమైనప్పుడు, నిప్పుమంట లేచిన
ప్పుడు దాని ఒంటరితనమును గురించి ఏర్పడిన ప్రతీతి, అది నాశమైనప్పుడు
దాని స్వరూప మెటుల వుండునో చెప్పుటకు వీలుకాని రీతిని, లేదా
ఉప్పు జల స్వరూపమును దాల్చినపిమ్మట ఆ ఉప్పుయొక్క ఉప్పదనము
ఆ నీటిలో నిలచియుండినప్పటికిని, ఆ ఉప్పదనము లేకపోయినప్పుడాఉప్పు
యొక్క అస్తిత్వమే లేకుండా పోవురీతిని, 'నేను ఆ పరబ్రహ్మనే' అని
ప్రతీతమై స్వానందానుభవ శాంతరసములో విలీనుడైనప్పుడు ఆతడు నాలో
ప్రవేశించును. ఆ స్థితిలో, 'ఆతడు' అనుటకుకూడా ఎచ్చటను తావుండదు.
మరియు 'నేను' అనుటకుకూడా ఏ స్థానమూ వుండదు. ఈవిధముగా ఆతని
'నేను' మరియు 'ఆతడు' అనెడిభావము నాశమైపోవును మరియు ఆతడు
నాస్వరూపమున కలసిపోవును. కర్పూరము వెలుగసాగినపుడు దానిని
అగ్నియని చెప్పదగును; కాని అకర్పూరము లోపించినప్పుడా అగ్నికూడా
లోపించుచున్నది. ఆసమయమున కేవలము ఆకాశతత్త్వమే మిగిలియుంటు
న్నది. లేదా ఒకటిలోనుంచి ఒకటిని తగ్గించినప్పుడు కేవలము శూన్యమే
మిగిలియుండురీతిని, 'ఉన్నది' మరియు 'లేదు'. లేదా భావము మరియు అభావ
ములు రెంటినీ విడదీసిన పిమ్మట ఏది మిగిలియుండునో, అదియే నేనై
యున్నాను. ఆయవస్థలో, 'బ్రహ్మ', 'ఆత్మ', మరియు 'ఈశ్వరుడు' మొదలగు
శబ్దములవలనకూడా ఆస్వానందమునకు విఘ్నముకలుగును. మరియు "లేదు"
అనగా "ఏమియూలేదు" అని చెప్పుటకుకూడా అచ్చట చోటు మిగిలి
యుండదు. ఆసమయమున, ఏమియూమాట్లాడకుండానే, మరియు నోటినుండి
ఏశబ్దమూవెలువరచకుండానే, బాగాహృదయపూర్వకముగ 'లేదు' అని చెప్ప
బడును. మరియు జ్ఞానము మరియు అజ్ఞానమునుగురించిన ఏవిధమగు ఎరుకయూ

లేకున్నప్పటికినీ అది పూర్తిగా సరియగురీతిని ఎరుగబడును. అచ్చట బోధవల్లనే బోధను తెలియజెప్పబడును, ఆనందముతోనే ఆనందము ఆలింగన మొనర్చుకొనబడును, మరియు కేవలము సుఖముతోనే సుఖము భోగింపబడును. ఆస్థితిలో లాభమునకే లాభము కలుగును, ప్రభయందే ప్రభ చేరును, మరియు విస్మయము విస్మయమునందే మునిగిపోవును. ఆయవస్థలో శమమునకు కూడా శాంతి లభించును, విశ్రాంతికికూడ విశ్రాంతి లభించును, మరియు అనుభవముపైన అనుభవమనెడి ఉన్మాదము స్వారీచేయును. తాత్పర్య మేమన, కర్మయోగమనెడి అందమగు లతను నాటుటవలన ఆపురుషునకే ఆత్మ స్వరూపమనెడి నిర్దోషమగు ఫలము లభించును. మరియు ఓ అర్జునా, యీకర్మయోగపు సామ్రాట్టుయొక్క ముకుటముపైగల చైతన్య మనెడి రత్నముకూడా నేనే అయియుందును, మరియు దీనికి బదులుగా అతడు నా ముకుటమణి యగును. లేదా యీ కర్మరూపియగు దేవాలయము నకు మోక్షమే కలశమనిన్నీ, మరియు ఆ కలశమునకు పైన వుండెడి ఆకాశ వ్యాప్తి ఆకర్మయోగియూ యగును. లేదా, సంసార మనెడి వనమునందు కర్మయోగమే ఒక మంచి రోడ్డనిన్నీ, ఆ రోడ్డు తిన్నగా నాలో ఐక్యమగుట యనెడి గ్రామమువరకు వచ్చుననిన్నీ యెరుంగవలెను. లేదా జ్ఞాన-భక్తియనెడి జలముతోపాటు కర్మయోగ మనెడి ప్రవాహ మార్గముగుండా అత దతి వేగముగా నడచి 'నేను' అనెడి ఆత్మానందసాగరమునకు వచ్చి కలియును. ఓ సువిజ్ఞుడవగు అర్జునా! యీ కర్మయోగ మాహాత్మ్య మింత గొప్పది? మరియు యిందువల్లనే నేను దీనిని నీకు మాటిమాటికి ఉపదేశించుచున్నాను. ఈ 'నేను' అను నట్టిది, ఉచితస్థలము, కాలము లేదా పదార్థమును సాధించి పొందదగినట్టి వస్తువు కాదు. అయినను, యీ 'నేను' తనంతతానే పూర్ణరూపమున అన్నింటియందును విలసిల్లునట్టి వస్తువై యున్నది: మరియు యిందుకని నన్ను పొందుటకు ఏ విధమగు కష్టమును సహింపనక్కర లేదు. యీ కర్మయోగముద్వారా మాత్రమే నేను వాస్తవముగా చేజిక్కుదును.

ఒకడు శిష్యుడుగా నుండుట, మరియొకడు గురువుగా
నుండుటయనెడి వ్యవహారమంతటను ప్రచలితమై యున్నది. కాని, యీ
వ్యవహారము కేవలము నన్ను చేరు మార్గము నెరుంగుటవరకు మాత్రమే అయి
యున్నది. ఓ అర్జునా, భూగర్భమున సంపద, కాష్ఠగర్భమున అగ్ని, మరియు
స్తనమున పాలు–ఎల్లప్పుడు స్వాభావికముగా వుండియే యుండును. కాని,
యీ వస్తువులను పొందుటకు ప్రయత్నించువాడు మాత్రమే వీటిని పొంద
గలుగును. సరిగా యిదేవిధమున, నేనుకూడా స్వస్వరూపునకు స్వతస్సిద్ధుడనే,
కాని ఉపాయములవలన సాధ్యుడనగుదును! ఇప్పటివరకు ఫలవివేచన మొన
ర్చినపిమ్మట శ్రీకృష్ణుడిప్పుడేల ఉపాయమును గురించి ప్రస్తావించుచున్నా
డని యీ సమయమున యెవరేని ప్రశ్నించవచ్చును. దానికి జవాబు – యీ
ప్రస్తావనలో గీతయొక్క ముఖ్యరహస్యము ప్రత్యక్ష మోక్షసాధనకు
సంబంధించిన విషయమున అన్నిదృష్టులననుసరించియూ వివరించుట కొరకే
యిచ్చట చెప్పబడియున్నది. అనేకములగు యితరశాస్త్రములందుకూడా దీనికి
అనేకఉపాయములు చెప్పబడియున్నవి. కాని అవియన్నియూ ప్రమాణ
సిద్ధములేయని చెప్ప వలనుబడదు. గాలి ఎక్కువగా చేయగలిగినచో మేఘ
ములను ఎగురగొట్టగలదే గాని, సూర్యుని నిర్మించలేదుగదా! చేతితో నీటియం
దలి నాచును తప్పించి ఒకప్రక్కకు నెట్టగలమేగాని, దానితో నీటిని ఉత్పన్న
మొనర్చలేముగదా! ఇదేవిధముగా, ఆత్మదర్శనమునందు బాధను కలుగ
జేసెడి అజ్ఞానమనెడి మలమును శాస్త్రములు తొలగించగలవు. కాని, మిగిలి
యున్న 'నేను' ఎల్లప్పుడు స్వయంప్రకాశుడుగను మరియు నిర్మలుడుగానే
వుండును. ఇందువల్లనే, శాస్త్రములన్నియూ కేవలము అజ్ఞాన మాలిన్యమును
కడిగెడి సాధనములుమాత్రమే యైయున్నవి. వాటిలో యింతకుమించి ఆత్మ
బోధను కలిగించెడి స్వతంత్రమగు యోగ్యత యేదియూ లేదు. ఆ అధ్యాత్మ
శాస్త్రములలో సత్యమును సిద్ధింపజేసెడి ప్రసంగము వచ్చినప్పుడవి, ఏ
ప్రదేశమునకు పోవునో, ఆ ప్రదేశమే యీ గీత. సూర్యుడు తూర్పు

దిశ నలంకరించినప్పుడు దిశ లన్నియూ ఉజ్జ్వల మగును. ఈవిధము గనే, శాస్త్రములను తగు మార్గమున నడుపునట్టిది గీతయై యున్నది. మరియు యీ గీతయొక్క సహాయమువల్లనే శాస్త్రము లన్నియూ సమర్థత గలవగును. అస్తు. మొదటగా సర్వజ్ఞుడగు శ్రీకృష్ణుడు ఆత్మ ప్రాప్తిని పొందుటకు పనికివచ్చు అనేక ఉపాయముల నతి వివరముగా చెప్పెను. అయినప్పటికిని, శ్రీహరి తన మనస్సునందత్యధికముగ చింతించి, యీ విషయమును ఒక్కమారు విన్నంతమాత్రమున వెంటనే అర్జునునకు బోధపడియుండకపోవచ్చును, లేదా చక్కగా తెలియకపోయి యుండ వచ్చును అని యోచించెను; మరియు, యిందువల్లనే యిప్పుడు, ఒక పర్యాయము చెప్పబడిన సిద్ధాంతమును శిష్యుని మనస్సున అటలముగా ప్రతిబింబింపచేయ గోరి. ఆ సిద్ధాంతమునే మరల స్పష్టముగా శ్రీకృష్ణులు చెప్పుచున్నారు. మరియు, దానితోపాటు గీతయొక్క ముగింపుకూడా సమాపించుటవలన యిచ్చట దీనిఆరంభమునందును, మరియు అంతమునను ఏకసూత్రత వుండుటకూడా చూపబడినది. ఇటుల చూపించుటకు గల కారణము, గ్రంథారంభము మరియు అంతములమధ్య అనేక విధములగు ప్రశ్నలు వచ్చుట వలన అనేక సిద్ధాంతములు స్పష్టీకరింపబడినవి. ఇందలి పూర్వాపర సందర్భములపై చక్కగా ధ్యానముంచకపోయినచో ఎవడైనా 'యీసిద్ధాంతములన్నియూ యీ శాస్త్రమందలి ముఖ్యము మరిగారు సారభూతమగు సిద్ధాంతములని' చెప్పవచ్చును. ఇందుచే, ఆ సిద్ధాంతము లన్నింటిని ఒక మహాసిద్ధాంత మనెడి మూసలో పోసి గీతారంభమునకు దాని అంతముతో ఏక - వాక్యత కలుగజేయబడినది. ఈ గ్రంథముయొక్క ముఖ్యమూ మరియు ప్రస్తుతవిషయము అవిద్యానాశమై యున్నది. మరియు, మోక్ష సంపాదనమే ఆ అవిద్యా నాశనముయొక్క ఫలము. మరియు యీ రెండింటికిని జ్ఞానమే సాధనము. కేవల మీవిషయమే, యీ విశాల గ్రంథమున అనేక విధములుగా అతివిపులముగ స్పష్టీకరింపబడినది. ఇక యీ వివరణ

యిచ్చట చాల కొద్ది మాటలలో జరుగుచున్నది. ఇందువల్లనే, ఫలము చేతి లోనికి వచ్చినప్పటికిన్నీ, ఆ ఫలమును పొందనగు ఉపాయములను మరల వివరించుట యనెడి ప్రయత్నములో శ్రీ కృష్ణుడు ప్రవృత్తుడాయెను.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ ॥౫౬॥

శ్రీకృష్ణుడు చెప్పెను– "ఓ వీరశ్రేష్ఠుడవగు అర్జునా, ఆ కర్మయోగి తన స్థిరభక్తి సహాయముచే 'నేను' అగును, మరియు అటులరూపమున నాలో నివసించును, అతడు స్వకర్మాచరణమనెడి నిర్మల పుష్పములతో సమర్చించును, మరియు ఆ అర్చనవలన ప్రాప్తించెడి ప్రసాదమువలన నాతనికి జ్ఞాననిష్ఠ యనెడి లాభము కలుగును, ఈ జ్ఞాననిష్ఠ లభించినప్పుడు నా భక్తికి ఉత్కర్ష కలుగును. మరియు ఆ భక్తివలన ప్రాప్తించెడి సమావస్థయనెడి శాంతిచే అతడుసుఖించును,విశ్వమును ప్రకాశింపజేసెడి 'నేను', ఆ 'నేను'ను అనగా స్వయముగా నా ఆత్మనే అంతటను ఓతప్రోతముగ నిండియున్నటుల ఎరుంగునో, మరియు దానిననుసరించి ఆచరించునో, ఎవడు బుద్ధి, వాక్కు మరియు శరీరములతో 'ఉప్పు' తన విలక్షణత్వమును విడచి జలమును ఆశ్రయించు రీతిని. లేదా వాయువు సుడితిరుగుటను మాని ఆకాశమున స్తబ్ధమై యుండురీతిని? కేవలము నన్నే ఆశ్రయముగా గొనునో, అతని చేత ఒకటి అరమారులు యిట్టిపని ఏదైనా జరిగినప్పటికిని గంగతో సంబంధమేర్పడుటచే దారియందలి మురుగునీటిప్రవాహము మరియు మహానదీప్రవాహములు రెండునూ కలసి ఒక్కటిగనైపోవురీతిని, నాజ్ఞానము కలిగినపిమ్మట శుభాశుభకర్మలు రెండున్నూ ఏకరూపమునుపొందును. చందనమునందును మరియు సాధారణకట్టెయందును వాటికి నిప్పు అంటుకొననంతవరకుమాత్రమే భేదము వుండును. అయిదువన్నెల మరియు పదునారువన్నెల బంగారమునందునూ, అవి రెండునూ స్పర్శమణిస్పర్శచే ఏకరూపమును పొందనంత వరకు మాత్రమే భేదము వుండును. సరిగా యిదేవిధమున, నాసర్వవ్యాపి

యగు ప్రకాశము ప్రాప్తించనంతవరకు మాత్రమే శుభాశుభ భేదములు గోచరించుచుండును. మనము సూర్యబింబమున ప్రవేశించనంతవరకు రాత్రిం బవళ్ళనెడి ద్వంద్వములు భాసమాన మగుచుండును. ఇందువల్లనే ఓ అర్జునా, నాతో కలియుటతోడనే ఆతని కర్మ లన్నియూ లోపించును. మరియు ఆతడు సాయుజ్యమోక్ష మనెడి ఆసనముపై విరాజిల్లును. అతనికి స్థల, కాల, స్వభావముల ననుసరించి ఎన్నడును వ్యయము కానట్టి క్షయముకానట్టిదియూ నగు నా అక్షయపదము లభించును. ఓ అర్జునా, ఎచ్చట నా ప్రత్యక్ష ఆత్మ ప్రసాదము ప్రాప్తించునో అచ్చట ఏ లాభము కొరవడును ? (అనగా అచ్చట అన్ని సుఖములను యితర లాభములూ అనాయాసముగానే ప్రాప్తించును.

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥౫౭॥

“కావుననే ఓ అర్జునా, నీవు నీ సమస్తకర్మలను నాయందే సన్న్యసించుము. నీ కర్మల నన్నింటిని నాకే అర్పించుము. కాని ఓ వీరుడవగు అర్జునా, ఇదియే నిత్యకర్మలను సన్న్యసించుట. నీవు నీమనోవృత్తి నెల్లప్పుడును ఆత్మ వివేకమున లగ్నమొనర్చుము, అంతట, ఆ వివేకసామర్థ్యము వల్లనే నీకు నీ ఆత్మతత్త్వము సమస్తదినములకు కర్మలకును అలిప్తముగనున్న స్వరూపములో నిర్దోషరూపమున కాన్పించును మరియు ఆ సమయమున ‘కర్మలకు జన్మభూమియగు ప్రకృతి యనబడెడి మాయకూడా ఆత్మకు చాలదూరమున నున్నదనెడి’ విషయముకూడా నీకు తెలియును. అంతట ఓ అర్జునా, పదార్థమునుండి దానినీడ విడిపోజాలని రీతిని యీ ప్రకృతికూడా ఆత్మతత్త్వమునకు విడిగా నుండజాలదు. ఈ రీతిని ప్రకృతి అంతమొందినప్పుడు సమూల కర్మ సన్న్యాసము తనంతతానే సంభవించును, అంతట కర్మనాశము, లేదా అంతమైన పిమ్మట కేవలము ‘నేను,’ లేక ఆత్మతత్త్వమే మిగిలియుండును. మరియు బుద్ధి ఒకానొక పతివ్రత స్త్రీవలె పూర్ణనిష్ఠతో దానియందు రమణ

మొనర్చును. ఈ విధముగా బుద్ధి అనన్యభక్తితో నారంగులో రంగరింప బడి నప్పుడు చిత్తముకూడా తన చంచలత్వము నంతనూ విడచి నన్నే భజింప సాగును. కావున నీ వెల్లప్పుడును 'నీ చిత్తము చంచలత్వమునంతను విడనాడి నిశ్చల రూపమున నాలోనికే వచ్చి చేరునటుల' ఉపాయము నొనర్చుచూ నుందుము.

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి॥ 58

"అంతట యీ విధమగు భేదభావహీనమగు భక్తితో నేను చిత్తము నందు పరిపూర్ణముగ నిండిపోయినప్పుడు, నా ప్రసాదము పరిపూర్ణముగ ప్రాప్తించినదని – నీవు తెలిసికొనుము. ఇట్టి అవస్థ ప్రాప్తించినప్పుడు జనన-మరణములవలన భోగించవలసివచ్చెడి అనేక విధములగు దుఃఖకర స్థలములు కూడా నీకు సుఖకరములుగా తోచసాగును. సూర్యుని సహాయము వలన కనులేర్పడి తయారైనచో, యిక వాటి ముందు అంధకారమెంతని ఇదే విధమున, నాపరిమకృపచే ఎవని జీవ – భావమనెడి కణము పూర్తిగా తునిగి పోవునో, అనగా ఎవనికి జీవ – భావము పూర్తిగా నాశమొందునో, అతనిని యీ సంసారమనెడి బూచివాడు ఏవిధమున బాధించ గలడు? కాన, ఓ అర్జునా, నీవు నా ప్రసాదమువలన యీ సంసారము నందలి దుష్టములగు జంజాటములనుండి తప్పించుకొందువు. కాని, అభిమానము వలన నీవు నా యీ మాటలన్నిటిని చెవికిని, మనస్సునకును సోకనివ్వక పోయినచో నీవు నిత్య ముక్తుడవు మరియు అవ్యయుడవైనప్పటికిని వ్యర్థుడవై పోదువు. మరియు నీపై దేహాభిమానమనెడి భయంకరమగు ఆఘాతములు తగులును. ఈ దేహ సంబంధమగు ప్రదేశమున అడుగడుగునను ఆత్మఘాతమనెడి కష్ట మును సహించవలసి వచ్చును, మరియు దాని యందెన్నడును క్షణమునైనై నను విశ్రాంతించుటకుకూడా అవకాశము లభించదు నీవు నా మాటలపై శ్రద్ధ

యుంచకున్నచో మరణించకున్నప్పటికిని నీ వీ గొప్పవగు సంకటముల వలన మరణించినవానితో సమానుడవే యయ్యెదవు.

యద్యహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥59॥

"పథ్యముచేయుని రోగి జ్వరమునూ, లేదా దీపమును ద్వేషించువాడు అంధకారమునూ పెంపుల మొనర్చురీతిని, నీవు వివేకమును తిరస్కార పూర్వకముగా దూరముగానెట్టి అహంకారమును పోషించుచో, మరియు ఆ అహంకారమువలన నీ శరీరమును 'అర్జునుడు', యితరుల శరీరములను 'స్వజనులు' మరియు యీ యుద్ధమును 'మహాపాపాచరణము' అను పేరుల, మరియు అభిమానపూర్వకముగ 'నేను యుద్ధమును చేయను' అని నిశ్చయమొనర్చుకొన్నప్పటికిని, నీ జన్మజాత మగు స్వభావము, నీ ఆ నిశ్చయమును పూర్తిగా నిష్ఫల మొనర్చును. నీవు నీ మనస్సున 'నేను అర్జునుడను వీరు నా ఆప్తులు, మరియు వారిని చంపుట ఘోరపాతకమని' భావించుచో 'యీ విధమగు భావనలో మాయ తప్ప మరింకెమైన వాస్తవిక మగు తథ్యమున్నదేమో ?' నీవే యోచించుము. మొందుగా, నీవు యుద్ధమునర్చుటకు సంసిద్ధుడవైతివి. మరియు అప్పుడు, యుద్ధమునర్చుటకై శస్త్రమునుకూడా చేకొంటివి; మరియు, యిదంతయూ చేసి యిప్పుడునీవు 'యుద్ధము చేయనని' ప్రతిజ్ఞ చేయగోరుచున్నావు. నీవు 'నేను యుద్ధము చేయనని' చెప్పెడి మాటలన్నియూ పూర్తిగా నిస్సారమైన మాటలు. పోనీ, కేవలము లౌకిక వ్యవహారదృష్టితో చూచినప్పటికిని, నీయీ మాటలందలి అభిప్రాయము బోధపడుటలేదు. నేను యుద్ధముచేయనని నీమనస్సున చేసికొనిన నిశ్చయమును నీ స్వభావమే విచలితమొనర్చును. స్వభావమే నీ యీ నిశ్చయమును నీతోనే తెగగొట్టించి యుద్ధముచేయుటకు బాధ్యునిగా చేయును.

స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్॥ ౬౦

“జలప్రవాహముయొక్క పాయదల పూర్వపు వైపు వుండగా పడమటి వైపుకు యీది పోవుటకు ప్రయత్నించుచో, యీతగాని పాలిటకు శుద్ధ వెర్రితనముతో కూడిన ఆగ్రహమే వచ్చును. ఇట్టి మనుష్యుని నీటి పాయదల స్వయముగా తనకు వశ మొనర్చుకొని - అతనిని అతని కోరికకు విరుద్ధముగా, తన యిచ్ఛానుసారము ప్రవాహమున గొనిపోవును. లేదా, ధాన్యపుగింజ ధాన్యమువలె నేను మొలవను, మరియు నేను దానివలె పెరుగను - అని చెప్పునెడల, అది యెన్నడైన తన స్వభావమును ఉల్లంఘించ గలుగునేమో - నీవే యోచించుము, సరిగా యిదేవిధమున, ఓబుద్ధిమంతుడవగు అర్జునా, నీస్వభావము మరియు నీప్రకృతియే క్షాత్రధర్మ సంస్కారముచే నిర్మితమై యున్నది. ఇందువల్లనే, నీ వీ సమయమున ‘నేను యుద్ధము చేయను’ అని చెప్పినప్పటికిని, నీప్రకృతియే నిన్ను యుద్ధప్రవృత్తు నొనర్చు ననుటలో ఏమాత్రము సందేహము లేదు. ఓ అర్జునా, శౌర్యము, తేజము మరియు తత్పరత్వము - మొదలగు గుణములను నీప్రకృతియే నికిచ్చినది. మరియు, నీ వాగుణానురూపముగ కార్యముల నొనర్పనిచో, నీఆప్రకృతియే నిన్ను స్వస్థముగ కూర్చొననివ్వదు. కాన, ఓ ధనుర్ధారివగు అర్జునా, నీ వీ గుణములచే గట్టిగా బంధింపబడి యున్నావు, మరియు యిందువలన, నీవు క్షాత్రకర్మ మార్గమును పట్టెదవనుటలో యించుకేని సందేహము లేదు. కాని, నీవు నీ యీజీవిత రహస్యమును ధ్యానమందుంచుకొనక, కేవలము అనాలోచితముగ ‘నేను యుద్ధము చేయను’ అనినిశ్చయించుకొని పట్టుదలతో కూర్చొని యున్నప్పటికిని, ‘కాళ్లు-చేతులు కట్టిపైచి రథముపైన కూర్చోబెట్టిన పురుషుడు తాను స్వయముగా నడవక పోయినప్పటికిని తానున్న ప్రదేశమునకు అత్యధిక దూరమువరకు పోయెడి విధమున’ నీవుకూడా తప్పక ఏదో ఒకటి ఆ పురుషునివలెనే చేసెదవన్న

విశ్వాసము నాకు పూర్తిగానున్నది. 'నేనేమియూ చేయను' అని నీవు నీ మనస్సున యోచించుచునే యుందువు, నీ ప్రకృతి బలవంతముగ నీచే ఎంతే చేయించును. విరాటరాజ కుమారుడగు ఉత్తరుడు రణరంగమునుండి పారిపోవుచున్నప్పుడు నీ క్షాత్రస్వభావమే నిన్ను యుద్ధప్రవృత్తు నొనర్పలేదా? నీ ఆ క్షాత్రస్వభావమే నేడుకూడ నిన్ను యుద్ధప్రవృత్తు నొనర్చును. గొప్ప గొప్ప వీరులుం గల పదునొకండు అక్షౌహిణుల సేనను నీవు ఉత్తరగోగ్రహణ సమయమున ఒంటరిగనే రణరంగమున శయనించునట్లు చేసితివి. ఇట్టి ప్రతాపముగల ఆ క్షాత్రస్వభావమే, ధనుర్ధరుడవగు అర్జునా, యీ సమయమున కూడ నిన్ను యుద్ధప్రవృత్తు నొనర్చును, రోగికెన్నడైన రోగమునిన యిష్టముండునా? దరిద్రుని కెన్నడైన దారిద్ర్యమునిన నచ్చునా? వుండదు. కాని, ఏ బలిష్ఠమగు దైవకారణమున రోగికి రోగము, దరిద్రునకు దారిద్ర్యమునూ అనుభవించవలసివచ్చునో, ఆ దైవమే యీశ్వరశక్తివల్ల తన పనిని చేయకుండా వుండదు. మరియు ఆ యీశ్వరీయశక్తికూడా నీ హృదయమున నివసించుచునే యున్నది.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి |
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ||

"భూతము లన్నింటియొక్క అంతఃకరణమునందును, లేదా వారి హృదయ మనెడి ఆకాశమునందు చిద్వృత్తి యనెడి సహస్రకిరణములతో ఏ యీశ్వరరూపి యగు సూర్యుడు ఉదయించునో, అతడు అవస్థాత్రయరూపి యగు లోకత్రయమును ప్రకాశిత మొనర్చి మాయలో పడియున్న యాత్రికులగు జీవులను మేల్కొలుపును. దృశ్యవస్తురూపి యగు జల-సరోవరమునందు విషయరూపియగు కమలములపై తన తేజస్సును వ్యాపింపజేసి ఆ యీశ్వరరూపి యగు సూర్యుడు 'పంచజ్ఞానేంద్రియములు మరియు ఆరవ దగు మనస్సున్నూ కలపి మొత్తము ఆరు పాదములుంగల' ఆ జీవరూపియగు భ్రమరమును ఎల్లప్పుడు మేపుచుండును. ఆ హృదయస్థ

ు యీశ్వరుడు అహంకారమనెడి ఆవరణమును కప్పుకొని నిరంతరము
ాసమొనర్చుచుండును. తనమాయయొక్క తెరమరుగుననే ఆతడు సమస్త
ాత్రిములను సంచాలన మొనర్చుచుండును. మరియు బాహ్యజగత్తనెడి రంగ
ూమిపై అరువదినాల్గు లక్షల చరాచర యోనులనెడి చిత్ర-విచిత్ర ఛాయా
త్రములను ఆడించుచుండును. ఆతడు బ్రహ్మనుండి మొదలుకొని క్షుద్ర
గు క్రిమి-కీటకములవరకు గల భూతముల నన్నిటిని వాటివాటి యోగ్యత
నుసరించి దేహాకృతితో నలంకరించి యుంచును. ఎవనిముం దే ఆకారము
తడు నైపుణ్యముతో సింగారించి వుంచునో, ఆ దేహమునం దాజీవుడు
యీ దేహమే నేను' అనెడి భావముచే బంధింపబడి పోవును. ఒక నూలు
గు మరియొక నూలుపోగును తాకియుండురీతిని, లేదా తృణాదుల దంటు
రియొక చొప్పదంటును అంటుకొనియుండు విధమున, లేదా చిన్నపిల్లవాడు
టపడిన తన ప్రతిబింబమును చూచి దానిని తన చేతులతో కెలుకురీతిని,
హాకార రూపమున స్వయముగా తనరెండవనీడనే చూచి జీవుడుకూడా
ానిలో ఆత్మ-బుద్ధిని స్థాపించుకొనును-అంత నాతడీదేహమే నేనని తలంచ
గును. ఈవిధముగా భూతకోటిని దేహమనెడి యంత్రముపై కూర్చుండబెట్టి
హృదయస్థుడగు యీశ్వరుడు ప్రాచీన కర్మల సూత్రములను పూపుచూ
ండును. వాటిలో ఏ ప్రాచీన సూత్రములు ఏ భూతముతో స్వతంత్ర
తిని బంధింపబడి యున్నవో, ఆభూతములు ఆ సూత్రము వలన ప్రాప్తిం
నెడి గతిని గైకొనసాగును. ఓ అర్జునా, వాయువు చొప్పదంటులను ఆకాశ
మున వెళ వెళ లాడించుచూ వుండు విధమున యీశ్వరుడు కూడా భూత
కోటిని స్వర్గము మరియు సంసారమునం దెల్లప్పుడు సమానరూపమున నడుపు
చుండును. సూదంటు రాయియొక్క ఆకర్షణవలన యినుము గిర గిర తిరుగ
సాగునటుల యీశ్వర శక్తిచే భూతకోటి కూడా తిరుగుచుండును. ఓ అర్జునా,
వలము చంద్రుని సామీప్యమువల్ల మాత్రమే సముద్రాదులు తమ తమ
చేష్టల నొనర్చుచున్నవి. అనగా ఆటు - పోటులు సముద్రమునం దేర్పడు

చున్నది, సోమకాంతమణి ద్రవించ సాగుచున్నది. కుముదము మరియు చకోర ములయొక్క ఔదాసీన్యము తొలగిపోవుచున్నది. మరియు అవి ఉల్లాసమును పొందుచున్నవి. అదేవిధముగా ఒక్కడగు ఈశ్వరుడే మూలప్రకృతియొక్క ప్రేరణచే సమస్తభూతములను భిన్నభిన్నరీతులలో ప్రతీతమగునటుల చేయు చుండును. మరియు ఓ అర్జునా, ఆయీశ్వరుడే నీ హృదయమునందుకూడా నివసించును. ఓ పాండుపుత్రా, అర్జునత్వమును నీ అంగములకు తాకనివ్వ కుండా నీమనస్సున వెదలుచున్న 'నేనున్నాను' అనెడిభావమే అహంకార మగు ఆ యీశ్వరునియొక్క నిజమగు స్వరూపము. కావున, ఆ యీశ్వరుడే ప్రకృతిశక్తిని నడిపించునెడి విషయమునం దేమాత్రము సందేహములేదు. మరియు, నీమనస్సున పోరాడవలెననెడి తలంపు లేకున్నప్పటికిని ఆప్రకృతి యే నిన్ను యుద్ధప్రవృత్తు నొనర్చునుటలో ఏ సంశయములేదు కావున, యీశ్వరుడే సర్వాధికారి. మరియు అతడు ప్రకృతిని నియమించును. అని చెప్పబడినది. అంతట ఆప్రకృతి తన యింద్రియములను నడపును. ఇందు వల్లనే, 'నేను యుద్ధముచేయవలెను. లేక చేయరాదు' అనెడి ఆలోచనను ప్రకృతిపైననే నీవు విడచిపెట్టుము.

తమేవ శరణం గచ్ఛ సర్వ భావేన భారత!
యత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥

"అహంభావముచేతను, వాక్కు చేతను, మనస్సుచేతను మరియు శరీరము చేతనూ ఆ యీశ్వరుని శరణు జొచ్చుము, అతని శక్తికి లోబడి ఆ ప్రకృతి అన్నిపనులను జేయును. గంగాజలము మహాసాగరమున ప్రవేశించురీతిని నీవుకూడా ఈశ్వరునియందు ప్రవేశించుము. అంతట, ఆ యీశ్వరుని కృపాప్రసాదముచే నీకు పూర్ణ-శాంతి యనెడి తరుణితో సమాగమ మగును. మరియు నీవు ఆత్మానందముతో స్వ-స్వరూపమున రమణ [illegible]నర్చసాగుదువు. స్వయముగా ఉత్పత్తికూడా దేనినుండి ఉత్పన్నమగునో [illegible] కూడా ఎచ్చట విశ్రాంతి లభించునో, మరియు అనుభవమునకు

కూడా ఎచ్చట అనుభవము ప్రాప్తించునో, ఆ ఆత్మరూపి యగు పీఠమునకు నీవు అక్షయరాజు వయ్యెదవు” ఆ సమయమున లక్ష్మీపతి యను శ్రీకృష్ణుడు అర్జునునితో యింకా యే చెప్పెను

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యాతరం మయా ।
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥63॥

“ఈ గీత సాహిత్యమునంతనూ మథించి తీసిన సుప్రసిద్ధమగు సారము. దేనినుండి ఆత్మయనెడి రత్నము చేజిక్కునో, వేదాంతమున దేనిని ‘జ్ఞాన’ మని ప్రాధాన్యముగ వర్ణించిరో, మరియు యిందువల్లనే దేని ఖ్యాతి ప్రపంచ మందంతటను వ్యాపించియున్నదో, దేనిప్రకాశమువలన బుద్ధ్యాదిశక్తులకు చూచుట మరియు అర్థము చేసికొనుట మొదలుగాగల యోగ్యత వచ్చునో, మరియు దేనిద్వారా సర్వద్రష్టుడ నగు నేనుకూడా కనిపింతునో, అదియే యీ ఆత్మజ్ఞానము. నేను అవ్యక్తుడనే, మరియు అవ్యక్తుడనగు నాకుకూడా యిది నితాంతము గుప్తముగ నుంచిన ధనమై యున్నది. కాని, నాయీ ధనమును నీ విషయమున ఎట్లు దాచియుంచగలను! ఇందువల్లనే, ఓ అర్జునా, దయ మరియూ ప్రేమలచే పూర్తిగా నిండిపోవుటవలన నేను నా యీ గుప్తభాండారమును నీ ఎదుట తెరచి యుంచితిని. ప్రేమావేశముచే నిండియున్న తల్లి తన బిడ్డతో దాపరికములేని మనస్సుతో మాట్లాడురీతిని, నాయీ ప్రీతికూడా మనసుకూడా అట్టి మాటలలో ప్రవృత్తమొనర్పదా? ఆకాశమును కూడా కరగించి వేయురీతిని, లేదా అమృతముయొక్క బెరడు తీసివేయురీతిని, లేదా దివ్యమునుకూడా యింకనూ దివ్యముగ నొనర్చురీతిని, లేదా తన అవయవప్రకాశమువలన పాతాళమునందలి అణు – రేణువులను కూడా ప్రకాశితమొనర్చెడి సూర్యుని నేత్రములందుకూడా దివ్యాంజనమురాయురీతిని, యీసమయమున, ఓ అర్జునా, సర్వజ్ఞుడనగు నేను కూడా సర్వదృష్టులతోనూ ఆలోచించి ‘నిశ్చయముగా సరియైన విషయమునే నీకు చెప్పితిని. ఇక నీవీవిషయము లన్నింటిని గురించిన్నీ తగురీతిని యోచనచేసి,

నీకు ఏదినచ్చునో, అదియే చేయుము". భగవానుని యీమాటలనువిని అర్జునుడు స్తబ్ధుడయ్యెను. అంతట భగవాను లిటులయనిరి- "ఓ అర్జునా, వాస్తవముగ నీ వతిగంభీరుడవు. ఆకలితోనున్నవాడు వడ్డించువానితో సంకోచించుచూ 'ఇకచాలును, నాపొట్టనిండినది' అనిచెప్పుచో, ఆతనికే ఆకలితో నుండవలసివచ్చును. మరియు, దానితోపాటు ఆతనికి అబద్ధము చెప్పిన దోషముకూడా సంభవించును. సరిగా యిదేవిధమున, సర్వజ్ఞుడగు సద్గురువు లభించినప్పుడు, నీవుసిగ్గుచే ఆతనిని ఆత్మ-నిర్ణయమునుగురించి ప్రశ్నించకుండుట, నిన్నునీవు మోసగించుకొనుటవంటిదే యగును. మరియు నీయీ పొరపాటు వలన ఆత్మవంచన యనెడి పాపముకూడా తగులును. కాని, నీ యీ స్తబ్ధత్వమువల్ల, నీమనస్సులో 'మరియొకమారీజ్ఞానమును గురించి వివరించవలసిన దనెడి' భావము గలదని నాకు తోచినది. "అందుపై అర్జునుడిట్టులనెను-" ఓ ఉదారుడవగు భగవానుడా, మీరు నా మనోభావమును సరిగా గుర్తించిరని నేను చెప్పుద మన్నను నా కీమాత్రము సమంజసముగ తోచుటలేదు. ఏలనన, మీతో పోల్చి చెప్పదగిన జ్ఞాత మరెచ్చటనైన లభించగలడా ? మరియు స్వాభావికముగ, కేవలము తామే దాని నెరింగిన జ్ఞాతలు. సూర్యుని సూర్యుడని యిట్టి స్థితిలో వర్ణించుచో, అందువల్ల ఏదైన విశేషమగు అభిప్రాయము వెలువడగలదా ? ఇది విని శ్రీకృష్ణు లిటుల చెప్పిరి-" ఓ అర్జునా, నీవిప్పుడు నన్ను గురించి చేసిన స్తుతిపూర్ణమగు వర్ణనము తక్కువైనదియు, సామాన్యమైనదిగను తలంచుచున్నావా ?

సర్వ గుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసిమే దృఢమతి స్తతో వక్ష్యామి తే హితమ్॥ ౬౪

"ఇక నీవు నా నిర్దోషములగు శబ్దములను మరియొకమారు శ్రద్ధగా వినుము. చెప్పదగినదగుటచేతనే నేను చెప్పుచున్నట్టిదిన్ని, మరియు వినదగినదగుటవల్లనే నీవు వినవలసినట్టిదిన్ని యగు ఏ విషయమూ లేదు. అయి నప్పటికిని యీ సంభాషణను గురించి 'నీకు భాగ్యోదయమైనదనియే' నీవు

తెలిసికొనుము. ఓ అర్జునా, ఆడతాబేలుయొక్క చూపువల్ల మాత్రమే దాని బిడ్డలను పోషించెడి పాలు లభించుచున్నది. మరియు చాతకపక్షి యింట స్వయముగా ఆకాశమే నీళ్లుపోయువాని పనిచేయును. కావున, ఎచ్చట ఏవ్యవహారము కాజాలదో, అచ్చటకూడా ఆ వ్యవహారఫలము అనుభవించుటకై ప్రాప్తించును. దైవము పూర్తిగా అనుకూలుడగుచో ఏ లాభమెచ్చట ప్రాప్తించ నేరదు ? సామాన్యముగ చూచినచో, యీ రహస్యమెట్టిదనిన, ద్వైతమును గురించిన జగడమును విడచి అద్వైతము అనగా ఏకతత్వ మనెడి యింటియందే యిది అనుభవమునకు రాగలదు. మరియు ఓ సఖుడవగు అర్జునా, కల్పితముకాని ప్రేమలో కాన్పించెడి ప్రేమవిషయము నేను తప్ప మరేదియూ కాదని – నీవు తెలసికొనియుండుము. ఓ అర్జునా, మనము మనముఖమును చూచుకొన దలచిన అద్దమును మనమే స్వయముగ శుభ్రమొనర్తుము; కాని ఆ శుభ్రతను మన మా అద్దముకొరకై చేయుటలేదు, స్వయముగ మనకొరకే చేయుదుము. ఇదే విధముగ, ఓఅర్జునా నిన్ను నిమిత్త మాత్రునిగ చేసికొని నే నీవిషయముల నన్నింటిని నాకొరకే చెప్పుకొనుచున్నాను; ఏలనన, అటుల కానిచో, నీయందును నాయందును ఏ విధమైన భేద-భావమైన గలదేమో నీవే చెప్పుము ? మరియు యిందువల్లనే నేను నాయునన్ననందలి రహస్యమును నీకు చెప్పుచున్నాను, ఏలనన, నీవు కూడా నా అంతరంగమున వసించువాడవే; మరియు ఏకనిష్ఠులగు భక్తుల పట్ల నేను వెర్రివాడ నగుదును. మరియు ఓఅర్జునా, జలమునకు తన సర్వస్వమును అర్పించునప్పుడు లవణముఎంతగా మైమరచి పోవుననిన, సర్వాంశలందును జలరూపమును పొందుటలో అవినాశమాత్రమునకైన సంకోచించదు; సరిగ యిదేవిధమున, నీవు నాపట్ల ఏ విధమగు భేద-భావమును ఏర్పరచుటనూ ఎరుగనపుడు, యిక నేను నీతో ఏవిషయమునైన ఎటుల దాచియుంచగలను? కావుననే, ఏరహస్యముముందు సంసారమునందలి మిగిలియున్న రహస్యము

అన్నియూ పూర్తిగా స్పష్టపరచినవిగా సిద్ధించునో, ఆ నాపరమగుప్తమగు రహస్యవచనమును నీకు చెప్పుచున్నాను వినుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥ ౬౫

"వీరుడవగు అర్జునా! నీవు, సర్వవ్యాపకుడనగు నన్నే నీ ఆంతరికము మరియు బాహ్యములగు సర్వవిధములగు వ్యవహారములకును సంబంధించిన విషయముగ చేసికొనుము. ఆకాశముయొక్క అన్ని అంగములందును వాయువు కలసియుండురీతిని నీవు నాలో కలసి యుండుము. సారాంశమేమన, నీవు నీమనస్సును ఏకమాత్రమగు నా దేవాలయముగనే ఒనర్చుకొనుము. మరియు నాశ్రవణమువల్లనే నీచెవులను చక్కగా నింపియుంచుము. ఆత్మజ్ఞానముచే నిర్మలులైనవారగు యీ సంత - జనులు నాయొక్క మూర్తిమంతములే యగుదురు. కావున, కాముకస్త్రీ తనభర్తవైపు ప్రేమపూర్వకముగ చూచువిధమున నీదృష్టినికూడా ఈసాధుమహాత్ములవైపు ప్రేమపూర్వకముగ చూచునటుల మార్చుము. నేను వస్తుకోటికి నివాస - స్థానమును, కావున, నానిర్మల నామస్మరణను నీ జిహ్వలో జేర్చి దానిని సజీవముగ నుంచుము. నీ చేతులచే జరిగెడి పనులన్నియును, మరియు పాదముల నడకయంతయూ- సమస్తమును నాకొరకే యగునటుల నీవు వ్యవస్థ యొనర్చుకొనుము. ఓ అర్జునా, నీ వారలకు లేదా పరులకూ నీవు చేసెడి ఉపకారములనెడి యజ్ఞమువలన నీవు నా నిజమగు యాచకుడవు కాగలుగుదువు. కాని, ఈ విధముగా నీకు ఒక్కొక్క మాటను ఎంతవరకని చెప్పను. ! సోదరా, నీలో నీవే స్వయముగా సేవక - భావమును స్థాపించుకొనుము. మరియు మిగిలినవారినందరిని మదూర్తులుగా తలంచి వారిని సేవ్యులుగా తెలసికొనుము. ఇందువలన భూతకోటియెడ నీ మనస్సునందుండెడి ద్వేషము తొలగిపోవును. మరియు నీ వీ జ్ఞాన భావనతోనే 'అంతటను నేనే నిండియున్నాననెడి' నమ్రతను గ్రహింపగలుగుదువు; మరియు ఇందువల్ల నీకు నా పూర్తియైన దృఢమగు ఆశ్రయము ప్రాప్తించ

కలదు. అంతట, యీ జనసమ్మర్దముచే నిండియున్న సంసారమున మరి మూడవవాని పేరే వుండదు. మరియు నేనునీవూవాస్తవముగా ఏకాంతమున కలియగలుగుదుము. అపైన, ఎట్టిస్థితి సంభవించినప్పటికిని, నీకూ మరియు నాకూ గల పారస్పరిక సహవాసము అనుభవించుటకై మిగిలియుండును, మరియు మన సౌఖ్యము దానంతట అదే వృద్ధిపొందసాగును. మరియు ఓ అర్జునా, త్రిత్వము (మూడవవాడు) అనెడి జగడములేనట్టి స్థితియందే నీవు అంతమున మదూప్రుడవై నాలో కలసిపోదువు, నీరు నశించినప్పుడు నీటిలో పడెడి ప్రతిబింబమును తన బింబముతో కలపి ఐక్యముకాకుండా ఎవరడ్డగించగలరు? వాయువు ఆకాశముతోనూ, లేదా తరంగములు సముద్రముతోనూ కలసి ఏకము కాసాగినచో, దానిలో బాధపడవలసిన దేమిగలదు? ఈదేహధర్మము వల్లనే నీవు మరియు నేనున్నూ భిన్నభిన్నముగా కాన్పించుచున్నాము కాని ఈ దేహమే లేకుండా పోయినప్పుడు, నీవుకూడా 'నేను' గానే అయ్యెద వనుట నిశ్చయము. నా యీ మాటలపట్ల యించుకేని నీమనస్సున సంశయిన చకుము. నీవీ విషయమున ఏ మాత్రమైన ఉపేక్షించుచో నీమీదఒట్టు! నీపైం నీవే ఒట్టుపెట్టుకొనుట ఆత్మస్వరూపముపైన ఒట్టు పెట్టుకొనుటవంటిదే. ఇందాశ్చర్య పడవలసిన సంగతి ఏదియూ లేదు, ఏలనన, ప్రీతికి గల లక్షణము లజ్జను ఏసమయమునను స్మరణమునకు రానివ్వకపోవుటయేయైయున్నది. అటుల కానిచో, ఏది జ్ఞానవిషయమో, ఏది ప్రపంచమునకు అలిప్తమైనదో, దేని వలన యీ విశ్వము వాస్తవముగ భావిల్లుచున్నదో, దేని ఆజ్ఞయొక్క ప్రతాపము కాలుని కూడా హరించివేయగలదో, అట్టి దేవుడనగు నేను, సత్య సంకల్పుడనై యుండి మరియు జగత్కల్యాణమునకై నేను ఎల్లప్పుడు ప్రయత్నము చేయుచున్నచో, యిక నేను శపథమొనర్చుట యనెడి నిరర్థకమగు ప్రయత్నము నేల చేయను? కాని, ఓ అర్జునా, నీప్రేమవలన నేనెంత వెర్రి వాడనైతిననిన, నా దేవత్వమనెడి భూషణమును కూడా నేనీ వెర్రితనములో పారవైచితిని. ఓ అర్జునా, యిందువల్లనే, నేను సగమైపోతిని. మరియు

నీవు మద్రూపుడవగుటవలన పరిపూర్ణుడవై పోతివి. ఓ అర్జునా, తన కార్య సిద్ధికొరకై రాజుకు స్వయముగా తనపైననే ఒట్టుపెట్టుకొనవలసివచ్చు విధమున, యిప్పటికూడా ఆ విధముగానే జరుగవలసియున్నది. ఇది విని అర్జును డిట్టులనెను—" ఓభగవంతుడా, తా మీవిధముగా విలక్షణమైన మాటలు మాట్లాడకుందురుగాక! ఏలనన, నాకార్యములన్నియూ కేవలము తమనామ స్మరణవల్లనే జరుగుచున్నవి. అందుపై, తా మీ సమయమున నాకు ఉపదేశింప బూనిరి. ఇక, తామే శపథపూర్వకముగా మాట్లాడసాగుచో, మీయీ వినోదముతో నిండియున్న లీలకు ఏదైన మర్యాద యుండునేమో-తెలిసికొన గోరుచున్నాను. సూర్యప్రకాశమందలి ఒక అల్పాంశముకూడా కమలములను వికసింప జేయును. కాని, యిందునిమిత్తమే ఆతడు సంపూర్ణముగ ప్రకాశమగుచున్నాడు. భూమియొక్క తాపము చల్లారుటేగాక, సముద్రమంతయూ కూడ నిండిపోవునంత మిక్కుటముగ మేఘములు వర్షించుచున్నవి. ఇట్టిస్థితిలో అది చాతకముయొక్క తృష్ణను శాంతపరచుట యనునది, ఆచాతకము దానికి కేవలము నిమిత్త మాత్రమగుటకాదా? కావున ఓకరుణానిధీ, దాతలలో శ్రేష్ఠుడవగు భగవానుడా, తామిప్పుడు చూపెడి యీ ఔదార్యమునకు నేను కూడా కేవలము నిమిత్తమాత్రుడను కానా? "ఇంతలో శ్రీకృష్ణదేవులిటుల చెప్పిరి-"చాలును యీ ప్రసంగము. నేను నీకిప్పుడు చెప్పినసాధనలవలన నీవు నిస్సందేహముగా నాస్వరూపమును పొందెదవు. ఉప్పుగల్లుసముద్రమున పడ్డసమయమునందే అదికరగిపోవును. లేదా అది కరగిపోకుండావుండుటకు ఏదైన కారణమువుండునా? ఇదేవిధముగ, వస్తుకోటియందుండెడి నాస్వరూప భక్తిజనించినప్పుడు అన్నివిషయములందునూ నీమనస్సున ఆత్మబుద్ధిజనించును నీదేహాభిమానము పూర్తిగా నాశమగును, మరియు నీవుకూడా 'నేనే' అయ్యెదవు. ఈరీతిని నీకు నేను 'కర్మద్వారా' తిన్నగా పెంపొందుచూ, సాధన చేసెడి అంతత్తు నా ప్రాప్తివరకు ఏవిధముగావచ్చునో చెప్పితిని. ఓ అర్జునా, నిరంతరము ముందుకుసాగెడి సాధకయొక్క క్రమమెట్టిదనిన, కర్మల

న్నియూ నాకు అర్పింపబడుచో, నాభావనవలన చిత్తము శాంతము మరియు ప్రసన్నము నగును. అంతట, ఆ ప్రసన్నతవలన నా జ్ఞానము ప్రాప్తించును, మరియు ఆ జ్ఞానము ద్వారా మనుష్యుడు నా స్వరూపముతో కలసి ఏకరూపుడు కాగలడు. ఓ అర్జునా, ఆ యవస్థలో, సాధ్యము లేదా సాధనము - లేనియూ మిగిలియుండవు. ఆయవస్థలో ఏపనియుచేయుటకు మిగిలియుండదని - చెప్పనగును. నీవు నీ కర్మల నన్నింటిని నిరంతరము నాకు అర్పించుచూ వుండుము, మరియు అందువలననే నేడు నీకునా ప్రసన్నత్వము ప్రాప్తించినది. ఇందువల్లనే, ఈ ప్రసన్నతయొక్క సామర్థ్యముచే యుద్ధమొనర్చుట యనెడి ప్రతిబంధము నాశనమగును. నే నొకమారు నీపై ముగ్ధుడనైతిని, మరియు యిందువల్ల యిక నీ కెన్నడును నేను బ్రతిమాలుకొన వలసిన స్థితిని కలుగనివ్వను. దేని యోగమువలన యీ ప్రపంచమంతటితోపాటు అజ్ఞానముకూడా నాశమొందునో, మరియు అంతటను కేవలము నేనే - నేను కాన్పించసాగుదునో, అట్టి జ్ఞానమును దృష్టాంతాది సహాయములచే స్పష్టీకరింపబడిన రూపమే యీ గీతయై యున్నది. నేను నీకనేకవిధములుగ ఆత్మజ్ఞానము నుపదేశించితిని; మరియు ధర్మాధర్మ భ్రాంతి జనింపజేసెడి అజ్ఞానముల నన్నింటిని నీ వీజ్ఞానసహాయముచే తొలగించి దూరముగ పారవేయుము.

సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥

“ఆశ దుఃఖములను కలిగించురీతిని, లేదా నిందవలన పాతకములు కలుగురీతిని, లేదా దుర్దైవము దీనత్వమునకు కారణమగు విధమున అజ్ఞానము స్వర్గ నరకములను లభింపజేసెడి ధర్మాధర్మములను సృష్టించినది. కాని, అజ్ఞానముచే జనించిన ఆ కల్పనల నన్నిటిని నీ వీ జ్ఞానముచే పూర్తిగా దూరమొనర్పుము. స్వయముగా త్రాటిని చేతబుచ్చుకొనిన పిమ్మట ఆ త్రాటిని

గురించి గల సర్పాభాసమును మనము త్యజించురీతిని, లేదా స్వప్నముతో పాటుగా దానికి సంబంధించిన వ్యవహారముల నన్నింటినికూడ మనము అంతమొందించు రీతిని, లేదా కామెర్లవ్యాధి పోగానే చంద్రబింబమున కాన్పించెడి పీతవర్ణముకూడా దానంతటు అదే తొలగిపోవురీతిని, లేదా పగటి వేళ గతించిపోగానే మృగజలముకూడా కాన్పించని విధమున, లేదా కట్టెను పరిత్యజించుటతోపాటు అగ్నిని పరిత్యజించుటకూడా సంభవించు విధమున, ధర్మాధర్మము లనెడి గడబిడను కలుగజేసెడి మూలాజ్ఞానమును తొలగించుట తోడనే, దానితోపాటు ధర్మాధర్మములనెడి జగడములన్నియూకూడా తమంతతామే దూరమైపోవును. మరియు, అజ్ఞానము నశించి నప్పుడు ఏకమాత్రుడనగు నేనే నాయంతటనే నేను మిగిలి యుండును. నిద్రతోపాటు స్వప్నముకూడా నశించినప్పుడు కేవలము తానే మిగిలియుండు రీతిని, అజ్ఞానము తొలగిపోగానే నేను తప్ప మరేదియూ మిగిలియుండదు; మరియు, నా ఆ కేవలస్వరూపమున కలసి జీవుడు పూర్తిగా ఏకాకారుడగును. స్వయముగ తన భిన్నత్వమును కూడా వుంచుకొనకుండా నాతో కలసి ఏకత్వమును పొందుటనే 'నాశరణు జొచ్చుట' యందురు. ఘటము నశించుటతోడనే దానియందలి గగనము గగనమున కలసిపోవురీతిని, యీ శరణాగతివలన నాతో ఏకత్వము సిద్ధించును. స్వర్ణమణి స్వర్ణమునందునూ, లేదా తరంగములు నీటియందునూ కలసిపోవు రీతిని, ఓఅర్జునా, నీవుకూడా నాశరణుజొచ్చి నాతో కలసిపొమ్ము. ఓఅర్జునా, అటులకానిచో, బడబాగ్ని సాగరమును శరణుజొచ్చినది, మరియు అది స్వయముగా సముద్రినే దగ్ధమొనర్చినది; – అనెడి యీ విధమగు కల్పవలను నీవు పూర్తిగా విడచిపెట్టుము. నన్ను శరణుజొచ్చిన [illegible] జీవభావము వుండునని చెప్పుట, పూర్తిగా హాస్యాస్పదము. ఈ విధ మాటలు నోటినుండి వెలువడుటకు కారణమైన ఆ బుద్ధికి ఏల సిగ్గు [illegible] ఒక సామాన్యదాసి ఏరాజు పాలిటనైనపడుచో, అది

కూడా రాజవైభవమును పొందును, అట్టిస్థితిలో జగదీశ్వరుడనగు నేను లభించిన పిమ్మటకూడ జీవత్వము తొలగిపోదనెడి - చెడుమాటలను నీ వేమాత్రము నమ్మకుము. మద్భక్తుడై అతి సహజముగా నా సేవ యొనర్చ బడగలదు; ఇందువలన, నీవు యీ విధముగనే నన్ను సేవించుము; ఏలనన, దీని ద్వారానే జ్ఞానము లభించును. ఇటు పిమ్మట, మజ్జిగలోనుంచి తీసిన వెన్న లక్ష ఉపాయము లొనర్చినప్పటిని తిరిగి మజ్జిగలో కలసిపోనిరీతిని నీవొక్కమారు అద్వైతభావనతో నన్ను శరణుజొచ్చినప్పుడు,లక్షప్రయత్నము లొనర్చినప్పటికిని ధర్మాధర్మములనెడి జగడము నిన్ను స్పర్శింపజాలదు. యినుము వ్యర్థముగా పడియుండి మట్టిగానైపోవును కాని, అదిఒక్కమారు స్పర్శమణిని స్పర్శించగానే బంగారుగానగును. అప్పుడిక దానికితుప్పుపట్టదు లేదా, కొయ్యను ఒరపిడిపెట్టి దానినుండి అగ్నిని బయల్పరచినచో, యిక నాఅగ్ని దానిలో దాగియుండజాలదు. ఓఅర్జునా, సూర్యునకు కూడ ఎన్నడైన చీకటి కాన్పించునా ? లేదా, మేల్కొనియున్నప్పుడు కూడ స్వప్న భ్రాంతిని అనుభవింప గలమా? సరిగా యిదేవిధమున, ఒక్కమారు నాతో ఏకత్వము కలిగినపిమ్మట నాస్వరూపముతప్ప మరేవస్తువైన మిగిలియుండుటకే కారణమైనవుండగలదా? కావున, నీవునన్నుతప్ప మరిదేనినీ నీమనస్సున కల్పన మైన నొనర్పకుము. నీ పాపపుణ్యములన్నియూ నేనే యగుదును. బంధనము లన్నింటి కిని లక్షణమగు ఏపాపము వాస్తవమునకు ద్వైతభావమువల్లనే మిగిలి యుండునో, అదికూడా నాజ్ఞానము వలన నాశనమగును. ఓ సువిజ్ఞుడవగు అర్జునా, నీటిలోబడినఉప్పు, పూర్తిగా నీరే అయిపోవును. ఇదేవిధముగ, నీవు అనన్యభావముతో నన్ను శరణుజొచ్చుచో, నీవుకూడా మద్భక్తుడవే యగుదువు. మరియు ఓ అర్జునా, నీవు మద్భక్తుడవైనప్పుడు నీయంతటనీవే ముక్తుడవుకూడా యగుదువు. నీవు నన్ను స్వీకరించుము. మరియు నేను నా ప్రకాశముచే నిన్ను ముక్తునొనర్తును. కావుననే, ఓ అర్జునా, యీ సమయ మున నీ వీరీతిని చింతించనక్కరలేదు. ఓ బుద్ధిమంతుడవగు పార్థా, నీ వీ జ్ఞాన

ముతో కూడియున్నవాడవై, ఏకమాత్రుడవగు నన్నే శరణుబొందుము. విశ్వస్వరూపుడు సర్వద్రష్ట మరియు సర్వవ్యాపీయగు శ్రీకృష్ణభగవానులు అర్జునునితో యీవిధముగా చెప్పియుండిరి. ఇటుపిమ్మట, ఆతడు తనకంకణ యుక్తమగు శ్యామవర్ణముగాగల దక్షిణహస్తమునుచాచి, తనశరణుబొందిన భక్తశ్రేష్ఠుడగు అర్జునుని ఆలింగన మొనర్చుకొనెను. ఎచ్చటకు చేరజాలనందువల్ల బుద్ధిని చంకయందు ఒత్తిపట్టి శబ్దములు వెనుకకు మరలిపోవునో, మరియూ ఏది శబ్దము, లేదా బుద్ధివలన చూడబడనిదో, ఆ స్వరూపమునే అర్జునున కొసంగుటకై శ్రీకృష్ణుడు ప్రసన్నగముతో ఆతనిని కౌగలించుకొనెను. శ్రీకృష్ణుని హృదయమునకు అర్జునుని హృదయము తాకుటతోడనే, శ్రీకృష్ణుని హృదయమందలి రహస్యము అర్జునుని హృదయమునందు ప్రవేశించెను. మరియు ఆతని ద్వైతభావము, అంతమొందుట తోడనే శ్రీకృష్ణుడాతనిని ఆత్మస్వరూపునిగ చేసెను. ఒక దీపముతో మరియొక దీపము వెలిగింపబడురీతిని యీ గాఢాలింగనముకూడా నయ్యెను. మరియు ద్వైతముగా నుంచికూడా శ్రీకృష్ణుడు అర్జునుని ఆత్మస్వరూపునిగా నొనర్చుకొనెను. అంతట, ఆ అర్జునుని హృదయమున వెడలిన మహాసుఖమనెడి ప్రవాహములోఅంతగొప్పవాడగుశ్రీకృష్ణుడుకూడా మునిగిపోయెను. ఒకసముద్రము మరియొకసముద్రముతో కలపినప్పుడు నీరురెట్టింపుగా నగును. మరియుయథేష్టస్థానమును సంపాదించుటకై ఆనీరుపైన ఆకాశమునందుకూడా ఎగురసాగును. ఈ శ్రీకృష్ణార్జునుల కలయిక వలనకూడా సరిగా అట్టిస్థితియే యిప్పుడు కలిగెను. ఇర్వురును ఆనందమును పట్టజాలకపోయిరి. ఈ సమ్మేళన మెటుల జరిగెనో ఎవడు చెప్పగలడు! ఆ సమయమున, విశ్వమంతయూ పూర్తిగా నారాయణునితో నిండిపోయినదా యన్నటుల వుండెను. ఈవిధముగా, వేదములకు మూలసూత్రమైయొప్పెడి యీ గీతాశాస్త్రమును సర్వాధికార యుక్తమునగను మరియు పూర్తిగా పవిత్రుడును అయిన శ్రీకృష్ణుడు [illegible]మునర్చెను. ఈ గీత వేదములకు మూలముగ నెట్లులైనదని మీ మన

న్నన సంశయము కలుగవచ్చును; దీనికి కారణమును చెప్పెదను వినుడు. ఎవని శ్వాసనుండి వేదములు జన్మించెనో, స్వయముగా ఆ సత్యవాణియే యగు మహావిష్ణువు తన నోటితో ప్రతిజ్ఞ చేసి యీ మాటను చెప్పు చున్నాడు; మరియు యిందువల్లనే, నేను యీ గీతను వేదములకు మూలమని చెప్పుటకూడా సమంజసమగును. దీనిని మరియొకవిధముగా కూడా వివరించవచ్చును. ఏదైన నాశనముకానివస్తువుండి, దాని వ్యాప్తియంతయూ ఏదేని పదార్థమునందు లయరూపమున సంగృహీతమై యున్నదని యన్నచో, ఆపదార్థము ఆవస్తువుయొక్క బీజమేనని యెరుంగవలెను. మరియు., బీజమునందు వృక్షమువుండువిధమున మూడు కాండములుగల వేదరాశి అంతయూ యీగీతలోపల నిండియున్నది. కావుననే, నాకీగీతయే వేదములకు బీజమని తోచుచున్నది; యీసంగతి స్పష్టముగా కాన్పించగలదు కూడాను. వజ్రములు మరియు మాణిక్యములు మొదలగు నగలచే శరీరమంతయూ అలంకరింపబడు ధమున త్రికాండాత్మకమగు వేదభాగములీగీతలో స్పష్టముగ సుశోభితమగుచున్నవి. ఇక, వేదములందలి కర్మకాండాది త్రికాండములు గీతలో ఎచ్చటెచ్చట స్పష్టీకరింపబడినవో వివరించిచెప్పెదను. దీనియందలి ప్రథమాధ్యాయము కేవలము శాస్త్రీయవిచారణకు ఆరంభక ప్రస్తావన మాత్రమే. ద్వితీయాధ్యాయములో సాంఖ్యశాస్త్ర సిద్ధాంతము ప్రకటింప బడినది. దానిలో, మోక్షప్రాప్తికై సాంఖ్యశాస్త్రము ఒక్కజ్ఞానముతప్ప మరిదేనినీ అపేక్షించదని చెప్పబడినది. తరువాత మూడవ అధ్యాయములో, అజ్ఞానమున చిక్కుకొనియున్న లోకులకు మోక్షమును పొందదగు సాధనము లేవి. యను విషయము ఆరంభింప బడినది. ఆ సాధనము - కామ్యము మరియు నిషిద్ధములూనగు కర్మలు మనుష్యుని దేహాభిమానమనెడి బంధనమున పడవేయునుగాన, వాటిని విడచి మానవుడు ఎల్లప్పుడును సక్రమముగ తనకు ఉపయుక్తములగు నిత్యనైమిత్తిక కర్మలను ఆచరించవలెను - అని. తృతీయా

ధ్యాయములో భగవానులు ‘అనిశముగా నిర్మలవృత్తితో కర్మాచరణ మొనర్ప వలెను’ అనెడి సిద్ధాంతమునుకూడా స్థిరపరచిరి. దీనినే కర్మ - కాండమని యెరుంగవలెను. బద్ధపురుషుని మనస్సునందు ‘ఈ నిత్య - నైమిత్తికాది కర్మాచరణ మేరీతిని అజ్ఞానబంధమును త్రెంచివేయును’ అనెడి ఆలోచన జనించినప్పుడాతడు ముముక్షు పదవికి వచ్చును. మరియు ఆ సమయమున చేయవలసిన పనిని గురించి శ్రీ భగవానులు ‘మనుష్యుడు తన కర్మాచరణము నంతనూ బ్రహ్మార్పణ మొనర్చుచూ చేయవలెనని’ చెప్పిరి. శారీరకముగను, వాగ్రూపమునను మరియు మనస్సుద్వారానూ ఏ విహితకర్మ లేరీతిని ఆచరింపబడునో, అవియన్నియూ ఆ రూపముగనే యీశ్వరార్పణ మొనర్పవలెనని - శ్రీకృష్ణదేవులు చెప్పిరి. కర్మయోగము ద్వారా జరిగెడి యీశ్వర భక్తిని గురించి ఉపన్యసించుచూ నాల్గవఅధ్యాయాంతభాగమున వడ్డింపబడిన మధురమగు ఖాద్యపదార్థమగు ‘ఈశ్వర భజనను కర్మాచరణముద్వారా చేయవలె’ ననెడి తత్త్వమే క్రమముగా విశ్వరూప దర్శనముగల పదునొకండవ అధ్యాయాంతము వరకు ప్రతిపాదిత మొనర్పబడినది. కావున, నాల్గవఅధ్యాయమునుండి పదకొండవ అధ్యాయము వరకునూ గల ఎనిమిది అధ్యాయములున్నూ దేవకాండమై యున్నది. ప్రతిబంధకము అన్నింటిని దూరమొనర్చి గీతాశాస్త్ర మీవిషయమున యోచన చేసినది. మరియు యీ ఈశ్వరభక్తివల్ల యీశ్వర ప్రసాదముచే గురుసాంప్రదాయమునకు అనురూపముగా లభించెడి సత్యము మరియు ప్రేమపూర్ణమూనగుజ్ఞానమును గురించి పండ్రెండవ అధ్యాయమున దానిని అద్వేష్ట మరియు అమానిత్వాది గుణసహాయముచే సంపాదించుకొన వలెనని చెప్పబడినదని నేను తలంతును. ఆ పన్నెండవ అధ్యాయమునుండి పదునైదవ అధ్యాయమువరకు జ్ఞానముయొక్క పరిపక్వ ఫలనిరూపణమును [illegible] విషయమే గలదు. ఇందుచే, ఊర్ధ్వమూలమువరకు - యీ నాల్గు [illegible] జ్ఞానకాండ వివరింపబడినది. కావున నిచ్చట

కాండత్రియనిరూపణ మొనర్చెడి శ్రుతి (అనగా బ్రహ్మవిద్య) యీ గీతా పద్యరూపియగు రత్నఖచితాలంకారమును ధరించి సుశోభితమూ మరియు అలంకృతమూ అయినది. అస్తు. కాండత్రయాత్మకమగు శ్రుతి ఏ మోక్షఫలమును గురించి ఉచ్చస్వరమున ఘోషించుచున్నదో, మరియు దేనిని తప్పక పొందవలసినదిగా అది చెప్పుచున్నదో, ఆ ఫలసాధనమగు జ్ఞానముతో రాత్రిం - బవళ్ళు వైరము కలిగియుండు ఏ అజ్ఞానసముదాయములు గలవో, వాటి ప్రతిపాదన పదునారవ అధ్యాయమున చేయబడినవి. పదునేడవ అధ్యాయమున శాస్త్రసహాయముచే యీ శత్రువులపై విజయమును సంపాదింపవలెననెడి సందేశముగలదు. ఈ విధముగా ప్రథమాధ్యాయము మొదలుకొని పదునేడవ అధ్యాయము ముగింపు వరకు భగవానులు వేదరహస్యమును వివరించిరి, మరియు యీ పదునేడు అధ్యాయములయొక్క అర్థమూ నిష్కర్షింపబడినట్టి యీ పదునెనిమిదవ అధ్యాయము కలశాధ్యాయమై యున్నది. ఈ విధముగా అధ్యాయములన్నింటి సంఖ్యనూ చూచుచూ యీ భగవద్గీతయనెడి గ్రంథము తన జ్ఞానదానమనెడి అలౌకికమగు ఔదార్యమువలన మూర్తిత్వమును దాల్చిన వేదమే యున్నటుల యున్నది. వేదము తన తావున జ్ఞానసంపదచే పరిపూర్ణముగా నిండి యున్నదనుటలో సందేహములేదు, కాని దానితో సాటివచ్చు లోభి కూడా మరెచ్చటనూ దొరకదు. మరియు, దీనికిగల కారణము, అది కేవలము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులనెడి యీ మూడు జాతుల వారి వీనుల వరకు మాత్రము చేరగలుగుటయే. వీరు తప్ప స్త్రీలు మరియు శూద్రాది ఇతర మానవజీవులకు వేదము తన జ్ఞానమందిరమున ఏమాత్రము చోటునివ్వదు. ఇందువల్లనే, ప్రాచీనకాలమందలి యీ లోపమును పరిమార్జనమొనర్చుటకొరకే వేదము యీ గీతాశాస్త్రమనెడి వేషమును ధరించి లోకులకందరకు సాధ్యమైనదని - నాకుతోచుచున్నది. కేవలమింతియే కాదు. అది గీతాస్వరూపమున అర్థ-రూపముతో మనస్సున ప్రవే

శించి శ్రవణముద్వారా కర్ణములకు సోకి, లేదా జప - పాఠములనెడి నెప
మున నోటియందుండి లోకులందరకిప్పుడు లభించుచున్నది. ఈగీతాపాఠము
జ్ఞప్తియందుండు వారికి వేదము లీగీతారూపమున మోక్షప్రదానము నొనర్పు
చునేయున్నది; కాని, వాటితోపాటు ఎవరు గీతనువ్రాసి, మరియు దానిని
కేవలము పుస్తకరూపమున తమవద్దనుంచుకొందురో, అట్టి సామాన్యబుద్ధిగల
లోకులకుకూడా వేదము యీసంసారమనెడి నాలుగువీధులవద్ద మోక్షసుఖ
మనెడియీఅన్నసత్రమునే తెరచియుంచినదాయననగును. ఆకాశమున వుండు
టకు, లేదాభూమిపైన కూర్చొనుటకు, లేదా సూర్యప్రకాశమున తిరుగుట
కును కేవలము ఆకాశముయొక్కటియే అందరికిని తెరచియుండి, ఎవరికిని ఏ ప్రతి
బంధకమున్నూ లేనట్టి స్థానమైయున్న రీతిని, యీ గీతకూడా ఏ విధముగ
బంధమూలేని అందరిదిన్నీ అయియున్నది. దీనివద్దకు వచ్చిన ప్రతివానినీ
ఉత్తముడు లేక మధ్యముడూ అనక యిది తనవారినిగా చేసికొనును, మరియు
ఏ విధముగ భేదభావమును చేయక అందరకును సమానరూపమున కైవల్య
సుఖమును దానముచేసి ప్రపంచమునంతను శాంతపరచును. తన పాత్రతనిందకు
భయపడి వేదము గీతయొక్క ఉదరమున ప్రవేశించినది. మరియు యిందు
వల్లనే యిప్పుడు దానికీర్తి శుద్ధమూమరియు ఉజ్జ్వలమూ అయినది. ఈ విధ
ముగా శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించిన భగవద్గీత అందరునూ సహజముగ
సేవించదగిన వేదస్వరూపమై యున్నది. కాని, దూడ నెపమున గోస్తనము
నుండి పాలుజారురీతిని, మరియు అందుమూలమున అప్పుడు యింటగలవారం
దరికి త్రాగుటకు పాలు లభించు విధమున యీగీతకూడా పాండవుల నెపమున
ప్రపంచము నంతనూ ఉద్ధరించినది. దప్పిక గొన్న చాతకముపై దయదలచి
మేఘము దానికొరకై జలసమేతముగ పరుగిడివచ్చును. కాని, ఆనీటి
వలన స్థావరజంగమము లన్నింటికిని మేలు కలుగును. మరియేవిధముగ
ఆధారమూలేని కమలముకొరకై సూర్యుడు ప్రతిదినమునను ఉదయించును.
అందువలన ప్రపంచమంతటను గల నేత్రములకు సుఖము కలుగు

చున్నది. ఇదేవిధముగా, అర్జునుని నెపమున భగవానులు గీతను ప్రకాశిత మొనర్చిరి. కాని, దీనివల్ల జగత్తంతటియొక్క శిరముపై నుండియూ సంసారమువంటి అతి పెద్దదగు బరువు తొలగిపోయినది. ఈతడు భగవానుడగు లక్ష్మీపతికాడు, యీయనను నోరనెడి ఆకాశమునుండి ఉదయించి శాస్త్రీయ రత్నకాంతిచే త్రిలోకములనూ ఉజ్జ్వల మొనర్చెడి సూర్యుడనియే చెప్పవలెను. ఏ కులమున జన్మించిన అర్జును డీ జ్ఞానమునకు పాత్రుడయ్యెనో, మరియు ఎవడు జగత్తంతటికొరకును గీతాశాస్త్ర మనెడి యీ ద్వారమును తెరచునో, ఆ ధన్యుడగు కులము నిజముగా పవిత్రమైనది. అస్తు. అటుపిమ్మట, సద్గురువగు శ్రీకృష్ణుడు స్వ-స్వరూపమున కలసెడి అర్జునుని మరల అద్వైతతత్వములోనికిగొనివచ్చి యీ విధముగా చెప్పెను— "ఓ పార్థా? నీకీ శాస్త్రము నచ్చినదా?" అంత అర్జునుడు "అవును మహారాజా, మీ కృపా ప్రసాదమువలన నాకీ శాస్త్రము చక్కగా నచ్చినది" అనెను. అంతట భగవానులు మరల యిట్లనిరి. "ఓ అర్జునా, గుప్తభాండారమును పొందుటకై అలౌకికమగు భాగ్యబలము కావలసి యున్నది. కాని భాగ్యమువలన ఏకత్రిత మొనర్పబడిన సంపదను ఉపయుక్తరీతిని భోగించు మహాద్భాగ్య మెవనికోమాత్రము లభించును. తోడుకొన నటువంటి శుద్ధమగు పాలుగల క్షీరసాగరమువంటి ప్రచండమగు భాననుమథించుటలో ఎంత ఎక్కువ కష్టమైయుండును! కాని ఆ పరిశ్రమ మంతయూకూడా అంతమున సఫలమే యైనది, ఏలనన, దానిని మథించినవారు స్వయముగా తమ నేత్రములతోనే దానినుండి అమృతము వెలువడుటను చూచియుండిరి. కాని అంతమున ఆ అమృతమునకై సక్రమముగా వారిచే యత్నమొనర్పబడలేదు. అందువల్ల అమరత్వమును పొందుటకై సంపాదించ బడిన ఆ అమృతమే మరణకారణమయ్యెను. సంపదను ఏవిధముగా అనుభవించవలెనో తెలిసికొనకుండా సంపదను కూడబెట్టినచో, యీ విధముగు అనర్థకమే వాటిల్లును. నహుషరాజు స్వర్గమునకు ప్రభువాయెను.

కాని ఆతని ఆచరణము సక్రమముగా లేకుండెను. మరియు యిందువల్లనే ఆతనికి సర్పయోనిలోకిపోయి పడవలసివచ్చెనన్న సంగతిని నీవెరుంగవా ? ఓ అర్జునా, నీవద్ద ఆ - గణ్యములుగలవు, యిందువల్లనే యీ సర్వశ్రేష్ఠమగు శాస్త్రమును పొందుటకు నీవు పాత్రుడవైతివి. కాని, ఇకనీవీ శాస్త్రానుసారము పరిపూర్ణముగ ఆచరించుము, మరియు అటలనిష్ఠతో దీనిని పాటించుము. కానిచో ఓ అర్జునా, నీవు సంప్రదాయమును తగురీతిని పాటించక, మరియు కేవలము దీని అనుష్ఠానమునందే నిమగ్నుడవగుచో, ఆ అనుష్ఠానమునకు కూడా ఆ అమృత - మథనమునకు పట్టిన దశయే పట్టును. బాగా బలిసి చూచుటకు అందముగానున్న ఆవు లభించిన దనుకొనుము. కాని, సంధ్యా సమయమున, దాని పాలను పితుకుటలో మనము నేర్పరులమైనప్పుడు మాత్రమే మనకు దానిపాలు త్రాగుటకు లభించును. సరిగా యిదేవిధమున, గురువు ప్రసన్నుడై శిష్యుడుకూడా విద్యాసంపన్నుడయ్యె ననుకొనుము. కాని, ఆ విద్యను సంప్రదాయమునకు తగిన రీతిని పాటించినప్పుడు మాత్రమే ఆ విద్యవల్ల తగిన ఫలము లభించగలదు. ఇందువల్లనే, యీ శాస్త్రసాంప్రదాయమును నీవత్యంత నిష్ఠతో వినుము.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
నచాశుశ్రూషవే వాచ్యం నచమాం యోఽభ్యసూయతి॥ 67

"ఓ అర్జునా, నీవు అత్యంత భక్తిపూర్వకముగా సంపాదించిన యీ గీతాశాస్త్ర విషయములను ఎన్నడును ఏ తపోహీనునకును చెప్పరాదు. లేదా ఒకానొకడు మంచితపస్వియైనప్పటికిని, ఆతని హృదయమున దృఢమైన గురుభక్తి లేనిచో, అంత్యజాలనుండి వేదములు సంరక్షింపబడు రీతిని యీ శాస్త్రమునుకూడా అట్టివానినుండి సంరక్షింపవలెను. కాకి ఎంతముసలిది అయినప్పటికిని దానికి యజ్ఞాహుతి యందలి శేషించిన భాగము యివ్వ

బడనిరీతిని యిట్టి తపోవృద్ధునకుకూడా ఆతడు గురుభక్తిలేనివా డగుచో యీ గీతను యివ్వరాదు. లేదా తపస్సొనర్చినవాడై యుండి గురుదేవునిపట్ల భక్తికూడా వున్నప్పటికిని జ్ఞానశ్రవణ మొనర్చుటకు అనురాగములేనివా డగుచో ఆతడు తన మొదటి రెండు గుణములవల్లనూ తప్పక లోకమున పూజనీయు డగును. కాని గీతాశ్రవణ మొనర్చుట కాతడు పాత్రుడు కాజాలడు. ముత్యము ఎంత స్వచ్ఛమైనదైనప్పటికిని దారము గుచ్చుటకు దానియందు బెజ్జములేనిచో ఏమి ప్రయోజనము ? సముద్ర మతిగంభీరమైనదే; అయినప్పటికని దానిపైన కురిసెడి వాన వ్యర్థముగ పోవుటలేదా ? పొట్ట పూర్తిగా నిండియున్నవాని ముందు బలవంతముగ ఉత్తమ పక్వాన్నములు వడ్డించి వాటిని వ్యర్థముగ పాడుచేయుటకంటె, ఆ పక్వాన్న ములనే ఔదార్యముతో ఆకలిగొన్నవారికి ఏలపెట్టరాదు ? కానసే, మనుష్యుడెంత అధికముగ యోగ్యుడైనప్పటికిని, ఆతని హృదయమున జ్ఞానమును శ్రవణమొనర్చుటపట్ల దనురాగము లేనిచో, అతనికి నవ్వులాట కైనను యీ శాస్త్రవిషయములు చెప్పరాదు. కాదామరి ? నేత్రములు రూప సౌందర్యమును పరీక్షించునట్టివై యుండగా అవి సువాసన నెటుల తెలసికొనగలవు ? ఎచ్చట ఏది ఉపయుక్తమైన మాట యగునో అచ్చటనే అది ఫలించుటకూడ సంభవించును. కావున, తాపసులు మరియు భక్తులైన వారిని తప్పక గౌరవించవలెను, కాని శాస్త్ర శ్రవణముపట్ల శ్రద్ధ చూపజాలని వానికి మాత్రము గీత నెన్నడును ఉప దేశింపరాదు. ఒకానొకనియందు, తపము, భక్తిమరియు శ్రవణమొనర్చుటకు అనురాగముకూడావుండి, యీ విధముగా కావలసిన యోగ్యతలన్నియూ వున్నవనుకొనుము ;అయినప్పటికిని, యీగీతాశాస్త్ర నిర్మాణమొనర్చిన మరియు సర్వలోక ప్రభుడనైన నన్నుగురించి తుచ్ఛముగా మాట్లాడు వాడైనచో, లేదా నా భక్తులను గురించిన్నీ మరియు స్వయముగ నన్ను గురించిన్నీ అతి పూర్వకముగా మాట్లాడువాడునూ అయినచో ఆతనినికూడా నీవు గీతా

శాస్త్రము వినుటకు ఉపయుక్తపాత్రునిగా తలంచకుము. అతనియందున్న యితరగుణములన్నియూ దీపజ్యోతిలేని రాత్రియందలి దీపముపెట్టెడి సెమ్మె వలెనే తలంచుము. ఎర్రని రంగుగలిగి, యువకుడుకూడా అయియుండి అలంకారాదులచే చక్కగా అలంకరింపబడిన వాడుగాకూడా వున్నప్పటికిని, అతని శరీరమున ప్రాణములు లేవనుకొనుము. లేదా శుద్ధ బంగారముతో నిర్మింపబడిన దేవాలయమే, కాని దాని గుమ్మమువద్ద త్రాచుపాము మార్గమునడ్డగించినిలచియున్నది. లేదా దివ్యాన్నము వండబడి సిద్ధముగా నున్నది. కానిదానిలో కాలకూటవిషము కలపబడి యున్నది. లేదా, మైత్రియున్నది. కాని అతనిలోపల కపటము దాగియున్నది. ఓ బుద్ధిమంతుడవగు అర్జునా, తపస్సు, భక్తి, మరియు బుద్ధికూడా వున్నప్పటికిని నాభక్తులనుగాని నన్నుగాని నిందించెడివారికి కూడా సరిగా యీవిధమగు దశయే ప్రాప్తించునని - నీవు జ్ఞప్తియందుంచుకొనుము. వారందరూ పైనచెప్పిన పదార్థములవలె దుష్టులే యగుదురు. కాన, ఓ పార్థా, నాభక్తులను మరియు నన్నూ నిందించెడి పురుషుడు, భక్తుడేకానిమ్ము, బుద్ధిమంతుడు మరియు తాపసియే కానిమ్ము, అయినప్పటికిని, ఎన్నడును యీ శాస్త్రము నాతడు స్పర్శించుటయైనను జరుగనివ్వకుము. ఓ అర్జునా, నీకింతకంటె విశేషించి ఏమిచెప్పను ! నిదించువాడు స్వయముగా బ్రహ్మ నాతో సమానమగు ప్రజ్ఞ గలవాడే యగుగాక, అయినప్పటికిని నీవాతని చేతికి యీ గీతను పరిహాసమునకైన ఎన్నడును యివ్వకుము.

య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥౬౮॥

కావున ఓ ధనుర్ధారివగు పాండవా ! ఏ పునాదిలో తపస్సనెడివి పూర్తిగా పూడ్చి నింపబడి, దాని ఆధారముపై గురుభక్తి యనెడి దృఢమైన మందిరము కట్టబడెనో, మరియు దేనియొక్క జ్ఞానశ్రవణ మనెడి గాఢ మగు

వాంఛతో కూడియున్న సింహద్వార మెల్లప్పుడు తెరచియుండునో, మరియు ఎందాభావ మనెడి రత్నములచే దేనియొక్క సుందరమగు కలశము నిర్మింప బడినదో, అట్టి నిర్దోషమగు భక్తు డనెడి మందిరమున నీ వీ గీతారత్న మనెడి యీశ్వరుని స్థాపించుము. ఇటుల చేయుటవలన నీ వీ సంసారమున స్వాయముగా నా యోగ్యతవరకును చేరెదవు. అ, ఉ, మ - య నెడి యీ త్రిమాత్రలయొక్క గర్భమునందు 'ఓమ్' ఏకాక్షరరూపమున మూసిపడియున్నది. వేదములయొక్క ఆ మూలబీజమగు ప్రణవ మీ గీతాశాఖలతో విస్తరించినది లేదా శ్లోకము లనెడి ఫలములు మరియు ఫలములద్వారా యీ గాయత్రియే అవతరించినదా యని తలంచవలెను. ఏ తల్లికి ఒక్కబాలుడు తప్ప మరేమియూ లేదో, ఆ తల్లికి యీ తల్లి తప్ప మరేగతియూ లేనట్టి బాలుడు లభింపజేయబడిన రీతిని, ఏవ్యక్తి యీ మహామంత్రముతో నిండియున్న గీతను నా భక్తులకు అతి ప్రేమపూర్వకముగ లభింపజేయునో, ఆతడు శరీరపాతమైన తరువాత తప్పక నాతో కలసి ఏకరూపుడగును.

న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి ॥౬౯.॥

" మరియూ, ఇట్టి పురుషుడు దేహాకారమనెడి అలంకారమును ధరించి చూచుటకు నాకు భిన్నుడుగా నున్నంతవరకును ఆతడు నాకు హృదయముకంటెను అత్యంత ప్రియుడగును. జ్ఞాని, కర్మనిష్ఠుడు, మరియు తాపసులలో కేవలము నా కీపురుషుడు ప్రియమైనంత ఎక్కువగా యీ భూతలమున నాకు మరెవ్వరును కాన్పించరు. ఎవడు భక్తసమూహమునందు గీతాకథన మొనర్చునో, ఎవడు ఐశ్వర్య సంపన్నుడనగు నన్నుగురించి తన మనస్సున పూర్తియైన ప్రేమ మరియు భక్తుల నుంచుకొని శాంతిపూర్వకముగ మహాత్ముల సభలో గీతాపాఠ మునర్చునో, ఎవడు క్రొత్తగా ఆకులు చిగుర్చుటవలన వృక్షములు ఆనందముచే పులకరించురీతిని అట్టి భక్తులను పులకరింపజేయునో, ఎవడు మందవాయు వీవనలు వృక్షములను వూపురీతిని వారిని ఊగులాడిం

చునో, ఆవృక్షములందలి ఫలములు రసముచే ఆర్ద్రమగు రీతిని ఎవడు వారి శ్రోత్రములను రసార్ద్రమొనర్చునో, ఎవడు కోకిలయొక్క పంచమస్వరము నందు పిలచునో, ఎవడు భక్తమండలి యనెడి ఉద్యానమున వసంతకాలము వలె ప్రవేశించునో, ఎవడు సాధుజనుల సభలో కేవలము నా స్వరూపము పైననే ధ్యానముంచిగీతాపద్యములనెడి రత్నములను 'చంద్రుడు ఆకాశమున ఉదయించగా నేచకోరముయొక్క జన్మ సఫలమగు రీతిని, లేదా నెమలియొక్క కూజనమునకు జవాబిచ్చు వర్షాకాలపు నూతన సజల మేఘము వచ్చు రీతిని' ఎడతెగక అత్యధికముగ వర్షింపజేయునో, అట్టి పురుషునితో సమానముగ ప్రియమైనవాడు వాస్తవముగ నాకు మరెవ్వడునూ లేడు; నేటివరకు ఎవ్వడునూ నాకు ఆతనితో సమానముగ ప్రియమైనవాడు కాలేక పోయెను; మరియు యింత ప్రియమగువాడు యికముందు కూడా నా కెవ్వడును కాన్పించుటలేదు. ఓ అర్జునా, ఎవడు గీతార్థముతో మహాత్ములకు అతిథి - సత్కారముల నొనర్చునో, అతనిని యిప్పటివరకు నేనెల్లప్పుడును నాహృదయములోపలనే వుంచుకొనుచు వచ్చియున్నాను.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః ।
జ్ఞాన యజ్ఞేన తేనాఽహ మిష్టస్స్యా మితిమే మతిః ॥ 70

ఈనీ - నా సంవాదమున మోక్ష - ధర్మమును జనింపజేసెడి ఏ కథ వివరింపబడినదో, దానియొక్క సకలార్థజ్ఞానమును కలిగించెడి యీ గీతనెవడు ఒక అక్షరమునైన మార్పుచేయకుండా పఠించునో, ఆతడు జ్ఞానాగ్నిని వెలిగించి దానిలో అజ్ఞానమును ఆహుతి యొనర్చుననిన్నీ, మరియూ శుద్ధ - మనస్కుడై నా స్వరూపమును పొందుననిన్నీ ఎరుగుము. గీతార్థమును చక్కగాను అన్వేషించిన జ్ఞానులు దేనిని పొందుదురో, ఓ సుదిజ్ఞుడవగు అర్జునా, చిలుకవలె యీగీతలు పఠించిన వారుకూడా దానినే పొందుదురు. గీతార్థము నెరింగినవారికి ఏఫలములభించునో, అదేఫలము కేవలము గీతను పఠించువారికి

గూడా లభించును. ఈ గీతారూపియగు తల్లి యెన్నడును జ్ఞానులు మరియు అజ్ఞానులూ నగు తన బిడ్డలపట్ల ఏవిధమగు భేదమును చూపదు.

శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యోనరః ।
సోఽపిముక్తశ్శుభాంల్లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్

" మరియు ఏవిధముగను నిందించక శుద్ధబుద్ధితో గీతాశ్రవణముపట్ల శ్రద్ధకలిగి యుండువాని చెవులయందు గీతయందలి శబ్దములు ప్రవేశించుట తోడనే ఆతని పాపము లాతనిని విడచి చాలదూరముగా పారిపోవును. అడవి యందగ్ని ప్రవేశించుటతోడనే, దానిలో నివసించెడి ప్రాణులు దశ దిశలకును పారిపోవు రీతిని, లేదా పూర్వగిరిశిఖరముపై సూర్యు డుదయించుట తోడనే అంధకారము అంతరాళములోనికి పోయి దాగుకొను రీతిని, వీనుల యొక్క మహాద్వారములందు గీతా ఝంకారము ప్రవేశించుటతోడనే సృష్ట్యుత్పత్తి సమయము వరకును గల పాపములన్నియూ నాశనమగును. ఈ విధముగా యీ జన్మమనెడి లత నిర్దోషియై పుణ్యములనెడి సుందర పుష్పములచే పుష్పించును, మరియు అంతమున, దాని యందు అపరంపారమగు ఫలములు వచ్చును. దీనికి కారణమేమన, చెవుల ద్వారా గీతయందలి ఎన్ని అక్షరములు అంతఃకరణమున ప్రవేశించునో, అన్ని అశ్వమేధయజ్ఞము లొనర్చిన ఫలము లభించును. కావున, గీతా శ్రవణమువలన పాపములు నశించును. మరియు దగ్గరనున్న పుణ్యములు బాగా వృద్ధిపొందును. మరియు అంతమున ఆపుణ్యములద్వారా యింద్రవైభవము ప్రాప్తించును. నా స్వరూపమునవచ్చి కలియుటకై ఆతడుచేయు ప్రవాసము నందలి మొదటిమజిలీ స్వర్గమునం దుండును; మరియు అచ్చట ఆతడెంత ఎక్కువగ సుఖముల ననుభవించవలెనని కోరునో అంత అధికముగ సుఖముల ననుభవించి, అంతమున ఆతడువచ్చి నాతో కలియును. ఓఅర్జునా, గీతను విను వారికిన్ని మరియు గీతను పఠించువారికిన్ని యీ విధమగు ఆశ్యానందము నిచ్చెడి ఫలములు లభించును. ఇక నేనీవిషయము నెంతవరకని విస్తరించిచెప్పను,

నేనింతవరకు చెప్పినది చాలును. కాని, ఏ కార్యముకొరకై నే నీశాస్త్రము నింత అధికముగ విస్తరించితినో, ఆ కార్యమును గురించి నేనిప్పుడు నిన్నొక మాట నడిగెదను.

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।
కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ ॥౭౨॥

"ఓ పార్థా ! నీ వొక మాటచెప్పుము. ఈ శాస్త్రీయసిద్ధాంతము నంతనూ నీవు ఏకాగ్రచిత్తముతో వింటివా లేదా ? నే నీ జ్ఞానమును నీ కర్ణములవరకు చేర్చిన రీతిగా నీ మనస్సునందు కూడా యీ జ్ఞానము నిండి యున్నదా ? లేక నీ ధ్యానములోనికి రాకుండా మధ్యలో తప్పిపోయిన విషయ మేదైనా గలదా ? లేక ఉపేక్షవలన వ్యర్థముగ నుండిపోయిన విషయ మేదైనను గలదా ? నీ కీ జ్ఞానము నే నుపదేశించిన విధముగా నీ అంతఃకరణమున నిండియున్నచో, నే నడిగిన దానికి నీవు జవాబిమ్ము. ఆత్మసంబంధమగు అజ్ఞానమువలన నీ మనస్సునం దేమోహము జనించి యుండెనో, మరియు ఏది నిన్ను భ్రమపెట్టెనో, ఆ నీ మోహ మిప్పటికైన తొలగిపోయినదో, లేదో, మరియు కర్మాకర్మల భేదము నీకు కాన్పించినదో లేదో — నాకు చెప్పుము". శ్రీకృష్ణుడు అర్జునుని ఎదుట యీ ప్రశ్ననుంచి అతడు ఆత్మానందమునకు చెందిన అద్వైతరసమున నిమగ్నుడగుటకును మరియు దానిని గురించి ఏమైన్న అడుగుటకును బదులు, అపారిత ద్వైతభావ ములోనికే యీడ్చుకొని వచ్చెనా ? యన్నస్థితిని అతనికి కలుగజేసెను. అర్జునుడు పూర్ణ బ్రహ్మరూపుడైయుండెను. కాని, ఆసమయమున అతని నెదుర్కొనిన కార్యమును నెరవేర్చుటకై శ్రీకృష్ణు డాతనిని భేదభావమునకు చెందిన మర్యాదను ఉల్లంఘించనివ్వలేదు. మరియు, కానిచో, సర్వజ్ఞుడగు శ్రీకృష్ణుడిప్పటివరకు తానేమిచేసెనో, మరియు ఏమిచెప్పెనో, అయనకు తెలియుదా ? కాని, అర్జునుని మరల ద్వైతభావములోనికి తీసికొని వచ్చుటకే ఆయన అతని నిటుల ప్రశ్నించెను. ఆసమయమున "భగవానుడీ రీతిని అర్జునిని ప్రశ్నించి మరల అతనిని అర్జునత్వభావములోనికితీసికొనివచ్చి అతని నోటితో "[illegible] పరిపూర్ణుడ నైతిని' అని అతని అనుభవమును చెప్పించెను.

అంతట క్షీరసాగరమునుండి వెలువడిఆకాశమునతనప్రకాశమునువ్యాపింప జేసెడి పూర్ణచంద్రుడు వేరుచేయకుండానే, సహజముగను మరియుస్పష్టముగను అన్నింటికిని భిన్నమైనవాడుగను మరియు విలక్షణమైనవాడుగనూ కాన్పించు రీతిని ఆసమయమున అర్జునునకొకవైపు 'నేను బ్రహ్మను' అనెడిమాట మరపురాకుండా నున్నూ, మరియు మరియొకవైపు 'యీ సమస్త జగత్తే బ్రహ్మ మనిన్నీ' అతనికి కాన్పించుచుండెను. ఒకవైపున ఆతనిని సంసారము విడిచిపోవుచున్నది, మరియు మరొకవైపు బ్రహ్మత్వమే క్షీణించిపోవు చున్నది. ఈ విధముగా ఆతడు బ్రహ్మత్వమును గురించి కొంతవరకు అర్థము లేకుండా యోచనచేయుచూ మిక్కుటమగు కష్టముతో నొక్కమారు మరల దేహాభిమానమనెడి సరిహద్దుకువచ్చి ఆగిపోయెను. మరియు అతడచ్చటనే 'నేను అర్జునుడను' అని తలంచి నిలబడిపోయెను. అంతట తన వణకుచున్న చేతులతో తన ఉప్పొంగుచున్న రోమావళిని అణచుకొని చెమటబిందువులను తుడుచుకొని, మరియు వేగముగ నడచుచున్న శ్వాసచే కంపించుచున్న అంగములను సంబాళించుకొని, శరీర విచలత్వము నతి నిగ్రహపూర్వకముగ అడ్డగించి, నేత్రద్వయమునుండి అశ్రుప్రవాహ రూపమున వచ్చుచున్న ఆనందామృత వెల్లువను ఎక్కడిదక్కడ అడ్డగించి, నానావిధములగు ఉత్కంఠల వలన పూడిపోవుచున్న గొంతును సరిచేసికొని, మరియు ఆ ఉత్కంఠలను తన మనస్సునందే అణచుకొని, తడబడుచున్న నాలుకను సంబాళించుకొని, మరియు శ్వాసను సరిచేసికొని అర్జును డీరీతిని చెప్పసాగెను.

అర్జున ఉవాచ-

నష్టో మోహా స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత
స్థితో౽స్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ 73 ॥

అర్జునుడు చెప్పెను-ఓ భగవానుడా, మీరు నన్ను మోహ మిప్పటికైన విడచిపెట్టినదా, లేదా? - యనియేగదా అడుగుచున్నారు. అది తన గోత్రమునకు చెందిన భావముల నన్నింటిని తీసికొని, తన తేరా - గడలను

కూడా నామనస్సునుండి పెకలించుకొని ఎన్నడో నన్ను విడిచి వెళ్ళిపోయినది. సూర్యదేవరివద్దకైనవచ్చి 'మీ కనులకు అంధకారము కాన్పించుచున్నదా?' యనిఅడుగుట ఎన్నడైన సంభవించునా? ఇదేవిధముగ శ్రీకృష్ణ భగవానులగు మీరు నా కీసమయమున కనులకు ప్రత్యక్షముగ గోచరించుచున్నారు; ఇదేమైన తక్కువ సంగతా ? పైగా, ఏ విధముగ ప్రయత్నించినప్పటికిని లభించని విషయమును మీరు తల్లికంటెను ఎక్కువప్రేమతో హృదయపూర్వకముగ నాకు చెప్పుచున్నారు. ఇట్టిస్థితిలో, మీ రీదృష్టితో నన్ను 'నీ మోహ మిప్పటికియైన తొలగిపోయినదా, లేదా' యని ప్రశ్నించిరో అదే దృష్టితో నేను 'ఓ మహారాజా, మీ ప్రసాదముచే నేను కృతకృత్యుడ నైతినని' చెప్పుచున్నాను. నే నిప్పటివరకును 'నే నర్జునుడ' ననెడి భ్రమలో చిక్కు పడి యుంటిని. కాని యిప్పుడు, మీ ప్రసాదమువల్ల మీ స్వరూపజ్ఞానము కలిగినపిమ్మట నేను ముక్తుడ నైతిని. ఇప్పుడు ప్రశ్నించుటకు గాని, మరియు జవా బిచ్చుటకు గాని తావు లేకుండా పోయి నది. ఓ దేవా, మీ ప్రసాదమువలన నాకు లభించిన ఆత్మబోధ మోహము నెచ్చటను ఊరు - పేరులు లేకుండా చేసివేయును. ఇక ద్వైతభా వమువలన జనించెడి ప్రశ్నయగు 'ఫలానా పని చేయవలెను, లేక చేయ రాదు' అనునట్టిది మీయందుతప్ప మరిదేనియందును నాకు కాన్పించుటలేదు. ఈ విషయమును గురించి నా కేమాత్రము సందేహములేదు. నేనిప్పుడు 'కర్మలు పూర్తిగా లేకుండాపోయెడి' స్థితికి వచ్చితిని. మీ కృప వలన నేడు 'నేను' అనగా ఆత్మస్వరూపమును పొందితిని. మరియు యిందు వల్లనే కర్తవ్య కర్మలు పూర్తిగా నశించిపోయినవి. ఇప్పుడు నాకు మీ ఆజ్ఞ తప్ప మరింకేదియూ శేషించి యుండలేదు; ఏలనన, ఏది దృష్టి - గోచర మైనపిమ్మట యీ దృశ్యవిషయము వుండదో, ఏది స్వయముగా రెండవది అయినప్పటికిని ద్వైతమును నాశనమొనర్చివేయునో, ఏది ఒక్కటైనప్పటికిని ఎల్లప్పుడు అన్ని ప్రదేశములందును నివసించునో, దేనితో సంబంధము ఏర్ప

ను కట తోడనే సమస్త బంధనములు తెగిపోవునో, దేనిని గురించిన ఆశ కలుగుటతోడనే యితర ఆశలన్నియూ అంతమొందునో, దేనితో కలయిక కలిగినపిమ్మట స్వయముగా తనను తానే కలపికొనుటయగునో ఆ నా ఆరాధ్య గురు దేవులుతామే అయియున్నారు. ఎవరెల్లప్పుడును ఐక్యము వెంటనుండునో ఎవరివలన అద్వైత బోధయొక్క ప్రాంతమున ప్రవేశము లభించునో మరియు స్వయముగా బ్రహ్మస్వరూపుడై కృత్యాకృత్యములనెడి జంజాటమును దూరమొనర్చి మరియు ఏకనిష్ఠుడై ఎవరి అపరంపారమగు సేవచేయుచూ నుండ వలెనో, ఎవరు తన భక్తులను తవలోనే ' సాగరమున కలిసెడి నది వచ్చి స్వయముగా సాగరముగానే అయిపోవురీతిని ' కలుపుకొనునో, అట్టివారగు తాము నా నిరుపాధిక సేవాయోగ్యులగు సద్గురువులై యున్నారు. కావున, నాకు బ్రహ్మస్వరూప సాక్షాత్కారమనెడి ఉపకారము లభించినదని తాము తలంతురుగాక. ' మీ - నా ' మధ్య గల భేదభావమనెడి బాధను దూరమొనర్చి నేడు తాము నాకు తమనుసేవించుటయనెడి మధుర సుఖమును లభింపజేసితిరి. కాన నో దేవాధిదేవేశ్వరులగు శ్రీకృష్ణా, ఇక తాము నన్నేరీతిని ఆజ్ఞాపింతురో, అటుల ఆ ఆజ్ఞాపాలన మొనర్చకుండా వుండను" అర్జునుని యీ మాటను విని శ్రీకృష్ణులు ఆనంద విహ్వలులైరి. అయన తన మనస్సునం దిటుల అనుకొనెను– "ఫలము లన్నింటికంటె శ్రేష్ఠ మగు ఫలము నేడు నాకు అర్జునరూపమున లభించినది. తనపుత్రుడగు చంద్రుని క్షీణకళలంపూర్తియైనప్పుడాపూర్ణ చంద్రునిచూచి క్షీరసముద్రముయొక్క హృదయముప్పొంగసాగదా? మరియు అది తన మర్యాద నుల్లంఘించసాగదా? "ఇదే విధమున సంభాషణా మండపమున శ్రీకృష్ణార్జునుల యీ సంయోగ మును చూచి సంజయుడుకూడా ఆనందముచే గంతువేసెను. అత్యధికముగా వృద్ధిపొందిన తన ఆనందభావనతో సంజయుడు ధృతరాష్ట్రరాజుతో నిటుల చెప్పెను– "వ్యాసమహర్షి యీ యుద్ధకాలమున మన యిరువురను పరిపూర్ణ ముగా సంరక్షించి ఎంత అధికమగు కృపజూపిరి! సంసారమందలి సామాన్య

వ్యవహారముల నొనర్చుటకుకూడా తమకు చర్మచక్షువులు లేకపోయినవి. కాని, యిట్టిస్థితిలో కూడా జ్ఞానదృష్టితో వ్యవహరించుశక్తి వ్యాసదేవుని కృపచే నేడు తమకు లభించినది; నాకు కేవలము గుఱ్ఱములను పరీక్షించుటకై రథముమీద కూర్చొనెడి వీరమండలిలో ప్రవేశించు సౌభాగ్యము లభించినది. అట్టి నేను జ్ఞానమునకు సంబంధించిన విషయముల నన్నింటిని తెలిసికొనగలుగుటకూడా వ్యాసమహర్షియొక్క కృపాప్రసాదమే. యుద్ధమెంత ప్రచండము మరియు ఘోరరూపమున నడచుచున్నదనిన, ఏ పక్షము ఓడిపోయినప్పటికినీ యీ యుద్ధమున నా ప్రాణములు తప్పక పోవునని ప్రతివ్యక్తియూ తలంచుచుండెను, ఈ విధమగు భీషణ ప్రసంగము వచ్చిన ప్రదేశమునందుకూడా నాకుగాను బ్రహ్మానందమనెడి గుప్తభాండారము తెరువబడినది. మరియు నేను ఆనందానుభవమును పొందగలిగితిని. వ్యాసదేవుని యీ ప్రసాదగమానత్వమును నేనెంతని వర్ణింపను!" సంజయుడీ మాటలను చెప్పెను. కాని చంద్రకిరణములవలన రాళ్ళు కరగనిరీతిని ధృతరాష్ట్రుని అంతఃకరణముకూడా యీ మాటలవలన నామమాత్రమునకైన ద్రవించలేదు. ఆతని యీస్థితినిచూచి సంజయుడు ఊరకనిట్టూర్పు విడచి వై చెను. అయినప్పటికిని, అతడు ఆనందాతిశయముచే స్పృహతప్పిపోయినవాడాయెను; అందుచేఆతడు మరల చెప్పసాగెను. ఆసమయమున కేవలము హర్షావేగముచే సంజయుడు మాట్లాడుచుండెను; అటులకానిచో, ధృతరాష్ట్రునియందు, సంజయుడింకనూ కొంత చెప్పవలెననెడి కోరిక నామమాత్రమునకైన కాన్పించకుండెను.

సంజయ ఉవాచ—

> ఇత్యహం వాసుదేవస్య పార్థస్యచ మహాత్మనః ।
> సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్ ॥౭౪॥

సంజయుడు చెప్పెను—" ఓ కురురాజా, మీ సోదర పుత్రుడగు [illegible] చెప్పినమాట లాభమునకు అత్యధిక మధురముగ

తోచెను. వాస్తవమునకు తూర్పుసముద్రము మరియు పడమటి సముద్రము ఆదిగా గల పేళ్ళు భిన్నమైనవే, అటుల కాదందుమేని, ఆ రెండు సముద్రము లందలి జలమున్నూ పూర్తిగా ఒక్క విధముగనే వున్నది. మరియు యీ విధముగనే, కృష్ణార్జున భేదముకూడా కేవలము శరీరము వల్లనే కాన్పించుచున్నది. కాని వారిసంవాదములో యీ భేదమెచ్చటను పేరునకైన మిగిలియుండదు. అద్దమును మించిన స్వచ్ఛమగు రెండు పదార్థములు ఎదురు బొదురుగా నున్నప్పుడు, వాటిలో ప్రతిపదార్థమూ మరియొకపదార్థమునందు తమతమ స్వరూపమును చూచును. ఆదేవిధముగా అర్జునుడుకూడా తనను తాను కృష్ణసహితముగా కృష్ణుని మూర్తి యందు చూడసాగెను. మరియు కృష్ణునకుకూడా అర్జునుని మూర్తియందు ఆతని సహితముగ స్వయముగా తన స్వరూపము కాన్పించసాగెను. దేవుడు ఏ అంగమున ఏస్థానమున స్వయముగా తనను తానుకూడాను మరియు తన భక్తుడగు అర్జునునికూడ చూడసాగెనో, ఆ అంగమునందే ఆస్థానము నందే భక్తుడగు అర్జునునకుకూడ దేవుడగు శ్రీకృష్ణుడు కాన్పించసాగెను. మరియు, ఇక, ఆయిద్దరూ తప్ప మరి మూడవవా రెవరునూ లేకుండా పోయినప్పుడు వారేమి చేసిరి ? వారిద్దరును ఏకరూపులైరి. మరియు, యీరీతిని ద్వైతభావము నశించినప్పు డిక ప్రశ్నోత్తర ప్రసంగ మెచటినుంచి రాగలదు ! ఇక యేభేదమూ లేకుండా పోయినప్పుడు సంభాషణాసుఖ మెటనుండి రాగలదు ? యీవిధముగా ద్వైతభావము లేకుండానున్న ఆయిరువురి సంభాషణమును నేనువింటిని. రెండు అద్దము లను ఒకదానికి మరొకదానిని ఎదురుగా వుంచినచో, వాటిలో ఏది దేనిని చూచుచున్నదో ఎన్నడైన ఊహించగలమా ? లేదా, వెలుగుచున్న దీపము ముందు మరియొక వెలుగుచున్న దీపమును పెట్టినచో, ఆ రెండింటియందూను ఏ దీపము దేనినుండి ప్రకాశమును యాచించుచున్నదో ఎటుల తెలిసికొన వీలగును? లేదా సూర్యుని ఎదుట మరియొక సూర్యుడు ఉదయించుచో,

వారిలో ఏసూర్యుడు ప్రకాశము నిచ్చువాడో మరియు ఎవని ప్రకాశము ప్రకాశించుచున్నదో-ఎటుల నిర్ణయించనగును! ఎవరైన యీ విషయమును నిర్ణయమొనర్ప సాగుచో స్వీయముగా నిశ్చయమే సద్భురాలగును. ఈ విధముగా ఆ సంభాషణమునందు కృష్ణార్జునులు పూర్తిగా ఒక్కటిగ నై పోయిరి. రెండు జలప్రవాహములు వచ్చి ఒకదానిలో నొకటి కలసిపోవుచో; మరియు ఉప్పుకూడా వచ్చి వాటిలో కలసిపోవుచో ఆ ఉప్పు ఆ ప్రవాహములు రెంటినీ అడ్డగించ గలదా ? లేదా అది కూడా క్షణమునేపటిలో ఆ రెంటితోనూ కలసి ఏకరూపమును పొందునా? సరిగా యిదేవిధమున, నేనా సంవాదమునం దీ రీతిని ఏకరూపు లయ్యేడి శ్రీకృష్ణార్జునులను నా మనస్సున ధ్యానించినప్పుడు నా స్థితికూడా ఆ ఉప్పు వలె నై పోవును" ఈ కొద్దిసంగతులను సంజయు డిప్పుడే చెప్పుచుండెను. యింతలో సాత్త్వికభావము వచ్చి అతని సంజయత్వపు స్మృతిని పోగొట్టెను— నేడు సంజయుండ ననెడి - ధ్యానమే అతనికి లేకుండాపోయెను, అతనికి రోమాంచమగుచున్న కొలదిని అతని శరీరముకూడా సంకుచితమై పోవు చుండెను. ఆ స్తంభితావస్థలోనే అతనికి పోసినటువంటి చెమటవలన అతని శరీర కంపముకూడా అత్యధికముగ వృద్ధిపొందెను, అద్వైతానందానుభవ మగుటవలన అతని కనులనుండి బాష్పములు వెడలి వచ్చెను. అతని కన్నులయందవి ప్రేమాశ్రువులు కావు, కేవలము జలప్రవాహమే ప్రారంభమయ్యెనా యన్నటుల వుండెను. శబ్దార్థము లాతని కుక్షిలో పట్టుకుండెనని తోచుచుండెను, మరియు గొంతు బొంగురుబోయెను; మరియు యిందువలన శ్వాసతో శబ్దార్థములు కలపి ఏకమైపోయెను. అంతే గాదు. ఎనిమిది సాత్త్విక భావములున్నూ ప్రకటమయ్యెను, మరియుసంజయు నకు ' అతని నోటనుండి శబ్దమే వెలువడనట్టి ' విలక్షణావస్థ సంభవించెను ఆ సమయమున సంజయుడు శ్రీ కృష్ణార్జునుల సంవాదమునకు నాల్గువీధులు [illegible]యెనా యన్నటుల వుండెను. కాని, అనుభవస్వభావము తనంత

తానే శాంతించునట్టిది యన్నది. అందువలన సంజయుడుకూడా అతి త్వరలో శాంతించెను. మరియు మరల స్పృహ వచ్చెను. అతనికి తన శరీర ధ్యాస వచ్చెను.

వ్యాస ప్రసాదాచ్ఛ్రుతవానేత ద్గుహ్యతమం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్

ఆనందావేగము సమాప్తమైనపిమ్మట సంజయు డిటులచెప్పెను. "స్వయముగా ఉపనిషత్తులకుకూడా విదితముకాని అజ్ఞానమును నేడు నేను శ్రీ వ్యాసదేవుని కృపచే వింటిని. దానిని వినుటతోడనే నాలో బ్రహ్మత్త్వమువచ్చెను. మరియూ నాకు 'నేను' మరియు 'మీరు' అనగా ద్వైతస్పృష్టి కూడా లేకుండా అంతమొందినది. ఈ యోగమార్గములన్నియూ వచ్చి పర్యవసానముపొందెడి ఆ శ్రీకృష్ణుని వచనములు వ్యాసదేవునికృపచే నేడు నాకు అతిసహజముగ లభించినవి. అర్జునుని నిమిత్తముగ నొనర్చుకొని మరియు తనలోతానే బలవంతముగా ద్వైతభావమును (భిన్నత్వమును) స్థాపించుకొని ఆత్మవిచారణనుగురించి ఏమిచెప్పెనో, ఏమని భాషించెనో, అట్టి ఆభాషణమునకు సర్వోత్కృష్టపాత్రునుగా నయ్యెడి యోగ్యత నావంటి సామాన్యునకు కలిగిన దన్నచో, యిక శ్రీగురుదేవులగు వ్యాసదేవుని సామర్థ్యమును నేనెంతని వర్ణించను:"

రాజన్ సంస్మృత్యసంస్మృత్య సంవాద మిమమద్భుతమ్
కేశవార్జునయోః పుణ్యం హృష్యామిచ ముహుర్ముహుః ॥ ౭౬ ॥

అటుపిమ్మట సంజయుడు మరలచెప్ప నారంభించినప్పు డాతని నోటి నుండి 'రాజన్' శబ్దము వెలువడుట తోడనే అత డత్యధికముగ విస్మితుడయ్యెను; మరియు రత్నప్రకాశము స్వయముగా దానిపైన నేపడి వ్యాపించు రీతిని అతడుకూడా స్వయముగ తన విస్మయముచే పూర్తిగా వ్యాపింపబడినవాడాయెను. చంద్రోదయమైన పిమ్మట హిమాలయుని పైనగల సరోవ

ములు కూడా స్ఫటికశిలతో సమానముగ కాన్పించసాగినప్పటికిని, సూర్యో దయ మగుటతోడనే మరలనవి ద్రవరూపముగ తోచురీతిని సంజయునకు తనశరీరధ్యాస వచ్చుటతోడనే శ్రీకృష్ణార్జునుల సంవాదము జ్ఞప్తికి వచ్చుచుండెను; మరియు యీ సంవాదము ఆతనికి జ్ఞప్తికివచ్చుటతోడనే అతడు మరల విస్మితుడై తన శరీరధ్యాసను మరచిపోవుచుండెను; ఈ క్రమమే ఆ సమయమున నడచుచుండెను.

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః ।
విస్మయో మే మహాన్ రాజన్! హృష్యామిచపునః పునః ॥౭౭॥

అంతట సంజయుడు నిలబడి ధృతరాష్ట్రునితో నిటుల చెప్పెను— “ఓ రాజా, శ్రీహరియొక్క ప్రత్యక్ష విశ్వరూపమును చూచి తా మీ రీతిని ఏల నిస్తబ్ధులై కూర్చొనియున్నారు? ఏది చూడకపోయినప్పటికిని కాన్పించునో, వుండనందువల్లనే ఏది వున్నదో, మరియు ఏది మరచిపోయినప్పుడే జ్ఞప్తికి వచ్చునో, అట్టిదానినుంచి ఎవడైన తప్పించుకొన జూచినచో నెటుల తప్పించుకొనగలడు? ఇచ్చట దానిని దూరమునుంచి చూచి కేవలము ఆశ్చర్యపడదగిన మాత్రపు అవకాశముకూడా లేదు. ఏలనన, యీ సంభాషణ యనెడి జ్ఞాన గంగాప్రవాహము తనతోపాటు నన్నుకూడా ప్రవహింపజేసి తీసికొనిపోవునంత అధిక ప్రచండమైనదై యున్నది” శ్రీకృష్ణార్జున సంవాద మనెడి యీ సంగమతీర్థమున స్నాన మొనర్చి ఆ సంజయుడు తన అహంభావమునకు తిలాంజలి నిచ్చెను. ఆ యవస్థలో ఆతడు చరమసీమయొక్క ఆనందము ననుభవించుచూ మధ్యమధ్య విలక్షణరూపమున ఏదో మాట్లాడుచుండెను. మరియు మాటిమాటికి అత్యంతరుద్ధ కంఠముతో “శ్రీకృష్ణ శ్రీకృష్ణ” యనుచుండెను. [illegible] కురురాజగు ధృతరాష్ట్రునకు ఆతని యీ అవస్థను గురించి [illegible] తెలియరాకయుండెను. మరియు ఆతడు తన మనస్సున అతనిని [illegible] [illegible] లోచించుచుండెను. అనమయము

సంజయునకు ప్రాప్తించుచున్న సుఖానుభవమును స్వీయముగ తనవరకే పరిమితముగా నొనర్చుకొని సంజయుడు తన ఆవిర్భావలత్వమును శాంత పరచెను. ఆ ప్రసంగమునకు యోగ్యమైనట్టి మరియు అడుగదగినట్టిమాటను దూరముగ నుంచి ధృతరాష్ట్రుడు సంజయునితో నిటులయనెను." సోదరా సంజయా, నీయీ విధమెట్టిది? వ్యాసుడు నిన్ను నావద్ద ఏపనికొరకై కూర్చుండనియమించెను. మరియు నీవీప్రసంగము నెటనుండి తెచ్చితివి? "ఎవడైన అడవిమనుష్యుని రాజమహాలునకు తీసికొనిపోయినచో, ఆ అడవిమనుష్యునకు తనవస్తువును దేనినో కోల్పోయినట్లనిపించును. మరియు ఆతనికి దశదిశలును శూన్యముగనే కాన్పించును లేదా, పగటిసమయము నిశాచరులకు రాత్రియేయగును. ఎవడే విషయమునందలి మాధుర్యమును తెలిసికొనలేడో, ఆతని కావిషయము నీరసముగాను, లేదా వికటముగాను తోచును. మరియు యిందువల్లనే ధృతరాష్ట్రునకు సంజయుని యీ మాటలు నచ్చలేదు, మరియు నిరర్థకములుగా కూడా తోచుచుండెను. ఇది ఆతనికి పూర్తిగా స్వాభావికమే. మరల ధృతరాష్ట్రుడు సంజయునితో చెప్పెను—"మంచిది సంజయా, ఈ యుద్ధమున చివరకు ఎవరికి విజయము లభించునో నాకుచెప్పుము, దుర్యోధనుని పరాక్రమమే ఎల్లప్పుడు సఫలమగునని నా దృఢవిశ్వాసము; మరియు పాండవుల సేనతో పోల్చి చూచినచో దుర్యోధనుని సేనకూడా దానికంటె ఒకటిన్నర రెట్లు అధికముగ నున్నది. కావున, అంతమున ఆతనికే విజయము కలుగునని నేను తలంచుచున్నాను. ఈ తలంపు సరియైనదేనా? సోదరా సంజయా, నాకిటులనే తోచుచున్నది కాని, నీబుద్ధియేమి చెప్పుచున్నదో, నాకు తెలియదు, అయినను, నీవేమని తలంచుచున్నావో నా కొకమారు చెప్పిన చాలును"

> యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
> తత్ర శ్రీ ర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ॥ ౭౮ ॥

ఈ ప్రశ్నకు జవాబుగా సంజయుడు చెప్పెను— " ఓ రాజా, ఈ యుద్ధమున యిరుపక్షములందును ఎవరికి విజయము లభించునో నా కెరి

బోధపడుటలేదు. కాని ఆయువుయున్న మనుష్యుడు తప్పక జీవించును. చంద్రుడున్నచోట వెన్నెలకూడా తప్పక వుండును; శంభుడున్నచోట పార్వతికూడా తప్పక వుండును; మహాత్ములున్నచోట వివేకముకూడా వుండును. రాజు వున్నచోట సైన్యముకూడా వుండును; సౌజన్యము వున్న చోట సోదరభావముకూడా వుండును; మరియు అగ్ని ఉన్నచోట దహన శక్తికూడా తప్పక వుండును. దయ వున్న చో ధర్మముకూడా తప్పకవుండును; మరియు ధర్మమువున్నచోట సుఖప్రాప్తికూడా తప్పకకాన్పించును. సుఖము వున్నచోట పురుషోత్తముడుకూడా తప్పకవుండును. వసంతము వున్నచోట వనముకూడా వుండును. వనము వున్నచోట పుష్పములుకూడా తప్పక వుండును. పుష్పములు వున్నచోటుకు భ్రమరములగుంపు కూడా తప్పక వచ్చును. గురువున్నచోట జ్ఞానము వుండును; మరియు జ్ఞానము వున్న చోట ఆత్మదర్శనముకూడా వుండును; మరియు ఆత్మదర్శనము వున్నచోట సమాధానముకూడా వుండితీరును; భాగ్యమువద్దకు విలాసము, సుఖమువద్దకు ఉల్లాసము మరియు సూర్యునివద్దకు ప్రకాశము తప్పక చూచుటకు వచ్చును. ఇదేవిధముగా ఎవరివలన పురుషార్థము లన్నింటికిని సామర్థ్యము లేదా శోభయూ లభించునో, అట్టి శ్రీకృష్ణు డే పక్షమున నున్న లక్ష్మీకూడా ఆ పక్షమునందే వుండును. మరియు తన భర్తసహితముగ ఆ జగన్మాతయగు లక్ష్మి ఎవరికి లభించునో, అట్టివానికి అణిమాది అష్టసిద్ధులున్నూ దాసీలుగా కారా? శ్రీకృష్ణుడు స్వయముగనే విజయస్వరూపుడు, కావున ఆతడే పక్షమున నున్న ఆ పక్షము వైపునకే విజయముకూడా పరుగెత్తుకొని వచ్చును. ఇక అర్జునుడో విజయుడను పేరు ప్రసిద్ధిపొందినదే యున్నాడు. మరియు శ్రీకృష్ణుడు స్వయముగనే విజయస్వరూపుడు; కావున, శ్రీకృష్ణుడు వున్నపక్షమునందు లక్ష్మీసహితముగ విజయము కూడా వుండుననుటలో సందేహ మించుకయులేదు. ఇట్టి ప్రతిష్ఠగలిగినట్టి పాండవులు మాననీయులవగు తల్లి - దండ్రుల ఆధారముగలభించినవారి దేశ

